





# మాసపత్రికలు

# శ్రీ రామకృష్ణ ప్రభ

# 1962





# సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

# శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

# అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

# వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి. కనుక తమవంతుగా భక్తి, జ్ఞాన, ధర్మ ప్రచారార్థం మహానుభావులైన శ్రీ రామకృష్ణ మఠ్ వెబ్ సైట్ వారు ఉచితంగా విలువైన మాసపత్రికలను ఆన్ లైన్ ద్వారా eBOOK(PDF) రూపంలో అందిస్తున్నారు.వారు చేస్తున్న జ్ఞాన యజ్ఞానికి సాయి రామ్ కూడా తమవంతుగా సహాయం చేసే కార్యక్రమంలో భాగంగా వారి గ్రంధాలను సాయి రామ్ ద్వారా కూడా అందచేస్తున్నాము, ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం చేసిన ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in),మైక్రోసాఫ్ట్ సైట్(http://www.microsoft.com) వారికి కూడా మేము ఋణపడివున్నాము. ఈ మాసపత్రికలు క్రొత్తవా లేక పాతవా? అని చూడకుండ, అందులోగల రత్నాలలాంటి విషయాలను తెలుసుకోవటానికి ప్రయత్నం చేయగలరు అని మనవిచేసుకొంటున్నాము..

ఈ మాసపత్రికలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) రామకృష్ణ మఠ్ వెబ్ సైట్: http://www.rkmath.org
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com
సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement
సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంధ వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.



SaiRealAttitudeManagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## రామకృష్ణ మఠ్ వారి వెబ్ సైట్

## http://www.rkmath.org

Archives

www.rkmath.org/prabhaarchives

Home | Universal Temple | Activities | Languages | Human Excellence | Health | Publications | Downloads

Magazine | Telugu Books, CDs & Posters | Online Shopping

About | Archives | Subscription

Aa | What's New | Our Location

Would you try to wash dirt with dirt? Will sin cure sin, weakness cure weakness? Strength, O man, strength, say the Upanishads, stand up and be strong.

- Swami Vivekananda

Donate | Serve with us | Contact Us

Universal Temple

- Temple
- Arathi
- Bhajans
- Festivals
- Rama Nama
- Worship

Activities

- Weekly discourses
- Relief
- Library
- Retreats
- Anna Danam
- Balanarayana Seva
- Vidya Danam
- Jnana Danam
- Satsangas
- Diksha

Ramakrishna Prabha Magazine Archives

Submit

2012

2011

Click to read

Click to read

Click to read

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

శ్రీ వివేకానందస్వామి శతతమ జయంతి ప్రచురణములు

ఆంధ్రపాఠకులకు అమూల్యతరుణము

# శ్రీ వివేకానంద సంపూర్ణగ్రంథావళి

ప్రతిభోజ్జ్వలులైన ఆంధ్రపండితులచే ఆంధ్రీకరింపబడి 10 సంపుటాలుగా ప్రకటింపబడుతున్నది. ప్రతి సంపుటంలోను దాదాపు 500 పుట లుంటాయి. అసలు ఖరీదు అట్టబైండు సెట్టు రు. 50 లు. కాలికోబైండు సెట్టు రు. 65 లు. పోస్టేజి ప్రత్యేకం.

స్వామీజీసందేశం మాతృదేశభక్తిభరితం ప్రాణప్రదం ఆత్మోత్తేజకరం విశ్వజనీనం. అది సమగ్రంగా ఆంధ్రమహాజనులకు అందడం ఇదే మొదటిసారి. స్వామీజీది దివ్యదృష్టి ఆయన అమోఘ పరిష్కారవిధానం సూచింపని ముఖ్యసమస్య అంటూ లేదు. ఆయన గ్రంథావళిని చదివినవారికి ఉత్సాహమును ఉదాత్తతయున్నూ కలుగక తప్పదు.

## ప్రకటనకు ముందే పైకం చెల్లించేవారికి తగ్గింపు ధరలు

అట్టబైండు సెట్టు రూ. 30 లు మాత్రమే. 1962 ఫిబ్రవరి తే 28 ది లోగా రూ. 10 లు చెల్లించి పేరు రిజిస్టరు చేయించుకొని మిగత రూ. 20 లను ఒకటి రెండు వాయిదాలుగా జూన్ తే 30 ది లోగా పంపాలి.

క్యాలికోబైండు సెట్టు రూ. 45 లు మాత్రమే. 1962 ఫిబ్రవరి తే 28 ది లోగా రూ. 15 లు చెల్లించి పేరు రిజిస్టరు చేయించుకొని మిగత రూ. 30 లను ఒకటి రెండు వాయిదాలుగా జూన్ తే 30 ది లోగా పంపాలి.

1962 జూలైకిని 1963 జూలైకిని మధ్యకాలమున గ్రంథములు సరఫరా చేయబడును.

విలాసము : మేనేజరు,

శ్రీ రామకృష్ణ మఠము

మైలాపూరు : : మద్రాసు - 4

# వంట చేస్తూనే విశ్రమించండి

ಅಡಿಗೆಯು ನಿಮಗೆ ಭೀಕರ ಶ್ರಮವಾಗಿರಬಲ್ಲುದು, ಈ ಆಶ್ಚರ್ಯಕರ ಕೆರೊಸಿನ್ ಕುಕರ್‌ನ ಸೌಕರ್ಯವನ್ನು ನೀವು ತಿಳಿದುಕೊಳ್ಳುವವರೆಗೆ. ಬೇಕಾದ ಕಾಲದಲ್ಲಿ ಅಡಿಗೆ ಮಾಡಿರಿ—ಪರಿಶ್ರಮವಿಲ್ಲ.

ಕಲ್ಲಿದ್ದಲನ್ನು ಮುರಿಯು ಬೇಕಾಗಿಲ್ಲ, ಬೆಂಕಿ ಊದ ಬೇಕಾಗಿಲ್ಲ, ಕಣ್ಣಿಗೆ ಹೊಗೆಯಿಲ್ಲ ಮತ್ತು ಒಳ ಮಾಳಿಗೆಯಲ್ಲಿ ಮಸಿಯಾಗದು. ಈ ಹೊಸ ಕುಕರ್ ಸ್ವಚ್ಛ, ನೇರ ಮತ್ತು ಸರಳ-ದುಡಿಮೆ, ಬೆವರು ಅಥವಾ ಕಂಬನಿಗಳಿಲ್ಲ.

- మురికి, దుమ్ము వుండవు, మసి పట్టదు, మంటలు లేవవు
- ఖర్చు చాలా తక్కువ, పూర్తిగా సురక్షితమైనది
- తేలికగా ఎక్కడికి పడితే అక్కడికి తీసికొని వెళ్లవచ్చు




# ఖాస్ జనతా
## కిరోసిన్ కుక్కర్

వంట బాగా తేలికగా చేసుకోండి

ఉత్పత్తిదారులు:
**ది ఓరియంటల్ మెటల్ ఇండస్ట్రీస్ ప్రైవేట్ లిమిటెడ్**
77, బౌబజార్ స్ట్రీట్, కలకత్తా-12

KALPANA O. M. 15/78

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటము ౧౮ ౧౯౬౨, జాన్యువరి; ప్లవ - పుష్యము సంచిక ౭

## విషయసూచిక



శ్రీ రామకృష్ణ ప్రభ

## చందాదారులకు

1961 వ సంవత్సరము జూలై నెలనుండియు మా చిట్టాయందు చందాదారుల పట్టీని మార్పుచేసియున్నాము. చందాదారులు (తమ చిరునామాయందు పేరునకు ముందుగల) తమ చందాదారుసంఖ్యను గుర్తించి ఉత్తరప్రత్యుత్తరములందు ఈ క్రొత్త చందాదారు సంఖ్య నుదాహరింపగలరని కోరుచున్నాము. అట్లు చందాదారుసంఖ్య తెలుపనియెడల ఉత్తరప్రత్యుత్తరములను జరుపుటయందు ఆలస్యమును, పొరపాటును జరుగు నవకాశము లేర్పడునని చందాదారులు గుర్తింపగలరని ఆశించుచున్నాము.

ఇట్లు,
ప్రకాశకులు

# శ్రీ రామకృష్ణ మఠ ప్రచురణములు

740 పుటలు శ్రీరామకృష్ణ సూక్తి సుధ (తోలికూర్పు) రూ. 7/50

496 పుటలు శ్రీ రామకృష్ణ లీలామృతము (ద్వితీయ ముద్రణము) రూ. 5/-

144 పుటలు శ్రీ శారదాదేవి రూ. 1-25

312 పుటలు శ్రీ శారదా ప్రసంగములు రూ. 3-00

540 పుటలు శ్రీ రామకృష్ణ బోధామృతము (సంగ్రహ జీవితసహితము) రూ. 3-50

432 పుటలు (సాదా) రూ. 3-50 శ్రీవివేకానంద జీవితచరిత్ర (అట్టబైండు) రూ. 4/-

564 పుటలు స్వామి - శిష్య సంవాదములు (ప్రథమ ముద్రణము) రూ. 5/-

344 పుటలు బ్రహ్మానంద బోధనలు (ప్రథమ ముద్రణము) రూ. 3-50

330; 324 పుటలు సందేశతరంగిణి - 2 భాగములు (ఒక్కొక్క భాగము) రూ. 3/-

402 పుటలు పారమార్థిక సంభాషణలు రూ. 3/-

504 పుటలు శ్రీమద్భగవద్గీత (పంచమ ముద్రణము) రూ 4/-

జ్ఞానయోగము 4 00 రాజయోగము 2 50
కర్మయోగము 1 50 భక్తియోగము 1 50
నారద భక్తి సూత్రములు ... 3/-
పరతత్త్వప్రసంగము ... 2/-
శ్రీ నాగమహాశయుని జీవితచరిత్ర ... 1 25
ప్రబోధరత్నాకరము ... 2 25
శ్రీ శారదాదేవి చరిత్ర ... 2/-
దేవీమాహాత్మ్యము ... 2/-
వివేకానందలేఖావళి (మొదటిభాగము) 1 50
వివేకానందలేఖావళి (రెండవభాగము) 1 75
శ్రీరామకృష్ణోపనిషత్తు ... 1 25
హిందూ మతము ... 1 25
అనుష్ఠాన వేదాంతము ... 1 25
కులము, సంస్కృతి, సామ్యవాదము 1/-
వివేక సూర్యోదయము ... 1 25
భారతీయ మహిళ ... 1/-
కఠోపనిషత్తు ... 0 80
శ్రీ పరమహంస నీతికథారత్నములు 0 75

గిరీశచంద్ర 0 75 భక్తిమార్గము 0 50
షికాగో నగరోపన్యాసములు 0 50
గురూపదేశములు 0 50 శ్రీకృష్ణవాణి 0 40
శ్రీ రామకృష్ణ ఉవాచ 0 37
శ్రీ వివేకానంద శంఖారావము 0 37
శ్రీ శారదా సూక్తి నవనీతము 0 40
నా సంస్కరణ యుద్ధవిధానము 0 87
నా గురుదేవుడు 0 40 బుద్ధ ఉవాచ 0 87
శ్రీరామకృష్ణుడు, వివేకానందస్వామి 0 25
శ్రీ పరమహంస జీవిత సంగ్రహము. 0 25
పరమహంస శ్రీరామకృష్ణుడు ... 0 25
నవీన భారతదేశము ... 0 25
తాపత్రయ చికిత్స ... 0 25
పవహారిబాబా 0 25 ముక్తిమార్గము 0 19
సర్వం విష్ణుమయం జగత్ ... 0 19
శ్రీ రామకృష్ణ ఆరాత్రికము 0 12
శ్రీరామనామసంకీర్తన 0 6 యతిగీతము 0 6
నామతము 0 3 వి. సింహగర్జనము 0 3

శ్రీ దొడ్డ భాగవతము - మొదటి సంపుటము రూ. 6-50; రెండవ సంపుటము రూ. 5-50; మూడవ సంపుటము రూ. 7-50 (మూడును ఒకేసరి కొన్నచో: రూ. 18-50)

ఇవియేకాక సంస్కృత, ఆంగ్ల, తమిళ, హిందీ, కన్నడ గ్రంథములు,

వేదాంత కేసరి (ఆంగ్లము) శ్రీ రామకృష్ణ విజయము (తమిళము)

అను మాసపత్రికలును మాయొద్ద దొరకును

అడ్రెసు : మేనేజరు, శ్రీరామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు - 4



'అఖిలవిభు శరణొందుమ, యా క్షణంబ యతనికృప నీకు ననుభావ్య మగును వత్స.'

-శ్రీ శారదామణి.


# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము ౧౮ } ౧౯౭౫ - జాన్యువరి : : భవ - పుష్యము సంచిక ౭


## సౌందర్యలహరి


మూలము : శ్రీ శంకరభగవత్పాదులు

టీక : నే. భ.


చతుర్భి శ్శ్రీకణ్ఠై శ్శివయువతిభిః పఞ్చభి రపి
ప్రభిన్నాభి శ్శమ్భోర్ నవభి రపి మూలప్రకృతిభిః
చతుశ్చత్వారింశ ద్వసుదల కలాశ్ర త్రివలయ
త్రిరేఖాభి స్సార్ధం తవ శరణకోణాః పరిణతాః ॥ ౧౧

| | | | |
|---|---|---|---|
| శంభోః | శివునినుండి బిందువునుండి | వసుదళ | ఎనిమిది రేకులతోను |
| ప్రభిన్నాభిః | వేఱైనవగు | కలాశ్ర | పదునాఱు రేకులతోను |
| శ్రీకణ్ఠైః | శ్రీకంఠ (కోణ) ములు | త్రివలయ | మూడు వృత్తములతోను |
| చతుర్భిః | నాలుగింటితోను | త్రిరేఖాభిః | మూడు రేఖలతోను |
| శివయువతిభిః | శక్తికోణములు | సార్ధం | కూడినవై |
| పఞ్చభిః అపి | ఐదింటితోను-ఇట్లు | తవశరణ | నీభవనపు (శ్రీచక్రపు) |
| నవభిః | తొమ్మిది | కోణాః | కోణములు |
| మూలప్రకృతిభిః | ప్రపంచ మూలకోణముల తోను | చతుశ్చత్వారింశత్ | నలువదినాల్గుగా |
| | | పరిణతాః | పరిణమిల్లినవి. |

తా॥ నాల్గు శివునివియు ఐదు శక్తివియును గా నున్న తొమ్మిదికోణములతోను, అష్టదళములతోను, షోడశదళములతోను, త్రివృత్తములతోను, భూగృహములు మూటితోను-నీయునికిపట్టు (శ్రీచక్రము) నలువదినాల్గు కోణములు గలదిగా విస్తరిల్లును.

త్వదీయం సౌందర్యం తుహినగిరికన్యే తులయితుం
కవీన్ద్రాః కల్పన్తే కథమపి విరిఞ్చిప్రభృతయః ?
యదాలోకౌత్సుక్యా దమరలలనా యాన్తి మనసా
తపోభి ర్దుష్ప్రాపా మపి గిరిశసాయుజ్యపదవీమ్ ॥ ౧౨

| | | | |
|---|---|---|---|
| తుహినగిరి కన్యే | ఓ హిమవత్పుత్రీ | ఔత్సుక్యాత్ | ఉబలాటము చేత |
| విరిఞ్చిప్రభృతయః | బ్రహ్మ మున్నగు | అమరలలనాః | వేల్పు మగువలు |
| కవీన్ద్రాః | కవిశ్రేష్ఠులు | తపోభిః అపి | కృచ్ఛ్రచాంద్రాయణాదుల చేత సైతము |
| త్వత్ | | | |
| సౌన్దర్యం | చక్కదనమును | దుష్ప్రాపాం | దుర్లభమగు |
| తులయితుం | సరితూచుటకు | గిరిశ | శివునితోటి |
| కథం అపి (కథంవా) | ఎట్లు | సాయుజ్య | ఐక్యానుసంధాన |
| కల్పన్తే | శక్తులగుదురు ? | పదవీం | సరణిని |
| యత్ | ఏచక్కదనమును | మనసా | మనస్సు చేత |
| ఆలోక | చూచుట చేత గల్గిన | యాని | పొందుదురో. |

తా॥ అమ్మా, హైమవతీ, నీచక్కదనమున కొక యుపమానమును చెప్పుటకు కవిశ్రేష్ఠులకు బ్రహ్మాదులకైనను ఎట్లు శక్య మగును? నీ చక్కదనమును జూచినచో దాని ననుభవింప వలె నను నాత్రము అచ్చరలకు సైతము గల్గును. స్త్రీలను సైతము మోహింపజేయు అంద మమ్మా, నీది! నీ చక్కదనమున కేమో పరమశివు డొక్కడే భోక్త. కావున ఆ యను భవమును గోరిన అచ్చరలు పరమశివునితో తమ్ము మానసికముగ ఐక్య మొందించుకొందురు. తపస్సుల చేతసైతము ప్రాపింపరాని శివైక్యము అచ్చరలకు నీసౌందర్యానుభవాభిలాష చే సిద్ధించుచున్నది.

నరం వర్షీయాంసం నయనవిరసం నర్మసు జడం
తవాపాఙ్గాలోకే పతిత మనుధావన్తి శతశః
గళద్వేణీబన్ధాః కుచకలశవిస్రస్తసిచయా
హఠాత్ త్రుట్యత్ కాఞ్చ్యో విగళితదుకూలా యువతయః ॥ ౧౩

| | | | |
|---|---|---|---|
| వర్షీయాంసం | అతివృద్ధుడును | ఆలోకే | చూపు (మేర) లో |
| నయనవిరసం | చూడ వెగటుగొల్పు వాడును (వెగటుగొల్పు చూపుల వాడును), | పతితం | పడ్డవాడును (నగు) |
| | | నరం | మనుష్యమాత్రుని (మన్మథునిగా నెంచి-అనుట) |
| నర్మసు | శృంగారక్రీడలలో | శతశః | నూర్లకొలదిగా |
| జడం | మొద్దన్నయు (దద్దన్నయు) | యువతయః | యౌవనమందున్న స్త్రీలు (కొమిరెలు) |
| తవ | నీ | | |
| అపాఙ్గ | కడకన్నుల | గళద్ | (తమంతట) విడిపోవుచున్న |

| | | | |
|---|---|---|---|
| వేణీబన్ధాః | కొప్పులుగలవారును | కాఞ్చ్యః | మొలనూళ్లుగలవారును (కావున నే) |
| కుచకలశ | స్తనకుంభములనుండి | | |
| విస్రస్త | (తమంతట) జాఱుచున్న | విగళిత | జాఱిన |
| సిచయాః | పైటలుగలవారును | దుకూలాః | కోకలుగలవారును (ఐ) |
| హఠాత్ | ఆకస్మికముగ | అనుధావన్తి | వెంటబడుదురు. |
| త్రుట్యత్ | తెగుచున్న | | |

తా॥ అమ్మా, మానవుడు ఎంతవృద్ధుడుకానీ, కురూపికానీ, నీ కడకంటిచూపునకు గుఱి యగునేని, ఆ చూపు అతనిని మన్మథసుందరునిగా నొనర్చును. యువతులు నూర్ల కొలదిగా అతనిపొందు గోరి ఆత్రముతో వెంటబడుదురు. లజ్జ నతిక్రమించిన కామోన్మత్తావస్థలో నున్న ఆయువతులకు వారికి తెలియక కొప్పులు విడిపోవును, పైటలు జాఱును, మొలనూళ్లు తెగును, కోకలు ఊడును. అంతటి సౌందర్యము నతని కిచ్చు మహిమ నీ కడకంటిచూపున కే ఉండగా, ఇక నీ సౌందర్యమహిమ ఎట్టిదో తెలిసికొన శక్యమగునా?

క్షితౌ షట్పఞ్చాశద్, ద్విసమధికపఞ్చాశ దుదకే,
హుతాశే ద్వాషష్టి, శ్చతురధికపఞ్చాశ దనిలే,
దివి ద్విఃషట్త్రింశ, న్మనసి చ చతుఃషష్టి — రితి యే
మయూఖా స్తేషా మప్యుపరి తవ పాదామ్బుజయుగమ్ ॥ ౧౪

| | | | |
|---|---|---|---|
| క్షితౌ | భూతత్త్వాత్మకమగు మూలాధారచక్రమున | దివి | ఆకాశతత్త్వాత్మకమగు విశుద్ధిచక్రమున |
| షట్పఞ్చాశత్ | ఏబదియాఱును ; | ద్విఃషట్త్రిం | 36×2 డెబ్బదిరెండును |
| ఉదకే | జలతత్త్వాత్మకమగు మణిపూరకచక్రమున | మనసిచ | మనస్తత్త్వాత్మకమగు ఆజ్ఞాచక్రమున |
| ద్విసమధికపఞ్చాశత్ | ఏబదిరెండును ; | చతుష్షష్టిః | అఱువదినాల్గును |
| హుతాశే | అగ్నితత్త్వాత్మకమగు స్వాధిష్ఠానచక్రమున | ఇతి | ఈ లెక్కగా |
| | | యేమయూఖాః | ఏ కిరణములు గలవో |
| ద్వాషష్టిః | అఱువదిరెండును ; | తేషాం అపి | వానికిని |
| అనిలే | వాయుతత్త్వాత్మకమగు అనాహతచక్రమున | ఉపరి | పైదై |
| | | తవ | నీ |
| చతురధికపఞ్చాశత్ | ఏబదినాలుగు | పాదామ్బుజయుగమ్ (విద్యతే) | అడుగుదామరల జంట (ఉన్నది). |

తా॥ భూతత్త్వాత్మక మగు మూలాధారచక్రపు కిరణములు 56 ; జలతత్త్వాత్మకమగు మణిపూర చక్రపు కిరణములు 52 ; ఈ రెండు చక్రములలో కలిసి ఉన్న 108 కిరణములును రుద్రునివి. అగ్నితత్త్వాత్మకమగు స్వాధిష్ఠానచక్రపు కిరణములు 62 ; వాయుతత్త్వాత్మక మగు

అనాహతచక్రపు కిరణములు 54; ఈ రెండు చక్రాలలో కలిసి ఉన్న కిరణములు 116 ను సూర్యునివి. ఆకాశతత్త్వాత్మకమగు విశుద్ధిచక్రపు కిరణాలు 72; మనస్తత్త్వాత్మకమగు ఆజ్ఞా చక్రపు కిరణములు 64; ఈ రెండు చక్రాలలో కలిసి ఉన్న కిరణములు మొత్తము 136 ను చంద్రునివి. ఈ కిరణములు మొత్తము మున్నూట అఱువదింటికిని పైనున్న సహస్రారకమలమున అమ్మా నీ పాదయుగళి ఉన్నది.

శరజ్జ్యోత్స్నాశుద్ధాం శశియుతజటాజూట మకుటాం
వర త్రాసత్రాణ స్ఫటిక ఘటికా పుస్తక కరామ్
సకృ న్న త్వా నత్వా కథ మివ సతాం సంనిదధతే
మధు-క్షీర-ద్రాక్షా-మధురిమ ధురీణాః ఫణితయః ॥ ౧౫

| | | | |
|---|---|---|---|
| శరజ్ | శరత్కాలపు | త్వా | నిన్ను |
| జ్యోత్స్నా | వెన్నెలవలె | సకృత్ | ఒక్కసారి |
| శుద్ధాం | ధవళకాంతిగలదానవును | నత్వా | మ్రొక్కి (న) |
| శశి | నెలవంకతో | సతాం | కవీశ్వరులకు |
| యుత | కూడుకొన్న | మధు (మధురిమ) | తేనె (తీపియందును) |
| జటాజూట | జడలగమియే | క్షీర (మధురిమ) | పాల (తీపియందును) |
| మకుటాం | కిరీటముగాగల దానవును | ద్రాక్షా | ద్రాక్షల |
| వర | వరదాన ముద్రను | మధురిమ | తీపియందును |
| త్రాసత్రాణ | అభయదాన ముద్రను | ధురీణాః | ధురంధరములగు (అగ్రగణ్యములగు) |
| స్ఫటికఘటికా | పటికపు పానపాత్రను | | |
| పుస్తక | పుస్తకమును (విద్యాముద్రను)దాల్చిన | ఫణితయః | వాగ్వైఖరులు |
| | | కథంఇవ | ఎటువలె |
| కరామ్ | హస్తములుగల దానవును అగు | నసంనిదధతే | సాన్నిధ్యమునర్పకుండును (సిద్ధింపకుండును) |

తా॥ మేనియందు శరత్కాలపు వెన్నెలను బోలిన ధవళకాంతియు, జడలగమిపైని చంద్రకళావతంసమును, చేతులందు వరదానముద్రయు అభయదానముద్రయు పటికపుపాత్రయు పుస్తకమును గల నీకు కవీశ్వరులు ఒక్కసారి నమస్కరించిన చాలును — వారికి తియ్యదనములో తేనెను పాలను ద్రాక్షలను మించిన వాగ్వైఖరులు తప్పక సిద్ధించును. శ్లోకమందలి వాక్యమును 'ఒక్కసారి మ్రొక్కనవారికి......వాగ్వైఖరులు ఎట్లు సిద్ధింపకుండును' అనియు '....మ్రొక్కనివారికి......ఎట్లు సిద్ధించు' ననియు రెండురీతులుగా వ్యాఖ్యాతలు అన్వయించి యున్నారు.

# శ్రీ వివేకానందస్వామి 'త్యాగ' సందేశము

## శ్రీమచ్ఛుద్ధసత్త్వానందస్వామి సంకలితము

మహాత్యాగమూలమునగాని మహాకార్యములు సాధింపబడవు.

*  *  *

విశ్వహిత మనెడు ఒక్క మహాలక్ష్యమును సాధించుకొనుటకు అవసరమగునేని సర్వమును పరిత్యజింపవలెను.

*  *  *

ఇతరులకు మోక్షము లభింపజేయుటకై నీవు నరకమునకు పోవుట ఆవశ్యకమైనచో పొమ్ము. 'నాయొక్కని మోక్షము' అనదగినది లోకమున లేనేలేదు.

సర్వమును ఇతరులకై పరిత్యజించు వానికే మోక్షము దక్కునది. "నా మోక్షము", "నా మోక్షము" అని శ్రేయంబవల్లు తపించి వాపోవువారు తమ ప్రస్తుత శ్రేయమును భావి శ్రేయమునుకూడ నాశిలజేసికొని క్రిమ్మరుచుందురు. నేనిది యెన్నియోసార్లు ప్రత్యక్షముగా చూచిన విషయము.

ప్రతిఫలము నెన్నడుగాని అడుగ వలదు, అపేక్షింపవలదు. నీవు ఇచ్చి వేయగల సర్వస్వమును ఇచ్చివేయుచుండుము. అది నీకు మరలవచ్చును – కాని ఆ తలంపు నిప్పుడు పెట్టుకోవలదు. అది అధికమయి — వేయిరెటయి మరలవచ్చును. కాని దృష్టి దానిపై నుండరాదు. ఇచ్చుశక్తి నీకు కలదు — కావున ఇమ్ము. అంతయే.

*  *  *

దాతృత్వమును మించిన ధర్మము లేదు. పుచ్చుకొని చేతిని వెనుకకు లాగుకొనువాడు మానవులలో అధమాధముడు. ఇచ్చుటకై చేయిచాచువాడు మానవులలో ఉత్తమోత్తముడు. ఎప్పుడును ఇచ్చుచుండుటకే చేయి కల్పింపబడినది. నీయొద్ద మిగిలియున్న పిడికెడు అన్నమునుకూడ పెట్టివేయుము. నీవు పస్తుపడియుండవలసివచ్చినను సరే. మఱియొకరికి పెట్టి నీవు పస్తుండి మరణించితివేని, నీ కా క్షణముననే ముక్తి లభించును. ఆ క్షణముననే నీవు పరిపూర్ణుడవగుదువు, భగవంతుడవగుదువు.

*  *  *

కీర్తి యెవనికి కావలెను ? అది తుచ్ఛము, దాని ప్రసక్తియే పెట్టుకొనకుము. అన్నాతురులై మాడుచున్న వారి యాకలితీర్చు యత్నమున పేరుప్రతిష్ఠలు, ఆస్తిపాస్తులు మున్నగునవన్నియు నశించినను — నీవు ధన్యుడవు, నీ ధన్యత గణనాతీతము. (పారమార్థిక)విజయము చేకూర్చునది హృదయము (ప్రేమ), మెదడు (బుద్ధి) కాదు. శాస్త్రములు, పాండిత్యము, యోగము, ధ్యానము, జ్ఞానతేజోదయము ఇవన్నియు ప్రేమతో పోల్చిచూచినయెడల తుచ్ఛములు, తృణప్రాయములు.

*  *  *

హిందూదేశమున కిప్పుడు కనీస మొక వేయిమంది త్రేబాయపు పురుషుల ఆహుతి కావలసియున్నది. "పురుషుల" అని జ్ఞప్తి పెట్టుకొనుము : "పశువుల," కాదు సుమా!

*  *  *

ధనికులయెడ గురుత్వము చూప నారంభించినచో మతశాఖలకు పతనము ప్రారంభమైనట్లే.

త్యాగమే ప్రధానవిషయము — మనః పూర్తిగా ఇతరులకై పాటుపడుట త్యాగికి కాని సాధ్యముకాదు. సర్వజనులను సమదృష్టితో చూచువాడే త్యాగి — అగుచో ఇతరులకన్న నీ ఆలుబిడ్డలు స్వకీయు లన్నభావము నీకేల కలదు? నారాయణుడే నిఱుపేద యాచకరూపమున నీ వాకిటి గడపయొద్దనే ఆకలిచే చచ్చుచున్నాడే! వాని కేమియు పెట్టక నీ యాలు బిడ్డలను మాత్రము షడ్రసోపేతభోజ్యములతో తృప్తిపఱతువా? ఎంత ఘోరకృత్యము అది!

* * *

స్వార్థపరమైన దంతయు నీతి బాహ్యము, అస్వార్థమైనది నైతికము.

* * *

మన మెలరమును లోకమునకు ఋణపడి యున్నామనియు, లోకము మన కేమియు ఋణపడి యుండలేదనియు, మనము జ్ఞప్తి పెట్టుకోవలెను. లోకహితార్థము ఏమేనియు చేయు నవకాశము లభ్యమగుట మన మహాభాగ్యము. లోకమునకు తోడ్పడుటలో మనము నిజముగా తోడ్పడునది మనకే.

* * *

ఉన్నతుడనని భావించి, నాలుగు కాసులు తీసి "ఇందరా అబ్బీ!" అని అనబోకుము. అందుకుమాఱు, ఆ "అబ్బి" అచట నున్నందుకు కృతజ్ఞుడవై యుండుము. అతనికి ఇచ్చుట వలన ఉపకారము నీకే కలిగినదని తెలిసికొనుము. పుచ్చుకొనువాడు కాదు ధన్యుడు, ఇచ్చువాడు.

అస్వార్థతయే ఎక్కువ ఫలప్రదము. కాని దాని నభ్యసించుటకు వలయు ఓర్పు మానవులకు లేదు.

మహత్త్వము కలిగియుండుము. త్యాగము లేనిదే ఏ మహాకార్యమును సాధించుటశక్యము కాదు. ఈ జగత్తును సృజించుటకై ఆ పరమపురుషుడే ఆత్మత్యాగమొనర్చుకొనెను. మీ భోగములను, మీ సుఖములను, మీ పేరుప్రతిష్ఠలను, మీ పదవులను — మీ ప్రాణములనైనను — సమర్పించి, మానవకళేబరముల గొలుసులతో నొక వంతెనను నిర్మింపుడు. ఆ వంతెనమీదుగా కోటానుకోట్లీ సంసారసాగరమును దాటుదురుగాక! అనుకూల శక్తుల నన్నిటి నొకటిగా కూర్పుడు. అందులో మీ కే జెండా ననుసరించినను ఫరవాలేదు. మీజెండా రంగు పచ్చనా, నీలమా, ఎఱుపా అని చూడవలదు. రంగుల నన్నిటిని మిశ్రమొనర్చి మహోజ్జ్వలశ్వేతవర్ణమును — ప్రేమశ్వేతవర్ణము — కల్పింపుడు. కార్యాచరణమే మనవంతు. ఫల ప్ర కి మన కేల?

* * *

లోకమున ఇచ్చువాడవుగ నుండుటే నీపని. సర్వమును ఇచ్చి వేయుము. ప్రతిఫలము నపేక్షింపకుము. ప్రేమ నిమ్ము, తోడ్పాటునిమ్ము, సేవ నిమ్ము, నీ వీయగలిగిన అత్యల్పవస్తువును కూడ నిమ్ము, కాని బదులుకు బదులుగా మాత్రము కాదు ఎట్టి షరత్తులను నీవు విధింపకుము ఎట్టి షరత్తులును నీకు విధింపబడవు. స్వేచ్ఛగా, కేవలము మన ఉదార స్వభావమూలముననే — భగవంతుడు మన కొసగు తెఱగున — ఇచ్చుచుందుముగాక!

# భారత దేశసమస్యలు - శ్రీవివేకానందస్వామి

## [సంపాదకీయము]

పందొమ్మిదవ శతాబ్దమునుండియు భారత దేశపు భాగముల కన్నిటికిని రైలు రేడియో టెలిగ్రాఫు (తంతివార్త)ల మూలమున సన్నిహితత్వ మేర్పడినది. భారతదేశమున సర్వప్రాంతీయులును సులభముగ అందుబాటులో ఉన్న పత్రికలద్వారా తమ అభిప్రాయాలను ఒకరి కొకరు ప్రకటింపగల్గినారు. తత్ఫలితముగా దేశములో ఉన్న సమస్యలు ఎంత పెద్దవో ఎంత సంకీర్ణములో ఎన్ని రకాలవో ప్రజలకు తెలిసివచ్చి, వారు ఎక్కువగా క్షోభిల్లిపోజొచ్చినారు. స్థితిగతులు తీసికట్టగుచున్నవనియు, అన్ని రంగములలో సంస్కార మావశ్యకమై ఉన్నదనియు అందఱు ఏకగ్రీవముగ అంగీకరించినారు. సాంఘికరంగములోనేమి ఆర్థిక రంగములోనేమి విద్యారంగములోనేమి రాజకీయరంగములోనేమి ప్రశంసనీయములైన, పెక్కు సంస్కారప్రణాళికలను ప్రముఖులు ఉత్సాహముతోను తత్పరతతోను పన్నాగించినారు. కాని ఆప్రణాళికలు మంచివే ఐనప్పటికిని ఎక్కువ సాధకములు కాబోవు అని తోచినది.

అందుకు మొదటి కారణ మిది—కావలసిన వానిని నిర్మించు పట్టింపుకంటె ఉన్నదానిని నిర్మూలించుపట్టింపే సంస్కర్తలలో హెచ్చిపోయినది. కాని తాత్కాలిక భారతదేశ పరిస్థితులను బట్టి చూచినచో ఇది ఆశ్చర్యకరము కాదు. దేశము అతిప్రాచీనము, దీని నాగరకతయు సంస్కృతియు అత్యంతప్రాచీనములు. ఇది పేదఱికమునకును దాస్యమునకును వానివలన గల్గు సకలానర్థములకును గుఱిఐనది. అదే సమయమున ఎట్టయెదుట విజయగర్వితులగు పాశ్చాత్యుల నాగరకత (ఐహికపరత) జాజ్వల్యమానముగ పొడగట్టినది. దాని వెలితళుకులు వీరికి నోరూరించినవే కాని దాని సరుకును పునాదులను సంశయించు అవకాశమైనను వీరికి లేదాయె. తమ ప్రాతదారిని విడిచిపెట్టి సరిక్రొత్త దారిని త్రొక్కవలె నని, నైతికాధ్యాత్మికనియమావళిని త్రోసిరాజని భోగభాగ్యోజ్జ్వల్యమహితమైన విశృంఖలమార్గమున ముందునకు ఉరవడింత మని—చాపల్యము అని వార్కి మాయెను.

రెండవకారణ మిది — శ్రీవివేకానంద స్వామి దేశీయాంతర్దేశీయరంగమున అడుగిడుటకు పూర్వము అప్పటి భారతదేశపుచిక్కులను పరామర్శించినవా రెవరును వానిని ప్రాచీన భారతదేశచరిత్రములోని వాని మూలములను బట్టి పరిశీలింప లేదు. భవిష్యత్కాలమున ప్రపంచదేశాల మధ్య భారతదేశస్థానమును ఊహించి చూచినవారును లేరు. ఆత్మ ఏకము అనుట వేదాంతసత్యము. ఇది భారతదేశమున కొకప్పుడు తెలిసియుండినది కాని పిమ్మట విస్మృతమైనది. ఈ సత్యమును గుర్తించి తీరవలసినట్లుగా పరిస్థితులు యావత్ప్రపంచదేశాలను ఇప్పుడు నిర్బంధించుచున్నవి. రెండు

ప్రపంచమహాసంగ్రామాలకును ఏబది సంవత్సరములకు పూర్వమే దివ్యదృష్టి సర్వజ్ఞత్వములతో శ్రీవివేకానందస్వామి ఈలాగు చెప్పెను —"ప్రపంచములో ఒక్క అణువు కదలినను అది తనతో లోకమునంతటిని ఈడ్చుకొని పోవును. యావత్ప్రపంచమును కూడదీసికొననిదే ఏ అభివృద్ధియు కలుగదు. ఏసమస్యను కాని జాతీయ దేశీయసంకుచితదృష్టితో పరిష్కరింప లేము. ప్రతి ఆశయమును ప్రతి అభిలాషయు యావత్ప్రపంచమును తనలో ఇముడ్చుకొగలంతగా, విశ్వమానవతతినిమాత్రమే కాదు సర్వప్రాణికోటిని తనలో ఇముడ్చుకొగలంతగా విశాలతను విరివిని చెంద వలెను." (కంప్లీట్వర్క్సు III పు. 269).

శ్రీవివేకానందస్వామికి మునుపటి సంస్కర్తలకు పెక్కండ్రకు ఉద్దేశములు మంచివే ఉండినప్పటికిని, అందుకు వలసిన పరిజ్ఞానమును దృక్పథమును లేకపోవుటచే, వారి ప్రణాళికలు అసమగ్రములును లోతులేనివియు కాక తప్పదాయె. భారతదేశసమస్యలనుగూర్చిన శ్రీస్వామిజిభావములును వాని పరిష్కారమునకు ఆయన చూపిన దారులును అపూర్వములు, ఆశ్చర్యకరములు. భారతదేశసమస్య భారతదేశమునకే సంబంధించినది కావున, ఆ సమస్యను చర్చించుటకు ముందు 'భారతదేశ మన నెట్టిది' అను ప్రశ్న ప్రసక్తించును. ఈప్రశ్నకే జవాబు అనతగినట్లుగాను చక్కగాను తీర్మానముగాను శ్రీస్వామిజి ఈలాగు చెప్పినారు— "భారతదేశము శిథిలమైపడిపోయిన బ్రహ్మాండమైన ఒకకట్టడము వంటిది. కావున మొదటిసారి చూచినప్పుడు ఆసపాటు ఇంచుకయు ఉండదు......కాని నిదానించి పరిశీలింపుము, అప్పుడు దానికి మఱుగుననున్న సంగతి కననగును. తనలో ఉన్న సత్యము, సూత్రము, లక్ష్యము చెడకున్నంతవఱకు పడిపోకున్నంతవఱకు, మానవుడు మరణింపడు. తెప్పరిల్లి బ్రతుకువను ఆసపాటు కలదు. నీ కోటును ఇరువది సార్లు దొంగిలించినను, నీకు చేగి యుండదు. నీ వొక క్రొత్తకోటును కట్టించుకొగలవు..... ఒక సంపన్నుని సొమ్ము కొల్లపోయినంత మాత్రముచేత అతని ప్రాణశక్తికి క్షితి లేదు. అది అతనికి మరణము కాదు. అతడు అటు తర్వాతకూడ జీవించియే యుండును. (కంప్లీట్వర్క్సు VIII-73). ఐహికసంపద కాని రాజ్యాధికారము కాని భారతదేశమునకు లక్ష్యము కాదు. ఆధ్యాత్మికధర్మమే భారతదేశ లక్ష్యము అని చెప్పి ఆయన ఇంకనుఇట్లన్నాడు —"హిందువు ఆధ్యాత్మికధర్మానుగుణముగనే త్రాగును, ఆధ్యాత్మికధర్మానుగుణముగనే నిద్రించును ఆధ్యాత్మికధర్మానుగుణముగనే నడచును, ఆధ్యాత్మికధర్మానుగుణముగనే పెండ్లాడును, ఆధ్యాత్మికధర్మానుగుణముగనే కొల్లగొట్టును.....కావున భారతజాతికి ఆధ్యాత్మికధర్మమే జీవ మనియు, అదే జీవితకార్యక్రమ మనియు తేలుచున్నది" (కంప్లీట్వర్క్సు VIII-74).

భారతదేశపతనమునకు కారణమేమి? వర్ణవ్యవస్థ కాదు, బాల్యవివాహములు కావు, ఏ సంఘదురాచారదుష్ఫలితమును కాదు ; మన దృక్పథమును కార్యరంగమును సంకుచితమొనర్చుకొనుటే మన పతనమునకు కారణ మని శ్రీవివేకానందస్వామియభిప్రాయము. విభజించి పరిశీలించు శాస్త్రాలకు భారతదేశమే పుట్టినిల్లు ఐనప్పటికిని, ఆ విభజనప్రజ్ఞ, కాలక్రమ

మున మితిమీరిపోయినదనియు, అందులో జీవమును శక్తియు చచ్చినవనియు, ఆ ప్రజ్ఞ క్షుద్రమును వివేకరహితమునైన దనియు స్వామిజి పల్కినాడు. ఈ విషయమునే వివరించుచు ఆయన కళలోను సంగీతమందును మతధర్మమందును పాటిల్లిన క్షీణదశను ఉదాహరించినాడు "కళలో భావవైశాల్యము లేదు. భావోదాత్తత లేదు, అంగములకు ఒద్దికపొందికలు లేవు. అభిరుచియంతయు వన్నెలమీదను పైతళుకుల మీదనే" "స్వరముల గందరగోళమును మది చెడగొట్టు మలుపులునే ఆధునిక సంగీతము, ప్రాచీనసంస్కృత సంగీతములోనున్న హృదయము నుఱ్ఱూతలూపు భావములిందు లేవు. ఏ స్వరమునకును దాని ప్రత్యేకత లేదు, అద్భుతశ్రావ్యత లేదు". (కంప్లీట్వర్క్సు III-270).

స్వాతంత్ర్యమును స్వప్రజ్ఞయు లేకపోవుటయు బాహ్యాడంబరములపైని అభిరతియు ఆధ్యాత్మికరంగములోనికి గూడ చొచ్చుకొన్నవి. ప్రాచీన మహర్షులు నామరూపాతీతమగు బ్రహ్మము ననుసంధించి విశ్వాత్మతో ఐక్యసిద్ధి కాంచగా, నవ్యమహర్షులు "అన్నపానములనుగూర్చి, ఏ చేతితో నీరు త్రాగవలెను, ఎవరిని అంట వచ్చును, ఈ నియమాలను ఉల్లంఘించినందుకు ప్రాయశ్చిత్తము లేవి" అను విషయములనుగూర్చి చర్చించుచున్నారు. ప్రాచీనుల పరమపురుషార్థపరత అట్లుండినది! నేటి పతన మిట్లున్నది!! కోపముతోను ఎత్తిపొడుపుగాను స్వామిజి ఒకసారి "దేవుడు పైని స్వర్గమునందో, క్రింద మానవుని డెందమందో ఉండెడివాడు. ఇప్పుడాయన ఉండునది, వంటింట్లలోను వంటపాత్రలలోను" అన్నారు. విస్తరిల్లవలె, వెలికేగవలె, కలిసిపోవలె, విశ్వైక్యమును గడింపవలె-అనునవి మన మునుపటి లక్ష్యాలు. కాని మన శాస్త్రసిద్ధాంతాలకు విప్రతిపన్నముగా, మనము నానాటికి సంకుచిత బుద్ధుల మగుచున్నాము, ఇతరులనుండి మనలను చీలదీసికొనుచున్నాము. (III-271-2).

సంకుచితత్వపు జాడ యైనను సరే శ్రీస్వామిజియొద్ద లేదు. విశ్వమానవకోటిని తనలో ఇముడ్చుకొన్న ప్రేమ ఆయనది. అఖండభూమండలమును తన కుటుంబముగ భావించు ఉదారచరితుడు ఆయన. కాని కడపటివఱకు భారతదేశమునందొక ప్రత్యేకభక్తి ఆయనకుండెను. దేశదుఃస్థితిని చక్కగా గుర్తెఱిగి దేశమును దేశీయులను ఉద్ధరించుటకు దారులను ఉపాయాలను ఆయన సదా ఆలోచించుచుండెడివాడు, ఉద్ధరణకార్యక్రమములో చిన్న చిక్కులను ఆయన ఎన్నడును అలక్ష్యపెట్టలేదు. ఆయన వాక్కులు — "భారతదేశసమస్యలు అన్యదేశసమస్యలకంటె ఎక్కువ క్లిష్టములు, ప్రబలతరములు. 'ఒక దేశ (ప్రజానీక)మును రూపొందించుటలో జాతి - మతము - భాష - పరిపాలనము (గవర్న్మెంటు) మున్నగునవన్నియు చేరును......మన దేశములోనికా, ఆర్యులు వచ్చినారు, ద్రావిడులు వచ్చినారు, తార్తారులు వచ్చినారు, తుర్కులు వచ్చినారు, మొగలాయీలు వచ్చినారు, యూరోపువారు వచ్చినారు, - ఇంతేల, ప్రపంచములోని అన్ని దేశాలవారును భారతదేశముతో రక్తసంబంధమును కలుపుకొన్నా రన వచ్చు. ఇక మన దేశములో ఉన్న భాషలను చూతుమేని ఆశ్చర్యకరమైన వైవిధ్యము కన నగును. ప్రాచ్యుల ఆచారవ్యవహారాలకు ప్రతీచ్యుల

ఆచారవ్యవహారాలకు ఉన్నంత భేదము తమ పరస్పరాచారవ్యవహారాలలో గల జాతులు భారతదేశమున నున్నారు''. (కంప్లీట్వర్క్సు III-286 పుట).

యూరోపియ దేశాలలో ఒద్దికకును పొందికకును మూలములు రాజకీయభావము లనియు, భారతదేశీయులలో ఒద్దికను పొందికను సమకూర్ప గల అమోఘశక్తివంతములు ఆధ్యాత్మికాశయము లనియు స్వామిజిదృఢవిశ్వాసము. ''ఆసియాలో, ముఖ్యముగా భారతదేశములో, జాతిచిక్కులును భాషచిక్కులును సాంఘికపు చిక్కులును అన్నిచిక్కులును మతమునకున్న ఏకీకరణశక్తిలో లయించి పోవుచుండుట మనకు ప్రత్యక్షము'' అన్నాడు స్వామిజి. కావున భావిభారతమును రూపొందించుటకు ప్రథమావశ్యకమైన దేది అనగా 'మతైక్యము', అని శ్రీవివేకానందస్వామియభిప్రాయము. ఈ దేశమున నిలుకడ గల సంస్కారము తేవలయు ననిన అందుకు సాధ్యమైన ఏకైకోపాయమును అత్యంతప్రధానమైనదియుమతైక్యసంపాదనమే. ఇందుల నిజమునకు ఈతరమువారమైన మనమే సాక్ష్యము. దేశస్వాతంత్ర్యోద్యమమునకు పూనుకొన్న గాంధిమహాత్ముడు ఆ ఉద్యమమునకు ఆధ్యాత్మికాదర్శమును మూలముగ జేసినప్పుడే యావద్భారతీయులు ఏకగ్రీవముగ దాని ననుసరించిరి. ''మన జీవరక్తము పారమార్థికపరతయే. దానిపాఱుదల సరళముగను స్వచ్ఛముగను ప్రబలముగను అమోఘముగను ఉన్నంతవఱకు అంతయు బాగుండును. ఆరక్తము శుద్ధముగ నున్నంతవఱకును రాజకీయ సాంఘికాదు లయిన యే మైహికపు లోటుపాట్లు ఏర్పడినను అవి చక్కబడుచుండును....అదే మన దేశీయజీవిత ప్రవాహము. దానిని అనుసరింపుడు, అది మిమ్ము ఉజ్జ్వలపదవి నెక్కించును. దానిని వదలుకొంటిరా, అంతరించి పోవుదురు'' — అన్నాడు స్వామిజి. (కంప్లీట్వర్క్సు III-288).

తన సమకాలికులగు ఇతరు లనుసరించిన పద్ధతి కంటె ఈ పద్ధ పూర్తిగా భిన్నమైనది. భారతదేశమునకు ఏది ఆత్మయో దానిని మనకు ఆయన ప్రత్యక్ష మొనర్చినాడు. మాతృదేశమునకు ఆయన చేసిన సేవలలో అగ్రగణ్యములలో ఇదొకటి. ఆయన వాణి ఉత్సాహప్రదము, శక్తివంతము; ఆయన తన యభిప్రాయములను ఆత్మవిశ్వాసముతోను అత్యంతస్పష్టతతోను తెల్పెడివాడు. ఇది భారతీయుల చిత్తమున తిరముగ నాటుకొన్నది. రామకృష్ణోద్యమ నిర్వాహకులు తెలిసి బుద్ధిపూర్వకముగనే ఆయన ననుసరింతురు. వారే కాక చిన్నవియు పెద్దవియు అగు పెక్కు ఇతరోద్యమములవారు అబుద్ధిపూర్వకముగా ఆయన యభిప్రాయములనే అనుసరించుచున్నారు. భారతదేశైక్యమునుగూర్చి చెప్పు సందర్భమున స్వామిజి జీవితచరిత్రకారుడైన రోమైరోలా ''భారతదేశైక్యమును రుజువుపఱచుటే కాక, ఉజ్జ్వలప్రబోధముచే దానిని భారతీయుల డెందముల హత్తుకొలిపినాడనుటే స్వామిజి ఘనత. ... భారతదేశభవిష్యత్తును ఆయన మార్చివేసినాడు, ఆయన ఉపదేశవాక్కులు విశ్వమంతట మాఱుమ్రోగినవి'' (కంప్లీట్వర్క్సు, పుట 314) అన్నాడు.

శ్రీవివేకానందస్వామి ప్రతిపాదించిన 'మతైక్యము'నకు 'మతాంతరులను మన మత

ములోనికి త్రిప్పుట' అని అర్థము కాదు. అట్టి తలంపు అతని ప్రకృతికే విరుద్ధము, శ్రీరామకృష్ణుని ఉపదేశములకు విరుద్ధము. దానికి నేటి రామకృష్ణ-వివేకానందుల 'మతప్రత్యయవిద్య' (రిలిజియస్ ఇడియాలజీ) లోనే స్థానము లేదు. అన్ని మతములును శ్రీరామకృష్ణుని హృదయమునకు సమానముగ ప్రియములే. 'అంగీకారము' 'కలుపుకోలు' అనునవి శ్రీవివేకానంద స్వామికి సంకేతపదాలు. భవిష్యత్కాలమున మానవతతికి ఆధ్యాత్మికవిముక్తిమార్గ మిదే. 'మతము లొకదానితో నొకటి ఒద్దికకలవై ఉండవలెనే కాని అవి తమకు ప్రత్యేకదైవా దర్శవిభేదము లున్నంతమాత్రముచేత ఒకదాని నొకటి ద్వేషించునవై ఉండరాదు. స్వామిజి యభిప్రాయమున 'సహనము' అను పదము సైతము అవమానప్రదము అకీర్తికరము. "క్రైస్తవుడు హిందువుగనో బౌద్ధుడుగనో మార్పొంద నక్కఱలేదు. హిందువుగాని బౌద్ధుడుగాని క్రైస్తవుడుగ మార్పొంద నక్కఱలేదు. కాని ఉపాదేయమైన సారమును ఒకరొకరినుండి గ్రహించుచునే తన ప్రత్యేకతను నిలుపుకొనవలె" నని స్వామి స్పష్టముగ చెప్పినాడు.

కావున శ్రీవివేకానందుని యభిప్రాయమున భారతదేశసమస్య ముఖ్యముగా ఆధ్యాత్మిక మైనది. సౌకర్యమునకు దానిని బాహ్యసమస్య అంతస్సమస్య అను రెండు శీర్షికల క్రింద విభజింప వచ్చును.

స్వామిజి అవతరించుటకు పూర్వము 'వెలుపలి సమస్య' యొకటి ఉన్న జాడయే భారతీయు లెఱుగరు. కావున దానిగూర్చిన స్వామిప్రతిపాదనమును అందులకు స్వామి చెప్పిన పరిష్కారమును తక్కిన అన్నింటికంటె స్వాతంత్ర్యోజ్జ్వలములై యున్నవి. 'మనము తక్కువవారము' అను నొక భ్రాంతి భారతీయులను ప్రబలముగ ఆవరించినది. అన్యదేశీయులతోడి సంపర్కముచే తమ కేమి చేటు వాటిల్లునో అను నొక భీతి వారి కెడతెంపులేనిదై గల్గెను. కావున అందఱికిని తాము దవ్వుగ నుండుటే వారికి ప్రియ మాయెను. కాని స్వామి "బ్రతుకగోరిన ప్రతిదేశీయులును అన్యదేశీయులకు తామును ఇచ్చువారుగ ఉండవలె" నని చెప్పెను. (కంప్లీట్వర్క్సు, పుట 273). భారతీయుల విషయమును అంతే అన్నా డాయన.

పందొమ్మిదవ శతాబ్దమునుండి భారతీయులు బిచ్చగాండ్రవలె పాశ్చాత్యులయొద్ద నుండి నవీనశాస్త్రసాంకేతికజ్ఞానమును యాచించుచున్నారు. అందులకు బదులుగ వారికి తామేమియు ఈయ కున్నారు. తమ ప్రాచీననాగరకతాసంస్కృతీనిధానమునుగూర్చి చెప్పుకోవలసివచ్చినప్పుడు వారు ఏదో క్షమాపణ చెప్పుకొనువారివలె ప్రసంగించుచుందురు. తన సూక్తిచేతను ఆదర్శప్రవర్తనచేతను స్వామి ఈ తలక్రిందు పరిస్థితిని చక్కబెట్టెను. ఆయన పల్కులు: "అన్యదేశీయులకు భారతీయులొసంగునది మతము, వేదాంతము, వివేకము, పారమార్థికపరత." "సరళభాషలో చెప్పుచున్నాను వినుడు—ఒరులకై మీ రేమి చేయుదురో అదే మీ కార్యములలో ఘన మైనది. ...నేను అమెరికాకును ఇంగ్లండునకును పోయివచ్చితిని కదా. అట్లు పోయివచ్చినందున మన దేశమున ఏ ప్రభావము కననైనదో, అందులో నాల్గవవంతైనను, — నేను నా ఆశయాలను మన దేశమువఱకే పరిమితమొనర్చియుండిన— కల్గియుండదు." (కంప్లీట్వర్క్సు-III, పు.276)

ఐహికసంపదల నిచ్చుటవంటిది కాదు పారమార్థికతా ప్రదానము. అదిఇచ్చినకొలదినూఱింతలువర్ధిల్లును, దాతకును ప్రతిగృహీతకును కూడ చరితార్థత చేకూరును. ఈ సంపదను మనము మన అనంతరకాలాలవారికి సమృద్ధిగను ఎట్టి షరత్తులను కోరకయు ఒసంగ వలెను. మన ప్రాచీనయోగులును ఋషులును పరావిద్యబీజములను అనాదికాలమునుండి మహాదీక్షతో కాపాడినారు. దుర్గమపర్వతశిఖరములనుండియు సుదూరారణ్యములనుండియు గుహలనుండియు సంస్కృతసారస్వతగహనములనుండియు ఆబీజములను సేకరించి మనము వానిని విశ్వమంతటను చల్లవలెను. రాగలకాలమున ఆ పైరు పండగలదు. మనయెదుట నున్న గొప్పలక్ష్యమిది. ప్రతివాడును ఇందులకు సంసిద్ధుడు కావలెను. భారతదేశము అఖండవిశ్వమును జయింపవలెను. అది మనలక్ష్యము. అందుకు వీసమైనను తగ్గరాదు. మన మందఱమును అందులకు సిద్ధపడవలెను....విదేశీయులను రానిండు, వారిసేనలు మనదేశమున నిండిపోనిండు. అది మన కొక్క లెక్క కాదు. ఓ భారతభూమీ, లెమ్ము, నీ ఆధ్యాత్మికతతో ప్రపంచమును గెల్వుము. మన దేశము జీవింపవలె నన్న, ప్రబుద్ధమై శక్తివంతమై జీవింపవలె నన్న మన ఆశయములు విశ్వమును జయంప వలెను. (కంప్లీట్వర్క్స్-III).

ఇట్టి శక్తివంతమైన దేశీయజీవితమును నిర్మించునప్పుడు, రాగల ఇబ్బందులు రెం డున్నవి. వానిని శ్రీ వివేకానందస్వామిజి చూపియున్నాడు — అవి రెండు విపరీతపరమావధులు (ఎక్స్ట్రీమ్సు). ఒకటి ఉద్రిక్తమైన ఐహికపరత, రెండవది అనర్థావహమైన మూఢవిశ్వాసము. ఆ రెంటిని త్రోసి వైచి నడిదారిని పురోగమించుటే సరి. చిరకాలము మనదేశమున సాగిన ఆంగ్లేయుల పరిపాలనవలనను వారు ప్రవేశపఱచిన విద్యావిధానమువలనను భారతీయులు కొందఱు దేశీయసంస్కృతిని సంప్రదాయమును బొత్తుగ ఎఱుగనివారై పాశ్చాత్యులయొద్దనుండి పరిపూర్ణమైన ఐహికపరతను అలవఱచుకొనుటయందాసక్తులైరి. కాని శోచనీయమైన విషయ మే మనగా— వీరు విదేశాలవారిని పైపై విషయాలలోను అవలక్షణాలలోను మాత్రమే అనుసరించుచున్నారు. ఆ సంస్కృతికి ఈ సంస్కృతికి నడుమ ఇటు అటు ఊగుచు రెంటి బాధ్యతలను విడనాడి వారు స్వప్రయోజనాలకు పనికివచ్చు భాగాలను ఉభయసంస్కృతులనుండియు కైకొనగోరిరి. ఇట్టివారినిగూర్చి స్వామిజి ఈలాగు అన్నారు : ''పాశ్చాత్యవిజ్ఞానమును ఆస్వాదించినంతమాత్రమున తమకు ప్రతివిషయమును తెలియు ననుకొనువారు ఈ కాలమున గలరు. వారి తలంపున దేశీయాశయములు వట్టిచెత్త, మన వేదాంతము శిశుజల్పము, మన మతము అవివేకుల మూఢవిశ్వాసము''. (అదే. పుట 278).

ఐహికపరుల తీరట్లుండ మూఢవిశ్వాసము గలవారి తీరుకూడ అనుచితమే. అవమానకరమే. బలిష్ఠులగు పురుషవతంసులు మూఢవిశ్వాసమును నిర్దాక్షిణ్యముగ తొలగింపవలెను. ఈనాటి కౌతస్కుతము (స్కెప్టిసిసమ్) చేత విశ్వాస మడుగంటుచున్నను, కౌతస్కుతమును ప్రేరించునది పరిశీలనాపరత. పరిశీలనాపరతకు ప్రత్యేకమైన విలువయు ప్రయోజనమును గలవు. విశుద్ధములును సంజీవనములు

నగు ధర్మపరమార్థముల చుట్టును త్రుప్పవలె చిరకాల మూఢవిశ్వాసాలు పేరుకొనియున్నవి. వానిని బట్టబయలు చేసినది హేతువాదదీప్తియే. విశ్వాసపు వేషము వైచికొన్న మూఢవిశ్వాసమే తఱచు ఆధ్యాత్మికధర్మమునకు నిజమైన శత్రువు. మానసికారోగ్యమును వివేకమును కాపాడునది హేతువాదము. హేతువాదము నిర్మలమైన ఊహాశక్తిని పోషించును, వింతపొరపాట్లు పడనీక మనల వారించును. ఏదో ఒక విధమున నైనను మన పారమార్థిక జీవితమునకు తోడ్పడును. “మత మర్మాలను వెలపెట్టి కొనవచ్చు నను తలంపుదౌర్బల్య లక్షణము. మూఢవిశ్వాసాలన్నియు దౌర్బల్యమునకు లక్షణాలు...పతనమునకును, మరణమునకును లక్షణములు. కాబట్టి వానివిషయమున మెలకువగలిగి యుండుము. ... నిజముగ మనకు మూఢవిశ్వాసాలు పెక్కు లున్నవి, వీనిని తొలగింపవలెను, ఖండింపవలెను, తుదముట్టింపవలెను. ... ఏ మతసిద్ధాంతమైనను భద్రమే. ఈ మచ్చలను ఎంత త్వరగ తీసివేసిన సిద్ధాంతములంత మేలుగా మహోజ్జ్వలముగ ప్రకాశించును. వాని నవలంబింపుడు. (అదే. పుట 279).

‘ఐహికపరత’ ‘మూఢవిశ్వాసదాస్యము’ అను ఈ రెండు విపరీతపరమావధులను విడిచి, ఈ విషయమున ఇక మనము ఏమి చేయవలయునో ఆలోచింతము—దేశపునరుద్ధరణమును గూర్చిన స్వామిజి ఆశయాలు అసంఖ్యాకములు అపారసాధకతాసమంచితములు. అవి అన్నియు అమలునకు వచ్చుటకు పెక్కుశతాబ్దములు పట్టును. ఆయన సర్వజ్ఞులగు మహర్షులలో ఒకడు. ఆయనకు ఈ అఖండవిశ్వము అరచేతి ఉసిరికకాయవంటిది. సూక్ష్మమైన ఆయన పారమార్థికదృష్టికి భూతభవిష్యద్వర్తమానములు మూడును ప్రత్యక్షములే. అట్టిదృష్టితో ఆయన విశ్వమును పీడించుచున్న వ్యాధులను చక్కగా గుర్తింపగలిగినాడు, వాని కారణాలను కనుగొనగలిగినాడు, వానిని తొలగించు ప్రతిక్రియలను చెప్పగలిగినాడు.

భారతదేశచరిత్రలో ఒక క్లిష్టఘట్టము వచ్చినప్పుడు సరియైన దారిచూపుటకు ఇట్టి యోగి ఇట్టి దక్షుడు అవతరించుట భారతదేశ భాగ్యము. భావోద్రేకముతో ఆయన పల్కిన పల్కులు:— “ఇక ఏబదేండ్లవఱకు మన పల్లవి ఇదే ‘భారతమాత’! ఈ కాలమున తక్కిన రిత్తవేల్పులందఱును మన మనస్సులనుండి మాయమగుదురు కాక. ప్రబుద్ధమై యున్న దైవ మిదొక్కటే, మన జాతియే మన దైవము. ఈ దైవపు హస్తములు చరణములు కర్ణములు సర్వతోముఖములై ఉన్నవి. సమస్తమును ఈ దైవమున ఇమిడి యున్నది. ... మనకు నలు వంకల నున్న యీ దేవుని, విరాట్పురుషుని, మనము భజింపలేక, రిత్త వేల్పులను వేఱు ఎవరిని వెదకుచు పోవుదము?” (అదే. పుట 300).

భారతదేశమును పారమార్థికపరముగ నొనర్చుటకు స్వామి చెప్పిన దారులు నాలుగు: (1) విద్యావిధానము. (2) నిమ్నదశనుండి ప్రజాసామాన్యము నుద్ధరించుట. (3) అంగక్రమముతోడి నిర్మాణము. (4) ఇన్నాళ్లును పాశ్చాత్యులయొద్ద మాత్రమే ఉండిన ఆ కార్యోత్సాహమును మనప్రజలలో నింపుట.

నిర్జీవమగు నొక పరీక్షవిధానముకై జీర్ణించుకోబడని సరకుతో మన బుఱ్ఱలను పిక్కటిల్ల జేయుట విద్య కాదు. ‘జీవితము

నకు రూపేర్పఱచునట్టియు, మానవత్వము నొసగునట్టియు, శీలమును నిర్మించునట్టియు ఆశయాలను మనలో నింపుకొనుటే' విద్య అన్నాడు స్వామిజి. భారతదేశమున ఆయన ప్రచారము చేయనెంచిన వానిలో అగ్రగణ్యము అద్వైతవేదాంతము. అద్వైతమున కొక అంగముగనే కాని ఆయన ద్వైతము నామోదింపలేదు. అనగా మన సాధనలో ద్వైత ముండవచ్చును గాని, అద్వైతమే మన లక్ష్య మనుటను మనము మఱువ రాదు. వేదాంతములోనేమి, శాస్త్రములోనేమి, ఆధ్యాత్మికధర్మములోనేమి, అద్వైతము అన్నిటికంటె పైమెట్టు. అదియును గాక ద్వైతములో 'భేదము' 'వేఱుపాటు' ఉన్నది. 'మనము వేఱు' అను ఆశయమే భయాలకు బలహీనతకు ప్రవర్ధకము. భారతదేశము చిరకాలముగ బలహీనమై ఉన్నది. సామాన్యమానవునకు అద్వైతజ్ఞానమును అందింపకపోవుటే ఆ బలహీనతకు కారణము. లంగరులేక ప్రతికూలవాతధూతమైన నావను బోలినవాడై సామాన్యమానవుడు దైవవిశ్వాసమును ఆత్మవిశ్వాసమును కోల్పోయెను. అట్టి మానవునకు స్వామిజి ఉపదేశము — "విశ్వాస ముండవలె, విశ్వాస ముండవలె, ఆత్మవిశ్వాస ముండవలె; విశ్వాస ముండవలె, భగవంతునందు విశ్వాస ముండవలె — విజయాభిలాషులు తెలిసికోవలసిన కిటుకు ఇదే. (అదే. పుట 190). మానవుడు పొరపాటు పడును అనిన స్వామి నమ్మును. మానవుడు 'పాపి' అనిన, స్వామి నమ్మడు. దేనినైన పాపము అని పేర్కొనవలసివచ్చుచో స్వామి 'బలహీనత'నే పాప మని పేర్కొనును. సత్యము బలము నిచ్చును. సత్యములం దెల్ల ఉన్నతోన్నతసత్యము వేదాంతము, బలమునకు నిరతిశయమైన ఆకరము (సోర్సు) వేదాంత సిద్ధాంతమే. "నేనుఆత్మను, నన్ను శస్త్రములు ఛేదింపలేవు, నిప్పు దహింపలేదు, నీరు తడుపలేదు, గాలి ఎండింపలేదు" అనుటే వేదాంత సిద్ధాంతము.

దేశక్షేమమునకు నిమ్నజనోద్ధరణము అనివార్యము అత్యావశ్యకము అని స్వామియభిప్రాయము. దేశప్రజలు కుటీరవాసులు. కోట్లకొలది ప్రజలుదారిద్ర్యాజ్ఞానములందుమగ్నులైయుండ, దేశము ఎట్లు పురోగమింప గలదు? ప్రజలకు వ్యక్తిత్వగౌరవ మిచ్చునప్పుడు వారి ఆధ్యాత్మికశీలము చెడకుండ జూచుకోవలెను. "ధర్మహాని లేకుండు రీతిలో ప్రజలఉద్ధరించు" లక్ష్యమును మీ ముందుంచుకొనుడు అన్నాడు స్వామి. తన ప్రణాళికలను అమలులోకి తెచ్చుటను గూర్చి స్వామి కుండిన ఆశయాలు పెక్కులు — అందులో ఒకటి — దేశమంతట కేంద్రముల నెలకొల్పవలెను. ఆ కేంద్రాలలో పేదవారికి మొదట నోటితో కఱపు విద్యను కఱపవలెను. తర్వాత సేద్యమును పరిశ్రమలను నేర్పవలెను. కళల శిల్పాల అభివృద్ధికై కర్మాగారముల నెలకొల్పవలెను.

ప్రజాసేవ చేయబూనువారికి ప్రేమ ఉండవలెను, ఓర్పు ఉండవలెను. ఈ విషయము జపానునుండి స్వామి వ్రాసిన ఒకలేఖలో స్పష్టమగును — ఆయన ఈలాగు వ్రాసినాడు. "బొమ్మలను హృదయపూర్వకముగ ప్రేమించితి మేని, ఆ బొమ్మలు సజీవము లగు నను నమ్మకము జపానుదేశబాలికల కున్న దని విన్నాను .... నాకును ఈ నమ్మక మున్నది. భారతప్రజలు సంపద్విహీనులుగ నున్నారు, దౌర్భాగ్యదూషితులుగ నున్నారు, నష్టవివేకు

లుగ నున్నారు. త్రొక్కుళ్లు పడుచున్నారు. సదా పస్తున్నారు. అసూయకు కలహాలకు ఆట పట్టై ఉన్నారు. అట్టి యీప్రజల సేవ సేని హృదయపూర్వకముగ ప్రేమింప గల్గినచో భారతదేశము మరల మేలుకాంచును. ఉదార హృదయులగు మగవారును మగువలును నూర్ల కొలదిగవచ్చి, జీవితసౌఖ్యాభిలాషల వర్జించి, దారిద్ర్యాజ్ఞానావర్తమున ఇంక నింకను అధఃపత నముగాంచుచున్న దేశప్రజలక్షేమమునకై తమ యావచ్ఛక్తిని వినియోగించి పాటుపడవలె నని ఎప్పుడు ఆత్రపడుదురో భారతదేశ మప్పుడు మేల్కాంచును (అదే V పు 96.)

అంగక్రమముతోడి నిర్మాణమునకు అమోఘ శక్తి ఉండు నను నమ్మకము అత్యధికముగ గల వాడు స్వామి. 'భావి కాలమున భారతదేశము పెంపు గాంచవలె ననిన అంగక్రమముతోడ నిర్మాణము, శక్తిసంపాదనము సంకల్పాల ఒద్దిక కావలెను' అన్నాడు స్వామి. ఈసూక్తి నిట్లు వ్యాఖ్యానింప వచ్చు — పెక్కండ్ర సంకల్ప మొక్కటై అగునేని మహాశక్తి ఆవిర్భవించును. ప్రబుద్ధమును పరిశుద్ధము నగు సంకల్పము దివ్యము. మాన్యులు వేలువేలుగా ఏమిసాధిం తురో దానిని సామాన్యులు కలిసి సాధింప గలరు.

ఆత్యంతికమైన కార్యోత్సాహము భారతీ యులకు గల్గవలె నని స్వామి కోరిక. దానికే 'రజ' స్సని పేరు. రజోగుణశక్తి యూరపునుండి అనర్గళ వేగప్రవాహమున వెలువడుచున్నది. ఈ అమోఘ శక్తి విద్యుత్ప్రవాహముగా విశ్వమ నంతటిని ప్రాణవంతముగ నొనర్చుచున్నది తమస్సులోపడి మొద్దులమై సోమరులమైయున్న మనము సత్త్వస్థాయి నధిగమించితి మని చెప్పుకొనుచు విఱ్ఱవీగుచుందుము. రజస్సు గుండనే సత్త్వమును ప్రాపింప వీలగును. భారతదేశము పారమార్థికపరమైన దేశమే ఐనను, ఏయుగములో చూచినను నిజమైన సాత్త్వికులు పిడికెడు మందికంటె ఎక్కువ ఉండరు. తక్కిన అనంతసంఖ్యాకులకు సత్త్వము లక్ష్యముగ మాత్రమున్నది. ఆ లక్ష్యమునకు ఏకైకమార్గము రజస్సు (కార్యపరత). కావున మన బాధ్యతలను మనము ఉపేక్షింపకుందము గాక, స్వామిసందేశమున సమగ్రవిశ్వాసము గలవారమై భారతదేశము ఎట్టిది కావలె నని ఆయన కలలుగాంచుచుండెనో అట్టిదిగా నొన ర్తము కాక. ఆధ్యాత్మికతరంగము భారత దేశమునుండి లేచుచున్న దనియు అది కాల క్రమమున అఖండవిశ్వమును ముంచెత్తకల దనియు స్వామి చెప్పియే యున్నాడు.

ఒక గొప్పవిధి మనల ఆహ్వానించుచున్నది. ఇట్లు ఆదేశించుచున్నది:—'లెండు పోరాడుడు. లోభాహింసాకలహముల నెడి శత్రువులను నిర్జించి యశఃకీర్తుల గడింపుడు. అనంతాధ్యా త్మికసామ్రాజ్యమును అనుభవింపుడు. దానికి ప్రతిభారతీయుడును వారసు''

స్వామిజి శతతమజయంతి తిథి పూజ 1962 జాన్యువరి 28 తేది నాడును బహిరంగోత్సవమును ఫెబ్రువరి 4 తేది నాడును జరుగును.

# శ్రీ వివేకానందస్వామి

శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారు

"యదా యదా హి ధర్మస్య
గ్లాని ర్భవతి భారత
అభ్యుత్థాన మధర్మస్య
త దాత్మానాం సృజా మ్యహం.'

"పరిత్రాణాయ సాధూనాం
వినాశాయ చ దుష్కృతాం
ధర్మసంస్థాపనార్థాయ
సంభవామి యుగే యుగే"

సాధువులను సంరక్షించుటకై దుష్టులను సంహరించుటకై, ధర్మము నుద్ధరించుటకై యుగయుగములందు అవతరింతు నని భగవంతు డనినాడు. ఒక్కొకపుడు సంపూర్ణావతారము, వేఱొకపుడు అంశావతారము కాలావశ్యకత ననుసరించి గోచరించును. ప్రవక్తలును, దేవదూతలును, ఆచార్యులును మనుష్యసంఘమును ఆచారప్రచారములవలన సేవింతురు.

హిందూధర్మపునరుద్ధరణము అవసరమైన సమయమున హూణశకమున 1836 లో శ్రీ రామకృష్ణపరమహంస ఉదయించెను. ఈయన అవతారము ప్రత్యేకప్రాముఖ్యము గలది. ఆంగ్లవిద్యావిర్భావమువలన ప్రతీచీనాగరకతా విజృంభణమువలన కొంత మేలుకు తోడుగా మఱికొంత కీడు భారతీయసంస్కృతికిని సనాతన మతమునకును దాపురించినది. స్వీయమతము దెస పెడమొగము పెట్టి, క్రైస్తవమతము వెనుక "భళాభళి" యని మేలి విద్వాంసు లని కీర్తి బడసినవారె పెక్కండ్రు గతశతాబ్దమున మన దేశమందు వివిధరీతుల జెలరేగిరి. భారతీయ సాంస్కృతిక చరిత్రయందు గోచరించిన ఈ సందిగ్ధస్థితినుండి దేశమాతను, ధార్మికజనయిత్రిని గాపాడుటకై ఉదయించిన మహనీయులు శ్రీరామకృష్ణవివేకానందులు. ఇరువుర సంయుక్తకృషి ఈ యాశయసిద్ధికి తోడుపడినది.

కలకత్తామహానగరము ఆంగ్లవిద్యాధికుల నిలయమై యుండెను. అచటి ప్రెసిడెన్సీ కాలేజీలో ఆంగ్లాధ్యాపకు లుండిరి. వారిప్రబోధము వలన పలువురు క్రైస్తవమతాభిమానులైరి. డేవిడ్ హేర్ ఒక ఉన్నతపాఠశాలను నెలకొలిపెను. భారతవిద్యావిధానము సంస్కృతమున జరుగవలెనా లేక ఆంగ్లమున జరుగవలెనా యను వాదము శ్రీరామమోహనుని కాలమున విజృంభించినపుడు, రామమోహనుని చేయూత ననుసరించి ఆంగ్లము దెస పలువుర హృదయములు మొగ్గుటవలన (కాలక్రమమున ఈ వ్యవస్థకు ంతర్జాతీయప్రశస్తి లభించినను) పాశ్చాత్యసంస్కృతికే అనేకులు అంజలి ఘటించుటవలన మాతృసంస్కృతి, మాతృసంస్కృతితో మాతృమతము సముచితాదరానురాగములను పడయకుండెను. మైకేల్ మధుసూదనదత్త వంటి మహాకవి క్రైస్తవుడాయెను. సుప్రసిద్ధబ్రహ్మసమాజనాయకుడు కేశవచంద్రసేనుకు క్రైస్తవమతముపై మక్కువ ఎక్కువాయెను. ప్రతీచీ వాతూలమున వంగసంఘము, దానివెనుక తక్కిన భారతీయసంఘములు ఉఱ్ఱూత లూగినవి.

వంగదేశమున హూరుమూలపల్లె కామార్ పుష్కరిణిలో పుట్టి, గంగాతీరమున కలకత్తా కెనిమిదమైళ్లపైన దక్షిణేశ్వరమున రాణీరాసమణి స్థాపించిన కాళీమందిరమున అన్న తరువాత పూజారియై శ్రీరామకృష్ణుడపుడు సాధన చేయుచుండెను. మతప్రచారము చేసి దేశదేశముల బర్యటించుట ఆయన యుద్దేశము కాదు. ప్రచారప్రకటనలకు వలసిన ఉద్గ్రంథపఠన మాయన యెఱుగరు. ఎంతో కష్టముతో తన సంతకమును మాత్రము చేయు టాయన యెఱుగును. కాళీమాత నారాధించుచు, వివిధ మతాశయముల ననుష్ఠించుచు, దేవీసాక్షాత్కారమునకై పొగులుచు తఱచుగ నిర్వికల్ప సమాధియందు నిమగ్నుడగుచు నిరాడంబర నిభృత సాధనము జేయు శ్రీరామకృష్ణుని కేశవచంద్రసేను అవలోకించి, ఆయన జీవన మహిమను గుర్తించి జగతికి తెలిపెను. అప్పటి నుండి దక్షిణేశ్వరము విద్యాధికులకును పామరులైన భక్తులకును యాత్రభూమి యైనది.

పూర్వాశ్రమములో శ్రీవివేకానందస్వామి నరేంద్రనాథదత్త. రానున్న జీవితఘట్టమునకు వలసిన తీవ్రసన్నాహము నాతనికై భగవంతుడు చేయనారంభించెను. తండ్రికాలమున ఆతని గృహము నిష్పచ్చరము నెఱుగదని చెప్ప జెల్లును. న్యాయశాస్త్రము దాని నాశ్రయించినది. విద్యార్థిగా నరేంద్రనాథుడు మెట్రపాలిటన్ కాలేజీలో చదివెను. తరువాత సుప్రసిద్ధవైద్యుడైన నీలరతన్ సర్కార్ ఆతనికి సహాధ్యాయుడు. *కాలేజీని స్థాపించిన మహాత్ముడు ఈశ్వరచంద్రవిద్యాసాగరుడు. కాలక్రమమున ఈ కళాశాల స్థాపనాచార్యుని పేరందె విద్యాసాగర కాలేజీ యనబరగుచున్నది. ఇందలి విద్యార్థులలో పల్వురు కాలక్రమమున మహాపురుషులైరి. సురేంద్రనాథు డొకప్పు డిందు అధ్యాపకుడై యుండెను. నరేంద్రనాథ నీలరతన సర్కారులీ కళాశాలయందు జీతము లేకుండనే చదువు ఉపకారమును పడసిరి.

విద్యాసాగరుడు గొప్పసంస్కృతపండితుడు. ఆతని కళాశాలలో విద్యాసాగరము ఉత్తాల తరంగసంకులమై వెలసినది. సంస్కృతప్రబోధము విశేషాదరము నందెనట. కలకత్తా విశ్వవిద్యాలయమున మెట్రిక్యులేషన్ వఱకు సంస్కృతభాషాభ్యాసము నిర్బంధవిషయమై యుండుటచే, సంస్కృతము రాని విద్యార్థులు వంగదేశమున నుండరు. వాఙ్మయముపై నరేంద్రనాథునకు విశేషమైన ప్రీతి యుండెను. కాలేజీతరగతులందును సంస్కృతాంగ్లవంగ భాషల నాతడు విశేషశ్రద్ధతో పఠించెను. తరువాత సుప్రసిద్ధతత్త్వవేత్త యని పేరొందిన బ్రజేంద్రలాల్‌సీల్ నరేంద్రనాథుని సహపాఠి యాయెను. నరేంద్రనాథుడు తర్కశాస్త్ర, మనశ్శాస్త్ర, నీతిశాస్త్ర తత్త్వశాస్త్రములను కళాశాలలో విద్యార్థిగానున్నపుడే మిగుల శ్రద్ధతో పఠించెను. పట్టభద్రుడైనపుడే ఆతని తండ్రి అస్తమించెను. ఆర్థికపరిస్థితులు అంధకారబంధురము లైనవి. "ఉద్యోగము నన్వేషింపు" మని జనయిత్రి శ్రీభువనేశ్వరీదేవి పుత్రుని ప్రోత్సహించినది. కలకత్తామహానగరమందలి మహోన్నతవాణిజ్యసంస్థలందు ఉద్యోగమునకై ఆతడు విశేషప్రయత్న మొనరించెను. ఏప్రయత్నము నెగ్గలేదు. నరేంద్రనాథుని హృదయములో తీవ్రసంక్షోభము రేకెత్తినది. మనుష్యజీవితము నిష్ఠురప్రహేళికయై, దారుణబిభీషికయై ఆతనికి గోచరించినది. "ఈశ్వరుడు

* ఈ కాలేజీలో ఇంటర్‌మీడియట్, బి. ఏ. ఆనర్సు తరగతులను చదువు మహాభాగ్యము నాకు కలిగినది.

కలడా?" యను ప్రశ్న అతని సమక్షమున భయంకరముగ తాండవింప సాగినది. ఉద్యోగాన్వేషణమునకు మాఱు ఈశ్వరుని జూపజాలువాని నన్వేషించుటకై అతడు తిరుగసాగెను. జడదారులను, ధర్మబోధకు లని ప్రశస్తినిపడసిన విద్వాంసులను అతడుసమీపించెను. భోల్పూరు ఉద్యానవనమందలి మహర్షి దేవేంద్రనాథ ఠాకూరును సమీపించి "ఈశ్వరుని చూపగలరా?" యని నరేంద్రనాథు డడిగెను. ఈశ్వరుని చూపు టెట్లు? "ప్రత్యక్షముగ నిలువు" మని దైవమును శాసించువా డెవరు? ప్రసంగధోరణిని మార్చి దేవేంద్రనాథు డేమేమో పలికి నరేంద్రనాథుని పంపి వేసెను. ఎవరో శ్రీరామకృష్ణునిమాట నరేంద్రనాథుని చెవిలో జొనిపిరి. హుటాహుటి బోయి ఎప్పటివలె "దేవునిజూపెదరా?" అని నరేంద్రనాథు డాయననడిగెను. "తప్పక చూపెదను, నే ననవరతము చూచుచున్నా" నని ఆ యన తెలిపి తనపాదముతో నరేంద్రనాథుని గుండెను తాకెను. తీవ్రవిద్యుత్ప్రవాహము నరేంద్రనాథునిశరీరమున తీవ్రస్పందనమును కలిగించినది. ఆ ముహూర్తమందే నరేంద్రుని హృదయమున పరిణతి కలిగినది; ఆంతరంగిక పరివర్తనము కలిగినది. తొల్లింటి నరేంద్రునకు మాఱుగా వివేకానందస్వామి ఆశరీరమందే గోచరించెను.

తర్కముపలన సాధ్యము కాని పని సాధకపదసంస్పర్శమువలన సాధ్యమైనది.

— సాధనసముద్భవ ఫలములను వర్ణించుటకిందు తావు లేదు. నిర్వికల్పసమాధిలో ఆరితేఱిన మహాత్మునిగుఱించి ఒకటి రెండు మాటలు తెలుపజెల్లును. ఇంద్రియములు మనస్సు బుద్ధి: వీని నధఃకరించి సాధకుడు బోధనందినపుడు, ఆత్మధ్యానమున సిద్ధహస్తు డైనపుడు ముక్తి వానికి ముంజేతికంకణమై వెలయును. మనసు నేల రాలినదే యన జెల్లును. శరీరమునకును, మనసునకును సన్నిహితసంబంధము గలదు. మనసు లొంగినపుడు శరీరము లొంగినదే యగును. జితేంద్రియుడును, యోగారూఢుడు నైన మహనీయుని మానసికప్రబోధము గాని శారీరకయాతన గాని ఎట్లు పీడింప గలదు? సజీవుడై యుండగనే ముక్తి ఈతనికి కొంగు బంగార మగును. శ్రీ రామకృష్ణపరమహంస ఇట్టి జీవన్ముక్తుడు. ఆయన కంతేవాసి యగుట శ్రీవివేకానందస్వామి అదృష్టము.

గురుస్పర్శవలన శిష్యహృదయమందలి శక్తులు సాగరహృదయము మీది కోటికోటి యలలవలె విజృంభించినవి. పురాతన నవీన ప్రాచీ ప్రతీచీ బహుళవాఙ్మయ తాత్త్విక వైజ్ఞానిక శక్తులు ఆతనియంతరంగమున పరిఢవిల్లినవి. ఆత్మజ్ఞానముతో నాత్మవిశ్వాసమునంది కోటి ముక్కడిశక్తులను అడచుటకై కుప్పించి యెగసిన మారుతివలె, తానును మహావీరుడై ఆతడు దశదిశల లంఘించెను. అంతవఱకు సనాతన ధర్మమును తూర్పారబట్టుచే తమ జీవనపరమాశయ మని తలచి, భారతీయ సంస్కృతిని పెరచూపుతో, కోరచూపుతో జూచి పూర్వపక్ష మొనరుగక, ఎదు రెవ్వరు లేరని చెలరేగువారి గుండెలందు శ్రీ వివేకానందస్వామి సింహరవము దడ బుట్టించెను. అన్యస్కంధావారమున ప్రవేశించి దుర్వ్యమర్శను పిడికిట బట్టి సత్యప్రతిష్ఠను గావించిన విజ్ఞానవీరు డాతడు. తర్కశాస్త్ర, నీతిశాస్త్ర, యోగశాస్త్ర, ధర్మశాస్త్ర, మతశాస్త్ర, తత్త్వశాస్త్రములను సమగ్రముగ హృదయంగతమొనరించుకొని, స్వీయనైశుష్యప్రజ్ఞను పుర

స్మరించుకొని, ప్రతిపక్షులను ఢీకొని, ఆర్ష ధర్మప్రతిష్ఠ గావించి, తన ప్రతిభాపాణింధమమును ప్రయోగించువాడు. ప్రపంచమందలి ప్రధానమతములందు ఆర్షమత మెట్టి విశిష్టత గలదో సోదాహరణముగా స్వామిజీ వివరించుచుండెను. 1893 లో చికాగోలో జరిగిన అఖిల మతమహాసభలో ప్రధానముగ నాతడు నిర్వహించిన కర్తవ్య మదియే! తక్కిన మతములు ఒక్కొక్క ప్రవక్త ననుసరించి పుట్టినవనియు ఆర్షమతము వేదము ననుసరించి, వేదాంతము ననుసరించి ఉద్భవించిన దనియు, అది అపౌరుషేయ మనియు, మంత్రద్రష్టలును, అతీంద్రియ ద్రష్టలును, యోగారూఢులును, ప్రజ్ఞానభాస్కరులును ఉచ్చరించిన మహావాక్కులు ప్రాజమువులంపు మానికము లాయె ననియు, ధర్మ సముద్ధరణ మొనరించుటకై, పతితుల నుద్ధరించుటకొఱకై భగవంతు డప్పుడప్పుడు అవతరించుచుండుననియు, కర్మసిద్ధాంతము ఆర్షమతమునకు స్వతస్సిద్ధమైనదనియు ఆతడు తెలిపెను. సత్యాన్వేషణము, సత్యారాధనము, సత్యనిర్వచనము స్వామిజీ పరమాశయములు. మహనీయగుణగరిష్ఠులును, ప్రజ్ఞాధురీణులునైన పరివ్రాజకసార్వభౌముల కాతడు భక్తిభరిత హృదయముతో ప్రణమిల్లువాడు; వారు ఎంత లబ్ధప్రతిష్ఠులైనను, వారిప్రబోధమున సమీచీనార్థమైన విషయ మేదేని గోచరించునో జంకు గొంకుల కెడమీయక ముక్తకంఠముతో ఆతడు విమర్శించువాడు. చంద్రికాసందీపితమైన ఉదధి హృదయముమీది అలలు ఉత్తాలములై చదలు చక్కిళ్లను చెళ్లుచెళ్లున చఱచునట్లు, అవిరళోద్గతభావబంధురభాషణములతో నాతడు ప్రతిపక్షనాయకుల చిత్తములను చఱచువాడు. కావున ఎదురైనవారు స్వామిజీకి మదగజములవలె లొంగి, అతని ప్రమోల వంగి, నతజానువులై నమస్కరించి అంతేవాసులగువారు. స్వామిజీహృదయము గభీరసింధువునుబోలినది. కడలికడుపులో అనంతశాంతి వెలయును గదా! కాని అంబుధిపై లెక్క లేని కరళ్లు మింటిదెస నుఱుకు లెత్తుచుండును. నిరుపమాన వచఃకౌశలమున స్వామిజీ వాక్కులు తరంగపరంపరవలె విజృంభించినను, గాంగనిర్ఝరసదృగ్ధారాళవాగ్ధాటి అతనికి సహజమైనను ఆతడు సౌమ్యమూర్తియే సుడీ! అతనిహృదయమున అనంతశాంతిసచ్చిదానందములు వెలయుచునే యుండును. నిర్దుష్టప్రవర్తనమునకును, నిస్తుల చరిత్రమునకును, నైసర్గికప్రతిభకును, నవనవోన్మేషశాలిని యైన ప్రజ్ఞకును ఆతడు సదా అంజలి ఘటించువాడు.

స్వామిజీహృదయము కామధేనువు పొదుగు బోలునది. అది మధురానురాగదుగ్ధసంభరితమైనది. నిరుపేదలను చూచినపు డాతనిగుండె నీరై పోయెడిది. నిష్పచ్చరము నుద్ధరించి, అన్నార్తుని నోటికి కబళ మందించియే ఆతడు తనక్షుద్బాధను బాపుకొనువాడు. ''జగతియందొకకుక్క కడుపు మలమలమాడుచున్నంతకాలము దానియాకలిదీర్చుటే నాధర్మసర్వస్వ'' మని ఆత డనువాడు. ఆకటిబాధతో నకనకలాడు కడుపులో ముందు అన్నరసము పోసియే చెవియందు ప్రబోధామృతమును వడ్డింపవలెనని అతని తలంపు.

ఆతడు సంయమీంద్రుడు; సంయమ మనబద్ధదీక్షులైన మహాత్ముల నాతడు సేవించును; వారి గురుగుణములను ప్రస్తుతించును. మనననిదిధ్యాసన ధ్యాన సమాధులందలి ప్రభావమెట్టిదో తెలుపుచు, మనుష్యుడు నడుముగట్టి కర్మయోగమును గూడ నిర్వహించుచు, దైవీ

భావబంధురదృక్పథముతో ఎట్టిసేవ చేసినను, అది పూజయే యగుననియు, భక్తిభరితమగు నారాధన మగుననియు ఆతడు తెలుపువాడు. స్వామిజీ స్థాపించిన శ్రీరామకృష్ణమఠమున ఆతని దృష్టాంతము మహోజ్జ్వలమయిన యొజ్జబంతియగుటవలన అందలి సాధకులు జ్ఞానయోగ భక్తియోగ కర్మయోగముల సంయుక్త ప్రభావమును గుఱుతించి, తమ దైనందిన జీవితములందు దాని చరితార్థతను ప్రకటించుచున్నారు. కావున భీషణములైన వరదలవలన అసంఖ్యాకులు బాధపడునపుడు ఈ మఠములందలి యోగులు వారికి తోడుపడుచు, వారి మనుగడకు తాము ఏడుగడ అగుచున్నారు.

వైదికమతము మహత్తరమైనదే; వేదాంతమతము మహిమోపేతమైనదే! పూతగంగోదకమందు సయితము ఒక్కొకపుడు మృత్తిక చేరునట్లు, ఆర్షధర్మసూత్రబంధురమైనను, హిందూసంఘ మొక్కొకపుడు హింసాత్మక ప్రథలకు తావాసగుచుండుటవలన ఒక్కొక్క యుగమున ఒక్కొక మతప్రవక్త ఆ సాంఘిక శైవలినియందలి మృత్తికను తొలగించుచు, మనుష్యహృదయమున సముచితసంస్కార మొనరించుచుండును. బుద్ధ శంకర రామానుజ మధ్వ ప్రభృతు లిట్టివారు. శ్రీరామకృష్ణ వివేకానందస్వాములును అట్టివారే!

జటిలపరిస్థితులవలన నేటి జగతి క్రుంగి సముద్ధరణమును కాంక్షించుచున్నది. శ్రీ వివేకానందస్వామివంటి మహావీరుడు మహాత్ముడు నేడు ప్రపంచదిగ్వలయముపై భాస్కరునివలె గోచరింపవలెను. ఆ కాలావశ్యకత ననుసరించి అవతరించినాడు స్వామిజీ. స్వామిజీ దృష్టాంతము దినమణివలె తేజరిల్లి అజ్ఞానాంధకారమును పటాపంచ లొనరించుగాక!

ఓం తత్సత్

# ప్రకృతి స్వరూపిణి - స్త్రీ

శ్రీమతి నెమలి చంద్రమతీదేవిగారు

సర్వప్రకృతి, జగత్కల్యాణి అయిన త్రిపురసుందరియే స్త్రీ. అసలు స్త్రీ యనగా ప్రకృతి దేవతాస్వరూపం. ప్రకృతే స్త్రీరూపం ధరిస్తున్నది. స్త్రీయొక్క నిజస్వరూపం మహామాయాప్రకృతి.

ఆదికాలమునాటి ఋషులు స్త్రీని ప్రకృతి మాతగానే భావించి పూజించారు. స్త్రీనే పరాశక్తి, ఆదిశక్తి, మూలమాయగాను వర్ణించారు. లక్ష్మీదేవిని, రాధాదేవిని, సరస్వతిపార్వతులను శక్తిస్వరూపిణులనే చెప్పినారు. ఈ శక్తి ఎక్కడనుండి ఉద్భవమైనది ? ఆదిపురుషునినుండి ఉద్భవమైనదే ప్రకృతిశక్తి గనుక, పురుషునియొక్క ప్రతిబింబమే స్త్రీ.

భగవంతుడు తనయొక్క ప్రకృతితోకూడియున్నపుడే, ఆయనకు రూపము, నామము, ప్రపంచము, సృష్టి అన్నీ ఉంటాయి. ఎప్పుడు

ప్రకృతినుండి విడిపడుతాడో అప్పుడు దేవునికి రూపము లేదు, నామము లేదు, సృష్టి లేదు, జగములు లేవు. అప్పుడుండేది నిర్గుణపరబ్రహ్మమే. యోగులు ఆ మాయామోహన రూపమగు ప్రకృతిమాతను వశము చేసుకుని, బ్రహ్మసాక్షాత్కారము పొందగలరు. ఆ దేవి దయలేనిదే బ్రహ్మమును చూడలేరు. "అమ్మగారి దయలేనిదే, అయ్యగారి దర్శనం కానట్లు! ఆ దేవిని ఆరాధించి వశపఱచుకొనడమంటే, సులభమైన సంగతా? అడుగడుగునకు అడ్డంకులే, అసందర్భాలే, అవస్థలే, తనమాయతో బంధించి వేయుచుండును. పట్టువదలక, మనోనిగ్రహం కలిగి, ఆ మాయను గెల్చి సాగి పోయినవారికే కృప కలిగి ఆ తల్లి బ్రహ్మసాక్షాత్కారము కలుగచేయును. ప్రతిపురుషునికి గాయత్రిజపముతో ప్రారంభమౌతుంది ఆధ్యాత్మికాభ్యాసం.

గుణాతీతుడు, ఉపాధిరహితుడయిన యోగికి స్త్రీపురుషభేద ముండదు. స్త్రీశరీరమందుండు నది, పురుషశరీరమందుండునది ఒకటే ఆత్మగా భావిస్తాడు. ద్వైతభావన ఉన్నప్పుడే స్త్రీయనీ, పురుషుడనీ భేదాలు. అద్వైతభావనకలిగినపుడు ఏ భేదమూ లేదు. అర్ధనారీశ్వరుడని ఎందు కంటారు? శివునిలోనే, సగభాగం స్త్రీరూపం దాల్చినదని లోకానికి చాటుటలేదా?

ఆదికాలఋషులు గాక, మధ్యలో వేదాంతుల మని చెప్పుకొనిన కొందఱు శుష్కవేదాంతులు స్త్రీ నెట్లు పరిహసించారో చూడండి. స్త్రీయొక్క దర్శనముచే, స్వయముగా పురుషుడు మోహమందు మగ్నుడై క్షోభించునట! గ్రహము సోకినవానివలె ప్రజ్ఞావిహీను డగునట! స్త్రీనరకద్వారముగ, బ్రహ్మదేవునిచే సృష్టింపబడినది గనుక ఆ స్త్రీదర్శనము గురులకును, తపసులకును బహుపాతకమైన దట! స్త్రీ ఎముకలతో, నరములతో, మాంసకండరములతో కూడిన మాంసపుబొమ్మయట! మఱి పురుషులు వేటితో చేయబడినారో! 'మాంసాస్థిపంజరమైన స్త్రీయందు ఏల మోహపడెద' వని, 'స్త్రీ ఎప్పుడును నీకు స్వర్గము కాదు, ఆనందము కాదు, మనస్సుఖకరి కాదు, కాబట్టి మనసుచేతను, మాటల చేతను, శరీరముచేతను, ఆ స్త్రీని దూరముగా వదలుము. మోక్షమునకు మాయబడ్డ తలుపువలె అడ్డమైనది' అని ఇంకా ఎన్నో వికారవిధముల స్త్రీలను దూషించారు. వీరేనా వేదాంతులు? వేదాంతి అంటే, వేదముయొక్క అంతమును తెలుసుకున్న వాడని అర్థము. తాను పరబ్రహ్మస్వరూపమని తెలిసి, తాను నిర్గుణమని ఎఱిగినవాడు గాన, స్త్రీజాతి వేఱు స్వరూపము కాదు, సాక్షాత్ పరబ్రహ్మయందు ఇద్దరు సమభాగములై యున్నారు గాన వారిని మోహించుట గాని, విరక్తిచెందుట గాని లేదు. అసలు వారిని గుఱించి తాను ముచ్చటించుట అనవసరం.

ఇట్లుండగా, ముందు చెప్పినట్లు చూడగా, వారు అసలు వేదాంతులుగారు, సంపూర్ణజ్ఞానములేని నిర్బంధవేదాంతులు. లేకపోయిన ఆ వికార వర్ణన లెందుకు? తన సంగతి తాను చూచుకొనక స్త్రీలను ఏవగించుట ఎందుకు? తప్పు తనయొద్ద నుంచుకొని, స్త్రీజాతి నంతటిని అపవిత్రవాక్కులతో దూషించుట న్యాయమేనా?

లోకం గ్రుడ్డిది, నిజమైన వేదాంతం తెలుసుకొన లేదు. శాస్త్ర భక్తిజ్ఞానము లుండగనే వేదాంతుల మనుకొనెదరు. అంతటి సంపూర్ణులే అయితే ఇట్టి స్త్రీపురుషభేదము లెందుకు?

తా నెవరు ? వా రెవరు ? తననీడను చూచి, తానే భయపడువాడు ఆత్మజ్ఞానియేనా ? పరమాత్మస్వరూపియేనా ? తన మనసు నిర్మలమైన ఎదుటిస్త్రీ త న్నేమి చేయును ? నిబ్బరము లేని, నిగ్రహము లేని ఇట్టి వేదాంతులు వేదాంతులు గారు; సాధకులు, అభ్యాసకులు అనవచ్చును. మనోనిగ్రహము లేని వారలకు వైరాగ్యము కలిగించుటకు ఉపయోగపడునేమో అని ఈ కల్లబొల్లిమాటలు చెప్పి, మహాపవిత్రమైన వేదాంతమును మలినపరుస్తున్నారు. వేదాంతమంటే స్త్రీని దూషించుటయేనా ? అసదృశ వేదాంత కేసరియు, పరమహంసయు, జగద్గురువునగు శ్రీరామకృష్ణుని వాక్యము లివి :

అతివ లందఱు భగవతియంశమున నె
జన్మ మొందినవా రను సత్య మెఱిగి
భ క్తుడై మోక్షమును గోరువాడు వారి
మాతృసదృశలుగా గణింపంగవలయు ॥

భగవంతుని సాధించుటకు భ క్తుడు స్త్రీవేషమును ధరించి, తాను స్త్రీ అని భావన చేయుటయు కద్దు.

ఆడువేషంబు బూని తన్వంగి లీల
భ ర్తృభావంబు శ్రీకృష్ణుపైని నిల్పి
'నాథ, సాయుజ్యసౌఖ్యము ల్నా కొసంగు
కరుణ' నని రామకృష్ణుడు గలవరించు ॥

స్త్రీ యను శక్తిస్వరూపిణియే, అనేక భ క్తులకు నిజజ్ఞానమును బోధించినట్లు నిదర్శములు గలవు.

ఒకప్పుడు సభలో, జనకరాజుకు జ్ఞానస్వరూపిణియగు నొక స్త్రీయే మోక్షమార్గమును జూపి, ము క్తికాంతాసాక్షాత్కారమును కలుగజేసినట్లు ఒకగ్రంథమున కలదు. మరియు శ్రీరామకృష్ణునికి యోగిని ఒక్క ర్తుక వచ్చి యోగసిద్ధిని కలుగజేసినది తెలియదా ?

ఇట్లు స్త్రీజనలోకము జ్ఞానదాతలైయుండ, మలభూయిష్ఠపు తోలుబొమ్మ లను భావము గల వేదాంతులు ఏనాటికి స్త్రీని జగన్మాతగ భావించగలరు ?

జీవుడే అసలు స్త్రీ యట. జ్ఞానము లేని పురుషుడు స్త్రీయే అని పెద్దలు నుడివెదరు. జ్ఞానియగు స్త్రీ, పురుషునితో సమాన గనుక జ్ఞానమే పురుషుడు, అజ్ఞానియగు జీవుడు స్త్రీయగును. అపరవిజ్ఞానస్వరూపిణి, సకలకళావాణి, చదువులరాణి ఎవరు ? స్త్రీరూపము దాల్చిన భగవత్స్వరూపిణి సరస్వతి కాదా ?

కృష్ణావతారమున ప్రకృతిపురుషుల సమైక్యము జూపినాడు. గోపికల భ క్తిప్రేమలను గైకొని సర్వాంతర్యామి తాను అని వారికి తెలియపఱచుకొన్నాడు. ప్రేమ యనిన ఎట్టిది? నిష్కపటమైన, నిర్మాలిన్యమైన భ క్తితో కూడినదే ప్రేమ. దేవుడు, అటువంటి ప్రేమకు వశుడయ్యేనే గాని, శరీరవ్యామోహముతో కూడిన ప్రేమకు కాదు.

భారతనారీమణులు కొందఱు, మీరాబాయి, సక్కుబాయి మొదలయిన భ క్తశిఖామణులు సర్వకష్టముల కోర్చి, అన్ని అడ్డంకులను ఎదుర్కొని బ్రహ్మసాక్షాత్కారము పొందిరి.

స్త్రీ సకలాభరణభూషితయై, భార్యగను, గృహలక్ష్మిగను నగును, అసమానవాత్సల్యపూరితయగు మాతృమూర్తియు నగును, సకల విద్యలు నేర్చి, రాజ్యాంగములలో పాల్గొని, దేశపరిపాలనను, ప్రజాపాలనమును, ప్రజాసేవను చేయును, తలచుకొనిన సర్వమును త్యజించి, విరాగిణియు, యోగినియు కూడ నగును.

తన శాంతస్వరూపాపరావతారములయిన, లక్ష్మి, సరస్వతి, పార్వతి మొదలగు నామములచే వ్యవహరించునపుడు ఆదిశక్తి సర్వాలంకార భూషిత, మఱి యోగీశ్వరీరూపమున నున్నప్పుడు ఏ భూషణములు లేవు. ఏమైనవి? యోగములో ఆమెయే కలిసిపోయెను, ఆ పరమశివునియందు ఐక్యమును బొంది ఆమెకు శరీరమే లేదు. ఇక భూషణముల మాట ఎందుకు? పార్వతిదేవి శరీరాలంకారములగు నగల నన్నిటిని త్యజించి, తపసు చేసిన పరమశివుడు మెచ్చెనే గాని, 'నీవు నీకు విధాయకములగు పసుపుకుంకుమలు, భూషణములు విడిచితి వేల' యని కోయ లేదు. పావనస్త్రీ మనస్సే మాంగల్యము, మనస్సే పసుపు, కుంకుమ, తులసీ, అక్షతలు, సర్వాభరణములు. ఇట్టి పరమపవిత్రపూజాద్రవ్యములు మనసునందే సంపాదించుకొని, పరమశివుని పూజించిన పరమభాగ్యశాలిని అంశమున జన్మించిన స్త్రీని, జ్ఞానాభివృద్ధికి అడ్డంకి యనుట ఎంత శోచనీయము!!!

అవన్ని అటుండ నిండు. ఈ ఇరవైయవ శతాబ్దములోనే శ్రీరామకృష్ణపరమహంస సహధర్మిణి శారదామాత, ఆయన శిష్యులకు, మాతగాను, గురువుగాను ఉండి తన విధ్యుక్త ధర్మము నిర్వహించినది అందఱికిని విశదమే కదా!



# శివానందస్వామి - ధర్మప్రసంగములు

బ్రహ్మచారిణి లలిత

(నొవెంబరు సంచిక తరువాయి)

జాన్యువరి 14, 1930.

సంభాషణము క్రమముగా సంఘపరిచాలన వైపునకు తిరిగినది. వారిట్లనిరి : 'కొంచెము గతము నాలోచింపుడు. ఈ సంఘము ఏ వ్యక్తి కోర్కె ప్రకారముకాని, మీ కార్యములపై ఆధారపడి నడచుట లేదు సుమా. కాశీపూరులో శ్రీగురుదేవులకు సేవ చేయు కాలముననే ఈ సంస్థ వ్రేళ్లునాటుకొనినవి. డాక్టరు (మహేంద్రలాల్ సర్కారు) మమ్ముల వారి సేవకై ప్రోత్సహించిరి. అప్పుడు మాలో పెక్కురము విద్యార్థులము. వారిని సేవించుటకై కొందఱము చదువులు మానితిమి. మేము అందఱము కలిసి వంతుల ప్రకారము వారి సేవ చేసెడివారము. మా పనులు ఒక చక్కని వ్యవస్థగా ఆనాడే ఏర్పడెను. సత్యమును తెలిసికొనవలె ననియే వివేకానందస్వామిజీ ఏకైకాభిలాష. స్వామిజీ పరివ్రాజకుడుగ దక్షిణ హిందూదేశము చేరుసరికి, అగ్రజాతుల దురధికారము, నిమ్నజాతుల అధఃపతనము, సామాన్యప్రజల అసంఖ్యాదుఃఖకష్టముల చూచి జాలికొనెను. సామాన్యప్రజల నుద్ధరింప సమకట్టెను. అంత అమెరికా దేశమునకు వేదాంత

ప్రచారమునకై వెడలెను. అచ్చట విజయము సంపాదించెను. అమెరికాప్రజలు స్వామిజీని కడు గౌరవించిరి. అటుపై ఆలంబజారు మఠములో ఉన్న శశిమహారాజ్ (రామకృష్ణానంద) కు ఇట్లు వ్రాసిరి: "చూడు శశీ, అంతయు వాని పని అనియే నాకు ఇప్పుడు దృఢమైనది. న న్నావిధముగ ప్రేమించి, అంతటి ఉపదేశముల నిచ్చి తర్ఫీదు చేయుటకు కారణముకూడ బోధపడినది." మున్నెప్పుడు కాని నేను కర్మ చేయవలసియున్న దను సంగతి కలలో నైనను తలపలేదు. నాకు కర్మయం దభిరుచియు లేదాయె. కాని స్వామిజీ ఉత్తరము చూచి ఆలోచించితిని. "నిజమే! తప్పక మనము కర్మ చేయవలసినదే" అని తోచినది. అంత శాస్త్రపఠన చేయుకోర్కె యుదయించెను. కాని చేత చిల్లిగవ్వ లేదాయె. అప్పుడే బొంబాయినుండి భక్తు డొకడు వచ్చి కొంత పైకము ఈయగా, దానితో ఇంగ్లీషు నిఘంటువు నొకదానిని కొని తెచ్చితిమి. ఒక అలమారు, ఒక మేజా మున్నగు వస్తువులు కూడినవి. వీనిని చూచి కొంత పని చేయ వలె నను కోర్కెయు కల్గినది. ఈసంఘము మా ఇష్ట ప్రకారము నడపబడుచున్న దని ఎవ రేని తలంచుచో అది పొరపాటు. ఎవరును కాదు, స్వామిజీయే ఈ సంఘమును తీర్చి దిద్దినది. ఈ సంఘచరిత్ర తెలియనివారే పలురకములుగ వ్యాఖ్యానింతురు. శ్రీగురుదేవుల ఇచ్ఛానుసారము, స్వామిజీ ఈ సంఘమునకు ఒక ఆకృతి నేర్పఱచెను....

'స్వామిజీ ప్రతిదినము రెండుపూటల ఆలయములోనికి వెళ్ళి ధ్యానించెడివారు. స్వామిజీ దేహత్యాగమునకు రెండు మూడు వారముల ముందు, మేము కొందఱము తోటలో మామిడి చెట్టుక్రింద నిలువబడి యుంటిమి. స్వామిజీ ఆలయమునుండి క్రిందికి దిగి వచ్చిరి, ఏదో సత్యానుభూతి కలిగినట్లు తోచినది వారిట్లనిరి. "చూడు! ఈ ప్రవహింప మొదలిడిన స్రోతము ఏడు ఎనిమిది వందల సంవత్సరములపాటు ప్రవహింపగలదు." అంత స్వామిజీ పెక్కువిషయములగూర్చి తెల్పిరి. వానిలో కొన్నింటిని మాత్రమే మేము చూడగల్గితిమి—కాని మీరు ఎక్కువగా చూడగలరు. పెక్కురు మంచి బాలురు వచ్చి చేరెదరు, మామాటలు విశ్వసింపుడు. మాకం డ్లెదురుగ మేము మొదటినుండి చూచుట లేదా? శ్రీగురుదేవులు సాక్షాత్ జగజ్జననియే సుడీ! వారి మూలముననే సర్వము నడచుచున్నది — వారి ఆజ్ఞ ప్రకారమే సమస్తము జరుగుచున్న దే కాని మీద్వారా కాదు. ఏదేని తప్పు చేసినచో కొంచెము వెనుక తిరిగి ఆలోచింపుడు. మీ తప్పులు తెలిసికో గలరు. ఏలాటి కష్టములైనను సరే అన్నియు సమసిపోగలవు. అపరిపక్వహృదయులే ఈ సంఘము ఎవరి ఆజ్ఞ ప్రకారమో, ఎవరిపైనో ఆధారపడి నడచుచున్న దని తలంతురు. ఎట్లు తలంచినను సరే ఆజగదీశ్వరిని — శ్రీగురుదేవుల నంటిపట్టుకొనగల్గినచో వారు అభివృద్ధి నంద గలరు. వాని కృపసంపాదించుటకు ఏలాటి నియమములు లేవు. గీతలో కృష్ణభగవానుడు "అర్జునా, నాకు మూడు లోకములలోను కొంచెమైనను చేయవలసినది లేదు. పొందబడనిది కాని, పొందదగినది కాని లేదు. అయినను నేను కర్మములు చేయుచున్నాను." అర్జునా, నేను ఒకానొకప్పుడును అలసటలేనివాడ నగుచు కర్మములను జేయకుండ నున్నవాడ నైనచో మనుష్యు లంద

అను సర్వవిధముల నా మార్గమునే అవలంబింతురు.''

''నేను కర్మముల జేయకుండ నుండు వాడ నైతి నేని ఈ లోకము లందఱును చెడిపోవుదురు, సంకరము చేసినవాడ నగుదును. అందువలన జనుల సందతిని పాడుచేసిన వాడ నగుదును.

'శ్రీకృష్ణుడు స్వయం భగవానుడు'. వానిచే పొందబడనిది కాని, పొందవలసినది కాని లేదు. కాని జీవుల నుద్ధరించుటకే కర్మములు చేయుచున్నాడు. ఇదియే వాని అపారదయను కృపను వెల్లడించుచున్నది.

పలువురు కలిసి ఒక పని చేయునపుడు పెక్కు భేదాభిప్రాయము లేర్పడుట సహజమే, కాని అవన్నియు సమసిపోగలవు. ఎవరో ఒకని నాయకత్వమునకు లోబడనిచో ఏ కార్యముకాని సాంతముగ నెఱవేఱజాలదు. స్వామిజీ ఏర్పఱచిన సంఘనియమము లన్నియు 'మఠ నియమావళి' అను చిన్నపుస్తకరూపమున ప్రచురింపబడియున్నవి. వాని నెల్ల మీరనుసరింప వలెను. మా మాటలుకూడ పెడచెవినిబెట్టక విన వలెను. మీలో ఎవరును పసిపాపలు లేరు. ఇది చేయుడు, అది మానుడు అని చెప్ప నవసరము లేదు. సందర్భవశమున ఏదేని చెప్పవలసినచో, నేను ఉన్నాను కదా. అవసరమైన దంతయు నేను చూచుకొందును. అట్టి సందర్భములు సకృత్తుగ ఏర్పడును. శ్రీ గురుదేవులచే ఆశీర్వదింపబడినశిష్యులు ఇంకను కొందఱు బ్రతికియున్నమాట మా త్రము మఱువకుడు. నా విషయమో నేను వచ్చి మీతో ఎక్కువగ కలసిమెలసియుండుటకు వీలు లేదాయె, గదినుండి క్రిందికి దిగివచ్చు శక్తి నాకు లేదాయె, అందుచే మీ అందఱితో కలిసి కొనుట చాల అరుదు. మీరు మిక్కిలి పానకములో పుడకలాగ అన్ని విషయములలో జోక్యము కలుగజేసికొనుట నాస్వభావము కాదు. నాకు అది హేయము. నాస్వభావమునకు విరుద్ధముగ పోజాలను. కాని శ్రీగురు మహారాజు, శ్రీమాతృదేవి (శారదాదేవి) వారలే సర్వవిషయముల చూచుకొనుచున్నారని నాకు దృఢవిశ్వాసము కలదు. అందుచే ఇతరుల నాజ్ఞాపించుట అనవసరమని నాతలంపు. మీకు నాపై విశ్వాసము కలదు. అందుచే శ్రేయోదాయకము లని తోచిన విషయముల నప్పుడప్పుడు మీకు చెప్పుచుందును.

'మనము పనిచేయవలసినదే. గత్యంతరము లేదు. పనితోపాటు సక్రమ మగు జపధ్యానములు చేసినచో కష్టపరంపరలలో మునిగిపోకుందుము. హరిద్వారముననో, హృషీకేశములోనో లేక ఎచ్చటనో ఇంటింటికి పోయి మధుకరమెత్తికొని భుజించుచు కాలము గడపుట, మన కర్తవ్యము కాదు. స్వామిజీ స్వయముగ అట్టిజీవనము గడపి, దాని ప్రయోజనమెంతవఱకో తెలిసికొనిరి. అట్టి జీవనము కొన్ని రోజులపాటు గడపవచ్చును, కాని జీవితమంతయు కాదు. దక్షిణేశ్వరములో ఒక పరి మమ్ము భిక్షాటనచేసి భుజింప శ్రీగురుదేవులు ఆజ్ఞాపించిరి. మా గౌరవాభిమానముల నశింపజేయుటకే అటుల కావించిరి. గౌరవాభిజాత్యాహంకారములను చంపుకొనుటకు కొద్దిదినములపాటు భిక్షాటన చేయ వచ్చును.

'స్వామిజీ అమెరికాకు వెళ్ళి, ఎంతటి అమోఘకార్యము కావించెనో మీరు కనులార కాంచలేదా? జప, ధ్యానములు సక్రమముగ నియమముగ చేయనిచో ఎవరైనను సరే ఏ మంచిపనికాని చేయజాలరు. జపధ్యాన

ముల నంటిపెట్టుకొని యుండవలసినదే.

'ఈసంఘములోని పెక్కుసభ్యుల అంగీకారముద్వారా నిర్ధారింపబడిన తీర్మానములు తప్పక మేలు చేయునవె కాని, కీడు ఎన్నటికిని కలుగజేయజాలవు. పెక్కురు కలిసి ఒక విషయమును కూర్చి తర్కించునపుడు, ప్రతిఒకరు తమ తమ అభిప్రాయముల నిరాటంకముగ వెల్లడించుచు తీవ్రాలోచనలద్వారా వాదులాడవచ్చును. దానివలన ఎప్పుడైనను, ఎట్టి ప్రమాదమును సంభవింపదు. కాని "ఇది నీకు మంచి కలుగజేయును" "ఇది నీకు చెడుగుకలుగ జేయును", అను వ్యక్తిగతముగ స్వలాభమునకై వాదులాడునపుడే మాకు భయము కల్గును.

'బిడ్డలారా, ధ్యానము, ఆధ్యాత్మికానుష్ఠానములే ముఖ్యముగ వలయునవి. వీనిని ప్రతిదినము వేళ తప్పక అనుష్ఠింపవలసినదే. అపుడే ఇతరవిషయములెల్ల తమంతట అవె సరిదిద్దబడును. ధ్యానించు సమయమున, పనిని గుఱించియు, మతమును గుఱించియు, సంఘపరిచాలనమునుగుఱించియు, ఇతరవిషయములనెల్ల గూర్చియు పూర్తిగా మఱచిపోవలెను. నీవు ఒంటరిగ ఉన్నట్లును, నీ భగవానుడు నీతోడుగ నున్నట్లును భావింపవలెను. క్రమముగ "నేను" అనునది కూడ మఱతువు. మనస్సును అపవిత్ర పఱచునట్టి దానిని పని అని చెప్ప దగునా! అది కేవలము చెడ్డపనియే.

'సాక్షాన్నారాయణునే సేవించుచున్నానను భావన కల్గి ఒక వ్యక్తిని సేవింపగల్గినచో అపుడే యథార్థమగు సేవ యగును. కాని అట్టిభావన ప్రప్రథమమున అనుభవవేద్యము కాదు. అందుచే (ప్రథమదశ) ఆరంభదశలో గురూపదేశముల విశ్వసించి అట్టిభావన ఏర్పఱచుకోవలెను. గురువాక్యములే శ్రీభగవానుని, శ్రీమాతృదేవి, శ్రీస్వామిజీల సందేశమని భావింప వలెను. నా స్వీయ అనుభవమిది:—శ్రీగురుమహారాజు ధర్మమును పునరుద్ధరించెను, దానినే స్వామిజీ క్రోడీకరించెను. గురుమహారాజుసూత్రము - స్వామిజీ దాని వ్యాఖ్య. శ్రీగురుదేవుల జీవితమును పరిశీలించియే స్వామిజీ ఈసేవాభావమును స్వీకరించెను. శ్రీగురుదేవులు మధురబాబుతోకూడి తీర్థాటనముచేయు సమయమున దేవఘర్ (బీహారు)లో కఱవు వాతబడిన ప్రజలదుఃస్థితికి అత్యంతము జాలికొని, ప్రతి ఒక్కరికి తలకు నూనె, కట్టుకొనుటకు బట్టలు, కనీసము ఒక్కపూట అయిన కడుపునిండ అన్నము పెట్టింపుమని మధురబాబును బ్రతిమాలుకొనెను. లేనిచో తాను వారియొద్దనే యుండిపోయెదననియు, తీర్థాటనము తన కవసరము లేదనియు చెప్పెను. మఱియు "నీవు కేవలము జగదీశ్వరికి కోశాధ్యక్షుడవు మాత్రమే. నీవు వీరి కెందులకు సాయము చేయవు?" అనికూడ అనెను కొన్ని దినములపిదప మధురబాబు జమీనులో కోస్తియా, రాణాఘట్ అనుప్రదేశములందుకఱవు సంభవింప, శిస్తులు త్రోసివేయుమనిమధురబాబుకుచెప్పెను కడకు మధురబాబు అట్లుచేయవలసివచ్చెను. ఆసందర్భమునకూడగురుదేవుడు "నీవు జగదీశ్వరికోశాధ్యక్షుడవు మాత్రమే. ఇతరులకు ఇచ్చుటకే నీకు ఈయబడినది." అనెను. స్వామిజీ ఎంతటి కరుణాపూర్ణహృదయులు! ఇట్టి దృశ్యములే వారిహృదయమును ద్రవింపజేసి, ఆధ్యాత్మికఉన్నతికి సేవాకార్యము తోడ్పడ కల దని కర్మయోగసాధన ఏర్పరచినది.

(సశేషము)

# శ్రీమద్భాగవతము - శ్రీకృష్ణసందేశము

## [శ్రీమత్ప్రిభవానందవాణి]

### తృతీయస్కంధము

### ద్వితీయాధ్యాయము
### సృష్టి చరిత్రము
### మైత్రేయుడు :

విదురా, 'ఫలానప్పుడు ఇది పుట్టినది, అంతకు ముందు ఇది లేదు' అని చెప్పుటకు తగినట్టి 'ప్రారంభము' జగత్తునకు లేదు. చన్నవియు ఇక రానున్నవియు నగు లోకాల పరంపరలో ఇప్పు డున్న ఈ లోకమును ఒకటి. విశ్వశక్తి ఒకప్పుడు అవ్యక్తదశలో నుండును, ఒకప్పుడు వ్యక్త మగును. ఆ దశకు తర్వాత ఈ దశయు, ఈ దశకు తర్వాత మరల ఆ దశయు—మాటిమాటికి కలుగుచుండును. విశ్వశక్తి అవ్యక్తముగ నుండుటకే సంహార మనియు అది వ్యక్తమగుటకే సృష్టి యనియు పేర్లు.

సృజింపబడ్డ వస్తురాశిలో వైవిధ్యమున్నది. అవ్యక్తమగు విశ్వశక్తిలో మూడు గుణాలు ఉన్నవి. ఆగుణాల సమత్వము చెడినప్పుడు, విశ్వచైతన్యమును విశ్వాహంకారమును, మనస్సును, ఇంద్రియవిషయములును, ఇంద్రియములును, పంచతన్మాత్రలును పంచమహాభూతములును రూపొందును. వివిధరీతులలో వీనికలయికమలి కలయికలు సాగుకొలది చరాచరములు ఆవిర్భవించును.

వీనిలో ఓషధులు గుల్మములు లతలు తరువులు మున్నగు స్థావరము లున్నవి. స్థావరాలకు స్పర్శజ్ఞాన మున్నది. వీని చైతన్యము అనావిష్కృతదశలో నుండును.

ఘాతుకమృగములలో నన్నో గంధజ్ఞాన మత్యంతము పెంపొంది యుండును.

వానికి పైవారు మానవులు.

వారికిని పైవారు దేవతలు పితరులు గంధర్వులు కిన్నరులు. వీరు వేల్పులు దివ్యులు దేవయోనులు సిద్ధులు.

ఓ విదురా, సకల పదార్థములను — అవి ఏవి కాని—సృజించినవాడు బ్రహ్మ.

సృష్టి జరిగిన విధ మిట్లు :—

జగము ప్రళయపయోధిలో మునిగి యుండెను. ఆపయోధిపైని శేషశాయియైన సర్వేశ్వరుడు యోగాసక్తుడై పవ్వళించియుండెను. ఆయన విశ్రమించియుండెను. ఆయన నయనములు నిమీలితములై యుండెను. కాని ఆయన చైతన్య మేమో పూర్తిగ జాగరూకమైయే ఉండెను. ఆయన పరిపూర్ణముగ ఆత్మానందానుభవనిమగ్నుడై యుండెను.

సృష్టికాలము సమీపించినది. సర్వేశ్వరునికి తనలోనే ఒక సంచలనము గోచరించెను, ఆయన నాభినుండి నిండార విరిసిన యొక పద్మము వెలువడెను. దాని కాంతి ఆ సముద్రమునెల్ల వెలుగొందించి కన్నులు మిఱుమిట్లు గొల్పుచుండెను.

విశ్వ మఖిలమును ఆ పద్మమున బీజరూపమున నుండెను. భగవంతుడే అం దంతర్యామియై యుండెను.

అందుండి తత్క్షణమే బ్రహ్మ ఆవిర్భవించెను. ఆయన ఆపద్మముపై నే ఆసీనుడై, తాను కాక వేఱు ప్రాణి ఎవరైన ఉన్నారా అని పరికించుటకు శిరమును నలువైపుల త్రిప్పెను. అప్పటి నుండి ఆయనకు చతుర్ముఖుడను పేరు గల్గినది.

బ్రహ్మకు తా నెవరో తెలియ లేదు. పూర్వ సృష్టుల స్మృతి యేమియు ఆయనకు లేకుండెను. కావున ఆయనకు స్తిమితము లేక పోయెను. ఆయన డెందమున జ్ఞానతృష్ణ పొటకెక్కెను. చుట్టురా చూచినప్పుడు తనకోరిక తీరు అవకాశము ఆయనకు కన్పట్టలేదు. జ్ఞానము తన లోనే ఉన్న దని ఆయనకు స్పష్ట మాయెను. కాగా ఆయన అంతర్ముఖుడై జ్ఞానలక్ష్యమును జేరుటకు ధ్యానమార్గము ననుసరించెను. తుదకు పరమార్థము ఆయనకు తనహృదయములోనే గోచరించెను. దేవు డాయనకు తనహృదయము లోనే ప్రత్యక్ష మయ్యెను. లోపల ఆసాక్షాత్కార మైన పిదప ఆయనకు వెలుపలగూడ సర్వమును విష్ణుమయముగ కనిపించెను. ఆయనకు నిర్వృతి గల్గెను.

అంతట భగవంతు డాయనతో ఇట్లనెను—

“ఓ బ్రహ్మా, నేను శాసించుచున్నాను. విశ్వమును సృజింపుము. పూర్వకల్పములలో సృజించిన తీరుననే సృజింపుము. సృజించుట నీకు క్రొత్త కాదు. సృజింపబడవలసినదెల్ల ఇప్పుడే నాయందు సన్నిహితమై ఉన్న దనుట నీ వెఱిగినదే కదా. ‘సృష్టి’ ‘సృష్టి’ అనగా ఉన్న దానిని వెలికి ప్రసరింపజేయుటే కదా”.

అప్పు డొక్క ప్రచండవాయువు ఉప్పతిల్లెను. దానిచే కడలి నీరు పొటకెక్కెను. తపస్సుచే తాను గడించిన జ్ఞానశక్తులచే బ్రహ్మ ఆ వాయువును ఆ కడలి నంతటిని తనలోనికి ఆకర్షించుకొనెను. పద్మపీఠస్థితుడై ఆకాశమున తేలుచుండిన తాను మరల పద్మగర్భములో జొచ్చెను, దానిని మూడు భాగములుగ విభజించి స్వర్గమును భూమిని ఆకాశమును ఏర్పఱచెను.

బ్రహ్మ అంతట లోకమునకు ఋగ్యజుస్సామాథర్వణము లను వేదముల నాల్గింటి నొసంగెను.

తార్కికులు ‘స్ఫోటము’ అందురే, దాని మూర్తీభావమే బ్రహ్మ, ఆయన ప్రణవస్వరూపుడు. సురజ్యేష్ఠు డనియు (భగవదగ్రసుతు డనియు) ఆయనకు పేరు గల్గినది.

బ్రహ్మ తొలుత సృజించిన మానవులు యోగులు. పుట్టిన తత్క్షణమే వారు ఐహికాసక్తిరహితులై గాఢధ్యాన నిమగ్ను లైరి. వారి వలన మానవజాతి వర్ధిల్లుట అసంభవ మని బ్రహ్మ గుర్తించెను. అనంతరకర్తవ్యమును గూర్చి ఆయన ఆలోచించుచుండ — ఆయన రూపమే స్త్రీ పురుషమూర్తులుగా రెండుగా విభక్త మాయెను.

ఆపురుషమూర్తియే మనువు, స్త్రీమూర్తి శతరూప. ఆజంటనుండి సకల మానవజాతియు పుట్టు వొందెను.

## తృతీయాధ్యాయము

### కపిలుని జన్మము

**విదురుడు :**

నీవాణి బ్రహ్మానందముగ నున్నది. మనువునుగూర్చియు శతరూపనుగూర్చియు ఇంకను జెప్పుమా, నిను వేడుకొందును.

మైత్రేయుడు :

కాలక్రమమున మనువునకు శతరూపయందు ఇద్దఱు పుత్రులును ముగ్గురు కూతుండ్రును గల్గిరి. పుత్రులు ప్రియవ్రతుడును ఉత్తానపాదుడును. ముగ్గురు కూతుండ్రు ఆకూతియు, దేవహూతియు, ప్రసూతియు. మనుసంతతిలో కొందఱి చరిత్రములను నీకు తెల్పెదను. మొదట దేవహూతినిగూర్చి చెప్పెదను. ఏల యన సుప్రసిద్ధ సాంఖ్యతత్త్వజ్ఞుడును యోగియునగు కపిలుడు ఆమె గర్భమున జనించెను.

రూపలావణ్యవతియగు దేవహూతి యౌవనము ప్రాపించినది. ఈమెకు అర్హుడైన వరుడు లభింపవలెనే అని తలిదండ్రులు ఉత్సుకులగుచుండిరి. వారు వివిధదేశములలో వెదకి తుదకు రూపవైదుష్యసంపన్నుడగు నొక యువ యోగీంద్రుని కలిసికొనిరి. అతని పేరు కర్దముడు. అతడు బ్రహ్మదేవుని హృదయమునుండి పుట్టినవాడు. చూచినంతనే దేవహూతి అతనిని వలచినది. ఆమె తల్లిదండ్రులగు శతరూపయు మనువును ఎంతయు సంతోషించిరి. కర్దముడును ఆమె చక్కదనమునకు ముగ్ధుడయ్యెను. అచిరకాలముననే మనువు తన పుత్రిక నతని కిచ్చి పెండ్లి చేసి తన రాజ్యమునకు మరలి వచ్చెను.

తపసుచే కర్దముడు అపారమైన ఆత్మనిగ్రహమును అలవఱచుకొనెను. తన ప్రేయసికిని అతడు ఆతపోఽభ్యాసమును కఱపెను. కొన్నాళ్లు కామోపభోగముల పొంత పోక వారిరువురును ధ్యానోపాసనలందు గడపిరి. ప్రాణకాంతుని సేవ తన కెంతో సుఖకరముగనున్నను, దేవహూతికి సంతానవాంఛ గల్గియుండెను. కర్దముడు ఆమె కోర్కికి వల్లె అనెను. అంతరూపలావణ్యవతులగు పెక్కండ్రు పుత్రికలు ఆమెకు గల్గిరి. ఆమె వారితో సుఖముండెను. కాని పుత్త్రుడు కావలెనను కోర్కెయు ఆమెకు కల్గెను. కాలక్రమమున ఈ కోర్కెయును ఫలించెను. కపిలుడు జన్మించెను. పద్మపత్రములను బోలిన నేత్రములును పసిడివన్నె తలకట్టును గల్గి కపిలుని చక్కదనము విశ్వమోహనమై యుండెను. దివ్యశక్తులును దివ్యప్రతిభయు వేదాదిసకలశాస్త్రపరిజ్ఞానమును ఆయనకు జన్మసిద్ధములై యుండినవి.

పుత్రుడు జన్మింపగనే కర్దముడు కృతార్థుడై జీవితశేషమును భగవద్ధ్యానమున గడప గోరెను. కావున నతడు సర్వసంగపరిత్యాగము చేసి సన్న్యాసి అయ్యెను. సుదృఢ భక్తిమార్గమున అతడు బ్రహ్మసాక్షాత్కారమును నిర్గుణతత్త్వానుభూతి నొందెను. భౌతికజ్ఞానదశ నతిక్రమించి సుఖదుఃఖ - శీతోష్ణ - జయపరాజయాది ద్వంద్వముల పట్ల సమదృష్టి నధిగమించెను. ఆ సమత్వము సిద్ధింపగనే కామవీచికలు ఆయన మనశ్శాంతిని చెనకజాలక పోయినవి. తుద కాయన డెందము దేవునందు లయించెను. దేవునితో ఆయన కైక్యము గల్గెను. ఆత్మను సమస్తమందును, సమస్తమును ఆత్మయందును ఆయన సాక్షాత్కరించుకొనెను.

ఇట్లు కర్దముడు మహోన్నతమైన ఐక్యమును గాంచి, సంపూర్ణవిముక్తిని సాధించెను.

# వార్తలు, విశేషాలు

## శ్రీ వివేకానందస్వామి శతతమ జయంతిమహోత్సవముల కేర్పాట్లు

(1963 జాన్యువరి నుండి 1964 జాన్యువరి వఱకు)

స్వామిజి శతతమ జయంతి మహోత్సవాలకు అంకురార్పణం బేలూరుమఠంలో 1963 జాన్యువరిలో జరుగుతుంది. ఆ సందర్భంలో పల్లెల అభివృద్ధినిగూర్చిన్నీ ప్రజల శీలనిర్మాణసమర్థమగు విద్యావిధానమునుగూర్చిన్నీ శ్రీ స్వామిజి చెప్పిన సూక్తులను, కేంద్రప్రభుత్వ 'కమ్యూనిటీ డెవ్లప్మెంటు' మంత్రివర్గమువారు అచ్చువేయించి భారతదేశమున ఐదున్నరలక్షల పల్లెలవారికి ఉచితంగా పంచిపెడతారు.

కేంద్రప్రభుత్వ సమాచార వార్తాప్రసార శాఖా మంత్రివర్గంవారు స్వామిజినిగూర్చి ఒక డాక్యుమెంటరి ఫిల్ము తయారుచేస్తారు.

'విద్యావిధానముగూర్చిన స్వామిజి వాణి'ని వివిధభాషలలో ప్రచురించి భారతదేశమంతటా ఉచితంగా పంచిపెట్టడానికి విద్యాశాఖ మంత్రివర్గ కార్యదర్శి శ్రీ పి. ఎన్. కృపాళుగారు అంగీకరించారు. కేంద్రప్రజాక్షేమపరిషదధ్యక్షురాలైన శ్రీమతి దుర్గాబాయి దేశముఖ్‌గారు భారతమహిళలం గూర్చిన స్వామిజి గ్రంథమును భారతదేశంలో ఉన్న పదిహేడు భాషలలోనికి పరివర్తింపజేసి ముద్రింపించుతామని మాట ఇచ్చారు.

విశ్వకళాపరిషత్తుల – ఇతర సంస్థల – సంఘముల సహకారంతో ఈ దేశంలో నేమి, విదేశాలలో నేమి స్వామిజి సందేశప్రచారానికై సమావేశాలు ఉపన్యాసాలు జరిపించటానికి ఏర్పాట్లు జరుగుతాయి.

శ్రీరామకృష్ణసంప్రదాయమువారగు బ్రహ్మచారులయు సన్న్యాసులయు ఒక సమావేశం బేలూరులో జరుగుతుంది. తక్కిన సమావేశాలు వారణాశిలోనో ప్రయాగలోనో కంఖాలులోనో జరుగుతాయి. ప్రపంచమున ఒద్దికను పొందికను స్థాపించడమే ఈ సమావేశాల లక్ష్యం.

## విజ్ఞప్తి

### పూర్ణకుంభమేళ – హరిద్వారము

### మార్చి – ఏప్రిలు 1962

ఇది పన్నెండేండ్ల కొకసారి జరిగేది. స్నానానికి ముఖ్యదినాలు మార్చి తే 4 ది, ఏప్రిలు తే 4 ది, తే 13 ది. సాధువులు యాత్రికులు దాదాపు పది పన్నెండు లక్షలమంది సమావేశమౌతారు. వ్యాధినివారణాదిసేవా కార్యక్రమం మామూలుగా స్థానిక శ్రీరామకృష్ణమిషనువారి బాధ్యత. మందులకు చికిత్సలకు అన్నసంతర్పణలకు కనీసం ముప్పైఐదువేల రూపాయలన్నా కావలసి ఉంటుంది. ఉదారమహాశయులు కంఖాలు రామకృష్ణ మిషను సేవాశ్రమ కార్యదర్శిగారికి కాని, బేలూరు శ్రీరామకృష్ణమిషను ప్రెసిడెంటుగారికి గాని, కల్కత్తా అద్వైతాశ్రమ మేనేజరుగారికి కాని—ధనరూపంలోనో వస్తురూపంలోనో విరాళా లందజేసి తోడ్పడవలె అని ప్రార్థిస్తున్నాం. కృతజ్ఞతతో అందుకొని రసీదులు పంపుతాము.

# గ్రంథపరిచయం

[సమీక్షకి గ్రంథాలు పంపేవారు రెండేసి ప్రతులు పంపవలె అని మనవి]

## శబ్దార్థకల్పతరువు

(సంస్కృత సంస్కృతాంధ్ర నిఘంటువు)

రచయిత : 'పండితరాయ' 'బాలామర' 'సాహిత్యచక్రవర్తి' శ్రీ మామిడి వేంకటార్యులు; పరిష్కర్త: శుద్ధచైతన్యస్వామి; ప్రాప్తిస్థానం : శ్రీవాసవీగ్రంథప్రచురణసమితి, మచిలీపట్టణం; పుటలు : 1631; వెల : రూ. 20/-

భాషకు నిఘంటువు ఎంత ఆవశ్యకమో చెప్పడం అనావశ్యకం. ఏ ప్రాంతం వారికి ఆ ప్రాంతీయ భాషానిఘంటువు లుండడం తోపాటు ఒక్కొక్క ప్రాంతంవారికీ యావద్భారత దేశ భాషమైన సంస్కృతభాషానిఘంటు వుండడం జరూరు. సంస్కృతశబ్దకోశావశ్యకత ఆంధ్ర దేశీయులకు ముఖ్యంగా మరెంత ఎక్కువ.

ప్రాచీనసంస్కృతనిఘంటువు లన్నీ పద్య రూపాలుగా ఉండడం వల్ల అవి ఈ కాలపు విద్యార్థులకే కాదు, ఉపాధ్యాయులకు సైతం సుబోధములు కావు. కాబట్టి పద్యరూపాలుగా ఉండిన నిఘంటువు లన్నీ ఇప్పు డిప్పుడు అకారాదిక్రమంలో వచనరూపాలుగా ఏర్పఱుప బడు తున్నాయి. ఇక ఈ కాలంలోనే వ్రాయ బడే నిఘంటువుకు రూపం 'వచనం' కాక, క్రమం అకారాది కాక — ఉంటుందా? ఐతే ఈ కల్పతరువులో ఒక్క విశేషం. ఆద్యక్షర క్రమమే కాక అంత్యాక్షరక్రమమున్నూ, పదాల అక్షరసంఖ్యాక్రమమున్నూ కూడా పాటింపబడి ఉన్నవి.

ప్రస్తుతకాలపు అక్కఱలను ఆంధ్రదేశ ప్రజల అక్కఱలను పూర్తిగా తీర్చేటటువంటి ఈ 'శబ్దార్థకల్పతరువు'ను శ్రీ మామిడి వేంకటార్యులు (1764-1834) జిజ్ఞాసులోకానికి ప్రసాదించారు. నిఘంటుగ్రంథకరణానికీ శాస్త్ర గ్రంథకరణానికీ ఉండవలసిన కూలంకష పాండిత్యం ఈ కల్పతరువులో ప్రతిపుటలోను వ్యక్తమై ఉంది. వ్యర్థమైన దేదీ దూఱి రాలేదు. ఆవశ్యకమైంది ఏదీ జాఱిపోలేదు. కాబట్టి దీన్ని సంక్షేపసామగ్ర్యాల అద్భుత మేళనం గల నిఘంటు వని చెప్పవచ్చు. ఇందులో ప్రతి మాటకూ క్రింద, దాని అర్థం మాత్రమే కాకుండా పర్యాయపదాలుగూడా లభించడం విశేషం. నేను చూచినంతవఱకు ఈ నిఘంటువులో వెదకిన పదం కనబడకపోలేదు, ఇయ్యబడిన అర్థం పదానికి సరిపడక పోలేదు, చాలక పోలేదు. పైగా, ఇచ్చిన వివరాలు కేవలం ప్రాచీననిఘంటు పద్ధతిలో గాక, నవీన 'విజ్ఞాన సర్వస్వాల' ఫక్కికలో పొందుపడి ఎంత ముచ్చటగా ఉందో మచ్చుకు చూడండి — (పుట 1403)

श्रीरामकृष्ण: శ్రీరామకృష్ణః ఆం పుం ज्ञानं शं प्रेम (भक्ती) रामानुजस्य च योग: पातञ्जलो यत्र सङ्घीभूयस्थिता त्रय: तस्मिन् శంకర భగవత్పాదుల జ్ఞానము రామానుజుల ప్రేమ (భక్తి) పతంజలి యోగము – ఇవి మూడును గుమిగూడి యున్న మహనీయ మూర్తి.

सर्वमतसामरस्यवादके సర్వమతసామరస్యవాది ; सर्ववर्णाश्रमाराध्ये दैव సమస్త వర్ణాశ్రమస్థులును పూజింపఁదగిన దైవము; कान्तासु कनकेषु च अनासक्ते मानवाकृतौ भर्गे కామినీకాంచనముల జయించిన, మానవాకృతితో వెలసిన-యీశ్వరుఁడు; ति महात्मभिः प्रणुते అవతారవరిష్ఠుఁడని మహాత్ములచే స్తుతింపఁబడినట్టి శ్రీ రామకృష్ణదేవుఁడు.

(పుట 1411)

शारदा आ० स्त्री० सरस्वत्याम् సరస్వతీదేవి; परमहंसाराधितायां श्रीरामकृष्णदेवस्य (पत्न्याम्) शक्त्याम् పరమహంసలచేత ఆరాధింపబడిన శ్రీరామకృష్ణదేవుని యిల్లాలు, శారదాదేవి, दुर्गायाम् దుర్గ.

(పుట 1412)

श्रीविवेकानन्दः శ్రీవివేకానన్దః अ० पु० रामकृष्ण प्रतिकृती रामकृष्णतपःफलम् । जगद्दुःखविनिर्भिन्नहृदयो यो दयार्णवः ॥ रामकृष्णकृपाप्राप्तमहाशक्त्या सुसंयुतः । अद्यापि यन्महाशक्तिः करोत्येव जगद्धितम् ॥ अति वर्णाश्रमी वाग्मी द्वितीयो बुद्ध एव यः तस्मिन् । శ్రీరామకృష్ణపరమహంస తపఃఫలము, శ్రీరామకృష్ణుని ప్రతిబింబము, అన్ని వర్ణములకును అన్ని ఆశ్రమములకును అతీతుఁడైన మహాత్ముఁడు, మహావక్త, జగద్దుఃఖముచే సంక్షుబ్ధమైన హృదయముగల దయామయుఁడు, అపరబుద్ధుఁడు, శ్రీరామకృష్ణకృపాప్రాప్తదివ్యశక్తి సంపన్నుడు (వీని మహాశక్తి నేఁటికిని లోకమునకు పలువిధముల మేలు చేయుచునేయున్నది) శ్రీ వివేకానందస్వామి.

శ్రీమన్మామిడి వేంకటార్యుల శేముషీ ప్రభవమైన యీ కల్పతరుశోభకు వసంతాగమంగా శ్రీమచ్ఛుద్ధచైతన్యస్వాములు అనుగ్రహించిన ఉపోద్ఘాతాది పరిష్కారం విద్వన్మనోహరంగా వెలుగొందుతుంది. ఈ గ్రంథ ప్రదానం మూలంగా మచిలీపట్టణపు శ్రీవాసవీ గ్రంథప్రచురణసమితివారు దేశానికీ ప్రజకూ భాషకూ కావించిన మహోపకారం ఇంత అంత అనలేము.

—ప్రభాకర్

---

తాజా విషాదవార్త

శ్రీరామకృష్ణ'మఠ' 'మిషను'-ల కేంద్రసర్వాధ్యక్షులు శ్రీశ్రీ శంకరానందస్వాములవారు జాన్యువరి తే 13 ది ప్రొద్దున బేలూరులో మహాసమాధి చెందినారు. వయస్సు 82 సంవత్సరాలు. వీరు 'మఠ' 'మిషను'ల సర్వాధ్యక్షులుగనున్నవారి వరుసలో 7-వ వారు. ప్రథమాధ్యక్షులైన శ్రీబ్రహ్మానందస్వాములవారి శిష్యులు వీరు. 1906 లో సన్న్యసించారు. 1947 లో ఉపాధ్యక్షులలో ఒకరుగా నియమితు లయ్యారు. 1951 జూను నెలలో సర్వాధ్యక్షులుగ ఎన్నుకోబడ్డారు. విద్యార్థిదశలోనే శ్రీవివేకానందస్వాముల ఉపన్యాసాలు విని వీరు సన్న్యాసిజీవితమువంకకు ఆకృష్టు లయ్యారు. 1903 లో వీరు శ్రీసదానందస్వాములతో జపానుకు వెళ్లి అక్కడ ఆఱు నెల లుండి మరలి వచ్చేటప్పుడు చైనాదేశంలోకూడా పర్యటించారు. వీరు పుట్టిన తేది 9-3-1880.



## ఆంధ్రప్రదేశ్‌లో పంచాయతీ రాజ్యం....

భారతదేశంలో పరిపాలనా రంగములో ప్రజాస్వామిక వికేంద్రీకరణ సూత్రాన్ని ప్రయోగాత్మకంగా ప్రవేశపెట్టిన మొట్టమొదటి రాష్ట్రాలలో ఆంధ్రప్రదేశ్ ఒకటి. సామాజికాభివృద్ధి కార్యక్రమం ఇప్పుడు ౨౨౦.౬౮ లక్షల జనాభాగల ౭౮,౫౩౨ చదరపుమైళ్ల ప్రాంతానికి విస్తరించింది. ఇందులో ౩౫౨ బ్లాకులున్నాయి. పంచాయతీ సమితులు ఇప్పుడు ౨౯౩ బ్లాకులలో పనిచేస్తున్నాయి. రాష్ట్రంలోని ౨౦ జిల్లాల్లోనూ జిల్లాపరిషత్తులు ఏర్పాటయినాయి. ఈ విధంగా ౧౯౫౯-వ సంవత్సరపు ఆంధ్రప్రదేశ్ జిల్లా పరిషత్తు, పంచాయతీ సమితుల చట్టాన్ననుసరించి యీ బ్లాకుల పరిపాలన, గ్రామస్థాయిలో పంచాయతీ, బ్లాకు స్థాయిలో సమితి, జిల్లా స్థాయిలో పరిషత్తులను ఏర్పాటుచేయడంతో, యీ మూడు స్థాయిలలోను, బ్లాకుల పరిపాలనా వికేంద్రీకరణ కార్యక్రమం పూర్తయింది. దీని ఫలితంగా రాష్ట్రంలో సమాజాభివృద్ధి పథకాలకు ఒక క్రొత్త వరవడి యేర్పడి, ఆంధ్రప్రదేశ్‌లోని గ్రామీణ ప్రాంతాలలో జరుగుతున్న శాంతియుత విప్లవంలో ఒక ముఖ్య పాత్రను వహిస్తున్నది.

సమాచార పౌరసంబంధముల శాఖ, హైదరాబాదు.



# మీటర్లలోనికి మార్పు

పొడవు, వెడల్పుల కొలతకి మీటరు ఒక ప్రమాణముగా అక్టోబరు 1 వ తేదీనుంచి అమలులోనికి వచ్చింది. ఒక ఏడాదిలో గజము, అడుగు, అంగుళం ప్రమాణాలు చట్ట సమ్మతము కానివి అవుతాయి.

బట్టల తానులమీద అప్పుడే మీటర్ల గుర్తులు వేయబడినాయి. వీటి ధరలలో కూడా 'మీటరు ఇంత' అని వేయబడింది.




భారత ప్రభుత్వముచే జారీ చేయబడినది

# శ్రీ రామకృష్ణ బోధామృతము

అనువాదము :

శ్రీ [illegible]

ఇందు శ్రీరామకృష్ణుని జీవిత సంగ్రహమును 1121 మహోపదేశములును గలవు.

జీవుడు : సంసారము ; మాయ. గ్రంథములు : గ్రంథులు, బోధగురువులు : బోధ గురువులు, తార్కికులు : వారి ధోరణులు, ఆత్మోన్నతి ; సాధకులు . వారి యాదర్శములు, పారమార్థిక జీవనమునకు సహాయములు, సర్వమతసామరస్యము, దేవుడు, జ్ఞానము : భక్తి : కర్మము, బ్రహ్మతత్త్వము మున్నగు అంశము లిందు తేటతెల్లముగ పసి బిడ్డల కయిన అవగాహన కాగల ఉపమానములతో వివరింపబడియున్నవి.

నీతికథలును సూక్తులును మకరంద పేశలములు, నిర్వృతికరములు.

... ఈ గ్రంథం చదువుతూంటే ఒక్క ఐహికానికే, ఒక్క ఆముష్మికానికే కాక, రెంటికీ సంబంధించిన సూత్రాలూ, రహస్యాలూ, [illegible] చక్కగా అరటి పండు వొలిచి చేతిలో పెట్టినట్లు ఉంటవి... —ఆంధ్రపత్రిక

540 పుటలు ప్రజ్జ్వలమగు పంచమ ముద్రణము ! వెల : రూ. 3-50

# హిందూమతము

రచయిత : శ్రీ వివేకానందస్వామి

అనువాదకులు: శ్రీ కందుకూరు మల్లికార్జునంగారు

హిందూమత నామమును పరస్పరభిన్నభావభూయిష్ఠములగు అనేక మతసంప్రదాయములు వహించి యుండుటచే, తత్స్వరూప నిర్వచనమునకు ఇందు శ్రీ వివేకానంద స్వాములవారు పూనుకొని ఆ మతము వేదసంహితాకాలమునుండి ఎట్లు క్రమ పరిణామ మందెనో, అందు సర్వసమ్మతమూలభావము లెవ్వియో, అవి చేయు బోధ యెట్టిదో, ఇన్ని భిన్నమతాంతరము లెట్లు కలిగెనో, ఈ కలగూరగంపకు హిందూమత నామ మెట్లు ఏర్పడెనో విశదీకరించియున్నారు. జిజ్ఞాసువుల కత్యంతోపయుక్తమగు గ్రంథము.

... తెలుగువాఙ్మయములో వేదాంతచర్చలపై ... ప్రకటింపబడిన గ్రంథములలో ఇది ఉత్తమోత్తమమైనదని శిరసాగ్గి చెప్పవలసియున్నది. ... —భారతజ్యోతి 12-4-1956.

... గ్రంథము ప్రావాహిక శైలిలో అనువదింపబడినది. —హిందూపత్రిక 5-8-'56.

168 పుటలు రూ. 1-25

అడ్రెసు : మేనేజరు, శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు - 4

సంపాదకులు : శ్రీ శుద్ధసత్త్వానందస్వామి, శ్రీ నేలటూరి భక్తవత్సలము,
శ్రీ కే. ఎస్. ఎస్. రాజన్ గారిచే ది జ్యూపిటర్ ప్రెస్స్ ప్రైవేట్ లిమిటెడ్ (మద్రాసు - 18) న ముద్రింపబడి
శ్రీ శుద్ధసత్త్వానందస్వామిచే శ్రీ రామకృష్ణమఠము (మైలాపూరు) నుండి ప్రచురింపబడినది.

శ్రీ వివేకానందస్వామి శతతమ జయంతి ప్రచురణములు

ఆంధ్రపాఠకులకు అమూల్యతరుణము

# శ్రీ వివేకానంద సంపూర్ణ గ్రంథావళి

ప్రతిష్ఠాత్మకమైన ఈ గ్రంథసంపుటాలు ఆంధ్రీకరింపబడి 10 సంపుటాలుగా ప్రకటింపబడుతున్నది. ప్రతి సంపుటంలోను సుమారు 500 పుటలు ఉంటాయి. అసలు ఖరీదు అట్టబైండు సెట్టు రు. 50 లు. కాలికోబైండు సెట్టు రు. 65 లు. పోస్టేజి ప్రత్యేకం.

స్వామిజీ సందేశం మాతృదేశభక్తిభరితం ప్రాణప్రదం ఆత్మోత్తేజకరం విశ్వజనీనం. అది సమగ్రంగా ఆంధ్రమహాజనులకు అందడం ఇదే మొదటిసారి. స్వామిజీ దివ్యదృష్టి ఆయన సమస్యా పరిష్కారవిధానం సూచింపని ముఖ్యసమస్య అంటూ లేదు. ఆయన గ్రంథావళిని చదివినవారికి ఉత్సాహమును ఉదాత్తతయును కలుగక తప్పదు.

## ప్రకటనకు ముందే పైకం చెల్లించేవారికి తగ్గింపు ధరలు

అట్టబైండు సెట్టు రూ. 30 లు మాత్రమే. 1962 ఫిబ్రవరి తే 28 ది లోగా రూ. 10 లు చెల్లించి పేరు రిజిస్టరు చేయించుకొని మిగిలిన రూ. 20 లను ఒకటి రెండు వాయిదాలుగా జూన్ తే 30 ది లోగా పంపాలి.

కాలికోబైండు సెట్టు రూ. 45 లు మాత్రమే. 1962 ఫిబ్రవరి తే 28 ది లోగా రూ. 15 లు చెల్లించి పేరు రిజిస్టరు చేయించుకొని మిగిలిన రూ. 30 లను ఒకటి రెండు వాయిదాలుగా జూన్ తే 30 ది లోగా పంపాలి.

1962 జూలైకిని 1963 జూలైకిని మధ్యకాలమున గ్రంథములు సరఫరా చేయబడును.

స్థలము :

మేనేజరు,

శ్రీ రామకృష్ణ మఠము

మైలాపూరు : : మద్రాసు - 4

# వంట చేస్తూనే విశ్రమించండి

ಅಡಿಗೆಯು ನಿಮಗೆ ಭೀಕರ ಶ್ರಮವಾಗಿರಬಲ್ಲುದು, ಈ ಆಶ್ಚರ್ಯಕರ ಕೆರೊಸಿನ್ ಕುಕರ್ ಸೌಕರ್ಯವನ್ನು ನೀವು ತಿಳಿದುಕೊಳ್ಳುವವರೆಗೆ. ಬೇಕಾದ ಕಾಲದಲ್ಲಿ ಅಡಿಗೆ ಮಾಡಿರಿ—ಪರಿಶ್ರಮವಿಲ್ಲ.

ಕಲ್ಲಿದ್ದಲನ್ನು ಮುರಿಯ ಬೇಕಾಗಿಲ್ಲ, ಬೆಂಕಿ ಊದ ಬೇಕಾಗಿಲ್ಲ, ಕಣ್ಣಿಗೆ ಹೊಗೆಯಿಲ್ಲ ಮತ್ತು ಒಳ ಮಾಳಿಗೆಯಲ್ಲಿ ಮಸಿಯಾಗದು. ಈ ಹೊಸ ಕುಕರ್ ಸ್ವಚ್ಛ, ನೇರ ಮತ್ತು ಸರಳ-ದುಡಿಮ್ಮೆ ಬೆವರು ಅಥವಾ ಕಂಬನಿಗಳಿಲ್ಲ.

- మురికి, దుమ్ము వుండవు, మసి పట్టదు, మంటలు లేవవు
- ఖర్చు చాలా తక్కువ, పూర్తిగా సురక్షితమైనది
- తేలికగా ఎక్కడికి పడితే అక్కడికి తీసికొని వెళ్లవచ్చు




# ఖాస్ జనతా
## కిరోసిన్ కుక్కర్

వంట బాగా | తేలికగా చేసుకోండి

ఉత్పత్తిదారులు :

**ది ఓరియంటల్ మెటల్ ఇండస్ట్రీస్ ప్రైవేట్ లిమిటెడ్**

77, బౌబజార్ స్ట్రీట్, కలకత్తా-12

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటము ౧౮ ౧౯౬౨, ఫెబ్రువరి; ప్లవ - మాఘము సంచిక ౮

## విషయసూచిక



---



'అఖిలవిభు శరణొందుమ, యా క్షణంబ యతనికృప నీకు ననుభావ్య మగును వత్స.'

-శ్రీ శారదామణి.

# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము ౧౮ } - ఫెబ్రువరి :: ప్లవ - మాఘము { సంచిక ౮

## సౌందర్యలహరి

మూలము : శ్రీ శంకరభగవత్పాదులు

టీక : నే. భ.

కవీన్ద్రాణాం చేతః కమలవన బాలాతపరుచిం
భజన్తే యే సన్తః కతిచి దరుణా మేవ భవతీమ్
విరిఞ్చి ప్రేయస్యా స్తరుణతర శృఙ్గారలహరీ
గభీరాభి ర్వాగ్భి ర్విదధతి సతాం రఞ్జన మమీ ॥ ౧౬

| | | | |
|---|---|---|---|
| (దేవి) | (అమ్మా) | అమీ సన్తః | ఆయీ సజ్జనులు |
| కవీన్ద్రాణాం | కవీశ్వరుల | విరిఞ్చి | బ్రహ్మదేవుని |
| చేతః కమల | మనఃపద్మములకు | ప్రేయస్యాః | ప్రియురాలి |
| బాల+ఆతపరుచిం | లేతయెండవంటిదానవును | తరుణతర | మిక్కిలి లేబ్రాయపు |
| అరుణాం ఏవ | అరుణ అను పేరుగలదానవును (అరుణవర్ణముగల దానవును) అగు | శృఙ్గారలహరీ | పొంగెక్కిన సింగారపు వెల్లువను బోలిన |
| | | గభీరాభిః | గంభీరములైన |
| భవతీం | నిన్ను | వాగ్భిః | వాగ్విలాసములచే |
| కతిచిత్ | అల్పసంఖ్యాకులగు | సతాం | సాధువులకు |
| యేసన్తః | ఏ సజ్జనులు | రఞ్జనం | ఆహ్లాదమును |
| భజన్తే | కొల్తురో ఉపాసింతురో | విదధతి | ఒనగూరురు. |

తా॥ అమ్మా, కవీశ్వరుల మనఃపద్మములకు నీవు ప్రభాత సూర్యకాంతివలె వికాస ప్రదాయినివి. నీ పేరు అరుణ. నీ వన్నె అరుణము. తెలిసి నిన్ను ఉపాసించు సాధువులు అరుదు. కాని ఆ ఉపాసనకు ఫలితముగ వారి వాగ్విలాసములు నలువరాణి యౌవనపుశృంగార ప్రవాహములవలె గంభీరములై సజ్జనులకు ఆహ్లాదము గూర్చుచుండును.

సవిత్రీభి ర్వాచాం శశిమణిశిలాభఙ్గరుచిభి
ర్వశిన్యాద్యాభి స్త్వాం సహ జనని సఞ్చిన్తయతి యః
స కర్తా కావ్యానాం భవతి మహతాం భఙ్గిరుచిభి
ర్వచోభి ర్వాగ్దేవీ వదనకమలామోద మధురైః ॥ ౧౭

| | | | |
|---|---|---|---|
| జనని | అమ్మా | మహతాం | మహాత్ముల (కాళిదాసాదుల) |
| వాచాం | వాక్కులకు | భఙ్గిరుచిభిః | రీతులందలి రుచులవంటి రుచులతోను |
| సవిత్రీ | జనయిత్రులును | | |
| శశిమణిశిలా | చంద్రకాంతమణుల | వాగ్దేవీ | సరస్వతీదేవియొక్క |
| భఙ్గరుచిభిః | తునకలబోలిన కాంతి గల వారును అగు | వదనకమల | వక్త్రపద్మమందలి |
| | | ఆమోద | పరిమళమువంటి పరిమళముతోను |
| వశినీ ఆద్యాభిః సహ | వశిని మున్నగు అష్ట శక్తులతో గూడ | | |
| | | మధురైః | మధురములైన |
| త్వాం | నిన్ను | వచోభిః | వాక్కులతో |
| యః | ఏ సాధకుడు | కావ్యానాం | ప్రబంధముల |
| సఞ్చిన్తయతి | ధ్యానించునో | కర్తా | రచయిత |
| సః | ఆసాధకుడు | భవతి | అగును. |

తా॥ వశిని – కామేశ్వరి – మోదిని – విమల – అరుణ – జయిని – సర్వేశ్వరి – కౌలిని అను నెనమండ్రు శక్తులును వాక్కులను జనింపజేయువారు. వారి మేనికాంతి అప్పుడే కోయబడ్డ చంద్రకాంత శిలలకాంతిని బోలియుండును. వారి నడుమ నున్న నిన్ను చింతించు సాధకుడు తప్పక మహాకావ్యకర్త యగును. అతని రీతులరుచి మహాత్ములగు కాళిదాసాదుల రీతుల రుచితో తులతూగుచుండును. అతని వాక్యముల మాధుర్యము సరస్వతీ ముఖ పద్మ పరిమళమువలె నుండును.

తనుచ్ఛాయాభి స్తే తరుణతరణిశ్రీసరణిభి
ర్దివం సర్వా ముర్వీ మరుణిమ నిమగ్నాం స్మరతి యః
భవ న్త్యస్య త్రస్యద్వనహరిణ శాలీన నయనా
స్సహోర్వశ్యా వశ్యాః కతి కతి న గీర్వాణగణికాః ॥ ౧౮

| | | | |
|---|---|---|---|
| (జనని) | (అమ్మా) | స్మరతి | ధ్యానించునో(భావించునో) |
| తరుణతరణి | బాలసూర్యుని | అస్య | ఆ ఉపాసకునికి |
| శ్రీ సరణిభిః | ద్యుతివంటి ద్యుతిగల నీ | త్రస్యద్ | భయపడుచున్న |
| | | వనహరిణ | అడవిజింకల (కన్నులవలె) |
| తనుచ్ఛాయాభిః | మేని కాంతులచే | శాలీన | చంచలములైన |
| సర్వాం | సమస్తమైన | నయనాః | నేత్రములుగలవారగు |
| దివం | అంతరిక్షమును | గీర్వాణగణికాః | దేవవేశ్యలు |
| ఉర్వీం | భూమిని | ఊర్వశ్యాసహ | ఊర్వశితో సహ |
| అరుణిమ | ఎఱుపులో | కతి కతి | ఎందఱెందఱు |
| నిమగ్నాం | మిక్కిలియు మునిగినదానినిగా | వశ్యాః | స్వాధీనులు |
| | | నభవన్తి | కాకుందురు ? |
| యః | ఏ ఉపాసకుడు | | |

తా॥ అమ్మా, నీమేనికాంతులు బాలసూర్యునిద్యుతిని బోలినవి. ఈ భూమ్యాకాశములను నీమేనికాంతి యెఱుపులో మునిగియున్నవానినిగా ఏ సాధకుడు ధ్యానించునో వానికి భయపడు వనహరిణముల కన్నులను బోలిన చంచలనేత్రములుగల ఊర్వశి మున్నగు దేవవేశ్యలు ఎందఱెందఱు వశపడకుందురు? ఎందఱెందఱో తప్పక వశపడుదు రనుట.

ముఖం బిన్దుంకృత్వా, కుచయుగ మధ స్తస్య, త దధో
హరార్ధం ధ్యాయేద్ యో, హరమహిషి, తే మన్మథకలామ్-
స సద్య స్సంక్షోభం నయతి వనితా ఇ త్యతిలఘు
త్రిలోకీ మ ప్యాశు భ్రమయతి రవీన్దు స్తనయుగామ్ ॥ ౧౯

| | | | |
|---|---|---|---|
| హరమహిషి | మహాదేవప్రియా, | మన్మథకలాం | కామరాజ బీజమును (క్లీంకారమును) |
| బిన్దుం | బిందుస్థానమున | యః | ఏసాధకుడు |
| ముఖం కృత్వా | ముఖమును ధ్యానించి | ధ్యాయేత్ | చింతించునో |
| తస్య+అధః | దానికి క్రింద (బిందుద్వయస్థానమున) | సః | ఆసాధకుడు |
| కుచయుగం | చనుగవను | సద్యః | అప్పుడే |
| (కృత్వా) | (ధ్యానించి) | వనితాః | మగువలను |
| తదధః | దానికి క్రింద | సంక్షోభం | చిత్తవికారమును |
| హర+అర్ధం | శక్తిని, త్రికోణమును, యోనిని | నయతి | ఒందించును |
| | | ఇతియత్ | అనుట ఏదికలదో |
| (కృత్వా) | (ధ్యానించి) | తత్ | అది |
| తత్ర | అచట | అతిలఘు | (అతని మహిమలో) లవలేశమే |
| తే | నీ | | |

| | | | |
|---|---|---|---|
| (కింతు) | (మరేమన) | త్రిలోకీం అపి | మూడులోకాల |
| రవి+ఇన్దు | సూర్యచంద్ర బింబములే | | (ముల్లోకము)ను సైతము |
| స్తనయుగాం | చనుగవగా గలదగు | ఆశు | శీఘ్రముగ |
| | | భ్రమయతి | చలింపజేయును. |

తా॥ ఓ సదాశివప్రియా, మీాది చుక్కలో ముఖమును, దాని క్రింది రెండు బిందువులలో చనుగవయు దానిక్రింది లకారమున త్రికోణమును (యోనియు) గల క్లీం అను నీ కామకలను ధ్యానించు సాధకుడు సూర్యచంద్రబింబములే చనుగవగ గల త్రిలోకినే (ముల్లోకాలనే) ఉఱ్ఱూతలూపు ననగా వనితల మనముల కలవరపఱచుట అతని కొక లెక్కయా?

కిరన్తీ మఙ్గేభ్యః కిరణనికురుమ్బామృతరసం
హృది త్వా మాధత్తే హిమకరశిలామూర్తిమివ యః
స సర్పాణాం దర్పం శమయతి శకున్తాధిప ఇవ
జ్వరప్లుష్టా౯ దృష్ట్వా సుఖయతి సుధాధారసిరయా॥ ౨౦

| | | | |
|---|---|---|---|
| (హేదేవి) | (అమ్మా) | సః | ఆ సాధకుడు |
| యః | ఏ సాధకుడు | శకున్తాధిప ఇవ | గరుత్మంతునివలె |
| అఙ్గేభ్యః | అవయవాలనుండి | దృష్ట్వా | చూపు (ప్రసరింపచేసిన) |
| కిరణ | కిరణాల | | మాత్రముచేతనే |
| నికురుమ్బ | సమూహము అనెడి | సర్పాణాం | పాముల |
| అమృతరసం | పీయూషరసమును | దర్పం | గర్వమును (క్రౌర్యమును) |
| కిరన్తీం | వెదజల్లుచున్న దానవును | శమయతి | నశింపజేయును |
| హిమకరశిలా | చంద్రకాంత శిలానిర్మిత | జ్వరప్లుష్టా౯ | జ్వరసంతప్తులను |
| మూర్తిం ఇవ | ప్రతిమవంటి దానవును అగు | సుధా+ఆధార | అమృతమును కురిపించగల |
| త్వాం | నిన్ను | సిరయా | నాడులు గలదగు |
| హృది | డెందమున | (దృష్ట్యా) | (చూపుచేతనే) |
| ఆధత్తే | ధ్యానించునో | సుఖయతి | సుఖింపజేయును. |

తా॥ అమ్మా, నీ అవయవాలు కిరణాల సమూహము అను అమృతరసమును వెదజల్లుచున్నవి. నీవు చంద్రకాంతశిలానిర్మితప్రతిమవంటిదానవుగ ఉన్నావు. నిన్ను డెందమున ధ్యానించు సాధకుని కంటినాడులలో అమృత మొలుకుచుండును. కావున అతనిచూపు సర్పముల గర్వ మణంప గలదు, జ్వర తప్తులజ్వరమును చల్లబఱుపగలదు.

# శ్రీ బ్రహ్మానందస్వామి

## [సంపాదకీయము]

శ్రీరామకృష్ణున కొకనా డొక దివ్యదర్శనము గలిగెను. దానిని కనినంతనే ఆయన మేను గడగడ వణక జొచ్చినది. ఆ దివ్యదర్శనములో లోకజనని ఆయనకు అగపడి 'వీడు నీ కుమారు' డనుచు నొక బాలకుని జూపెను. ఆతలంపే ఆయనకు ప్రాణాంతకము. అంతలో లోకజనని ఖిన్నుడైన ఆతన సుతుని ఊరడించి "ఆ బాలుడు నీకు పుత్రు డగు ననగా పారమార్థిక పుత్రుడగునే కాని లోకసామాన్యార్థమున కాదు" అనెను. శ్రీరామకృష్ణుని దిగులు తీఱెను. అనంతరకాలమున బ్రహ్మానందస్వామి యని ప్రసిద్ధుడైన శిష్యుడు తన యొద్దకు వచ్చినప్పుడు దివ్యదర్శనమున తనకు కనిపించిన బాలు డతడే అని శ్రీరామకృష్ణుడు తత్క్షణమే గుర్తించెను.

శ్రీబ్రహ్మానందస్వామికి మొదటి పేరు రాఖాల్చంద్రఘోషు. ఇరువదినాలుగు పర్గణాల జిల్లాలో బసిర్హాట్ అను గ్రామమున నొక సంపన్నకుటుంబమున నతడు జనించెను. అతని తండ్రి ఆనందమోహనఘోషు ఒక జమీందారు. తల్లి ధర్మనిష్ఠ గలది, శ్రీకృష్ణభక్త. రాఖాలు 1863 వ సంవత్సరము జాన్యువరి 21 తేదినాడు జన్మించెను. శ్రీకృష్ణుని సహచరబాలు డను నర్థము గల రాఖా లను పేరును కుమారునకు తల్లియే పెట్టియుండును. రాఖాలు ఐదేండ్ల వాడుగ నున్నప్పుడే, దురదృష్టముచే అతని తల్లి మరణించెను, తండ్రి రెండవభార్యను వివాహము చేసికొనెను. ఆమెయే రాఖాలును పెంచినది.

రాఖాలు నిరతిశయారోగ్యసౌందర్యములు గల బాలుడుగా పెరిగెను. చూచువారికి అందఱికిని ప్రేమ గొలుపు ఒకానొక విశేషము అతని యాకారములోనే ఉండెను. ఆనందమోహనుడు ముఖ్యముగ తన కుమారుని కొఱకే ఒక పల్లెబడిని ప్రారంభించి అతని నా బడి కంపెను. ఆ దినాలలో పల్లెబడుల ఉపాధ్యాయులు పిల్లలను బెత్తములతో కొట్టువారనుట ఎల్ల రెఱింగినదే. తన సహాధ్యాయు లెవరైన దెబ్బలు తిన్నప్పుడు రాఖాలు బాధపడుచుండెడివాడు. దానిని గుర్తించి ఉపాధ్యాయుడు పిల్లలను బెత్తముతో కొట్టుట మానుకొనెను. విద్యార్థిదశలో నున్న రాఖాలు ప్రతిభ అసాధారణము. బాల్యములోనైతము అతని జీవితాభిరుచులు వివిధములుగ నుండెను. ఆ దినాలలో దేహదార్ఢ్యమున నతడు తన సవయస్కులకన్న చాల మిన్నగ నుండెను. కుస్తీలలో గాని ఆటలలో గాని సహచరు లతనితో తులదూగజాలకుండిరి. పల్లె క్రీడలలో పెక్కింట అతడు పాల్గొని వానిలో నిరతిశయనైపుణి చూపుచుండును. కాని వినోదమును క్రీడలును మాత్రమే కాదు అతనిలక్ష్యము. సమీపముననే కాళిగుడి ఉండెను. రాఖాలు తఱచుగ ఆగుడి యావరణములో కనిపించుచుండును. ఒక్కొక్కప్పు డతడు తన సఖులనుగూడి

మాతృదేవినిపూజించుచే ఆటగా వినోదించును. ఒక్కొక్కప్పుడు తానే బంకమట్టితో చక్కని జననివిగ్రహమును జేసి పూజావ్యగ్రుడగును. చాల పసివాడుగ నున్నప్పుడు సైతము రాఖాలునకు దేవతలయందును దేవేరులయందును భక్తి హెచ్చు. ఇంటిలో దుర్గాపూజ జరుగు నప్పుడు, దానిని జూచుచు నతడు నిశ్చలముగ మౌనముగ గూర్చుండి యుండును. లేదా మునిమాపువేళ సాయంపూజ జరుగుచున్నప్పుడు రాఖాలు మహాభక్తితో దేవి కెదుట నిలబడియుండును.

బాల్యమునుండియే రాఖాలునకు భజనలం దభిరతి సహజము. భిక్షువులు బృందావనవేణు వినోదినిగూర్చిన కీర్తనలను పాడినప్పుడును, ఎవరేని లోకమాతనుగూర్చి కీర్తనలను పాడినప్పుడును రాఖాలు తన్మయుడగుచుండును. ఒక్కొకప్పుడు అతడు సహచరులతో పల్లె సమీపక్షేత్రమున నొక యేకాంతస్థలమున కేగును. అట వారి భక్తిగేయముల బృందగానము సాగుచుండును. పాడుచుండగా అప్పుడప్పుడతడు బాహ్యస్మృతి నించుమించు పూర్తిగా కోల్పోవును. పైస్థాయి కెక్కును అతని మనసు.

ప్రాథమికవిద్య ముగిసినపిమ్మట 1875 లో తండ్రి అతనిని కల్కత్తా కంపి ఒకయింగ్లీషు హైస్కూలులో చేర్పించెను. కల్కత్తాలో ప్రాంతీయబాలురకు నాయకుడుగ నున్న నరేంద్రనాథునితో రాఖాలునకు సంసర్గమేర్పడినది. ఈ నరేంద్రనాథుడే అనంతరకాలమున శ్రీవివేకానందస్వామి అన ప్రసిద్ధుడయ్యెను. క్రీడలకు ఉత్సాహమును సహజనాయకగుణాలును గల నరేంద్రనాథుని కితరులు వశపడుచుండిరి. అతడు వారిని మంచి దని తనకు తోచిన మార్గమున నడపుచుండెను. నమ్రుడును శాంతుడును మృదువునైన రాఖాలు మంత్రముగ్ధుడైనట్లు నరేంద్రునికి వశుడయ్యెను. వారి నడుమ ఆంతరంగికమైత్రి పెంపొంది దక్షిణేశ్వరమున ఒక్కగురువునకే ఇద్దఱును శిష్యులగుటలో పర్యవసించి మహాఫలప్రదమైనది.

ఇతరసఖులతోగూడి రాఖాలును నరేంద్రుడును ఒక్కగరిడీశాలలోనే కసరత్తు నభ్యసించుచుండిరి. రాఖాలును బ్రాహ్మసమాజమున చేర్చినదియు నరేంద్రనాథుడే. ఈదశలోనే రాఖాలున కుండిన సహజాధ్యాత్మికప్రవణతలు, స్ఫుటతరముగ ప్రకటము కాజొచ్చినవి. అతడు జననమరణముల మర్మాలనుగూర్చి తలపోసికొనుచుండెను. నిత్యతత్త్వమును సాక్షాత్కరించుకొనుట కతనిమనస్సు ఆత్రపడుచుండెను. తెలివియు చుఱుకును గలవాడే కాని అతని కిప్పుడు చదువులో ప్రీతి బొత్తిగ లేదాయెను. చదువునందలి యతని యుపేక్షను జూచి అతని పెద్దలు దిగులుపడిరి. తొలుత ప్రేమపూర్వకముగ ప్రోత్సహించి అతనిని మార్చెదముగాక యని వారు ప్రయత్నించిరి. నెగ్గలేకపోగా వారు కఠినతను వహించి కచ్చితముగ ప్రవర్తించువారైరి కాని ఏదియు ఫలింపక పోగా పెండ్లిచేసినచో లౌకికవిషయాసక్తి కలుగునేమో అని తలంచి తండ్రి రాఖాలునకు పెండ్లిచేసెను. మఱి విధివైపరీత్యమును జూడుడు. అనంతరకాలమున అతని జీవితమార్గమును పూర్తిగ మార్చివేయ నున్న యొకానొకనితో సంసర్గము రాఖాలునకు ఈపెండ్లిచేతనే గలిగినది!

గంగకు ఎగువను, దక్షిణతీరమున, దక్షిణేశ్వరమునకు కొన్నిమైళ్లదూరమున కొన్నగరు అను ముఖ్యమైన గ్రామ మొకటి కలదు. ఆ గ్రామవాసియగు మనోమోహనమిత్రుని సోద

రినే రాఖాలు పెండ్లాడినది. మనోమోహన మిత్రుడును అతనితల్లియు ఇద్దఱును శ్రీరామకృష్ణునం దత్యధికభక్తి గలవారు. రాఖాలుకు పెండ్లియైన తర్వాత, 1881-వ సంవత్సర మధ్యమున నొకనాడు, అతనిని వెంటనిడుకొని మనోమోహనుడు గురుదేవుని సందర్శింప దక్షిణేశ్వరమునకు పోయెను. రాఖాలు గురుదేవు నెదుట ప్రణమిల్లెను, అప్పు డొక ఆనంద వీచిక గురుదేవుని మనసుగుండను శరీరముగుండను ప్రవహించినది. ఆయన రాఖాలును అత్యంతదయతో ఆదరించెను. అంతకంటె నెక్కువగా తనహృదయభావములను వెలువరింప లేదు. గురుదేవుడు చూపిన అద్భుత ప్రేమకు రాఖాలు ముగ్ధుడయ్యెను. అట్టిప్రేమ ఇంతవఱకు వేఱెవరియొద్దను తా నెప్పుడును పొందియుండలే దని అతడు అనుకొనెను. కావున సహజముగనే ఇంటికి మరలిన పిమ్మట కూడ గురుదేవుని జ్ఞాపకము రాఖాలు మనసున ఆవరించియే యుండెను. తత్ఫలితముగా కొన్నాళ్ల కనంతరము రాఖాలు ఒకనాడు ఒంటరిగ దక్షిణేశ్వరమునకు పోయెను. అతని దర్శనమాత్రముచేత గురుదేవుడు ఆనందోద్రేకము నొందెను. అతడును నోరాడక స్తంభించి నిలబడెను.

రాఖాలు వీలైనంత తఱచుగా దక్షిణేశ్వరమునకు పోదొడగెను. ఒక్కొక్కప్పు డక్కడే ఆగిపోవుచు నుండసాగెను. అతడు పదునెనిమిది పందొమ్మిదేండ్లయువకు డైనను, గురుదేవు నెదుట తా నొక నాలుగైదేండ్ల శిశువ నని అతనికి తోచెడిది, నిజమున కత డట్లే నడచుకొనుచు నుండెను. చిరకాలమునాడు తాను కోల్పోయిన తన తల్లికి తనయం దుండిన గాఢ ప్రేమయు తనతండ్రికి తనయందు గల సానురాగమగు జాగరూకతయు - ఇవే రాఖాలునకు గురుదేవునందును కనిపించినవి. కాని వారి ప్రేమజాగరూకతలకంటె గురుదేవుని ప్రేమజాగరూకతలు ఇంతంతనరానంత ఉత్కటములుగ నుండెడివి. గురుదేవుడును అతనిని కేవల మొక శిశువును చూచినట్లే చూచును. దిక్కులేని శిశువునకై చెందినంత ఉత్కంఠ అతనికై ఆయన చెందుచుండును. ఇతరశిష్యులందఱు ఉపచారములను గురుదేవునకు చేయుచుండగా, గురుదేవుడు రాఖాలు విషయమున తఱచు జాగ్రత్త వహించుచుండును. ఈ యిరువురి నడిమి యీవింత చుట్టఱికములో హృదయపూర్వకతయు సహజత్వమును ఎంత హెచ్చుగా నుండిన వనగా, ప్రేక్షకులు అచ్చెరువునకు బదులు ఆహ్లాదమును గొందురు. గురుదేవుడు తమచే ఏ చిన్నసేవ చేయించుకొన్నను ఇతర శిష్యులు దానిని తమ మహాభాగ్యముగను గురుదేవుని పరమానుగ్రహముగను భావింతురు. మఱి రాఖాలు, గురుదేవుడు చెప్పిన పనిని 'నేను చేయనే చేయ' నని యొక్కొక్కమాఱు నిరాకరించుచుండును. రాఖాలు ఆలాగు ప్రవర్తించినపుడు గురుదేవుడు చిరాకు చెందుటకు మాఱు ముచ్చటపడుచుండును. ఏల యన ఆ ప్రవర్తన గురుదేవునందు ఆబాలున కుండిన ప్రేమనే సూచించును. కాని సామాన్యముగ నేమో గురుదేవున కన్నియుపచారములను చేయుట కాత్రపడుచుండును. గురుదేవుని రాఖాలు ఎంత భక్తిప్రేమలతో శుశ్రూషించెనో అంతభక్తిప్రేమలతో ఏ పుత్రుడును ఏతండ్రిని శుశ్రూషింపడు. అట్టి సేవలచేయుటే కాక గురుదేవుడు సమాధిదశలలో బాహ్యలోకస్మృతి లేకుండునప్పుడు ఆయన శరీరక్షేమమును రాఖాలు చూచుకొనెడివాడు.

భావోద్రేకమున నొక్కొక్కప్పుడు గురుదేవుడు పచారు చేయునప్పుడు రాఖాలు ఆయన దేహమును పట్టుకొని, చుట్టు నున్న విషయములనుగూర్చి బిగ్గఱగ చెప్పి మెలకువ గూర్చుచు, ఆయన పాదములకు దారిచూపును.

రాఖాలు దక్షిణేశ్వరమునకు తఱచు వచ్చుచు, ఒక్కొకప్పు డక్కడే ఆగిపోవుచు చదువును చెడగొట్టుకొనుచుండగా అతని తండ్రితొలుత వ్యధను పిదప దిగులును జెందెను. 'సభవిష్యజ్జీవితమును తలంప వోయి' అని తండ్రి రాఖాలును చేతనైనంతవఱకు ఎచ్చరించెం గాని, భవిష్యత్తున ఐహికసుఖాలనుగూర్చి అతడు తలంపనే లేదు. ఒకప్పుడు ఆనంద మోహనుడు రాఖాలును బంధించియు ఉంచెను. కాని అత డెట్లో తప్పించుకొని దక్షిణేశ్వరమునకు చేరుకొనెను. ఏమి చేసినను ఉపయోగము లేకపోగా ఆనందమోహనుడు రాఖాలువిషయమున ఆసపాటు వదలుకొనెను. అతనిని విడిచిపెట్టెను. ఇక ఇంటినుండి తన్ను ఆటంకపఱచువారు లేకపోగా రాఖాలుహాయిగా గురుదేవునితోనే ఉండ గలిగెను.

గురుదేవుడు రాఖాలునకు ప్రేమపూర్ణుడగు తండ్రి యగుటయే కాక పారమార్థికమార్గ దర్శకు డగు గురువుగను ఉండెను. రాఖాలును గురుదేవునివంకకు తొలుత ఆకర్షించినది గురుదేవుని నిరతిశయప్రేమయే. కాని ఆమానవ ప్రేమకు మఱుగున ఆధ్యాత్మికశక్తి యున్న దనియు, ఆ శక్తి సంకల్పమాత్రముచేత జీవితములను మార్పొందింపగల దనియు రాఖాలు గుర్తించెను. గురుదేవుని ప్రేమకు పాత్రు డగుటతోబాటు రాఖాలులో ఆధ్యాత్మికముగ నొక గొప్ప పరిణామము ప్రారంభమయ్యెను.

తనప్రియపుత్రునికి ఆధ్యాత్మికశిక్షణము నిచ్చుటలో గురుదేవుడు చాల అక్కఱ కలిగి యుండెను. రాఖాలులో చిన్నతప్పు కనిపించినను అతనిని చీవాట్లు పెట్టుటకు గురుదేవుడు వెనుదీయడు. ఒకనాడు తన ఎదుటికి వచ్చిన రాఖాలును "నీమోము నల్లబడి యున్నదేమి? ఏమేని తప్పు చేసితివా" అని గురుదేవు డడిగెను. రాఖాలు విస్మయముతో మిణకరించెను. తానొకతప్పుచేసినట్లు అతనికి జ్ఞప్తి లేదు. కాని ఆలోచించిచూడగా వేడుకకై తానొక అసత్యము చెప్పియుండుట అతనిజ్ఞప్తికివచ్చెను. వేడుకకైనను సరే అసత్యము చెప్పరా దని గురుదేవు డతనిని హెచ్చరించెను.

ఒకనాడుగురుదేవుడు రాఖాలును వెంటనిడుకొని ఏదో యొక ఉత్సవమున పాల్గొననేగెను. ఆ ఉత్సవమున కాహ్వానము గురుదేవునకు వచ్చి ఉండెను. కాని పోయి చూడగ ఆఉత్సవ నిర్వాహకులు సంపన్నులను, వ్యపదిష్టులను, విచారించుకొనుచుండిరే కాని గురుదేవుని అంతగా లక్ష్యపెట్టలేదు. నిజముగ ఈ అవమానమునకు బాలుడైన రాఖాలు సహింపలేక పోయెను. ముంగోపియైన బాలునివలె అతడు "తత్క్షణమే ఇటనుండి వెడలిపోవుదము" అని గురుదేవునితో అనెను. కాని గురుదేవుడు ఎంతయవమానమునకైనను ఓర్చుకొనుచునే యుండెను. రాఖాలు చెప్పినమాటను వినలేదు. "కోపించి ఇచటనుండి మనము వెడలిపోయితిమేని భక్తులకు చెఱుపు కలుగును." అని తరువాత గురుదేవుడు రాఖాలుకు చెప్పెను. గురుదేవుని చిన్నచిన్నపనులలో సైతము నిగూఢముగ నుండు నర్థమును రాఖాలు గుర్తించెను. ఇందుండి తాను 'వినయ' 'గర్వత్యాగ' పాఠములను నేర్చుకొనెను.

శ్రీరామకృష్ణుడు ఒక్కొక్కప్పుడు ఆధ్యాత్మికదశలోనుండి ప్రియశిష్యులకు వారు నిరీక్షింపకే ఎంతెంతో అనుగ్రహములు చేయుచుండెను. కాళిగుడి కెదుట రాఖాలు ఒకప్పుడు ధ్యాననిమగ్నుడై ఉండగ గురుదేవు డచటికి వచ్చి ధ్యానాసనాసీనుడైన రాఖాలును చూచి హెచ్చరించుకొని "నీకు మంత్రము ఇది, నీ కిష్టమైన లక్ష్య మిది" అని చెప్పెను. రాఖాలు తలయెత్తి చూడగనే అతనికి ఇష్టదేవతా సాక్షాత్కారము కలిగెను. తాను నిరీక్షింపకే తనకు లభించిన ఈ భాగ్యమునకు అతడు ఆనందపరవశు డయ్యెను.

రాఖాలు దక్షిణేశ్వరమున గురుదేవునితో కూడి ఉన్న కొలదియు అతని పారమార్థికజీవితమున పురోగతి వేగముగ సాగజొచ్చెను. ధ్యాననిమగ్నుడై వెలుపలి లోకస్మృతి బొత్తిగ లేకున్న రాఖాలునొద్దకు గురుదేవుడు వచ్చి అతనిని మామూలు వ్యావహారికరంగమునకు మరలించుటకు తోడ్పడిన సందర్భములు పెక్కులు. ఆధ్యాత్మికముగ రాఖాలులో కనవచ్చుచుండిన అభివృద్ధిని గుర్తించి గురుదేవుడు చాల సంతోషించి ఒక్కొక్కప్పుడు ప్రకటముగ ప్రశంసించుచునే ఉండెను. రాఖాలు యోగదశలో సదా భగవత్సంశ్లేషమును అనుభవించుచునే ఉండును. రాత్రింబగళ్ళు అతడు నామమంత్రమును జపించుచుండును. అతని అంతరనుభవములను కదులుచున్న అతని పెదవులు సూచించుచుండును. దానిని చూచినంత మాత్రముచేతనే గురుదేవుడు అప్పుడప్పుడు భావోద్రేకపరవశు డగుచుండెను. అంతటి అర్హుడైన శిష్యుడు లభించినందులకు ఆనందము పొంగి పొర్లుచుండగా శ్రీరామకృష్ణుడు అతనికి యోగరహస్యములను సాధనవివిధరూపములను బోధింప సాగెను. ఇట్టి విషయములలో బహిరంగప్రకటనము రాఖాలునకు గిట్టదు. సాధనలను అతడు సాధ్యమైనంతరహస్యముగ చేయుచుండును. అయినను అతనిరూపమును, ఆలోచించు, ప్రవర్తించు పద్ధతులును, అతని ప్రకృతిలోనుండి వెలువడు మాధుర్యమును — అతని లోపల గూఢముగ సాగిపోవుచున్న పరిణామమును సూచించుచుండును.

ఆధ్యాత్మికజీవితము ఒడుదొడుకులు లేని ప్రయాణము కాదు. దానిలో సైతము మిట్టపల్లములు గలవు. రాఖాలు సైతము చిక్కుల నెన్నింటినో దాటవలసివచ్చెను. ఒక దినము రాఖాలు కాళిగుడి సంగీతశాలలో ధ్యానింప కూర్చుండెను. కాని ఎంతప్రయత్నించినను మనసునకు నిలుకడ కుదురలేదు. అతనికి చిరాకు కలిగినది. అతని మనసులో తనపై వెగటును, అనుతాపమును నిండినవి. గురుదేవు సంతటి యోగీంద్రుని దీవనలు తాను బడసి పరిసరములందు సమస్తమును ఆధ్యాత్మికపురోగతికి అనుకూలముగ నున్నను తన మనస్సు అస్థితిలో నున్నది! ఆధ్యాత్మికజీవితమున కే తన కర్హత లేదేమో. అట్టితలంపుల లుపాను ఆయనను పైకొన్నది. కేవలము విసుగెత్తి మనోవ్యథతో అతడు తన ధ్యానపీఠమునుండి లేచిపోయెను. యాదృచ్ఛికముగ శ్రీరామకృష్ణుడు అపుడు ఆదారినే పోవుచుండెను. రాఖాలును చూచి "ఇంచుకసేపటికే పీఠము నుండి లేచితి వేల?" అని అడిగెను. రాఖాలు ఏమియు దాచుకోక తన మనోభావములను వివరించెను. వెంటనే గురుదేవుని మోముతీరు గంభీర మయ్యెను. కొంచెముసేపు ఆలోచించి ఆయన రాఖాలును నోరు తెరవు మనెను. నోటితో అస్పష్టముగ నేమో పలుకుచు గురు

దేవుడు అతని నాలుకపై ఏమో వ్రాసెను. తత్‌క్షణమే రాఖాలు మనోభారము పూర్తిగ దిగిపోయెను. అతడు తేలికపడెను. అతని మనసు గుండ అంతర్వాహినిగ ఆనందము ప్రవహించినది. గురుదేవుడు చిఱునవ్వునవ్వి "ధ్యానింప మరల ప్రయత్నించి చూడుము." అనెను.

దక్షిణేశ్వరమున గురుదేవుని సన్నిధిలో రాఖాలునకు దినములు ఆనందముగ గడిచిపోవుచుండెను. కాని కష్టము సంభవించెను. అతనికి మాటిమాటికిని జ్వరము తగులసాగెను. అది గురుదేవుని చాల ఆందోళనపఱచెను. అప్పుడు బలరామబోసు అను గొప్ప భక్తుడు బృందావనమునకు పోబోవుచుండెను. వాతావరణమున నించుక మార్పుండనిమ్మను తలంపుతో రాఖాలుగూడ అచ్చటికి పంపబడెను. కాని అచ్చటకూడ రాఖాలునకు జబ్బువచ్చుచునే ఉండెను. గురుదేవుని ఆందోళనము మఱింత హెచ్చెను. ఏలయన పూర్వజన్మమున రాఖాలు శ్రీకృష్ణుని సహచరులలో నొకడుగ ఉండెనని గురుదేవుడు ఒకదివ్యదర్శనము గుండ తెలిసికొనెను. రాఖాలునకు పూర్వజన్మస్మరణము కలుగునేని దేహపతనము సంభవించునేమో అని గురుదేవుడు దిగులుపడెను, తనపారమార్థికపుత్రునికై శ్రీరామకృష్ణుడు దీనాతిదీనముగ లోకజననిని ప్రార్థించెను. ఆమె మాట ఇచ్చువఱకు ఆయనకు నిబ్బరము కలుగలేదు. మూడునెలలకు ఆరోగ్యము చాలవఱకు బాగై రాఖాలు దక్షిణేశ్వరమునకు మరలి వచ్చెను. గురుదేవుడు అపరిమితానందముతో అతనిని ఆదరించెను.

గురుదేవునివ్యక్తిమహిమచే ఆకృష్టులగుచుండిన భక్తులయు, యువశిష్యులయు సంఖ్య తిరుగుమొగము లేక పెరుగుచునే ఉండెను. యువశిష్యులలో కొందఱు రాఖాలునకు పూర్వపరిచితులును మిత్రులును. కావున వారును తానును ఒక్కగురువునకే శిష్యులైన చుట్టఱికము అతనికి సంతోషకరముగ ఉండెను. కాని గురుదేవుని తోడి పవిత్రసమాగమమును చిరకాల మనుభవించుప్రాప్తి వారికి లేదాయెను. ఏలయన శ్రీరామకృష్ణుడు కంఠబాధతో వ్యాధిగ్రస్తుడయ్యెను. అది మహావ్రణము (కాన్సరు)గ పరిణమించెను. ఆయనను మేలైన వైద్యవసతులకై మొదట కల్కత్తాలోని శ్యాంపుకూరునకును తరువాత అచటినుండి కాశీపూరునకును మార్చిరి. నరేంద్రనాథుని నాయకత్వమున రాఖాలు ప్రభృతులు గురుదేవుని ఉపచారమందే తమ హృదయములను తమ ఆత్మలను నిమగ్నములుగ చేసికొనిరి. గురుసేవయు ఆధ్యాత్మికసాధనలును చాలచుఱుకుగ సాగిన దినములవి. రాఖాలు సహజముగనే లోచూపు గలవాడు. ఇప్పుడు మఱింతగంభీరుడుగను చింతనాపరుడుగను అయ్యెను. ఒకనాడు గురుదేవుడు నరేంద్రునితో ఏకాంతమున "రాఖాలునకు విశాల రాజ్యము నేలు ప్రతిభ ఉన్నది" అని చెప్పెను. ఆమాటకర్థము నరేంద్రుడు గ్రహించెను.

సమయము వచ్చినపుడు రాఖాలునుగూర్చిన గురుదేవుని ఈ అభిప్రాయమును నరేంద్రుడు ఉపయోగపఱచుకొనెను. గురుదేవునొద్ద అంతటి ప్రేమను ప్రశంసను చూఱగొన్నవాడని రాఖాలునందు యువశిష్యుల కందఱికిని అత్యంతగౌరవ మేర్పడినది. ఒకనాడు నరేంద్రుడు "ఇప్పటినుండి మనము రాఖాలును రాజని వ్యవహరింతము" అని సోదరశిష్యులతో చెప్పెను. అందఱును అందులకు హృదయపూర్వకముగ సమ్మతించిరి. ఈ వార్త

గురుదేవున కందగనే ఆయనయు ''నిజముగ నది రాఖాలునకు అనురూపమైన పేరే'' అనెను.

గురుదేవునకు వ్యాధి నయమగునను ఆసపాటునకు అవకాశము లేకున్నను శిష్యులు ఆసపాటు కలిగియే యుండిరి. కాని ఆయన శరీరస్థితి నానాటికి క్షీణిక ట్రగుచుండెను. ఒకనాడు రాఖాలు వ్యథచెంది ''ఆరోగ్యముని మ్మని లోకజననిని ప్రార్థింపుడు'' అని గురుదేవుని అడిగెను. దేవునిసంకల్పమునకు విరుద్ధముగ దేనినైనను ప్రార్థించుట గురుదేవునకు అసాధ్యము. తన ఆరోగ్యమునుగూర్చి ప్రార్థించుట మీదు మిక్కిలి అసాధ్యము ''అది దేవుని చేతిలో ఉన్నది'' అని మాత్రమే ఆయన జవాబు చెప్పెను. ఔను, మానవులెంతప్రయత్నించినను తుదకు దేవుని సంకల్పమే నెగ్గినది. ఎంతోమేలైన వైద్యమును, వైద్యుల అవేక్షణమును ఉన్నను గురుదేవుని వ్యాధి హెచ్చుచునే ఉండెను. 1886 సంవత్సరము ఆగస్టు నెల 16-వ తేది ఆయన మహాసమాధి నొందెను.

(సశేషము)

# యతి కేసరి

## శ్రీ గణపతిగారు

'తై పిఱన్దాల్ వళి పిఱక్కుమ్' 'మకర మాసము పుట్టిన మార్గ మేర్పడును' అను సామెత వంగదేశములో వాడుకలో ఉన్నదో లేదో కాని ఆ కలకత్తా న్యాయవాది విశ్వనాథ దత్తగారికిని, ఆయన సహధర్మిణి భువనేశ్వరికిని సరిగ నూ ండ్లకు మునుపు మకరమాసమున ''మార్గ మేర్పడినది''. అదియు మోక్షమునకు పోవు మార్గముగను ఏర్పడినది. పున్నామనరకమునుండి తరింప చేయు పుత్రుడు ఆ దినము వారికి పుట్టినాడు. వారినిమాత్రమే కాక మానవలోకమంతటను ఎంద ఱెందఱినో నరకమునుండి తప్పించి మోక్షమునకు చేర్చు మార్గముగ అత డేర్పడ నున్నాడు. సూర్యునకు ప్రియమైన మకరసంక్రాంతినాడు అవతరించిన వంగశిశువు విశ్వమంతటను వెలుగును వ్యాపింపచేయు సూర్యుడుగా ప్రకాశిం నున్నాడు.

సదా తుంటరిచేష్టలు చేయు నరేంద్రుని విషయమును చెప్పుటకు మాటలు చాలవు.

''బిడ్డ నిమ్మని ఈశ్వరుని వరము కోరితిని. ఆయన తన యొద్ద నున్న భూతములలో నొకదానిని కదా పంపినాడు'' అని భువనేశ్వరీదేవి విసుగుకొనునంతగా నుండెడివి అతని లీలలు. ఐనను చాలమంచిపిల్లవాడుగ అమ్మచెంత కూర్చుండి శ్రద్ధగ రామాయణకథను విననారంభించినాడు నరేంద్రుడు. విడనాడివ కొడు

వయు వచ్చి తాకినది. పసిపిల్లవాడు సీతా రాముల విగ్రహము లుంచుకొని ఆరాధింప సాగినాడు.

అప్పుడే ఒకదినము వారింటిబండివాడు గృహస్థాశ్రమమునందలి చెడుగులను గూర్చి చెప్పుచుండగా విన్నాడు.

ఆ లేతహృదయములో వెంటనే ఒకసందేహమును దానితోబాటు దుర్భరదుఃఖమును కలిగినవి. "ఆలాగా? పెండ్లి తప్పా? తప్పైనచో రాముడు ఏల సీతను పెండ్లియాడెను?"

అమ్మయొద్దకు పోయి 'హో' యని ఏడ్చినాడు నరేంద్రుడు. "తప్పుచేసిన రాముని నాకు దేవునిగా చూపితివే" అని నిందించినాడు.

బాలుని మనస్సును ఆ పావనురాలు అర్థము చేసికొన్నది.

"అబ్బాయి, ఏడవకు. పెండ్లిపేరంటములు అక్కఱలేని కాశీనాథుడు మనకు ఉండనే యున్నాడు కదా! సర్వస్వమును త్యజించిన త్యాగరాజు ఆయన. ఆయననే దేవునిగా ఉంచుకో" అన్నది.

ఈ మొలక తర్వాత నాటై చెట్టుగా ఎదిగి మహావృక్షముగ పెంపొంద నున్నది. "త్యాగము, సన్న్యాసము, ప్రజలకై తన సర్వస్వము త్యజించుట, పరమునకై యిహమును త్యజించుట" ఇదే నరేంద్రుని జీవితము కానున్నది. శివభక్తుడైన నరేంద్రుడు సమరసజ్ఞానమును పొందిన పిదప రాముడు మరల ఆయనడెందమున ప్రవేశించినాడు. ప్రత్యక్షముగ ఎంతో రామానుగ్రహమును బడసినాడు.

నరేంద్రుని ప్రతిమాటలోను ఒక క్రొత్తదన ముండును. విషయముపాటుకు విషయము. పాఠము వినునప్పుడు నోరు తెఱవడు. కన్నులను సైతము తెఱచుటలేదు. కావుననే ఉపాధ్యాయునికి సందేహము కలిగినది. ఆయన "ఈ నిద్ర ఏమిటోయి" అని అదల్చినాడు.

"నిద్రపోలేదే" అన్నాడు పిల్లవాడు.

"మేలుకొనియే ఉంటివేని ఇంతవఱకు నేను ఏమి చెప్పుచుంటినో చెప్పుము" అన్నాడు ఉపాధ్యాయుడు.

అంతే! ఆయన గంటసేపుగా చెప్పుచుండిన దాని నెల్ల చీమతలకాయంతైన విడువక గడగడ అప్పగించివేసినాడు నరేంద్రుడు.

నరేంద్రుని నిద్రలోకూడ ఒకవింత! అతడు శయనింపగనే ఒకమహాజ్యోతి అతనిని సమీపించును. అందులో మెల్లమెల్లగ అతడు కరగి స్మృతిలేనివాడగును. చాలకాలమువఱకు ఇతరులు నిద్రపోవువిధము వేఱు, తన నిద్రతీరు వేఱు అను విషయము నరేంద్రునకు తెలియకనే ఉండినది.

నరేంద్రుడు హైస్కూలులో చదువుచున్నప్పుడు మధ్య రెండేండ్లకాలము రాయ్‌పూరులో వారికుటుంబము వసింపవలసి వచ్చినది. అతని చదువునకు విఘ్నము కలిగినది. తరువాత అతడు న్యాయముగ చదువవలసిన తరగతిలోనే* చేరి మూడేండ్లచదువును ఒక్కసంవత్సరములోనే చదివి ఉత్తీర్ణుడై పాఠశాలకే ఖ్యాతి తెచ్చినాడు.

చదువులోమాత్రమే కాదు, సకలకళలలోను గొప్పగా ప్రకాశించినాడు నరేంద్రుడు. సహజముగనే అతనికి ఉన్న మధురకంఠముతో

---

* పైతరగతిలోనే.

అతడు సంగీతములో తన నేర్పును చూపినప్పుడు విద్యార్థు లందఱును పరవశు లగుదురు. బడి నాటకాలలో అతని నటనాసామర్థ్యమును ప్రకట మైనది. నరేంద్రుని పల్కులు అందఱిని వశపఱచుకొనునవి, విద్యార్థిదశలోనే అతడు సంభాషణలో సైతము చక్రవర్తిగా నుండినాడు.

పాకకళలోగూడ మహామేధావి నరేంద్రుడు. దేహమును ద్రఢిష్ఠముగ ఉంచుకొనుటలో అతనికి సాటి ఎవ్వరును లేరు. కుస్తీ, సాము, గుఱ్ఱపుసవారి—అన్నిటిలోను సమర్థుడుగనుండినాడు అతడు. "యువకులు శరీరమును సుస్థితిలో పెట్టుకొనియుండవలెను. శరీరానారోగ్యము మనస్సును చెఱచుటకు అవకాశమిచ్చు నట్టివారు మే లొందనే లేరు" అని నరేంద్రుడు సదా నొక్కి చెప్పుచుండును: "భగవద్గీతపఠనముకంటె ఫుట్ బాల్ ఆట మిమ్ము మోక్షమునకు ఎక్కువ అమోఘముగ చేర్చును" అని అనంతరకాలమున చెప్పినవాడుకదా ఆయన.

రాజవంశములో పుట్టి రాజభోగములోనే పెరుగుచువచ్చిన నరేంద్రుని సుఖజీవనము తటాలున అంధకారబంధుర మైనది.

అప్పుడు "లా" చదువుచుండినాడు నరేంద్రుడు. ఒకసెలవుదినము అత డొక మిత్రునితో ఇంట ప్రొద్దుపుచ్చుచున్నప్పుడు పిడుగుపడ్డట్లుగా వచ్చినది వార్త. 'తండ్రి విశ్వనాథదత్త తటాలున మరణించినాడు' అని.

కుటుంబభారము నరేంద్రుని తలపై బడినది. వట్టి ఓదార్చు భారము మాత్రము కా దది. ఆపూటకు అన్నము సంపాదించుకోవలసిన బాధ్యత కలిగినది. పెద్దహోదాలో నుండిన విశ్వనాథదత్త ఆస్తిపాస్తు లేమియు ఏర్పఱుపకే మరణించినాడు. ఆధ్యాత్మికస్వాతంత్ర్యము వెలయింప తాను అన్వేషించి నిల్పిన ఆస్తి యగు నరేంద్రుడు తప్ప, కుటుంబమునకు ఆయన ఏమియు పెట్టిపోలేదు. అందుచేతనే నరేంద్రుడు భారతదేశమునకు ఆస్తిగానైనా డేమో. తిండినిగూర్చిన విచారము హెచ్చినప్పుడే కదా ఆత్మవిచారము కలుగునది?

ఈ దినాలలో నరేంద్రుడు పాదచారిగనే కాలేజికి పోవుచుండెను. ఎండకుగాని వానకుగాని గొడుగు లేదు. కాళ్లకు చెప్పులు కడుపుకు చాలిన అన్నము లేదు. ఆత్మగౌరవము కలవాడు కావున మిత్రులు పిలిచినను వారియిండ్లలో భుజింపడు. కాని బుద్ధిపూర్వకముగనే ఆలస్యముగ ఇంటికి వచ్చి తాను వెలుపల భుజించివచ్చితి నని అమ్మతో చెప్పును. చాలియు చాలనంతగా ఆమె వండియున్న అన్నమును ఆమెయే భుజించునట్లు చేయును.

ఆయన ఉల్లము వేఱేవో ఒక ఆహారమును వెదకి వెదకి తపించినది. అవును. అపారమైన పుణ్యమును చేసి కూడబెట్టుకొనియుండువారికే ఏర్పడదగిన జ్ఞానక్షుధ నరేంద్రునకు కలిగినది. ఆ ఆకలిని తీర్చు అమృతము భారతీయసంస్కృతిలోను, మతములోను, గ్రంథములందును ఉన్నది అని మాత్రము ఆయన బుద్ధి అప్పుడు ఒప్పుకోలేదు. పాశ్చాత్యవిద్యచేత, ప్రతిదానిని నమ్మి తలదాల్పక పరిశీలించి చూడ దొడంగినాడు నరేంద్రుడు. ప్రాచ్యపాశ్చాత్యమతతత్త్వములు రెండును కలిసిన బ్రాహ్మసమాజమందు చేరినాడు, చేరినను అతని మనసులోని కొదువ తీఱలేదు. అతడు అన్వేషించి పరిశ్రమించినది పరతత్త్వమునకై. కాని ఆ పరతత్త్వమును కన్నార గాంచి దాని స్వరూపమును చెప్పగలవారు ఒక్కరైనను లేనందున, పరతత్త్వమొకటి ఉన్న దని నమ్ముటకైనను శక్యము

కాలేదు. "దేవుని మీరు చూచియున్నారా? చూచియున్నారా?" అని వేదాంతము ప్రసంగించువారి నెల్ల—ఆరాధన చేయువారి నెల్ల అడిగి చూచినాడు అతడు. దేవుని ప్రత్యక్షముగ చూచినవారు ఒకరైనను నరేంద్రునకు అగపడరైరి.

అతని పరితాపమును చూచుచుండిన ఒక ఆప్తుడు చెప్పినాడు. "నాయనా, దక్షిణేశ్వరమున శ్రీ కాళీమాతను ఆరాధించుచున్నాడు ఒకమహాత్ముడు. నీ ప్రశ్నకు బదులు ఆయన చెప్పగలడు" అని.

కల్కత్తాకు చాల సమీపముననే ఉన్న దక్షిణేశ్వరమునకు బయలుదేఱినాడు నరేంద్రుడు. 1880-వ సంవత్సరము నొవెంబరు నెలలో ఇది జరిగినది. భారతదేశచరిత్రములో సువర్ణాక్షరములతో వ్రాసిపెట్టవలసిన దినమది.

భారతదేశపు ఆధ్యాత్మికజ్ఞానమును, పాశ్చాత్యుల శాస్త్రవిజ్ఞానమును సంధించిన దినము అది. పాశ్చాత్యదేశపు మోహమును, విజ్ఞానపరిశోధనయు పొంగి వచ్చినపుడు వానిని పురాతనభారతదేశపు సూక్ష్మతిచేతను, ఆధ్యాత్మిక జ్ఞానముచేతను నిర్జించి చూపుటకొఱకే సంభవించినవాడగు పరమహంస శ్రీరామకృష్ణుని అవతారలక్ష్యము ఫలించిన దినము అది.

దక్షిణేశ్వరమున దేవిని ఉపాసించుచున్న పరమహంస సన్నిధానమునకు వచ్చి చేరినాడు నరేంద్రుడు. ఇతనిని చూచిన వెంటనే పరమహంస పరవశుడైనాడు. "ఎన్నాళ్లు నీకై వేచియుందును. రమ్ము, రమ్ము" అని చేరదీసినాడు.

అవును. జీవాత్మ ఈశ్వరుని వంకకు ఒక్క అడుగుపెట్టినను ఆ పరమాత్మ పదిఅడుగులు ముందుకు వచ్చి ఇతని ననుగ్రహించు నని కదా చెప్పుదురు.

అందఱిని అడిగిన ప్రశ్ననే పరమహంసను కూడ అడిగినాడు నరేంద్రుడు.

"మీరు దేవుని చూచియున్నారా?"

గురుదేవుడు అందఱు చెప్పిన జవాబును చెప్పలేదు. చిఱునవ్వుతో "చూచియున్నానోయి చూచియున్నాను కాని ఇదిగో నిన్ను చూచుచున్నానే అట్లు కాదు. అంతకన్న స్పష్టముగా తీవ్రదృష్టితో చూచియున్నాను. దేవునితో మాటాడియున్నాను. వత్సా, కాని నీతో ఇదిగో మాటాడుచున్నానే అట్లు కాదు. ఇంకను సన్నిహితముగ మాటాడియున్నాను" అన్నాడు.

"నీవు దేవుని చూడవలయునా? ఆయనతో మాటాడవలయునా? చూపుదును, మాటాడింతును" అని ఆరంభించినాడు ఆ కృపానిధి.

నరేంద్రుని దేహము గగుర్పాటుచెందినది. హృదయము వికసించినది. మనస్సు ఉప్పొంగినది. జ్ఞాన ముదయించినది. ఈ యన్నింటికంటె పైగా ఆత్మ ఆత్మ అని దేనినో చెప్పుచుండే దాని పిలుపు అతనికి వినబడినది. కాని ఆ పిలుపును అప్పుడే అతడు తలదాల్ప లేదు. పొంగిన జ్ఞానము మరల క్రుంగినది. లేనిపోని సందేహము లన్నిటిని లేపుకొన్నది. "ఈ మాయకు లోబడకూడదు. చక్కగా పరీక్షించి చూచిన పిమ్మటనే పరమహంసను అంగీకరింపవలెను" అని ఆయన బుద్ధి చెప్పినది.

అదియా మాయ? మాయ నంతటిని మాయించు మహాకరుణ గదా అది?

ఆ కరుణ తానే చెప్పినది. "అబ్బాయి, ప్రతినాణెమును చెల్లునా చెల్లదా అని పరీక్షించి పరీక్షించి పైకమును తీసికొనునట్లు నన్ను

ఒక్కొక్క విషయమునను పరీక్షించి చూచియే, ఎట్లు చేయదగునో అట్లు చేయుము'' అన్నాడు గురుమహారాజు.

కాని ఎవరిని ఎవరు ఎట్లు పరీక్షించుట? ఆ పరమహంసయే చెప్పినట్లుగ కడలిలోతును ఉప్పుబొమ్మ శోధించి తెలిసికోగలదా! ఆ జ్ఞానము నెదుట, భక్తి కెదుట, శీలమున కెదుట, దయ కెదుట, సూక్ష్మత కెదుట, నరేంద్రుని వాదప్రతివాదము లన్నియు తమంతట నుగ్గైనవి.

ఈశ్వరుని సదా ఆరాధించుటచే పావనమైన చేయి ఈశ్వరునికంటెను మేలైనది అని వేదము చెప్పుచున్నది కదా! అట్టి తన శ్రీహస్తమును ఒక్కసారి నరేంద్రుని వక్షమున నుంచినాడు శ్రీరామకృష్ణుడు. అంతే. శ్రీరామకృష్ణుడును కాళిగుడియు దక్షిణేశ్వరమును బాహ్యలోకమును బాహ్యలోకప్రజ్ఞయు అన్నియు మాయమై పోయినవి నరేంద్రునకు. తన్ను గూర్చిన తెలివిని సైతము అతడు కోల్పోయినాడు. దృశ్యజగత్తున కెల్ల ఏది మూలకారణమో అందులో కరగిపోయినాడు. పల్కుపల్కులకెల్ల ఏది ఆధారమో అందులో కలిసిపోయినాడు. ఆ యానందానుభవమును పోలిన జ్ఞానము వేఱొకటి యున్నదా? దేవుని చూచినవారిని చూచుటతోను వారితో మాటాడుటతోను ఆగ లేదు. ఈ దినము నరేంద్రుడే బ్రహ్మమును సాక్షాత్కరించుకొని అయినది. దేవునితో మాటాడి అయినది. నరేంద్రుడు వివేకానందుడుగ రూపొందినాడు.

తర్కజ్ఞానముచేత ఆధ్యాత్మికవిషయమును తర్కించి చూచిన ఇతడు ఇప్పుడు ఆత్మను అనాత్మనుండి వేఱుపఱచి తెలిసికొను వివేకమును బడసి అందులోనే ఆనందించు వివేకానందుడుగ అయినాడు. భువనేశ్వరికి పుత్రుడుగ నుండిన ఇతడు నిజముగనే సకలభువనముల కీశ్వరి యైన పరాశక్తికి పుత్రు డైనాడు.

సమాధిదశలోనే సదా తా నుండునట్లు చేయు మని శిష్యుడు గురువును ప్రార్థించినాడు.

''లేదు వత్సా, నీ వందుకై పుట్టలేదు'' అన్నాడు గురుదేవుడు.

''నీ మోక్షమును మాత్రము వెదకుకొనుట స్వార్థపరత యగును. నీవు ఈ జగమున కల పెక్కుదేశాల ప్రజలకందఱికిని మోక్షమును సంపాదించు దారిని ఉపదేశించుటకు పుట్టినవాడవు. నీ పని ముగిసిన పిమ్మట నీవు ఈ ఆనందదశను పొందుదువు. అంతవఱకు దీని ద్వారము మూసిపెట్టబడియుండును. దీని తాళపుచెవి నాచేత నుండును'' అన్నాడు.

తాను దేహమును త్యజించుటకు ముందు ''అబ్బాయి, నా సర్వతపఃఫలమును నీ కిచ్చి వేసితిని, దానిని గొని ఈ జగమునం దంతటను ఆత్మికజ్ఞానమును స్థిరపఱుపుము. మన స్ఫూర్తిగ ఈ మహాబాధ్యతను నెఱవేర్తువుగాక'' అని వాక్రుచ్చినాడు.

శ్రీరామకృష్ణపరమ మహాసమాధి నొందినపిదప ఆయన ఆదేశించిన కార్యనిర్వహణమునకే తన్ను అర్పించుకొన్నాడు వివేకానందుడు. సన్న్యాసుల సంఘమును విచ్ఛిన్నము కానీయక చూచుకొన్నాడు. ధర్మప్రచారము కొఱకే జీవితమును వ్యయింప క్రొత్తక్రొత్త సన్న్యాసులను బరానగర మను చోటికి తెచ్చి చేర్చినాడు. పెక్కువిధములుగ గలిగిన ప్రతి ఘటనలను లక్ష్యపెట్టక వారు ఆనందముగ కాలమును గడపుచు వచ్చిరి.

ప్రపంచ మంతట సంచరించి గురుదేవుని ఆజ్ఞను నెఱవేర్పవలె నను ఆత్రము వివేకానందునికి నానాటికి హెచ్చసాగెను. తుదకు 1891-వ సంవత్సరమున బయలుదేఱినాడు. దండకమండలుధారియగు పరివ్రాజకుడుగ. చేత దమ్మిడీ ఉండకూడదు. ఆహారమును వెదకుచు పోకూడదు. చాల దూరప్రయాణమైననే తప్ప పాదచారిగనే పోవలెను అను తీర్మానములతో బయలుదేఱినాడు.

హిమాలయపర్వతములనుండి కన్యాకుమారి వఱకు దిగ్విజయముచేసి పురాతనవేదాంత విజయధ్వజమును నాటినాడు వివేకానంద స్వామి. అనాదికాలమునుండి భారతీయుల మనస్సులో స్థిరపడియుండునది ఆధ్యాత్మికజ్ఞానమే. రాజకీయార్థికవిషయములు కావు, కావున ఆ యాధ్యాత్మికవిశ్వాసము మూలముననే విదేశీయుల త్రొక్కిళ్ళకు లోనై ఆత్మను కోల్పోయిన భారతదేశమును సంజీవనము చేయ శక్య మగు నని ఆయన అభిప్రాయము. దేశ మంతట సంచరించినందువలన సకలప్రజల ఆర్థిక మనఃపరిస్థితులు ఆయనకు తెలిసినవి. భారతదేశపు మునుపటి ఇప్పటి పరిస్థితులను చక్కగ నెఱిగి ఆ జ్ఞానమునకు మూర్తీభావమైనాడు. తానే తన్ను సంక్షిప్తభారతము అని చెప్పుకొన్నాడు. ఈ అనుభవజ్ఞానము కలిగి యున్నందుననే ఆయన దారిద్ర్యదేహబాధలను తొలగించిన పిమ్మటనే ఆధ్యాత్మికజ్ఞానమును ప్రజలకు బోధించిన వారు గ్రహింప గలిగి యుందురు అని తెలిసికొన్నాడు. పిఱికితనమును దులిపివేసి పౌరుషమును వహింపచేయుటయే ప్రజలకు ఒసంగవలసిన తారకమంత్ర మని ఘోషించినాడు. సత్త్వగుణపరిపూర్ణుడైన వివేకానందుడు. ''ఉద్వేగము నిండిన రాజసమే నేటి భారతదేశమునకు జరూరు'' అని చాటినాడు. తానే వేదాంతులలో నొక కేసరిగ, కర్మయోగిగ ప్రకాశించినాడు.

స్వామిజి మేధాశక్తియు దాని నాయన ప్రకటించిన వాక్చాతుర్యమును పోయినచోట నెల్ల ఆయనకు ప్రజాదరమును సంపాదించిపెట్టినవి. భారతసంస్కృతి మరల పేర్మి గాంచినది. పాశ్చాత్యనాగరికతావ్యామోహము మెల్ల మెల్లగ తలత్రాల్ప దొడగినది. ఈయన అవతారలక్ష్య మిదే.

అమెరికాలో [illegible] హాసభ యొకటి సమావేశము కాబోవుచుండినది. భారతదేశ ప్రతినిధిగా వివేకానందస్వామి ఆ సభలో పాల్గొనవలె నను నభిప్రాయమును మొదట సూచించినవారు అప్పటి మైసూరుమహారాజా గారు. ప్రయాణమునకు కావలసిన సాహాయ్యమును చేయుటకు ముందడుగుపెట్టినవారు రామనాథపురరాజుగారగు శ్రీ భాస్కర సేతుపతి, వేయేల తమిళదేశము మొత్తముగనే ఈ పుణ్యసేవాకార్యభారమును మున్ముందు వహించినది.

ఈ సమయములోనే ఒకనాడు పరమహంస శ్రీరామకృష్ణుడు ప్రసన్నుడై ''నా వెంట రమ్ము'' అని సైగచేసి సముద్రమున నడచుచు పోయి అంతర్ధానమైనట్లు వివేకానందునకు ఒక దృశ్య మగపడినది. గురుదేవుని అనుమతి లభించె నన్న మాట. బయలుదేఱ సిద్ధపడినాడు వివేకానందుడు.

1893-వ సంవత్సరము మే నెల 31-వ తేదీ బొంబాయినుండి బయలుదేఱిన ''పెనిన్సులర్'' అను నావలో శ్రీ వివేకానందస్వామియు ఒక ప్రయాణికుడు.

విశ్వమతమహాసభ జరిగిన చికాగోనగరమున స్వామిజీకి పెక్కు విఘ్నములు కలిగినవి.

ఇక్కట్టులలో చిక్కుపఱచి, భక్తుల మనఃశక్తిని శోధించిన పిమ్మటనే తోడ్పడుట భగవంతుని లీల కదా. ఆ శోధనలం దెల్ల నెగ్గినాడు స్వామిజి.

చికాగోలో కొలంబియను హాలులో 1893-వ సంవత్సరము సెప్టెంబరు 11-వ తేదీ మహాసభ ప్రారంభ మైనది. ప్రముఖులు పెక్కండ్రు ఉపన్యసించినారు. స్వామిజికిని వంతు వచ్చినది. అంబికను ఆమెకంటె వేఱు కాని గురుదేవుని ధ్యానించి, ఉపన్యాసమును ఆరంభించినాడు వివేకానందస్వామి. వాక్కులును భావములును వెల్లువగ ప్రవహించినవి.

పాశ్చాత్యులు పరిహసించు విగ్రహారాధనము మొదలుకొని అద్వైతతత్త్వమువఱకు హిందూసిద్ధాంతమును వివరించి ఉపన్యసించినాడు.

ఒక్కదినములో వివేకానందుని పేర్మి అమెరికాఖండమంతటను వ్యాపించినది. ప్రజలు ఆయన ఉపన్యాసములు వినుటకును, ఆయనకు ఉపచారములు చేయుటకును నేను ముందు నేను ముందు అని పోటీలు వేసికొనిరి. తనకు అమర్పబడిన హంసతూలికాతల్పమును చూచి స్వామి భారతదేశప్రజల దరిద్రదశను స్మరించి స్మరించి ఒకరాత్రియంతయు వెక్కి వెక్కి ఏడ్చినా డట. విచ్చేసి ఉపన్యసింప వలసిన దని పెక్కునగరములనుండి ఆయనకు పిలుపులు వచ్చినవి. ప్రతిచోటను క్రొత్తవిషయమును దేనినిగూర్చి ఉపన్యసింతమా అని స్వామి యోచించును. కాని ప్రతిరాత్రి నిద్రింప పరుండుటకుముందు క్రొత్తక్రొత్తవిషయములను ఎవరో ఎతి తనకు చెప్పుచున్నట్లు ఆయనకు స్పష్టముగ వినవగు చుండెను. అవియే మఱు నాడు ఆయన ఉపన్యాసములో ప్రకాశ మొందును.

అమెరికాలో జయభేరిని మ్రోగించిన పిమ్మట స్వామి ఐరోపాకు పోయినాడు. అచ్చట అనేకశిష్యులను ఏర్పఱచుకొని వారి ద్వారా పరమహంస శ్రీరామకృష్ణుని అనుగ్రహసంపదను ఆ ఖండములో వ్యాపింప చేసినాడు.

1897-వ సంవత్సర ప్రారంభమున స్వామి మాతృదేశమున రామనాథపురసంస్థానములో అడుగుపెట్టినపుడు ఆయన విదేశయాత్రకు మూలకారణముగనుండిన తమిళదేశము మహోత్సాహముతో ఆయనకు స్వాగతము చెప్పినది. తమిళదేశమున ప్రతినగరమందును ఆయనకు స్వాగతాభివందనములు సమర్పితము లైనవి. కుంభకోణమునుండి ఆయన మద్రాసుకు వచ్చుచున్నప్పుడు బండిని ఆపి మరియాద చెల్లించినా రట చిత్తూరువాసులు. మద్రాసు ఎగ్మూరునుండి ఆదినములలో కాసిల్ కర్నన్ అనియు ఇప్పుడు ఐస్హౌసు అనియు వ్యవహరింపబడుచోటికి పోవునప్పుడు టెంకాయలను సమర్పించి కర్పూరహారతుల నిచ్చినవారిసంఖ్యకు మితి లే దట.

ఆ సంవత్సరమునసే మే నెలలో తమ సేవా కార్యముల కెల్ల మణిమకుటము పెట్టినాడు శ్రీ వివేకానందుడు. శ్రీరామకృష్ణమఠము, శ్రీరామకృష్ణమిషను అను రెంటిని స్థాపించినాడు. పారమార్థికసేవను మఠమును సంఘసేవను మిషనును చేయవలె నని ఏర్పాటుచేసినాడు. మహోదారమనస్సుతో ఆయన స్థాపించిన శ్రీరామకృష్ణసంస్థలు ఇప్పుడు లోకమంతట మహోదాత్త సేవాకార్యక్రమములను నిర్వహించుచు వచ్చుచున్నవి.

1899-వ సంవత్సరము మరల పాశ్చాత్య దేశమునకు పోయి పూర్వము తాను ప్రారంభించియుండిన ప్రణాళికలను పూర్తి చేసినాడు శ్రీ వివేకానందుడు. రెండునెలలలోనే ఫ్రెంచి భాషలో సమర్థుడై సర్వమతముల సారమును గుఱించి ప్యారిసులో జరిగిన మహాసభలో మహోపన్యాసము చేసినాడు. మాతృదేశమునకు మరలిన శ్రీ వివేకానందుని దిగ్విజయములు 1901-వ సంవత్సరముతో పూర్తి అయినవి. నలువదిసంవత్సరములైనను నిండ గాంచని స్వామి సన్న్యాసపరాకోటిని అందుకొన్నాడు. కల్కత్తా బేలూరులో నున్న కేంద్రమఠములోనే స్థిమితముగ నుండి బోధనలు ఆత్మసాధనలు చేయుచు కాలము గడపుచుండినాడు. దూరప్రాంతములం దుండిన శిష్యుల నెల్లర రప్పించి ఆశీర్వదించి పంపినాడు. మఠమును నిర్వహింపవలసిన పద్ధతిని చక్కగ ఏర్పఱచి యుంచినాడు. ఎటనుండి వచ్చెనో అచటికి చేరి పోవుటకే ఈ ఏర్పాటు లన్నియు.

1902-వ సంవత్సరము జూలై 4-వ తేదీ ప్రొద్దున స్వామి శ్రీరామకృష్ణుని సన్నిధిలో ఎప్పటికంటె సుదీర్ఘకాలము ధ్యానములో కూర్చుండి యుండెను. పగలువంట తానే వండినాడు. మద్రసములేకాక భగవత్ప్రేమరసమును కలసిన ఆ యన్నమును సొంతచేతితో శిష్యులకు వడ్డించినాడు. వారు చేతులు కడుగుకొనుటకు నీళ్ళను తానే అందిచ్చినాడు.

సాయంపూజకు శిష్యులను మాత్రము పంపి తాను మాత్రము ఏకాంతముగ తన గదికి పోయినాడు. తూర్పుముఖముగ కూర్చుండి ధ్యానని మగ్నుడైనాడు.

మద్రాసు శ్రీరామకృష్ణమఠములో జపము చేయుచుండిన శ్రీరామకృష్ణానందస్వామికి వివేకానందుడు కనిపించి "సోదరా, నేను దేహమును విడిచితిని" అని చెప్పినాడు.

అవును, సరిగా అదే సమయమునకు రాత్రి తొమ్మిదిగంటలకు స్వామి బేలూరులో తన పవిత్రదేహమును పరిత్యజించినాడు. పరమహంస గురుదేవుడు తాళపుచెవితో మోక్షసామ్రాజ్యద్వారమును తెఱవగ అందు ప్రవేశించి బ్రహ్మానందమున ఐక్యమైనాడు శ్రీ వివేకానందుడు.

సనాతన ధర్మమునకు గ్లాని కలిగినప్పుడు అవతరించి దానిని మరల పెంపొందించి తన పాదవిన్యాసముచే అఖండభూమండలమును పవిత్రీకరించి సడిప్రాయముననే జీవితమును ముగించుకొన్న వివేకానందుని తలంచినప్పుడు ఆదిశంకరభగవత్పాదుల పావనస్మృతి కలుగును—

దివిని తనదు కీర్తి దీపింపఁ గాంచిన
యాదిశంకరుండె యవనిమీఁద
జ్ఞాననిలయ మైన మన భారతావని
మరల గాంచ తనదు మదిని గోరి
వచ్చె ననఁగ మించె వరవివేకానంద
మానివరుఁడు విశ్వమాన్యుఁడు సుఁడీ.

(అనువాదము)

అని కదా భారతి పాడినాడు.*

ఆ ఆనందపరంజ్యోతి ఉదయించి ఇప్పటికి నూఱవ సంవత్సరము ప్రారంభమైనది. మన సంసారాంధకారమును తొలగించుకొనుటకు ఆయన కృపాజ్యోతిని ఆశ్రయింతము గాక.

* 'కల్కి' అను తమిళ పత్రికాధిపతుల సౌజన్యముతో. —(సం.)

# ఆస్తిక్యం

## శ్రీ పున్నావజ్ఝల సీతారామబ్రహ్మంగారు

సత్యానికి పరమోత్కృష్ట ప్రమాణం స్వానుభూతి. దీనికి ప్రత్యక్షప్రమాణమని మరొక పేరు. ఇది సాధ్యంకానప్పుడు, సాధ్యం కానంతవరకు స్వీకరించదగిన ప్రమాణాలు రెండు. ఒకటి, అనుమానం; మరొకటి శబ్దం. పరిస్థితుల, నిదర్శనాల సహాయం తీసుకొని తార్కికబుద్ధితో, పరస్పర వైరుధ్యంలేని భావనతో చేయదగు నిర్ణయం అనుమానప్రమాణం. స్వానుభూతి పొందినవారు చెప్పినమాటలను వారియందలి ప్రమాణబుద్ధితో గ్రహించడం శబ్దప్రమాణం.

దేవు డున్నాడనే వారు అతడు అవాఙ్మనసగోచరు డని, అనుభవైకవేద్యుడనే చెబుతున్నారు. కనుక దేవుని ఉనికిని గురించి తర్కంతో తీర్పుచెప్పడం పనిలేని పని. దేవు డున్నా డని అనుభవంచేత గ్రహించడానికి అనుభవజ్ఞులు సాధన ప్రణాళికలు సూచించారు. అవి దేహ ప్రాణ మనస్సులతో సాగించవలసినవి. భగవ దనుభవంకూడా మాటలలో స్పష్టంగాను, సమగ్రంగాను చెప్పడానికి సాధ్యం కాదు. కబీరు అన్నాడు: ''మూగవాడు బెల్లం తినడంవంటిది ఈశ్వరానుభూతి. అనుభవం అపరిమితంగా పొందుతాడేగాని యితరులకు ఆ అనుభవం గురించి సరిగా తెలియచెయ్యలేడు.'' అని.

దేవు డున్నాడో లేడో తెల్సుకొని తీరవలసినదే నని ప్రతిజ్ఞ చేసుకోగల ధీరులు అనుభవజ్ఞులు ప్రతిపాదించిన ప్రణాళికలను అనుష్ఠించి తీరవలసినదే. అయితే, దేవు డున్నా డనే వారందరు స్వానుభూతితోనే ఆమాట చెబుతున్నారా? అనుభవం లేనివారికి దేవు డున్నా డని చెప్పే హక్కు ఎక్కడిది? అనుభవం లేకుండా దేవుడున్నాడనడానికి హక్కు ఉన్నప్పుడు దేవుడు లేడనడానికి మాకు హక్కు లేదా అని ప్రశ్నించవచ్చు.

వైజ్ఞానికులు పరిశోధనలు, ప్రయోగాలు చేసి కనిపెట్టిన సత్యాలను వైజ్ఞానికులు కానివారు పరిశోధనలు, ప్రయోగాలు చెయ్యకుండానే వైజ్ఞానికులందలి ప్రమాణబుద్ధితో శిరసా వహించడం లేదూ? ''వేదాహమేతం పురుషం మహాంతం''. భగవంతుని నేను తెలుసుకున్నాను అని ఋషీశ్వరుడు వేదశిఖరంనుంచి శృంగధ్వని చేస్తున్నాడు. అతనియందు ప్రమాణబుద్ధితో ఇతరులుకూడా దేవు డున్నాడని నమ్ముతున్నారు. సైంటిస్టులకు ఉన్న సత్యసంధత, ఋజుత్వం సర్వసంగపరిత్యాగులకు కూడా ఉన్నదని గ్రహించడం జిజ్ఞాసకు ప్రాతిపదిక, జిజ్ఞాసువు అర్హతకు నిదర్శనం.

అయితే, దేవుడున్నా డని గ్రహించడానికి తర్కం ఎంతమాత్రం ఉపయోగకరం కాదా?

ఎందుకు కాదు? కేవలం యుక్తివాదంతో దేవుని ఉనికి నిరూపించడం సాధ్యంకాదు. దేవుడున్నాడనడానికి ఎంతటి వాదబలమున్నదో దేవుని ఉనికిని శంకించడానికి కూడా దాదాపు అంతటి వాదబల మున్నది. జ్ఞానార్జనకు మనకు గల అనేకశక్తులలో తర్కం ఒకటిమాత్రమే. తర్కంచేత కలిగే జ్ఞానం సమగ్రమైనది కాదు: సర్వదా నిరుపద్రమైన దనడానికి వీలులేదు. ఏ ప్రాతిపదికమీద ఒక వాదాన్ని ప్రతిష్ఠిస్తామో, ఆ ప్రాతిపదికను గురించే సంశయం కలిగినప్పుడు, దానిమీద కట్టిన సిద్ధాంతసౌధం ఇసుకమీద కట్టిన బొమ్మరిల్లువలె కూలిపోగలదు.

దేవు డున్నాడనే భావం జిజ్ఞాసవల్లగాని, జీవితానుభవం వల్లగాని అస్పష్టంగానో, స్పష్టాస్పష్టంగానో తోచి, ఆ విషయమై స్పష్టంగాను, విపులంగాను మనస్సుకు పట్టించుకొనడానికి, జీవితానికి ఇతర అనుభవాలకు అన్వయించుకొనడానికి తర్కం అమోఘమైన సాధనంగా ఉపయోగపడగలదు.

దేవుడున్నాడనే తోస్తున్నది. ''దేవుడు ఉండే ఉండాలి'' అని పృచ్ఛకుడు అనగలిగి, ఆ విషయమై తన అన్వేషణకు సహాయపడగల నిమిత్తం వివరణ కోరితే ఎవరైనా తమకు తోచిన అభిప్రాయాలు తెలియజెయ్యగలుగుతారు లేదా, అనుభవజ్ఞుల మాటలయందు ప్రమాణబుద్ధి కలిగి, విషయ విశదీకరణ కోరితే చెప్పవచ్చు. అంతేగాని, దేవుడున్నాడని ఏ కోశాన ఎంత పరిశీలించినా తోచకపోతే, ఏమి చెప్పినా, ఎంత చెప్పినా ఉపయోగం ఉండదు. సానుభూతి లేకపోతే, మనస్సు శంకాకులితమై ప్రతియుక్తికి ప్రతియుక్తి స్ఫురిస్తుంటుంది. దేవుని విషయంలో యిది విషచక్ర పరిభ్రమణమే అవుతుంది. జగత్తు, జీవితానుభవం కలిగించలేని నమ్మకం కేవలం యుక్తివాదం కలిగించగలదా?

దేవు డున్నా డన్న నమ్మకం కలగకపోతే నిశ్చింతగా ఉండవచ్చు కదా. ఆ విషయమై తర్జన భర్జన ఎందుకు? జిజ్ఞాస మెదడులోనే కాక, హృదయంలోకూడా కలిగినప్పుడు చేసే చర్చ ఉపయోగకరమవుతుంది. ఆ అవసరం కలిగినప్పుడే మీమాంస ప్రారంభించవచ్చు. దేవుడున్నాడని చెప్పి, అంతటితో సంతృప్తి కలిగి ఊరుకుంటే అట్టి నమ్మకం ఉన్నా లేకపోయినా ఒకటే. దేవు డున్నాడని నమ్మకం కలిగినప్పుడు అతనిని పొందడానికి సాధనకూడా చేస్తుంటేనే నమ్మకం, సార్థకం, ఫలప్రదం అవుతుంటుంది. సాధనతో కూడిన నమ్మకమే నిజమైన నమ్మకం.*



* 'ధర్మసాధని' సౌజన్యముతో.

# గంగాధరస్తవము

'నాట్య కవితా కళానిధి' - 'మహాకవి'
విద్వాన్ దర్భా వేంకటకృష్ణమూర్తి, ఎం. ఏ.

శా॥ ప్రారబ్ధంబు బలీయ మైన వినరావా నీవు నే మొఱ్ఱలున్?
భారంబా భవదీయదాసులను బ్రోవన్ నీకుఁ? గాదేని శి
క్షారూపంబ? పరీక్షయా మఱి? పరాకా? యేటి కీ హింస? ని
న్నారాధించినదాసికిన్ ఫల మిదేనా తండ్రి, గంగాధరా?

శా॥ పాపం బన్నను దైవ మన్నను తృణప్రాయంబుగా నెంచి స్వే
చ్ఛాపారమ్యమునం జరించుఘను లుచ్చస్థాన మందన్, సదా
నీ ప్రాపే నెఱనమ్మికొన్న యనదల్ నిమ్నస్థితిం గుందు, టా
హా! ప్రారబ్ధఫలంబొ? కాక, కవిమాహాత్మ్యంబొ గంగాధరా?

శా॥ పాపిష్ఠంపుఁబనుల్ పొనర్చుకొలఁదిన్ బ్రాపించునేమో వరుం
డేపున్ వైభవమున్ మహోన్నతియుఁ దా నీ పాడుకాలాన! నం
తే పో; కానియెడన్ గలిప్రభుఁడు తా నేరీతి సైరింపఁగా
నోపున్ సత్పథవర్తనున్, బతితుఁ జేయుం గాని గంగాధరా.

శా॥ నీ వున్నాఁడవు, ధాతయున్ గలఁడు గా, నీరేజనాభుండు లేఁ
డా? వాస్తోష్పతి లేఁడె విశ్వమును సమ్యగ్రీతిఁ బాలింప? నే
లా విశ్వాధిపతిత్వ మిట్లు కలికే యర్పించినా రిందఱున్?
జీవుల్ చేసినపాప మేమి యిటు హింసింపంగ గంగాధరా?

మ॥ కలిరాజేల్బడి తెచ్చిపెట్టితివి మా కర్మాన, నద్దాన నాఁ
కలిచావుల్ కడు హెచ్చె, దేశమున నాక్రందధ్వనుల్ రెచ్చెఁ, దె
క్కలికాండ్రై రధికారు, లిం కెటు సుభిక్షత్వంబు చేకూరు? దూఁ
కలిచే భూప్రజ రూపడంప మది సంకల్పంబొ గంగాధరా?

శా॥ స్వారాజ్యం బగు మా స్వరాజ్య మని యాశాసౌధముల్ గట్టికొ
న్నా రేవేవియొ భారతీయు; లవి యీ నాఁ డేటికో యిట్లు తా
ర్మారై దుర్భర మాయె జీవితము సామాన్యప్రజాపాళి; కీ
దారిద్ర్యంబు తొలంగుమార్గ మిఁక లేదా తండ్రి, గంగాధరా!

శ్రీ రామ   ష్ణ ప్ర

శా॥ హిందూదేశచరిత్రమందుఁ గనఁబో మీలాటికాలం బహో!
ముం దెన్నండును లేద, యింక మఱి మున్ముం దెన్నఁడున్ రాద, మి
న్నుం దెన్ దేశదరిద్రతాగరిమ సర్వాంశంబులన్; శాంతి యే
చందానన్ సమకూరు నింక నడియాసల్ గాక గంగాధరా?

శా॥ సై న్సేమో యభివృద్ధిఁ జెందినది, విశ్వం బెల్ల నద్దాన న
ద్వా సైన్స నాగరకత్వ ముచ్చపదవిన్ బ్రాపించెఁ, గానీ లవం
బు న్సౌఖ్యంబును శాంతి యన్నది కనంబో మేమిపాపంబొ! న్యూ
సె న్సయ్యెన్ బ్రతు కెల్ల, దేశమును నాన్సె న్సయ్యె గంగాధరా.

మ॥ కలితీ లేని పదార్థమే కన మెటన్ గాలించినన్ నేఁడు, బు
ద్ధులలోఁ గల్తియె, కల్తియే క్రియల, ధూంధూం వాక్కులం గల్తియే,
కలిమాహాత్మ్యము నేమనన్? సకలమున్ "గల్తీమయం' బయ్యెఁ బో
కలితీయే కలితీ రటంచు నుడువంగాఁ జెల్లు గంగాధరా.

శా॥ ఆరోగ్యంబు నశింప నెన్ని కలవో యన్ని తటస్థించె న
య్యారే యీ కలిరాజుప్రాభవమునం; దన్నింటికిన్ బాడు వే
వో రాసాయనికంపుదోహదము లం చుత్పన్నమై, భోజ్యసం
భారం బెచ్చి, గుణంబు చచ్చి, వివిధవ్యాధుల్ కడున్ రెచ్చె; ఈ
ప్రారబ్ధంబున కంత మన్నదియె లేదా తండ్రి, గంగాధరా?

మ॥ "తొలి యా మూఁడుయుగాల ధర్మ మది యంతో యింతో యొప్పారె, నీ
కలిలోనే కడు ధర్మహాని కలిగెం గా" కందు రజ్ఞుల్ గటా!
కలి యన్ మాటకు నర్థ మీ సని యెఱుంగన్ లేక; తద్ధర్మ మి
క్కలియే పూర్తిగ నిర్వహించె నని వక్కాణింతు గంగాధరా.

శా॥ సఖ్యంబా నశియించె, నీతి సమసె   సౌజన్యమా రూపఱెన్,
సౌఖ్యంబా కఱవాయె, శాంతియొ యదృశ్యం బాయె, ధర్మంబు ప్ర
త్యాఖ్యాతం బయిపోయె, జీవితమె హేయం బాయెఁ, గట్టా! జగ
త్ప్రఖ్యాతం బగుభారతావనికి దౌర్భాగ్యంబు వాటిల్లెఁ, బ్రా
ముఖ్యం బంది కలిప్రభుండు తన యేపుం జూప గంగాధరా.

# శివానందస్వామి - ధర్మప్రసంగములు

బ్రహ్మచారిణి లలిత

(గతసంచిక తరువాయి)

మహారాజు బ్రహ్మానందస్వామి ఇట్లు పల్కెడివారు:—"ఎక్కువ భాగము మనసు భగవంతునిపై నిల్పగల్గినచో, కొద్దిభాగపు మనస్సుతోనే ఎక్కువ పని చేయ వచ్చును". (వారి పలుకు లివి:—14 అణాల మనస్సు భగవానునిపై నుంచి, రెండణాల మనస్సు పనిపై పెట్టిన చాలును.) గీతలో భగవాను డిట్లు నుడువుచున్నాడు:—"నా ఒక్క అంశము తోడనే ఈ చరాచరప్రపంచ మంతయు నడుపుచున్నాను." ఈశ్వరుడు ఒక్కచిన్న అంశముతోడనే ఈ విశ్వమును పరిపాలించుచున్నాడు. వానినే ధ్యానింపవలెను, మనసార వానినే ప్రార్థింపవలెను. తులసీదాసు ఇట్లు పల్కెను: "రామనామము పెదవులపైనను, పని చేతిపైనను సాగిపోవలెను. ఇంటింట బిచ్చ మెత్తుకొని తిరుగుట కాదు మన ఆదర్శము. హృషీకేశాది పెక్కుస్థలములలో చాల కాలము తపస్సు చేసినట్టియు, సహజైకాంతవాసాభిలాషియు అగు హరిమహారాజే ఒకపరి ఇట్లు పల్కిరి: "మనము నిజముగా దొంగలము. (మన సమయమును మనమే వ్యర్థపఱచుకొనుచున్నాము.) దినమంతయు మనము భగవంతుని తలంచుచున్నామా? ఎక్కువగా చేసినప్పుడు మూడునాల్గుగంటలు ధ్యానమందు గడపుచున్నాము. మిగిలిన సమయమంతయు వ్యర్థముగ గడచిపోవుచున్నది."

ఎవరికైన తీవ్రవాంఛ యున్నచో ఆరు నెలలో ఒక సంవత్సరముపాటో ఒక్కపట్టున తీవ్రధ్యానము, ఆధ్యాత్మిక సాధనలు సలుపవచ్చును. మఱొకనితోడుగ చేసికొనుట మంచిది. ముఖ్యముగ గమనింప దగిన వేఱొక విషయము: చదువు అలవాటు చేసికోవలెను. ప్రతిదినము కొంత కాలము చదువుట, వ్రాయుట యందు గడపవలెను. జపధ్యానములందు మనస్సు కుదురని సమయముల శాస్త్రపఠనము ద్వారా సద్వినియోగపఱచుకోవచ్చును. హరి మహారాజు ఎచ్చటికి వెళ్లినను, తనతో గీత, ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రములు, చండి, వివేకచూడామణి మున్నగు పుస్తకముల కొనిపోయెడి వారు. వాని నెల్ల, వారు తఱచు చదివెడివారు. వారివంటి స్వభావసంపన్నులకు పఠనము ఒక విధమగు ధ్యానము. గీత, ఉపనిషత్తుల శ్లోకములపై హరిమహారాజు ధ్యానించెడివారు. అధ్యయనము చాల మంచిది. ఎంతయో సహాయకారి. కంఖాలులో నేను కొందఱు సాధువులను చూచితిని. ప్రొద్దుపుచ్చుకొనుటకై రెండు మూడుగంటలు తిరిగి వచ్చెదరు. కాని మనవిషయమో వేఱు. మనలో బాధ్యత అనునది నాటుకొనినది. గాఢధ్యానమందైనను, సమాధిఅవస్థలోనైనను సరే ఈ బాధ్యత మనల విడువదు. శ్రీగురుదేవులు జగద్ధితార్థమై అవతరించిరి. మనము వారి సేవకులము. మనల నా తల పెట్లు విడుచును? యథార్థముగ ఎంత కాలము మనము గాఢధ్యానతత్పరులమైయుండగలము? మనస్సును స్థిరపఱచుకొనుటకే ఎక్కువకాలము పట్టును. రెండు మూడు గంటలు కూర్చున్నచో నిశ్చలధ్యానము కల్గుట ఒకటో, రెండో నిమిషములు మాత్రమే.

ఈశ్వరకృపచే అది కల్గుటకూడ గొప్ప విష యము. సామాన్యులకు అదియే చాలును.

నేడు హరిమహారాజుగారి జన్మదినసందర్భ మున నేను మీా కెల్లరకును జ్ఞాన, భక్తి, ప్రేమలు కల్గుగాక యనియు, మీా హృదయ ములు విశ్వాసపూరితము లగుగాక అనియు, ఆధ్యాత్మికజీవనమున దినదినప్రవర్ధమాను లగు దురు గాక యనియు శ్రీ గురుదేవుల హృదయ పూర్వకముగ ప్రార్థించుచున్నాను. ఇదియే నా ఏకైకప్రార్థన....

'స్వామిజీ ఈ సంఘమును (సన్న్యాసుల మఠమును) శ్రీ గురుదేవుల అభీష్టానుసారము ఏర్పఱచెను. ఆలంబజారులో నుండగ స్వామిజీ శశిమహారాజుతో ఇట్లనేను: "శశీ, మన మొక కార్యము కావింపవలెను. కా మీా రెల్లరును సంసిద్ధులు కండు." శ్రీ గురుమహారాజు బిడ్డ లును (శిష్యులు) సేవకులును ఈ సంస్థలో చేరి యున్నారు. శ్రీ గురుదేవుల ఆదేశముపై స్వామిజీ కాక ఇట్టి మహత్తరసంఘము నెవ రేర్పఱచి యుండగలరు? స్వామిజీ నాతో ఇట్లనిరి: "ఈ ఆరంభించిన కార్యము ఏడు ఎని మిది వందల సంవత్సరములపాటు నడచును. మంచిబాలురు పెక్కురు వచ్చి చేరెదరు." అయినప్పటికిని ధ్యానాది ఆధ్యాత్మికసాధనల మనము తీవ్రముగ చేయవలసియున్నది. శ్రీ గురుదేవుల కృపవలననే నేను ఇంకను మాట్లాడ గలిగి యున్నాను. అంత వారు పాట నొక దానిని పాడ నారంభించిరి. ప్రక్కనున్న ఒక సాధువును ఆ పాట పూర్తిగా పాడు మనిరి. ఆ పాట సారాంశ మిది: ఓ విశ్వప్రాణాధారా, ఓ విశ్వేశ్వరా, నీకు జయమగు గాక. ఓ దీన శరణ్యా, ఓ శుభదాయకా, నీకు జయమగు గాక. సర్వభూతములకు తల్లియు, తండ్రియు అగు ఓ ప్రభూ, నీకు జయమగు గాక.......
.......................................
ఓ జగద్దుఃఖభంజక, ఓ జగద్రక్షక, నీకు జయ మగు గాక. నీ ద్వారముకడ వేచియున్నాడీ దీనుడు, కృపజూపుము పరాత్పరా.

అంత మెల్ల మెల్లగ నడచుచు మహాపురుష్‌జీ ఇట్లనిరి: 'ఈమాత్రము నడువ కల్గుటకూడ వాని కృపయే.' వరండాలోనికి వెళ్లి, గంగ వైపు చూచి చేతులు జోడించి "దేవిసురేశ్వరి భగవతి గంగే, త్రిభువనతారిణి తరల తరంగే ..." అని గంగాస్తవము చేయనారంభించిరి.

జాన్యువరి 15, 1930.

ప్రసంగవశమున మహాపురుషమహారాజు ఇట్లనిరి: "రోమైరోలా గురుమహారాజు జీవిత చరిత్రము వ్రాసెను. జీవితచరిత్ర ఏ విధముగ వ్రాయవలెనో వారు (పాశ్చాత్యులు) చక్కగ ఎఱుగుదురు. రామమోహన్ రాయ్, దేవేంద్ర నాథఠాకూరు, కేశవచంద్రసేనుల జీవితచరి త్రల తెల్పుచు, పాఠకుని మెల్లగ శ్రీరామ కృష్ణస్వామిజీల జీవితముల వైపునకు లాగును."

పెక్కురు శ్రీ గురుమహారాజ్ భక్తులగుట చూచి ఆశ్చర్యముగుట లేదా? ఒకదినము గురుదేవు లిట్లనిరి: "పలురకములగు ప్రజలు, శ్వేతపీతాదివర్ణములవారు—భక్తులగుదురు." ఆహా! భగవానునికి దేశ, కాల, వ్యక్తిగత సీమలు లేవు కదా! అతడు ప్రేమ (కరుణా) స్వరూపుడు. నిజముగా మేము ధన్యులము. వారిని సేవింప గల్గితిమి. తాంబూలాదికములు చేసి ఇచ్చితిమి, వారి అపారప్రేమ చూరగొం టిమి. అదృష్టవంతులము!

# శ్రీమద్భాగవతము - శ్రీకృష్ణసందేశము

## [శ్రీమత్ప్రభవానందవాణి]

### తృతీయస్కంధము

### చతుర్థాధ్యాయము

### దివ్యప్రేమనుగూర్చి కపిలుని బోధలు

మైత్రేయుడు :

తన గారాబు కుమారుడగు కపిలునిచూచుకొని గర్వించుటకు దేవహూతికి మంచి కారణమే కలదు. అతడు ఆజన్మముక్తుడు, మానవతతికి నిరుపాధికగురువు,* సాంఖ్యదర్శనమునకు ప్రవక్త. పరమజ్ఞానతృష్ణ ఆమెకు సహజముగ నుండెను. కుమారునితో మత తత్త్వశాస్త్ర విషయికములగు చర్చలు సల్పుట ఆమెకు జన్మహక్కు. ఒకనాడు ఆమె అతనితో ఇట్లనెను:

"కుమారా, నీవు నాకు మిక్కిలి ప్రియుడవు. ఐహికబంధమునుండి విముక్తినికలిగించునట్టి జ్ఞానమును నాకు తెలుపవా? సంసార జీవితవిధులు తలపైబడినదాది నేను ఇంకనింకను హెచ్చుగ ఐహికములందు సక్తనగుచున్నాను. యౌవనమున నున్న దినములలో నీ ప్రియ జనకుడగు కర్దమప్రజాపతియొద్ద నేనెంతో తెలిసికొంటిని. ఇప్పుడు వార్ధక్యమున కర్దమసుతునొద్ద సంతోషముతో నేర్చుకొందును.

కపిలుడు :

అమ్మా, దివ్యాత్మతోడి ఐక్యమును కలుపు యోగమార్గమును అనుసరించినవానికి దుఃఖము పూర్తిగ అంతరించును. ఈ యోగము మానవతతి నిశ్శ్రేయసమును సమకూర్చును. నా పూర్వావతారములలో నే నీ యోగమును ప్రాచీనమహర్షులకు ఉపదేశించితిని. దానినే ఇప్పుడు నీకు ఉపదేశింతును.

ఆత్మకు బంధమునుగాని ముక్తినిగాని కలిగించునది మనస్సే. మనస్సునకు ఐహికసంగముండిన మనము బద్ధులమగుదుము. ఆ మనస్సు భగవంతునియందు ఆసక్తమగునేని మనము విముక్తుల మగుదుము.

అహంకార మమకారములను పూర్తిగ విడిచిపెట్టుము. హృదయవిశుద్ధికిని కామ లోభ మోహావిముక్తికిని అదొక్కటే మార్గము. పవిత్రమైన హృదయమందే జ్ఞానమును, ప్రేమయు ఆవిష్కృతము లగును. దివ్యమును, స్వయంప్రకాశమును, విశుద్ధమును, స్వతంత్రమును, సత్యమును అగు బ్రహ్మము సాక్షాత్కృత మగును.

ఐహికవస్తువాంఛయే బంధమునకును బాధలకును కారణ మని వివేకులు చెప్పు మాట నిజము. ఆ వాంఛయే భక్తసాధువులవంకకు మరల్పబడునేని ముక్తికారణ మగును. ఆత్మనిగ్రహము శాంతి ఎల్లరపట్ల ప్రేమ సౌహార్దము కలవారే భక్తసాధువులు. భగవద్ధ్యానమే వారికి ప్రాణము. వారి డెందములు దేవునితో నైక్య మొందియుండును. కావున ఏ దుఃఖముగాని వ్యసనముకాని వారి మనస్సులను కదల్పలేవు. వారి సమత్వమును చెడగొట్టలేవు. వారు సర్వసంగవిముక్తులు.

* కపిలుని సాంఖ్య దర్శనమునకును శ్రీ మద్భాగవతమందలి సాంఖ్య సిద్ధాంతప్రతిపాదనమునకును సారమున భేదములేదు కాని కొన్ని వివరములలో భేదమున్నది.

వారితో కూడువారును, వారిని ప్రేమించు వారును పవిత్రు లగుదురు. పవిత్ర వాతావరణమున నుండుచు దేవుని స్తుతులను ప్రతిదినము వినుచు వారు దేవునందు తమ భక్తి విశ్వాసములను పెంపొందించుకొందురు. తుదకు దేవునితలంపు వారికి అత్యానందకర మగును. భగవత్ప్రేమ వారి హృదయములలో నిండి తొణకుచుండును. అప్పటినుండి వారు దేవునే ధ్యానించుచు పూర్తిగా దేవునివారే అగుదురు.

అట్టి అనుభూతిని పొందిన మానవునకు ఇక నింద్రియసుఖాభిలాష యుండనే యుండదు. అజ్ఞానజాలము నుండి అతడు విడుపొందును. అతని డెందమున జ్ఞానజ్యోతి దీపిత మగును. ఈ జీవితమందే మోక్షసామ్రాజ్యము ముంజేతి కంకణ మగును.

దేవహూతి :

దేవుని ప్రేమించుట ఎట్లో చెప్పుము. ఏ ప్రేమచేత బంధవిముక్తి కలుగునో ఆ ప్రేమను నాకు నేర్పుమా! ధ్యానయోగమునుగూర్చి కూడ నాకు తెలుపుము.

కపిలుడు :

అమ్మా, మనప్రేమ సంసారముపైనున్నది. కావున మన ఇంద్రియములు మనలను ఐహిక వస్తునివహమువంకకే లాగుచుండును. మన ప్రేమను దేవునివంకకు మరల్తుమేని దివ్యజ్ఞానమును, అఖండ మోక్షమును కందుము. కొందఱకు మాత్రము భగవత్ప్రేమయందును భగవత్సేవయందును, ఎంత ఆనందము కలుగుననగా వారు తమ మోక్షమునుసైతము లక్ష్యపెట్టరు. ఐనను దివ్యప్రేమయే తుదకు వారికి మోక్షమును కూడ చేకూర్చును.

ఎవరు తమ్ము ప్రేమించుకొన్నంతగా, భగవంతుని ప్రేమింతురో, తమ శిశువులను ప్రేమించినట్లుగా భగవంతుని ప్రేమింతురో, తమ ప్రాణవల్లభుని విశ్వసించినట్లుగా భగవంతుని విశ్వసింతురో గురువుల కందఱికిని గురువుగా భగవంతుని గౌరవింతురో, తమ ప్రాణమిత్రుని ప్రేమించినట్లుగా భగవంతుని ప్రేమింతురో, స్వామిగా ఆరాధింతురో వారే అమర జీవులు.

భగవదారాధనలో తీరముగ నిమగ్నులగు వారు నిజముగ ధన్యులు. ఏలయన అఖండ మోక్షసామ్రాజ్యము వారి దగును*

నేను భగవంతుడను; విశ్వనాథుడను, సకల ప్రాణులందు ఉన్న ఆత్మను నేను. నాకు భయము లేదు. సంసారభయమునుండి అందఱిని విడిపించువాడను నేను. నావలని వెఱపుచేతనే గాలి వీచుచున్నది. నా వలని వెఱపుచేతనే సూర్యుడు వెలుగును వేడిని ఇచ్చుచున్నాడు, మేఘములు వానకురియుచున్నవి, నావలని వెఱపుచేతనే అగ్ని మండుచున్నది. భయరహితుడనగు నన్ను యోగులు ఆరాధించుచున్నారు, కొల్చుచున్నారు. పరమ శ్రేయమును ప్రాపించుటకై వారు నన్ను ప్రేమించుచున్నారు, ధ్యానించుచున్నారు. హృదయశాంతి కలిగినప్పుడు, ప్రేమద్వారా మనసు నాయందు ఐక్యమైనప్పుడు పరమ శ్రేయము సిద్ధించును.

* ఈ దిగువ కపిలుడు తనఉపన్యాసమును సాగించుచునేయున్నను, తనకును పరమాత్మకును అభేదమును అనుభవమునకు తెచ్చుకొని మాటాడుచున్నాడు.

# వార్తలు, విశేషాలు

## శ్రీ రామకృష్ణమఠము - మద్రాసు

### మాతృశ్రీ శారదాజయంతి మహోత్సవములు

1961 డిసెంబరు 29-వ తేదీనాడు మాతృశ్రీ శారద 109-వ జయంతి తిథిపూజ జరిగినది. ప్రొద్దున ఐదుగంటలకు మంగళహారతి, భజన, గీతోపనిషత్తుల పారాయణము. 8 గంటల నుండి మధ్యాహ్నము 1-30 గంటలవఱకు విశేషపూజ, హోమము, మున్నగునవి సాగినవి. తర్వాత 2,000 భక్తజనులకు, 1,100 దరిద్ర నారాయణులకు అన్నసంతర్పణ చేయబడినది. గుడిలో సాయంపూజ ముగిసినతరువాత మాతృశ్రీ ఉపదేశములు కొన్ని చదువబడ్డవి. వృద్ధస్వాములు కొందఱు ఉపన్యసించిరి.

బహిరంగోత్సవము 1961 డిసెంబరు 31-వ తేదీ మధ్యాహ్నం 3-30 గంటలకు ప్రారంభమైనది. శ్రీమతి సి. కె. హాండు, ఎమ్. ఏ. (బొంబాయి) అధ్యక్షత వహించినారు. అద్వైహోము విద్యార్థినుల భజనతోను శ్రీరామకృష్ణమిషను, శారదావిద్యాలయ హైస్కూలు విద్యార్థినుల ప్రార్థనగీతముతోను కార్యక్రమము ఆరంభమైనది. రాణీ మేరీ కళాశాల ప్రిన్సిపాలు డా॥ ఐరావతమ్మగారు అధ్యక్షురాలికి వక్తలకు సభ్యులకు స్వాగతవందనోపచారము కావించుటకు ముందు సభ్యులు ఒక్కనిమిష కాలము మౌనము పాటించిరి. డా॥ ఐరావతమ్మగారు ఉత్సవప్రాముఖ్యమునుగూర్చి మంగళకరత్వమునుగూర్చి ప్రస్తుత సంక్షుబ్ధ లోకమునకు, మాతృదేవి సందేశావశ్యకతను గూర్చి చెప్పినారు. అధ్యక్షురాలి తొలి పలుకుల తర్వాత శ్రీమతి కామాక్షి రామకృష్ణగారు తమిళములో మాతృదేవి మహిమను గూర్చి ఉపన్యసించినారు. ''ఆమెజీవితమును - శ్రీరామకృష్ణుని జీవితముతోనే పోల్పదగును. ఉభయులును అమాయిక పవిత్రగ్రామ పరిసరాలలో పుట్టి పెరిగినారు. ఆ పరిసరాలు ఆధ్యాత్మిక జీవితమునకు ప్రేరకములు. శారదా శ్రీరామకృష్ణులచుట్టఱికము పూర్తిగా ''దివ్య''మైనది. మానవలోకోద్ధరణమునకే వారి కలయిక సాధకమైనది. శారదకు శ్రీరామకృష్ణుడు శ్రీరామకృష్ణునికి శారదయు లోకజననిప్రత్యక్షరూపములు. పాతివ్రత్య మాతృత్వసన్న్యాస లక్ష్యములు ఆమెయందు అద్భుతమేళనము నొందినవి.''—అన్నారు శ్రీమతి కామాక్షి రామకృష్ణగారు.

గౌరీ, జయలక్ష్మి అను సేలము సోదరులు తిరుప్పావై మున్నగు భక్తిగీతములను పాడి కొంతసేపు సభ్యులను ఆనందపఱచిరి.

శ్రీమతి సుశీల ఇంద్రసేన్ — శ్రీమతి గాడేపల్లి సుందరీ శంకరంగారలు వరుసగా హిందీలోను, తెలుగులోను ప్రసంగించిరి. శ్రీరామకృష్ణునందు మాతృదేవికి ఉండిన భక్తి, గురుదేవునిసందేశప్రచారమునకు ఆమె తన

జీవితమును అంకితమొనర్చుకొనుట ఆమెలో నిరూపితమైన మాతృధర్మము—వీనికి మానవ చరిత్రలో సాటిలేదని, శ్రీమతి సుందరీ శంకరంగారు చెప్పినారు. పోటీలలో నెగ్గిన విద్యార్థినులచేత కొన్ని గ్రంథభాగములను వల్లింపచేసిన తరువాత బహుమతులొసంగబడినవి. అధ్యక్షురాలు తన మలిపలుకులో మాతృదేవి సందేశమును సంక్షేపించి ప్రస్తుతప్రపంచమున దాని ఆచరణయోగ్యతను కొనియాడినారు.

శ్రీమతి సావిత్రీ రాజనుగారు సదస్సునకు కృతజ్ఞతాభివందనోపచారముచేసిన తరువాత గుడిలో హారతియు శ్రీప్రియానందస్వామి బృందమువారి భజనయు జరుగుటతో ఉత్సవ కార్యక్రమము పూర్తియైనది.



## శ్రీవివేకానందస్వామి - శతతమ జయంతి మహోత్సవములు

7-1-1962 వ తేదీనాడు సాయంకాలము 5 గంటలకు మైలాపూరు శ్రీరామకృష్ణమఠములో మద్రాసుపురమహాజనులు సమావేశమై 1963-1964 సం॥లో జరుగవలసిన శ్రీవివేకానందస్వామి శతతమజయంతి మహోత్సవములకు ప్రణాళికలు ఏర్పఱచుటకు ఒక కమిటిని ఎన్నుకొనిరి. డా॥ సి.పి. రామస్వామి అయ్యరుగారిని అధ్యక్షులుగ ఎన్నుకొన్నారు. మద్రాసు శ్రీరామకృష్ణమఠాధ్యక్షులు శ్రీ కైలాసానంద స్వాములు సదస్సునకు స్వాగతము చెప్పి శ్రీ వివేకానందస్వామికి మద్రాసుపౌరులతో ఏర్పడియుండిన సన్నిహిత సంబంధమును స్వామికి దక్షిణభారతదేశము చేసిన గొప్పసాహాయ్యమును బట్టి ఈశతతమజయంతి మహోత్సవములో మద్రాసువారు ముఖ్యమైనవవంతు నిర్వహింపవలె నని చెప్పినారు.

మద్రాసు నిధిమంత్రి పూజ్యశ్రీ సి. సుబ్రహ్మణ్యం తమ ఆంగ్లోపన్యాసములో కలహకల్లోలపూర్ణమగు నేటిప్రపంచమంతటను శ్రీ వివేకానందస్వాముల పారమార్థిక సందేశము ప్రచారము చేయుట ఎంతజరూరో తెలిపినారు.

శ్రీశివజ్ఞానగ్రామణిగారు సాంస్కృతికముగ భారతదేశమునకుగల ఐక్యమును వివరించి ప్రజలు తమ ప్రాంతీయ సంకుచితాభిప్రాయములను దిగద్రావి ఈ మహోత్సవమును విజయవంతముగ చేయవలె నన్నారు.

శ్రీ కె. ఎస్. రామస్వామిశాస్త్రిగారు తిరువనంతపురమున తమతండ్రియొద్దకు శ్రీవివేకానందస్వామి విచ్చేసినసందర్భములు వివరించి అమెరికానుండి మరలి వచ్చినపిమ్మట స్వామికి మద్రాసులో జరిగిన అఖండగౌరవమును కన్నులకు కట్టినట్లు వర్ణించిరి.

డా॥ సి. పి. రామస్వామి అయ్యరుగారు తిరువల్లిక్కేణిలోని ఐస్హౌసునకు వివేకానంద హౌస్ అని పేరుమార్చిన బాగుండుననని సూచించిరి. శతతమజయంతిని తగినవైభవముతో జరుపవలెననెడి నాటి సభాతీర్మానము శ్రీరామస్వామిఅయ్యరుగారు ప్రతిపాదించిరి. డా॥ పి.వి. చెరియనుగారిని పురస్కరించుకొని సభ్యులు ఏకగ్రీవముగ ఆ ప్రతిపాదనను ఆమోదించిరి.

ఉత్సవసమితిని ఏర్పఱుపవలె నను తీర్మానమును ప్రతిపాదించినవారు శ్రీ ఎస్. కె. శివరామన్‌గారు. శ్రీ ఓ. వి. చిన్నస్వామి గారి పురస్సరముగ ఏకగ్రీవముగ సభ్యులు ఆ తీర్మానమును ఆమోదించిరి. నిర్వాహకపరిషత్తును ఒకదానిని ఏర్పఱుపవలెనని ప్రతిపాదించినవారు

శ్రీ ఎస్. కృష్ణయ్యరుగారు, శ్రీ ఎ. ఎల్. కృష్ణయ్యగారిని పురస్కరించుకొని సభ్యులు ఏకగ్రీవముగ ఆ ప్రతిపాదనను ఆమోదించిరి.

శ్రీ ఉప్పుటి పాండురంగయ్యగారు ఒక విజ్ఞప్తిని ప్రతిపాదించిరి. ఆ విజ్ఞప్తి వేఱుగ ప్రచురించుచున్నాము. దానిని శ్రీ వి. కె. రామస్వామి మొదలియారుగారు బలపఱచిరి.

శ్రీ కె. బాలసుబ్రహ్మణ్యయ్యరుగారి వందనోపచారవాక్యముతో సభాకార్యక్రమము ముగిసినది.

# శ్రీ వివేకానందస్వామి శతతమజయంతి మహోత్సవములు

## విజ్ఞప్తి

7-1-'62 తేదీనాడు డా॥ సి. పి. రామస్వామిఅయ్యరుగారి ఆధ్యక్ష్యమున మద్రాసు పౌరులు శ్రీ రామకృష్ణమఠ మంటపమున సమావేశమై ఈ క్రింది తీర్మానమును చేసికొనిరి

“పరమహంస శ్రీరామకృష్ణగురుదేవుని ప్రియతమశిష్యుడును విశ్వవ్యాప్తములైయున్న రామకృష్ణమిషను సంస్థల స్థాపకుడును, దేశభక్తయోగీంద్రశిఖామణియు, భారతీయులలో వారి సనాతనాధ్యాత్మికసంపదనుగూర్చిన జ్ఞానమును మేలుకొలిపినవాడును, 1893 లో చికాగోలో విశ్వమతమహాసభ జరిగినప్పటినుండి శ్రోతల చేతముల ఉఱ్ఱూతలూపు శాంతిసామరస్యప్రతిపాదకోపన్యాసములచే పాశ్చాత్యప్రజలకు భారతదేశమునెడల ఆదరమును మహోన్నతముగ పెంచినవాడును అగు శ్రీ వివేకానందస్వామిజి శతతమజయంతిమహోత్సవమును 1963 జాన్యువరిలో ప్రారంభించి 1964 జాన్యువరి వరకు మద్రాసునగరములోను, మద్రాసురాష్ట్రమంతటను అనుకూలములైన తారీఖులందు అర్హరీతిలో జరుపవలెను. అందులకు ఆవశ్యకములైన ప్రయత్నములను చేయవలెను.”

ఈ తీర్మానమును అమలుజరుపుటకై సెంటినరీకమిటి ఏర్పఱుపబడినది. ఆ కమిటీలో మద్రాసుపౌరప్రముఖులు సభ్యులు:—వైస్ప్రెసిడెంటు డా॥ రాధాకృష్ణగారును, మద్రాసు గవర్నరు శ్రీ విష్ణురామ్‌మేధిగారును, మద్రాసు ముఖ్యమంత్రి శ్రీ కె. కామరాజుగారును ఆ కమిటీకి పోషకులుగ ఉండుటకు దయతో అంగీకరించిరి. ఉత్సవకార్యక్రమములో ఈ క్రిందివి ముఖ్యాంశములు :.

| | | రూ. |
|---|---|---|
| 1. | శతతమజయంతికి స్మారకముగ ఒక గ్రంథాలయము, పత్రికాపఠనాలయము, శిశువినోద కేంద్రము, ఒక సభాభవనమును నిర్మించుట ... | 3,51,000 |
| 2. | తమిళమందును తెలుగునందును శ్రీ స్వామిజి సంపూర్ణగ్రంథావళిని 10 సంపుటములుగ ప్రచురించుట ... | 3,00,000 |
| 3. | తమిళములో సప్రమాణముగ "శ్రీ వివేకానందస్వామి జీవిత చరిత్రము"ను ప్రచురించుట ... | 25,000 |
| 4. | శ్రీ వివేకానందస్వామిజి జీవితమును సందేశమును తెల్పు చిన్న పుస్తకములను కార్డుచిత్రములను ఉచితముగ పంచిపెట్టుట ... | 10,000 |
| 5. | మద్రాసు జార్జిటవునులో ఉన్న శ్రీరామకృష్ణమఠ నేషనల్ గరల్స్ హయ్యరు ఎలిమెంటరీ స్కూలును వివేకానంద సెంటినరీ గరల్స్ హైస్కూలుగ అభివృద్ధిచేయుట ... | 1,00,000 |
| 6. | మెరీనా రోడ్డులో ఐస్హౌసుకు ఎదురుగ శ్రీ వివేకానందస్వామిజి శిలా ప్రతిమను ప్రతిష్ఠించుట ... | 1,25,000 |
| 7. | స్వామిజి జీవితమందలి ముఖ్యఘట్టములను తెల్పు వస్తుప్రదర్శనము (ఎక్సిబిషన్) ఏర్పాటుచేయుట ... | 25,000 |
| 8. | పౌరమహాసభలు, వివిధమతాలవారి సమావేశములు, పండిత సదస్సులు, వ్యాసరచనలో, వక్తృత్వములో పోటీలు జరుపుట ... | 5,000 |
| 9. | పేదలకు అన్నవస్త్రదానములు ... | 5,000 |
| 10. | కుష్ఠవ్యాధిగ్రస్తుల శరణాలయములందును, క్షయరోగ ఆసుపత్రుల లోను పిల్లలకును పండ్లను భక్ష్యములను పంచిపెట్టుట ... | 5,000 |
| 11. | జిల్లాలలో ఉత్సవములు (ఒక్కొక్క జిల్లాకు రూ. 2,000/-చొ॥)... | 25,000 |
| 12. | మద్రాసు విశ్వవిద్యాలయమున శ్రీ వివేకానందస్వామిజి పేరున ఒక ఆచార్యపీఠమునకు కావలసిన మూలధనమును సమర్పించుట ... | 15,000 |
| 13. | పందిళ్లు, కుర్చీలు, ఎలక్ట్రిసిటీ వగైరాలు ... | 3,000 |
| 14. | అచ్చుపనులకు, తపాలాబిళ్లలకు, కాగితాలకు, ప్రయాణాలకు ... | 3,000 |
| 15. | ఇతర ఖర్చులు ... | 5,000 |
| | మొత్తము ... | 10,02,000 |

కావలసిన ధనవిరాళములను ఒసగవలసినదని మద్రాసునగరమందును దక్షిణభారతమందును గల ఉదారమహాజనులకందఱికిని ఈ క్రింద సంతకములుచేసిన మేము విజ్ఞాపించు

చున్నాము. రొక్కముగాని, చెక్కుగాని "రామకృష్ణమిషను—శ్రీ వివేకానందస్వామి సెంటినరి, మద్రాసు-4" అను విలాసమునకు దయతో పంపినయెడల కృతజ్ఞతతో అందుకొని రసీదులు పంపబడును. మిషనుకు ఒసగబడు విరాళములకు వరుమానపన్ను లేదు.

శ్రీ కైలాసానందస్వామి
శ్రీ కె. కామరాజ్
శ్రీ సి. సుబ్రహ్మణ్యం
శ్రీ ఎమ్. భక్తవత్సలం
డా॥ సి. పి. రామస్వామి అయ్యరు
డా॥ ఎ. లక్ష్మణస్వామి మొదలియార్
కర్నల్ వి. సుబ్రహ్మణ్యం
శ్రీ వి. టి. కృష్ణమాచారి
రాజా సర్ ఎమ్. ఎ. ముత్తయ్యచెట్టియార్
డా॥ పి. వి. చెరియను
శ్రీ ఎస్. అనంతరామకృష్ణన్
శ్రీ కె. బాలసుబ్రహ్మణ్యఅయ్యర్
శ్రీ ఓ. వి. అలగేశన్
శ్రీమతి ముత్తులక్ష్మిరెడ్డి
శ్రీ రామనాథ్ గోయంకా
శ్రీ జి. నరసింహన్
శ్రీ ఎస్. వి. రామమూర్తి
శ్రీ ఎమ్. ఎమ్. మురుగప్పచెట్టియా
శ్రీ జి. కుచేలర్
శ్రీ కె. ఎస్. రామస్వామిశాస్త్రి
శ్రీ ఎస్. వరదాచారి
శ్రీ టి. ఎస్. సంతానమ్
శ్రీమతి మేరీక్లబ్‌వాలా జాదవ్
సిస్టరు ఆర్. ఎస్. సుబ్బులక్ష్మి
శ్రీ ఎస్. ఎస్. వాసన్
శ్రీ వి. సి. గణేశన్
శ్రీ టి. సదాశివన్
శ్రీ సి. ఎస్. లోకనాథముదలియార్
శ్రీ వి. కె. రామస్వామిముదలియార్
శ్రీ వి. పాండురంగయ్య
జె. వి. సోమయాజులు
శ్రీ పి. సూర్యనారాయణ
శ్రీ ఎమ్. పి. శివజ్ఞానం
శ్రీ బి. జగన్నాథ్‌దాస్
శ్రీ లాల్‌చంద్‌దాదా
శ్రీ ఎమ్. సిటి. ముత్తయ్య
శ్రీ కరిముత్తు త్యాగరాజన్
శ్రీ శుద్ధసత్త్వానందస్వామి

# గ్రంథపరిచయం

కవికోకిల శ్రీదువ్వూరి రామిరెడ్డిగారి
డైరి - ఉత్తరాలు

కవికోకిల గ్రంథమాల, పెమ్మారెడ్డిపాళెం-ఎల్లాయపాళెం (పోస్టు), నెల్లూరు జిల్లా. మూల్యం రెండు రూపాయలు. సంకలనకర్త కె. వి. రమణారెడ్డిగారు.

మంచుకొండ తొమ్మిదివంతులు నీటిలో మునిగియుండును. ఒకవంతుమాత్రము నీటిపై తేలియుండును. నిభృతజీవితమున గభీరమనన మున, అంతరంగమున కవి సృజించుకొను అశేషభావములు కొన్ని చైతన్యలహరియం దుప్పొంగి సముచితపదజాలమున వ్యక్తమగును. క్రమగత నిదిధ్యాసన, ధ్యానసమాధులవలన ఆంతరంగికజీవనము విస్తరిల్లును. సమాధి యందు సృష్టియగు భావము దేవకీగర్భమందలి శ్రీకృష్ణపరమాత్మునివలె పరిఢవిల్లి "తేజో

మయి'' అనదగు వాక్కునందు ప్రసరించును. ఈరీతి తపస్సులోను, ప్రవచనవ్యక్తీకరణమందును ఆరితేఱిన మహాకవులు ప్రపంచమున అరుదుగా గోచరింతురు. వీరిలో కవికోకిల శ్రీదువ్వూరి రామిరెడ్డిగా రొకరు.

''డైరి - ఉత్తరాల' వాఙ్మయము ఆంగ్లమున, తదితరప్రతీచీ సారస్వతమున గలదు. భారతదేశమందలి మేలి రచయితలు కొందఱు ఈరీతి సాహితిని సృష్టించిరి. సత్వరపత్రికా ప్రకటనమందలి సారస్వతమునకును ఈరీతి సాహిత్యమునకును విశేషవ్యత్యాసము కలదు. ప్రకటనను దృష్టిలో నిడికొనక ఒకడు రచించిన లేఖలందును, డైరీవృత్తాంతములందును సత్యసందీపిత బహుళాంశము లుండును. కవిహృదయమున కీ వాఙ్మయము నిక్కంపుదర్పణము.

ప్రస్తుతగ్రంథమున ప్రజ లీవఱలో నెఱుగని బహుళాంశములు కలవు. ఇవి అమూల్యములు. నిగూఢమైయుండిన జీవితతత్త్వము, రసతత్త్వము, ఇందు గలదు. నిస్తులమై, నిర్మలమై, మహిమోపేతమైన శ్రీరామిరెడ్డిగారి జీవితప్రభావమును, కవిత్వమహత్త్వము ఈగ్రంథమున నొప్పుచుండుట భావుకులు గుర్తింతురు.

అర్ధాంగి అస్తమించినపుడు ఈయన హృదయమునుండి వెలారిన శోకరసవాహిని, ఈయన ప్రణయ మెట్టిదో, అంతరంగ మెట్టిదో పఠితలకు తెలుపును. చూడుడు:

'కన్నులు విచ్చి చూచితిని
కాంత శవంబును; జేతితోడనే
యన్నులమిన్న కాష్ఠమున
కగ్గి రగిల్చితి,......''

''మఱుపెఱుగల్గు నీనగవు
మాటలు, నీదరహాసచంద్రికాం-
కురములు, వచ్చిరాని మృదు
కోపము........''

ఇట్టి హృదయము గలవాడే మహాకవి కాజాలును. ఈ పద్యములోని అద్భుతభావనాశక్తిని గమనింపుడు.

''ఉ॥ పండిన పైరుచేల దన
పయ్యెద చెంగులకావిరంగు నీ
రెండలుగాయ సాంధ్యరమ
యింపుగ లాస్యమాసల్ప; దిక్కులా
ఖండల చాపపు౯ రజము
గ్రమ్మినరీతిరహింప, మున్నునా
దండకు నెనరాక, కవి
తా, విగతాశుని జేసితేగదా!''

కొలది దశాబ్దులకుమున్ను డాక్టరు కజిన్సుగారు కలకత్తా విశ్వకళాపరిషత్తులో ఉపాధ్యక్షులైన సర్ ఆశుతోషుముఖర్జీ మున్నగు మహావిద్వాంసులతో శోభిలు మహాసభలో ఒకానొక ఉపన్యాస సందర్భములో శ్రీరామిరెడ్డిగారి కవిత్వమునుగుఱించిన సూక్తులును, శ్రీరామలింగారెడ్డిగారి వైదుష్యమును గుఱించి తెలిపిన మాటలును విద్యార్థినై నాటి సభలోనున్న నాఅంతరంగమున ఇంకను ప్రతిధ్వనించుచున్నవి.

ఈ రామిరెడ్డిగారి జీవితమహిమను, కవితాసౌందర్యమును ఈరీతిగా లోకమునకు తెలుపు కె. వి. రమణారెడ్డిగారెంతయు వందనీయులు.

—జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి

సంపాదకులు : శ్రీ శుద్ధసత్త్వానందస్వామి, శ్రీ నేలటూరి భక్తవత్సలము,

శ్రీ. కే. ఎస్. ఎస్. రాజన్ గారిచే ది జ్యూపిటర్ ప్రెస్సు ప్రైవేట్ లిమిటెడ్ (మద్రాసు - 18) న ముద్రింపబడి,

# OUR ENGLISH PUBLICATIONS

| | *Price.* Rs. | nP. |
|---|---|---|
| Sri Ramakrishna the Great Master (2nd Edn.) (Calico) | 25 | 00 |
| „ „ (Morocco) | 35 | 00 |
| The Gospel of Sri Ramakrishna (3rd Edn.) (Calico) | 20 | 00 |
| „ „ (Morocco) | 30 | 00 |
| Ramakrishna : Prophet of New India | 10 | 00 |
| Sri Ramakrishna .. | 1 | 50 |
| Sayings of Sri Ramakrishna (9th Edn.) | 5 | 00 |
| Ramakrishna Upanishad (2nd Edn.) | 1 | 00 |
| Tales and Parables of Sri Ramakrishna (2nd Edn.) | 2 | 50 |
| The Ramakrishna Mission its ideals and activities .. | 0 | 50 |
| Sri Ramakrishna and His Mission (2nd Edn.) | 0 | 62 |
| The Master and the Disciple . | 2 | 00 |
| Sri Ramakrishna and Sarada Devi | 2 | 50 |
| Holy Mother Sri Sarada Devi (Gambhiranandaji) (Ordinary) | 7 | 00 |
| „ „ (Calico) | 9 | 00 |
| Sri Sarada Devi the Holy Mother (Tapasyanandaji) (Ordinary) | 6 | 50 |
| „ „ (Calico) | 8 | 00 |
| Inspired Talks (Swami Vivekananda) (8th Edn.) (Board) | 2 | 00 |
| „ „ (Calico) | 3 | 00 |
| Hinduism (4th Edn.) .. | 1 | 00 |
| Education (6th Edn.) .. | 1 | 00 |
| The Eternal Companion (3rd Edn.) (Ordinary) | 2 | 25 |
| „ „ (Calico) | 3 | 25 |
| For Thinkers on Education (Swami Ramakrishnananda) | 3 | 00 |
| The Story of a Dedicated Life (Life of Swami Ramakrishnananda) | 3 | 00 |
| The Message of Eternal Wisdom (Swami Ramakrishnananda) | 3 | 00 |
| God and Divine Incarnations (Swami Ramakrishnananda) | 2 | 25 |
| The Ancient Quest (Swami Ramakrishnananda) | 1 | 50 |
| Sri Krishna, The Pastoral and King-maker) (Swami Ramakrishnananda) (5th Edn.) .. | 1 | 25 |
| Life of Sri Ramanuja (Board) .. | 4 | 00 |
| „ „ (Cloth) .. | 5 | 00 |
| Isavasya Upanishad (7th Edn.) .. | 0 | 75 |
| Kena Upanishad (6th Edn.) .. | 0 | 75 |
| Katha Upanishad (8th Edn.) .. | 1 | 50 |
| Adventures in Religious Life (2nd Edn.) (Board) | 4 | 00 |
| (Cloth) | 5 | 00 |

| | *Price.* Rs. | nP. |
|---|---|---|
| Prasna Upanishad (5th Edn.) .. | 1 | 00 |
| Mundaka Upanishad (6th Edn.) .. | 1 | 00 |
| Mandukya Upanishad (7th Edn.) .. | 0 | 75 |
| Taittiriya Upanishad (4th Edn.) .. | 2 | 00 |
| Aitareya Upanishad (3rd Edn.) .. | 1 | 00 |
| Svetasvatara Upanishad (3rd Edn.) | 1 | 50 |
| Chandogya Upanishad .. | 8 | 00 |
| Brihadaranyaka Upanishad (2nd Edn.) | 7 | 50 |
| Mahanarayanopanishad .. | 5 | 00 |
| Srimad-Bhagavad-Gita (Swami Vireswarananda, with Sridhara's Gloss) .. | 7 | 00 |
| Bhagavad-Gita : the Song of God (4th Edn.) | 2 | 75 |
| Upadeshasahasri .. | 3 | 50 |
| Atmabodha .. | 4 | 00 |
| Yatindramatadipika .. | 5 | 00 |
| Srimad Bhagavatam : The Wisdom of God .. | 3 | 50 |
| Stotraratna (2nd Edn.) .. | 0 | 75 |
| Divine Life (4th Edn.) .. | 3 | 00 |
| Universal Prayers (5th Edn.) .. | 2 | 25 |
| Prince of Ayodhya (Ordinary) | 3 | 00 |
| „ „ (Calico) | 4 | 50 |
| Vedic Religion and Philosophy (4th Edn.) | 2 | 50 |
| Narada Bhakti Sutras (3rd Edn.) .. | 3 | 00 |
| Vakyavritti & Atmajnanopadeshavidhi (2nd Edn.) .. | 1 | 00 |
| Devi-Mahatmyam (Chandi) (2nd Edn.) | 2 | 00 |
| Saint Durga Charan Nag (3rd Edn.) | 2 | 25 |
| Thus Spake Sri Ramakrishna (7th Edn.) | 0 | 40 |
| Thus Spake The Holy Mother (2nd Edn.) | 0 | 37 |
| Thus Spake Vivekananda (8th Edn.) | 0 | 40 |
| Thus Spake The Buddha (2nd Edn.) | 0 | 40 |
| Thus Spake Sri Krishna (2nd Edn.) | 0 | 40 |
| Thus Spake The Christ (2nd Edn.) | 0 | 40 |
| Worship of Sri Ramakrishna .. | 1 | 00 |
| A Man of God (Ordinary) | 3 | 00 |
| „ „ (Calico) | 4 | 00 |
| Buddha and Our Heritage .. | 0 | 40 |
| Swami Vivekananda, My Master .. | 0 | 37 |
| Path to Perfection .. | 0 | 37 |
| Consolations .. | 0 | 31 |
| Women of India .. | 0 | 25 |
| Spiritual Life .. | 0 | 06 |
| Path Beyond Sorrow .. | 0 | 06 |

**Please ask for the Detailed Catalogues of our Tamil and Telugu Books**

**SRI RAMAKRISHNA MATH,** *Publication Dept.,* **MYLAPORE, MADRAS-4**

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటము ౧౮ ౧౯౬౨, మార్చి; ప్లవ - ఫాల్గుణము సంచిక ౯

## విషయసూచిక

# శ్రీ రామకృష్ణ మఠ ప్రచురణములు

740 పుటలు శ్రీరామకృష్ణ సూక్తి సుధ (తొలికూర్పు) రూ. 7/50
496 పుటలు శ్రీ రామకృష్ణ లీలామృతము (ద్వితీయ ముద్రణము) రూ. 5/-
144 పుటలు శ్రీ శారదాదేవి రూ. 1-25
312 పుటలు శ్రీ శారదా ప్రసంగములు రూ. 3-00
540 పుటలు శ్రీ రామకృష్ణ బోధామృతము (సంగ్రహ జీవితసహితము) రూ. 3-50
432 పుటలు (సాదా) రూ. 3-50 శ్రీవివేకానంద జీవితచరిత్ర (అట్టబైండు) రూ. 4/-
564 పుటలు స్వామి - శిష్య సంవాదములు (ప్రథమ ముద్రణము) రూ. 5/-
344 పుటలు బ్రహ్మానంద బోధనలు (ప్రథమ ముద్రణము) రూ. 3-50
330; 324 పుటలు సందేశతరంగిణి - 2 భాగములు (ఒక్కొక్క భాగము) రూ. 3/-
402 పుటలు పారమార్థిక సంభాషణలు రూ. 3/-
504 పుటలు శ్రీమద్భగవద్గీత (పంచమ ముద్రణము) రూ. 4/-

జ్ఞానయోగము 4 00 రాజయోగము 2 50
కర్మయోగము 1 50 భక్తియోగము 1 50
నారద భక్తి సూత్రములు ... 3/-
పరతత్త్వప్రసంగము ... 2/-
శ్రీ నాగమహాశయుని జీవితచరిత్ర ... 1 25
ప్రబోధరత్నాకరము ... 2 25
శ్రీ శారదాదేవి చరిత్ర ... 2/-
దేవీమాహాత్మ్యము ... 2/-
వివేకానందలేఖావళి (మొదటిభాగము) 1 50
వివేకానందలేఖావళి (రెండవభాగము) 1 75
శ్రీరామకృష్ణోపనిషత్తు ... 1 25
హిందూ మతము ... 1 25
అనుష్ఠాన వేదాంతము ... 1 25
కలము, సంస్కృతి, సామ్యవాదము 1/-
వివేక సూర్యోదయము ... 1 25
భారతీయ మహిళ ... 1/-
కఠోపనిషత్తు ... 0 80
శ్రీ పరమహంస నీతికథారత్నములు 0 75

గిరీశచంద్ర 0 75 భక్తిమార్గము 0 50
చికాగో నగరోపన్యాసములు ... 0 50
గురూపదేశములు 0 50 శ్రీకృష్ణవాణి 0 40
శ్రీ రామకృష్ణ ఉవాచ ... 0 37
శ్రీ వివేకానంద శంఖారావము ... 0 37
శ్రీ శారదా సూక్తి నవనీతము ... 0 40
నా సంస్కరణ యుద్ధవిధానము ... 0 37
నా గురుదేవుడు 0 40 బుద్ధ ఉవాచ 0 37
శ్రీరామకృష్ణుడు, వివేకానందస్వామి 0 25
శ్రీ పరమహంస జీవిత సంగ్రహము... 0 25
పరమహంస శ్రీరామకృష్ణుడు ... 0 25
నవీన భారతదేశము ... 0 25
తాపత్రయ చికిత్స ... 0 25
పవహారిబాబా 0 25 ముక్తిమార్గము 0 19
సర్వం విష్ణుమయం జగత్ ... 0 19
శ్రీ రామకృష్ణ ఆరాత్రికము ... 0 12
శ్రీరామనామసంకీర్తన 0 6 యతిగీతము 0 6
నామతము 0 3 వి. సింహగర్జనము 0 3

శ్రీ దొడ్డ భాగవతము - మొదటి సంపుటము రూ. 6-50; రెండవ సంపుటము రూ. 5-50;
మూడవ సంపుటము రూ. 7-50 (మూడును ఒకేసారి కొన్నచో: రూ. 18-50)
ఇవియేకాక సంస్కృత, ఆంగ్ల, తమిళ, హిందీ, కన్నడ గ్రంథములు,

వేదాంత కేసరి (ఆంగ్లము) శ్రీ రామకృష్ణ విజయము (తమిళము)
అను మాసపత్రికలును మాయొద్ద దొరకును

అడ్రెసు : మేనేజరు, శ్రీరామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు - 4



'అఖిలవిభు శరణొందుమ, యా క్షణంబ యతనికృప నీవ ననుభావ్య మగును వత్స.'

—శ్రీ శారదామణి.


# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము ౧౨ } ౧౯౬౨ - మార్చి :: ప్లవ - ఫాల్గుణము { సంచిక


## సౌందర్యలహరి

మూలము : శ్రీ శంకరభగవత్పాదులు

టీక : నే. భ.

తటిల్లేఖాతన్వీం తపనశశివైశ్వానరమయీం
నిషణ్ణాం షణ్ణా మప్యుపరి కమలానాం తవ కలామ్
మహాపద్మాటవ్యాం మృదితమలమాయేన మనసా
మహాన్తః పశ్యన్తో దధతి పరమాహ్లాదలహరీమ్ ॥ ౨౧

| | |
|---|---|
| (హే భగవతి) | (అమ్మా) |
| తటిత్ + లేఖ | మెఱుపుదీగవలె |
| తన్వీం | క్షణప్రభారూపము గలదియు |
| తపన | సూర్య |
| శశి | చంద్ర |
| వైశ్వానర | అగ్ని |
| మయీం | ఆత్మికయు |
| షణ్ణాం | ఆఱు |
| కమలానాం అపి | (మూలాధారము మున్నగు) కమలములకును |
| ఉపరి | పైని |
| మహాపద్మ | సహస్రార కమల మనెడి |
| అటవ్యాం | అడవియందు |
| నిషణ్ణాం | నెలకొన్నదియు అగు |
| తవ | నీ |
| కలాం | కళను |
| మహాన్తః | యోగీశ్వరులు |
| మృదిత | ధ్వంసితమైన |
| మల | (కామాదులగు) మఱికియు |
| మాయా | మాయయు గల |
| మనసా | మనస్సుతో |
| పశ్యన్తః | చూచుచు |
| పరమ + ఆహ్లాద | బ్రహ్మానందపు |
| లహరీం | ప్రవాహమును |
| దధతి | అనుభవింతురు. |

తా॥ అమ్మా, నిర్మలమును భ్రాంతిరహితమునగు చిత్తముతో యోగీశ్వరులు షట్కమలములకును పైని సహస్రారకమల వనమధ్యమున సాదాఖ్యమగు నీ నిత్యకళను దర్శించుచు బ్రహ్మానందము ననుభవింతురు. మెఱుపుతీగవలె తళుక్కు మను ఆ నీ కళ సూర్యచంద్రాగ్న్యాత్మకము.

భవాని త్వం దాసే మయి వితర దృష్టిం సకరుణా
మితి స్తోతుం వాఞ్ఛన్ కథయతి భవాని త్వ మితి యః
త దైవ త్వం తస్మై దిశసి నిజసాయుజ్యపదవీం
ముకున్ద బ్రహ్మేన్ద్ర స్ఫుట ముకుట నీరాజిత పదామ్ ॥ ౨౨

| | | | |
|---|---|---|---|
| భవాని | ఓ భవుని రాణీ | కథయతి | పల్కునో |
| త్వం | నీవు | తస్మై | అతనికి |
| దాసే | కింకరుడనగు | తదా+ఏవ | అప్పుడే అక్షణమందే |
| మయి | నాయందు | త్వం | నీవు |
| సకరుణాం | కరుణతోగూడిన | ముకున్ద | విష్ణుని |
| దృష్టిం | చూపును | బ్రహ్మ | చతుర్ముఖుని |
| వితర | ప్రసరింపజేయుమా | ఇన్ద్ర | ఇంద్రుని |
| ఇతి | అని | స్ఫుట | ఉజ్జ్వలములగు |
| స్తోతుం | స్తుతింప | ముకుట | కిరీటములచే |
| వాఞ్ఛన్ | కోరుచు | నీరాజిత | హారతికొన్న |
| భవాని | ఓ భవుని రాణీ | పదాం | పదములుగల |
| త్వం | నీవు | నిజ | నీతోడి |
| ఇతి | అని | సాయుజ్యపదవీం | ఐక్యమును |
| యః | ఎవడు | | ప్రసాదింతువు. |

తా॥ ‘ఓ భవానీ, నీ కింకరుడ నగు నాయందు నీ కృపాదృష్టిని పాటింపుమా’ అని నిన్ను స్తోత్రము చేయ గోరిన భక్తుడు ‘ఓ భవానీ, నీ’ అని వాక్యమును ప్రారంభించిన తత్క్షణమే, ఆవాక్యమైనను పూర్తియగులోపుననే అతనికి నీవు విష్ణు బ్రహ్మ దేవేంద్రుల కిరీటకాంతులచే నీరాజనమునొందు చరణములు గల నీతోడి సాయుజ్యమును ప్రసాదింతువు.

త్వయా హృత్వా వామం వపు రపరితృప్తేన మనసా
శరీరార్ధం శమ్భో రపర మపి శఙ్కే హృత మభూత్
య దేతత్ త్వ ద్రూపం సకల మరుణాభం త్రినయనం
కుచాభ్యా మానమ్రం కుటిలశశిచూడాలమకుటమ్ ॥

| | | | |
|---|---|---|---|
| (హే భగవతి) | (ఓ అమ్మా) | యత్ | ఏల యన |
| త్వయా | | | ఈ |
| శమ్భోః | శివుని | త్వద్రూపం | నీ రూపము |
| వామం వపుః | మేని యెడమ భాగము | సకలం | సమస్తమును |
| హృత్వా | అపహృతమై | అరుణాభం | ఎఱుపుకాంతి గలదియు |
| అపరితృప్తేన | తనివినొందని | త్రి నయనం | మూడు కన్నులు గలదియు |
| మనసా | మనస్సుచేత | కుచాభ్యాం | చన్నుల (బరువు)చే |
| అపరం | రెండవదగు | ఆనమ్రం | ఇంచుక వంగినదియు |
| శరీర+అర్ధం అపి | సగము మేనుగూడ | కుటిలశశి | నెలవంక అనెడి |
| హృతం అభూత్ | అపహరింపబడెను | చూడాలం | కిరీటము గలదియు |
| ఇతి శఙ్కే | అని తలంతును | (జాతం) | (ఐనది) |

తా॥ అమ్మా, శివుని మేనిలో ఎడమసగమును అపహరించుటతో నీ మనసు తనివిజెందలేదనియు కుడిసగమునుకూడ నీవు అపహరించితి వనియు తోచుచున్నది. ఏల యన ఈ నీ రూపములో సగము కాక, అంతయునే ఎఱుపువన్నె గల్గి యున్నది. ఒక్క స్తనము కాదు, రెండు స్తనములును మేనిని వంచుచున్నవి. కన్నులు మూ డున్నవి. నెలవంక కిరీట మున్నది.

జగ త్సూతే ధాతా, హరి రవతి, రుద్రః క్షపయతే,
తిరస్కుర్వ న్నేత త్స్వమపి వపు రీశ స్తిర యతి
సదాపూర్వ స్సర్వం త దిద మనుగృహ్ణాతి చ శివ
స్త వాజ్ఞా మాలమ్బ్య క్షణచలితయో ర్భ్రూలతికయోః ౨౪

| | | | |
|---|---|---|---|
| (దేవి) | (అమ్మా) | ఈశః | మహేశ్వరుడు |
| క్షణ | క్షణమాత్రము | ఏతత్ | బ్రహ్మ విష్ణు రుద్రు లను త్రితయమును |
| చలితయోః | కదల్పబడ్డ | | |
| తవ | నీ | తిరస్కుర్వన్ | ఆవరించుచు |
| భ్రూలతికయోః | కనుబొమ తీగల | స్వం | తన |
| ఆజ్ఞాం | ఆనతిని | వపుః అపి | మేనిని సైతము |
| ఆలమ్బ్య | అవలంబించి | తిరయతి | (సదాశివ తత్త్వములో) అంతర్హిత మొనర్చుకొనును |
| జగత్ | జగమును | | |
| ధాతా | బ్రహ్మ | సదాపూర్వః శివః | సదాశివుడు |
| సూతే | సృజించును | తదిదం | బ్రహ్మ విష్ణు రుద్ర మహేశానులనెడి తత్త్వ చతుష్టయమును |
| హరిః | విష్ణువు | | |
| అవతి | రక్షించును | | |
| రుద్రః | రుద్రుడు | అనుగృహ్ణాతి | (సృజించి)అనుగ్రహించును |
| క్షపయతే | సంహరించును | | |

తా॥ బ్రహ్మ సృజించుటయు, విష్ణువు రక్షించుటయు, రుద్రుడు సంహరించుటయు, ఈశానుడు బ్రహ్మ విష్ణు రుద్రులను సంహరించి తన రూపును సైతము సదాశివతత్త్వములో అంతరింపజేసికొనుటయు, సదాశివుడు మరల ఈసర్వము ననుగ్రహించుటయు — అమ్మా తీగలంబోని నీ కనుబొమలకదలికచే సూచితమైన ఆజ్ఞచేతనే.

త్రయాణాం దేవానాం త్రిగుణజనితానాం తవ శివే
భవేత్ పూజా పూజా తవ చరణయోర్ యా విరచితా
తథా హి త్వత్పాదోద్వహన మణిపీఠస్య నికటే
స్థితా హ్యేతే శశ్వ న్ముకులితకరో త్తంస మకుటాః ॥

| | | | |
|---|---|---|---|
| హే శివే | ఓ శివమహిషీ | (విరచితా) | (కావింపబడిన) |
| తవ | నీ | పూజా | పూజ |
| చరణయోః | పాదములందు | (భవేత్) | (అగును) |
| యా | ఏ | తథాహి | అట్లే కదా |
| పూజా | పూజ | ఏతే | వీరు (బ్రహ్మ విష్ణు రుద్రులు) |
| విరచితా | కావింపబడినది | శశ్వత్ | సదా |
| భవేత్ | అగునో | త్వత్ | నీ |
| (సైవ) | (అదే) | పాద+ఉద్వహన | పాదముల మోయు |
| తవ | నీ | మణిపీఠస్య | రత్నాల పీటకు |
| త్రిగుణ | రజస్సత్త్వతమము లనెడి మూడు గుణములనుండి | నికటే | సమీపమున |
| | | ముకుళితకర | మోడ్పు కేలే |
| జనితానాం | జనింపజేయబడ్డ వారగు | ఉత్తంస | సిగదండగాగల |
| త్రయాణాం | బ్రహ్మ విష్ణు రుద్రులను ముగ్గురు | మకుటాః | కిరీటములుగలవారై |
| | | స్థితాహి | ఉన్నారు కదా. |
| దేవానాం | దేవతలకు | | |

తా॥ ఓ శివునిరాణీ, బ్రహ్మ విష్ణు రుద్రులు నీ త్రిగుణములచే పుట్టినవారు. వారు సదా కేల్మోడ్పునే సిగదండగా తమ కిరీటములపై అమర్చుకొని నీ రత్నాల పాదపీఠమునకు చెంత ఉందురు. కావున నీ పాదములకు చేసిన పూజయే వారికి చేసిన పూజయు అగును.

# కర్మయోగమునుగూర్చి పరమహంస గురుదేవుని సూక్తులు

కార్యాచరణమూలమున భగవంతునితో సాంగత్యము కల్గియుండుటే కర్మయోగము. ఫలాపేక్షవదలి సంసార విధులను నిర్వర్తించుకొనుటయు కర్మయోగమే అగును.

నీవు భగవంతునకేది అర్పించినను అది వేయింతలుగా నీకు తిరిగివచ్చును. కావున నీవు ఏ కర్మ చేసినను, చివరకు ఆ కర్మఫలమును భగవదర్పితముచేసి నీళ్లు విడువుము.

ఈ కలియుగమున భగవద్భక్తి రహితమైన కర్మము నిలువజాలదు. అట్టిది ఇసుకతో వేసిన పునాది వంటిది. కావున ముందు దైవభక్తిని సాధనచేయుము. అది కుదిరెనా పిమ్మట నీవు విద్యాశాలలు, వైద్యశాలలు మున్నగునవి ఏవి కట్టించినను అవి సార్థకములగును. ముందు భక్తి, తరువాతే కర్మము. భక్తి శూన్యమగు కర్మ కేవలము నిస్సహాయము. అది తనకాళ్లపై తాను నిలబడజాలదు.

ఉద్రేక పూరితులగు సంఘ సంస్కర్తలను కొందఱనుద్దేశించి శ్రీ గురుదేవుడు ఒకసారి ''మీరు ఈ ప్రపంచమునకెల్ల ఏదో ఒరిగింతుమని ప్రగల్భములు పలుకుచుందురు. కాని, అది అంత తేలికా? అయినను, ఈ ప్రపంచమునకు మేలుచేయుటకు మీరెవ్వరు? ముందు భక్తి సాధనలు చేసి భగవంతుని దర్శింపుడు. అప్పుడుగాని లోకహితము చేయుటకు వలయు ఆవేశము, శక్తి మీకు కలుగవు. అంతవఱకు లోకమునేదో ఉద్ధరింతుమని గొప్పలు చెప్పకొనకుడు'' అని పలికెను.

ప్రశ్న : మఱి, భగవంతుని దర్శించువఱకును చేతులు ముడుచుకొని కూర్చుండవలయుననియా మీ ఉపదేశము?

జవాబు : నేనట్లు చెప్పితినా? అంతవఱకు, ఊరక కూర్చుండుటేల? ధ్యానము, సంకీర్తనము, భగవన్నామస్మరణము మొదలగు భక్తి సాధనలు మాత్రము చేయుచుండవలెను.

ప్రశ్న : మేము ప్రాపంచిక కర్మలను గుఱించి చెప్పచున్నాము. భగవద్దర్శనము కలుగువఱకు వీనినెల్ల వదలివేయవలెనా?

జవాబు : ఈ తనువు నిల్పుకొనుటకు అవి ఎంతమట్టుకు అనివార్యములో అంతమట్టుకే వానిపై శ్రద్ధ చూపుడు. కాని, ఈ ప్రాపంచిక కర్మలుచేయుచునే, భగవంతుని కటాక్షముకొఱకును, ఆశాభీతులకు చలింపని మనస్థైర్యముకొఱకును, కన్నుల నీరుకాఱ సర్వేశ్వరుని ప్రార్థింపుడు.

*　*　*

కర్మము ప్రకృతిసిద్ధమగుటచే మానవులకు అనివార్యము. కావున మీమీ పనులను యుక్త విధమున (అనగా నిస్సంగబుద్ధితో) నెఱవేర్చుకొనుడు. నిస్సంగమగు కార్యాచరణమనగా

ఇహాపరములందు ప్రతిఫలాపేక్షగాని, శిక్షా భయముగాని లేక కర్మము నాచరించుట. ఇట్టి కర్మమువలన భగవత్ప్రాప్తి కలుగును. ప్రతి కార్యమును గమ్యమున కొక మార్గమే. భగవంతుడే పరమగమ్యుడు.

కర్మమే జీవిత పరమార్థమనియు, సరి మనియు, భావింపకుము. కర్మము ఒక సాధనము మాత్రమే; అదియు, నిస్సంగముగా ఆచరింపబడినప్పుడే! అసలు జీవిత లక్ష్యము భగవంతుని దర్శించుట!

* * *

కర్మఫలమెల్ల భగవంతునకు అర్పించుటే కర్మయోగమందురు.

* * *

మానవుని శివస్వరూపునిగ భావించి సేవా భావమున వానికై పాటుపడుము; అంతేగాని, అతడు నీకన్న హీనుడని తలచి నీవేనో ఒరిగించుచున్నానని మాత్రము భావింపకుము.



# పరమహంస శ్రీరామకృష్ణుని ఉపదేశసారము

## శ్రీ చిరంతనానందస్వామి

శ్రీరామకృష్ణుడు బోధించిన దేమి? 'మాటలమూలమునకంటె చేతలమూలమున' నాతడెక్కువ బోధించెననుట ముమ్మాటికిని నిజము. ఆతని దివ్యోపదేశము లాతని జీవితమున రూపు దాల్చినవి. ఆత డెన్నడును వ్రాసి యెఱుగడు, ఉపన్యసించియెఱుగడు. కానితనబోధనల నన్నిటిని సంభాషణరూపమున జిజ్ఞాసువులకొసగెను. ఈ సంభాషణములను గొన్నిటిని శిష్యు లతి జాగరూకతతో వ్రాసి భద్రపఱిచి యున్నారు. కాని యీ మూలములైనను ఆతని బోధనలను సమగ్రముగా దెలుపునని చెప్పజాలము. వాగ్రూపమున — సంభాషణ రూపమున— ఆత డొనరించిన బోధనలలో శిష్యులు స్వయముగా వ్రాసియుంచిన వన్నియు — విస్తారమగు వాఙ్మయమున బహు గ్రంథములలో గాన నగు నాతనియమూల్యోపదేశములన్నియు — యథారూపమున 'శ్రీరామకృష్ణబోధామృతము'న క్రోడీకరింపబడియున్నవి. కాని యిందు గూర్పబడిన విషయములు వివిధ సందర్భములలో జెప్పబడినవగుటచే సామరస్యమును—ఏకవాక్యతను—గూర్చుట కెన్ని యుపాయముల మేమెంత ప్రయత్నించియున్నను, అదుకులు గాన్పింపక మానవు — కొంతవఱకైనను విషయము ఖండఖండములుగా దోపక మానదు. బోధనలను క్రమవికాసమార్గమున బొందుపఱచుటకై శ్రద్ధ వహించియున్నను, అందలి ప్రధానతత్త్వములను ఇట సంగ్రహముగా దెల్పినచో, పాఠకజన సామాన్యము

నకు విశేష ప్రయోజనకరమగునని మా ఆశయము. ఐనను దిగ్దర్శన్యాయమున ఈ క్రింద జూపబడు విషయములు ప్రత్యేకమైన యొక మతమునుగాని, సంప్రదాయమునుగాని నిరూపించునవి కావని పాఠకులు గమనింతురుగాక. శ్రీరామకృష్ణపరమహంస ప్రత్యేకమగు నే మతమునుగాని, యే సంప్రదాయమునుగాని, యే సిద్ధాంతమునుగాని ప్రకటించియుండలేదు, బోధించియుండలేదు. వివిధోపాసనా వాహినులు— వివిధమతసాధనలు— అతని విజ్ఞానసాగరమున లీనమై యొప్పుచున్నవని గమనింపవలసియున్నది. అందలి సారామృతమే యీ క్రింది తత్త్వసంగ్రహము.

సత్యము, (తత్త్వము) స్వయంజ్యోతి. ఏకమగు నీ తత్త్వమే ప్రపంచమందలి వివిధమతములచే భగవంతుడు, అల్లా, బుద్ధుడు, శివుడు, విష్ణువు, బ్రహ్మము— మొదలగు నామములచే సూచింపబడుచున్నది. సాకారమదియే, నిరాకారము నదియే; సగుణమదియే, నిర్గుణము నదియే, నిరాకార బ్రహ్మమనునది సాకార బ్రహ్మముకంటె తక్కువదనిగాక, నిరుపాధికమని భావింపనగును.

స్వతస్సిద్ధముగా బ్రహ్మము సర్వాతీతమయ్యు, పరమేశ్వరాంశమున (లీలారూపమున) చేతనాచేతన ప్రపంచమున కంతకును మూలాధారమై సృష్టిస్థితిలయకారణమైయొప్పుచున్నది. ఈభావముననే బ్రహ్మము జగత్పితయనిగాని జగన్మాతయనిగాని సూచితమగుచున్నది. జీవులును జగత్తునుగూడ బ్రహ్మస్వరూపములే— పరమేశ్వర స్వరూపములే.

భక్తునకు ఆతడు ప్రేమమూర్తి, జీవనజ్యోతి. సంసారదుఃఖములు తన్ను మఱచి సంచరించుచున్న తనబిడ్డలను తిరిగి తనయొద్దకు జేర్చుకొనుటకై ఆతడు వినియోగించు నుపాయములు. సర్వాంతర్యామియై వెల్గొందుచున్నను భక్తిపూరితు లగువారలకు ఆత డత్యంతాప్తుడు. మానవుని హృదయాంతరాళమునుండి వెలువడు ప్రార్థనల నాత డాలకించును— ఆలకించి తనకటాక్షమును వానిపై బఱపును.

నిర్గుణనిరాకారతత్త్వమున వానిని జ్ఞానమార్గముచే భావింపనగును; సగుణసాకారరూపమున వానిని భక్తిమార్గమున బొందవచ్చును. ఐనను ఆత్మార్పణముతో గూడిన భక్తిమార్గమే మానవున కెంతయు సహజము, సులభము. ఈ మార్గము నవలంబించువారల కాతడు జ్ఞానఫలమగు బ్రహ్మైక్యమునుగూడ ప్రసాదించును. భక్తిమార్గమున భగవానుని మన తండ్రిగాగాని, తల్లిగాగాని, మిత్రునిగాగాని, పుత్రునిగాగాని, ప్రాణేశ్వరునిగాగాని, సన్నిహితము, ప్రియతమమునగు మఱి యే యితర సంబంధమునగాని భావింపనగును, భజింపనగును. భక్తుని మనోభావమననుసరించి భగవానుడు వివిధదివ్యరూపములతో సాక్షాత్కరించుచుండును.

సాక్షాత్కారవాఙ్మయమున అద్వైతము తుదిమాట. అది మనస్సునకును మాటలకును అతీతమగుటచే యోగసమాధిలో ననుభవింపబడవలసినదే. మనస్సును బుద్ధియు విశిష్టాద్వైతమువఱకుగల విజ్ఞానమును గ్రహించి మాటలలో జెప్పగలుగును. వానిని దాటి యవి పోజాలవు. సంపూర్ణ విశిష్టాద్వైతావస్థయం దఖండ సచ్చిదానంద వస్తువును తద్బాహ్యరూపమును సమముగా సత్యములని కనుగొనవచ్చును.

తన యనంతకారుణ్యముచే భగవాను డవతరించును. బ్రహ్మమార్గమును—ధర్మమార్గమును—లోకమునకు దెలుపుటకై ఆత్మశక్తికిని పవిత్రతకును నిలయమగు నొకానొక దివ్యమానవ రూపమున నాత డావిర్భవించును. వివిధదేశ కాలములలో లోకమునకు ఆధ్యాత్మిక జీవనమార్గములను జూపిన ధర్మస్థాపకులందఱును ఇట్టి యవతారపురుషులే—లేదా, ఈశ్వరాదేశమునొందిన మహనీయులే. వారి నారాధించుటయు వారి జీవితచరితములను ధ్యానించుటయు ఆత్మవికాసమునకు అమోఘ సులభోపాయములు.

జీవునివ్యక్తిత్వమునకు ఈశ్వరచైతన్యముతో సన్నిహిత సంబంధము గలదు; ఏలన పరమేశ్వరచైతన్యమే ఉపాధి బద్ధమై జీవ రూపమున భాసించుచున్నది. కావున ప్రతి జీవియందును దివ్యత్వము — ఈశ్వరత్వము— గర్భితముగా నున్నది. బాహ్యాంతర ప్రకృతులను వశమొనర్చుకొని యంతర్గతముగానున్న ఈశ్వరత్వమును ప్రకాశితమొనర్చుటయే జీవిత పరమావధి. సరియగు మనోభావముతో నవలంబించినచో, సమస్తధర్మమార్గములును ఈ యాత్మవికాసము నొనగూర్చునవియే.

బ్రహ్మసాక్షాత్కారమును బొందుటకై జ్ఞానయోగము, కర్మయోగము, భక్తియోగము, రాజయోగము నను ముఖ్య యోగములలో దేనినిగాని, కొన్నిటినిగాని, అన్నిటినిగాని యవలంబింపనగును.

పారమార్థికజీవనమునకు ప్రధానాంగము బలము—శారీర మానసి కాధ్యాత్మిక బలము. బలమే పుణ్యము, దౌర్బల్యమే పాపము. బలమున కంతకును మూలకారణము నమ్మిక — తనయందును భగవంతునియందును నమ్మిక; ఆత్మనిరసనము అనగా స్వయముగా తాను పాపి ననుకొనుట ధర్మలక్షణముకానేరదు. అట్టి దౌర్బల్యమును త్రోసిరాజనవలయును. ఏలన స్వతస్సిద్ధమగు తనదివ్యత్వమును ధ్యానించుటచే మానవుడు పాపముక్తుడు కాగలడుగాని, "నేను పాపిని, పాపి"నని కుందుచుండుటచే విముక్తుడు కాజాలడు. నిజముగా "అమృతపుత్రు"డగు మానవుని పాపి యనుటకంటె మహాపాపము మఱియొకటి లేదు.

అవినీతిపరు డగువాడు పాపమునకు వెఱవనివాడు పారమార్థికుడగుట కలలోనివార్త. సమస్తనీతినియమములకును మూలాధారము స్వార్థరాహిత్యము, స్వార్థరాహిత్యమునకు మూలాధారము వైరాగ్యము. వైరాగ్యమనగా కామినీకాంచనసంగత్యాగము. వినిర్మల వర్తనమున, సర్వభూతహితాచరణమున, సర్వేశ్వరుని బొందవలయునను పరితాపమున, వైరాగ్యము ప్రజ్వలించును. ఇట్టివైరాగ్యముచే వినిర్మలమగు హృదయమున భగవానుడు ప్రతిఫలించును. దుర్లభమగు మానవ జన్మము నెత్తియు భగవద్దర్శనము నొందనివాని జీవితము — తుదకందులకై తగు సాధనమైన నొనర్పనివాని జీవితము నిరర్థకము, నిరర్థకము!

# శ్రీరామకృష్ణుని విశిష్టసందేశము

## [సంపాదకీయము]

అస్తమించిపోవుచున్న గతకాల చరిత్రమునకును ఉదయోన్ముఖమైన భవిష్యత్కాల చరిత్రమునకును సేతువుగా వెలయువారు లోకాచార్యులు, మార్గసంస్థాపకులు, భగవదవతారమూర్తులు. అవతారమూర్తులు గతకాలవిషయములలో శ్రేష్ఠములైన వానిని ఏఱి, వాని త్రుప్పును నులిపివేసి వానిని పరమోచ్చస్థితికి గొనివచ్చుటే కాక భవిష్యత్కాలపథములను వైభవములనుగూడ సూచింతురు. భౌతిక – వైజ్ఞానిక – నైతి – కాధ్యాత్మికాది సకలమందును, వారు తమ కనంతరము పెక్కుశతాబ్దములవఱకు పనికివచ్చు సరకును సామగ్రిని పెట్టిపోవుదురు. వారు విష్ణుదేవులు స్రష్టలు, ప్రాత పరికరములనుండియే వారు క్రొంగ్రొత్తనమూనాలను మెల్లగా నిరాడంబరముగా తయారు చేయుచుందురు. క్రొత్తసంస్కృతిని నాగరికతను రూపుదాల్చ జేయుచుందురు. వారి దారి నిర్మాణాత్మకముగ నుండునే కాని విప్లవాత్మకముగ నుండదు.

అట్టి లోకాచార్యులలో శ్రీరామకృష్ణు డొకడు. ఆయనజీవితమును ఉపదేశములును మానవలోకమున కంతటికిని నూతనమహోజ్జ్వలసంస్కృతికి పునాదులు వేసినవి. ఏబదేండ్ల జీవితములో ఆయన మానవజాతిగతకాలాధ్యాత్మికచరిత్రమునంతటిని ఇముడ్చుకొన్నాడు. అంతఃకలహములకు పోరాటములకు కారణములుగ నుండిన శాఖాసీమల నెల్ల ఖండించి విశ్వమున నున్న వివిధానేకమతములకు ఆయన చక్కని సామరస్యమును, పొత్తును కుదిర్చినాడు. ఏ మతముగాని తన ప్రత్యేకతను ప్రత్యేకాభివృద్ధిని కోల్పోక ఇతరమతములతో సహకారభావముతో ఉండగల రీతిని ఆయన బోధించినాడు.

ఆయన చేసిన గొప్పకార్య మిది. ఆత్మకు ఆత్మేతరమునకు విరోధము లేదని తెల్పినాడు. ప్రకృతి మనలను ఆత్మనుండి దూరీకరింపదనియు ఆత్మలో నిగూఢముగ నున్న వైభవములను ప్రకాశపఱచుననియు ఆయన చెప్పినాడు. పెక్కుశతాబ్దములుగా ఆ రెంటికిఅగపడుచుండిన విరోధము దాని దాని స్వభావఫలితము కాదనియు మహాపురుషులలో అవి వెలువడినపుడు చూచిన ఇతరులు అపార్థముచేసికొనుటవలన ఆ విరోధము కనిపించిన దనియు ఆయనఅభిప్రాయము. సరిగా గుర్తించితిమేని భగవంతునిలీలలలో అవి ఒండొంటికి సహాయములు, మిత్రములు. 'మార్క్స్' వర్గమువారు ప్రకృతి, ఆత్మ అను రెంటిలో ప్రధాన మేది అనుచు లేవదీసిన జగడమును శ్రీరామకృష్ణుని పరిష్కారము నిర్మూలము చేసినది. ఇందుచే వర్తమాననాగరకతాసంస్కృతులలో శ్రీరామకృష్ణు నుపదేశప్రాముఖ్యము స్పష్ట మగును. 'అ', 'ఆ' 'అ', 'ఆ' అను అనంతపరంపరలో ముందు వెనుకలే లేవు. 'రూపొందినది' 'పొందిన రూపము'— ఈ రెంటిలో ఒకటి మఱొకదాని

కన్న మిన్న కాదు. వానిలో ఒకటి లేనిదే ఇం కొకటి యుండదు, సూర్యునివలె, సూర్య కిరణములవలె.

శ్రీరామకృష్ణుని ఉపదేశములో ప్రతిదియు దానిపట్టుకు అది ముఖ్యమే. మానవుని పురో గతిని భంగపఱచుచున్న ఒక్కొక్క భ్రాంతిని ఆయన ఉపదేశములలో నొక్కొక్కటి తీర్చి వేసినది. కొందఱి యభిప్రాయములో ఆయన ఉపదేశములు పరస్పరవివరణప్రాయములు. నరుడు నారాయణుడే, మానవుడు దివ్యుడే, జీవుడు శివుడే, లీలార్థము స్రష్ట దాల్చిన రూప ములే సృష్టి అంతయు. తక్కిన వెల్ల నటుండ నిండు. ఇ దొక్కటి చాలు, శ్రీరామకృష్ణుని లోకోద్ధారకు డని చాటుటకు. ఐనను ఇందుల గూఢార్థములను మనము చక్కగా తెలిసికో వలెను.

పాశ్చాత్యదేశములలో మతవిశ్వాసము కల వా రందఱికిని ''మానవుడు పుట్టుపాపి'' అను సూక్తినే నిరంతరము వల్లించుచుండుటచే తలలు బరువెక్కియున్నవి. వారికి శ్రీరామ కృష్ణుని సందేశము ఉత్తారకపరమానుగ్రహ ముగ నున్నది. 'దేనిని భావింతువో అదిగా నీ వగుదువు'—అను మన తత్త్వశాస్త్రసూత్రము ఇచ్చటను అన్వయించును. వారు తమ్ము పాపు లనియే తలంచుకొన మొదలిడిరి. కావున శ్రీ వివేకానందస్వామి హిందూసిద్ధాంతమును గూర్చి ప్రసంగించుచు వారిని 'అమృతపుత్రు లారా' అని సంబోధించి ''పాపు లట! మాన వుని పాపి అనుటే పాపము'' అని చెప్పినప్పుడు శ్రోత లందఱు ఉత్సాహముచే లేచిరి. వారికి కలిగిన ఆప్యాయత అంత సహజముగను అంత హెచ్చుగను ఉండినది.

దేవునందును ధర్మమందును విశ్వాసమును కోల్పోయియు, కోల్పోవుచును ఉన్నవారికి శ్రీరామకృష్ణు నుపదేశము తమ తీర్మానము సరియైనదో కాదో మరల నొకసారి ఆలో చించి చూచుకొందమను బుద్ధిని కలిగించినది. తర్వాత స్వామిజి వేదాంతోపన్యాసములలో విషయము నెల్ల యుక్తియుక్తముగ చెప్పి నప్పుడు గురుదేవుని సూక్తియాథార్థ్యము వారికి తెలిసివచ్చినది. వారు మరల మత విశ్వాసము కలవారిలో తాము చేరిపోయిరి.

అప్పుడు సంస్కృతిరంగమున ప్రముఖులై యుండిన విజ్ఞానశాస్త్రజ్ఞులు, ప్రత్యక్షవాదులు, మానవస్వభావ జ్ఞాననిష్ఠులు మున్నగువారి మీద శ్రీరామకృష్ణు నుపదేశమునకు అప్ర్హుత ప్రభావము కలిగినది. వారి బుద్ధులకు సంతృప్తి కలిగినది. వారి హృదయముల సేవాసక్తికి విపులతరమైన రంగము లభించినది. తాత్కా లిక శంకలు కమ్ముకొని యుండిన వారి నిత్యాత్మలకు విముక్తి చేకూరినది. వారు తెలిసికొన్నారు. తాము చేసిన చేయవలసిన మానవుడు వట్టి మట్టి మాంసము నెత్తురు ఎముకల మొత్తము కాదు; మానవునిలోపల నిర్మాణాత్మకమగు శక్తి యున్నది. ఆ శక్తి అచే తనపదార్థమునుండి అద్భుతరూపములు, పరి మాణములుగల సుందరజీవులను రూపొందించు నది. అట్టి శక్తి సచేతనముగను సంకల్పసంపన్న ముగను ఉంపక తప్పదు.

అంతే కాదు; వివిధదేశముల సీమావధులు విచ్ఛిన్నము లైనవి. ఎక్కడ పుట్టినను ఎక్కడ నున్నను మానవుడు మానవుడే. ఔను. మానవుడు నిజముగా అమరికనే, ఆంగ్లేయుడే, జర్మనే, రష్యనే, చైనీయుడే. కాని ఈ

అన్నింటికిని మఱుగున అతడు మానవుడే. భౌతిక దేహమున నున్న మానవునిలో, వాస్తవములైన లోపములు కలవు. కాని మేలు ములుకూడ కలవు, అవి వెలువడనున్నవి. అనంతత్వమునకు, సంపూర్ణత్వమునకు చేర్చు బాటలో మానవుడు పురోగమించుచున్నాడు. మాంసశరీరమునకు లోపల పరిపూర్ణజ్ఞానమూర్తి కలడు. అతడు అద్భుతములను వెలయించు వాడు. అతనికి సేవ చేయుటయు, అతని నారా ధించుటయు ఎవరికిగాని గౌరవప్రదము, భాగ్య లభ్యము.

విశేషముగా పారతంత్ర్యమున బడియున్న ప్రాచ్యదేశ ప్రజలకు గురుదేవుని సందేశము ఆసపాటును ఆనందమును కలిగించెను. దేశ మును గెల్చుకొన్నవారును దోచుకొనుచున్న వారును ప్రజలతో "మీరు లెక్కలో లేని వారు, మీకు భవిష్యత్తు లేదు, కట్టెలు కొట్టుచు, నీళ్లు చేదుచు ఉండవలసినవారు మీరు, మీ పరిపాలకులను సేవించుటకే మీరు పుట్టియున్నారు. మాకు చేయు సేవ మీకు మోక్షప్రదము" అని చెవులు గింగురుమను నట్లు చెప్పుచుండిరి. తమ ప్రాచీన చరిత్ర మంతయు కల్ల బొల్లి కథ లనియు గ్రుడ్డినమ్మ కాల కుప్ప యనియు వెలుగు కావలసినచో పాశ్చాత్యుల నాశ్రయింపవలసినదే యనియు నమ్మకము వారికి కల్పింపబడెను. ఇట్లు తమ ప్రాచీన సంప్రదాయమునుండి విచ్ఛిన్నులై భవిష్యమునుండి అడ్డగింపబడినవారై ప్రజలు ఎట్టి తరణోపాయమును లేకుండిరి. శ్రీరామ కృష్ణుని సందేశము వారిచేత వారిలోనిదివ్యత్వ మును గుర్తింపజేసినది. ఆదివ్యత్వమును వారి నుండి తొలగింప ఎవరికిని సాధ్యము కా దని వారికి చెప్పినది. అజరామరమైన శక్తి వారిలో నిద్రాణమై యున్న దనియు దానిని వారు గుర్తించిన తత్క్షణమే అది వెలికి ఉఱుకు ననియు గురుదేవుని ఉపదేశము వారికి తెలిపినది. ఇది అపూర్వమైన ఒక విప్లవమునకు, మహో జ్వలమైన ఒకభవిష్యత్తునకు వారిని లేపుట యైనది. ఈ సందేశము అద్భుతకల్పనమేమియు కాదు. దాస్య దుఃఖ పీడితులగు ప్రజల సకల దుఃఖములకును ఆచరణసాధ్యమైన పరిష్కా రము. అది వారి పాలిటి చింతామణి.

భారతదేశము పూర్తిగా వేయేండ్లపాటు విజేతల పాదముల క్రింద పడియుండినది. పాడు కలో లేక మూలబడియుండిన తమ వేదాంత డిండిమధ్వనిని వినుసరికి భారతీయులు మొదట దానిని గుర్తింప లేక పోయిరి. సంప్రీతిని అద్భుతమును చెందిరి. ఆ పొంగు వారిని ఆత్మ పునరుద్ధరణవ్యగ్రులనుగా జేసినది. భారత మాతృసందేశహారియైన శ్రీ వివేకానంద స్వామికి కావింపబడిన గౌరవము కేవల మొక ప్రారంభమే. అన్ని జీవితరంగములలోను అట్టి వారు నూర్లకొలదిగ రావలసియున్నది, రాను న్నారు. స్వామిజి చెప్పువఱకు కాననములందును గుహలందును ఉండిన వేదాంతమును దేశీయదృ క్పథమునే పూర్తిగా మార్చివేయు శక్తివంతముగా చేయుటకు వీ లగు నని పూర్వ మెవరికిని తెలి యదు. అస్పృశ్యులుగా చండాలురుగ సంఘపు త్రొక్కిళ్ల క్రిందమృగములవలె నలిగిపోవుచున్న తన పుత్రులను ఆరాధ్యదేవతలనుగ మార్పొం దింప వీ లగు నని భారతమాత భావించియుండ లేదు.

భారతదేశీయులకు తమ మేలుములు తమ లోపములు అన్నియు తెలిసివచ్చినవి. తమ

దివ్యతను గుర్తించుకొన్న వెంటనే సదా మానవోపకారపరులుగ దీనబంధువులుగ అధార్మికప్రభువుల నిరాసకులుగ నుండ గల తమ జన్మహక్కును మరల సంపాదించుకొన భారతీయులు నడుముకట్టిరి. ఇవన్నియు నిజములు కావు, కలలు అని కొంద ఱన వచ్చును. అవును. అవి కలలే. నేటి కలలు రేపటి నిజములగును. ఏల యన ప్రజలు మేలుకొని తమ దివ్యతను గుర్తించుకొన్నారు గదా! సాధించుకోవలసిన లక్ష్య మిదే! చాల మెల్లగానే అయినను ఆ లక్ష్యము సాధించుకోబడుచున్నది.

తమ సంస్కృతిని తమ ఆస్తికధర్మమును తాము మఱచుటే పరాభవ పరాజయములకు మూలకారణ మని భారతీయులు గ్రహించిరి. భారతీయులు విదేశీయులను మ్లేచ్ఛు లనియు తమలోనే భాగ్యహీనులను శూద్రు లనియు, మాల లనియు, అపచారము చేయ నారంభించిరి. తత్ఫలితముగ ఆమ్లేచ్ఛులకే తాము బానిస లగు దుర్గతి వీరికి పట్టినది. భారతీయులలో మాలలుగను, మాదిగలుగను అవమానింపబడుచుండినవారు అన్యమతములను స్వీకరించి శత్రువులుగ రూపొందిరి. తత్ఫలితములే దేశము కుక్క చింపిన విస్తరి యగుటయు, దోపిడులు, హింసలు, దురాక్రమణలు పోటెక్కుటయు. దేశమునకులోపలగాని దేశమునకు వెలుపలగాని మ్రొక్క దగినవారిని ఎవరు కాలద్రొక్క నారంభింతురో వారికి అధః పతనము రాకుండునా?

శ్రీరామకృష్ణుడు 'జీవుడు దేవుడే' అని బోధించినాడు. ఆ బోధనను తనజీవితానుష్ఠానమున ప్రదర్శించినాడు. ఇది దేశీయులకు కనువిప్పైనది. ప్రాతదోసగులను సరిపఱచు మహోద్యమములు దేశ మంతటను నేడు కననగుచున్నవి. నిమ్నజాతులవారిని సముద్ధరించు పనిలో ప్రస్తుతము ప్రభుత్వసంస్థలును ప్రభుత్వేతర సంస్థలును ఒకదానితో నొకటి పోటీలు వేసికొనుచున్నవి. జీవుల నందఱిని దేవులనుగా చూచినప్పుడు కలుగు నంతటి ఫలితము జీవులను పట్టి జీవులనుగ గణించినచో కలుగదు. భువిని దివిగా మార్పవలె ననిన మానవుడు తనలోని దివ్యతను సాక్షాత్కరించుకోవలెను. నేడు మన దేశమున ప్రజల పరిస్థితులను బాగుపఱచుటకు నూర్లకొలది ప్రణాళికలు పన్నాగింపబడి నెగ్గింపబడుచు ఉన్నవి. కాని దేశమున పేదఱికము తగ్గలేదు. ప్రతిమానవు నందును అనంతశక్తి జ్ఞానము ప్రేమ పవిత్రత నిద్రాణములై యున్నప్పుడు దానిని మేల్కొల్పు ప్రణాళికలను పన్నాగింపవలె, నెగ్గింపవలె. తూము తెఱచి మానవునిలోని దివ్యతాప్రవాహమును వెలి కుఱికించిన అది పెక్కు పాయలుగా పాఱి అతనికిని అందఱికిని శ్రేయము లొనగూర్చును. మానవుని దివ్యతనుగూర్చి శ్రీరామకృష్ణుడు కాపించిన ఉపదేశమును మనము నమ్మిననాడు, దాని నమలు పఱచిననాడు — భువి తప్పక దివి యగును.

# గంగాధరస్తవము

'నాట్య కవితా కళానిధి' - 'మహాకవి'
విద్వాన్ దర్భా వేంకటకృష్ణమూర్తి, ఎం.ఏ.

శా॥ చచ్చెన్ న్యాయము, చచ్చె నార్జవ మిలన్, జచ్చెన్ దయాశౌచముల్,
హెచ్చెన్ స్వార్థము, హెచ్చె నక్రమ మహో! హెచ్చెన్ మహామాయ, కా
ర్చిచ్చై యేర్చఁగసాగె నాస్తికత బల్ జృంభించి ధర్మాటవిన్;
సచ్చారిత్రుల కెల్లభంగిఁ గలిలోఁ జావయ్యెఁ, జావైన మేల్,
చచ్చీచావనిచావు చావఁగ నెటుల్ శక్యంబు గంగాధరా? 1

శా॥ ఏదో దుర్గుణ మున్నమాత్రమునకే హింసించెనే రావణున్
దా దైత్యారి; యయారె! రావణు తలన్ దన్నం గలా రెందఱో
యీ దౌర్భాగ్యపుఁగాలమందు! హరి నేఁ డేమాయె? నెం దున్నవాఁ?
డీ దుర్నీతులఁ గానఁడే? యణఁప రాఁడే? లేఁడె గంగాధరా? 2

మ॥ ఖలులే యెల్లెడ నున్నతిం బొరసి బల్ గారించుటన్ సాధులన్
గలవో లేవో యటంచు నెమ్మనము శంకాసంకులం బయ్యె; నీ
కలహాపున్ బ్రకటించి లోకమునకున్ గల్యాణమున్ గూర్పు; మి
క్కలికాలం బిటు కాలుచుండఁ దగవా కన్మోడ్పు గంగాధరా? 3

శా॥ నమ్మంగాఁ దగువ్యక్తియే కనఁబడన్ రాఁ, డెంతపాపిష్ఠకా
లమ్మో యీ కలికాల! మింకఁ గలకాల మ్మిట్టులే సాగ, దే
శ మ్మేమీ? యశ మేమి? జీవితమునన్ సారస్య మేమీ? వికా
స మ్మేమీ? చెలికార మేమి? యకటా! శ మ్మేమి గంగాధరా? 4

శా॥ లో నొక్కండును, బల్కులన్ మఱియొకండున్, జేఁతలం దొండునుం
గా నిట్టుల్ త్రిపథప్రవర్తనమె పక్కా తెల్విగా నెంచి లో
లోనం బొంగుచు లాఁతులం గరము బేల్పుచ్చంగ నుంకింత్రహో!
ఆ నిష్ణాతులె యాత్మవంచకులు కారా తండ్రీ, గంగాధరా? 5

మ॥ తమ కుళ్ళంతయుఁ గప్పిపుచ్చుకొన వేదాంతంబు సత్సాధనం
బమరెన్ గొందఱకున్ గలిన్ గటకటా! హాస్యాస్పదం బయ్యె, హే
యము నయ్యెం గద నేఁటి కక్కతన వేదాంతంబు పే రెత్త! లో
కము క న్మూయఁగ నేరికేనియును శక్యం బౌనె గంగాధరా? 6

మ॥ నిలు వెల్లన్ విషపూరితం బగుకలిన్ నిక్కంబు వాక్రుచ్చుచో
నిలువం జాలెడివాఁ డెవండు? పయికిన్ దియ్యంగ మాటాడుచోఁ
జెలులే యందఱు, నందఱున్ హితులె యిస్సీ! తుమ్ముచో నూడుము
క్కలె పో యందఱుఁ, బట్టిచూచిన రసజ్ఞుం డేడి గంగాధరా?

శా॥ అన్న ద్వేషము నా ప్రపంచనయు బ్రహ్మద్వేషమున్ గాల మా
సన్నం బైననె కాని కల్గ వని శాస్త్రాలెల్ల ఘోషించుఁగా!
అన్నీ కల్గియు నేఁ డదేమొ కలిమాహాత్మ్యంబు గాఁబోలు నో
రన్నా! నాఁటికినాఁటి కభ్యుదయమే యాఁ గాదె గంగాధరా! 8

శా॥ అబ్రహ్మణ్య మటన్న పల్కున కవధ్యం బన్న యర్థంబు కాఁ
గా, బ్రహ్మణ్య మనంగ నేమి యగునో గ్రాహ్యంబె కా! అందుకే
తా బ్రాహ్మణ్యముపట్ల నయ్యదియె సంధానింపఁ జూచున్ జగం;
బబ్రంబే? కలిరాజునేల్బడియె కాదా నేఁడు గంగాధరా! 9

శా॥ ధాతన్ దూఱఁగరాదు గాని, యిటు లీ దౌర్భాగ్యపున్ జన్మ మే
లా తార్పన్వలెఁ? దార్చు టయ్యది యవశ్యం బైన బ్రాహ్మణ్య మే
లా తీర్పన్వలెఁ? దీర్చెఁ బో యెటులొ, తా నా మాత్రతోఁ బోక, యి
స్సీ! తద్ద్వేషము నింప నేల జగమం దీలీల గంగాధరా? 10

మ॥ అవమానం బనియో, ప్రమాద మనియో, ఆమ్నాయవాక్యంబె తే
కువమై దిద్ది రహో కలిప్రభుభటుల్ ''గోబ్రాహ్మణేభ్య శ్శుభం
భవ'' తన్ సూక్తిని ''మానవేభ్య'' యనుచున్; 'బ్రాహ్మణ్య' శబ్దంబు తాఁ
జెవి సోకన్ గలిరాజు కేమిటి కయా చీకాకు గంగాధరా? 11

మ॥ కలిలోనం బ్రథమంపుఁబాద మని లెక్కల్ వేసినా రెట్లొ పూ
ర్వులు, కానీ యవి యెల్ల నా మదికిఁ దప్పుల్ గానె కన్పట్టెడిన్;
దొలిపాదం బగునేని కాల మపుడే దుర్నీతిపాలై యిటుల్
ప్రళయం బేర్పడునే? చతుర్థపదమే రానోపు గంగాధరా! 12

మ॥ అవురా యెంత నికృష్టకాలమొ! నిజం బాడన్ భరింపం గలాఁ
డెవఁడున్ గానఁబడండు; మాయబ్రతుకే యెందేని మెప్పొందెడిన్;
భువి శీతాంశునికాంతి కెంతయు ముదంబుం గందురే కాని, యా
రవితేజంబు భరింతురే యది యథార్థం బౌట గంగాధరా? 13

ఓమ్

# పరమహంస శ్రీరామకృష్ణుడు

## బుఱ్ఱ కథ

శ్రీ పురిఘళ్ల రంగారావుగారు

ఓంనమోభగవతే శ్రీరామకృష్ణాయ
ఓంనమోభగవత్యై శ్రీశారదాంబాయై
ఓంనమోభగవతే శ్రీవివేకానందాయ

కం॥ వందనము విఘ్ననాయక
వందన మో మధురదివ్యవాణీ, వాణీ,
వందనము జానకీశ్వర
వందన మిదె గొనుడు ప్రేమ వరసుర
కోటుల్ !

ప్రార్థన

పాట - 1

వందనమయ్యా, విఘ్నవినాయక
వందనంబు నీకు - దేవ
వందిత సురవరముఖ్య పాద
వర శుభము లిమ్ము మాకు ॥ వం
వందన మమ్మా వాణీ
పలుకులరాణీ అలివేణీ
పొందగు పల్కుల పల్కజేయవే
పొల్పున బ్రహ్మాణీ ॥ వం
వందన మయ్యా రామచంద్ర
వరభక్త జలధి చంద్రా
వందన మయ్యా రామకృష్ణ
గురుదేవ సుగుణసాంద్రా ॥ వం

కథా ప్రారంభం

వంత:—తందానా తాన తందనా

కథకుడు:—

పూజ్యులైన సభవారికి మ్రొక్కి ॥ తం
ముక్కోటి దివ్యుల ముదమున దలచి॥ తం
శ్రీగల భారత మాతను దలచి॥ తం
రాజమహేంద్రుల రాణ దలంచి॥ తం
కాళిదాస ముఖ్య కవుల దలంచి॥ తం
పుణ్యగాథ నిదె చెప్పబూనితిమి
పూర్తిగ విన రయ్యా॥ తం
రామరావణ సంగ్రామమె కాదు॥ తం
భారతయుద్ధ చరిత్రమె గాదు॥ తం
పల్నాటికోళ్ల పందాలే గావు॥ తం
బొబ్బిలి బెబ్బులి బొబ్బలెగావు॥ తం
కామమ్మ లక్ష్మమ్మ కథలేగావు॥ తం
బాలనాగమ్మ బాధలెగావు॥ తం
స్వాతంత్ర్యసమరసన్నాహమె కాదంఢో॥ తం

హాస్యగాడు:—కాదు - కాదు కాదు. ఎంత
సేపూ ఏదీ కా దంటావేగాని కథ నీకు

రావనియేడవ రాదూ! డక్కీ భుజాన్న
వేసుకొని చక్కా పోతాను.

రాచకీయం: కాసేపు ఓపిక పట్టరా! మన
వాడు కథ మొదలిడతాడు.

హా॥ ఓ! పీకదాకా పట్టాను ఓపిక! ఇక కథ
చెప్పమను. లేకపోతే రెట్ట పట్టుకొని చట్ట
పిరగ్గొడతాను. ఖబర్దార్!

క॥ వంత:—
వినరా సోదర పరమహంసజీ
విమల గాథ నేడు
ఆదివిష్ణు విల నవతరించినటు
అలరె నతడు చూడు॥ వి
వంగదేశ మీ భరతభూమికే
వన్నె తెచ్చె నండీ
దేశభక్తులకు, భక్తకోటులకు
వాసి కెక్కె నండీ॥ వి
వంగదేశమున 'హుగ్లీ' జిల్లా
వరలు చుండె నయ్యా
అందున 'కామార్పుకూ'రను గ్రామము
అలరుచుండె నయ్యా॥
'ఖుదిరాముం' డను విప్రశేఖరుడు
ఆ కు గ్రామములో
'చంద్రమణీ' సతితోడను గూడుక
చక్కగ నున్నాడు॥ వి

రా॥ ఆ ఖుదిరాము డెట్టివా డయ్యా అంటే,

క॥ వంత:—
భళా నోయి భాయి తమ్ముడూ। భళా
భాయి భళా నోయి దాదా నా।
సత్య దీక్షకై సంపదా। భళా
వదలినట్టి యనవద్యుడు। భళా
ధర్మమార్గమును తప్పక।
కర్మచేయు కర్మిష్ఠిరా।
సత్య శౌచధర్మాముల కాతడె
స్థానమయ్యినాడా॥
(ఖుదిరాముని గుణజాలము। సై
కోర్కెమీర వినవేమిరా —
కోర్కెమీర విన వేమీరా —

గమనిక.— ఈ వంత 'భళానోయి' అని పైనవ్రాసిన వరుసకు పలుకుతుంది. తగినట్లుంటుంది.
—ఇదే పెట్టటం మంచిది)

దైవభక్తిగల ధన్యుడు। సై
దేవునికొలువని దినముడు। సై
పోయడు నోటిలో తోయడు। సై
రాముపైని ప్రేమహెచ్చురా। సై
అతడు పూజలో కూరుచున్న
లోకంబె మరచిపోవు। ఖుది

హా॥ సరే నయ్యా, ఇంతకూ 'ఖుదిరాముడు'
మహాభక్తుడు సద్గుణవంతుడు నన్న మాట!
అయితే మరి ఆయన భార్య?

క॥ వంత:—తందానా తందాని తందనా
తాని తందనానా॥ —భళాభళి
అనసూయా సావిత్రి సతీత్వం
అలరె నామె యోన। తం
గంగానది పావిత్ర్య మామెలో
ఘనముగ వెలగిందా। తం
అతిథు లన్న అభ్యాగతు లన్నను
ఆదరించు నయ్యా॥ తం
దేవుని కామె పూజసేయని
దినమె కాన రాదు॥ తం
కష్టసుఖంబుల పాలుగువారితో
ఇష్టత మెలగును రా॥ తం
గౌరవంటి యిల్లా లని ప్రజలే
గౌరవించినారా॥ తం

హా॥ అబ్బా! చంద్రమణీదేవికూడ భర్తకు తగిన యిల్లా లన్న మాట. మరి వారి కేం సంతానం లేదా?

రా॥ ఉంది. రామకుమారుడు, రామేశ్వరుడూ అని యిద్దరు కొడుకులూ, కాత్యాయని ఒక అమ్మాయి.

హా॥ ఇంకేం, అయితే వీరంతా జీవించే విధానం?

రా॥ మొదటిలో ఖుదిరామునిది 'దేరేపూర్' అనే గ్రామం. అచ్చటాయనకు చక్కని ఆస్తిపాస్తులుండేవి. కాని, ఆఊరి జమీందారు, ఖుదిరాముడు తాను కోరిన ట్లొక అబద్ధపు సాక్ష్యము చెప్పలే దనే కక్షతో, ఇంకొక అబద్ధపువ్యాజ్యం తెచ్చి ఖుదిరాముని ఆస్తిని సర్వం హరించాడు. అయినప్పటికీ భక్తవీరుడైన ఖుదిరాముడు దీనుడు మాత్రం కాక ధీరుడు మాదిరిగానే నిలబడ్డాడు. అతడు 'సుఖలాల్' అనే ఒక మిత్రుని ఆహ్వానంపై కుటుంబముతో సహా 'కామార్పకూర్' కాపురంవచ్చి, ఆమిత్రుడిచ్చిన 'లక్ష్మీజాల' అనబడేటు కొద్దిభూమితోనే తన సంసార సాగరాన్ని ఈదుతున్నాడు కులదైవమైన 'రఘువీరుని' పై భారం పెట్టి. ఇలా ఉండగా

క॥ వంత:—రామకృష్ణ చరితామృతలోలా
రమ్యసుగుణ జాలా॥
ఖుదిరాముడు క్షేత్రాలు చూడగా
మదిని తలచినాడా॥ రా
భార్యాపుత్రుల నింట నుంచియే
పయనమయ్యెనాడా॥ రా
కాలినడకనే కదిలె క్షేత్రములు
కన్నులార గాంచ॥ రా
అచటచ్చట గల సృష్టివింతలకు
అబ్బుర మందుచును। రా
దైవమహత్త్వము కొనియాడుచును
తన్మయు డగుచుండె॥ రా
కాశి ప్రయాగల సందర్శించి
గయాక్షేత్ర మేగె॥ రా
గయలో నొక రాతిరి స్వప్నములో
గదాధరస్వామి॥ రా
కానిపించి 'ఓ భక్తశిఖామణి
కల్ల కాదు నిజము॥ రా
ధర్మరక్షణకు నే నవతారము
దాల్చవలసి వచ్చె॥ రా
నీగర్భమ్మున నేను సుతుడనై
జన్మించెద నోయి॥ రా
అడ్డు చెప్పబో కేమియు దీనికి
ఆనతిచ్చినాను॥ రా
అని సెలవిచ్చి గదాధరస్వామి
అంతర్హితు డాయె॥ రా
దిగ్గున మేల్కాని ఖుదిరాముం డదె
దివ్యవాణి యనుచు॥ రా
సంతోషాంబుధి నోలలాడెరా
శౌరికృపను తలచి॥ రా

రా॥ ఈవిషయం భార్యకు చెప్పాలనే ఆత్రంతో ఖుదిరాముడు ఇంటికి బయలుదేరాడు. అయితే, ఇంటివద్ద చంద్రమణీదేవి...

హా॥ పిల్లాడిని కని రెడీగా ఉండిఉంటుంది.

రా॥ కాదురా- ఆమె 'ధని' అనే ఒక పొరుగింటికమ్మరిస్త్రీతో కలిసి, అలవాటు ప్రకారం తమయింటికి దగ్గర లోనే ఉన్న శివాలయానికి వెళింది.

హా॥ ఏం- ఎందుకు- చెప్పా లెత్తుకు రావటానికా?

రా॥ భళా! అందుకు కాదు రా దద్దన్నా! పూజచేయటానికి వెళ్లింది. ఆమె ఆశివ లింగం ముందు భక్తితో కన్నులు మూసి కొని మోకరిల్లి యెలా ప్రార్థిస్తోందంటే—

పాట – 2

క॥ జయ జయ శంకర మహాదేవా
హర హర భవహర శివదేవా॥ జయ
భయద పురాసుర మారణదక్షా,
భక్తలోక పరిపాలన దీక్షా,
దీనుల మయ్యా, దిక్కు నీ వయా
బ్రోవ రావయా —— ప్రభో!॥ జయ
తాపత్రయ భయదాపహారణా
తాండవలోల పాపనివారణ
దయగనలేవా —— దర్శనమీవా
దయామయా రావా – శివా॥ జయ
జై మహాదేవా —— శివమహాదేవా
జై మహాదేవా —— శివమహాదేవా...
శంభో......

రా॥ ఈ విధంగా

క॥ వంత:—తందానా తాన తందనా
చంద్రమణీదేవి సదమలభక్తిని॥ తం
చంద్రధరుని పూజసలిపి నిలిచెరా॥ తం
దివ్యమైనదా తేజః కిరణము॥ తం
ఒకటి లింగమున నుండి వెలువడి॥ తం
కలిసె చంద్రమణి గర్భమునందు॥ తం
మైకము క్రమ్మట మాట లేకను॥ తం
ఆమె కొంతసే పచట పరుండె॥ తం
పిదపకొంతసేపటికి మేల్కొని॥ తం
చనవున 'ధని'తో సర్వము చెప్పిందా॥ తం

రా॥ ఈవిధమైన దివ్యానుభూతిని పొందిన చంద్రమణీదేవి ఖుదిరాముడు ఇంటికి తిరిగి రాగానే ఆయన కీ విషయం వివరంగా చెప్పింది. ఆయనకూడ తనకు గయా క్షేత్రంలో వచ్చిన స్వప్నవృత్తాంతం ఆమెకు చెప్పి ఆనందపరిచాడు. నాటినుండి, ఆ పవిత్రదంపతులు, తమ పూర్వపుణ్య భాగ్యముచేత పురుషోత్తముడే తమకు పుట్ట బోతున్నాడని పొంగిపోయేవారు. ఆనాటి నుండే చంద్రమణికి గర్భసూచనలు ప్రారం భించాయి. —— కొన్ని నెలలు నిండాయి. ఆమెగర్భవతిగా నుండగా ఆమె పడక గదిలో. దేవకాంతలు మాటాడుకొను చున్నట్లు దేవతలు తిరుగుచున్నట్లు, గిజ్జెలు కట్టుకొని ఒక బాలుడు చిందులు త్రొక్కు చున్నట్లు కనిపించేవి.

హా॥ ఎందుచేత? ఏదైనా గ్రహపాటా?

రా॥ అదే పొరపాటు. ఇటువంటి శుభలక్ష ణాలు దివ్యదృశ్యాలు 'మహాప్రవక్తలు' పుట్టబోయే ముందు కనిపిస్తాయ్! చంద్రమణి నవమాసాలు నిండాయి. ఆనాడు మన్మథనామ సంవత్సర ఫాల్గుణ శుద్ధవిదియ బుధవారం. (1836 సం. ఫిబ్ర వరి 18–వ తేదీ) ప్రశాంత ప్రభాతకాలం. సుమారు 5 గం. 15 నిమిషము లవుతుంది. తూర్పుకొండనుండి ప్రభాకరదేవుడు జగ త్తులో నిండిన చీకట్ల మూకలను తనకిరణ ఖడ్గాలతో ఖండించటం ప్రారంభించాడు. ఇచ్చట ఖుదిరాముని యింటిలో చంద్ర మణీదేవి పుణ్యగర్భాన్నే పూర్వదిక్కుగా చేసికొని అనంత విశ్వమానవహృదయ కుహరాంతరాలలో తరతరాలనుండి వాసం చేస్తున్న అజ్ఞానతిమిరపుంజాన్ని పార ద్రోలునిమిత్తం పుట్టబోతున్నాడు అప్ర మేయ తేజోవిరాజితుడగు జ్ఞానభాస్కరుడు. ఆ మహోదయసమయంలో

క॥ తే॥గీ॥ తెల్లవారల పాలనన్ తెల్ల మొగము
వేసి, చెడ నున్న హైందవ విపులధర్మ
ములను రక్షింప విష్ణువే పుట్టనుండ
సర్వ సచరాచరంబులు సంతసించె॥

వంత:___తందాన తందాన తాన తందనానా
తానా, తందనానా॥
గ్రహము లన్ని అతి ఉచ్చస్థానముల
కరము తిరుగుచుండ॥ తం
భామ చంద్రమణి కాంచెనుపుత్రుని
భావిరామకృష్ణు॥ తం
ధర్మరక్షణకు గదాధరుండే
తరలివచ్చె నంటూ॥ తం
తల్లిదండ్రులే కాక దివిజులున్
సంతసించి రపుడు॥ తం
బిడ్డ పెద్ద యని అమ్మ లక్కలు
విస్తుపడిరి చూచి॥ తం
దొడ్డ దైన బంగారు వన్నె
ఆ బిడ్డసొమ్మె యనిరి॥ తం
గయాగదాధరు కృపచే కల్గుట
గదాధరుం డంటూ॥ తం
పావననామము పెట్టి పిలిచి
రా పాపను వా రంతా॥ తం

రా॥ ఈ విధంగా ఆమహానుభావుడు జన్మించాడు.

హా॥ జన్మించాడు - జన్మించాడు రా మనకీ ఓ వీరభోగవసంతరాయుడో శుభముహూర్తాన. పుట్టీపుట్టటంతోనే నిల్చి కాలిందిరా నాలుగువంపలగడప నూగ్రామంలో.

రా॥ ఆబాలుణ్ణి ఇరువదిఒకటోనాడు తొట్లలో పరుండబెట్టి పుణ్యాంగన లందరూ ఏవిధంగా జోలలుపాడుతున్నా రంటే___

పాట - 3

క॥ నిదురించరా తండ్రి - నిదురించ వయ్యా
నెలత లందఱుపాడు జోల లాలించి॥ జోజో
పదునాల్గు భువనాలు పాలించి విసిగి
అలసియున్నా వేమొ-జోల పాడేము॥ జోజో
ధర్మస్థాపనకొఱకు ధరకవతరించిన
వెన్నుడవు నిన్నెట్లు సన్నుతించేము॥ జోజో
తెలుపు మీ లోకులకు దివ్యతత్త్వమును
నిలుపు హైందవకీర్తి నిఖిలదిశలందు॥ జోజో

రా॥ గయావిష్ణుని ప్రసాదంచేత జన్మించిన ఆ బాలునికి 'గదాధరు' డని నామకరణం చేశారు. ఈవిధంగా బాలగదాధరుడు దినదినప్రవర్ధమాను డౌతు, తన (ఆట పాట) బాల్యచేష్టలచేత ఇంటిలో వారికీ పొరుగిళ్లవారికీ మహానందాన్ని కల్గిస్తూ ఐదారేళ్ల ప్రాయమువా డయ్యాడు. అప్పటి నుండీ అతని బాల్యచేష్టలు ఎలా ఉన్నా యంటే

హా॥ పొరుగింటిలో వారికి సంకటంగాను, ఇంటిలోవారికి మంటగానూ - వాడి మట్టుకు వాడికి పంటగాను ఉండి ఉంటాయ్! ఏమంటావ్ ?

రా॥ కాదంటాను. నీవు శుద్ధ చవట వంటాను- విన్న తరువాత మాటాడమంటాను. అంతే.

క॥ వంత:___వినర గదాధరు గుణగణంబులను
వీనులార నేడు - వహ్వా
విన్నది కన్నది యెన్నడు మఱువక
సన్నుతు లందాడా॥ వి
హరిగాథలకు, హరికథలకును
హాజ రగును ముందు॥ వి

నాటకాలు తోలుబొమ్మలాటలకు
నాగా కట్టడురా॥ వి
హరిగాథల గానమ్ము సేయుచో
అమరగానమే రా॥ వి
రాతికి ప్రాణము పోసి నిల్ప గల
రమ్య శిల్పి యతడు॥ వి
విగ్రహముల గల లోపము లెంచును
విస్తుపడగ జనులు॥ వి
కోవెలలోన ప్రతిష్ఠ సేయగా
కోరిన విగ్రహము॥ వి
పెద్ద లందఱూ గదాధరున కే
పేర్మి చూపువాడు॥ వి
విగ్రహాన గల లోపము లన్నిటి
వింతగ సరిజేసి॥ వి
ప్రజల మెప్పులకు గదాధరుండు
పాత్రు డయెడివాడు॥ వి
బాలు రందఱను జేర్చి పెద్దయై
భజన నేర్పువాడు॥ వి
సాధుల, యోగుల చేరి మాటలను
చక్కగ వినువాడు॥ వి
మాటల చేతల నాచరించుటకు
పాటుపడెడివాడు॥ వి
ఆచరణంబున మంచి మాటలకు
ఆలస్యము చేడు॥ వి

రా॥ ఈ విధంగా బాలగదాధరుడు అనేకభవ్య గుణప్రభలతో విరాజిల్లుతున్నాడు. ఆఊరి జమీందారు మరణించినప్పుడు — ఆయన ఉత్తరక్రియల సందర్భంలో ఉదయించింది పండితుల కొక బండసందేహం. ఆ సందేహాన్ని బాలగదాధరుడు తనబుద్ధిసూక్ష్మత వల్ల అతిసులువుగా పరిష్కరించి వార్నందరినీ ఆశ్చర్యపరవశులను చేశాడు. అంత, ఆపండితు లందరూ గదాధరుని కేవలం అవతారపురుషు డని ప్రస్తుతించారు. అంతటి చిఱుతప్రాయమునుండియు గూడ, గదాధరుడు ఒంటరిగా మైదానప్రదేశముల సంచరించుచు, అచటి రమణీయప్రకృతి దృశ్యములకు ముగ్ధుడై, తఱచు భావసమాధిలో మునిగిపోయేవాడు.

హా॥ హాన్నీ! సమాధిపోతే మళ్లీ బ్రతికాడా?

రా॥ ఛ! సమాధి అంటే మహాయోగులు భగవంతుని ధ్యానంలో పొందే ఒకఅతీంద్రియ స్థితి. ఆస్థితిలో శరీరం భౌతికప్రేరణలకు ఏమాత్రం చలించక పూర్తిగా చైతన్యాన్ని కోల్పోతుంది. ఒక్కొక్కప్పుడు శరీరం కఱ్ఱలా బిఱ్ఱబిగుసుకుపోతుంది. గదాధరుడు పొందే యీసమాధిని 'భావసమాధి' అంటారు. ఇదే భక్తిమార్గం యొక్క పరమావధి. అంటే, సాధకుని యందలి భక్తిరసం పరిపుష్టి నొంది, పరిపక్వతకు వచ్చినప్పుడు మాత్రమే యీ సమాధి ప్రాప్తిస్తుంది.

హా॥ అబ్బో! చాల గొప్పమాటే సుమీ! పిదప ఏం జరిగింది?

రా॥ పాపం! గదాధరునకు ఏడేండ్ల వయస్సులోనే ఆయన తండ్రి ఖుదిరాముడు స్వర్గస్థుడయ్యాడు. తదుపరి కుటుంబభారాన్ని రామకుమారుడు, రామేశ్వరుడు చెరియొక భుజాన్నా వహించటం ప్రారంభించారు. ఇలా ఉండగా

క॥ వంత:—తందానా తాన తందన
తొమ్మిదేండ్లు నిండ తొందరపడుచు॥ తం
గదాధరునకు క్రమ మగు రీతిగ॥ తం

ఉపనయనమ్ము గావించినారు రా॥ తం
మాట తప్పని మాన్య డౌటచే॥ తం
ఎందఱు చెప్పిన ఏమియు వినక॥ తం
బాలుడు 'ధని'కడ భిక్ష పట్టెరా॥ తం
అందఱు ఆతని సత్యదీక్షకు
అచ్చెరు వొందేరా॥ తం

రా॥ ఈవిధంగా, గదాధరుడు తన్నుతల్లితో సమానంగా ఆదరాభిమానములతో చూస్తూ, తనపై నెన్నో ఆశలుపెట్టుకొని యున్న 'ధని' అనే కమ్మరస్త్రీకి తాను ఇచ్చినమాటప్రకారం, ఉపనయనసమయంలో తొలిభిక్ష తీసుకున్నాడు.

హా॥ సెభాష్! అయితే, సత్యహరిశ్చంద్రుడికి, గదాధరుడికీ మధ్య ఒక్కటిడికే అడ్డన్న మాట! తరువాత ఏంజరిగిందిరా?

క॥ వంత:—తందానా తిందాని తిందనా తాన తందనానా,
అరయ గదాధరు కన్న యానుడు రా
రామకుమారుండు॥ తం
సంస్కృతాన గల మేటి పండితుని
సన్నుతు లందా. తం
కలకత్తాపురమందు నతండు
తాపుర ముండుటచే॥ తం
గదాధరు నచ్చట విద్య నేర్వగా
కరము పంపినారు॥ తం
విద్యయందు మన గదాధరుండు
వెనుకపడుట చూచి॥ తం
అన్నగారు కోపంబు సేయగా
మిన్నకుండ లేక॥ తం
''పొట్టకూటి విద్యల నేర్చుటకై
పుట్టలేదు నేను॥ తం
జన్మసార్థకము చేయ జాలని
చదువ దేల అన్నా॥ తం
ఈవిద్యల ఇకమీద నేర్వ'' నని
ఈసడించి పలికె॥ తం

హా॥ ఛ-ఛా! అదేం సమర్థనరా? చచ్చు సమర్థన. వెనకటి కో చెల్లెలు అన్నగారితో 'సరే! అన్నయ్యా! వదినెమీద చల్ల వలసిన వసంతం నామీద చల్లుతావేం రా' అంటే 'అరెరె! తప్పు తప్పు పొరపడి పోయానే, నిన్ను చూసి అమ్మనుకొన్నా' నన్నాడట ఒకప్రబుద్ధుడు. అలాగే, మన గదాధరుడు 'చదువుకోరా నాయనా!' అని కసురుకొంటే 'చదవనలే'నని యేడవక అలా చచ్చుగా సమర్థించుకుంటాడేం? చదువు పేరు చెపితే చలిజ్వరం వస్తుం దేమో!

(సశేషము)



# ఆస్తిక్యం

## శ్రీ పన్నావజ్ఝల సీతారామబ్రహ్మంగారు

''నవ్వు'' అంటే ఏమిటని ఒక శరీరతత్త్వ శాస్త్రజ్ఞుని అడిగితే, ''ఏముందీ? పెదవులను అని గాని, హాహాహా అనిగాని శబ్దం చెయ్యడం'' అని ఆతడు నిర్వచించాడట, జంకు కొంకు కొసలకు చాచి, పళ్లు బయటపెట్టి, హిహిహి లేకుండా.

నవ్వినప్పుడు పెదవులు ప్రక్కలకు సాగుతవా? సాగవా? పళ్లు కనబడుతవా? కనబడవా? నవ్వినప్పుడు చప్పు డవుతుందా? కాదా? కొందరు నవ్వుతుంటే చిరుగంటలు మ్రోగుతున్నట్టుంటుంది కూడాను — మూతి ముడుచుకొని, ముఖం చిట్లించుకొని నవ్వేవా రెవరయినా ఉన్నారా? అని అతని వాదం.

జగద్వ్యాపారాలు, మానవుని ఆలోచనలు, అనుభవాలు ఆతని కార్య కలాపాలు రసాయనిక పరిణామాలే అనడం నవ్వును శరీరతత్త్వ శాస్త్రజ్ఞుడు నిర్వచించినట్టుగానే ఉన్నది.

అఖిల విశ్వాన్ని, అందలి ప్రతి వస్తువును మహత్తరమైన ''శక్తి నడుపుతున్నది'' అని, ఆ శక్తి అనేకం గాక ''ఒకే ఒక్కటి'' అని మన జిజ్ఞాసువు గ్రహించడం చాలా తెలివయిన పని. భావగర్భితమైన ఈ వాక్యాన్ని పరిశీలిస్తే, ''దేవు''డంటే ఏమిటో తెలుసుకొనడానికి సులువు దొరకవచ్చు.

గ్రహతారల గతులకు కారణమైన శక్తి, మన కనురెప్పల కదలికలకు ప్రేరేపకమైన శక్తి ఒకే ఒక్కటన్నమాట. ఈ సత్యాన్ని తలుచుకుంటే ఎంత హాయిగా ఉంటుంది! ఆ శక్తిని ఆశ్రయించే భూగర్భంలోని రత్నం ప్రకాశిస్తున్నది. ఆ శక్తి సహాయంతోనే సాగరమధ్యంలోని మత్స్యం చరిస్తున్నది. రాతిలోని కప్పకు ఆహార మందించే శక్తికూడా అదే. ఆ శక్తి నిర్జీవ పదార్థాల ధర్మాలను నిర్ణయించడంతోపాటు ప్రాణుల జీవితాలనుకూడా నడుపుతున్నది.

పదార్థమూ, శక్తీ వేర్వేరు కావని, ఆ రెండు ఒక్కటే నని, పదార్థం శక్తిగా, శక్తి పదార్థంగా మారుతుంటుందనడం వైజ్ఞానికులు సిద్ధాంతీకరించిన విషయమే. అంటే, నడిపేది, నడిపింపబడేది కూడా ఒక్కటే నని అర్థం.

ఒక వస్తువునుంచి మరొక వస్తువు పుట్టడం మనం గ్రహించగలం. కాని, ఏమీ లేని శుద్ధ శూన్యంనుంచి మరేది గాని రాగలదనడం మన ఊహకు అందని విషయం. అది పరస్పర విరుద్ధమైన భావంకూడా. సున్నలోనుంచి వచ్చేది సున్న మాత్రమే. గర్భితమైనదే బహిర్గతం కాగలదు.

మఱ్ఱి గింజలోనుంచి మఱ్ఱిచెట్టే వస్తున్నది. ఎందుచేత? మామిడి చెట్టు మామిడి టెంకలోనుంచే రావడాని కేమిటి కారణం? చెట్టు అంతా, చెక్కు చెదరకుండా, సూక్ష్మరూపం దాల్చి గింజలో భద్రమై ఉన్నదని అర్థం. గింజలోఉన్న చెట్టు బయటికి రావడానికి వేడి, వెలుతురు, గాలి, నీరు, ఎరువు సహాయపడుతున్నమాట నిజమే. వాటి రసాయనిక పరిణామాలు మొక్క మొలవడానికి, మొలిచిన మొక్క పెరగడానికి అవసరమే. ఈ రసాయనిక పరిణామాలు తోడ్పడుతున్నప్పటికీ ఇటుక ముక్కలోనుంచి గులాబిచెట్టు ఎందుకు మొలవదు? ఖర్జూరవృక్షం వేపగింజలో నుంచి ఎందుకు రాదు? రసాయనిక పరిణామాల ప్రభావం, ఫలితం బహు విపరీతమని దాని అర్థం; సృష్టి అంతా రసాయనిక పరిణామాల అధీనమయి లేదని దాని తాత్పర్యం.

జగత్తు సర్వము రసాయనిక పరిణామాలమయమే గాని మరేమీ కాదంటే, చరిత్ర, గణితం, ఫిజిక్స్, వృక్షశాస్త్రం, జంతుశాస్త్రం, అలంకారశాస్త్రం, న్యాయశాస్త్రం, ధర్మశాస్త్రం, అర్థశాస్త్రం మున్నగు శాస్త్రాలకు తావులేదు. కనుక అది అసంగతం. రసాయనిక సూత్రాలు జీవలక్షణాలకు అన్వయం కావు. జీవధర్మాలను తెలిపేది జీవశాస్త్రం. జీవలక్ష

ణాలు మనస్సుకు వర్తించవు. కనుకనే, మన తత్త్వ పరిశోధన అవసరమైనది. సామాన్య మనోధర్మాలు అతీంద్రియానుభూతికి వర్తించవు. అందుచేతనే యోగశాస్త్రం ఏర్పడింది.

సృష్టిలో ఎన్నో వస్తువు లున్నవి. ఎన్నో శక్తు లున్నవి. ఎన్నో జీవు లున్నవి. ఎన్నో వ్యాపారాలు సాగుతున్నవి. ఎన్నో సంఘుటనలు జరుగుతున్నవి. అసలు ఉన్నది "ఒకే ఒక్కటి" అయితే, ఈ నానాత్వమంతా ఏమిటి? ఈ నానాత్వం ఎక్కడనుంచి వస్తున్నది? దేని చేత భరించబడుతున్నది? మరొక ఏదీ లేదు కదా? శూన్యంనుంచి రాదుకదా? గింజకు చెట్టుకుగల సంబంధాన్ని గురించి మనం గ్రహించిన దానినిబట్టి ఈ సకలమూ ఆ "ఒకే ఒక్కటి" నుంచి ఉద్భవిస్తున్నదని, దానిచేతనే భరించబడుతున్నదని తెలుసుకోవడం కష్టం కాదు.

జగత్తును, జగత్తులోని ప్రతి వస్తువును నడుపుతున్న శక్తి విద్యుచ్ఛక్తివంటి అంధప్రాయమైన శక్తే అని ఒక జిజ్ఞాసువు అభిప్రాయం. పిచ్చివాని మాటలకు అర్థం ఉండదు, సందర్భం ఉండదు, క్రమం ఉండదు, అన్వయం ఉండదు. కనుక, మనం గ్రహించలేము. అలాగే పసిబిడ్డ పలకమీద గీసే పిచ్చిగీతలకు కూడా మనం అర్థం చెప్పలేము. తెలుగు భాషలోని లేఖ నేను చదివి అర్థం చేసుకుంటున్నానంటే, నా వలె లేఖ వ్రాసినవానికి కూడా తెలుగు భాషాజ్ఞానం, విషయగ్రహణశక్తి, ఆలోచన ఉన్నవని అర్థం.

విశ్వాన్ని "నడుపుతున్న" శక్తి విద్యుచ్ఛక్తి వంటి అంధప్రాయమైన శక్తే అయితే, అది నడపడం ఎలా సంభవం? జగత్తు శాసనబద్ధమెట్లయినది? జగత్తు శాసనబద్ధం కాకపోతే, వైజ్ఞానికులు ప్రకృతి భౌతికధర్మాలను ఎలా కనుగొనగలుగుతున్నారు? సృష్టిలో క్రమం, విధానం, పద్ధతి లేకపోతే వైజ్ఞానికులు ప్రకృతి రహస్యాలను గ్రహించడం, మనం ప్రకృతిపై అధికాధికంగా ఆధిపత్యం వహించి, సుఖం, అభివృద్ధి, వికాసం పొందడం ఏ విధంగా సాధ్యం? పూర్వ వర్తమాన భవిష్యత్తులకు పరస్పర సంబంధం ఎలా ఉంటుంది? జగత్తు మనకెలా అన్వయం కాగలదు? జగత్తు శాసనబద్ధం కాకపోతే ఎప్పుడేది ఎలా ఎందుకు జరుగుతుందో ఎప్పటికీ ఎవ్వరూ చెప్పలేరు. అంతట మన బ్రతుకే అసాధ్య మవుతుంది.

క్రమం, విధానం, పద్ధతి, శాసనం, అన్వయం—ఇవి భౌతికవస్తువులు కావు, బాహ్య పరిస్థితులు కావు. ఇవి కేవలం మన బుద్ధిగతమైన భావాలు. వస్తువుల ధర్మాలను, సంఘుటనల తీరును, వాటి పరస్పర సంబంధాలను, కార్య కారణ సంబంధాన్ని మనం అర్థం చేసుకొనే పద్ధతే శాసనం. అంటే ఆలోచన, ధీశక్తి, ప్రజ్ఞ లేకపోతే ఈ భావాలకు ఆశ్రయం లేదు. మన బుద్ధి గ్రాహ్యమైన భావాలకు, తదనుగుణమైన మన జీవితానికి జగత్తు అన్వయ మవుతున్న దంటే, జగత్తు ప్రజ్ఞాజన్య మన్నమాట. ఇటు మన బుద్ధికి గ్రాహ్యమైనది. అటు సృష్టి వైపునుంచి జ్ఞానజన్యమైనది.

అంధప్రాయమైన విద్యుచ్ఛక్తివంటి శక్తే ప్రపంచాన్ని నడుపుతున్నట్లయితే, జగత్తు సర్వము రసాయనిక పరిణామాలు తప్పమరేమీ కాకపోతే, మానవుడు పృథివిమీద అవతరించడమే సాధ్యమయ్యేది కాదు; మానవుని మను

గడే సంభవమయ్యేది కాదు. మానవుని ఉనికే లోకాన్ని నడుపుతున్న శక్తి జ్ఞానాత్మకమైన దనడానికి నిదర్శనం.

జడపదార్థంలో జీవం సంకోచరూపంలో లేకపోతే, పదార్థంనుంచి ప్రాణం విలసనం కాదగు కారణం లేదు. ప్రాణంలో మనస్సు అవ్యక్తంగా లేకపోతే, జీవంలోనుంచి మనస్సు వ్యక్తం కావలసిన హేతువులేదు. మనస్సులో ప్రజ్ఞ దాగిఉండకపోతే, ప్రజ్ఞ మనస్సులో నుంచి ఆవిష్కారం కావలసిన అవసరం లేదు. ''క్యూ'' లో ఏది అన్నిటికంటె ఎక్కువ వెనుక ఉన్నదో, పరిణామక్రమంలో అదే కట్టకడపట వ్యక్తమవుతుంది. జడవస్తువు వెనుక ప్రాణం, ప్రాణం వెనుక మనస్సు, మనస్సు వెనుక ప్రజ్ఞ ఉన్నది. కనుకనే, వికాసక్రమంలో మొట్టమొదట భౌతిక తత్త్వం, పిమ్మట ప్రాణం, తరువాత మనస్సు, అనంతరం ప్రజ్ఞ ఆవిష్కారమవుతున్నవి. ఏది జగత్తుకు పూర్వమందు పరమందు కలదో అది జగత్తంతటా, జగత్తుకు ఆధారంగా, సృష్టి స్థితిలయాలకు ఆశ్రయంగా అవ్యక్తంగా, పరిణామ సూత్రం పొడవునా ఉన్నది. "In Him I live and move and have my being" ''నా బ్రతుకు, విహారం, ఉనికి ఆ పరమ పురుషుని యందే'' అని సెయింట్ పాల్ అన్నమాటకు అర్థమిదే.

పూర్వమందు, వర్తమానమందు, భవిష్యత్తునందు – ఇక్కడ అక్కడ, సర్వత్ర, – స్థూలరూపంలో, సూక్ష్మరూపంలో ఏదేది కలదో, ఏదేది సంభవమో, ఏదేది సాధ్యమో అదంతా గింజలో చెట్టువలె ఆ ''ఒకేఒక్కటి' నుంచి ఉద్భవిస్తున్నది. దానిచేతనే పోషింబడుతున్నది. ఈ బహుళత్వమంతా ఒక్కటే, ఏకం అనేకానికి కారణరూపం; అనేకం ఏకమునకు కార్యరూపం. పరస్పర విరుద్ధమైన వన్నీ ఏకమేవాద్వితీయమందు సమన్వితమైనవి. మన ఇచ్ఛాశక్తి, జ్ఞానశక్తి, క్రియాశక్తి, స్మృతిశక్తి, తార్కికశక్తి, భావనాశక్తి దేనినుంచి ప్రభవిస్తున్నవో అది విద్యుచ్ఛక్తివంటి అంధప్రాయమైన శక్తే అనడం ''చూపులేని గ్రుడ్డివాడు'', ''వెలుతురు నిచ్చే చీకటి'' ''మాట్లాడుతున్న మూగవాడు'', అనడం వంటిది. మన ఆవేశాలు, ఆవేగాలు, ఆశయాలు, అనుభవాలు, అనుబంధాలు, ధర్మచింత, సేవాశీలం, విమర్శాకౌశలం, భాషాపాండిత్యం – ఇవన్నీ రసాయనిక పరిణామాలనడం హాస్యం, చమత్కారం, భావం, ఆలోచన, రసజ్ఞత, ఆవేశం, అనుభవం–వీటితో నవ్వుకు సంబంధం లేదనుకునే శరీరతత్త్వ శాస్త్రజ్ఞుని నిర్ణయం వంటిదే.

మన జిజ్ఞాసువు అంగీకరించిన ఏకమేవాద్వితీయమైన శక్తి స్వతస్సిద్ధంగా ఉన్నదికనుక, అది సత్యం. అది సమస్త జ్ఞానానికీ ఆశ్రయం కనుక ప్రజ్ఞానం. అది మన సమస్త ఆశయాలకు కారణం, ఫలస్వరూపం కనుక ఆనందం. సత్ చిత్ ఆనందమే దేవుడంటే. దేవుని యితర గుణాలలో కొన్ని సత్ చిత్ ఆనందంనుంచి పుట్టినవి. మరికొన్ని దేవునికి ప్రపంచంతోగల సంబంధాన్ని గురించినవి. వేరు కొన్ని దేవునికి జీవులతో గల సంబంధాన్ని సూచించేవి. సత్ చిత్ ఆనందం దేవుని స్వరూప లక్షణాలు.

(సశేషము)

# శ్రీ వివేకానందస్వామి సూక్తులు సుభాషితాలు

1. మానవుడు జన్మించినది ప్రకృతిని జయించుటకే గాని దాని ననుసరించుటకు కాదు.

2. "ఈ దేహామే నేను" అనుకొనినప్పుడు జగత్తునుండి నీవు వేఱగుచున్నావు; "నే నొక ఆత్మను" అనుకొందు వేని నిత్యమహాగ్నిలో నీ వొక విస్ఫులింగమవు; "నేను పరమాత్మను" అనుకొందువేని, సకలము నీవే.

3. సంకల్పము స్వాతంత్ర్యమైనది కాదు. అది కార్యకారణనియతికి లోబడినదే. కాని సంకల్పమునకు మఱుగున ఒకానొకటి యున్నది, అది స్వాతంత్రము.

4. సౌజన్యమే బలము, పవిత్రతయే బలము.

5. మనసుండి వేఱైనదిగా చూడబడు బ్రహ్మమే జగము.

6. నీయందు నీకు విశ్వాసము కల్గువఱకు దేవుని నీవు విశ్వసింపజాలవు.

7. మనము దేహాములము అనెడి భ్రాంతియే అనర్థమునకు మూలము. అసలు పాపమనునది ఒకటి ఉన్నచో, ఆభ్రాంతియే పాపము.

8. స్థూలద్రవ్యమునుండి మనస్సు పుట్టినది అని ఒకపక్షమువారు చెప్పుదురు. జగత్తు మనఃప్రభవ మని మఱొకపక్షమువారు చెప్పుదురు. రెండు ప్రతిపాదనలును తప్పే. మనస్సును స్థూలద్రవ్యమును సహచరములు. మూడవది ఒకటి కలదు. అందుండి పుట్టినవే స్థూలద్రవ్యమును, మనస్సును.

9. ద్రవ్యాణువులు ఆకాశమున కలిసికొనును. మనస్తరంగములు కాలతత్వమున కలసికొనును.

10. దేవుని నిర్వచించుట అనగా—మెదిగియున్న దానినే మెదుపుట. ఏలయన మన మెఱిగిన ఏకైక సత్తు దేవుడే!

11. మృగమును మానవస్థాయికిని మానవుని దేవుని స్థాయికిని హెచ్చించు ఆశయమే ఆస్తిక్యము (రిలిజన్).

12. అంతః ప్రకృతి దాల్చు బృహద్రూపమే బాహ్యప్రకృతి

13. నీపని కొలబద్ద నీ యభిప్రాయమే. నీవు దేవుడనుటకంటెను, అత్యంత క్షుద్ర జీవుడునైతము దేవుడే, అనుటకంటెను ఉన్నతతరమైన అభిప్రాయము ఏది యుండగలదు?

14. మనఃప్రపంచ పరిశోధకుడు బలిష్ఠుడుగ నుండవలెను, శాస్త్రీయరీతిలో శిక్షితుడై యుండవలెను.

15. మనస్సే సర్వస్వము అనియు సంకల్పమే సర్వస్వ మనియు నమ్మట పై మెట్టైనను అనాత్మవాదమే.

16. ఈ ప్రపంచము ఒక పెద్దగరిడీశాల. మనమిచ్చటికి వచ్చుట మనలను బలిష్ఠులనుగా చేసికొనుటకే.

17. మొక్కను వర్ధిల్లచేయుట నీకేపాటి సాధ్యమొ ఒక శిశువునకు బోధపఱచుటయు

ఆపాటిసాధ్యమే. నీవు చేయగలిగినది యెల్ల వ్యతిరేకపక్షముగ నుండును. నీవు తోడ్పడ గలవు, అంతే. మొక్క ఎదుగుట అనగా దాని లోపలనుండునది వెలికి ఆవిష్కృత మగుటే. అది తనప్రకృతిని తానే పెంపొందించుకొనును. నీవు అడ్డములను తొలగింపగలవు అంతే.

18. నీ వొక వర్గమును ఏర్పఱచితివేని విశ్వమానవ సోదరభావమును ప్రతిఘటించితి వన్న మాటే. విశ్వమానవ సోదరభావాను భవము నిజముగ గలవారు ఎక్కువగ మాటా డరు. వారి నడవడులే చెప్పక చెప్పు చుండును.

19. సత్యమును వేయిభిన్న రీతులలో ప్రతి పాదింపవచ్చును. కాని ప్రతిరీతియు సత్యమే అనుట నిర్బాధము.

20. నీ అభివృద్ధి నీలోపలినుండియే వెలు పలికి సాగవలెను. ఒరులు నీకు బోధపఱుప లేరు. నిన్ను ఆధ్యాత్మికపరునిగ నొనర్ప లేరు. నీ ఆత్మయే నీకు గురువు. వేఱు గురువులు లేరు.

21. అనంతమైన యొక పరంపరలో కొన్ని కొలుకులను నీవు వివరింపగలిగినచో, ఆ మార్గముననే సమస్తమును వివరింప వచ్చును.

22. ఐహికమైనది ఏదియు ఎవనిని కదల్ప జాలదో వాడు అమృతత్వమును అధిగమించిన వాడు.

23. సత్యమునకై, దేనినైననుసరే,త్యజింప వచ్చు; కాని, దేనికొఱకైననుసరే, సత్యమును త్యజింప గూడదు.

24. సత్యాన్వేషణ మనగా బలహీనుడును నేత్రహీనుడును దేవులాడుట కాదు. బలా విష్కృతియే సత్యాన్వేషణము.

25. దేవుడే జీవుడైనాడు. జీవుడు మరల దేవు డగును.

26. మానవుడు చచ్చి ననుటయు స్వర్గ మునకు పోవును అనుటయు శిశుజల్పితము. వచ్చుట కాని పోవుట కాని మనకు లేదు. ఉన్న చోటనే మనము ఉన్నాము, ఉన్న జీవులు ఉన్న జీవులు రానున్న జీవులు అందఱును ఒక్క బిందువులోనే యున్నారు.

27. తన హృదయగ్రంథమును తెఱచు కొన్నవానికి ఇతర గ్రంథములఅక్కఱ లేదు. మనలో కోరికలను పుట్టించుట ఒక్కటే ఆగ్రంథాల విలువ. అవి కేవలము ఇతరుల అనుభవములు.

28. సకలప్రాణులయెడ ఔదార్యము కలిగి యుండుము. ఆపదయందున్నవారిపట్ల కని కరము గలిగి యుండుము.

# శ్రీమద్భాగవతము - శ్రీకృష్ణసందేశము

## [శ్రీమత్ప్రభవానందవాణి]

## తృతీయస్కంధము

### పంచమాధ్యాయము

### దుఃఖకారణము : విముక్తి మార్గము

కపిలుడు :

అమ్మా, దేని నెఱుంగుటచే మానవుడు అజ్ఞానపువలనుండి విముపొందునో, ఆ పరమార్థమును నీ కిప్పుడు చెప్పెదను.

మానవుని ఆత్మగా, లోపలనున్న చైతన్యజ్యోతికి పురుషు డనియు పేరు. పురుషుడు స్వయంప్రకాశుడు. ఆదిరహితుడు, అంతములేనివాడు. ప్రకృతికంటె పూర్తిగ భిన్నమైనవాడు. పురుషసాన్నిధ్యముచే ఉత్తేజితమైన ప్రకృతినుండి పుట్టుచుండునదే నామరూపాత్మకమగు నీ జగత్తు. పురుషుడు తన్ను ప్రకృతి యని — ఆత్మేతరమని — తలంచుకొనుటతో అవిద్యావంచితు డగును. అతనిజ్ఞానమునకు పరిమితి యేర్పడును. పురుషుడు నిత్యసాక్షి, నిత్యముక్తుడు, ఎన్నడు గాని కర్త కానేకాడు. కార్యములన్నియు ప్రకృతిగుణసంభవములు. తానే ప్రకృతి అనుకొనుటచేత పురుషుడు తన్ను కర్త అని భావించుచున్నాడు. నిజమునకేమో అతడు ముక్తుడు, ఆనందపూర్ణుడు. కర్మబద్ధుడైనట్లును జననమరణవశుడైనట్లును సుఖపడుచునో, కష్టపడుచునో ఉన్నట్లును అతడు పైకి కనిపించును.

దేవహూతి :

స్థూల సూక్ష్మజగమునకు ప్రకృతియే ప్రభవము అని నాకర్థమైనది. కాని ప్ర[illegible] అనగా నేమో తెల్పుము.

కపిలుడు :

తాను అవిభక్తమయ్యు సకలవిభాగములకు కారణమైనదానిని తనలో ఇముడ్చుకొని యుండునది ప్రకృతి. ప్రకృతి త్రిగుణాత్మకము. సత్వరజస్తమములు త్రిగుణములు. మూడు గుణములకును సరి తూనిక కలిగి సమత్వము వెలసియున్నప్పుడు ఆ దశకు శాంతప్రకృతి నిరాకారప్రకృతి అని పేరు. గుణముల ఆ సమత్వము కదల్పబడినపుడు జగము ఉద్భవించును.

పురుషుడు నిరాకారుడు, నిర్గుణుడు, నిర్వికారుడు. కావున అతడు కర్తగా నుండుట పొసగదు. సూర్యుడు నీట ప్రతిఫలించినను నీటి గుణములు సూర్యుని కంటనట్లు పురుషుడు దేహధారియైనను అతనిని ప్రకృతిగుణము

లంటవు. కాని అవిద్యచేత పురుషుడు త్రిగుణములను ఆరోపించుకొని సుఖపడుచునో, కష్టపడుచునో ఉన్నట్లు కనిపించును. తన్ను కర్తగా ఎంచుకొనును. అతడు దేవతిర్యఙ్మనుష్యజన్మము లెత్తుటకును జననమరణపరంపరకు లోనగుటకు — కర్మదాసుడగుటకును కారణమిదే. మనసునకు ఇహలోకమందును తద్వస్తువులందును సంగము కల్గుటతో కామము హెచ్చును. మోహము కల్గును. ఈ లోకస్థాయి నతిక్రమించి అధిరోహింప గోరువాడు నిస్సంగతను అలవఱచుకొని ఆత్మనిగ్రహమును నేర్చుకోవలెను.

ధ్యానయోగమార్గమును అనుసరింపుము. భగవంతునందు స్థిరభక్తి కలిగి యుండుము. ఏకాగ్రచిత్తముతో భగవంతునే ధ్యానించుచుండుము.

సకలచరాచరములందును సమదృష్టిని అలవఱచుకొనుము. ద్వేషశాత్రవముల తఱిమివేయుము. ప్రీతిపూర్ణ హృదయముతో భగవచ్చరణములను శరణొందుము.

ప్రాప్తి ఎంతైన గాని, సంతృప్తి గల్గియుండుము. అన్నపానవినోదాలలో మితిని పాటింపుము. ఏకాంతవీథుల సంచరింపుము. నీ హృదయముననే శాంతి నన్వేషించుకొమ్ము. ఎల్లరకును మిత్రుడవై యుండుము, వారి దోషము లెన్నకు. వారు కష్టపడుచున్నప్పుడు సానుభూతితో ఉపచరింపుము. ఈ విధముగ పరమసత్యమును ప్రకటించు జ్ఞానమును స్వీకరింప ఆయత్తుడ వగుము. అజ్ఞానజాలమునుండి నిన్ను విముక్తను జేసికొనుట కదే దారి. ఇహలోకస్పృహల దాస్యమునుండి నిన్ను విముక్తను జేసికొనుట కదే దారి. తదనంతరము అనంతుని శుద్ధుని నిత్యముక్తుని ఆత్మను నీవు సాక్షాత్కరించుకొందువు.

ఒకనికి చెడ్డ కల రావచ్చు. నిద్ర మేలుకొన్న పిమ్మట అతనికి అది జ్ఞప్తి యున్నను దానిచే మోసపోడు. అట్లే ఆత్మను సాక్షాత్కరించుకొని దాని దివ్యతను అనుభవమునకు తెచ్చుకొని దాని వైభవముచే ఆనందించునాతడు ఇక మాయచే మోసపోడు. జననమరణములను అతడు జయించినాడు. మోక్షానందమును గుర్తించినాడు. యోగశక్తులు సైతము అతనిని ఆకర్షింప లేవు. ఏల యన అవి అతనిచేతిలో నున్నవి. భువి నున్నంత కాలము, అతడు ముక్తాత్మగనే యుండును. అతని శరీరము పంచత్వమొందినప్పుడు అతడు నిరతిశయానంద మగు దివ్యమోక్షమును అధిగమించును.



# వార్తలు, విశేషాలు

## శ్రీరామకృష్ణమఠము - మద్రాసు

### శ్రీ వివేకానందస్వామి జయంతి

1962వ సంవత్సరం జాన్యువరి తే 28 ది ఆదివారం మఠంలో శ్రీవివేకానందస్వామి శతతమజయంతి తిథిపూజ నిర్వర్తింపబడింది. నాటి కార్యక్రమం — ప్రొద్దున 5 గంటలకు మంగళహారతి; తర్వాత భజన, చండిగీతోప నిషత్తుల పారాయణం; గుడిలో 8 గంటలకు ఆరంభమైన విశేషపూజ మధ్యాహ్నం 1 గంట ప్పుడు హోమంతో పరిసమాప్తి చెందింది. దాదాపు 1,150 మంది భక్తులకున్నూ 750 మంది దరిద్రనారాయణులకున్నూ అన్నసంత ర్పణ జరిగింది. సాయంహారతికి అనంతరం సదస్సులో శ్రీమచ్ఛుద్ధసత్త్వానందస్వాములు స్వామిజి ఉపదేశాలను కొన్నింటిని చదవారు. శ్రీమత్పరమాత్మానంద - శ్రీమత్కైలాసా నందస్వాములు ఉపన్యసించారు.

1962 వ సంవత్సరం ఫెబ్రువరి తే 4 ది భానువారం బహిరంగోత్సవం జరపబడింది. స్వామిజి చిత్రపటం చక్కగా సింగారింపబడి మండపంలో అమర్చబడింది. తత్సన్నిధిలో భక్తులు దాదాపు 4,000 పుటల స్వామిజి సం పూర్ణగ్రంథావళిని మౌనపారాయణం చేశారు. మధ్యాహ్నం 3 గంటలనుంచి 5 గంటలదాక శ్రీ తిరువారూరు ఎన్. రామచంద్రశర్మగారు తిరునీలకంఠనాయనార్లనుగూర్చి హరికథా కాల క్షేపం చేశారు. 5 గంటలకు బహిరంగసభ సమావేశమైంది. డాక్టరు సి. పి. రామస్వామి అయ్యరుగారు ఆధ్యక్ష్యం వహించారు. శ్రీమత్కైలాసానందస్వాములు సభాధ్యక్షు లకు ఉపన్యాసకులకు సదస్యులకు స్వాగతం చెప్పారు. తర్వాత ప్రొఫెస్సరు డి. సిహెచ్. కృష్ణయ్యగారున్నూ శ్రీ ఐ. జె. నాయుడు గారున్నూ శ్రీ కె. పంజాబకేశయ్యరుగారున్నూ శ్రీ కె. వి. జగన్నాథంగారున్నూ వరుసగా తెలుగులో ఇంగ్లీషులో సంస్కృతంలో తమి ళంలో ఉపన్యసించారు. నలుగురున్నూ స్వామిజి జీవితోపదేశాలను గురించే మాటాడి శ్రోతలను రంజింపజేశారు. వ్యాసాలువ్రాసిన కళాశాలావిద్యార్థులకు బహుమతులు ఇచ్చిన తర్వాత సభాధ్యక్షులు శ్రీ వివేకానందస్వాముల సంపూర్ణగ్రంథావళికి తెలుగు తమిళాలలో తయారైన అనువాదగ్రంథాలను ఆవిష్కరించ వలసిందని మద్రాసు హైకోర్టు ప్రధానన్యాయ మూర్తులైన పూజ్యశ్రీ ఎస్. రామచంద్ర య్యరుగారిని ప్రార్థించారు. తమ అధ్యక్షోప న్యాసంలో శ్రీ రామస్వామిఅయ్యరుగారు ''ఊరక ప్రాతకాలపు గొప్పలను దప్పువాయిం

చుకోవడంచేత దేశంలో నేడున్న సమస్యలకు పరిష్కారం కల్గదు అనిన్నీ, ఆధ్యాత్మికభావాలను ప్రజలు జీర్ణించుకోగలిగే ముందు, వారు దారిద్ర్యాదులైన చిక్కులనుండి విమోచితులు కావాలి అనిన్నీ, తల ఎత్తుకోగలగాలి అనిన్నీ, అన్ని రంగాలలో పురోగమించాలి అనిన్నీ స్వామిజి నమ్మకం అన్నారు. శ్రీ వివేకానంద స్వామిసూక్తులలోంచి ప్రకరణోచితమైన ఈ క్రింది వాక్యం చదివి 'సాంఘికరాజకీయాశయాలను భారతదేశంలో వ్యాప్తిచేయడానికి ముందు పారమార్థికాశయాలచే దేశాన్ని ముంచివేయవలె.'' తర్వాత ఈలా గన్నారు— ''మన ఉపనిషత్తులలో వేదాలలో పురాణాలలో ఉన్న తత్త్వాలను జగమంతట వెదజల్లవలసిన ఈ రోజుల్లో ఈ ఉపదేశానికి ఎంతైనా విలువ ఉంది. శ్రీ వివేకానందస్వామిలో ఇటు ప్రాచ్యవిజ్ఞానమూ ఉంది. అటు పాశ్చాత్యులకుండే సాంగోపాంగనిర్మాణశక్తీ ఉంది. దేశవ్యాప్తమైన శ్రీరామకృష్ణసంస్థానిర్మాణానికి కారణం అదే. శ్రీ వివేకానందస్వామికి మొదటి పేరు నరేంద్రుడు అని మాత్రమే చాలామందికి తెలుసు కాని వివిదిషానందస్వామి అనే పేరు కూడా మొదట ఆయనకుండేది అని తెలిసిన వారు చాల తక్కువ మంది. ఖేత్రి మహారాజుగారి కోరికపైనే స్వామి శ్రీ వివేకానందనామమును పెట్టుకొన్నారు. స్వామిజి ముఖ్యసందేశం ఇది — 'ప్రతిజీవియందును దేవత్వం గర్భితంగా ఉంది. భారతదేశంలో దారిద్ర్యమున్నూ దుఃఖమున్నూ ఉన్నా, ఎంత నిమ్నవర్గంవాడైన మానవుడైనా అతడు బ్రహ్మంలో ఒక అంశ మనీ, ప్రాచ్యునిలోనైనా సరే పాశ్చాత్యునిలోనైనా సరే ఏ మానవునిలోనైనా సరే దివ్యాంశ ఉంది అనే సంప్రదాయం భారతదేశంలోనే కద్దని పాశ్చాత్యులకు మొట్టమొదట చెప్పినవాడు స్వామిజి. ఈ దేవత్వమును వ్యక్తం చేయడమే స్వామిజి తనకు నిర్ణయించుకొన్న పని.

## సంపూర్ణగ్రంథావళి ఆవిష్కరణం

నాటిసాయంకాలం నిర్వర్తితమైన మఱొక పని — శ్రీ వివేకానందస్వాముల సంపూర్ణ గ్రంథావళికి తెలుగులోనూ తమిళంలోనూ ఇప్పటికి అచ్చైన సంపుటాలను ఆవిష్కరించడం. సెంటినెరికమిటీకి కార్యదర్శులైన శ్రీమచ్ఛుద్ధసత్త్వానందస్వాములు మొదట ఈలాగు అన్నారు—''శ్రీవివేకానందసంపూర్ణ గ్రంథావళిని తమిళంలోనికిన్నీ తెలుగులోనికిన్నీ అనువదింపించి ప్రచురించాలనుకొన్నాం. ఈ కార్యక్రమంలో ముందడుగు మద్రాసుదే ఐంది. ఇతరరాష్ట్రాలలో ఇతరకేంద్రాలలో కూడ ఇతర ఎనిమిదిభాషలలో అనువాదకార్యక్రమం తర్వాత ప్రారంభింపబడ్డది. ఈ ప్రచురణకార్యానికి మొత్తం సుమారు మూడులక్షల రూపాయలు అవుతుం దని అంచనా వేయబడింది. ఇండియా కేంద్రప్రభుత్వంవారు ఒకలక్ష రూపాయలనున్నూ మద్రాసురాష్ట్రప్రభుత్వంవారు ఎనిమిదివేలరూపాయలనున్నూ ఆంధ్రప్రదేశప్రభుత్వంవారు ముప్ఫైవేలరూపాయలనున్నూ విరాళా లిచ్చారు. ఇదికాక ప్రతి పంచాయతియూనియనువారును 50 రూపాయలవఱకు ఈగ్రంథప్రచురణవ్యయానికి ఇయ్యవచ్చునని మద్రాసుప్రభుత్వంవారున్నూ; ఒక్కొక్కజిల్లాపరిషత్తు నూఱు రూపాయల చొప్పుననున్నూ, ప్రతిపంచాయతియూనియను 50 రూపాయలచొప్పుననున్నూ ఇయ్యవచ్చు

సని ఆంధ్రప్రదేశ్ప్రభుత్వంవారున్నూ అనుమతించారు. బెంగాలులో 22,000 ప్రతులకి ఇప్పటికే ఆర్డర్లు రిజిస్టరు ఐనాయి. ఈపనిలో మాకు తోడ్పడుతుండే ముద్రాశాలలవారికి సంపాదకులకి వివిధప్రభుత్వాలవారికి ఇతరులకు మా కృతజ్ఞతను తెలుపుకొంటున్నాము.''

సంపుటాలను ఆవిష్కరిస్తూ మద్రాసు ప్రధానన్యాయమూర్తులు పూజ్యశ్రీ ఎస్. రామచంద్రయ్యరుగారు ''భారతమాతృనందనులలో శ్రీ వివేకానందస్వామి అగ్రగణ్యుడు. అజరామరమైన హిందుసిద్ధాంతపారమార్థికమహిమను గుర్తించేటట్లు ప్రజలకన్ను తెఱచినది ఆయనే. అఱువైయేండ్లకు మునుపు స్వామిజి కావించిన ఉపన్యాసాలకు ఆ రోజులలో ఎంతో విలువ ఉండేది. కలహవిదీర్ణమైన నేటి ంచంలో ఆ ఉపన్యాసాలకు మునుపటికి చాల హెచ్చు విలువ ఉం'' దన్నారు.

శ్రీ బాలసుబ్రహ్మణ్యయ్యరుగారు సదస్సుకున్నూ ఉపన్యాసకులకున్నూ అధ్యక్షులకున్నూ కృతజ్ఞతాభివందనం సమర్పించారు. హారతికనంతరం శ్రీ ప్రియానందస్వామిబృందంవారు గంటసేపు భజన చేశారు. రాత్రి 9-15 గంటలకు కార్యక్రమం పరిసమాప్తమైంది.



# గ్రంథపరిచయం

[సమీక్షకై గ్రంథాలు పంపేవారు రెండేసి ప్రతులు పంపవలె అని మనవి]

### భగవన్నామ సంకీర్తన

ఇది ఆంధ్రప్రదేశ్ - గుంటూరు జిల్లా - పిడుగురాళ్ల పోస్టు శ్రీ రామతీర్థసేవాశ్రమం వారి ప్రచురణ. పుటలు 92, వెల ఒక్క రూపాయ మాత్రమే.

ఆశ్రమస్థాపనమైననాటినుండి ఈనాటివఱకు ప్రతిదినం రాత్రి శ్రీనృసింహపంచాయతన పూజామందిరంలో జరుగుతుండే భగవన్నామ సంకీర్తనంలో ఉపయోగించుకొనే కీర్తన లన్నీ ఈ గ్రంథరూపంలో భక్తజనాభీష్టానుసారం నేడు వెలువడినవి. ఇందు కొన్ని పూర్వభాగవతోత్తమకృతములు, పెక్కు శ్రీ కేశవస్వామికృతములు. సర్వదేవభక్తులకున్నూ ఉత్తారకంగా విశ్వోపజీవ్యంగా వ్యాగ్రూపం దాల్చిన ఈభక్తి పరీవాహానికి స్వాగతం.

## స్త్రీధర్మప్రబోధిని

రచయిత శ్రీమాన్ కలవకుంట కృష్ణమాచార్య. ప్రకాశకులు రామానుజ ఆయుర్వేదనిలయమువారు, పూడూరు, వయా కొత్తపల్లి, కరీంనగర జిల్లా. పుటలు 69, వెల ఒకరూపాయి.

ఇందు 'శ్రీమతి' 'సావిత్రి' అను నిద్దఱి సంభాషణరూపంలో 'విద్య' 'వివాహము - పతిసేవ' 'కుటుంబము - సత్ప్రవర్తనము' 'ఆరోగ్యరక్షణము' 'సంతానము' 'ప్రసూతి - శిశుపోషణ' 'వితంతువులు - నియమములు' అనే ఏడు శీర్షికల క్రింద స్త్రీధర్మాలు 'సర్వసుగ్రహంగా ఉండా'లనే లక్ష్యంతో పొందుపఱుపబడ్డాయి ఐతే 'మనఃప్రవృత్తి' వంటి సాధురూపాలకంటె 'మనోప్రవృత్తి' (పుట 6) వంటి అపభ్రంశరూపాలే సుగ్రహాలు అనే భ్రాంతి ఇందు ప్రతిపుటలోను కనబడుతుంది.

ప్రభాకర్.

## Sri Ramakrishna Prabha

Statement about ownership and other particulars about *Sri Ramakrishna Prabha* (according to Form IV, Rule 8, circulated by the Registrar of Newspapers for India).

| | | |
|---|---|---|
| 1. | Place of Publication | Sri Ramakrishna Math, Mylapore, Madras-4. |
| 2. | Periodicity of its Publication | Monthly. |
| 3. | Printer's Name | K. S. S. Rajan. |
| | Nationality | Indian. |
| | Address | The Jupiter Press Private Ltd., 109-C, Mount Road, Madras-18. |
| 4. | Publisher's Name | Swami Suddhasatwananda. |
| | Nationality | Indian. |
| | Address | Sri Ramakrishna Math, Mylapore, Madras-4. |
| 5. | Editors' Names | Swami Suddhasatwananda, and Prof. N. Bhaktavatsalam, M.A., B.O.L. |
| | Nationality | Indian. |
| | Address | Sri Ramakrishna Math, Mylapore, Madras-4. |
| 6. | Names and addresses of individuals who own the newspaper and partners or Shareholders holding more than 1% of the total capital. | Sri Ramakrishna Math, Mylapore, Madras-4. |

I, Swami Suddhasatwananda, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

Date: 28-2-1962.

Signature of the Publisher,
(Sd.) SWAMI SUDDHASATWANANDA.

# ఆదిమవాసులకు నవ్యజీవితం



బయటి ప్రపంచానికి తెలియని కొండకోనల నడుమ శతాబ్దాలతరబడి అంధకార జీవితంలో క్రమ్మగ్గిన విశాఖపట్నం జిల్లా అరకు లోయలోని ఆదిమవాసులు సామాజికాభివృద్ధి కార్యక్రమాలలోని బహుళార్థ సాధక పథకంవల్ల తమజీవనప్రమాణాలను పెంపొందించుకోవడానికి నూతన వృత్తులను, పనులను నేర్చుకొంటున్నారు.

—స. పౌ. స. శా. ఆ. ప్ర.

సంపాదకులు : శ్రీ శుద్ధసత్త్వానందస్వామి, శ్రీ నేలటూరి భక్తవత్సలము,

శ్రీ. కే. ఎస్. ఎస్. రాజన్ గారిచే ది జ్యూపిటర్ ప్రెస్స్ ప్రైవేట్ లిమిటెడ్ (మద్రాసు - 18) న ముద్రింపబడి,

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటము ౧౮ ౧౯౬౨, ఏప్రిల్; శుభకృత్తు - చైత్రము సంచిక ౧౦

## విషయసూచిక

# శ్రీ రామకృష్ణ మఠ ప్రచురణములు

| | | |
|---|---|---|
| 740 పుటలు | శ్రీరామకృష్ణ సూక్తి సుధ (తొలికూర్పు) | రూ. 7/50 |
| 496 పుటలు | శ్రీ రామకృష్ణ లీలామృతము (ద్వితీయ ముద్రణము) | రూ. 5/- |
| 144 పుటలు | శ్రీ శారదాదేవి | రూ. 1-25 |
| 312 పుటలు | శ్రీ శారదా ప్రసంగములు | రూ. 3-00 |
| 540 పుటలు | శ్రీ రామకృష్ణ బోధామృతము (సంగ్రహ జీవితసహితము) | రూ. 3-50 |
| 432 పుటలు (సాదా) రూ. 3-50 | శ్రీవివేకానంద జీవితచరిత్ర (అట్టబైండు) | రూ. 4/- |
| 564 పుటలు | స్వామి - శిష్య సంవాదములు (ప్రథమ ముద్రణము) | రూ. 5/- |
| 344 పుటలు | బ్రహ్మానంద బోధనలు (ప్రథమ ముద్రణము) | రూ. 3-50 |
| 330; 324 పుటలు | సందేశతరంగిణి - 2 భాగములు (ఒక్కొక్క భాగము) | రూ. 3/- |
| 402 పుటలు | పారమార్థిక సంభాషణలు | రూ. 3/- |
| 504 పుటలు | శ్రీమద్భగవద్గీత (పంచమ ముద్రణము) | రూ. 4/- |

| | | | |
|---|---|---|---|
| జ్ఞానయోగము 4 00 రాజయోగము | 2 50 | గిరీశచంద్ర 0 75 భక్తిమార్గము | 0 50 |
| కర్మయోగము 1 50 భక్తియోగము | 1 50 | షికాగో నగరోపన్యాసములు ... | 0 50 |
| నారద భక్తి సూత్రములు ... | 3/- | గురూపదేశములు 0 50 శ్రీకృష్ణవాణి | 0 40 |
| పరతత్త్వప్రసంగము ... | 2/- | శ్రీ రామకృష్ణ ఉవాచ ... | 0 37 |
| శ్రీ నాగమహాశయుని జీవితచరిత్ర ... | 1 25 | శ్రీ వివేకానంద శంఖారావము ... | 0 37 |
| ప్రబోధరత్నాకరము ... | 2 25 | శ్రీ శారదా సూక్తి నవనీతము ... | 0 40 |
| శ్రీ శారదాదేవి చరిత్ర ... | 2/- | నా సంస్కరణ యుద్ధవిధానము ... | 0 37 |
| దేవీమాహాత్మ్యము ... | 2/- | నా గురుదేవుడు 0 40 బుద్ధ ఉవాచ | 0 37 |
| వివేకానందలేఖావళి (మొదటిభాగము) | 1 50 | శ్రీరామకృష్ణుడు, వివేకానందస్వామి | 0 25 |
| వివేకానందలేఖావళి (రెండవభాగము) | 1 75 | శ్రీ పరమహంస జీవిత సంగ్రహము... | 0 25 |
| శ్రీరామకృష్ణోపనిషత్తు .. | 1 25 | పరమహంస శ్రీరామకృష్ణుడు ... | 0 25 |
| హిందూ మతము .. | 1 25 | నవీన భారతదేశము ... | 0 25 |
| అనుష్ఠాన వేదాంతము .. | 1 25 | తాపత్రయ చికిత్స | 0 25 |
| కులము, సంస్కృతి, సామ్యవాదము | 1/- | పవహారిబాబా 0 25 ముక్తిమార్గము | 0 19 |
| వివేక సూర్యోదయము .. | 1 25 | సర్వం విష్ణుమయం జగత్ | 0 19 |
| భారతీయ మహిళ .. | 1/- | శ్రీ రామకృష్ణ ఆరాత్రికము | 0 12 |
| కఠోపనిషత్తు .. | 0 80 | శ్రీరామనామసంకీర్తన 0 6 యతిగీతము | 0 6 |
| శ్రీ పరమహంస నీతికథారత్నములు | 0 75 | నామతము 0 3 వి. సింహగర్జనము | 0 3 |

శ్రీ దొడ్డ భాగవతము - మొదటి సంపుటము రూ. 6-50; రెండవ సంపుటము రూ. 5-50;
మూడవ సంపుటము రూ. 7-50 (మూడును ఒకేపరి కొన్నచో: రూ. 18-50)

ఇవియేకాక సంస్కృత, ఆంగ్ల, తమిళ, హిందీ, కన్నడ గ్రంథములు,

వేదాంత కేసరి (ఆంగ్లము) శ్రీ రామకృష్ణ విజయము (తమిళము)

అను మాసపత్రికలును మాయొద్ద దొరకును

అడ్రెసు : మేనేజరు, శ్రీరామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు - 4



'అఖిలవిభు శరణొందుము, యా క్షణంబ యతనికృప నీవ ననుభావ్య మగును వత్స.'

—శ్రీ శారదామణి.


# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము ౧౮ } ౧౯౬౨ - ఏప్రిల్ : : శుభకృత్తు - చైత్రము { సంచిక ౧౦


శ్రీః

# సౌందర్యలహరి

మూలము : శ్రీ శంకరభగవత్పాదులు

టీక : నే. భ.

విరిఞ్చిః పఞ్చత్వం వ్రజతి, హరి రాప్నోతి విరతిం,
వినాశం కీనాశో భజతి, ధనదో యాతి నిధనమ్।
వితన్ద్రీ మాహేన్ద్రీ వితతి రపి సమ్మీలితదృశా
మహాసంహారే ఽస్మిన్ విహరతి సతి త్వత్పతి రసౌ॥ ౨౬

| | | | |
|---|---|---|---|
| (హే) సతి | (ఓ) పతివ్రతాశిరోమణీ | యాతి | పొందును |
| విరిఞ్చిః | బ్రహ్మ (యు) | మాహేన్ద్రీ | ఇంద్రుల (మనువుల) |
| పఞ్చత్వం | మరణమును | వితతిః అపి | సమూహము సైతము |
| వ్రజతి | పొందును | సమ్మీలితదృశా | మూసికొన్న కన్ను(ల)తో |
| హరిః | విష్ణువు (ను) | వితన్ద్రీ | నిద్రాణమగును |
| విరతిం | మరణమును | అస్మిన్ | ఈ |
| ఆప్నోతి | పొందును | మహాసంహారేసతి | ప్రళయమునందు |
| కీనాశః | యముడు (ను) | అసౌ | ఈ |
| వినాశం | మరణమును | త్వత్పతిః | నీ విభుడు |
| భజతి | పొందును | విహరతి | క్రీడించును. |
| ధనదః | కుబేరుడు (ను) | | |
| నిధనం | మరణమును | | |

తా॥ బ్రహ్మ మరణించును, విష్ణువు మడియును, యముడు గెడయును, కుబేరుడు దోరును, మహేంద్రులతండము అంతరించును. అట్టి మహాప్రళయకాలము, అమ్మా, నీ విభుని విహారకాలము.

జపో జల్ప, శ్శిల్పం సకల మపి ముద్రావిరచనా,
గతిః ప్రాదక్షిణ్యక్రమణ, మశనా ద్యాహుతి విధిః ।
ప్రణామ స్సంవేశ, స్సుఖ మఖిల మాత్మార్పణదశా
సపర్యాపర్యాయ స్తవ భవతు య న్మే విలసితమ్ ॥ ౨౭

| | |
|---|---|
| (భగవతి) | (అమ్మా) |
| సకలః | సమస్త |
| జల్పః అపి | వాగ్వ్యాపారమును |
| జపః | జపము (గా) |
| భవతు | అగును గాక |
| సకలం | సమస్త |
| శిల్పం అపి | పాణీంద్రియవ్యాపారమును |
| ముద్రావిరచనా | సంస్థాపన - సంనిధాపన - సంనిరోధ - నావాహ - నాకర్షణాదుల రచనగా |
| భవతు | పర్యవసించును గాక |
| సకలా | సమస్తమగు |
| గతిః అపి | పాదేంద్రియవ్యాపారమును |
| ప్రాదక్షిణ్యక్రమణం | ప్రదక్షిణ క్రియగా |
| భవతు | అగుత |
| అశనాది | భోజనాదికము |
| ఆహుతి విధిః | (నిన్నుద్దేశించి) జఠరాగ్నిలో కావింపబడు ద్రవ్యప్రక్షేపణముగ |

| | |
|---|---|
| భవతు | అగును గాక |
| సంవేశః | పరుండుట పొర్లుట |
| సకలః | అంతయు |
| ప్రణామః | సాష్టాంగ నమస్క్రియ |
| భవతు | కావుత. |
| అఖిలం | సమస్త |
| సుఖం | సుఖముగ తలంపబడుచున్న |
| మే | నా |
| యద్విలసితం | ఏ యథేచ్ఛా విహారము కలదో |
| (సోఽపి) | (అదియు) |
| తవ | నీ |
| సపర్యాపర్యాయః | సేవాక్రమముగ |
| ఆత్మార్పణదశా | బ్రహ్మార్పణముగ |
| భవతు | అగును గాక. |

తా॥ అమ్మా, నోటితో నే నేమి మాటాడినను అ దెల్ల జపము అగును గాక, చేతితో నే నేమి చేసినను అ వెల్ల ముద్రారచనలు అగును గాక, పాదముతో నే నే యే యెడల సంచరించినను అ దెల్ల ప్రదక్షిణక్రియ అగును గాక, నే నే మేమి భుజించినను అ వెల్ల ఆహుతివిధులగును గాక, నే నెట పరుండినను ఎటు పొర్లినను అ దెల్ల (నీ కొనర్పబడిన) సాష్టాంగ నమస్క్రియ అగుత. నా సుఖవిలసితము లెల్ల నీ సేవాక్రమములే అగును గాక. ఆలాగు అనుగ్రహింపుమా.

సుధా మ ప్యాస్వాద్య ప్రతిభయ జరా మృత్యుహరిణీం
విపద్య న్తే విశ్వే విధిశతమఖాద్యా దివిషదః।
కరాళం య త్క్ష్వేళం కబళితవతః కాలకలనా
న శమ్భో, స్తన్మూలం తవ జనని తాటఙ్క-మహిమా॥ ౨౮

| | | | |
|---|---|---|---|
| జనని | అమ్మా | కరాళం | అతిభయంకరమగు |
| విధి | బ్రహ్మ | క్ష్వేళం | విషమును |
| శతమఖ | దేవేంద్రుడు | కబళితవతః | మ్రింగినవాడగు |
| ఆద్యాః | మున్నగు | శమ్భోః | శివునకు |
| విశ్వే | సమస్త | కాలకలనా | మృత్యూపద్రవము |
| దివిషదః | దేవతలును | న | లేదు |
| ప్రతిభయ | భయంకరములగు | (ఇతి) | (అనుట) |
| జరా | ముదిమిని | యత్ | ఏది (కలదో) |
| మృత్యు | మరణమును | తత్ | దానికి |
| హరిణీం | హరించునదైన | మూలం | కారణము |
| సుధాం | అమృతమును | తవ | నీ |
| ఆస్వాద్య అపి | త్రాగియు | తాటఙ్క | కర్ణాభరణముల |
| విపద్యన్తే | చేటునొందుదురు | మహిమా | ప్రభావము. |

తా॥ అమ్మా, బ్రహ్మేంద్రాది దేవతలు భయంకరము లగు వార్ధక్యమును మరణమును హరించున దగు అమృతమును త్రాగియు మరణించుచున్నారు. దారుణ విషమును మ్రింగియు పరమశివుడు మృత్యూపద్రవము లేక మృత్యుంజయుడై యున్నాడు. ఇందులకు కారణము నీ కర్ణాభరణముల మహిమయే.

కిరీటం వైరిఞ్చం పరిహర పురః, కైటభభిదః
కఠోరే కోటీరే స్ఖలసి, జహి జమ్భారిమకుటమ్,
ప్రణమ్రే ష్వేతేషు ప్రసభ ముపయాతస్య భవనం
భవ స్యాభ్యుత్థానే తవ పరిజనోక్తి ర్విజయతే॥ ౨౯

| | | | |
|---|---|---|---|
| (భగవతి) | (అమ్మా) | పురః | ఎదుట |
| ఏతేషు | ఈ బ్రహ్మాదులు | వైరిఞ్చం | బ్రహ్మదేవుని |
| ప్రణమ్రేషు | (నీకు) సాగిలబడినమస్కరించుచుండగా | కిరీటం | కిరీటమును |
| | | పరిహర | విడువుము |
| ప్రసభం | తటాలున | కైటభభిదః | కైటభాంతకుని |
| భవనం | ఇంటికి | కఠోరే | కఠోరమగు |
| ఉపయాతస్య | వచ్చినట్టి | కోటీరే | కిరీటాంచలమున |
| భవస్య | పరమశివునికి | స్ఖలసి | జాఱుదువు |
| అభ్యుత్థానే | (నీవు) ఎదురేగుచున్నప్పుడు | జమ్భారి | దేవేంద్రుని |

| | | | |
|---|---|---|---|
| మకుటం | కిరీటమును | పరిజనోక్తిః | సేవకజనుల ఆలాప కోలాహలము |
| జహి | త్యజింపుము | | |
| (ఇతి) | (అనెడి) నీ | విజయతే | సర్వోత్కృష్టమై వెలయును. |

తా॥ బ్రహ్మాదిదేవతలు నీ ప్రసాదము నాకాంక్షించుచు సాగిలబడి నీకు నమస్కరింతురు. వారు అట్లు సాగిలబడియుండగా ఆకస్మికముగ నీ వల్లభుడు ఇంటికి విచ్చేయునేని ఆయన నెదుర్కొన నీవు సంభ్రమింతువు. అప్పుడు పరిచారికలు ''ఇదిగో బ్రహ్మదేవుని కిరీటమిట నున్నది, తప్పుకొనుము; విష్ణుని కిరీటపు కఱకుటంచు ఇదిగో, నీ పదమును దానిపై పెట్టకు; ఈ యింద్రుని కిరీటమునుండికూడ ఓసరిల్లు'' మని నిన్నెచ్చరింతురు. వారి ఆ మాటలకు జయము.

స్వదేహోద్భూతాభి ర్ఘృణిభి రణిమాద్యాభి రభితో
నిషేవ్యే నిత్యే త్వా మహ మితి సదా భావయతి యః
కి మాశ్చర్యం తస్య త్రినయనసమృద్ధిం తృణయతే
మహాసంవర్తాగ్ని ర్విరచయతి నీరాజనవిధిమ్ ॥ ౩౦

| | | | |
|---|---|---|---|
| నిత్యే | ఆదిమధ్యాంతరహితా | త్వాం | నిన్ను |
| స్వ | సొంత (నీ) | అహం ఇతి | 'నేను' అను భావముతో |
| దేహ | మేనినుండి | సదా | ఎల్లప్పుడును |
| ఉద్భూ | ఉత్పత్తిల్లినవియు | భావయతి | భావించునో |
| అభిత | చుట్టును | త్రినయన సమృద్ధిం | ముక్కంటి యైశ్వర్యమును |
| అవస్థితాభిః | ఉన్నవియు | తృణయతః | తృణీకరించువాడగు |
| ఘృణిభిః | (ప్రకాశముచే) కిరణములు (అనదగినవియు)ను అగు | తస్య | అతనికి |
| | | మహాసంవర్తాగ్నిః | ప్రళయకాలాగ్ని |
| అణిమాద్యాభిః | అణిమ మున్నగు నెనిమిది సిద్ధులచే | నీరాజనవిధిం | ఆరాత్రికానుష్ఠానమును (హారతిని) |
| నిషేవ్యే | సేవింపబడదగ్గ తల్లీ | విరచయతి | కావించును |
| యః | ఏ | ఇతి అత్ర | అనుటలో |
| సాధకః | సాధకుడు | కి మాశ్చర్యమ్ | ఆశ్చర్యమేమున్నది ? |

తా॥ అమ్మా, నీవు ఆదిమధ్యాంతరహితవు. అణిమ మున్నగు అష్టసిద్ధులును నీ మేని నుండియే ఉత్పత్తిల్లిన కిరణము లన దగి నిన్ను పరివేష్టించియుండును. వానికి నీవు ఆరాధ్యవై యుందువు. అట్టి నిన్ను 'అహంభావనతో' అనగా తాదాత్మ్యముతో ధ్యానించు సాధకుడు ఈశ్వరు నైశ్వర్యమును సైతము తృణీకరింపగలవాడగును. ప్రళయకాలాగ్ని అతనికి హారతి జ్యోతి యగును. అందులో ఆశ్చర్య మే మున్నది ? ఏమియును లేదు.



# శ్రీ రా మ చ ం ద్ర స్తు తి

## మహాకవి పింగళి సూరనామాత్యప్రణీతము

### తురగ వల్గన రగడ

దశరథావనీశ విమలతర తపఃఫ లావతార
నిశితశర లఘుప్రయోగ నిహత తాటకావిహార

కపట పటు సుబాహు దళన ఘటిత గాధిసూను యాగ
అపరిమేయ గౌతమాంగ నాఘ దమన పద పరాగ

సోమ లేఖధరదళనసదృశ ఘోరశంభుచాపభంగ
భూమిజా వివాహ విభవపూర్ణ సమ్మదాంతరంగ

పరశురామ గర్వపవన పాన పీన బాహు నాగ
గురువచోనుపాల నాతి కుతుక విధుత రాజ్య భోగ

పాదభజన వితరణాతి ఫలిత గుహసమస్త పుణ్య
పాదుకా ప్రదాన విహిత భరత సౌహృదానుగుణ్య

ఘన విరాధ మదవినాశ కలిత బహు విపన్నిరాస
వినుత పదనివేశ పూత వివిధ మౌనికులనివాస

తత నిశాచరీ విరూపతాకృత ప్రియావినోద
అతుల బల ఖరాది దనుజ హననజనిత విబుధమోద

హరిణ రూపధారి దారు ణాసు రాసు హరణబాణ
పరమ ఘోర బాహుబల కబంధ మర్దన ప్రవీణ

అమల శబరి కాఫలోపహారరుచి ఘనాభిముఖ్య
సమదవాలి దర్ప దమన సఫలితార్కతనయసఖ్య

| | | | |
|---|---|---|---|
| మకుటం | కిరీటమును | పరిజనోక్తిః | సేవకజనుల ఆలాప కోలాహలము |
| జహి | త్యజింపుము | | |
| (ఇతి) | (అనెడి) | విజయతే | సర్వోత్కృష్టమై వెలయును. |
| తవ | నీ | | |

తా॥ బ్రహ్మాదిదేవతలు నీ ప్రసాదము నాకాంక్షించుచు సాగిలబడి నీకు నమస్కరింతురు. వారు అట్లు సాగిలబడియుండగా ఆకస్మికముగ నీ వల్లభుడు ఇంటికి విచ్చేయునేని ఆయన నెదుర్కొన నీవు సంభ్రమింతువు. అప్పుడు పరిచారికలు "ఇదిగో బ్రహ్మదేవుని కిరీటమిట నున్నది, తప్పుకొనుము; విష్ణుని కిరీటపు కటకటంచు ఇదిగో, నీ పదమును దానిపై పెట్టకు; ఈ యింద్రుని కిరీటమునుండికూడ ఓసరిల్లు" మని నిస్సెచ్చరింతురు. వారి ఆ మాటలకు జయము.

స్వదేహోద్భూతాభి ర్ఘృణిభి రణిమాద్యాభి రభితో
నిషేవ్యే నిత్యే త్వా మహ మితి సదా భావయతి యః
కి మాశ్చర్యం తస్య త్రినయనసమృద్ధిం తృణయతే
మహాసంవర్తాగ్ని ర్విరచయతి నీరాజనవిధిమ్ ॥ ౩౦

| | | | |
|---|---|---|---|
| నిత్యే | ఆదిమధ్యాంతరహితా | త్వాం | నిన్ను |
| స్వ | సొంత (నీ) | అహం ఇతి | 'నేను' అను భావముతో |
| దేహ | మేనినుండి | సదా | ఎల్లప్పుడును |
| ఉద్భూ | ఉత్పత్తిల్లినవియు | భావయతి | భావించునో |
| అభిత | చుట్టును | త్రినయ సమృద్ధిం | ముక్కంటి యైశ్వర్యమును |
| అవస్థితాభిః | ఉన్నవియు | | తృణీకరించువాడగు |
| ఘృణిభిః | (ప్రకాశముచే) కిరణములు (అనదగినవియు)ను అగు | తస్య | అతనికి |
| | అణిమ మున్నగు పెనిమిది సిద్ధులచే | మహాసంవర్తాగ్నిః | ప్రళయకాలాగ్ని |
| | | నీరాజనవిధిం | ఆరాత్రికానుష్ఠానమును (హారతిని) |
| నిషేవ్యే | సేవింపబడదగ్గ తల్లీ | విరచయతి | కావించును |
| యః | ఏ | ఇతి అత్ర | అనుటలో |
| సాధకః | సాధకుడు | కి మాశ్చర్యమ్ | ఆశ్చర్యమేమున్నది ? |

తా॥ అమ్మా, నీవు ఆదిమధ్యాంతరహితవు. అణిమ మున్నగు అష్టసిద్ధులును నీ మేనినుండియే ఉత్పత్తిల్లిన కిరణము లన దగి నిన్ను పరివేష్టించియుండును. వానికి నీవు ఆరాధ్యవై యుందువు. అట్టి నిన్ను 'అహంభావనతో' అనగా తాదాత్మ్యముతో ధ్యానించు సాధకుడు ఈశ్వరు నైశ్వర్యమును సైతము తృణీకరింపగలవా డగును. ప్రళయకాలాగ్ని అతనికి హారతి జ్యోతి యగును. అందులో ఆశ్చర్య మే మున్నది ? ఏమియును లేదు.



# శ్రీ రామ చంద్ర స్తుతి

## మహాకవి పింగళి సూరనామాత్యప్రణీతము

### తురగ వల్గన రగడ

దశరథావనీశ విమలతర తపఃఫ లావతార
నిశితశర లఘుప్రయోగ నిహత తాటకావిహార

కపట పటు సుబాహు దళన ఘటిత గాధిసూను యాగ
అపరిమేయ గాతమాంగ నాఘ దమన పద పరాగ

కోమలేక్షుదళనసదృశ ఘోరశంభుచాపభంగ
భూమిజా వివాహ విభవపూర్ణ సమ్మదాంతరంగ

పరశురామ గర్వపవన పాన పీన బాహు నాగ
గురువచోనుపాల నాతి కుతుక విధుత రాజ్య భోగ

పాదభజన వితరణాతి ఫలిత గుహాసమస్త పుణ్య
పాదుకా ప్రదాన విహిత భరత సౌహృదానుగుణ్య

ఘన విరాధ మదవినాశ కలిత బహు విపన్నిరాస
వినుత పదనివేశ పూత వివిధ మౌనికులనివాస

తత నిశాచరీ విరూపతాకృత ప్రియావినోద
అతుల బల ఖరాది దనుజ హననజనిత విబుధమోద

హరిణ రూపధారి దారు ణాసు రాసు హరణబాణ
పరమ ఘోర బాహుబల కబంధ మర్దన ప్రవీణ

అమల శబరి కాఫలోపహారరుచి ఘనాభిముఖ్య
సమదవాలి దర్ప దమన సఫలితార్కతనయసఖ్య

శరణవరణపర పరానుజప్రదీపితప్రసాద
అరుణి తాక్షికోణ విరచి తాంబురాశిగర్వసాద

పర్వతౌఘ రచిత సేతుబంధ సుతర సింధుకాండ
గర్వ పంక్తికంఠ కంఠఖండన ప్రచండ కాండ

సకల దివిజ నుత చరిత్ర జానకీ మనోజ్ఞ గాత్ర
సకరుణాతరంగనేత్ర సాధుభవలతాలవిత్ర

యతిజపార్శ్వ పుణ్యానామ యతివితీర్ణ భక్తకామ
సతతసిత యశోభిరామ సర్వలోక పూర్ణధామ

అహిత విదళనాతి రౌద్ర యార్తపాలనా వినిద్ర
మహిత నిఖిల గుణసముద్ర, మమ్ముఁ బ్రోవు రామభద్ర.

క. పరమంబగు నీనామము కర మామ్నాయములు తారకబ్రహ్మముగా
నిరతిఁ వినుతింపఁగ నా తరమే నిను నభినుతింప దశరథరామా॥

## గద్యానువాదము : నే. భ.

నీ అవతారముచే దశరథసార్వభౌముని అత్యంత విమలతపస్సును ఫలింపజేసిన రామా.

పదునైన బాణమును వేగముగ ప్రయోగించి తాటకావిహారమును తుదముట్టించిన రామా.

వంచకుడును బలవంతుడు నగు సుబాహువును జంపి విశ్వామిత్రుని యాగమును నెగ్గించిన రామా.

అహల్య కావించిన ఇంతంతనరాని పాపమును పాదరేణువుచే పోగొట్టిన రామా.

మృదువైన చెఱకును విఱిచినంత సులభముగా ఘోరమైన శివునిధనువును విఱిచివైచిన రామా.

సీతావివాహవైభవముచే ఆనందపూర్ణహృదయుడవైన రామా.

పరశురాముని గర్వమను గాలిని త్రాగివేసి బలిసినట్టి బాహువను నాగము గల రామా.

పితృవాక్యపరిపాలనమందలి తీవ్రవాంఛచే రాజ్యభోగమును వీడి యేగిన రామా,

నీ పాదభజనను గుహున కొసంగుటచే అతని సమస్తపుణ్యమును ఫలింపజేసిన రామా,

భరతుని సౌహృదమునకుఁ దగినట్లు పాదుకల ప్రసాదించిన రామా.

మిక్కుటమైన విరాధుని మద మణచిన రామా.

పెక్కు విపత్తుల తొలగ ద్రోలు కొన్న రామా.

ప్రతితపోవనమును నీ పాదవిన్యాసముచే పవిత్రీకరించిన రామా.

వంచింపవచ్చిన శూర్పణఖను విరూపనుగా చేసి ప్రియురాలిని వినోదపఱచిన రామా.

సాటి లేని ఖరాదిరాక్షసుల పదునాల్గు వేలమందిని జంపి వేల్పుల సంతోషపఱచిన రామా.

జింకరూపు దాల్చిన మారీచుని ప్రాణము హరించిన బాణము గల రామా.

అతిభయంకరభుజబలవంతు డగు కబంధుని నేర్పుతో మర్దించిన రామా.

పవిత్రురా లగు శబరి అర్పించిన ఫలముల రుచి నత్యంత మిష్టపడిన రామా.

గర్వి యగు వాలి మద మణచిన రామా.

సుగ్రీవుని మైత్రిని అతనిరాజ్యప్రాప్తిచేతను నీ సైన్యలబ్ధిచేతను సఫలీకరించిన రామా.

శరణార్థి యగు విభీషణుని పట్ల మహోజ్జ్వల ప్రసాదమును వెలయించిన రామా.

కడకంటి కెంజాయ మాత్రముచేత [బాణ ప్రయోగము లేకే] సముద్రుని గర్వమును అణచిన రామా.

కొండలచే నిర్మితమైన సేతువుమీదుగ సముద్రమును సులభముగ దాటిన రామా.

తీక్ష్ణబాణములచే దశకంఠుని కంఠముల రాలగొట్టిన రామా.

వేల్పు లెల్లరచే కొనియాడబడిన చరిత్రము గల రామా.

సజ్జనుల సంసారబంధ మను తీగకు గొడ్డలి యైన రామా.

కనికరపు కెరటములతో గూడిన కన్నులు గల రామా.

సీతకు మరులుగొల్పు చక్కని మేను గల రామా.

వామదేవాది యతుల జపమున కర్హ మైన నామము గల రామా.

భక్తుల కోరికలను సమృద్ధిగ నొసగిన రామా.

సదా తెల్లని కీర్తితో శోభించు రామా.

ఎల్ల లోకములు నిండిన తేజము గల రామా.

శత్రువులను జెండాడునప్పు డతిభయంకరుడ వగు రామా.

దీనుల పాలించుటయందు మెలకువ గల రామా.

కొనియాడ బడిన సకల గుణములకు సముద్రమువంటి రామా.

మమ్ము కాపాడుమా.

నీ పరమ నామము తారకమంత్ర మని వేదములు కొనియాడుచుండగా, అంతకంటె కొనియాడుట నాకు శక్య మగునా ?



రామ యహల్యాశాపవిరామా వైకుంఠధామ రవిపుత్రబల
స్తోమ రణరంగభీమా శ్రీమద్భద్రాద్రిధామ శ్రీరఘురామా

పావులూరి మల్లన.

# బాలగోపన్న రామప్రణయము

శ్రీ కేశవ తీర్థస్వాములవారు

[భద్రాచల శ్రీరామాలయ పునరుద్ధరణ మొనరించి లోకప్రసిద్ధి వహించిన ఆంధ్రభాగవతోత్తము డగు శ్రీరామదాసుగారి పూర్వనామం గోపన్న. ప్రహ్లాదునివలె ఆయన ఆబాల్యభక్తుడు. బాల్యంలో వీథిబళ్లో బాలరామాయణం పఠిస్తూ, బాలగోపన్న ఇట్లు నిర్వేదిస్తున్నాడు:]

ఇప్పుడు పుట్ట కా రఘుకులేశుని తోడను పుట్టియున్న చో,
అప్పు డయోధ్య నుందు గద! ఆ భరతుండును నేను గూడియున్
తప్పక కాళ్ల వ్రేళ్ల బడి దాశరథీవనవాస మాపమే?
తప్పిన, కాన నా ప్రభుపదంబుల గొల్చి తరింప కుందునే?

నేనే నా డుదయించి యున్న యెడ, క్షోణీపుత్రి మాతల్లి నా
కానన్ రావణు డెన్ని గుండియలతో గష్టంబు పా ల్సేయు? నే
మైనన్ నేను జటాయువు ల్గలిసి బాహాబాహి పోరాడియున్
వాని న్గూల్పమె? నీకృపాబలము మాపై నున్న చో రాఘవా!

ఆ మహితాత్ములా ప్రజలు, ఆ గుహు, డా శబరీజటాయువుల్,
రామ పదాబ్జ భక్తులయి రాజిలు నా కపు, లా విభీషణుం—
డేమి తపంబు జేసిరో! జనించి ధరిత్రిని, కన్ను లారగా
రాముని జూచి, సంతతము రాముని గొల్చిరి చేతులారగన్!

గణ్యత లేని నేటి నరుగా జనియించుట కన్న, దండకా
రణ్య పథంబులందు తృణరాశిగ జన్మము నొందియున్న, నా
పుణ్యము పండిపోయి, రఘుపుంగవు పాదము సోకి నే నహా
ధన్యత గాంచి యుందు గద! తత్పద మెంతటి వారి కబ్బునో!

పావనశోభతో వెలుగు పంచవటీకుటినుండి, పుణ్య గో
దావరి రేవుకు న్జనెడి దారిని, సైకతరేణువైన, సీ
తావిభు దివ్యమంగళపదాబ్జపరాగము సోకి, నే నహ
ల్యావనితామణీవిధి నహా! క్షణమందె తరింపకుందునా?

ఓం

శ్రీసీతాలక్ష్మణ భరతశత్రుఘ్న హనుమత్సమేత శ్రీరామచంద్రపరబ్రహ్మణేనమః

# శ్రీరాముడు - ధర్మమూర్తి

## [జ్ఞాపిక]

శ్రీ శుభకృద్వత్సరము ప్రారంభమయినది. చైత్రశుద్ధనవమి శ్రీరామచంద్రుని జయంతి కదా. కావున 'విగ్రహవాన్ ధర్మః' "మూర్తీభవించిన ధర్మము" అనిపించుకొన్న శ్రీరాముని స్మరించుట మన కిపుడు ప్రాప్తమగుచున్నది.

ఆదర్శపురుషవతంసుడు పురుషోత్తముడు అయిన అటువంటి పుత్రరత్నమును పడయవలెనన్న ఎంత పుణ్యము ఎంత భాగ్యము ఎంత తపసు గలవారై తల్లిదండ్రు లుండ వలెనో అంతపుణ్యము అంతభాగ్యము అంతతపస్సు కలవారు, దశరథ కౌసల్యా సుమిత్రా కైకేయులు.

అన్ని అవతారాలవలె, అన్ని అవతారాల కంటె ఎక్కువగా కూడ అవతారప్రయోజనాలను నిర్వహించిన యవతారము శ్రీరామావతారము. దుష్టసంహార మొక ప్రయోజనమే కాని అది ముఖ్య ప్రయోజనము కాదు. తాటకను జంపుట, విశ్వామిత్రయజ్ఞ విఘ్నకరుల జంపుట, శివధనుర్భంగము, పరశురామ గర్వభంగము, ఖరాదిరాక్షసులను పదునాలుగు వేలమందని ఒకటిన్నర ముహూర్త [72 నిమిషాల] కాలమున తానొక్కడే సంహరించుట, విరాధకబంధవాలిరావణాదుల వధ—ఇవంతయు పైకి మామూలు పరాక్రమకృత్యాలుగా కనిపించుచున్నప్పటికిని 'అమోఘపరాక్రమ' 'ధర్మపరాక్రమ' 'సత్యపరాక్రమ' విజృంభణలుగా వానిని కొన వలెను.

సాధుపరిత్రాణము అవతారప్రయోజనాలలో మఱొకటి. దుష్టవినాశనమునకంటె ఇది ముఖ్యప్రయోజనము. తన నామమును జిహ్వామృతముగాను, తన చరితమును పవిత్రశ్రోత్రజనోత్తారకముగాను వెలయించుటయు సాధుపరిత్రాణప్రకారములే.

పితృభక్తి, సోదరప్రేమ, గురుభక్తి, మిత్రధర్మము, దాంపత్యధర్మము, రాజధర్మము— అన్నిటికిని గని శ్రీరామచరితామృతము.

ఆదర్శరాజధర్మమును

'స్వసుఖ నిరభిలాషః ఖిద్యసే లోకహేతోః
ప్రతిదిన మథవా తే వృత్తి రేవం విధైవ
అనుభవతి హి మూర్ధ్నా పాదప స్తీవ్ర ముష్ణం
శమయతి పరితాపం ఛాయయా సంశ్రితానాం'

"స్వసుఖచింత దక్కి ప్రజలకై తపియింతు
విట్టి దార! నీదు వృత్తి యెపుడు;
ఖరకరాంశుతప్తశిరమౌ తరువు నీడ
నాశ్రితాళి తాప మడఁచినట్లు"*

అని కాళిదాసు దుష్యంతవిషయముగా ప్రసంగించినాడే ఆధర్మమునకు మూలకందము శ్రీరామచంద్రుడు. తండ్రి తాతలనాటినుండి తరతరాలుగా పరమహంస శ్రీరామకృష్ణున కభిజనమగు ఛాటర్జీల కిలువేలుపు 'రఘువీరుడు!' శ్రీరామనవమి జయంతి పూజాంగముగా మన 'శ్రీరామకృష్ణప్రభ' ప్రకృత సంచిక శ్రీరామచంద్రుని చరణముల కర్పితము. తద్విషయికములైన వ్యాసములను ప్రధానీకరించి ఇందు ప్రచురించితిమి.

---

* కీ॥ శే॥ దుర్భా సుబ్రహ్మణ్యశర్మ మహోపాధ్యాయుల అనువాదము.

# శ్రీ బ్రహ్మానందస్వామి

## [సంపాదకీయము]

(ఫెబ్రువరిసంచికకు తరువాయి)

గురుదేవుని నిర్యాణానంతరము ఇతర యువ శిష్యులతోపాటు రాఖాలును బరానగరమఠములో చేరెను. అనంతరము వారు యథావిధిగా సన్న్యాసము స్వీకరించి కుటుంబనామములను మార్చుకొనిరి. ఆవిధముగ రాఖాలు బ్రహ్మానందస్వామి అయ్యెను. కాని సోదర శిష్యులు తమ గాఢప్రేమాదరములకుగుర్తుగా ఆయనను 'రాజు' అని పేర్కొనుటయే మేలని భావించుచుండిరి.

గురుదేవునితోకూడియుండిన దినములు పరమానందసంపన్నములు. అట్లే బరానగరమున గడచుచుండిన దినములు కఠోరతపశ్చర్యతో కూడినవి. ఆగొప్ప అజ్ఞాతతత్త్వము నన్వేషించుచు యువశిష్యులు అందులకై తమ ప్రాణము లర్పించుటకును సంసిద్ధులైరి. శరీర సౌఖ్యములు వారికి లక్ష్యము లేదు. అన్నపానములు వారికి లక్ష్యము లేదు. ఆత్మను సాక్షాత్కరించుకొనుట ఎట్లు? లేదా గురుదేవుని సన్నిధిలో తమకు కలిగిన సాక్షాత్కారములను, తమ జీవితములలో స్థిరపఱచుకొనుట ఎట్లు? ఇదొక్కటే వారి గొప్ప తలంపు.

కొన్నాళ్ళకు బరానగరజీవితము కూడ ఆధ్యాత్మికాభివృద్ధికి తగనంతక్షేమముగలదిగా వారికి తోచినది. దేవుడు తప్ప వేఱు మార్గదర్శకుడును సహాయుడును లేకుండ విశాలమును అజ్ఞాతము నైన విశ్వములో తాము అదృశ్యులై పోవలె నని వారి కోరిక. ఏకాంతముగనుండి తపస్సు చేసికొందమని వారిలో కొందఱు యాత్రాస్థలములకు పోవసాగిరి. అట్టి వైరాగ్యప్రేరితుడై బ్రహ్మానందస్వామి పూరిక్షేత్రమున కేగెను. భిక్షమెత్తి జీవించుచు భగవద్ధ్యానమున దినములు గడపుచు ఆయన అచట కొంత కాల ముండెను. బ్రహ్మానందస్వామియెడ గురుదేవుడు ప్రత్యేకమైన మెలకువ కలిగియుండెను కావున అట్టి బ్రహ్మానందస్వామికి ఎట్టి కష్టము కలిగినను గురుదేవుని భక్తులును శిష్యులును ఎప్పుడుగాని ఓర్వ లేరు. బలరామబోసుకు ఒరిస్సాలో పెద్దజమీను ఉండినది. పూరిక్షేత్రమున సంపన్నసంస్థయొకటి ఆయనది ఉండెను. బ్రహ్మానందస్వామి ఘోరతపఃకష్టములకు లోనగుచున్నాడని విన్నప్పుడు ఆయన "హాయిగా నాతో నుండ రాదా?" అని నిక్కచ్చి చేయసాగెను. పూరిక్షేత్రమున తన నచ్చిన రీతిలో జీవితమార్గము సాగదని గుర్తించి బ్రహ్మానందస్వామి బరానగరమునకు మరలి వచ్చివేసెను. కాని జీవిత లక్ష్యమును సాక్షాత్కరించుకొనుటకు ఇంకను ఎక్కువగా పాటుపడవలెనను ఆత్రము అతనిని పైకొనెను. ఉత్తరహిందూదేశమునకు పోయి ఎచటనైన తపస్సాధన చేసికోవలెనను తన కోరికను ఆయన తెలిపెను. ఇట్లు తన ప్రియ సోదరశిష్యుడు పరివ్రాజకజీవితమును అవలంబించుటకు, నాయకుడైన నరేంద్రనాథుడు తనకు ఇష్టము లేకపోయినను సమ్మతింపవలసి

వచ్చెను. కాని ''రాజు'' ఎక్కువ చిక్కులు పడవలసిన అక్కఱ లేకుండునట్లు శ్రీసుబోధానందస్వామి అను మఱియొకసోదరశిష్యుని ఆయన వెంబడినే ఉండునట్లు ఏర్పాటుచేసెను. శ్రీబ్రహ్మానందస్వామి దేవగడముమీదుగ వారణాసికి పోయి అచట కొంతకాలముండెను. వారణాసినుండి అతడు నర్మదానది తీరమున ఉన్న ఓంకారనాథమునకు పోయెను. ఆపవిత్ర నదీతీరమున తపస్సాధన చేయుచుండినకాలములో బ్రహ్మానందస్వామి ఒకప్పుడు ఆఱు దినములపాటు బాహ్యాలోకస్మృతియే లేక అవిచ్ఛిన్న భావసమాధిలో నుండెనట. సోదర శిష్యుని, మఱొకభక్తుని వెంటనిడుకొని ఆయన ఓంకారనాథమునుండి కొన్ని యాత్రాస్థలములకేగెను. సీతారాముల సంబంధముచే పవిత్రమైన పంచవటి, సుప్రసిద్ధ శ్రీకృష్ణాలయము ఉండునట్టి ద్వారక, పోర్బందర్, గర్ణార్, ఆజ్మీర్ మున్నగు తావులను చూచి తరువాత నతడు బృందావనమునకు మరలి వచ్చివేసెను. శ్రీ బ్రహ్మానందస్వామివంటి వారు ఈ పవిత్ర క్షేత్రమును దర్శించుట యనగా ఒకప్రేక్షకుడు కేవలము తన వ్యర్థకుతూహలమును తీర్చుకొనుటమాత్రమే కాదు. ప్రతిచోటను పరిసరములలో నిగూఢమయి యున్నఆత్మతో అతడు ఐక్య మనుభవించెడివాడు. కావున ఆయన సదా తనలోనే నిమగ్నుడయి యుండెను. పెదవులు మూతపడి యున్నను లోపలి ఆధ్యాత్మకాగ్నిని మొగము సూచించుచునే యుండెను. ఆయనచూపు చేతను తేటమైన ముఖవైఖరిచేతను ఆకర్షింపబడిన వారు పెక్కండ్రు. ఆయనకు ఏకాంతసేవ చేయుటకు తమకు వీలైనను దానినివారు మహాభాగ్యముగ గణింతురు. తమసేవను స్వీకరింపుమని వారు స్వామిని నొక్కి ప్రార్థించిరి. కాని పైకిపోవుచున్న అతని మనసు ఐహికసుఖముల పట్ల పూర్తిగ అశ్రద్ధ వహించెను. ఎవరు ఏమి ఇచ్చినను దానిని తీసికొమ్మని స్వామిని ప్రోత్సహించుట అసాధ్యము కాదు కాని కష్టమే. మీదు మిక్కిలి నిక్కచ్చిచేసినప్పుడు స్వామి ఏదో రవంత కైకొనుటను సమ్మతించును. అది ఎంత కొంచెముగను లెక్కకురానిదిగను ఉండుననగా, ఇచ్చినయతనికి ఆనందమునకంటె హెచ్చుగ అచ్చెరువు కల్గును.

స్వామి బృందావనమునకు రెండవసారి వచ్చెను. ఇచట ఆయన కఠోరతపస్సాధనలలో దినములు గడపెను. జీవితపరమలక్ష్యమును పొందవలయు ననెడి తృష్ణ ఆయనలో ఉత్కటమై యుండెను. ఈ లక్ష్యమును సాధించుటకు ఏమి త్యాగము చేయవలసివచ్చినను అది ఆయనకు ''అతి'' కాదు. దినమంతయును ఆయన ఏదో ఒక విధమైన ఆధ్యాత్మిక సాధనను చేయుచునే యుండును. శ్రీ సుబోధానంద స్వామి ఆయనతో ఉండెను. కాని వారికి మాటలే లేవు. సుబోధానందస్వామి ఆయనకు అన్నము తెచ్చి పెట్టును. తెచ్చిన అన్నమును ఆయన తినుటయు కలదు, తినక పస్తుండుటయు కలదు. విజయకృష్ణగోస్వామి అను గొప్ప యోగి ఆ సమయమున బృందావనమున ఉండెను. ఆయన లోగడ రాఖాలును దక్షిణేశ్వరమున చూచియుండెను. రాఖాలుపై శ్రీరామకృష్ణున కెంత ప్రేమయో ఆయన గుర్తించియుండెను. స్వామి చేయుచున్న కఠోర సాధనలను చూచి విజయకృష్ణగోస్వామి ''ఇంత తపస్సు చేయవలసిన జరూరు నీ కే మున్నది? ఆధ్యాత్మికజీవితమున అభిలషనీయమైన సర్వస్వమును గురుదేవుడు నీ కిచ్చినాడు కదా''

అని అడిగెను. అందుకు స్వామి ఊరక చిఱునవ్వు నవ్వి "గురుదేవునియొద్ద నేను సంపాదించిన దానిని శాశ్వతముగ దక్కించుకొన గోరుచున్నాను" అని జవాబు చెప్పెను. కొన్నాళ్ళ పిమ్మట శ్రీ సుబోధానందస్వామి హరిద్వారమునకు యాత్ర కేగెను. బ్రహ్మానందస్వామి ఒంటరిగ ఉండెను. ఇందుచే ఆయనకు జీవితమున ఎక్కువ స్వేచ్ఛయు మఱింత దారుణమైన తపశ్చర్య కావించుట కవకాశమును కలిగినవి.

బృందావనములో ఉండగా మహాభక్తుడైన బలరామబోసు మరణించె నను వార్త స్వామి చెవిని పడెను. ఇది ఆయనను మిక్కిలి కలవరపఱచినది. ఆయన మఱింత ఏకాంతమును గోరి బృందావనమును వీడి హిమాలయప్రాంతమునకు హరిద్వారమునకు పోయెను. ఆయన హరిద్వారమునొద్ద నున్న 'కంఖాలు'లో కొంత కాల ముండెను. కంఖాలులోని వాతావరణము ఆధ్యాత్మికాభివృద్ధికి మిక్కిలి అనుకూలముగ నుండెడి దని అనంతరకాలమున ఆయన చెప్పుచుండెడివాడు. కంఖాలులోనుండగా తలవని తలంపుగా శ్రీ వివేకానంద, తురీయానంద, శారదానందస్వాములును, వైకుంఠసన్న్యాసులును ఆల్మోరానుండి ఆయనను కలిసికొనుటకు వచ్చిరి. అట్టి సమాగమానందమును వర్ణించుటకంటె ఊహించుట మేలు. ఏకాంతవాసము చేతను తీవ్రతపశ్చర్యచేతను శ్రీ బ్రహ్మానందస్వామి తన ఆరోగ్యమును చెఱుపుకొనునేమొ అని దిగులుపడి, మీరట్టుకు పోవుచున్న శ్రీ వివేకానందస్వామి ఆయనను తనతోగూడ బలాత్కరించి పిలుచుకొనిపోయెను. శ్రీ వివేకానందస్వామి సోదరశిష్యులను ఢిల్లీయొద్ద వదలి తా నేకాకిగ సంచరింప నేగెను. దీని కనంతరము శ్రీ తురీయానందస్వామితో కూడి శ్రీ బ్రహ్మానందస్వామి జ్వాలాముఖికి యాత్ర చేసెను. అచ్చటినుండి పంజాబులోను సింధులోను బొంబాయిరాష్ట్రమందును రాజపుత్రస్థానమందును ఉన్నట్టి వివిధపుణ్యస్థలములకు పోయెను. బొంబాయిలో వారు శ్రీ వివేకానందస్వామిని సంధించిరి. శ్రీ వివేకానందస్వామి చికాగోలో జరుగనున్న విశ్వమతమహాసభకు హాజరగుటకై అమెరికాకు బయలుదేఱ సిద్ధపడుచుండెను. ఆయనతో వీరు అబూరోడ్డు స్టేషనువఱకు పయనించి బృందావనమునకు మరలి వచ్చివేసిరి. ఇచ్చట ఇద్దఱును తమకాలమును పూర్తిగా ఆధ్యాత్మికసాధనలకే వినియోగించుచుండిరి. తురీయానందస్వామియు బ్రహ్మానందస్వామినిగూర్చి జాగ్రత్త కలిగి యుండెను. ఉభయులును రాత్రింబగళ్లు భగవద్ధ్యాననిమగ్నులై యుండిరి. బృందావనములో గడచిన ఆ దినములు ఎంతయు స్పృహణీయములు. అప్పు డచ్చట ఘటిల్లిన సుఖసంభవములను పెక్కింటిని అనంతరకాలమున వారు చాలసంతోషముతో చెప్పుచుండెడివారు.

కాలము చాల త్వరగ గడచిపోవును. సోదరశిష్యు లిద్దఱును బృందావనపవిత్రపరిసరములలో ఆధ్యాత్మికానందము అనుభవించుచుండగా అమెరికాలో శ్రీ వివేకానందస్వాముల ఉద్యమము మహోజ్జ్వల విజయముగాంచిన దను వార్త వారి కందినది. వారి నాయకునిగూర్చి గురుదేవుడు భవిష్యత్కాలములో చెప్పినమాటలు నిజముగ పరిణమించినందులకు వారు చాల సంతోషించిరి. భారతదేశపునరుద్ధరణ, విశ్వమానవక్షేమసంపాదన కార్యక్రమములలో మునుగు డని వివేకానందస్వామి తన గురుభాయిలకు సదా జాబులు వ్రాయుచుం

డెను. బరానగరమునుండి మఠము ఆలంబజారు నకు మారినది. అక్కడివారు బృందావనములో నున్న సోదరుల కిద్దఱికిని "బంగాళమునకు రండి. మన మందఱమును కలిసి భావి కార్యక్రమనిర్వహణమునకు నొక సంఘముగ నేర్పడుదము" అని మాటిమాటికిని జాబులు వ్రాయుచుండిరి. మొదట తురీయానందస్వామి మాత్రము మరలివచ్చెను. తరువాత 1894 సం॥ అంత్యమప్పటికి బ్రహ్మానందస్వామియు మరలి వచ్చెను. (సశేషము)



# సీత : జన్మల పరంపర - వివిధప్రాంతాల్లో విభిన్నరూపకల్పన

శ్రీ వేదం రామశాస్త్రిగారు

సీత అనే పేరు వినేసరికి మహాకవి వాల్మీకి సృజించిన రామాయణంలోని విదేహరాజపుత్రి చప్పున స్ఫురిస్తుంది. వాస్తవానికి ఈ సీత అనే పేరు రామాయణకాలంకంటే చాల ప్రాచీనమైనది. వైదిక సాహిత్యంలో సీత రెండు రూపాలలో కనిపిస్తుంది. సీతా సావిత్రులు కృషి దేవతలు. తైత్తిరీయ బ్రాహ్మణంలో, 'సోమ రాజోపాఖ్యానం'లో సీతావృత్తాంతం వర్ణింపబడింది. వైదిక సాహిత్యంలో సీత, సూర్య, సావిత్రి — ఇవి ఒకప్పుడు పర్యాయపదాలుగాను, ఒకప్పుడు వేరు వేరు వ్యక్తులను తెలియజేసేవిగాను నిరూపితమైనవి. తైత్తిరీయ బ్రాహ్మణములో ప్రజాపతి తన పుత్రియగు సీతకు 'స్థావరము' అను పేరు గల అంగరాగాన్నిచ్చినట్లును, దానితో ఆమె సోమరాజుపై వశీకరణమంత్రం ప్రయోగించి అతనిని వివాహం చేసికొని సఫలమనోరథమైనట్లునువర్ణింపబడింది.

## ఋగ్వేదంలో

ఋగ్వేదంలో సీత భూమినుంచి జన్మించినట్లు చెప్పబడింది. ఇందులోనూ అథర్వవేదంలోనూ, ధాన్యము లొసగు సీతాదేవియొక్క స్తవనముకూడా ఉంది. గృహ్యసూత్రాల కాలంలో దేశంలో కృషి, వాణిజ్యం—చాలా పెంపొందింది. అందువల్ల సీతవర్ణన విశేషంగా కనిపిస్తుంది. వీటిలో 'లాంగలయోజన'మనే సీతాయజ్ఞాన్ని గురించి విస్తారంగా వర్ణితమైనది. ఇందు ఒక్క సీతయేకాక, కృషి దేవతలుగా ఇంద్రుడు, అగ్ని, విశ్వేదేవులు, పృథ్వి మొదలైనవారిపేర్లు పేర్కొనబడినప్పటికి సీతయొక్క స్థానం సర్వోత్కృష్టమయినది. గృహ్యసూత్రాలలో సీతా స్తవనము, 'ఇంద్రపత్ని' 'పర్జన్యపత్ని' అనే పేర్లతో వర్ణింపబడినది. కాటక గృహ్యసూత్రములకు భాష్యకారుడగు దేవపాలుడు 'సీతాదేవి'ని ఆజన్మకుమారి అన్నాడు. మహాభారతం ద్రోణపర్వంలో శల్యుడు తన ధ్వజంపై సీతయొక్క స్వర్ణప్రతిమను ప్రతిష్ఠించినట్లున్నది.

గృహ్యసూత్రాల్లో వర్ణింపబడిన సీతా మాహాత్మ్యము రామాయణకాలానికి క్రమక్రమంగా క్షీణించి ఉంటుంది. రామాయణం

లోని సీత వైదికసాహిత్యంలోని సీత కాదు. కాని ఆమె పుట్టుక విషయంలో మటుకు వైదిక సీతయొక్క ముద్ర స్పష్టంగా గోచరిస్తుంది. కాలం గడిచేకొద్దీ, కృషి దేవతయైన సీత, కాల గర్భంలో లీనమై రామపత్నియైన సీతయొక్క ప్రచారం ఎక్కువగా కొనసాగింది. వైదిక సాహిత్యంలోని సీత' దుర్గగా మారింది. ఆధారమంతయు మునుపటిలాగానే! కాని పేరు మట్టుకు మారిపోయింది.

## లౌకిక సాహిత్యంలో

వివిధప్రాంతాల్లో జనుల వాడుకనుబట్టి సీత, జానకి ఈ రెండు పదాలు ధాన్యలక్ష్మికి పర్యాయపదాలుగా దొరుకుతవి. సీతావిష యమై కృషికి చెందిన కథలు లౌకిక సాహి త్యంలో వాడుకలో ఉన్నవి. ఛోటానాగపూరు లోని 'ఉరావ' జాతిలో రెండు కథలు మిక్కిలి ప్రసిద్ధములై ఉన్నవి. 'వాటిలో సీత పార్వతిగాను, సూర్యుడే రాముడుగాను అయినట్లుంది. దక్షిణ భారతంలో 'సీతాలక్ష్మి' అనే పేరుతో ఒక జలదేవత కన్పిస్తుంది.

కృషి దేవతగా సీతాదేవి అన్ని సాహిత్యా లలో కన్పిస్తున్నప్పటికీ, ఆమె పుట్టుక విష యంలోమాత్రం ఒక వ్యవస్థ కన్పించడంలేదు. అసలు సీత అంటే సస్యసమృద్ధమైన క్షేత్రమని అర్థము. కాని ఆమె జీవిత చరిత్ర అంతా లేమి తోనే గడచింది.

దీనికి కారణము ఎవరెన్ని చెప్పినప్పటికీ ఆమె పృథ్వీపుత్రి కావటమే. రామాయణంలో అన్ని పాత్రలతోపాటు సీత పుట్టుక అసందిగ్ధం కావటంవల్ల ఆమె తల్లిదండ్రులనుగూర్చి కావ్య కారులు రకరకాల కల్పనలు కొనసాగించారు. కృషి దేవతయైన సీతయొక్క ప్రభావం రామా యణంలోని సీతమీదకూడ చూచాయగా తెలుస్తుంది. భూమితో సంబంధం ఉండటంవల్ల సీతను 'అయోనిజ' అని పేర్కొన్నారు. ఆయా దేశాల్లోని వాడుకలనుబట్టి చెప్పుకొనే కథల్లో జనకుడు, రావణుడు, దశరథుడు, సీతకు తండ్రు లైనట్లు కన్పిస్తాంది. సీతకూ జనకునికీగల సంబంధం రెండు విధాల వాడుకలో ఉంది. కొన్నిచోట్ల సీత జనకుని 'ఔరసపుత్రి' యని, కొన్నిచోట్లలో 'పెంపుడు కూతురు' అని వాడుక.

## మహాభారతంలోని రామకథలో

మహాభారతంలో రామకథ నాల్గుచోట్ల దొరకుతుంది. సీత అన్నిచోట్ల జనకాత్మజయే. ఆమె అలౌకికజన్మను గురించి అందులో మత్తే ప్రసంగము లేదు. హరివంశంలోనూ, రామా యణంలోనూ, ఆమె జనకుని కుమార్తెయే. పద్మపురాణ, విష్ణుపురాణ, వాయుపురా ణాల్లో సీత సోదరులనుగూర్చి కూడా వర్ణితమై ఉంది. కాళికాపురాణంలో జనకునికి ఒక కుమార్తె, ఇరువురు పుత్రులు ఉన్నట్లుంది. సీతను గురించి ఎన్ని అలౌకిక జన్మవృత్తాం తాలు వాడుకలోకి వచ్చినప్పటికి అసలు మూలంలో సీత 'అయోనిజ' కాదు. వాల్మీకి రామాయణంలో సీతయొక్క జన్మభూమి 'యజ్ఞభూమి'. పద్మపురాణాన్నిబట్టి జనకునికి భూమిమీద ఒక ధనువు దొరికినట్లుగా, అందు నుంచి సీత పుట్టినట్లు ఉంది.

ఎట్లున్నప్పటికి ప్రఖ్యాతమైన 'సీత' జనకుని 'అయోనిజ' పుత్రి. వాల్మీకిరామాయణపు గౌడ దేశ ప్రతులలో సీత మేనకకు జనకునివల్ల పుట్టిన మానసపుత్రి అని పేర్కొనబడినది. క్షేమేంద్రుడు రచించిన రామాయణమంజరిలో కూడా ఇదే ఉంది.

సీతయొక్క అపూర్ణమైన జన్మవృత్తాంతానికి పూర్ణతను కల్పించేందుకై శతాబ్దుల తరబడిగా కవులు తమ స్వంతత్ర కల్పనలద్వారా అనేక జన్మలను సృజించారు. రామాయణం ఉత్తరకాండంలో రావణునిచే అవమానింపబడిన వేదవతి పగసాధించేందుకు జనకుని యజ్ఞభూమిలో సీతయై పుట్టినట్లుంది. బ్రహ్మవైవర్త పురాణంలోనూ, దేవీభాగవతంలోనూ, ఇదే కథ కొద్దిగా సంగ్రహింపబడింది. దానిలో వేదవతి లక్ష్మి అవతారము. కాబట్టే సీతా లక్ష్ములు ఒకరే అయ్యారు. పద్మచరిత్రంలోనూ, కృత్తివాస రామాయణంలోనూ, విచిత్ర రామాయణంలోనూ 'వేదవతీ సీతల' ఈ కథే కొద్ది మార్పులతో లభిస్తుంది.

## సీత రావణుని కూతురా?

కొన్ని చోట్ల సీత రావణుని పుత్రి అని చెప్పబడింది. రావణుడు వేదవతియొక్క సతీత్వమును భంగపఱచాడు. కాబట్టి ఆమె వచ్చే జన్మలో రావణుని వినాశనానికి కారణమయ్యేట్లు అతనికి శాపం ఇచ్చింది. ఉత్తర పురాణం, మహాభారత దేవీపురాణం వీటిల్లో ఇలా ఉంది— ''రావణునికి ఒక కుమార్తె పుట్టగా జ్యోతిష్కులు ఈమె ముమ్మందు రావణుని నాశానికి కారణమాతుందని చెప్పారు. వెంటనే రావణుడు భయపడి మారీచునిద్వారా సీతను మిథిలలో పూడిపించాడు. అక్కడ జనకుని భార్య 'వసుధ' సీతను కాపాడింది—దక్షిణ భారతంలోని కథలలో రావణునిపేరు లేదు గాని సీత పెట్టెలో దొరికినట్లుగా వృత్తాంతం ఉంది. కొన్ని కథల్లో సీత రావణుని ఇంట్లో పుట్టినట్టుగాను, ఆమెను వారు నీటిలో పారవేసినట్లుగాను ఉంది. కాశ్మీరదేశపు రామాయణంలో మండోదరి సీతను అవలక్షణగా తలచియు, జావాలోని కథాప్రకారంగా ఆమె రావణుని ప్రేమపాత్రగా తలచి నీటిలో పారవేసినట్టుంది. మొదటి కథను బట్టి ఆమెను జనకుడు కాపాడితే, రెండవదాన్ని బట్టి ఆమెను ఒక ఋషి రక్షిస్తాడు. టిబెట్టుకు చెందిన రామాయణాలలో కొన్ని చోట్ల ఆమెను ఒక కృషీవలుడును, ఒక ఋషి నీటినుంచి కాపాడినట్లుంది. కొన్ని రామాయణ కథలను బట్టి సీతయొక్క ముఖం పుట్టినప్పుడు నల్లగా ఉండటంవల్ల అది అశుభంగా తలచి రావణమహిషి ఆమెను పారవేసిందట. అప్పుడు వాయువు ఆమె నొక పద్మముపై నుంచగా ఒక ఋషి ఆమెను కాపాడుతాడు. సయాములోని 'రామకియేన్'లో మండోదరి దశరథుడు యజ్ఞం చేసేటప్పుడు ఎనిమిదో వంతు యజ్ఞపాయసం తాగి లక్ష్మి అవతారమైన సీతను కన్నది. విభీషణుడు ఆమెను ఒక కుంభములో బెట్టి నీటిలో వదలేస్తాడు. ఒక కమలము దానికి ఆధారముకాగా అది జనకునివద్దకు చేరుతుంది. కొంతకాలం దాటి ఈకుంభపు పద్మంమీద సీత వెలువడుతుంది.

క్షేమేంద్రుని 'దశావతార చరిత్ర'లో రావణుడు కమల సరోవరానికి వెళ్ళగా అక్కడ ఒక బంగారు కమలంమీద సీతను చూచి ఆమెను తన భార్యయైన మండోదరి కిస్తాడు. నారదునివల్ల ఈకన్యను భవిష్యత్తులో రావణుడు ప్రేమిస్తాడని విని మండోదరి ఆమెను దూరదేశంలో పారవేయుమని ఆదేశిస్తుంది. జనకుడు భూమిని దున్నే సమయంలో అకస్మాత్తుగా ఆమె అతనికి దొరుకుతుంది.

అద్భుత రామాయణం – సింహళదేశములోని రామకథ – ఉత్తర భారతములోని మఱి కొన్ని కథల్లో మఱొక వృత్తాంతముంది.

పన్ను పేరిట రావణుడు ఋషులనుండి వారి రక్తాన్ని తీసుకొంటాడు. ఆ రక్తాన్నంతా ఒక కుండలోపోసి అతడు లంకకు తెస్తాడు. మండోదరి ఈ రక్తాన్ని తాగుతుంది. ఫలితంగా ఆమె కొక కుమార్తె పుడుతుంది. కొంతకాలం తర్వాత ఈ కన్యను త్యాగం చేస్తుంది. మరి కొన్ని కథలనుబట్టి రావణుని రాజ్యంలో అనావృష్టి వచ్చేసరికి ఈ కన్యయే దీనికి కారణమని తలంచి ఆమెను మిథిలలో పూడ్పించాడు. ఈ రెండు కథలలో ఈమె జనకునికి దొరికి రావణుని వినాశానికి కారణమౌతుంది.

## అగ్ని కుమార్తె

ఆనంద రామాయణంలో సీత అగ్నిదేవునికి జన్మించినట్లుంది.

రావణునితోటి అంటిపెట్టుకొన్న ఈ అన్ని కథల్లో వాల్మీకి పేర్కొన్నట్లు భూమియందు పుట్టిన కన్య సీత. వేదవతి— ఈ కథల ప్రభావం గోచరిస్తూంది. ఈ కల్పనలంతా వాల్మీకి రామాయణం తర్వాతనే పుట్టి ఉంటుందని దీనినిబట్టి నిస్సందేహంగా చెప్పవచ్చు.

కొన్ని చోట్ల సీత దశరథుని పుత్రిక యైనట్లు కూడ వ్రాయబడింది. సీతారావణులకు గల సంబంధాన్ని ఆధారం చేసుకొని జావా, మలయాలలో చిత్రాతిచిత్రమైన కథలు ప్రచారపథమెక్కినవి. వాటిల్లో రావణునిగూర్చి విచిత్ర కల్పన లున్నాయి. ''మండోదరి దశరథుని భార్యయట. ఆమె సౌందర్యానికి ముగ్ధుడై రావణుడు ఆమె నిమ్మని దశరథుని యాచించాడు. మండోదరి ఒక మాయామండోదరిని పుట్టించి రావణుని వెంట బంపుతుంది. అప్పుడు మండోదరికి ఒక కన్య పుట్టగా దానిని నీటిలో పారవేస్తుంది.

జాతక కథల్లో—వారాణసి రాజైన దశరథునికి జ్యేష్ఠ మహిషియందు సీత యనే పేరు గల ఒక కూతురు పుడుతుంది. ఆమె రామునితో అరణ్యానికి వెళ్లుతుంది. వనం నుంచి తిరిగి వస్తూనే రాముడు తన సోదరియగు సీతనే వివాహం చేసుకొంటాడు. ఈ సీతయే పూర్వజన్మంలో రాహులుని తల్లి యశోధర.

సీత జన్మవృత్తాంతమై ఎన్ని వాడుకలు ప్రచారంలో ఉన్నా ఆమె వంశం మాత్రం అనిశ్చితమే కాని వీటినిబట్టి రామాయణం లోకప్రియమైందని ఋజువు చేయవచ్చు.



# వాల్మీకిరామాయణంలోని పాత్రలు - హనుమంతుడు

పండిత యల్లంరాజు చెంచుసుబ్బారావుగారు, బీకామ్ (ఆనర్సు), యల్.యల్.బి., విశారద

పాత్రలచరిత్రను సంపూర్ణముగాను, మధురంగాను చిత్రించడం నిజంగా ఒకగొప్ప కళగానే భావించాలి. ఇది అందఱు కవులలోనూ గోచరించదు. ఈకళలో ఆదికవి వాల్మీకి అందఱినీ మించినాడని చెబితే అతిశయోక్తి కాబోదు. ఆయన వ్రాసిన పౌరాణికకావ్యమైన రామాయణంలో మారుతిపాత్ర ఆకర్షించే పాత్రల్లో ఒకటిగా ప్రసిద్ధి కెక్కింది. ఈ పాత్ర యొక్క శౌర్యాన్నీ, గుణాలను వాల్మీకిరామాయణంలో ఒకప్రత్యేకకాండ (సుందరకాండ)

లో వర్ణించాడంటే, యీపాత్రయొక్క ప్రాము ఖ్యాన్ని సూచించేందుకు వేరే నిదర్శన మక్కఱ లేదు.

హనుమంతుడి పాత్రలో మనకు చాల అసా ధారణమైన లక్షణాలు గోచరిస్తాయి. అమిత పరాక్రమం, విశేషనమ్రభావం, గొప్ప పాండిత్యం, సమయస్ఫూర్తి గల వాక్కు, వీరోచితధైర్యం మొదలయిన లక్షణాలు ఈ పాత్రలో కనిపిస్తాయి. మాటల్లోను, చేత ల్లోను క్రమశిక్షణ, విధియందు శ్రద్ధ, కర్తవ్య పాలనలో పట్టుదల యీాయనలోని విశేషలక్ష ణాలు. త్రికరణశుద్ధిగా బ్రహ్మచారి జీవనం గడపినందువల్లనే ఆయనలో ఈ లక్షణాలు మూర్తీభవించాయి. ఈ యుగంలోకూడా ఆయన మనకందఱికీ ఆదర్శప్రాయుడే. ఆయన చరిత్ర మన కనుసరణీయమే.

రామాయణంలోని ఈ పాత్రను సూక్ష్మం గా పరిశీలిస్తే, ఈ పాత్రచరిత్రను మూడుభాగా లుగా విభజించవచ్చు. హనుమంతుడు రామ దూతగా, పరాక్రమవంతుడైన యుద్ధవీరుడుగా, ఆదర్శప్రాయుడైనభక్తుడుగా మనకు గోచరి స్తాడు. అన్న వాలితో యుద్ధం చేసి ఓడిపో యిన తర్వాత సుగ్రీవుడు ఋష్యమూక పర్వ తంపై తలదాచుకోవలసివచ్చింది. అట్టి నిస్స హాయస్థితిలో అతనికి హనుమంతుడు ఉత్తమ మంత్రిగాను, దూతగాను సహాయపడ్డాడు. శక్తి వంతాలైన బాణాలను ధరించి రామలక్ష్మణులు తన కంట బడేసరికి సుగ్రీవుని మనస్సులో సందేహ మేర్పడి వారిని చూచి భయపడ సాగాడు. హనుమంతుడు వెంటనే తనమాటల నేర్పుతో సుగ్రీవుని శాంతపఱచి అతని భయాన్ని తొలగించాడు. నిశ్చలమనస్సుతో నమ్రభావంతొణికిసలాడగా హనుమంతుడు రామలక్ష్మణులను సమీపించాడు. తన నేర్పు మాటలతో హనుమంతుడు వారిహృదయా లను చూరగొన్నాడు. హనుమంతుని తెలివి తేటలు, వివేకాన్ని గుఱించి రాముడు చాలా ప్రశంసించాడు. హనుమంతుని గుఱించి రాముడు లక్ష్మణునితో పలికిన ప్రశంసా వాక్యాలు వాల్మీకి కిష్కింధాకాండంలో ఈ క్రింది శ్లోకాలలో సుందరంగా పొందు పఱచాడు.

శ్లో॥ నానృగ్వేద వినీతస్య
నాయజుర్వేద ధారిణః
నా సామవేద విదుష
శ్శక్య మేవం ప్రభాషితుమ్
నూనం వ్యాకరణం కృత్స్న
మనేన బహుధా శ్రుతమ్
బహువ్యాహర తానేన
న కించి దపశబ్దితమ్
న ముఖే నేత్రయో ర్వాపి
లలాటే చ భ్రువో స్తథా
అన్యే ష్వపి చ గాత్రేషు
దోష స్సంవిదితః క్వచిత్ ॥
అవిస్తర మసందిగ్ధ
మవిలమ్బిత మద్రుతమ్
ఉరస్థం కణ్ఠగం వాక్యం
వర్తతే మధ్యమే స్వరే
సంస్కారక్రమసమ్పన్నా
మద్రుతా మవిలమ్బితామ్
ఉచ్చారయతి కల్యాణీం
వాచం హృదయహారిణీమ్ ॥

'లక్ష్మణా, ఇతని భాషలోనిసౌందర్యాన్ని, వర్ణనాక్రమంలోని తాలబద్ధతను గమనించవల సింది. మాటలధోరణిబట్టి చూస్తే ఇతడు వేదాలను వల్లెవేసినట్లు ఉంది. వ్యాకరణ

శాస్త్రంలో కూడ పండితుడులా మాట్లాడుతున్నాడు. ఇతడు ఆదర్శప్రాయుడైన రాజదూత. ఇలాంటి దూత కలిగిన రాజు అదృష్టవంతుడు. మనం ఎవరిని వెతుకుతూవచ్చామో, అతడు మనలనే వెతుక్కుంటూ మనకంట బడ్డాడు. మనం సుగ్రీవుని వెదుక్కుంటూ బయలుదేరాం. సుగ్రీవుడే మనకోసం ఇతనిని పంపించాడు. ఇతన్ని ఆహ్వానిద్దాం.' ఆకర్షకమై, రసవత్తరమైన తన మాటలచేతనే రామునికి తన ప్రభువైన సుగ్రీవునికి మధ్య సామరస్యం కుదిరించ గలిగాడు మారుతి. మానవప్రకృతి హనుమంతునికి బాగా తెలుసు. ఒకానొక క్లిష్టసమయంలో రాముడు సైతం మారుతి వివేకాన్ని ప్రశంసించాడు. వానరులంతా లంకాద్వీపానికి ఎదురుగా సముద్రతీరంలో సమావేశమై రావణునితో యుద్ధం చేయడానికి సభ జరిపారు. అక్కడికి శరణార్థియై రామసహాయం కోసం విభీషణుడు వచ్చాడు. వానరులంతా అతన్ని శత్రువుగా భావించి తమకు తోచినట్లుగా రామునికిహితవు చెప్పసాగారు. సుగ్రీవుడూ అట్లాగే భావించాడు. అప్పుడు మారుతి లేచి విభీషణుడు శరణార్థి యని, అతనికి సహాయ మొనరించడం క్షాత్రధర్మ మని రామునితో పలికాడు. రాముడి మనస్సులోకూడా ఇదే భావన కలిగి ఉండడంచేత రాముడు హనుమంతుని తెలివితేటలకు, తనముఖవర్చస్సునుబట్టి హృదయంలోని తన భావనను గుర్తించగలిగినందులకు మారుతిని ప్రశంసించాడు.

హనుమంతునియందు గల విశ్వాసంచేతనే రాముడు తన ముద్రికను ఇచ్చి సీతను వెదకడానికి దక్షిణదిశకు పంపాడు. ఈ కార్యం హనుమంతు డొక్కడే నెరవేర్చగల డని సుగ్రీవునికి నమ్మకం ఉంది. హనుమంతుడు సముద్రాన్ని దాటడం మొదలుకొని లంకనుండి తిరిగి వచ్చినంతవరకు జరిగిన సంఘటనలను పరిశీలిస్తే, ఆయన పరాక్రమం, విశద మవుతుంది. తాను సీతను ముందు చూడకపోయి నప్పటికి రాముడు చెప్పిన గుర్తులనుబట్టి అతడు సీతాదేవిని అశోకవనంలో శింశుపావృక్షం క్రింద పోల్చుకో గలిగాడు. లంకలో వెదికి సీతాదేవి కనబడకపోయేసరికి హనుమంతుడు చాలా బాధపడి కేవలం పట్టుదలతోనూ, ఆత్మవిశ్వాసంతోనూ ఆమె కనబడే వరకు వెదకి ఆమెకు రామసందేశాన్ని ఇవ్వ గలిగాడు

సందేశాన్ని అందివ్వడంలోకూడా తన మాటలనేర్పును జారవిడువకుండా రాముని పవిత్ర చరిత్రను, ప్రేమహృదయాన్ని సీతకు మధురమైన భాషలో శ్రావ్యమైన గొంతుకతో మారుతి వినిపించ గలిగాడు.

సంశ్రవే మధురం వాక్యం
వైదేహ్యా వ్యాజహార హ ॥
(సుందరకాండ)

రామదూతగా మారుతి నెరవేర్చిన కార్యం అద్భుతమైన దని చెప్పవలసి ఉంటుంది. సీతకు రాముని సందేశం తెలుపడమే గాకుండా రావణునికి రాముని శక్తిని చూపించ గలందులకే లంకాదహనం మొదలయిన సాహసకార్యాలు చేసి రావణుని హృదయంలో చిచ్చు బెట్టగలిగాడు. రాముడు వాలిని ఒక బాణంతో సంహరించివేశా డనీ, అతడు అమితపరాక్రమవంతు డనీ రామదూతగా వెళ్లిన మారుతి రావణ సమక్షంలో చెప్ప గలిగాడు.

"త్వయా విజ్ఞాతపూర్వశ్చ
వాలీ వానరపుంగవః"

అంతే గాకుండా తిరిగి సముద్రం దాటివచ్చి

రాముడికి సీతను గురించి చెప్పి రామున్ని సంతుష్టిపరచాడు. తాను ఆంజనేయుడికి ఇవ్వ గలిగింది యేమియు లేనందున రాముడు మా రుతిని ప్రేమతో కౌగలించుకొన్నాడు.

యుద్ధవీరుడుగా హనుమంతుని పాత్రను పరిశీలిస్తే అద్భుతంగా గోచరిస్తుంది. నూరు యోజనాల సముద్రాన్ని దాటడం, లంకాధి దేవతను నిర్జించడం, అశోకవనాన్ని నాశనం చేయడం, రావణుని సేనాధిపతులను సంహ రించడం, ఇన్నీ జరిపి తిరిగి రాముడి దగ్గరకు క్షేమంగా చేరడం – మొద లయిన సంఘటన లను పరికిస్తే హనుమంతుని ధైర్యసాహసాలు, దుర్వారపరాక్రమం మనకు గోచరిస్తాయి. వానరులను కలుసుకొని తాను ఈ కార్యాలను సాధించడం మూడు కారణాల ఫలితమే నని మారుతి చాలా వినయంగా పలికాడు. (1) రాముని ప్రభావం, (2) వానరుల తేజము, (3) సుగ్రీవుని పని నెగ్గించా లనే దీక్ష.

రాఘవస్య ప్రభా వేన
భవతాం చైవ తేజసా
సుగ్రీవస్యచ కార్యార్థం
మయా సర్వ మనుష్ఠితమ్

కాని హనుమంతుని పరాక్రమ మంతా యుద్ధభూమిలోనే ప్రదర్శింపబడింది. సంజీవనీ పర్వతాన్ని తీసుకొని రావడమే దానికి నిదర్శనం.

కాని దూతగా, వీరుడుగా హనుమంతుడు చేసిన పనులకంటె భక్తుడుగా అతడు చూపిన నిదర్శనాలే అతనికి చిరంజీవిత్వాన్ని ప్రసాదిం చాయి. ఆత్మ త్యాగం చేసి సర్వం తన స్వామి కోసం చేసే సేవయే ఉత్తమభక్తి అనిపించు కొంటుంది. ఇలాంటి భక్తుడు ప్రాకృతమైన ప్రతిబంధకాలను కూడా లెక్క చేయడు. సముద్రాన్ని దాటేటపుడు మారుతికి సురసా దేవి ఎలాంటి కష్టాన్ని కలుగజేయ లేక పోయింది. తనకార్యసాధనలో మారుతికి మైనాకుని ఆతిథ్యంకూడా కష్ట మనిపించి నిరా కరించాడు. లంకలో ప్రవేశించేటపుడు కూడా హనుమంతుడు తన ప్రభువగు రామచంద్రుని జయం కోరి తన యెడమ పాదాన్నే పెట్టాడు.

'రామా స్యాభ్యుదయే రతః...'

హనుమంతుడు పుట్టుకతోనే భక్తుడుగా జన్మిం చాడు. సీతాదేవికూడా మారుతిని ప్రశం సిసూ పలికిన వాక్యాలు.

'విక్రాన్త స్త్వం సమర్థ స్త్వం
ప్రాజ్ఞ స్త్వం వానరోత్తమ.'

తన అనన్యభక్తిచేతనే మారుతి చిరంజీవి త్వాన్ని పొందగలిగి సర్వకాలములందు రామ నామసంకీర్తనం జరిగే అన్ని స్థలాల్లో ఉంటా డని వాల్మీకిరామాయణ పారాయణ పూ ర్వాంగ శ్లోకంలో చెప్పబడింది.

యత్ర యత్ర రఘునాథ కీర్తనం।
తత్ర తత్ర కృతమస్తకాంజలిమ్॥
బాష్పవారి పరిపూర్ణలోచనమ్।
మారుతిం నమత రాక్షసాన్తకమ్॥

హనుమంతుని గుణాలు ఈక్రింది శ్లోకంలో రామాయణ పారాయణ పూర్వాంగంలో కీర్తించబడుతుంటాయి.

మనోజవం మారుతతుల్యవేగం
జితేంద్రియం బుద్ధిమతాం వరిష్ఠమ్।
వాతాత్మజం వానరయూథ ముఖ్యం
శ్రీరామదూతం శిరసా నమామి॥

* * *

# మహాసాధ్వీ కైకేయి

భాషారత్న శ్రీ అయ్యగారి రామచంద్రరావుగారు

శ్లోకసారసమాకీర్ణం
సర్గ కల్లోల సంకులం
కాండగ్రాహ మహామీనం
వన్దే రామాయణార్ణవం.

శ్రీమద్రామాయణము ఆదికావ్యము. శ్రీరాముడు సాక్షాత్పరాత్పరుడు. ఆదర్శపురుషపుంగవుడు. రామాయణమున ప్రతిపాత్రయు నాదర్శవంతమే. అత్యంతాదర్శములే. రాజహంసలు విహరించు నిర్మలమానససరోవరము శ్రీమద్వాల్మీకిరామాయణము. శ్రీమద్రామాయణమున మహారాజ్ఞి కైకేయిచరిత్ర చిత్రమైనది. సకలజనారాధ్యుడు పరమప్రియుడు, నగు శ్రీరామచంద్రుని వనవాసంబున కంపిన వనితామణి ఈకైక పాపిని, కళంకిని, కులనాశిని, రాక్షసి యని లోకు లీ మహారాజ్ఞిని దిట్టుచుందురు.

కైకేయి కేకయరాజపుత్రి. దశరథుని చిన్నభార్య. ఈమె యప్రతిమసుందరీమణి. వీరాంగనయే గాక ప్రథమశ్రేణికి చెందిన పతివ్రతాశిరోమణియై యుండెను. పతిసేవకు, నిర్వ్యాజప్రేమకు నాలవాలమై యుండుటచేతనే దశరథుడు కౌసల్యాసుమిత్రలకంటె నీమె నధికముగా ప్రేమించెను. కైక పతిసేవకై ఎట్టి కష్టములనైనను సహించెను. దశరథు డొకప్పుడు దేవతలకు సాయ మొనర్చుటకై శంబరాసురునితో సంగ్రామమునకు వెడలెను. కైకయు పతితో రణభూమి కేగెను. ఆమె సుఖభోగములకై దశరథునితో బోలేదు. పతిదేవునకు శూరత జూపుటకు, సుఖమును గలిగించుటకే అనుసరించెను. కైకేయి పాతివ్రత్యము, వీరత్వము వెల్లడియగు క్షణ మాసన్న మాయెను. దశరథుని సారథి రణభూమిని మరణించెను. నిరుపమానంబగు ధీరత్వంబున కైక సారథ్యం బొనరించి తననాథుని ప్రమాదమునుండి తప్పించెను. మఱియొకసారి మహారాజు ఘోరయుద్ధ మొనర్చుచుండెను. జయలక్ష్మి శత్రువశం బగునా యని సంశయము గలుగుచుండెను. రథచక్రపుమేకు ఊడి పడిపోయెను. రథము నేలగూల నైయుండెను. కైక యీ దుస్సంఘటన గాంచెను. దశరథుడే ప్రమాదము నెఱుగ డాయెను. పతి విజయకాంక్షిణి యగు నాయుత్తమ వీరాంగన మేకునకు మారు తన దక్షిణహస్తమునుంచి ధైర్యముతో గూరుచుండెను. ఈవిశేషపరిశ్రమచే ఆమెకు వేదన కలిగెను. నేత్రములనుండి యశ్రువులు ప్రవహించెను. కాని కైకహస్తము అట్లే యుండెను. దశరథునిప్రాణసంరక్షణ మొనర్చెను. విజయశ్రీ దశరథుని వరించెను.

శత్రుసంహార మొనర్చి కైక సాహసమును గాంచిన దశరథుని యాశ్చర్యమునకు మేర లేకుండెను. ఆయనహృదయము కృతజ్ఞతానందములతో నిండిపోయెను. ఇట్టి వీరత్వము, త్యాగము జూపియు కైక గర్వరహితయై యుండెను. తనప్రాణేశ్వరుని ప్రశంస నపేక్షింప దాయెను. మహారాజు వర దానము సేయ నిశ్చయించెను. కైక "ప్రాణేశ్వరా, మీ ప్రేమకంటె అన్య మేమియు నేను గోర" నని పలికెను. కాని దశరథుడు రెండువరములను

గోరు మని బలాత్కరించెను. పతిసంతృప్తికై దేవతాప్రేరణచే నవసరమగువేళ వరము లడిగెద నని పలికెను. కైకయొక్క ఈ యపూర్వత్యాగము స్మరణీయము.

భరతశత్రుఘ్నులు మేనమామయింటి కేగి యుండిరి. అదిచైత్రమాసము. దశరథుడు శ్రీరామునకు రాజ్యాభిషేకము సేయ నభిలషించెను. దశరథు డీ మహోత్సవమునకు భరతశత్రుఘ్నుల బిలువవలయు ననియు దలప లేదు. కేకయరాజునుగూడ బిలువలేదు. దశరథుడు కైకేయీ వివాహసమయమున నామెకు నుద్ఘాటించిన పుత్రుడే రాజ్యాధికారి కావలె నని నుడివె నని కథ యొకటి గలదు. శ్రీరామునిపై దశరథున కనురాగ మధిక మగుటచేత నే రామునకే యౌవరాజ్యాభిషేకము చేయ దలచె ననియు జనులు చెప్పుకొను చుండిరి. ఈ కారణమువలననే దశరథుడు తనకు అత్యంతప్రేమపాత్రమైన కైకేయికిగూడ పట్టాభిషేకవార్త ముందుగా తెలిపియుండ లేదు. కైకేయీ వివాహసమయమున దశరథుడు పలికిన మాటల నెఱిగిన దగుటచేత తన కుమారుడు రాజ్యార్హు డని కైక యెఱిగి యుండెను. కాని తనకుమారుడగు భరతునకు రాజ్యాధికారము నెన్నడును గోర నని నిశ్చయించుకొనెను. ఈ సంగతి యెవ్వరితోడను జెప్పియుండలేదు. శ్రీరాముని రాజ్యాభిషేక వార్తను ముందుగా మంథరాముఖమునవినెను. కైకేయి యానందాబ్ధిని నోలలాడెను. ఈ ఆనందవార్త గొనివచ్చిన మంథర కమూల్యంబగు నాభరణంబును పారితోషికంబుగా నిచ్చి యీవిధముగా పలుకుచున్నది.

ఇదం తు మంథరే మహ్యా
మాఖ్యాతం పరమం శివం
ఏత న్మే ప్రియ మాఖ్యాతం
కిం వా భూయః కరోమి తే.

ఓ మంథరా, నాకీ శుభమైన ప్రియవార్తను దెలిపితివి. దీనికి బదులుగా నే నేమి నీకు ప్రత్యుపకారము చేయగలను.

రామే వా భరతే వాహం
విశేషం నోపలక్షయే
తస్మా త్తుష్టాస్మి య ద్రాజా
రామం రాజ్యేఽభిషేక్ష్యతి.

కాని శ్రీరామునియందును, భరతునియందును భేద మేమియు నాకగపడుట లేదు. అందువలన మహారాజు రామునికి రాజ్యాభిషేకము చేయునని విని సంతోషించితిని.

న మే పరం కించి దితో వరం పునః
ప్రియం ప్రియార్హే సువచం వచోఽమృతమ్
తథాహ్యవోచ స్త్వ మతః ప్రియోత్తరం
వరం పరం తే ప్రదదామి కం వృణు.

ఓ ప్రియవాదినీ, రాముని రాజ్యాభిషేకవార్త వినుటకంటె వేఱొక యానందము లేదు. అమృతోపమమై సుఖప్రదమైన ప్రియవచనము పలికితివి. దీనికి ప్రత్యుపకారముగా గోరిన వర మిత్తును కోరుకొనుము.

కైకేయీవచనములు విని మంథర, మహారాజ్ఞీ హృదయమున భేదబుద్ధిగలిగింప బ్రయత్నించెను. కైక రామచంద్రప్రశంస మాన లేదు. మంథరా, రామచంద్రుడు ధర్మజ్ఞుడు, గుణవంతుడు, సంయతేంద్రియుడు, సత్యవ్రతుడు, పవిత్రుడు, అతడు దశరథునకు జ్యేష్ఠపుత్రుడు. మా రఘుకులధర్మము ననుసరించి రామునికే యౌవరాజ్యాధికారము గలదు. దీర్ఘాయుష్మంతుడగు రాముడు సోదరులను, సేవకులను తండ్రివలె పాలించును. ఇట్టి రామచంద్రుని రాజ్యాభిషేకవార్త విని నీ వేల

దుఃఖించుచుంటివి. ఇది యానందసమయము. ఈ సమయమున నీకోపమునకు గారణ మగ పడదు. ఈ కల్యాణముహూర్తమున నీవు దుఃఖింపరాదు.

యథా వై భరతో మాన్య స్తథా
భూయోఽపి రాఘవః ।
కౌసల్యాతో ఽతిరిక్తం చ
మమ శుశ్రూషతే బహు ॥

నాకు భరతునికంటె రామునిపై నధిక ప్రేమ గలదు. రాముడును కౌసల్య కంటె నా కధిక సేవ చేయుచున్నాడు.

రాజ్యం యది హి రామస్య
భరత స్యాపి త త్తథా ।
మన్యతే హి యథాత్మానం
తథా భ్రాతౄం స్తు రాఘవః ॥

రాజ్యలాభము రామునకైనచో భరతున కైనట్లుగా భావింపవచ్చును. ఏలయన రాముడు సోదరులను తనవలెనే తలచుచుండును.

కైకేయీవచనములను విని మంధర దశరథుని నిందింప మొదలిడెను. కైకరోషాయత్తచిత్తయై మంధర నిట్లు నిందించెను.

ఈదృశీ యది రామే చ
బుద్ధి స్తవసమాగతా ।
జిహ్వాయా శ్ఛేదనం చైవ
కర్తవ్యం తవ పాపిని ॥

శ్రీరామునిపై నిట్టి ద్వేషబుద్ధి యేర్పడినచో ఓ పాపాత్మురాలా, నీ నాలుక తెగగోయవలయును.

ఈ ప్రసంగమువలన కైకేయికి రామునిపై గల ప్రేమయు, రామరాజ్యాభిషేకమువలన సంతోషమును వెల్లడియైనవి. ఇక మంధర ప్రేరణచే గైకవలననే రాజ్యాభిషేకమునకు విఘ్నము గలిగిన దని వేఱు వ్రాయ నక్కఱ లేదు. మంధరదుష్కార్యాభిలాష నెఱిగి పాపాత్మురాలా, అనర్థదాయినీ అని నిందించి, రాముని ప్రేమించి, రఘుకులసంరక్షణ సేయ నారంభమునుండియు యత్నించిన పరమసుశీలయగు కైక రాజ్యలోభముచే నిట్టి యనర్థదాయకకృత్యమును ఏ విధముగా చేయ నెంచు నని యోచింప వలసి యున్నది. రాముని రాజ్యాభిషేకవార్తను మంథరాముఖమున విని యామెను దివ్యాభరణముచే బహూకరించి, దశరథుడే భరతునకు రాజ్య మిత్తు నని ప్రతిజ్ఞ చేయుట నెఱింగియు, భరతుని రాజుగా జేయ నభినివేశము జూపిన మంధర నాలుకను గోయ ధర్మ మని చెప్పిన కైక క్షణకాలమున నిట్లెందులకు బరిణామము నొందెను? శ్రీరాముని దుఃఖభూయిష్ఠమగు నరణ్యావాసమున కేల పదునాలుగు వత్సరములు పంప నెంచెను? భరతుని శీలస్వభావాదులు తెలిసియుండియు వానికై రాజ్యవరదాన మేల గోరెను?

కైకకృత్యమునకు బరమరహస్య మొకటి గలదు. కైకజన్మము భగవంతుడగు శ్రీరామచంద్రునిలీలయందు ప్రధానభారమును వహించుటకేయై యున్నది. కైక శ్రీరాముని పరబ్రహ్మ, పరమాత్మగా గ్రహించియుండెను. కైక శ్రీరాముని కరణ్యావాసాజ్ఞ నొసంగకున్నచో ఆయన యవతారలీల సంపూర్ణమయ్యెడిది కాదు. సీతాపహరణము జరుగదు. రాక్షససహితుడగు రావణుడు సేనాసహితముగా మరణింపడు. శ్రీరాముడు దుష్టశిక్షణ శిష్టరక్షణకై యవతారమును ధరించెను. అపరాధములేనిదే ధర్మమూర్తియగు శ్రీరాముడు రావణునిపై నెట్లు విగ్రహించును? ఈనాటి రాజ్యలోభులగు నాయకులవలె బలాత్కార

ముగా రావణుని రాజ్యాపహారణమునకు ధర్మ మూర్తియగు శ్రీరాము డంగీకరింపడు. ధర్మ రక్షణసేయుచు దుష్టశిక్షణ చేయుటయే యాయన కభిమతము. దుష్టులను వధించుట చేతనే సాధులకు, ధర్మమునకుగూడ పరిత్రాణము గలుగును. ఈ కార్యమునకు కారణము గావలసి యుండెను. సీతాపహరణమే దీనికి గారణ మయ్యెను. రాజ్యాభిషేకమైనచో రాము డర ణ్యమునకు వెడలుట ఎట్లు సంభవించును? మహారాజు దశరథునిమరణము సమీపించెను. దశరథునిమరణము, రావణునివధ రెండును కైకేయీకారణమున వనవాసముచే జరిగెను. భగవత్ప్రేరణచే దేవతలప్రార్థన మన్నించి సరస్వతి కైకకు బుద్ధిపరిణామ మొనర్చెను. ఇయ్యది యత్యంతక్రూరమైనను భగవానుని లీల సంపూర్ణ మగుటకు అవసర మయ్యెను.

కైక శ్రీరాముని ప్రేమించిన జనని, భక్తు రాలు. ఈ సతీమణి కీర్తి రాజ్యమంచును, పరిజన మందును సుస్థిరమై యుండెను. రాము డరణ్య ములపాలైననాటినుండియు పౌరులు, బంధు వులు కైకను దిరస్కరించిరి. పుత్రు డవమానిం చెను. చివరకు ఆమె లోకనింద పాలాయెను. శ్రీరాముడు సకలజనులకు ప్రేమపాత్రుడైనచో సరళస్వభావురాలును, సాధ్వియునగు కైక యొక్క హృదయమును నెందులకు బరిణామము నొందించెను? ఇందువలన సచ్చారిత్రయగు కైక శాశ్వతదుష్కీర్తి నొందలేదా? జీవితము దుఃఖమయము కాలేదా? యని ప్రశ్నింప వచ్చును. శ్రీరాముడు సాక్షాత్తు సచ్చిదానంద స్వరూపుడు, కైక పరమానురాగము గల సేవకురాలు. శ్రీరామావతారకార్యభారము సమకూర్చుటకు కైకేయి లోకాపవాదమును గూడ సహించెను. అందుచే శ్రీరాముడు తన ౹మునకు సహకరించి సాధ్విగా భావిం చెనే గాని యపకారిణిగా భావింప లేదు. శ్రీరామునకు గలిగిన లోకాపవాదము బాపు టకే సీతవనవాస మనుభవించెను. జానకియు ''నాథా, నా విశుద్ధతనుగూర్చి మీకు సందే హము లేదు. కేవలము లోకాపవాదభయముచే నన్ను మీరు త్యజించితిరి. అయినను నాకు మీరు పరమగతియై యున్నా'' రని పలికెను. ఇట్లు రామకార్యమునకై సీత కష్టములను సహించెను. సీతామహాసాధ్వి దుష్కీర్తిని బొంద లేదు. లోకముచే శ్లాఘింపబడెను. సీతను పతివ్రతాలలామగా లోకము భావిం చెను. కైకమాత్రము రామవిరోధిని యను దుష్కీర్తిపాలాయెను. ఆచంద్రతారార్కము లోకదూషణకు గురి అయ్యెను. పాపాత్మ రాలు, కళంకిని, వంశఘాతకురాలు అని పిలువ బడెను. వైధవ్యదుఃఖమును స్వీకరిం చెను. పుత్రునిచేతను, బురజనులచేతను దిర స్కరింపబడెను. రాముడు తనకార్యమును నెఱవేర్చుకొనుటకు కైకను ప్రధానసాధనముగా గ్రహించెను. సీతాలక్ష్మణులు రామనాటక మున పాత్రధారులై రామునితో వనవాసమును చేసి ఆయవతారమూర్తి సాంగత్యమును సంపాదించిరి. కైకేయికి శ్రీరామునికి ఏకాంత వాసమున కవకాశము కలుగ లేదు. అందులకే కైక భరతునితో వనమున కేగెను. సామాన్య స్త్రీవలె శ్రీరాముని క్షమింపు మని వేడెను. శ్రీరాముడు ''తల్లీ, యిది నా కార్యము. నీవు నిమిత్తమాత్రురాలవు. ఇది నా యిచ్ఛ. సంతో షముతో ముక్తినొందు'' మని పలికెను.

## అధ్యాత్మరామాయణము

భరతుడు తిరిగి శ్రీరాముని అయోధ్యకు రమ్మని బలాత్కరించెను. శ్రీరాము డంగీ కరింపలేదు. శ్రీరామజననరహస్య మెఱిగిన వశిష్ఠుడు భరతుని సంకేతస్థలమునకు గొని

పోయి "పుత్రా, నీకొక రహస్యము చెప్పె దను. శ్రీరాముడు సాక్షాన్నారాయణుడు. పూర్వకాలమున బ్రహ్మ వీనిని రావణవధకై ప్రార్థించెను. అందులకే యితడు దశరథునకు బుత్రరూపమున జన్మించెను. సీతాసాధ్వి సాక్షా ద్యోగమాయ. లక్ష్మణుడు ఆదిశేషుని అవతా రము. అందులకే యితనికి సర్వదా శ్రీరాముని సేవాభాగ్యము గల్గినది. రాముడు రావణవధ చేయ వలెను. వనమున నుండ వలెను. నీ జనని దోష మేమియు లేదు.

కైకేయ్యా వరదానాది
యద్యన్నిష్ఠురభాషణం ।
సర్వం దేవకృతం నోచే
దేవం సా భాషయేత్ కథం ॥

కైకేయివరముల నడుగుట, నిష్ఠురవాక్యము లాడుట యివి యన్నియు దైవకార్యములు. లేనిచో సాధ్వి యగు కైకేయి అట్లు పలుకునా? అందుచే రాము డయోధ్యకు తిరిగి రావలెనని బలాత్కరింపకుము.

తస్మాత్త్వ జాగ్రహం తాత
రామస్య వినివర్తనే ॥

"భరతా, నీవు జననిపై దోషారోపణ సేయకుము. రామవనవాసము సమస్తదేవదాన వులకు, ఋషులకు బరమహితము, సుఖకారణ" మని పలికెను.

భరతుడు శ్రీరాముని పాదుకలను శిరము నం దుంచుకొని అయోధ్యకు ప్రయాణ మగు చుండగా కైకేయి ఏకాంతమున శ్రీరాముని గలిసికొనెను. కన్నీరు గార్చుచు వ్యాకులహృద యమున చేతులు జోడించి "శ్రీరామా, నీ రాజ్యాభిషేకమునకు నేను విఘ్నము గలిగించి తిని. ఆ సమయమున నా బుద్ధి దేవతలచే వికట ముగా పరిణామము నొందెను. నా చిత్తము నీ మాయచే మోహిత మయ్యెను. నా దుష్టత్వ మును క్షమింపుము. నీవు సాక్షాద్విష్ణువవు అవ్యక్తుడవు, సనాతనుడవు, పరమాత్మవు "మనుష్యరూపధారివై సమస్తవిశ్వమును మోహింపజేయుచున్నావు. నీచే ప్రేరింపబడియే జనులు సాధ్వసాధుకార్యములు చేయుచున్నా రు. బహురూపధారిణియైన మాయానర్తకి నీ యధీనము. నీవు దేవకార్యమును నిర్వహించు టకే నన్నిట్లు ప్రేరేపించితివి. ఓ జగన్నాథా, నన్ను రక్షింపుము. నీవు తత్త్వజ్ఞానరూపమైన నిర్మలతీక్ష్ణధారగల కరవాలముతో బుత్త్రవిత్తాదిరూపమైన నా స్నేహపాశమును ఛేదిం పుము. నేను నిన్ను శరణుబొందితి" నని పలికెను.

## అధ్యాత్మరామాయణము

కైకేయిభాషణములు విని శ్రీరాముడు మందహాసముతో బలికెను. అమ్మా, నీ వేమియు చేయలేదు. సత్యము పలికితివి. దేవకార్యనిర్వ హణకై నీ ముఖమునుండి నా ప్రేరణచే నిట్టి వాక్యములు బయల్వెడలెను. ఇందువలన నీ దోషము ఏ మాత్రము లేదు. నీవు కార్యము నెఱవేర్చిన సాధ్వీమతల్లివి. ఈ భక్తిచే సత్వ రము ముక్తినొందెదవు. నాకు లోకమున ద్వేషియును, ప్రియుడును లేడు. నీవు కర్మఫల మనుభవింపవు."

శ్రీరామునిమాటలవలన కైక నిర్దోషి యని స్పష్టమయినది. ఈ ప్రపంచమున జనులబుద్ధి మాయామోహితమైనది. తల్లీ, నిన్ను సామా న్యస్త్రీగా లోకులు భావించుచున్నారు. నీ హృదయమున నా తత్త్వజ్ఞానము గలదు. నీవు ధన్యురాల వని రాముడు పలికెను. కైకేయి శ్రీరామునకు ప్రణామం బాచరించి భరతు నితో అయోధ్య కరిగెను.

పై నుదహరించిన రామవాక్యములవలన కైక యుత్తమభక్తశ్రేణికి చెందిన సాధ్వి యని వెల్లడియైనది. ఈమె సరళహృదయ; స్వార్థ రహిత; స్నేహవాత్సల్యరూపిణి; ధర్మపరాయణ; ఆదర్శపతివ్రతాశిరోమణి; వీరాంగన; శ్రీరామచంద్రున కనన్యభక్తురాలును నై యుండెను. శ్రీరామునిపై కైకేయికి గల యాంతరంగిక ప్రేమ నిరుపమానము. ఈ మహాదేవి జగదాధారుడు, ప్రేమసముద్రుడు, రామభక్తుడు నగు భరతుని గన్న జననీ మతల్లి. ఈమె తిరస్కారార్హురాలు గాదు. ప్రాతఃస్మరణీయ యగు నీ దేవికి ననంత ప్రణామములు.



# శ్రీ వివేకానందస్వామి సూక్తులు సుభాషితాలు

(గతసంచిక తరువాయి)

28. (తరువాయి) సకల ప్రాణులను ప్రేమింపుము. ఎవరియందుగాని అసూయ వహింపకుము. ఒరుల తప్పులపై దృష్టిపెట్టకు.

29. మానవునకు మరణము లేదు, జననమును లేదు. దేహములు నశించును. అతనికి నాశనము లేదు.

30. ఏదే నొకమతమువాడుగ ఎవడును పుట్టడు. ప్రతివాడును ఏదే నొకమతమువాడగుటకే పుట్టును.

31. విశ్వమున నున్న ఆత్మ నిజమున కొక్కటే. తక్కిన వెల్ల ఆ యాత్మ దాల్చు రూపములే.

32. ఉపాసకులు అందఱును రెండువర్గముల వారుగ నున్నారు — అల్పసంఖ్యాకు లగు ధీరులు, అనల్పసంఖ్యాకు లగు పామరులు.

33. ఇప్పుడు ఈ జన్మములో పరిపూర్ణులము కాజాల మేని మఱొకజన్మములో కాగల మనుటకు రుజువు లేదు.

34. ఒక బంకమట్టిముద్దను నేను చక్కగ నెఱుగుదునేని, లోకమున నున్న బంకమట్టి నెల్ల నెఱిగినవాడనే. ఇది మూలసూత్రముల యెఱుక. కాని ఈ సూత్రముల పొందికలు వివిధములుగ నుండును. నీవు నిన్నెప్పుడు ఎఱుగుదువో అప్పుడే సమస్తము నెఱిగినవాడవే.

35. నావఱకు నేను వేదములలో హేతువాదముతో సరిపడు భాగములను మాత్రమే అంగీకరింతును. పైకి చూచుటకు వేదభాగములు పరస్పరవిరుద్ధములై కనిపించును. పాశ్చాత్త్యులు ఈశ్వరప్రేరితవాణి అందురే, వేదములు అట్టివిగా తలంపబడుటలేదు. దేవుని గూర్చిన జ్ఞానసర్వస్వమే, సర్వజ్ఞత్వమే వేదములని తలంపబడుచున్నవి. ఈ జ్ఞానము ప్రతి కల్పారంభమునందును తన్ను ఆవిష్కరించుకొనును. కల్పము ముగిసినప్పుడు అదియు సూక్ష్మరూపములోనికి దిగబడిపోవును. కల్పము మరల ప్రసారితమైనప్పుడు దానితోగూడ ఈ

జ్ఞానమును మరల ప్రసారిత మగును. అంతవఱకు సిద్ధాంతము బాగుగనే యున్నది. కాని దేవునిగూర్చిన జ్ఞానమంతయు వేదము లనెడి ఈ గ్రంథములలోమాత్రమే కల దనుట కేవలము కుతర్కము. వేదములలో హేతువాదముతో సరిపడు భాగములుమాత్రమే అసలు వేదము లనియు, తక్కిన వేవియు వేదములు కా వనియు మనువు ఒకచోట చెప్పియున్నాడు. భారతీయతత్త్వశాస్త్రజ్ఞులలో పెక్కుండ్ర అభిప్రాయ మిదే.

36. ప్రపంచమున నున్న మతగ్రంథములన్నిటిలో వేదములు మాత్రమే "వేదాధ్యయనము సైతము అప్రధానము" అనుచున్నవి. దేనిచేత నిత్యతత్త్వమును మనము సాక్షాత్కరించుకొనగలమో అదే నిజమైన విద్య. అది అధ్యయనమును కాదు, విశ్వాసమును కాదు, వాదమును కాదు. మఱేమనగా అతీంద్రియ సాక్షాత్కారము, సమాధి.

37. ఒకప్పుడు మనము నీచమృగములుగ నుంటిమి. అవి మనకంటె వేఱని మనము తలంతుము. "మనకొఱకే విశ్వము సృజింపబడియున్నది" అని పాశ్చాత్యులు చెప్పగా వినుచున్నాను. పెద్దపులులు గ్రంథములు వ్రాయగల్గినచో అవి తమకొఱకే మానవుడు సృజింపబడె ననియు, మానవుడు సులభముగ తమ చేతికి చిక్కుడు కావున అతడు మిక్కిలి పాపిష్ఠి ప్రాణి యనియు వ్రాసిపెట్టును. నేడు నీ కాలిక్రింద ప్రాకుచున్న కీటము ముందొకనాటికి దేవుడుగ నగునదే.

38. న్యూయార్కులో శ్రీవివేకానంద స్వామి ఇట్లనెను — "మీకున్న బుద్ధిబలము మా మహిళలకును ఉండవలయు నని నే నెంతో కోరుదును కాని బుద్ధిబలము పవిత్రతను చెడగొట్టునది అగునేని అప్పుడు అది నాకపేక్షితము కాదు. మీ విజ్ఞానమునకు మిమ్ము నేను పొగడెదను కాని "చెడుగు"ను పూలతో కప్పిపెట్టి దానిని "మంచిది' అని పేర్కొందురే ఆ మార్గము నాకిష్టము కాదు. బుద్ధిబలము మేలిమియే కాని అది అన్నిటికంటె పెది కాదు. మేము పాటుపడునదెల్ల నీతికొఱకును, పారమార్థికపరతకొఱకును. మీకున్న విజ్ఞానము మా మహిళలకు లేదు. కాని పవిత్రతలో వారే అధికురాండ్రు. ప్రతిమహిళకును తన భర్తకంటె వేఱైన ప్రతిపరపురుషుడును పుత్రస్థానీయుడు. ప్రతిమగవానికిని తనయిల్లాలుతప్ప ప్రతిస్త్రీయు మాతృస్థానీయురాలు. మీనడుమ నున్నప్పుడు దేనిని మీరు "స్త్రీలయెడ మర్యాద" అని పేర్కొనుచున్నారో అది నాకు రోతపుట్టించుచున్నది. మేము మగవారము, మేము ఆడువారము అను తలంపే ఉండరాదు. అందఱమును మానవులము అను భావముమాత్రమే యుండవలయును. స్త్రీపురుషవిభేదమును గణింపక ఉభయసాధారణమైన మానవత్వమును మాత్రమే మీరు గణించునంతవఱకు మీ మహిళలకు నిజమైన అభివృద్ధి కలుగదు. అంతవఱకును వారు కేవలము ఆటవస్తువులే కాని అంతకన్న హెచ్చు కారు. అందువలననే వివాహములను రద్దుచేసికొనుట కూడ మీలో సర్వసహజముగ నున్నది. మీలో మగవారు స్త్రీలకు మ్రొక్కి ఆసనమర్పించి మఱుక్షణముననే ముఖస్తుతిపాఠములను ఏకరువుపెట్టుదురు. యువతియు, యువకుడును ఒకచోట చేరిరా, తత్క్షణమే అతడు ఆమెను "కాంతా, నీ కన్నులెంత యందముగ నున్నవే" అని స్తోత్రము చేయ దొడగును. ఇట్లనుటకు మగవారికి ఏమి హక్కు

గలదు? మగవారికి అంత ధైర్యమేమి? మీ మహిళలు అందులకు అనుమతించుట ఏమి? ఇట్టివి మానవునిలో ఉదారాదర్శములను పోషింపక జఘన్యాంశములను హెచ్చించును.

మనము మగవారము, మనము ఆడువారము అను తలంపు మనకుండగూడదు. అందఱమును మానవులమే. ఒకరొకరికి గారాబముతో తోడ్పడవలసినవారమే అని తలంపవలయును. యువతీయువకులు ఏకాంతమున కలసికొన్న తక్షణమే, యువకుడు యువతిని కైవారమొనర్చును. వరుడు ఒకయువతిని పెండ్లాడగలుగుటకుముందు రెండువందలమంది యువతులను బ్రతిమాలికొని యుండును. నేను వివాహమాడువారిలో చేరుదునేని, ఇవేవియు లేకయే ఒక ప్రియురాలిని బడయ గలిగి యుందును.

భారతదేశములోనున్నప్పుడు వెలుపలినుండి మీ ఆచారములను చూచి "ఇదంతయు సరసమే కాని వేఱుకాదు, అంతయు బాగుగనే యున్నది" అని చెప్పగా వింటిని; నమ్మితిని. కాని తర్వాత నేను దేశాటనమునకు గడంగితిని. స్వయముగ చూచి మీ యాచారములు బాగుగలేవని తెలిసికొంటిని. మీ ఆచారమేమో బాగు లేదు. మీరు మాత్రము కన్నులు మూసికొని "చాల బాగున్నది, చాల బాగున్నది మా యాచారము" అనుకొనుచుందురు. పాశ్చాత్యదేశీయులైన మీతో వచ్చిన చిక్కు ఏమనగా — మీరు పసివారు, అవివేకులు, చపలచిత్తులు, ధనసంపన్నులు. పసితనము, అవివేకము, చిత్తచాపల్యము, ధనాఢ్యత అనువానిలో ఒక్కటియున్నను మహానర్థములు వాటిల్లుననగా, ఇవి అన్నియును కూడినచోట చెప్పనక్కఱలేదు. జాగ్రత్తతో నుండుడు.

పాశ్చాత్యమహిళల నందఱినిగూర్చి స్వామిజి నిష్ఠురముగనే మాటాడినను బోస్టను మహిళల మీద ఎక్కువగా దెబ్బతీసినారు.

'అన్నిచోట్లకంటె అధమమైనది బోస్టను. అచ్చటిమహిళలు అందఱును వెఱ్ఱిమోజుల వారు. చపలచిత్తులు. ఏది క్రొత్తయో, ఏది వింతయో దాని వెంటబడుచే వారి మొండి పట్టు'.

39. అమెరికాలో ఆయన ఇట్లడిగెను: 'తననాగరికతకు తానే విఱ్ఱవీగు దేశమున, మనము నిరీక్షించు పారమార్థికపరత ఎట నున్నది'.

40. ఇహము పరము అను మాటలు పిల్లలను భయపెట్టునవి. అంతయు "ఇహమే", ఇహముననే ఈ జన్మముననే భగవద్గతజీవులముగను, భగవద్గతవిహారులముగను అగుటకు, 'తా' నను తలంపు పోవలెను. మూఢవిశ్వాసమంతయు తొలగవలయును. అట్టివారు భారతదేశమున ఉన్నారు. ఈ దేశమున (అమెరికాలో) ఏరీ? మీ మతప్రచారకులు కలలుగాంచువారిని నిందించుచు ప్రసంగించుచుందురు. కలలుగాంచువారు ఇప్పుడున్నంతకంటె ఇంకను ఎక్కువ ఉన్నచో ఈ దేశీయులు ఎంతో బాగుపడెడివారు. 19-వ శతాబ్దపు (వారి) ఆత్మస్తుతికిని కలలుగాంచుటకును ఎంతో భేద మున్నది. ప్రపంచమంతయు నిండియుండునది దేవుడే కాని పాపము కాదు. ఒండొరులకు తోడ్పడుదము గాక. ఒకరినొకరు ప్రేమింతము గాక.

(సశేషము)

# శ్రీమద్భాగవతము - శ్రీకృష్ణసందేశము

[శ్రీమత్ప్రభవానందవాణి]

## తృతీయస్కంధము

### షష్ఠాధ్యాయము

### ధ్యానయోగము

కపిలుడు :

నే నిప్పుడు నీకు ధ్యానయోగమును వివరింతును. ఈ యోగమున మొదటిమెట్టు నీతి సూత్రములను పాటించుట. ఆ సూత్రములను అందఱును తలదాల్పవలసినదే. అవి యేవనగా :

జీవితములో నీస్థితి ఎంత తగ్గుదిగా నున్నను సరే నీ విధులను ఆర్జవముతో నిర్వహింపుము. నీ కర్మలఫలితమును భగవదర్పణముచేయుము. సాధువులగోష్ఠి నన్వేషింపుము. వారికి సేవ చేయుము. అన్నిటికంటె నెక్కువగా ధర్మమందు, సత్యమందు, మోక్షమందు, తీవ్రతృష్ణ నలవఱచుకొనుము.

నీవాంఛలలో నొకపరిమితిని అలవఱచుకొనుము. ఏప్రాణికిని హింస నొనరింపకుము.

సత్యమునుండి చలింపకు. పరులసొమ్ము కోరకు.

నీకై నందినపు అక్కఱలకు కావలసినంత మట్టుకుమాత్రమే ప్రతిగ్రహింపుము.

విశుద్ధ సంతుష్టజీవితమును గడపుటకు ఆత్మనిగ్రహమును వైరాగ్యమును అలవఱచుకొనుము. అన్నిటికంటె ముందు ఆత్మశుద్ధియు, మనశ్శుద్ధియు, దేహశుద్ధియు కలిగియుండుము.

కడపటి సూత్రమే దనగా— వేదములను శ్రద్ధతో అధ్యయనము చేయుము

ధ్యానసాధన కావించుటకు ఏకాంతస్థలమును ఎన్నుకొనవలెను. ఆస్థలమును అందుకు మాత్రమే ఉపయోగించుకోవలెను. కూర్చున్న మేను నిట్రముగనుండ వలెను గాని బిగిసికొని యుండ గూడదు. తర్వాత ఊపిరి బిగబట్టుచు విడుచుచు ప్రాణాయామమును నభ్యసింప వలెను. బాహ్యవస్తువులపైకి పాఱనీయక మనసును మనసులోనే కూడబట్టవలెను.

మేనియందలి చైతన్యకేంద్రములలో మనస్సును స్థిరపఱచుట తర్వాతి మెట్టు. ఈ తుది మెట్టునకు ఏకాగ్రతాసాధన అని పేరు.

ఇట్లు ఆయత్తుడై సాధకుడు భగవద్గుణముల ధ్యానింప వలెను.

ఈసాధనలవలన మహోజ్జ్వలమగు ఆధ్యాత్మికోన్నతి కలుగును. ప్రాణాయామసాధనచే దేహారోగ్యము పొంద వచ్చు. ప్రత్యాహారమును అభ్యసించుకొలది బాహ్యవస్తువులందలి సంగము నీకు అంతరించును. ఏకాగ్రతను అభ్యసింపగా అభ్యసింపగా హృదయశుద్ధి సిద్ధించును. నిన్ను పరమాత్మతో ఐక్యమొనర్చుకొనుశక్తి ధ్యానముచేత నీకు కలుగును.

ఇట్లు మనసునకు శాంతియు, హృదయము

నకు విశుద్ధియును కలుగగానే భగవద్గతచిత్తవై యుండుట నీ కలవడును. అంతట దివ్యప్రేమ నీకు సిద్ధించును.

దేవహూతి

ప్రేమధర్మమును గుఱించియే నా కింకను చెప్పుము. ఏల యన భగవత్ప్రేమ లేనిదే ధ్యానయోగమును అభ్యసించుట శక్యము గాదు.

కపిలుడు :

ప్రేమ దివ్యము. కాని ఒక్కొక్క వ్యష్ట్యాత్మలో గలిగిన పరిణతి ననుసరించి ప్రేమ ప్రకటనమును దాని అంతస్తులును భేదిల్లుచుండును.

ఇంకను మనసులలో ద్వేష మాత్సర్య క్రోధాహంకారములు కలవా రున్నారు. అట్టి వారికి దేవుడు దవ్వు, అంటడు, అందడు. దేవు నందు వారికి ప్రేమ ఉండ వచ్చు. కాని వారి ప్రేమ స్వార్థపరమైనది. ఇట్టి ప్రేమ తామసికము.

దేవుని మనకంటె వేఱైన వానినిగ భావించి ఐహికవాంఛలసిద్ధికై ఆయనను ప్రార్థించువారు కలరు. ఆలాగు దేవుని ప్రేమించి ఆరాధించు వారి ప్రేమయు ప్రేమయే కాని, అది జఘన్యము. అట్టి ప్రేమకు రాజసికప్రేమ యని పేరు.

ప్రేమకొఱకే దేవుని ప్రేమించి హృదయ పూర్వకముగ దేవున కాత్మార్పణము చేసికొనువారి ప్రేమను సాత్త్విక ప్రేమ అని అందుము.

ప్రియుడును, ప్రేయసియు, ప్రేమలో ఒక్కటైనప్పుడు, దేవుని సాక్షాత్కరించుకొని సకల జీవులందున్న ఆత్మగా ఆయనను మనము ప్రేమించునప్పుడు, మన డెందములందు అవిచ్ఛిన్నప్రేమ ప్రవాహ మున్నప్పుడు — అప్పుడు మనకు దివ్యప్రేమ సిద్ధించునది.

మన హృదయము అట్టి దివ్యప్రేమతో నిండినప్పుడు మనము త్రిగుణములను అతిక్రమింతుము. బ్రహ్మముతో నైక్య మందుదుము.

హృదయము విశుద్ధ మగుటకును దివ్య ప్రేమ పెంపొందుటకును సాధకుడు ఈ క్రింది సూత్రములను అనుసరింపవలెను :

జీవిత కర్తవ్యములను నిర్వహింపుము, ఫలమునుగూర్చిన తలంపు లేక పాటుపడుము. కర్మనే ఆరాధనగా రూపొందించుకొనవలయును.

క్రమముతప్పక భగవంతు నారాధింపుము; భగవన్నామమును పాడుము; ఆయన గుణముల కీర్తింపుము. నానాటికి అధికాధికముగ భగవద్ధ్యానముననే నిమగ్నుడవై యుండుము.

సకలజీవులందును దేవునే సాక్షాత్కరించుకొన నేర్చుకొనుము. మహాత్ముల పూజింపుము. దీనులపట్ల దరిద్రులపట్ల కనికరము కలిగి యుండుము. అందఱియందు సౌహృదము పాటింపుము.

స్వారాజ్యసిద్ధికి ఇది మార్గము.

సకలజీవులందును సకలవస్తువులందును అంతరాత్మగా దేవు డున్నాడు. అన్నింటను ఆయనమూర్తిభావము సమానము కాకపోవచ్చు; పవిత్రహృదయులందు ఆయనమూర్తిభావము హెచ్చుగ నుండును. అనేకముల నడుమ నున్న ఏకమును సాక్షాత్కరించుకొన్న వాని యందును ఆయన సాన్నిధ్యము హెచ్చు.

సకలజీవులందు ఉన్న ఆత్మను *నేనే. ఎల్లరదెందములందు నేను వసింతును. సకల జీవులందును గాక మఱి ఎచట నన్ను ఎవడైన ఆరాధింపవలెను ? సకలజీవులయందలి అంతరాత్మ నేనే అనుటను గుర్తించి, ఎల్లర ప్రేమింపుము. ఎల్లర సేవించుచు జీవింపుము.

దేవహూతి తనప్రియపుత్రుని ఉపదేశములను పరమవిశ్వాసముతో అనుసరించెను. అచిరకాలమునందే తన డెందమందును ఎల్లర హృదయములందును ఉన్నట్టి ఏకాత్మను ఆమె సాక్షాత్కరించుకొన్నది.

కపిలుడు కొంతకాలమునకు తల్లియొద్ద సెలవు పొంది ఐహికబంధముల నెల్ల విడనాడి ఉత్తరముగా హిమాలయములొద్దకు పయనించెను. విశ్వమానవ శ్రేయస్సుకై యోగసమాధియందు సంపూర్ణముగ నిమగ్నుడై ఆయన ఇప్పటికిని ఉన్నాడట.

* కపిలుడు మరల దేవునితో తన తాదాత్మ్యమును భావించి మాటాడుచున్నాడు.



# వార్తలు, విశేషాలు

## శ్రీరామకృష్ణమఠము - మద్రాసు
## శ్రీరామకృష్ణ జయంతి మహోత్సవములు

పరమహంస శ్రీరామకృష్ణదేవుని 127-వ జయంతి తిథిపూజ 1962 మార్చి 8 వ తేదీ గురువారమునాడు జరుపబడినది. నాటికార్యక్రమం : వేకువ 5 గం॥ మంగళహారతి, పిమ్మట భజన, గీతాపఠనము, ఉపనిషత్పారాయణము (రామకృష్ణ మిషను హోము విద్యార్థులచే); 8 గంటలకు ప్రారంభమైన ప్రత్యేకపూజ గీతా, చండీస్తోత్రపారాయణములతో హోమముతో 1-15 గంటలకు ముగిసినది. 1,100 భక్తులకు, 700 దరిద్రనారాయణులకు అన్నసంతర్పణ గావింపబడినది. సాయంఆరాత్రికమునకు తర్వాత మండపములో సమావేశమైన భక్తగోష్ఠిలో శ్రీరామకృష్ణుని అమృతసూక్తులు కొన్ని పఠింపబడినవి. వృద్ధస్వాములు కొందఱు ఉపన్యసించిరి.

మార్చి 11-వ తేదీ ఆదివారము బహిరంగోత్సవము. శ్రీరామకృష్ణుని లీలాప్రసంగ - కథామృత - మానపారాయణము ప్రొద్దున 8-30 గంటల కారంభమై 10-30 గంటలకు ముగిసినది.

మధ్యాహ్నము 3 గంటలనుండి 5 గంటల వఱకు విద్వాన్ మన్నార్గుడి సాంబశివ భాగవతులు "భక్తపురందరదాస" చరిత్ర సంగీతోపన్యాసముచేత భక్తులకు రక్తిగొలిపిరి. ప్రార్థనతో 5 గంట లప్పుడు బహిరంగసభ ప్రారంభమైనది. డా॥ ఆర్కాటు లక్ష్మణస్వామి మొదలియారు అధ్యక్షపీఠ మలంకరించారు. శ్రీమత్కైలాసానందస్వామి వక్తలకు సదస్యులకు సభాధిపతికి స్వాగతమంగళం పలికారు. ఆచార్య జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారును, శ్రీమద్విమలానందస్వాములును, శ్రీ శివజ్ఞానగ్రామణిగారును వరుసగా తెలుగులో, ఆంగ్లములో, తమిళములో ఉపన్యసించినారు. అధ్యక్షోపన్యాసానంతరము నగర పాఠశాలలలో పోటీలలో పాల్గొని ప్రథమబహుమతులు పొందిన విద్యార్థులు తాము కంఠస్థములు చేసిన గ్రంథభాగములను వల్లించిరి. బహుమతు లిచ్చిన పిదప ఆచార్య ఎ. ఎల్. కృష్ణన్‌గారు అందఱికిని వందనోపచారవాక్కు పలికినారు. శ్రీ శివజ్ఞానగ్రామణిగారు తమ ఉపన్యాసంలో శ్రీరామకృష్ణుని విశుద్ధదివ్యజీవితము లోకోత్తర మని కొనియాడినారు. శ్రీ లక్ష్మణస్వామి మొదలియారుగారు తమ అధ్యక్షోపన్యాసంలో ఈలా గన్నారు: "భారతదేశం పారమార్థికపరతను కోల్పోవునేని సర్వనాశమే. ఆంతరములైన శ్రద్ధోత్సాహములచేత గొప్పతనము కల్గునే గాని వెలి పటాటోపములచేత కలుగ దను పాఠమును మన మింకను నేర్చుకోవలసియున్నది. కాబట్టి పరమహంస శ్రీరామకృష్ణుని ఆశీస్సులు ఎప్పటికంటె ఇప్పుడు ఎక్కువగా అవసరం". గుడిలో హారతి ముగియగానే మఠభజనబృందంవారు శ్రీమత్ప్రియానందస్వాముల నాయకత్వమున కర్ణామృతంగా నడపిన భజనతో నాటి కార్యక్రమం ముగిసింది.

## సరోజినీనగర్, న్యూఢిల్లీ
## శ్రీరామకృష్ణవివేకానందజయంతి మహోత్సవములు

శ్రీరామకృష్ణుని 127-వ జయంతి, శ్రీవివేకానందస్వామిజీ శతతమజయంతి సరోజినీనగరంలో 1962 ఫెబ్రువరి 25-వ తేదీనాడును, మార్చి 3-వ తేదీనాడును విభవోత్తరంగా జరుపబడినవి. మొదటిదినం ఇంగ్లీషు, హిందీ, సంస్కృత, బెంగాలీ, పంజాబీ, తమిళభాషలలో వల్లించడంలో పోటీలు జరిగినవి. వివిధపాఠశాలలనుండి దాదాపు 500 మంది విద్యార్థులు పాల్గొన్నారు. 59 బహుమతులు ఒసగబడినవి. రెండవదినం బహిరంగసమావేశం. న్యూఢిల్లీ రామకృష్ణ మిషనుకు అధ్యక్షులగు శ్రీ రంగనాథానంద స్వాములు అధ్యక్షత వహించిరి. శ్రీరామ్‌చంద్రతివారీ హిందీలోనూ, శ్రీతారాపాద చౌదరిగారు బెంగాలీలోను ఉపన్యసించారు. బహుమతులు పొందిన విద్యార్థులు వివిధభాషలలో తాము కంఠస్థముచేసిన శ్రీ వివేకానంద సందేశవాక్యాలను వల్లించినారు.

"తనమదిలోపల దశరథతనయులలోఁ బెద్దవానిఁ దలఁచిన జన్మం
బనయంబు పావనం బని ఘను లందురు కుందవరపు కవిచౌడప్పా.

చౌడప్ప.

# గ్రంథపరిచయం

[సమీక్షకి గ్రంథాలు పంపేవారు రెండేసి ప్రతులు పంపవలె అని మనవి]

### శ్రీరామచరితమానసామృతము

రచయిత్రి – శ్రీమతి తులసీదాసదాసి – తెలుగు వచనము; సైజు – డెమీ; పుటలు – 405; వెల – రూ. 10.00; ప్రాప్తి స్థానములు – శ్రీమతి నేలనూతల పార్వతీకృష్ణ మూర్తిగారు, మూలపేట, నెల్లూరు; చందా నారాయణశ్రేష్ఠిగారు, సికిందరాబాదు – హైదరాబాదు, వరంగల్.

వేదవేద్యుడగు పరమపురుషుడు దశరథాత్మజుడుగా అవతరించినప్పుడు, వేదము వాల్మీకి ద్వారా రామాయణముగ రూపొందిన దని ఆభాణకము. పురుషులలో పురుషోత్తముడగు శ్రీరామచంద్రుడు నిస్సమాభ్యధికుడైనట్లు, విశ్వసారస్వతములో శ్రీరామాయణము నిస్సమాభ్యధికమైనది. ఎంద ఱెందఱు, ఎన్నెన్ని భాషలలో, గద్య – పద్య – మిశ్ర – సంక్షేప విస్తర ప్రముఖములైన ఎన్నెన్ని రీతులలో అందించినా, శ్రీరామభక్తులకు శ్రీరామకథ యందున్న ఆసక్తికి పెరుగుదలే కాని ఒండొకటి ఉండదు. కావ్యరససంభృతమైన వాల్మీకిఫణితిని తమిళములో కంబకవియు హిందిలో తులసీదాసమహాకవియు భక్తిరససంభృతముగ రూపొందించినారు. తులసీదాసరామకథామృతపుచవులను ఆంధ్రులకు అందించుటకును యావద్భారతదేశభాషగా పట్టాభిషిక్తమై ఉన్న హిందీలో ఆంధ్రులకు ఆసక్తిని వర్ధిల్లజేయుటకును శ్రీమతి తులసీదాసదాసిగారు సర్వోపజీవ్యముగా వెలయించిన యీ గద్యాంధ్రసంక్షేపమునకు స్వాగతము. శ్రీకృష్ణచరిత్రమగు పోతనభాగవతము శ్రీరామాంకితమైనట్లు ఈ శ్రీరామకథాగద్యగ్రంథము శ్రీ అలర్మేల్మంగా సమేత శ్రీవేంకటేశ్వరస్వామికంకిత మగుట మిక్కిలి అనురూపము. ఏతద్గ్రంథమునకు ప్రభవమైన రచయిత్రి హృదయభక్తి మున్నుడులలో స్పష్ట మగుచున్నది. సౌభాగ్యవతి వారా కవి గాయత్రీ రామారావుగారి 'నివేదనము' తులసీదాస రామాయణవిశిష్టతను చక్కగా తెల్పుచున్నది. చతుర్దశభాషావిశారదులును సరస్వతీపుత్ర బిరుదాంచితులును అగు శ్రీమాన్ పుట్టపర్తి నారాయణాచార్యుల ఆశీస్సు 'తెలిసి చెప్పినమాట'గా చదువరులకు ఈ గ్రంథపఠనమున ఆసక్తి గొల్పుచున్నది. శ్రీ మోచర్ల రామకృష్ణయ్యగారు జతపఱచిన 'తులసీదాస జీవితవృత్తాంతసంగ్రహము' పఠితల ముఖ్యకుతూహలమును తీర్చుచున్నది. ఏడు సోపానములలో తేటతెనుగున పొందుపడిన రామకథ నడుమ నడుమ ఉదాహృతములైన మూల హిందిపద్యాలతో కూడి భగవత్కథారస తృషితసంతర్పణదక్షమై ఉన్నది. రామభక్తు లెల్లరు దీనిని చదివి ఆనందింతురు గాక.

ప్రభాకర్.

# స్వామి - శిష్య సంవాదములు

(శ్రీమద్వివేకానందస్వామితోడి సంభాషణలు)

అనువాదకులు : కీ. శే. కందుకూరు మల్లికార్జునంగారు

సాంసారిక సమస్యలు పరిష్కరించుకొనదలచినను సమాధిస్థితి సాధింపదలచినను ; రాజకీయవిశేషము లాకళింపదలచినను, లలితకళారహస్యము లవగతముచేసికొనదలచినను — ఇంతేల, లౌకికాలౌకిక విషయములలో వేనినిగుఱించిగాని మీ పరిజ్ఞానము వృద్ధి గావించుకొన దలచినచో ఈ గ్రంథమును తప్పక చదువుడు. నవభారతభాగ్యవిధాత శ్రీమద్వివేకానందస్వామిచంద్రులు శిష్యులతో కావించిన యీ ప్రసంగములలో వారి అనుభవసర్వస్వము రాశీభూతమై యున్నది. సులభశైలి, హృదయమును పట్టి యిచ్చు సంభాషణలు, ముచ్చటైన అచ్చుకూర్పు.

పుటలు : 552+12; అకారాది అనుక్రమణిక వెల : రూ. 5/-

# శ్రీమద్భగవద్గీత

అనువాదకులు : శ్రీ నిర్వికల్పానందస్వాములవారు

ఇది మూలశ్లోకములు, ప్రతిపదార్థము, ధారాళమగు అనువాదము, శ్రీధరీయ టీకాసారము, విశేషాంశములు, సానువాదగీతాపాఠక్రమము, ధ్యానమాహాత్మ్యములు, సమభావాత్మకములగు ఉపనిషద్వాక్యసూచిక, వేదాంతసూత్రసూచిక, గీతాశ్లోకసూచిక, శబ్దానుక్రమణిక—ఇన్నిటితో విరాజిల్లుచున్నది.

పుటలు : 480 (అందమయిన అయిదవ కూర్పు) వెల : రూ. 4

# పారమార్థిక సంభాషణలు

అనువాదకులు : కీ. శే. కందుకూరు మల్లికార్జునంగారు

శ్రీరామకృష్ణదేవుని స్వశిష్యవర్గములోని ఆర్గురు జ్ఞానసిద్ధులు శిష్యులతోడను, భక్తులతోడను చేసిన పరమార్థ విషయక సంభాషణ కతిపయములు. ఎన్నెన్నో గ్రంథములు చదివినగాని తీఱని ఆధ్యాత్మిక సంశయము లీ గ్రంథమూలమున అవలీలగా తీఱును.

పుటలు : 402 (మనోజ్ఞమగు ప్రథమ ముద్రణము) వెల : రూ. 3/-

సంపాదకులు : శ్రీ శుద్ధసత్త్వానందస్వామి, శ్రీ గోలటూరి భక్తవత్సలము,
శ్రీ. కే. ఎస్. ఎస్. రాజన్ గారిచే ది జూపిటర్ ప్రెస్స్ ప్రైవేట్ లిమిటెడ్ (మద్రాసు - 18) న ముద్రింపబడి,
శ్రీ శుద్ధసత్త్వానందస్వామిచే శ్రీ రామకృష్ణమఠము (మైలాపూరు) నుండి ప్రచురింపబడినది.

# OUR ENGLISH PUBLICATIONS

| | *Price.* Rs. | nP. |
|---|---|---|
| Sri Ramakrishna the Great Master (2nd Edn.) (Calico) | 25 | 00 |
| „ „ (Morocco) | 35 | 00 |
| The Gospel of Sri Ramakrishna (3rd Edn.) (Calico) | 20 | 00 |
| „ „ (Morocco) | 30 | 00 |
| Ramakrishna: Prophet of New India | 10 | 00 |
| Sri Ramakrishna .. | 1 | 50 |
| Sayings of Sri Ramakrishna (9th Edn.) | | 00 |
| Ramakrishna Upanishad (2nd Edn.) | | 00 |
| Tales and Parables of Sri Ramakrishna (2nd Edn.) | 2 | 50 |
| The Ramakrishna Mission its ideals and activities .. | 0 | 50 |
| Sri Ramakrishna and His Mission (2nd Edn.) | 0 | 62 |
| The Master and the Disciple .. | | 00 |
| Sri Ramakrishna and Sarada Devi | | 50 |
| Holy Mother Sri Sarada Devi (Gambhiranandaji) (Ordinary) | 7 | 00 |
| „ „ (Calico) | 9 | 00 |
| Sri Sarada Devi the Holy Mother (Tapasyanandaji) (Ordinary) | 6 | 50 |
| „ „ (Calico) | 8 | 00 |
| Inspired Talks (Swami Vivekananda) (8th Edn.) (Board) | 2 | 00 |
| „ „ (Calico) | 3 | 00 |
| Hinduism (4th Edn.) .. | 1 | 00 |
| Education (6th Edn.) .. | 1 | 00 |
| The Eternal Companion (3rd Edn.) (Ordinary) | 2 | 25 |
| „ „ (Calico) | 3 | 25 |
| For Thinkers on Education (Swami Ramakrishnananda) | 3 | 00 |
| The Story of a Dedicated Life (Life of Swami Ramakrishnananda) | 3 | 00 |
| The Message of Eternal Wisdom (Swami Ramakrishnananda) | 3 | 00 |
| God and Divine Incarnations (Swami Ramakrishnananda) | 2 | 25 |
| The Ancient Quest (Swami Ramakrishnananda) | 1 | 50 |
| Sri Krishna, The Pastoral and King-maker) (Swami Ramakrishnananda) (5th Edn.) | 1 | 25 |
| Life of Sri Ramanuja (Board) | 4 | 00 |
| „ „ (Cloth) | 5 | 00 |
| Isavasya Upanishad (7th Edn.) | 0 | 75 |
| Kena Upanishad (6th Edn.) | 0 | 75 |
| Katha Upanishad (8th Edn.) | 1 | 50 |
| Adventures in Religious Life (2nd Edn.) (Board) | 4 | 00 |
| (Clcth) | 5 | 00 |

| | *Price.* Rs. | nP. |
|---|---|---|
| Prasna Upanishad (5th Edn.) .. | 1 | 00 |
| Mundaka Upanishad (6th Edn.) .. | 1 | 00 |
| Mandukya Upanishad (7th Edn.) .. | 0 | 75 |
| Taittiriya Upanishad (4th Edn.) .. | 2 | 00 |
| Aitareya Upanishad (3rd Edn.) .. | 1 | 00 |
| Svetasvatara Upanishad (3rd Edn.) | 1 | 50 |
| Chandogya Upanishad .. | 8 | 00 |
| Brihadaranyaka Upanishad (2nd Edn.) | 7 | 50 |
| Mahanarayanopanishad .. | 5 | 00 |
| Srimad-Bhagavad-Gita (Swami Vireswarananda, with Sridhara's Gloss) .. | 7 | 00 |
| Bhagavad-Gita: the Song of God (4th Edn.) | 2 | 75 |
| Upadeshasahasri .. | 3 | 50 |
| Atmabodha .. | 4 | 00 |
| Yatindramatadipika .. | 5 | 00 |
| Srimad Bhagavatam: The Wisdom of God .. | 3 | 50 |
| Stotraratna (2nd Edn.) .. | 0 | 75 |
| Divine Life (4th Edn.) .. | 3 | 00 |
| Universal Prayers (5th Edn.) .. | 2 | 25 |
| Prince of Ayodhya (Ordinary) | 3 | 00 |
| „ „ (Calico) | 4 | 50 |
| Vedic Religion and Philosophy (4th Edn.) | 2 | 50 |
| Narada Bhakti Sutras (3rd Edn.) .. | 3 | 00 |
| Vakyavritti & Atmajnanopadeshavidhi (2nd Edn.) .. | 1 | 00 |
| Devi-Mahatmyam (Chandi) (2nd Edn.) | 2 | 00 |
| Saint Durga Charan Nag (3rd Edn.) | 2 | 25 |
| Thus Spake Sri Ramakrishna (7th Edn.) | 0 | 40 |
| Thus Spake The Holy Mother (2nd Edn.) | 0 | 37 |
| Thus Spake Vivekananda (8th Edn.) | 0 | 40 |
| Thus Spake The Buddha (2nd Edn.) | 0 | 40 |
| Thus Spake Sri Krishna (2nd Edn.) | 0 | 40 |
| Thus Spake The Christ (2nd Edn.) | 0 | 40 |
| Worship of Sri Ramakrishna .. | 1 | 00 |
| A Man of God (Ordinary) | 3 | 00 |
| „ „ (Calico) | 4 | 00 |
| Buddha and Our Heritage .. | 0 | 40 |
| Swami Vivekananda, My Master .. | 0 | 37 |
| Path to Perfection .. | 0 | 37 |
| Consolations .. | 0 | 31 |
| Women of India .. | 0 | 25 |
| Spiritual Life .. | 0 | 06 |
| Path Beyond Sorrow .. | 0 | 06 |

**Please ask for the Detailed Catalogues of our Tamil and Telugu Books**

**SRI RAMAKRISHNA MATH,** ***Publication Dept.,*** **MYLAPORE, MADRAS-4**

# వంటచేస్తూనే విశ్రమించండి

ಅಡಿಗೆಯು ನಿಮಗೆ ಭೀಕರ ಶ್ರಮವಾಗಿರಬಲ್ಲುದು, ಈ ಆಶ್ಚರ್ಯಕರ ಕೆರೊಸಿನ್ ಕುಕರ್ ಸೌಕರ್ಯವನ್ನು ನೀವು ತಿಳಿದುಕೊಳ್ಳುವವರೆಗೆ. ಬೇಕಾದ ಕಾಲದಲ್ಲಿ ಅಡಿಗೆ ಮಾಡಿರಿ— ಪರಿಶ್ರಮವಿಲ್ಲ.

... ಮುರಿಯ ಬೇಕಾಗಿಲ್ಲ, ಬೆಂಕಿ ... ಬೇಕಾಗಿಲ್ಲ, ಕಣ್ಣಿಗೆ ಹೊಗೆಯಿಲ್ಲ ಮತ್ತು ಹಿಳಿ ಮಾಳಿಗೆಯಲ್ಲಿ ಮಸಿಯಾಗದು. ಈ ಹೊಸ ಕುಕರ್ ಸ್ವಚ್ಛ, ನೇರ ಮತ್ತು ಸರಳ-ದುಡಿಮೆ, ಬೆವರು ಅಥವಾ ಕಂಬನಿಗಳಿಲ್ಲ.

- మురికి, దుమ్ము వుండవు, మసి పట్టదు, మంటలు లేవవు
- ఖర్చు చాలా తక్కువ, పూర్తిగా సురక్షితమైనది
- తేలికగా ఎక్కడికి వడితే అక్కడికి తీసికొని వెళ్లవచ్చు




# ఖాస్ జనా
## కిరోసిన్ కుక్కర్

వంట బాగా

ఉత్పత్తిదారులు :

**ది ఓరియంటల్ మెటల్ ఇండస్ట్రీస్ ప్రైవేట్ లిమిటెడ్**

[illegible], బౌబజార్ స్ట్రీట్, కలకత్తా-12

KALPANA O. M. 1578

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటము ౧౮ ౧౯౬౨, మే; శుభకృత్తు - వైశాఖము సంచిక ౧౧

## విషయసూచిక



'అఖిలవిభు శరణొందుము, యా క్షణంబ యతనికృప నీకు ననుభావ్య మగును వత్స.'

—శ్రీ శారదామణి.



# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము ౧౮ } ౧౯౬౨ – మే :: శుభకృత్తు – వైశాఖము { సంచిక ౧౧



శ్రీః

## సౌందర్యలహరి


మూలము : శ్రీ శంకరభగవత్పాదులు

టీక : నే. భ.


చతుష్షష్ట్యా తన్త్రైః స్సకల మతిసన్ధాయ భువనం
స్థిత స్త త్త త్సిద్ధిప్రసవపరతన్త్రైః పశుపతిః
పున స్త్వ న్నిర్బన్ధా దఖిలపురుషార్థైక ఘటనా
స్వతన్త్రం తే తన్త్రం క్షితితల మవాతీతర దిదమ్ ॥

| | | | |
|---|---|---|---|
| (హే భగవతి) | (అమ్మా) | స్థితః | ఉన్నవాడగు |
| తత్ తత్ | (వశ్య - ఆకర్షణ - మోహన - ఉచ్చాటనాదులగు) ఆయా | పశుపతిః | పరమశివుడు |
| | | పునః | మరల |
| | | త్వత్ | నీ (వు) |
| సిద్ధిప్రసవ | సిద్ధులను గల్గించు, బాధ్యతకు | నిర్బన్ధాత్ | నిర్బంధించి చేయుటచే |
| పరతన్త్రైః | లోబడినవగు | అఖిల | సమస్త |
| తన్త్రైః | తంత్రాల | పురుషార్థ | పురుషార్థములను |
| చతుష్షష్ట్యా | అరువదినాల్గింటిచేత | ఏక | ముఖ్యముగా |
| సకలం | సమస్త | ఘటనా | సమకూర్చుటయందు |
| భువనం | లోకమును | స్వతన్త్రం | అమోఘమైన |
| అతిసన్ధాయ | వంచించి | తే | నీ |

| | | | |
|---|---|---|---|
| ఇదం | ఈ (చెప్పనున్న) | క్షితితలం | భూతలమున |
| తన్త్రం | తంత్రమును (మంత్రరహస్యమును) | అవాతీతరత్ | అవతరింపజేసెను. |

తా॥ తంత్రములు అఱువదినాలు గున్నవి. అవి 'వశీకరణము' 'ఆకర్షణము' 'మోహనము' 'ఉచ్చాటనము' మున్నగు సిద్ధులను తప్పక కలిగించును. ఆ తంత్రములచే పరమశివుడు ఈ సమస్తలోకములను వంచించుచు(న్నట్లు)న్నాడు కాని లోకానుగ్రహదీక్షిత వగు నీ నిర్బంధముచేత ఆయనే మరల ఈ చెప్పబడబోవు నీ తంత్రమును (మంత్రరహస్యమును) భూలోకమున అవతరింపజేసెను. నీ తంత్రము సమస్తపురుషార్థములను సమకూర్చుటలో అమోఘమైనది.

శివ శ్శక్తిః కామః క్షితి రథ రవి శ్శీతకిరణః
స్మరో హంస శ్శక్ర స్తదను చ పరామారహరయః
అమీ హృల్లేఖాభి స్తిసృభి రవసానేషు ఘటితాః
భజన్తే వర్ణాస్తే తవజనని నామావయవతామ్ ॥ 32

| | |
|---|---|
| హే జనని | ఓ అమ్మా |
| శివః | కకారమును |
| శక్తిః | ఏకారమును |
| కామః | ఈకారమును |
| క్షితిః | లకారమును |
| అథ | అంతట |
| రవిః | హకారమును |
| శీత కిరణః | సకారమును |
| స్మరః | కకారమును |
| హంసః | హకారమును |
| శక్రః | లకారమును |
| తదనుచ | ఆ వెనుక |
| పరా | సకారమును |
| మారః | కకారమును |
| హరిః | లకారమును |

| | |
|---|---|
| ఇతి అమీ | అను ఈ పంద్రెండు |
| వర్ణాః | అక్షరములు |
| తిసృభిః | త్రిత్వవిశిష్టములగు |
| హృల్లేఖాభిః | హ్రీంకారములతో |
| అవసానేషు | విరామస్థానములలో [నాల్గింటికి ఐదింటికి మూటికి పైని] |
| ఘటితాః | యోజితములైనచో |
| | ఆ |
| వర్ణాః | కకారాదులు |
| తవ | నీ |
| నామావయవతామ్ | త్రిపురసుందరీ మంత్ర ప్రతీకత్వమును |
| భజన్తే | ప్రాపించును. |

తా॥ అమ్మా, కకారము, ఏకారము, ఈకారము, లకారము — హకారము, సకారము, కకారము, హకారము, లకారము — సకారము, కకారము, లకారము — ఈ పంద్రెండు అక్షరములును, విరామస్థానములందు కూర్పబడ్డ హ్రీంకారములు మూడింటితో కూడినచో, నీ 'త్రిపురసుందరీ మంత్ర ప్రతీకత్వము'ను భజించును.

స్మరం యోనిం లక్ష్మీం త్రితయ మిద మాదౌ తవ మనో
ర్నిధా యైకే నిత్యే నిరవధిమహాభోగరసికాః
భజన్తి త్వాం చిన్తామణిగుణనిబద్ధాక్షవలయా
శివాగ్నౌ జుహ్వన్త స్సురభిఘృతధారాహుతిశతైః ॥

| | | | |
|---|---|---|---|
| హే నిత్యే | ఓ నిత్యురాలా | త్రితయం | మూడింటిని |
| నిరవధి | అంతులేని | నిధాయ | కూర్చి |
| మహాభోగ | మహైశ్వర్య సుఖానుభవమందు | చిన్తామణిగుణ | చింతామణిసమూహము |
| | | నిబద్ధ | గ్రువ్వబడిన |
| రసికాః | రుచిగలవారై | అక్షవలయః | జపమాలగలవారై (జపించి అనుట) |
| ఏకే | కొందఱు | | |
| తవ | నీ | శివాగ్నౌ | త్రికోణమందున్న అగ్నిలో |
| మనోః | మంత్రమునకు | సురభిఘృతధారా | ఈగియావు నేతిధారల (పరిమళించు నేతిధారల) |
| ఆదౌ | ముందు | | |
| స్మరం | మదనబీజమును | ఆహుతిశతైః | నూర్లకొలది ఆహుతులతో |
| యోనిం | భువనేశ్వరీ బీజమును | జుహ్వన్తః | వ్రేల్చుచు |
| లక్ష్మీం | శ్రీం బీజమును | త్వాం | నిన్ను |
| ఇదం | ఈ | భజన్తి | ఆరాధింతురు. |

తా॥ ఓ నిత్యమాతా, అంతు లేని గొప్పభోగములందు ఆశగలవారు కొందఱు అందుకై నిన్నారాధింతురు — ఎట్లనగా నీ మంత్రమునకు ముందు 'మదన' 'భువనేశ్వరీ' 'రమా' బీజములను కూర్చుకొని చింతామణులు గ్రువ్వబడ్డ జపమాలతో జపింతురు, త్రికోణముననున్న శివాగ్నిలో కామధేనుఘృతధారల ఆహుతులను నూర్లకొలదిగా వేల్తురు.

శరీరం త్వం శమ్భో శ్శశి మిహిర వక్షోరుహయుగం
త వాత్మానం మన్యే భగవతి నవాత్మాన మనఘమ్
అత శ్శేష శ్శేషీ త్యయ ముభయసాధారణతయా
స్థిత స్సమ్బన్ధో వా సమరసపరానన్దపరయోః ॥ ౩౪

| | | | |
|---|---|---|---|
| హే భగవతి | ఓ షడ్గుణైశ్వర్యసంపన్నా | ఆత్మానం | దేహమును |
| త్వం | నీవు | అనఘం | నిర్దోషమనియు |
| శమ్భోః | పరమశివునకు | నవాత్మానం | నవసంఖ్యాత్మకమనియు |
| శశి | చంద్రబింబమును | మన్యే | తలంతును; గుర్తింతును |
| మిహిర | సూర్యబింబమును | అతః | కావున |
| వక్షోరుహయుగం | చనుగవగా గల | శేషః | అప్రధానము |
| శరీరం | దేహమవు | శేషీ | ప్రధానము |
| తవ | మహాభైరవివగు నీ | ఇతి | అను |

| | | | |
|---|---|---|---|
| ఇదం | ఈ (చెప్పనున్న) | క్షితితలం | భూతలమున |
| తన్త్రం | తంత్రమును (మంత్రరహస్య మును) | అవాతీతరత్ | అవతరింపజేసెను |

తా॥ తంత్రములు అఱువదినాలు గున్నవి. అవి 'వశీకరణము' 'ఆకర్షణము' 'మోహనము' 'ఉచ్చాటనము' మున్నగు సిద్ధులను తప్పక కలిగించును. ఆ తంత్రములచే పరమశివుడు ఈ సమస్తలోకములను వంచించుచు(న్నట్లు)న్నాడు కాని లోకానుగ్రహదీక్షిత వగు నీ నిర్బంధముచేత ఆయనే మరల ఈ చెప్పబడబోవు నీ తంత్రమును (మంత్రరహస్యమును) భూలోకమున అవతరింపజేసెను. నీ తంత్రము సమస్తపురుషార్థములను సమకూర్చుటలో అమోఘమైనది.

శివ శ్శక్తిః కామః క్షితి రథ రవి శ్శీతకిరణః
స్స్మరో హంస శ్శక్ర స్తదను చ పరామారహరయః
అమీ హృల్లేఖాభి స్తిసృభి రవసానేషు ఘటితాః
భజన్తే వర్ణా స్తే తవజనని నామావయవతామ్ ॥ 32

| | | | |
|---|---|---|---|
| హే జనని | ఓ అమ్మా | ఇతి అమీ | అను ఈ పండ్రెండు |
| శివః | కకారమును | వర్ణాః | అక్షరములు |
| శక్తిః | ఏకారమును | తిసృభిః | త్రిత్వవిశిష్టములగు |
| కామః | ఈకారమును | హృల్లేఖాభిః | హ్రీంకారములతో |
| క్షితిః | లకారమును | అవసానేషు | విరామస్థానములలో [నాల్గింటికి ఐదింటికి మూటికి పైని] |
| అథ | అంతట | | |
| రవిః | హకారమును | | |
| శీత కిరణః | సకారమును | ఘటితాః | యోజితములైనచో |
| స్మరః | కకారమును | | ఆ |
| హంసః | హకారమును | వర్ణాః | కకారాదులు |
| | లకారమును | తవ | నీ |
| తదనుచ | ఆ వెనుక | నామావయవతామ్ | త్రిపురసుందరీ మంత్ర ప్రతీకత్వమును |
| పరా | సకారమును | | |
| మారః | కకారమును | భజన్తే | ప్రాపించును. |
| హరిః | లకారమును | | |

తా॥ అమ్మా, కకారము, ఏకారము, ఈకారము, లకారము — హకారము, సకారము, కకారము, హకారము, లకారము — సకారము, కకారము, లకారము — ఈ పండ్రెండు అక్షరములును, విరామస్థానములందు కూర్పబడ్డ హ్రీంకారములు మూడింటితో కూడినచో, నీ 'త్రిపురసుందరీ మంత్ర ప్రతీకత్వము'ను భజించును.

స్మరం యోనిం లక్ష్మీం త్రితయ మిద మాదౌ తవ మనో
ర్నిధా యైకే నిత్యే నిరవధిమహాభోగరసికాః
భజన్తి త్వాం చిన్తామణిగుణనిబద్ధాక్షవలయాః
శివాగ్నౌ జుహ్వన్త స్సురభిఘృతధారాహుతిశతైః ॥ ౩౩

| | | | |
|---|---|---|---|
| హే నిత్యే | ఓ నిత్యురాలా | త్రితయం | మూడింటిని |
| నిరవధి | అంతులేని | నిధాయ | కూర్చి |
| మహాభోగ | మహైశ్వర్య సుఖానుభవమందు | చిన్తామణిగుణ | చింతామణిసమూహము |
| | | నిబద్ధ | గ్రువ్వబడిన |
| రసికాః | రుచిగలవారై | అక్షవలయః | జపమాలగలవారై (జపించి అనుట) |
| ఏకే | కొందఱు | | |
| తవ | నీ | శివాగ్నౌ | త్రికోణమందున్న అగ్నిలో |
| మనోః | మంత్రమునకు ముందు | సురభిఘృతధారా | ఈగియావు నేతిధారల (పరిమళించు నేతిధారల) |
| స్మరం | మదనబీజమును | ఆహుతిశతైః | నూర్లకొలది ఆహుతులతో |
| యోనిం | భువనేశ్వరీ బీజమును | జుహ్వన్తః | వ్రేల్చుచు |
| లక్ష్మీం | శ్రీం బీజమును | త్వాం | నిన్ను |
| ఇదం | ఈ | భజన్తి | ఆరాధింతురు. |

తా॥ ఓ నిత్యమాతా, అంతు లేని గొప్పభోగములందు ఆశగలవారు కొందఱు అందుకై నిన్నారాధింతురు — ఎట్లనగా నీ మంత్రమునకు ముందు 'మదన' 'భువనేశ్వరీ' 'రమా' బీజములను కూర్చుకొని చింతామణులు గ్రువ్వబడ్డ జపమాలతో జపింతురు, త్రికోణముననున్న శివాగ్నిలో కామధేనుఘృతధారల ఆహుతులను నూర్లకొలదిగా వేల్తురు.

శరీరం త్వం శమ్భో శ్శశి మిహిర వక్షోరుహయుగం
త వాత్మానం మన్యే భగవతి నవాత్మాన మనఘమ్
అత శ్శేష శ్శేషీ త్యయ ముభయసాధారణతయా
స్థిత స్సమ్బన్ధో వా సమరసపరానన్దపరయోః ॥ ౩౪

| | | | |
|---|---|---|---|
| హే భగవతి | ఓ షడ్గుణైశ్వర్యసంపన్నా | ఆత్మానం | దేహమును |
| త్వం | నీవు | అనఘం | నిర్దోషమనియు |
| శమ్భోః | పరమశివునకు | నవాత్మానం | నవసంఖ్యాత్మకమనియు |
| శశి | చంద్రబింబమును | మన్యే | తలంతును; గుర్తింతును |
| మిహిర | సూర్యబింబమును | అతః | కావున |
| వక్షోరుహయుగం | చనుగవగా గల | శేషః | అప్రధానము |
| శరీరం | దేహమవు | శేషీ | ప్రధానము |
| తవ | మహాభైరవివగు నీ | ఇతి | అను |

| | | | |
|---|---|---|---|
| అయం సమ్బన్ధః | ఈ చుట్టఱికము | వాం | మీకు |
| సమరస | సమాన సుఖానుభవ | ఉభయసాధారణతయా | ఉభయులకును ఉమ్మడిదై |
| పరానన్దపరయోః | పరమానందపరులగు | | ఉన్నది. |

తా॥ అమ్మా, నీవు పరమశివునకు దేహమవు. చంద్రసూర్యబింబములే ఈ మేనియందలి చనుగవ. ఆనందభైరవుని మేనివలె మహాభైరవివగు నీమేనును నిర్మలము నవసంఖ్యాత్మకము. నీకు ఆయన శేషి, ఆయనకు నీవు శేషి, నీకు ఆయన శేషము ఆయనకు నీవు శేషము, ఇట్లు శేషశేషిసంబంధము సమరసపరానందసంపన్నులగు మీ ఇరువురకు సాధారణము.

మన స్త్వం, వ్యోమ త్వం, మరు దసి, మరుత్సారథి రసి,
త్వ మాప, స్త్వం భూమి, స్త్వయి పరిణతాయాం న హి పరమ్ ;
త్వ మేవ స్వాత్మానం పరిణమయితుం విశ్వవపుషా
చిదానన్దాకారం శివయువతిభావేన బిభృషే॥

| | | | |
|---|---|---|---|
| (హేభగవతి) | (అమ్మా) | త్వయి | నీవు |
| మనః | మ స్తత్త్వము | పరిణతాయాం | (ఇన్నితత్త్వములుగను) పరిణమించిన దానవుకాగా |
| త్వం | నీవు | | |
| వ్యోమ | ఆకాశతత్త్వము | పరం | (నీకంటె) వేఱైనది |
| త్వం | నీవు | నహి | లేదు కదా |
| మరుత్ | వాయుతత్త్వము | త్వమేవ | నీవే |
| అసి | నీవు | స్వాత్మానం | స్వస్వరూపమును |
| మరుత్సారథిః | అగ్నితత్త్వము | విశ్వవపుషా | విశ్వాకారముతో |
| అసి | నీవు | పరిణమయితుం | పరిణమింపజేయుటకు |
| ఆపః | జలతత్త్వము | శివయువతిభావేన | హరపత్నివిగా |
| త్వం | నీవు | చిదానన్దాకారం | చిచ్ఛక్తి రూపమును ఆనందభైరవాకారమును |
| భూమిః | భూమితత్త్వము | | |
| త్వం | నీవు | బిభృషే | వహింతువు. |

తా॥ అమ్మా, ఆజ్ఞాచక్రమందున్న మనస్తత్త్వము, విశుద్ధిచక్రమందున్న ఆకాశతత్త్వము అనాహతమనెడి సంవిచ్చక్రమున నున్న వాయుతత్త్వము, స్వాధిష్ఠానచక్రమందున్న అగ్నితత్త్వము, మణిపూరచక్రమందున్న జలతత్త్వము, మూలాధారచక్రమందున్న భూతత్త్వము— ఇన్ని తత్త్వములుగ నీవు పరిణమించితివి. నీకంటె పరము లేదు. స్వస్వరూపమును జగద్రూపమున పరిణమింపజేసికొనుటకై హరపత్నివిగా చిదానందరూపమును దాల్తువు.

# శ్రీ బ్రహ్మానందస్వామి

## [సంపాదకీయము]

(గతసంచిక తరువాయి)

"రాజు" మఠమునకు చేరుకొనగనే, అచట నొక గొప్ప ఊపును ఉత్సాహమును కలిగినవి. అతని సాహచర్యభాగ్యము లభించినందుకు ప్రతివాడును సంతోషించెను. పరిసరములకు ఒక ఉదాత్తతను కలిగించు ప్రభావము ఆయన సాన్నిధ్యమునకే కలదు. ఆయన మఠమునకు మరలి వచ్చినప్పుడు అచటివారిలో ఆధ్యాత్మికాభివృద్ధి ఉత్సాహము ఒకనూతన తరంగముగ పర్వినది. శ్రీరామకృష్ణునిసందేశము ప్రపంచప్రజల హృదయమునకు అంత హెచ్చుగ నచ్చినందులకు స్వామి సంతోషించెను. గురుదేవుని ఆయన ఎఱుగును. కావున గురుదేవుని సందేశము జనప్రీతికరమైనందులకు ఆయన ఆశ్చర్యపడ లేదు. కాని సందేశప్రచారమునకు మఠము నొక అమోఘసాధనముగ చేయవలెనని ఆయన కోరెను. ఒకసారి ఆయన గురుభాయిలతో ఇట్లనెను. "మీ జీవితము మీ మఠము విపన్నులకును భారభుగ్నులకును నిర్వృతిని ఆసపాటును ఉత్సాహమును కలిగించును. అందుకు తగినట్లు మీ జీవితములను రూపొందించుకొనుడు." రాజా మఠమునకు మరల వచ్చి చేరినాడను వార్త అమెరికాలో నున్న శ్రీవివేకానందస్వామి చెవిని బడినపుడు ఆయన ఎంతో ఊరట చెందెను. ఏల యన శ్రీబ్రహ్మానందస్వాముల అభిప్రాయము లనినను, నిర్ణయము లనినను ఆయన కెంతో గౌరవము. ఒకరాజ్యము నేలు సామర్థ్యము రాఖాలున కున్న దని గురుదేవుడే చెప్పి ఉండ లేదా! కొండమీదినుండి దొర్లి పడెడు మంచుగడ్డవలె వివేకానందస్వామి విశ్వముపై పడెను. తన సందేశము నందించుటకై ప్రపంచములోని ఒక మూలనుండి ఇంకొక మూలకు ఆయన ఒకసుడిగాలివలె సంచరించెను. ఆయన చుఱుకు గలవాడు. కార్యనిమగ్నుడు. ఆయనయే చెప్పినట్లుగ తన సందేశమున కొక సమగ్రతను పరిపూర్తిని కలిగించుటకు ఆయనకు వ్యవధి లేదాయెను. రామకృష్ణసంస్థవఱకు చూతు మేని అపారశాంతము, ఓర్పు, అసాధారణవివేకము బుద్ధి గల బ్రహ్మానందస్వామి శ్రీవివేకానందస్వాముల సందేశమును భారతభూమిలో సఫలమొనర్చెను. శ్రీవివేకానందస్వామి మేఘగర్జనను బోలిన తనకంఠమును లోకమున ప్రయోగించెను. శ్రీబ్రహ్మానందస్వామి జీవితము—ఎవరికిని తెలియక, ఎవరికిని కనబడక నెమ్మదిగ స్రవించి శరదృతువులో పైరును సమృద్ధముగ పండించెడి మంచునీరువంటిది.

శ్రీబ్రహ్మానందస్వామి మఠమునకు మరలి వచ్చిన రెండేండ్లకు శ్రీవివేకానందస్వామియు భారతదేశమునకు మరలి వచ్చెను. ఆ మహాస్వామి శ్రీబ్రహ్మానందస్వామిని కలిసికొని భారతదేశములోని కార్యక్రమమునకై తాను వసూలు చేసి తెచ్చిన ధనమునంతటిని అతని చేతి కిచ్చివేసి "ఇప్పుడు నాకు నిబ్బరము కల్గినది. పవిత్రమైన ఆ ధర్మధనమును సరియైన

| | | | |
|---|---|---|---|
| అయం సమ్బన్ధః | ఈ చుట్టఱికము | వాం | మీకు |
| సమరస | సమాన సుఖానుభవ | ఉభయసాధారణతయా | ఉభయులకును ఉమ్మడిదై |
| పరానన్దపరయోః | పరమానందపరులగు | స్థితః | ఉన్నది. |

తా॥ అమ్మా, నీవు పరమశివునకు దేహమవు. చంద్రసూర్యబింబములే ఈ మేనియందలి చనుగవ. ఆనందభైరవుని మేనివలె మహాభైరవివగు నీమేనును నిర్మలము నవసంఖ్యాత్మకము. నీకు ఆయన శేషి, ఆయనకు నీవు శేషి, నీకు ఆయన శేషము ఆయనకు నీవు శేషము. ఇట్లు శేషశేషిసంబంధము సమరసపరానందసంపన్నులగు మీ ఇరువురకు సాధారణము.

మన స్త్వం, వ్యోమ త్వం, మరు దసి, మరుత్సారథి రసి,
త్వ మాప, స్త్వం భూమి, స్త్వయి పరిణతాయాం న హి పరమ్
త్వ మేవ స్వాత్మానం పరిణమయితుం విశ్వవపుషా
చిదానన్దాకారం శివయువతిభావేన బిభృషే॥ ౩౫

| | | | |
|---|---|---|---|
| (హేభగవతి) | (అమ్మా) | త్వయి | నీవు |
| మనః | మనస్తత్త్వము | పరిణతాయాం | (ఇన్నితత్త్వములుగను) పరిణమించిన దానవుకాగా |
| త్వం | నీవు | | |
| వ్యోమ | ఆకాశతత్త్వము | పరం | (నీకంటె) వేఱైనది |
| త్వం | నీవు | నహి | లేదు కదా |
| మరుత్ | వాయుతత్త్వము | త్వమేవ | నీవే |
| అసి | నీవు | స్వాత్మానం | స్వస్వరూపమును |
| మరుత్సారథిః | అగ్నితత్త్వము | విశ్వవపుషా | విశ్వాకారముతో |
| అసి | నీవు | పరిణమయితుం | పరిణమింపజేయుటకు |
| ఆపః | జలతత్త్వము | శివయువతిభావేన | హరపత్నివిగా |
| త్వం | నీవు | చిదానన్దాకారం | చిచ్ఛక్తి రూపమును ఆనందభైరవాకారమును |
| భూమిః | భూమితత్త్వము | | |
| త్వం | నీవు | బిభృషే | వహింతువు. |

తా॥ అమ్మా, ఆజ్ఞాచక్రమందున్న మనస్తత్త్వము, విశుద్ధిచక్రమందున్న ఆకాశతత్త్వము అనాహతమనెడి సంవిచ్చక్రమున నున్న వాయుతత్త్వము, స్వాధిష్ఠానచక్రమందున్న అగ్నితత్త్వము, మణిపూరచక్రమందున్న జలతత్త్వము, మూలాధారచక్రమందున్న భూతత్త్వము— ఇన్ని తత్త్వములుగ నీవు పరిణమించితివి. నీకంటె పరము లేదు. స్వస్వరూపమును జగద్రూపమున పరిణమింపజేసికొనుటకై హరపత్నివిగా చిదానందరూపమును దాల్తువు.

# శ్రీ బ్రహ్మానందస్వామి

## [సంపాదకీయము]

(గతసంచిక తరువాయి)

"రాజు" మఠమునకు చేరుకొనగనే, అచట నొక గొప్ప ఊపును ఉత్సాహమును కలిగినవి. అతని సాహచర్యభాగ్యము లభించినందుకు ప్రతివాడును సంతోషించెను. పరిసరములకు ఒక ఉదాత్తతను కలిగించు ప్రభావము ఆయన సాన్నిధ్యమునకే కలదు. ఆయన మఠమునకు మరలి వచ్చినప్పుడు అచటివారిలో ఆధ్యాత్మికాభివృద్ధి ఉత్సాహము ఒకనూతన తరంగముగ పర్వినది. శ్రీరామకృష్ణునిసందేశము ప్రపంచప్రజల హృదయమునకు అంత హెచ్చుగ నచ్చినందులకు స్వామి సంతోషించెను. గురుదేవుని ఆయన ఎఱుగును. కావున గురుదేవుని సందేశము జనప్రీతికరమైనందులకు ఆయన ఆశ్చర్యపడ లేదు. కాని సందేశప్రచారమునకు మఠము నొక అమోఘసాధనముగ చేయవలెనని ఆయన కోరెను. ఒకసారి ఆయన గురుభాయిలతో ఇట్లనెను. "మీ జీవితము మీ మఠము విపన్నులకును భారభుగ్నులకును నిర్వృతిని ఆసపాటును ఉత్సాహమును కలిగించును. అందుకు తగినట్లు మీ జీవితములను రూపొందించుకొనుడు." రాజా మఠమునకు మరల వచ్చి చేరినాడను వార్త అమెరికాలో నున్న శ్రీ వివేకానందస్వామి చెవిని బడినపుడు ఆయన ఎంతో ఊరట చెందెను, ఏల యన శ్రీ బ్రహ్మానందస్వాముల అభిప్రాయము లనినను, నిర్ణయము లనినను ఆయన కెంతో గౌరవము. ఒకరాజ్యము నేలు సామర్థ్యము రాఖాలునకున్నదని గురుదేవుడే చెప్పి ఉండ లేదా? కొండమీదినుండి దొర్లి పడెడు మంచుగడ్డవలె వివేకానందస్వామి విశ్వముపై పడెను. తన సందేశము నందించుటకై ప్రపంచములోని ఒక మూలనుండి ఇంకొక మూలకు ఆయన ఒకసుడిగాలివలె సంచరించెను. ఆయన చుఱుకు గలవాడు. కార్యనిమగ్నుడు. ఆయనయే చెప్పినట్లుగ తన సందేశమున కొక సమగ్రతను పరిపూర్తిని కలిగించుటకు ఆయనకు వ్యవధి లేదాయెను. రామకృష్ణసంస్థవఱకు చూతు మేని అపారశాంతము, ఓర్పు, అసాధారణవివేకము బుద్ధి గల బ్రహ్మానందస్వామి శ్రీ వివేకానందస్వాముల సందేశమును భారతభూమిలో సఫలమొనర్చెను. శ్రీ వివేకానందస్వామి మేఘగర్జనను బోలిన తనకంఠమును లోకమున ప్రయోగించెను. శ్రీ బ్రహ్మానందస్వామి జీవితము—ఎవరికిని తెలియక, ఎవరికిని కనబడక నెమ్మదిగ స్రవించి శరదృతువులో పైరును సమృద్ధముగ పండించెడి మంచునీరువంటిది.

శ్రీ బ్రహ్మానందస్వామి మఠమునకు మరలి వచ్చిన రెండేండ్లకు శ్రీ వివేకానందస్వామియు భారతదేశమునకు మరలి వచ్చెను. ఆ మహాస్వామి శ్రీ బ్రహ్మానందస్వామిని కలిసికొని భారతదేశములోని కార్యక్రమమునకై తాను వసూలు చేసి తెచ్చిన ధనమునంతటిని అతని చేతి కిచ్చివేసి "ఇప్పుడు నాకు నిబ్బరము కలిగినది. పవిత్రమైన ఆ ధర్మధనమును సరియైన

వ్యక్తికి అప్పగించితిని'' అని చెప్పెను. శ్రీ బ్రహ్మానందస్వామి వివేకానందస్వామికి అన్నివిధముల మిత్రుడు, మార్గదర్శకుడు, శాస్త్రవేత్త. ఆయన ఈయన శరీరారోగ్యమును గూర్చి మెలకువ వహించెను, ప్రణాళికలనుగూర్చి సలహా చెప్పెను. ప్రయాణములకు ఏర్పాట్లు చేసెను. ఈయన సంకల్పములను ఆయన అమలుపఱచెను. రామకృష్ణమిషనుసొసైటి ప్రారంభింపబడినపుడు వివేకానందస్వామి సర్వాధ్యక్షుడయ్యెను. బ్రహ్మానందస్వామి కల్కత్తా కేంద్రాధ్యక్షుడయ్యెను. కాని 1902-వ సంవత్సరపు ప్రారంభములో వివేకానందస్వామి తన పదవిని బ్రహ్మానందస్వామికి వదలుకొనెను. బ్రహ్మానందస్వామి రామకృష్ణమఠమునకును మిషనునకును తన తుదిదినమువఱకు సర్వాధ్యక్షుడుగ ఉండెను.

వివేకానంద, బ్రహ్మానందస్వాముల సంబంధము ఆశ్చర్యకరము. చూచినవారికెల్ల అది రక్తిగొలుపును. ఉభయులును గురుదేవునకు ప్రియులు. ఉభయులను నిత్యసిద్ధులని, ఈశ్వరకోటులని అనగా తాము నిత్యముక్తులై ఉండుచునే మానవులకు శ్రేయస్సును కలిగించుటకును దారి చూపుటకును భువి నవతరించినవారు అని గురుదేవుడు పేర్కొనెడివాడు. ఉభయులును తమ బడిదినములనుండి ఒండొరులను ఆంతరంగికముగ ఎఱిగినవారు. వారి యావజ్జీవసంబంధము పరస్పరప్రేమాదరములకు అభివృద్ధినే కలిగించినది. అమెరికానుండి మరలివచ్చినపుడు వివేకానందస్వామి బ్రహ్మానందస్వామికి సాష్టాంగముగ నమస్కరించి గురు నారాధించినట్లే గురుపుత్రుని సహితము ఆరాధింపవలె నని చెప్పెను. బ్రహ్మానందస్వామికూడ హాస్యరసములో తక్కువవాడు కాడు. కావున బదులు నమస్కరించుచు ''జ్యేష్ఠభ్రాతా పితృసమానః'' అని చెప్పెను.

ఈ యాధ్యాత్మికపు పునాదితో నేర్పడిన యుభయుల చుట్టఱికము చాల ముచ్చటగొలుపునదై యుండెను. స్థానికవిషయములను సన్నిహితముగ నెఱిగినవాడుగను కార్యాచరణవివేకముగలవాడుగను బ్రహ్మానందస్వామి ఒక్కొక్కసారి వివేకానందస్వాముల ప్రణాళికను సవరింపవలసివచ్చెడిది. అట్టి సందర్భములలో వివేకానందస్వామి ఒక్కొక్కసారి కలవరపడి కోపించుచుండెను. కాని తరువాత తనతప్పు తెలిసివచ్చినప్పుడు ఆయన అనుతాపము చెందును. ఎంతగా అనుతాపము చెందు ననగా నొచ్చుకొన్నవారికే సిగ్గు కలిగించునంత, స్వామికి ఇబ్బంది కలిగించినందులకు పరితాపము చెందునంత. వివేకానందస్వామికి జంతువులపై ప్రేమ. బ్రహ్మానందస్వామికి మొక్కలపై తోటలపై ప్రేమ. ఆయన జంతువులవలన ఈయన తోటకు చెఱుపు కలిగినపుడు ఉభయులమధ్య జగడము కలుగును, దానిని చూచువారు పక్కలు చెక్కలగునట్లు నవ్వుదురు.

బ్రహ్మానందస్వామి తన పక్షమును వీడకయే యుండు నను అనంతవిశ్వాసము వివేకానందస్వామికి కలదు. ''ఇతరులు నన్ను విడిచినను విడుతురు. కాని 'రాజా' తుదివఱకు నాప్రక్కనే యుండును'' అని ఆయన చెప్పెను. గురుదేవుని పేరట ప్రారంభింపబడిన కార్యక్రమమును కొనసాగించుటకు అతిమానుషశక్తివంతులైన ఈ ఇద్దఱును భుజములు భుజములు కలిపి బేలూరులోని క్రొత్తమఠమును 1899 లో నెలకొల్పిరి, మద్రాసులో ఒక శాశ్వతకేంద్రము ప్రారంభింపబడినది. మఱియొకటి హిమాలయ ప్రాంతమున ఏర్పఱుపబడినది. తక్కినవి పెం

పొందుచుండినవి. ప్రచారకులు ఇంగ్లండునకును, అమెరికాకును పంపబడిరి. కార్యక్రమము వేగముగా వర్ధిల్లుచుండెను, కాని ఇద్దఱు స్వాములును దీర్ఘకాలము కలిసి పాటుపడలేరైరి. శ్రీ వివేకానందస్వామి జీవితము 1902లో అకాలపరిసమాప్తి నొందెను.

నాయకుని మరణముచేత ఆయన ప్రారంభించిన కార్యక్రమము చాల దెబ్బతిన్నది. గురుభాయిలకు ముఖ్యముగ సర్వబాధ్యతను ఇక వహింపవలసినవాడును సంస్థయంతటిచేతను మార్గదర్శకుడుగ ఆశ్రయింపబడువాడును అగు బ్రహ్మానందస్వామికి ఇది పెద్ద దెబ్బ. శ్రీ వివేకానందస్వామి మరణించినందువలన సొంతమునకు కలిగిన వియోగదుఃఖమును అణచుకొని ఆయన తనదృష్టిని తనపైబడిన కర్తవ్యముల వంకకు పాఱించెను.

శ్రీ బ్రహ్మానందస్వామి పనిచేయుపద్ధతి ఆశ్చర్యకరము. ఆయన కుండిన బాధ్యతలు సామాన్యమానవునికి దుర్భరములే యైనను మనశ్శాంతి ఆయన కెప్పుడును చెడలేదు, మనఃప్రసన్నత ఎప్పుడును చెదరలేదు. కర్మరహస్యమునుగూర్చి ఆయన యొకసారి ఇట్లనెను: ''నీ మనస్సును పూర్తిగా దేవుని కర్పింపుము. మనశ్శక్తిని వ్యర్థపుచ్చకుంటివేని అందొక లేశముచేత నీవు చేయగల పని లోకమును నివ్వెఱగొల్పును.'' ఈ మాట నిజము ఆయనజీవితములోనే కానవగును. ఆయనను చూచినవారిలో ఆయన అంత బరువు మోయుచున్నాడని ఎవడు నమ్మగలడు? మనస్సును పూర్తిగ భగవంతుని కర్పించి, ఈ సంస్థకు సంబంధించి వెలుపల ఏమి జరుగుచున్నదో ఆయన లెక్కయే చేయనట్లు కనిపించును. మనస్సును ఐహికరంగమునకు దింపుట ఆయనకు ప్రయత్నసాధ్యముగ నుండిన ట్లున్నది. పరాకు చూపు, అర్ధనిమీలితనేత్రములు, చెదరని నెమ్మది — ఇవన్నియు ఆయనభావములు ఇహలోకమునకు సంబంధించినవి కావని సూచించుచుండెడివి. కాని సాగుచున్న కార్యములో అన్ని వివరములును ఆయనకు తెలిసియే యుండెడివి. దూరకేంద్రములలో పనిచేయుచున్న వివిధమానవుల మనస్సులను ఆయన గాఢముగ నెఱిగి యుండెను. చూచినంతమాత్రమున స్వభావమును గుర్తించి తదనుగుణముగ ఆయన దారి చూపుచుండెను. విశాలమైన ఈసంస్థలో చేరిన ప్రతివ్యక్తియు తనయోగక్షేమము బ్రహ్మానందస్వామిచేతులలో భద్రముగ నున్నదని అనుకొనెడువాడు. ఆయన మెల్లగ కోరినను, ఆ కోరికను తదీయు లెల్లరు ఆజ్ఞగ తలదాల్చుచుండిరి.

స్వామియభిరుచులు వివిధములుగ ఉండెడివి. ఒక భవనమును ఏ రీతి నిర్మింపవలెనో ఆ నమూనాను ఆయన చక్కగ సూచింపగలడు. కష్టములకులోనైనవారికి సాహాయ్య మందజేయు టెట్లో ఆయన పన్నాగింప గలడు. విద్యావిధానమునుగూర్చిన ఆయన సలహాలను విద్యావిధాననిష్ణాతులు గౌరవించెడివారు. గ్రంథములను ముద్రించునప్పుడు అనుసరింపవలసిన సూత్రములను ఆయన తెలిపియున్నాడు. అవి యెంతయు ఉపపన్నము లని కనుగొనబడినవి. ఆయన యేయాశ్రమమునకు వచ్చినను, బస చేసినను, అచటివారిని 'పూదోటలను కూరగాయలతోటలను వేసికొం'డని ప్రోత్సహించెడివాడు. ఆయనకు పుష్పము లనిన ఎంతో ప్రీతి. తోటలలో వికసించిన పుష్పములు సర్వవ్యాప్తుడగు జగన్నాథునకు ప్రకృతి కావించు సమర్పణము లని ఆయన భావించును. ఎవరైనను

పూవును కోసికొన్నను, పూలతీగను హింసించినను వారిపై ఆయన చాల చిరాకు చూపెడివాడు. ప్రజలు విరాళ మిచ్చిన ధనమునకు సక్రమములైన లెక్కలు వ్రాయించి పెట్టెడివాడు. ఈ విషయమున రవంత పొరపాటైనను ఆయన క్షమింపడు.

ఈయభిరుచులే గాక, పైగా ఆయన మనసును సామాన్యమైన పనికి కావలసిన క్రింది స్థాయికి తేలేమనుట ప్రతియొక్కడును స్పష్టముగ గుర్తించును. మతధర్మకర్తల సమావేశములకు గాని, 'మిషను' నిర్వాహకపరిషత్తు సమావేశమునకు గాని హాజరు కమ్మని ఆయనను ప్రోత్సహించుట చాల కష్టము. అట్టి సమయములలో దేహమునకు అస్వస్థత తెచ్చుకొను నేర్పు ఆయన కుండెడిది. లేదా, "ఈ సమావేశములను ఇక నెప్పుడైనను పెట్టుకొందము" అని సలహా చెప్పును. అట్టి సమావేశములను జరుపగోరిన వారికి స్వామిని అక్కడికి వచ్చునట్లు చేసికొనుట దుస్సాధ్యముగ నుండెడిది. నియమముల నన్నిటిని అతిక్రమించి సదా పైకి పర్వు నొక యాత్మను నియమములకు లోబడిన యొక యావరణమునకు తెచ్చుటకు తాము ప్రయత్నించుచున్నట్లు వారికి అనిపించెడిది. అది స్వామికి ఎంత బాధకరమో ఆలోచించుకొన్నప్పుడు వారి మనసులును ఎంతగనో నొచ్చెడివి. సమావేశమునకు ఆయనను రప్పింపగల్గిరా, ఇక ఆయన అభిప్రాయములును సలహాలును అమూల్యములే. ఆయనసలహాలు ఎంతయు సరియైన వని అనుభవమున చూచియైనందున చర్చ జరుగుచున్నప్పుడు గాని, పిదప గాని ఆయన మాటను కాదంద మను తలంపు ఎవరికిని కలుగదు. అట్టి సమావేశాలలో చర్చలుండవు. స్వామి ఏమి చెప్పునో, సూక్ష్మముగనైనను ఏమి సూచించునో, దానిని అందఱును అంగీకరింతురు. ఇదే మామూలు. రామకృష్ణమిషను కార్యదర్శియగు శ్రీ శారదానందస్వామి ఒకప్పుడు యువకుడగు నొక పసివానితో నిట్లనెను: "నేనేమేని చెప్పితినేని, అది సరి అగునో కాదో అని నీవు పరీక్షింపవలెను. కాని మహారాజు (శ్రీ బ్రహ్మానందస్వామి) ఏమేని చెప్పిన, అది నిజమే అని నీవు నిబ్బరముగ నమ్మవచ్చు. ఇంచుకేని సంశయమక్కఱ లేదు."

ఉత్తరభారతదేశమున నేమి దక్షిణభారతదేశమున నేమి శ్రీ బ్రహ్మానందస్వామి పెక్కు పర్యటనలు గావించెను. ఉన్న సాధన కేంద్రములకు ఆయన సాన్నిధ్యప్రభావమున నూత్నోత్సాహము గల్గెడిది, క్రొత్త కేంద్రము లేర్పడజొచ్చినవి. ఆయన ఎచ్చటికి పోయినను చిన్నవారును పెద్దవారునుగ దర్శనార్థులు తండతండములుగ వత్తురు. ఆయనప్రేమయు దయయు వ్యక్తిమహిమయు వారిచిత్తములలో హత్తుకొని వారు ఆయనకు యావజ్జీవమిత్రులును మిషనుకు సహాయులును అయ్యెడివారు.

వివిధకేంద్రములందున్న సన్న్యాసులతో ఆయన ప్రసంగించునప్పుడు తఱచు ప్రస్తావమునకు వచ్చు సమస్యలలో నొకటి ఏదనగా — పనికి ధ్యానమునకు పొందిక కూర్చు టెట్లు అనుట. సేవాకార్యమునకు మఱుగున పారమార్థికోత్సాహము లేకున్నచో అట్టి సేవాకార్యము అహంకారజనక మగుననియు, పారమార్థికజీవితమునకు అది హానికర మగుననియు ఆయన ఎఱుగును. అందుకై ధ్యానమువంక కే మొగ్గుచు మేని, ధ్యానము ధ్యానము అనుచు మరల సోమరితనమున బడి పోవుదుము. అది మఱియొక చెడుగు. పారమార్థికతాప్రాముఖ్య

మును అడుగున బడనీయక ఉభయమునకు సమ ప్రాధాన్యముగూర్చుట స్వామి లక్ష్యము. ఆయన సేవాకార్యమును ఆధ్యాత్మికస్థాయికి హెచ్చింప వలసివచ్చెను. "మేము చాల శ్రమ పడి పనులు చేయవలసివచ్చుచున్నది, కావున ధ్యానమునకు చాలినంత వ్యవధి యుండుట లే" దని ఒకశిష్యు డనెను. మనస్సును పూర్తిగా భగవంతున కర్పించుకొన్న స్వామి తాను చెప్పిన మాటకు సానుభూతి చూపు నని ఆ శిష్యు డనుకొనెను. స్వామి ఇట్లనెను — 'అబ్బాయి, అట్లనుటకు నీవు సిగ్గుపడ వలె. మీరు సన్న్యాసులరు. ఏ పనిని గాని 'కష్ట' మని మీ రన గూడదు.''

ధ్యానమున కడ్డు తగులునది మన మనశ్చంచలతయే కాని కార్యభారము కాదు. ఈ జన్మము వ్యర్థ మగు నని నీవు అనుకొన్నను ఈ ఒక జన్మమును స్వామీజీ (వివేకానందుల) పనికై త్యాగ మొనర్పుము. ఇంతకు మునుపు లెక్కలే నన్ని జన్మములు నీ వెత్త లేదా! కాని హృదయపూర్వకముగా నీవు నిన్ను ఆయనకు అర్పించుకొందు వేని నీ ఆధ్యాత్మిక జీవితము ఆయన అనుగ్రహముచే శరవేగమున పురోగమింప గలదు. నీవు గట్టిగ నమ్మి ఉండవచ్చు.'' మఱియొకప్పుడు వేఱొక యువకునికి ఆయన ఇట్లు ఉపదేశించెను: "స్వామిజి విషయమున కృతఘ్నుడవై యుండకుము. మీకొఱకును, దేశముకొఱకును, ఆయన తన ప్రాణములను అర్పించినాడు. ఆయనపనిని చేయుటలో నిమగ్నుడవు కమ్ము. ఆయన ఋణమును తీర్చుకొమ్ము.''

శ్రీరామకృష్ణ కేంద్రములలో ఆయన ఎచ్చటికి విచ్చేసినను అచ్చటి వారి ఆధ్యాత్మికోద్ధరణమున చూపినంత హెచ్చు శ్రద్ధ తక్కిన కార్యముల వివరములలో ఆయన చూపడు. తన మనస్సును పూర్తిగా భగవంతున కర్పించుకొననివాడు నిక్కముగా నిస్స్వార్థకర్మాచరణమునకు సమర్థుడు కా డని ఆయన అభిప్రాయము. "సన్న్యసించి తల్లితండ్రులయు బంధువులయు తగులాటములను తెకతెంపులు చేసికొన్న మీరు మీ యావచ్ఛక్తిని బ్రహ్మసాక్షాత్కారమునకు వినియోగించుకొన లేరేని, అయ్యో, ఇక మీ రెందుకు'' అని ఆయన సన్న్యాసులను హెచ్చరించుచుండును. దైవసాక్షాత్కారమును మీ జీవితములకు ఏకైక లక్ష్యముగా నొనర్చుకొం డని ఆయన అందఱికి బుద్ధి చెప్పెడివాడు. ఆయన ఇట్లు అనును: "ప్రయత్నించి అయినను మీ మనస్సులలో నిర్వేదమును సృష్టించుకొనుడు. మీ యావచ్ఛక్తిని పారమార్థికశ్రేయస్సునకై వినియోగించుచున్నారా — మిమ్మే ప్రశ్నించుకొండి. ఎంతకాలము దేవుని ధ్యానమున గడపితిమి, ఎంతకాలము వేఱు విషయములలో గడపితిమి అని ప్రతిరాత్రియు మిమ్ము మీరే ప్రశ్నించుకొండి. భగవదర్పితము కాని కాలము వ్యర్థముగా నిష్ప్రయోజనముగా గడచినదే.'' అయినను వింత ఏమన ఆధ్యాత్మికాభివృద్ధిపైనే ఆయన ఊనిక ఉంచినను, మిషను (సేవాసంఘ) కార్యక్రమములు ఆయన పర్యవేక్షణలో వెనుకడుగు లేక వర్ధిల్లినవి.

శ్రీ బ్రహ్మానందస్వామి ఆధ్యాత్మికవిషయములనుగూర్చి తఱచు మాటాడడు. ఆధ్యాత్మిక విషయసంభాషణలవంకకు ఆయనను ఆకర్షించుట చాల కష్టమే. కాని మాటాడినపుడు మాత్రము ఆయన వాక్కులలో ఆధ్యాత్మిక జ్యోతి వెలువడుచుండును. విన్నవారికి అవి బ్రతికినన్నినాళ్లు ఉత్సాహప్రదములుగా నుండె

డివి. ఆయన ప్రభావఫలితముగా పెక్కండ్రు యువకులు ఈ మఠమున చేరిరి. ఒకొక్కపుడు సంశయాత్ముల కౌతస్కుతము (స్కెప్టిసిసమ్) ఆయన సన్నిధానమాత్రముచేత మాయమయ్యెడిది. ఎవరికిని ఆయనతో వాదించుటకు ధైర్యము ఉండదు. సిద్ధాంతచర్చలయందు ఆయనకు అభిరతి లేదు. పెక్కు సంవత్సరములుగా మానవులను విసిగించిన క్లిష్టసమస్యలు ఈయన ఎదుటికి వచ్చిన చాలును, తత్‌క్షణమే తీఱిపోయెడివి. అట్టి అనుభవములు పొందినవారు లెక్కకు మిక్కిలిగా నున్నారు. శ్రీరామకృష్ణుని, శ్రీబ్రహ్మానందస్వామిని కూడ నెఱిగినవారు గురుదేవుని గుణములలో కొన్ని శ్రీ బ్రహ్మానందస్వామియందు రూపుదాల్చినవని చెప్పుచుందురు. ఆకారములలోగూడ కొంత పోలిక యున్నది.

ఆయన పోయినచోట నెల్ల ఆనందముతో కూడిన ఉత్సవవాతావరణ ముండెడిది. అచటివారెల్ల అందు నిమగ్నులయ్యెడివారు. కాని ఆ ఉత్సవప్రత్యేకత ఏమనగా అది మిక్కిలి ఉదాత్తతను కల్గించుచుండును. ఒకప్పుడు ఒకానొక కేంద్రములో నుండిన స్వాములమధ్య ద్వేషములు తీవ్రమై ఆ ఆవరణమే చెడిపోయి ఉండెను. దానిని చక్కబఱచుటకై చేసిన తక్కిన ప్రతిక్రియ లెల్ల ఫలింపకపోగా హితాభిలాషులు, శ్రీ బ్రహ్మానందస్వామిని సమీపించి ఆ కేంద్రమునకు విచ్చేయ ప్రార్థించిరి.

అచటికి పోయినపుడు ఎవరి కొదువలను గాని ఆయన విచారింప లేదు. ఆయన సన్నిధానమాత్రముచేత ఆధ్యాత్మికోత్సాహమహాతరంగ మొక్కటి పుట్టెను. వెంటనే చిన్న సమస్య లన్నియు తమంతట పరిష్కృతములై పోయినవి.

శ్రీ వివేకానందస్వామి మహాసమాధి నొందిన పిదప శ్రీ బ్రహ్మానందస్వామి బేలూరునందలి కార్యప్రణాళికలను గట్టిపఱచుటలో మొదట తన శ్రద్ధను చూపెను. ఒకసంవత్సర కాలము గడచిన పిమ్మట అచటి నిత్యకార్య నిర్వహణమును శ్రీ శారదానందస్వామికి అప్పగించి, బేలూరుమఠపర్యవేక్షణమును మఱొక సోదరశిష్యునకు అప్పగించి, శ్రీ బ్రహ్మానంద స్వామి కాశికి బయలుదేఱెను. ఆ దినములలో కాశిలో అద్వైతాశ్రమ మనెడి శ్రీరామకృష్ణ మఠకేంద్రము ఒకటి ఉండెను. ఆ యాశ్రమము ధ్యానజీవితము గడపుటకే ఉద్దేశింపబడినది. శ్రీ వివేకానందస్వామి భక్తులగు నొక కొందఱు యువకులు ప్రజాసేవకై స్థాపించిన యొక సంస్థ కూడ అట నుండెను. ఆ సంస్థను నిర్వహించుచుండిన పరిషత్తువారు శ్రీ బ్రహ్మానందస్వామి కాశికి రాగానే ఆ సంస్థమీది పరిపాలనాధికారమును రామకృష్ణమిషనువారికి అర్పించిరి. స్వామి కాశిలో నెలదినము లుండెను. కొన్ని ఏండ్లపిదప స్వామి మరల కాశికి వచ్చినపుడు క్రొత్తచోట రామకృష్ణమిషను సేవాగృహము (హోమ్ ఆఫ్ సర్వీస్) కు శంకుస్థాపనము చేసెను. అచ్చటి కట్టడములలో కొన్ని ఆయన పన్నాగము ప్రకారము కట్టబడినవే.

కాశీనుండి ఆయన హరిద్వారమునొద్ద ఉండు కంఖాలుకు పోయెను. అచ్చట రామకృష్ణ సంస్థకు చెందిన శ్రీ కల్యాణానందస్వామి అను యువసన్న్యాసి పేదలకు వ్యాధిగ్రస్తులకు వైద్య సాహాయ్య కార్యక్రమమును ప్రారంభించియుండెను. కంఖాలున ప్రశాంత పవిత్ర పరిసరముల మధ్య స్వామి పగ లనక రాత్రి యనక ధ్యాన నిమగ్నుడై యుండెను. తక్కినచోట్లలో వలె ఇచ్చటను ఆయన మౌనసన్నిధానము ఆ సంస్థ

కార్యక్రమమునకు ఉత్సాహము కలిగించినది. ఆయన వచ్చిన తర్వాత ఆశ్రమము అభివృద్ధి కాంచ దొడగెను. హరిద్వారమునుండి స్వామి బృందావనమునకు పోయెను. అచట శ్రీ తురీయానందస్వామి తపస్సు చేయుచుండెను. బృందావనమునకు రాగానే మరల తదేకతానముగా తపస్సులో పడిపోవుద మను తలంపు స్వామికి గలిగెను. శ్రీ తురీయానందస్వామితో ఆయన అట కొంతకాల ముండెను. ఆ కాలమంతయు కఠోరసాధనలలో గడచెను. ఆ దినాలలో ఆయన తప్పక ధ్యానమునకై సగము రాత్రియప్పుడు లేచుచుండెను. ఒకనాడు రాత్రి ఆయన గాఢముగ నిద్రించుచుండె నట. లేవవలసిన సమయము దాటిపోవ నుండెను. అపుడు తటాలున త న్నెవరో నెట్టినట్లు అనుభూతమై ఆయన లేచెను. ఎవరో ఒక అశరీరి సుజనుడు తన్ను పిలిచి ధ్యానింపు మని ఎచ్చరించినట్లుండె నట.

బృందావనమునుండి స్వామి అలహాబాదుకు చేరెను. అట ఆయన సోదరశిష్యులలో నొకరు భావి రామకృష్ణకేంద్రమునకు పునాదిని నిర్మించుచుండెను. అటనుండి స్వామి వింధ్యాచలమునకు పోయెను. అది లోకజనని వెలసియున్న చోటు. గొప్పయాత్రాస్థలము. ఇట నున్నప్పుడు స్వామి అత్యుద్రిక్తభక్తిభావస్థితిలో నుండెను. లోకజనని గుడిలో నొక రాత్రి ఆయన తన అనుచరుని ఒక పాట పాడుమనెను. ఆ పాట వినుచు దేవి యెదుట నిలబడి యున్నప్పుడు స్వామి కన్నులనుండి బాష్పధారలు ప్రవహించినవి, కొంతసేపటిలోనే ఆయన అత్యంతయోగనిమగ్నుడై బాహ్యస్మృతిని పూర్తిగా కోల్పోయెను. ప్రక్క నున్నవారు ఆయనను కనుపెట్టి యుండ వలసి వచ్చెను. వింధ్యాచలములోనే మఱొక గుడిలో కూడ స్వామికి ఇట్టి అనుభూతియే కలిగెను. ఈ పుణ్యక్షేత్రమున కొన్నాళ్లుండి స్వామి బేలూరు మఠమునకు తిరిగి వచ్చెను.

(సశేషము)



# శ్రీ మహాభారత సాంఖ్యము

శ్రీ కేతవరపు వేంకటరామకోటి శాస్త్రిగారు, బి.ఏ., (ఆనర్సు) పిహెచ్.డి.

కారికాసాంఖ్యము పంచవింశకతత్త్వముగా నే పురుషుని పేర్కొనునో, ఆ పురుషుని భారతము బ్రహ్మము, ఈశ్వరుడు, నారాయణుడు, ఆత్మ, పరమాత్మ, జీవాత్మ, ఈ మొదలైన పేర్లతో చెప్పును. ఇవన్నియు అర్థాంతరమును బోధింపవు. ఈ యాత్మ నిర్గుణము త్రికాలాబాధితము. సర్వమునకు నధిష్ఠాత. అద్వితీయము. సృష్టిస్థితిలయములు దానివలననే జరుగును. అది యదేహము. ఇంద్రియములకు గోచరము కాదు. జ్ఞానైకసాధ్యము. ప్రకృతిని తనయం దిముడ్చుకొన్నది. ప్రకృతిని తాను వ్యాపించినది. ప్రకృతి వికృతులను

అతీత మైనది. నామరూపములు లేని దయ్యు బహునామరూపములు కలది. మఱియు తా నదేహ మయ్యును, దేహమునం దున్నది. ఎట్లున్న దనగా మథనలక్ష్యమై యున్నది.

ఈయాత్మకు రెండు స్వరూపములు కలవు. అట్లే రెండు నామములు కలవు. నిజమునకు లేవు. ఉపాధివలన స్థూలదృష్టికి అట్టి నామ రూపములుకలదిగా నుండును. దేహ ముపాధిగా కలది జీవాత్మ, నిరుపాధికము పరమాత్మ. అనుభవ మంతయు నారోపించుకొనునది జీవాత్మ. అనుభవము లేశ మైనను లేనిది పరమాత్మ. అంతే భేదము. కనుక జీవాత్మయే పరమాత్మ. అందువలన జీవాత్మయు అక్షరమే. కాని ఉపాధివశమున నున్నందున, ఉపాధి క్షరము గనుక జీవాత్మయొక్క స్థితికూడ క్షర మనియే అనిపించును. కొంద ఱట్లే యనిరి కూడ. అట్టిచో కేవలము పరమాత్మయే అక్షరము. ఆ దృష్టితో చూచినపుడు కేవలము జీవాత్మయె పంచవింశక తత్త్వము. కేవల పరమాత్మ షడ్వింశకతత్త్వము. ఇది భారత సాంఖ్యమునందు ఆత్మస్వరూపము.

అవ్యక్త మనబడు ప్రకృతి ఆత్మయొక్క విక్రియా శబలరూపము. ఇది శాశ్వతము కాదు. దీని తత్త్వములు ఇరువదినాలుగు. ఇవన్నియు క్షరములు. ఏతదవ్యక్తము సత్త్వ రజస్తమోగుణాత్మకము, నిత్యపరిణామశీలము కలిగి చివరకు ఆత్మయందు లయము పొందు నది. ఆత్మ శాశ్వతము గనుక, ఆత్మయం దుండు ప్రకృతికూడ శాశ్వతమే కదా! కనుక ప్రకృతికూడ అక్షరమే – అని కొంద అన వచ్చును. ఒకవేళ ప్రకృతి అక్షరమైనను అది ఆత్మకంటె భిన్నముగా ఉనికి గలది కాదు కావున ఆత్మయొక్క అద్వితీయతకు భంగము లేదు.—ప్రకృతి యచేతనము ఆత్మయొక్క చైతన్యమువలన సృష్టిగా పరిణమించుచున్నది. ఎప్పు డాత్మ యుపసంహరింప దలచునో అప్పుడే ప్రకృతి లేని దగుచున్నది. ఆత్మ వినా ప్రకృతి యేమియు చేయ లేదు. అది ఆ త్మాధీనము. అచేతన మగుట మూలముగా ప్రకృతిఆత్మను తెలిసికొన లేదు. అదిఅవిద్యాత్మకము. వికృతు లన్నియు దానికి సంబంధించి నవే. ఎంతకాల మాత్మ తన్ను తాను చూచు కొన కుండ ఈ ప్రకృతియందు లగ్నమై యుం డునో అంతకాలముపాటు ఈ ప్రకృతి సర్వ మును తానే చేయుచున్నదివలె వర్తించును ఇది భారతమునందలి సాంఖ్యసిద్ధాంతగత ప్రకృతిలక్షణము

తత్త్వము లిరువదియైదు. ప్రకృతితత్త్వము లిరువదినాలుగు. పురుషతత్త్వ మొకటి. వెరసి ఇరువదియైదు. మనశ్శుద్ధియే బుద్ధియను దృష్టితో కొందఱు తత్త్వము లిరువదినా ల్గందురు. మఱికొందఱు తత్త్వము లిరువదిమూ డని యం దురు. వీరు మనస్సు, బుద్ధి ఒక్కటే అందురు. భారతమున చెప్పబడిన ఈ ఇరువదిమూడు తత్త్వముల విషయమును కొంచెము విచారింప వలయును. మనస్సు బుద్ధి ఒక్కటియే అయి నను తత్త్వము లిరువదినాల్గు కావలయును. పురుషతత్త్వమును కలుపుకొనకుండ కేవలము ప్రకృతితత్త్వములను, మనస్సును బుద్ధిని ఏకము చేసి, ఇరువదిమూ డనుచున్నారా యేమి? అని అనుమానింప వచ్చును. కాని పురుషతత్త్వము వదలబడినట్లు లేదు. అదియునుగాక తత్త్వము లిరువదినా ల్గనువారు మనస్సుయొక్క శుద్ధ స్వరూపమే బుద్ధి యనుచున్నా రని చెప్ప బడినది. అపుడు పురుషతత్త్వము లెక్కింపబడ నిచో మఱి తత్త్వములు ఇరువదిమూడే కావల

యును గదా! కాని అట్లు లేదు. అందువలన పురుషతత్త్వమును కలుపుకొనియే మాటాడు చున్నట్లర్థ మగుచున్నది. అయినచో మనస్సును, బుద్ధిని ఒక్కదానిక్రిందనే జమకట్టుకొని తత్త్వములు ఇరువదిమూడనుట పొసగుట లేదు. మనశ్శుద్ధియే బుద్ధి యను వారికిని మనస్సు బుద్ధి ఒక్కటే అను వారికిని భేద మంతగా కనిపించుట లేదు. ఇంతకును ఇరువది మూడు తత్త్వము లని గాని ఇరువదినాల్గని గాని చెప్పుచో విషయము స్పష్టముగా లేదు. ఇక సమన్వయమునకొఱ కిట్లు బహుశః భావింప వచ్చు ననిపించుచున్నది. సాంఖ్యయోగదర్శనములకు సిద్ధాంతము విషయమున భేద మంతగా లేదు. యోగమునందు "మనసు బుద్ధియు నాత్మయందు నొక్కటి యగుట" (అనుశాసనిక పర్వము 5-256) అని చెప్పబడినందున యోగసాంఖ్యమునందు తత్త్వము లిరువదిమూడనుట పొసగుచున్నది. మఱియు సాంఖ్యుల తత్త్వనిర్ణయమున నొక స్థిమితము లే దని శ్రీమచ్ఛంకరభగవత్పాదులవారు "విప్రతిషేధాచ్చాసమంజసమ్." (2-2-10)అను వేదాంతసూత్రమునకు వ్రాసిన భాష్యమున స్పష్టము చేసినారు. అందువలననే శ్రీమచ్ఛంకరులు సాంఖ్యులు, యోగసాంఖ్యులు చెప్పు ఇరువదినాల్గు, ఇరువదిమూడు అను తత్త్వముల విషయమును మనసున బెట్టుకొనియే అట్లని యుందురు. కనుక భారతమునందు కొందఱు సాంఖ్యులు తత్త్వములను ఇరువదినాల్గని, ఇరువదిమూడని పేర్కొనుచుందు రని చెప్పబడినవాక్యము పొసగుచునే యున్నది.—

అసలు తత్త్వము లిరువదియైదు. ఇరువదియైదవది అధిష్ఠానతత్త్వము. అదియే పురుషతత్త్వము. దానివలననే ప్రకృతితత్త్వము లిరువదినాలుగును ప్రకాశించుచున్నవి. ఆత్మకు రెండు రూపము లున్న వని చెప్పబడినందున, ఒకరూపము పంచవింశకతత్త్వముగాను, రెండవరూపమును షడ్వింశకతత్త్వముగాను చెప్పవలయును. ఈ రెండింటికిని భేద మంతగా లేదు. జీవాత్మకూడ క్షరమే అను భావ మున్నపుడు పంచవింశకతత్త్వముకూడ క్షరమే కావలయును. అందువలన అక్షరమైనది షడ్వింశకతత్త్వముగా చెప్పబడినది. ప్రకృతితత్త్వములైన చతుర్వింశతికిని పరమైనది పంచవింశకతత్త్వము, దానికిపరమైనది, మఱితనకు పరము లేనిదియు షడ్వింశకతత్త్వము. ఇట్లు ఆషడ్వింశకతత్త్వమును విద్యావిద్యారహితమై మఱి తనకు పరము లేని అవ్యయపదముగా ప్రతిపాదించుటనే భారతసాంఖ్యము చేసినది. భారతసాంఖ్యము కేవల సాంఖ్యము కాదు. అది సాంఖ్యసూక్ష్మత్వదర్శనము. తద్దర్శనము యొక్క ఆంతర్యము మఱియొకసారి వ్రాయబడును. ఇది భారతసాంఖ్యమున తత్త్వముల విషయము.

జీవుడు పురుషుడు అనగా నాత్మయే, శరీరోపాధివలన జీవాత్మ యనబడును. ఒకదృష్టితో చూచినపు డీ జీవుడు క్షరుడు మఱొక దృష్టితో చూచినపుడు అక్షరుడు. ప్రకృతిగుణము లన్నియు తనవిగా నీ జీవు డనుకొనును. అది అవిద్యాలక్షణము. అవిద్య జీవునకు సహజము కాదు. ఉపాధివశముననైనది. ఈ జీవుడు చేతనుడు జ్ఞానస్వరూపుడు. అయ్యును ప్రకృతివశవర్తిగా నగును. అపుడు తాను కేవలు డన్న జ్ఞానము లేనివాడై దేహేంద్రియములే తానని ప్రవర్తించును. అట్లు ప్రవర్తించుచు పుణ్యకర్మములు, పాపకర్మలు చేయుచు తత్తత్ఫలములను అనుభవించుచు జననమరణాది యాత

నలకు గుఱియగును. సంసారమున బడి జీవుడు, అంధు డింటియం దలవాటుబలిమిని తిరుగు చున్నట్లు, తిరుగాడుచున్నాడు. 'దేహమే తా' నన్న అజ్ఞానమే జీవుని పరిపరివిధముల తపింప జేయుచున్నది. భార్యాపుత్రమిత్రాదు లంద ఱును తన వా రని, వారివలన తనకు సుఖము కల దని భ్రాంతిపడి జీవుడు మమకారము పెం చుకొనుచున్నాడు. జీవునిబంధమునకు కేవల మవిద్య, అవిద్యవలన కామము, పుట్టుచున్నది. కామమునకు వశుడై అనేకకర్మములయం దీ జీవుడు వర్తించుచున్నాడు. ఆకామము వివిధ రీతుల, లోభమును, మోహమును, క్రోధ మును, మదమాత్సర్యములను కల్గించి పురు షుని ఆయామార్గముల త్రిప్పుచున్నది. భార్యా పేక్షయే పురుషుని బంధమునకు మూలము.

జీవుని జన్మపరంపరలో నరజన్మ ముత్తమ మైనది. జననమరణాదులనుండి తప్పుకొనుటకు జీవున కనువైన జన్మ నరజన్మయే. ఆత్మ జ్ఞానము తప్ప మఱేదియు జీవుని జననమరణా దులను తప్పింప లేదు. మానవజన్మ మెత్తిన జీవుడు జ్ఞానమును పొంది మోక్షము నంద వలయును. మానవు డనేకములు కర్మలు చేయును. పుణ్యకర్మములవలన పరలోక సుఖము - పాపకర్మములవలన నరకదుఃఖము అనుభవించుట తప్ప ముక్తి లేదు. మఱియు నా యా పుణ్యపాపకర్మములు చేసిన దేవ మానవతిర్యగ్యోనులయందు పుట్టుట తప్పదు. జన్మరాహిత్యమే మోక్షము. ఆత్మజ్ఞానము వలన నది సాధ్యము. గురువుల నారాధించి జ్ఞానమును పొంద వలయును, జ్ఞాన మనగా తాను కేవలాత్మస్వరూపు డనియు, ఈప్రకృతి గుణములతో తన కేమియు సంబంధము లే దనియు, తాను విశ్వాత్మకు డనియు, ఈ మొద లుగా పురుషుడు తన్ను తా నెఱుగుట. ఈజ్ఞాన మొక మాత్రమున దృఢముగా నుండదు. అందుకు సాధన అవసరము. ముందు భార్యా పుత్రమిత్రాదులయందు విరక్తిని పెంచుకొన వలయును, ఇంద్రియములు విషయములయందు ప్రవర్తించు లక్షణములు కలవి. వాని యా ప్రవృత్తిని తప్పింపవలయును. ఇంద్రియము లలో మనస్సు గొప్పది. మఱియు చెడ్డది. దానిని నిగ్రహింపవలయును. అపుడు కాని విష యోపరతి సిద్ధింపదు. అదియే మోక్ష మూలము.

ఈ మానవసమాజము వర్ణాశ్రమధర్మకర్మ ములతో కూడి యున్నది. అవి యీ లోకము స్థిమితముగానుండుట కేర్పడినవి. కనుక త్యజింప రానివి. అయినచో అవి ప్రవృత్తిలక్షణముగా గలవి కదా ? మరి మోక్షమున కవి యె ట్లు.. కరించును ? అని యన రాదు. కర్మఫలముల యందు మమకారము లేకుండ విహితముల నాచరించుట నిష్కర్మయే యగును. ఆ విధ ముగా గృహస్థుడుగా నుండి కూడ పురుషుడు మోక్షమును పొంద వచ్చును. కావలసినది జ్ఞానము మాత్రమే. జ్ఞానము కలిమిని ఎక్కడ వర్తించినను నేమియును కాదు. కాని యెంత దృఢముగా జ్ఞాన మున్నను సంసారము దానిని సడలజేయునంత పటువైనది. అందువలన సం సారమును త్యజించుట శ్రేయము. అదియే సన్న్యాసము. సన్న్యాసము జ్ఞానపూర్వకముగా నుండ వలయును. సర్వభూతములయందు సమ భావము - నిర్మమత్వము కలవాడే సన్న్యాసి. లేనివాడు కాడు.

కొందఱు ద్రవ్యమును వెచ్చించి పశువులను హింసించి క్రతువులు చేయుదురు. అవి మోక్షమునీయవు. స్వర్గసుఖములను మాత్రమే




# శ్రీరామకృష్ణ ప్రభ

## పదునెనిమిదవ సంపుటము

౧౯౬౧ జూలై ప్లవ - ఆషాఢము మొదలు ౧౯౬౨ జూ॥ శుభకృత్తు - జ్యేష్ఠము వఱకు


సంపాదకులు :

శ్రీ శుద్ధ సత్త్వానందస్వామి

శ్రీ నేలటూరి భక్తవత్సలము, ఎమ్.ఏ., బి.ఓ.ఎల్.





శ్రీ రామకృష్ణ మఠము, మైలాపూరు, మద్రాసు - 4.

సాలు చందా రూ. 4. విడిప్రతి 37 న.పై.

# విషయానుక్రమణిక

కలుగ జేయును. ఆ క్రతువులవలని పుణ్య మున్నంతకాలమే స్వర్గము. అది క్షీణింపగనే తిరిగి యెక్కడనో పుట్టి తీర వలయును. అందు వలన పశుయజ్ఞములకంటె జ్ఞానయజ్ఞము శ్రేష్ఠము, అదే తపోయజ్ఞము. అంతర్యాగమని యను దానికి పేరు. ఇంద్రియములను బాహ్యముగా ప్రవర్తింపనీయక ఆత్మయందు వేల్చుటయే అంతర్యాగము. ఆత్మ అగ్నిస్వరూపము. ఆత్మజ్ఞానమే మోక్షము నిచ్చును. తాను గాని ప్రకృతి తన్నెట్లు వశము చేసికొన్నదియు తెలిసికొన్న చాలును. ఇక ప్రకృతి గుణములు పురుషుని అంటవు. ఈ ఇరువది నాలుగును ప్రకృతితత్త్వములు. ఇవి నా చేతిలోనివి. ఇవి నాచేతలేనివిగా చేయబడ గలవు. ఈ ప్రకృతి వికారములు నావి కావు. నావను కొనుట యజ్ఞానము. నేను జ్ఞానస్వరూపుడను. నే నీ ప్రకృతికి పరుడను. నాకు పరము లేదు —అను ఈ మొదలైన వివేకము పురుషుని ప్రకృతినుండి వేర్పఱచును. ప్రకృతినుండి పురుషుడు వేర్పడుటయె మోక్షము. పంచవింశకతత్త్వమైన జీవాత్మప్రకృతిబంధములను త్రెంచుకొని షడ్వింశకమైన పరతత్త్వమున దృష్టిపెట్టి అందు లీన మగుటయే మోక్షము. —ఇది పురుషుని బంధమోక్షముల విషయము.

భారతమునందలి సాంఖ్యము స్వరూపము స్థూలముగా పైన పేర్కొనబడినది. కారికా సాంఖ్యమునకును భారతసాంఖ్యమునకును గల భేదముల నిట్లు చెప్ప వచ్చును :

కారికా సాంఖ్యమున ప్రకృతి పురుషు లిరువురును శాశ్వతులు. భారతసాంఖ్యమున పురుషు డొక్కడే శాశ్వతుడు. మఱియు అద్వితీయపరబ్రహ్మమే పురుషుడు. కారికాసాంఖ్యమున ప్రకృతియే సృష్టికర్త్రి. భారతమున ప్రకృతిపురుషుని యధీనమునకు లోబడినది. సర్వమునకును పురుషుడే కర్త. కారికాసాంఖ్యము వేదములవిషయము నుదాసీనముగా జూచును. భారతసాంఖ్యము వేదశాస్త్రతాత్పర్యమునందు దృష్టి కలది. కారికాసాంఖ్యము ఈశ్వరుని విషయము ప్రస్తావింపదు. భారతమున పురుషుడే ఈశ్వరుడు. కారికాసాంఖ్యము యజ్ఞయాగాదిప్రవృత్తులను త్రోసిపుచ్చును. భారతసాంఖ్యము చిత్తశుద్ధి నిమిత్తములుగా వాని నంగీకరించును. నివృత్తిమార్గమున జ్ఞానమే మోక్షసాధన మనుటలో భారత కారికాసాంఖ్యములకు భేదము లేదు. కారికా సాంఖ్యము పంచవింశతి తత్త్వములనుమాత్రమే అంగీకరింపగా భారతసాంఖ్యము షడ్వింశక తత్త్వమును ప్రతిపాదించినది. కారికాసాంఖ్యము ప్రకృతివాదసాంఖ్యము. భారతసాంఖ్యము సాంఖ్యసూక్ష్మత్వదర్శనము. వేదాంతదర్శనముతో కారికాసాంఖ్య మెక్కడ భేదమును చూపునో అక్కడ భారతసాంఖ్యము వేదాంతదర్శనముతో సమన్వయించుకొని పోవును. ఆ సమన్వయించుకొని పోవుటలోనే భారతము షడ్వింశకతత్త్వమును ప్రతిపాదించినది. ఆ ప్రతిపాదనమునందలి ఆంతర్యమును సూచించుటకే భారతము తాను నిరూపించిన సాంఖ్యమును సాంఖ్యసూక్ష్మత్వదర్శనము అని పేర్కొనినది. ఏతద్దర్శనమునుగూర్చి మఱొకసారి వ్రాయుదును. —ఇతి శివమ్.

ఓమ్

# పరమహంస శ్రీరామకృష్ణుడు

## బుఱ్ఱ కథ

శ్రీ పురిఘళ్ల రంగారావుగారు

(మార్చిసంచిక తరువాయి)

రా॥ అది కాదురా! సోదరా, ఈ విద్య లన్నీ పొట్టనుపోషించుకోటానికి మాత్రమే పనికి వసాయ్!

హా॥ అవును! 'కోటి విద్యలు కూటికోసమే' అని యెవరో మహానుభావుడు ఎప్పుడో చెప్పాడు. ఆఁ ఇంకా ఎవరో మహానుభావు డంటా నేమిటి - బహుశా నేనే చెప్పి ఉంటాను. తెల్లవారితే సవాలక్ష యిటు వంటి నీతులు నీలాంటి కోతులకు చెప్తూ చున్న మూలాన్ని నే నన్న మాటలు నాకే గుర్తుండటం లేదులే - అయితే - గదాధరుడు కోరే విద్య యెటువంటి దంటావ్!

రా॥ అదే!... మానవుణ్ణి సరాసరి భగవత్సాన్నిధ్యానిక చేర్చే 'బ్రహ్మవిద్య'. దాన్నే నేర్వాలనుకున్నాడు.

హా॥ ఓస్! అదా! నేనూ కొంతకాలం క్రితం నేర్చుకుందా మనుకున్నాను గాని, తీరా నేర్చుకొనీ - నేర్చుకొనకుండానే యెక్కడ నేను సరాసరి భగవంతుడి వద్దకు వెళ్లి పోతానో - మళ్లీ మీకు పాపం బుఱ్ఱకథ చెప్పటానికి ఒకడు తక్కువ వస్తాడేమో నని దూరమాలోచించి యీ ప్రజల మేలు కోరినవాడనై నేర్చుకోలేదురా. పరోపకారార్థమే కదా యీ వెధవ శరీరం. సరే తర్వాత?

రా॥ కలకత్తానగరందాపులో 'దక్షిణేశ్వరం' అనే గ్రామం ఉంది. అక్కడ ఏం జరిగిం దంటే

క॥ వంత:—తందానా తాన తందానా

రాణి రాసమణి యను జమీందారిణి॥ తం
భక్తురాలు రా భద్రకాళికి॥ తం
కాశీయాత్రకు కదలనుండగా॥ తం
కలలో కాళిక కానిపించియు॥ తం
కోవెలకై తన్ను కోరియుంటచే॥ తం
ఆమె యానతిని ఔదల దాల్చియు॥ తం
యాత్రను మానుక ఆత్రముతోను॥ తం
దక్షిణేశ్వరమె తగినక్షేత్ర మని॥ తం
'భవతారిణి' యను భద్రకాళికి॥ తం
లక్షలు తొమ్మిది లక్ష్య పెట్టకను॥ తం
ఆలయ మొక్కటి అన్ని హంగులతో॥ తం
ఘనత మీఱగా కట్టించెను రా॥ తం
కాని దానికి అర్చకు డొక్కడు
కఱ వయ్యెను నాడు॥ తం

హా॥ కాసేపు గుఱ్ఱాన్ని కట్టెయ్యవోయ్! ఏకంగా గూడ్సుబండిపోయినట్టు ఒకటే పోకైతే మాకు కథ అర్థమై చావాలా ఒద్దా? అసలు ఎవరా రాసమణి? ఆమె కట్టించిన

ఆలయానికి నావంటి కేరాఫ్ ప్లాట్‌ఫారంగా డైనా అర్చకత్వానికి రాకపోవటానికి కారణ మేమిటి? ముం దీ రెంటికీ సమాధానం చెప్పు.

రా॥ రాణిరాసమణి కలకత్తానగరంలో ఉన్న జాన్ బజారులో నివసిస్తున్న ఒకపల్లెజమీం దారిణి.

హా॥ ఛీ! చేపలు కంపుకొడుతోంది. ఆ మాట చెప్పకు.

రా॥ ఆమె నడివయస్సులో నున్న వితంతువు. పవిత్రశీల. ఆమె 1855వ సంవత్సరం నాటికి భవతారిణీ ఆలయం పూర్తిచేసింది. అమ్మవారికి అర్చనావిధానం సక్రమంగా జరపగల సమర్థులు బ్రాహ్మణులు కాబట్టి, అర్చకునిగా ఒకబ్రాహ్మణునే నియమించాలని ఆమె సంకల్పించింది. కాని, ఆనాటి బ్రాహ్మణులు శూద్రులు కట్టించిన ఆలయంలో అర్చన చేయటం కాని, అచటి ప్రసాదం స్వీకరించటం గాని తమ ఆచారానికి హానిగా భావించే వారు.

హా॥ అబ్బబ్బబ్బా!!! ఈ బ్రాహ్మణాళ్లతో వచ్చిన చావే యిది! ఎంతసేపూ ఆచారం, గోచారం, గ్రహచారం, నాబొంద సమాచారం అంటూ గొడవే! వీళ్లేవో పెద్ద దేవుడి పాలిటి ఏజెంటుల్లా ఫలానా ఫలానా వాళ్లు దేవుణ్ణి ముట్టుకో రాదు. అలా ముట్టు కుంటే ఆ మా దేవుడు మైలపడతాడో హోయ్! అంటూ వెధవ ఘోషే కదా! రణరణధ్వని. అసలీ బ్రాహ్మణముండా వాళ్లందర్నీ రష్యన్ రాకెట్లలో చంద్ర మండలం పంపించి వేస్తే మన దేశానికి పీడ వదిలి పోతుంది. అసలు అలా చేస్తే యే మాతుం దంటావ్?

రా॥ ఏ మాతుందా! భారతదేశకీర్తిసౌధానికి పునాది రాళ్లైన చతుర్వేదాలు నశించి పోతాయ్! తదుపరి ఆర్యసాంప్రదాయాలనే గోడలు దఫేలు మని కూలిపోతాయ్! మరుక్షణంలో — నీతికి, జాతికి, రీతికి, భూతికి - వందలు - వేలు - లక్షలు - కోట్ల యేండ్లనుండి దిగంతవిశ్రాంతకీర్తిని ఆర్జించుకొన్న పరమపవిత్రభారతవర్షమే - ఊరు పేరు లేకుండా - ఈ విశాలవిశ్వక్షోణిపై నిలిచి ఉంటుంది - లేకపోతే ఆ రోజున అనంత హిందూ మహాసాగర జలాలమధ్య తక్క భారతావనికి నిలబడే యోగ్యత కూడ ఉండ దేమో యీ ప్రపంచరాజ్యాల మధ్యలో - సరే! దాని గొడవ కేం గాని కథ విను - బ్రాహ్మణు లెవ్వరూ తాను కట్టించిన ఆలయంలోనికి అర్చకత్వానికి రాకపోవటం చేత రాణిరాసమణి దిగులు పడింది. అపుడు గదాధరుని అన్నగారైన రామకుమారుడు ఆ సమస్యను చక్కగా పరిష్కరించి, అనేకగ్రాంథికప్రమాణాలు చూపించి పండితులను ఒప్పించి మెప్పించాడు. తదుపరి ఆయనే ఆలయార్చకుడుగా కుదిరి భవతారిణీదేవిని అర్చించటం ప్రారంభించి, రాసమణికి అభిమానపాత్రుడయ్యాడు — మన గదాధరున కీ దక్షిణేశ్వరములోనే రామకృష్ణు డని పేరు వచ్చింది. ఏమంటే, రాసమణి అల్లుడైన మధురమోహనుడు గదాధరుని ఆ పేరుతోనే పిలిచేవాడు. ఆ తర్వాత-అంటే రామకుమారుడు అర్చకుడుగా కుదిరినతర్వాత—

క॥ వంత :—

వినరా సోదర రామకృష్ణు కథ
వీనులార నేడు

అన్న పూజకై సమ్మతించుట
అతనికి గిట్టకను॥ వి
కలకత్తానగరంబు చేరెను
కాలినడక నంత॥ వి
రామకుమారుడు బ్రతిమాలుటచే
రామకృష్ణు డంత॥ వి
దక్షిణేశ్వరము వచ్చి చేరెను
తలను దాల్చి ఆజ్ఞ॥ వి
తనదు నిష్ఠకు కాళిప్రసాదము
తగ ద టంచు నెంచి॥ వి
గంగయొడ్డున నె వంటచేసికొని
గడపుచుండువాడు॥ వి
రాణిరాసమణి అల్లుడు కలడు
మధురానాథుండు॥ వి
ఎన్నగ మే లగు గుణముల కన్నిటి
కతడే నాథుండు॥ వి
మధురుడు మన శ్రీరామకృష్ణుపై
మక్కువగొనియుండె॥ వి
రామకృష్ణుపై మిక్కిలిభక్తిని
రాజిలు మధురుండు॥ వి
ఇట్టు లుండగా రామకుమారున
కెంతో జబ్బు చేసె॥ వి
కాళీమాతకు అర్చనచేసెడు
దాత కాన రాక॥ వి
మధురుడు చేరెను రామకృష్ణుతో
మాటలాడగాను॥ వి

రా॥ మధురానాథుడు రామకృష్ణుని అన్నగారి బదులుగా దేవికి అర్చనచేయవలసిం దని అర్థించాడు. అన్నగారి పరిస్థితి చాల ప్రమాదకరంగా ఉన్న దని గుర్తించి – మక్కువతో – మమకారంతో – భక్తితో ప్రార్థించే మధురునిమాట కా దన లేక, తాను దేవతార్చనసమయంలో బాహ్యప్రజ్ఞ కోల్పోతాడు కాబట్టి, భవతారిణీదేవి బంగారు సొమ్ములను రక్షించటానికి వేరొకవ్యక్తిని కూడ నియమిస్తే తాను అర్చనచేస్తా నన్నాడు రామకృష్ణుడు. అందుచే ఆ పనికి రామకృష్ణుని మేనల్లుడైన హృదయరాముడు నియమించబడ్డాడు. మఱునాడు రామకృష్ణుడు భవతారిణి ఆలయంలో అడుగు పెట్టాడు అర్చించటానికి. సర్వమంగళాకారిణియైన ఆ జగదంబను చూచి —

పద్యం

క॥ ఉత్ప :—
ఏ మిది ? సర్వలోకముల
నేలెడు నా జగదంబ యిచ్చటన్
భూమిని గల్గు భక్తులను
భూరికృపామతి నేల రాతిలో
ప్రేమను నిల్చియుండినదె ?
భేషుర ! కల్ల నిజంబు లెల్ల నే
మామకతీవ్రయత్నముల,
మారని భక్తిని కందు నింకపై.

రా॥ శ్రీరామకృష్ణు డీ విధంగా స్థిరసంకల్పుడై, జగన్మాత సాక్షాత్కారాన్ని పొందుటకై అచంచలభక్తివిశ్వాసాలతోను, అనవరతధ్యాననిష్ఠలతోను బాహ్యప్రపంచాన్ని మరచి నిద్రాహారాదులను లెక్కచేయక తరచుగా దేవీపాదపద్మాలను ధారాపాతంగా కారే కన్నీటికాల్వలచే తడుపుతూ ఈ విధంగా ప్రార్థించేవాడు.

పాట – 4

క॥ కాన రా వే మమ్మా ఓ కాళిమాతా
కానివాడనా నేను కరుణాసమేతా॥ కా.
నీవుంట యీధరలో నిక్క మంటూ జనులు
నమ్మియున్నవారు అమ్మా ఉంటివో లేవో॥ కా

ఉన్నది నిజమైన కన్నుల బడ వేమి
కన్నబిడ్డలయందే కాఠిన్య మేలా॥ కా
ఎన్నో యుగములనుండి ఎన్నో జన్మల నెత్తి
నీదివ్యపాదనీరజ మందలే నైతి॥ కా
ఎన్నో జన్మలనుండి ఈభవము ప్రగ్గితి
ఆయువు చెల్లిన అడ్డుపడువా రెవరె॥ కా
అదిగో! సూర్యుడు చూడు అపరాబ్ధి గ్రుంకె
ఆయువునం దొక్క రో జంతరించె॥ కా
తవదర్శనభాగ్యంబు తక్కని యీ దేహ
మేలనె నాకింక మేలు వీడుట యింక॥ కా

రా॥ ఎంతకూ దేవీదర్శనం కలుగలే దని రామ
కృష్ణుడు

క॥ అమ్మా నాపై సుంతయు। సై
కారుణ్యమే కానకుంటివి। సై
నీదుదర్శనము లేకను। సై
నాకు దేహ మిం కేలను। సై
అంటు దేవి చేతికత్తిని। సై
చటుకున చేనందుకొన్నా డా। సై
భళానోయి భాయి తమ్ముడు। సై
భాయి భళానోయి దాదానా।
ఆత్మహత్యకై పూనియు।
కత్తి నెతె కంఠ మేయగా।
కాళి వచ్చి కరము పట్టె రా। సై
బిడ్డా, వీడుము భీతిని। సై
ఉంటిని నీకండదండగా। సై
ప్రాణము వీడుట తప్పురా
నిన్ను పాలింపగా నే నున్నా రా॥ భళా

రా॥ ఈ విధంగా జగన్మాత సాక్షాత్కారం పొందిన రామకృష్ణుడు తనభక్తిప్రభావం వల్ల ఆమెను తనపట్ల నిత్యప్రసన్నురాలి నిగా చేసికొన్నాడు. తదుపరి—

క॥ తే॥గీ॥ లోకముల నెల్ల పోషించు లోకమాత
పిలిచి నంతనె ఓ యని పలుకుచుండ
రామకృష్ణుడు రేబవల్ ఆమె ప్రోల
గడపుచుండునుభక్తితో కరము మోడ్చి.

రా॥ నాటినుండి భవతారిణీదేవి విగ్రహం శ్రీరామకృష్ణునికంటికి పరిపూర్ణచైతన్యం తో పరిఢవిల్లుచుండుటచేత, అతనిపూజా విధానంగూడ నూతనత్వాన్ని పుంజీభవించు కొన్నది.

హా॥ ఏవిధంగారా?

క॥ వంత :—

వినరా సోదర రామకృష్ణుని
విమలచరిత నేను
దైవపూజకై తెచ్చిన పూలను
తానె తలను దాల్చు॥ వి
చందనాది సుగంధద్రవ్యములు
చక్కగ పూసికొను॥ వి
తెచ్చిన భక్ష్యము లన్నియు దేవిని
తిను మని బ్రతిమాలు॥ వి
దేవి ఆన తిడినట్టులు తానె
తిను నొక్కొక మారు॥ వి
అమ్మకు శ్వాస పరీక్ష సేయగా
అప్పు డప్పు డతడు॥ వి
కాళిముక్కుకడ వ్రేలిని ఉంచి
కాంచును సంతసము॥ వి

రా॥ ఈ విపరీత చేష్టలు చూచి ప్రజ లాయనకు పిచ్చి, అందులో మదపిచ్చి పట్టిం దని అను కొన్నారు.

హా॥ అంటే నీవు అనుకోలే దన్న మాట. చా ల్చాల్లే ఊరుకోరా పిచ్చి కుంకా! అసలు నిన్ను ముందు వైజాగ్ పంపకపోతే మా కందరికీ పిచ్చి యెక్కించే టట్లున్నావ్! పిచ్చి కాదుట పిచ్చి!!!

రా॥ పిచ్చేరా! అది ఖచ్చితంగా పిచ్చే! కాని యిది మదోన్మాదం కాదు. భగవదున్మాదం రా. ఎన్నో జన్మల తపఃఫలంవల్ల కాని యిది లభించ దీ మాయామేయజగత్తులో. కాని దీనిని మామూలు పిచ్చిక్రింద భావించి ఆయన కనేక మందులు మ్రాకులు ఇప్పించారు. తగ్గ లేదు. తుదకు

క॥ వంత :—

వినరా సోదర రామకృష్ణుని
విమలచరిత నేడు
పెండ్లి చేసినచో పిచ్చి కుదురు నని
పెద్ద లెంచినారు॥ వి
పిల్ల నెచ్చటను దొరకకపోవుట
తల్లడిల్లినారు। వి
రామకృష్ణు డది గాంచి తల్లికడ
కేగె రయము మీర॥ వి
"అమ్మా, బాలిక యొక్కతె నాకై
అవని పుట్టి యుండె॥ వి
ఆమె జనకుడు రామచంద్ర
ముఖోపాధ్యాయుండు॥ వి
ఆమెను నా కిమ్మని మీరందఱు
అడిగిచూడు" డనగ॥ వి
తల్లి చాలగ నబ్బురపడెను
తనయుని మాటలకు॥ వి

హా॥ ఎవ డీ రామచంద్రముఖోపాధ్యాయుడు?

రా॥ ఇతడు కలకత్తాకు దాదాపు 80 మైళ్ళ దూరమున ఉండే 'జయరాంబాటి' అనే కుగ్రామవాస్తవ్యుడు. సామాన్యసంసారి. అత్యంతభగవద్భక్తుడు. ఈ మహనీయునకు 1853-వ సంవత్సరం డిసెంబరు 22-వ తేదీని దేవీ ప్రసాదంవల్ల శారదామణి అనే కుమార్తె కల్గింది. ఆమె ఐదారేండ్లప్రాయముననాడే సుగుణాల కుప్పయై అలరారుతుండేది. ఎలా అంటే—

పాట – 5

క॥ శారదమాయి గుణగణంబులను
శ్రద్ధగ వినుమన్నా
ఆ లోకమాతయే బిడ్డల కావగ
అవతరించె నన్నా –
నిజ మని నమ్ముము మది నన్నా॥ శా
పేదలపాలిటి పెన్నిధి యాచు
దానధర్మములు దయ సలుపును రా
వారికి కల్గిన వంతల నన్నీ
తనవిగ మదిలో తలచును రా॥ శా
ఇంటిపనులను ఒంటి ముగించుక
ఇరుగుపొరుగునకు ఎపుడు సాయపడు
నియతిని దేవిని నిరతము కొలిచి
దేవి దర్శనము దీక్షతొ పొందెను॥ శా

రా॥ ఇటువంటి శారదామణిని, రామకృష్ణున కిచ్చి వివాహం చేయవలసిందిగా కోరింది చంద్రమణీదేవి రామచంద్రముఖోపాధ్యాయుణ్ణి. అతడు అంగీకరించాడు. ఒక శుభముహూర్తాన శారదారామకృష్ణుల కళ్యాణం జగత్కళ్యాణం నిమిత్తం జరిగిపోయింది. అప్పటికి శారద యింకా చిన్నపిల్లయిన కారణంచేత, ఆమెను పుట్టింటివద్దనే ఉంచి రామకృష్ణుడు తనదివ్యసాధనాపీఠం అయిన దక్షిణేశ్వరం చేరాడు. మళ్లీ యథాప్రకారం కాళీసన్నిధిలో దివ్యభావపారవశ్యమే – అద్వైతపూజావిధానమే!

(సశేషము)



# శ్రీమద్భాగవతము - శ్రీకృష్ణసందేశము

## [శ్రీమత్పరిభవానందవాణి]

## చతుర్థస్కంధము

### సమాసము

శ్రీశుకదేవు ననుసరించి సూతుడు భాగవతమును చెప్పుచున్నాడు. ఈ ప్రకరణమున మైత్రేయుడు ఇంకను విదురునితో సంభాషించుచున్నాడు. పురాణ పురుషవతంసులను మహిళామతల్లులను గుఱించి చెప్పుచున్నాడు.

### ప్రథమాధ్యాయము

### ధ్రువోపాఖ్యానము

బ్రహ్మకు జనించిన మొదటినరుడు మనువు. మనువునకు కుమారుడు ఉత్తానపాద మహారాజు. ఉత్తానపాదునకును అతని మొదటి భార్యయగు సునీతికిని పుత్త్రుడు ధ్రువుడు. రాజు రెండవభార్య సురుచి. ఆమెయందు రాజునకు గాఢప్రేమ. చెడ్డ అసూయ ఆమెకు మిక్కుటము గాబట్టి ఆమె అనిన రాజు గడగడలాడు చుండును.

ఒకనాడు ఉత్తానపాదమహారాజును సురుచియు ఒకచోట కూర్చుండి తమ పుత్త్రుడగు ఉత్తముని లాలించుచుండిరి. వా రట్లు ఆః దించుచుండుటను చూచినప్పుడు ఐదేండ్లవాడగు ధ్రువునకు నోరూఱినది. అతడును సమీపించి ఆక్రీడలో పాల్గొందు నని రాజానుమతిని కోరెను. కాని రాజు తన పెద్దకుమారుని కన్నెత్తియైన చూడ లేదు. సవతిపుత్రునందు ప్రేమ ఇంచుకేని లేని సురుచికి అతని యెడ రాజు చూపిన నిరాదరము ప్రీతికరముగ నుండెను. ధ్రువునితో ఆమె యిట్లనెను. "నీవు రాజపుత్రుడ వనుటకు సందేహము లేదు. కాని రాజుగారి కుమారుడవే యైనను నా కడుపున పుట్టనివానికి రాజ్యార్హత లేదు. కావున నీకు రాజ్యాశ యున్నచో ఈజన్మమంతయు తపస్సు చేయుము. మఱుజన్మమున నాకు పుత్రుడవై పుట్టునట్లు వర మడుగుము."

ధ్రువుడు సురుచి కేమియు బదులు చెప్ప లేదు. కాని తండ్రి ఏమేని ఓదార్పు మాట పల్కునేమో యని ఆయనవైపు తిరిగెను. ఆయన నోరెత్తలేదు. ఏడ్చుచు నతడు తన తల్లియొద్దకు పరుగెత్తెను.

అంత మిక్కుటముగ నేడ్చుచున్న కొడుకును చూచి సునీతి హృదయమున మిక్కిలి బాధపడెను. అతనిని చేరదీసి కన్నీరు తుడిచి ముద్దుకొని మంచిమాటలతో ఓదార్చెను. ఏడ్పు ఉడిగి అతడు శాంతింపగనే ఆమె యిట్లనెను.

"కుమారా, నీసవతితల్లి మాటలకు అంత యెక్కువగా బాధపడకు. ఆమెపై కోపించుటకు బదులు ఆమెకై శోకింపుము. కర్మసూత్రము ప్రకారము ఆమె చేసినవి ఆమెకే అనుభవమునకు రాక తప్ప వని నీకు తెలియును గదా! ఆమె నీకు చెప్పిన ఏకైకసత్యమును మాత్రము జ్ఞప్తియం దుంచుకొనుము. తపస్సు

చేత భగవత్ప్రార్థనచేత భగవదనుగ్రహము చేత సర్వమును సుసాధ్యమే అనుట నిజమే. కుమారా, దేవు డొక్కడే మనకు దిక్కు, మనల నోదార్చువాడు.''

''అమ్మా, దేవు డెవరు? ఆయన నెచట దర్శింప వీ లగును చెప్పుమా?'' అని ధ్రువు డడిగెను.

ఆయన పుండరీకాక్షు డట. సకలదుఃఖములు మాప గల వాడు, సకలాభీష్టములను కూర్ప గల వాడు ఆయన యొక్కడే. అనన్యులై ఆయనను శరణుజొచ్చినవారికి ఆయన యనుగ్రహము లభించును. ఆయనను పొందుట సులభము కాదు. యోగులహృదయములలో వారి పరిపూర్ణభక్తికి వశుడై ఆయన నెలకొని యుండును.

ధ్రువుడు తల్లిమాటలను హెచ్చరికతో విని తా నొక యోగి కావలె నని మనసులో నిశ్చయించుకొనెను. దేవుని సాక్షాత్కరించుకొనవలసినదే అనుకొనెను. కాని యోగసాధనలను అతనికి ఉపదేశింప గల వా రెవరు?

వెలుగు మన డెందములలోనే ఉన్నదట. అంధకారము దానిని ఆవరించి యున్నది. తమ వెలుగునుకప్పియున్న చీకటిని తొలగించుకొన్నవారే ఇతరులందు మఱుగుపడియున్న జ్యోతిని వెలువరింపగలరు. ఆదర్శగురువు అట్టివాడు. పుండరీకాక్షుడైన సర్వేశ్వరుని సాక్షాత్కరించుకొను టెట్లో తన కుపదేశింప గల వారిని వెదకుచు ధ్రువుడు బయలుదేఱెను.

నారదమహాముని భగవద్ధ్యానములో నుండగా బాలుడగు ధ్రువుని సరళహృదయమందలి కృష్ణతృష్ణ ఆయనకు తెలియ నయ్యెను. బాలుని భగవద్దర్శనాభిలాష అత్యంతమనఃపూర్వకమై యున్న దనియు అతని కొక మార్గదర్శకుడు కావలె ననియు గుర్తించి నారదుడు భగవత్సాక్షాత్కారమార్గమును అతని కుపదేశింతమని బయలుదేఱెను.

బాలుని కన్నంతనే నారదుడు అతనిని దీవించెను. తపోమార్గమునుండి అతనిని నిరుత్సాహపఱచుటకుం బోలె అతని ఆస్థను పరీక్షించుటకై నారదు డి ట్లనెను.

కుమారా, నీవు పసివాడవు. జీవితమును లౌకికానందములను ఇకమీద ననుభవింపవలసినవాడవు. భగవంతునిపొందు మార్గము దుర్గమము. యోగులు సమస్తజీవితానందములను త్యజించి పెక్కు సంవత్సరములు మిక్కిలి శ్రమపడుదురు. దేవుని కనగల్గుటకు ముందు అంత శ్రమపడవలయును. కాబట్టి ఇంచు మించు వ్యర్థమే అయిన ఈ అన్వేషణమును నీ వేల వదలుకోరాదు? ఇంటికిపో, మంచి రీతిలో జీవితముగడపు. మహాత్ముల సాంగత్యముపొంది ఆనందింపుము. అందఱియెడ కరుణయు సానుభూతియు కలిగియుండుము. సరళమైన ఈ యుపదేశమును అనుసరింపుము. నీవు సుఖముగ నుందువు. తర్వాత వృద్ధుడవై నప్పుడు ధ్యానపరుడవు కమ్ము!

కరుణాకరుడగు మునికి కృతజ్ఞతను తెల్పుకొని ధ్రువుడు వినయముతో ని ట్లనెను.

పూజ్యమహాశయా, ప్రాప్యము లన్నిటిలో మహోన్నతమైన దేదో దానిని, జీవిత పరమలక్ష్యమును, నేను కోరుచున్నాను. నేను దేవుని చూడ వలయును. నిను వేడుకొందును. మార్గ ముపదేశింపుమా?

నారదు డి ట్లనెను.

వత్సా, నీవు దృఢనిశ్చయుడవై యున్నావు. భగవదారాధనపరులగువారు నిజముగ ధన్యులు కదా! వారి డెందములందలి కోర్కె లన్నియు

నెఱవేఱును. పరమమైన మోక్షము వారికి లభించును.

నారదు డంత అతనికి పవిత్ర యోగమార్గ ముపదేశించెను. రేచకము, కుంభకము, పూరకము అను మూడు భాగములుగ ప్రాణాయామము నేర్పెను. ఇంద్రియములను, ప్రాణమును వశపఱచుకొనుటకు అదే మార్గ మని సూచించెను. మనసునకు నిశ్చలత కుదిరిన వెనుక ధ్యానాభ్యాసమునకు అర్హత కలుగు నని తెల్పెను.

ధ్రువునకు ప్రాణాయామవిధానము చక్కగ అలవడిన పిమ్మట నారదు డతనికి ధ్యానవిధానమును నేర్పెను.

ధ్రువున కిష్టదైవము వాసుదేవుడు (విష్ణువు). కావున నారదుడు ధ్రువునకు విష్ణుదేవుని హృదయాలయమున ప్రతిష్ఠించుకొని ధ్యానించుపద్ధతి నేర్పెను. ఇట్లనెను: "ప్రేమ సంభృతమగు భగవత్సన్నిధిలో నీ వున్నట్లుగా అనుకో. దేవునిప్రేమను రక్షణమును మార్గదర్శకత్వమును నీ యనుభవములోనికి తెచ్చుకో." అంతట నారదు డతనికి "ఓం నమో భగవతే వాసుదేవాయ" అనుమంత్రము నుపదేశించి ఇట్లు కఱపెను. "దీనిని మానసికముగ జపింపుము. జపించి భగవంతుని ఆరాధింపుము, ప్రార్థింపుము. వాసుదేవుని నీహృదయములోనే సాక్షాత్కరించుకొనుము. ఎల్లెడలను ఎల్ల ప్రాణులందును ఆయననే గుర్తింపుము. భగవదారాధనకు అచంచలాసక్తితో నిన్నంకితమొనర్చుకొనుము. నీకు పరమార్థజ్ఞానము ఈ జన్మములోనే కలుగును.'

నారదు డంత ధ్రువుని పవిత్ర యమునా తీరమున నున్న మధువనమున కేగి భగవత్సన్నిధానవిశిష్టమగు ఆ ఏకాంతపవిత్రపరిసరములలో ధ్యానము నభ్యసింపు మని చెప్పెను. ధ్రువుడు గురుచరణములకు సాష్టాంగముగ మ్రొక్కి తపస్సాధనలకై మధువనమున కేగెను.

నారదుడు హృదయమున ప్రీతుడై ఉత్తానపాద మహారాజును దర్శింప నేగెను. రాజు ఆయనను ఉచితభక్తితో ఆదరించెను. రాజు ముఖమున విషాదచ్ఛాయను గుర్తించి నారదుడందులకు కారణ మడిగెను. రా జిట్లనెను.

"పూజ్యమునిరాజా, నా హృదయము నా పుత్రుడగు ధ్రువునకై ఉత్కంఠితమై వ్యధనందుచున్నది. నా యిల్లాలిప్రీతికై అతనిని ప్రేమింపక కష్టపెట్టి తఱిమివైచితిని. ఇప్పుడత డెచ్చట నున్నాడో తెలియదు. అదే నా హృదయబాధకు కారణము. రాజులలో గాని, తండ్రులలో గాని నావంటి వంచితుడును క్రూరుడును మఱొక్క డుండడు."

అతని దుఃఖమును జూచి మనస్సు కరగి నారదు డిట్లూరడించెను.

రాజా, దిగు లొందకు. నీకుమారుడు సజీవుడై యున్నాడు, క్షేమముగా నున్నాడు. దేవరక్షితుడై యున్నాడు. అతని కెట్టికీడును కలుగదు. అతనికీర్తి దశదిశల వ్యాపింపనున్నది. తుదకు అతడు నీయొద్దకు మరలి వచ్చినప్పుడు అతని యశోమహిమలో నీవును పాల్గొందువు.

ఆపరమపావనుని నోట వెలువడిన ఈ మాటలు ఉత్తానపాదుని దుఃఖవిదీర్ణచిత్తమునకు శాంతిని కలిగించెను.

ధ్రువుడు అత్యంతనిష్ఠతో మధువనమున తపస్సు చేయుచుండెను: తొలి దినాలలో అతని మనసు కొంత చెదరు చుండినది కాని అచిరకాలములోనే అతడు మనస్సును నిగ్ర

హించి ధ్యానానందము ననుభవింపసాగెను.

అతని తపఃపురోగతి ఎంత చుఱుకుగా సాగె ననగా ఐదవనెలలోనే అతడు భౌతిక స్మృతిరంగమునుదాటి పైమెట్టెక్కెను. పరిసరప్రపంచమును గూర్చి అత డేమియు నెఱుగకుండెను. అతని మనస్సు బ్రహ్మానుసంధానమున లీనమై యుండెను.

ఆఱవ నెలలో అతని ధ్యానము మఱింతగాఢమయ్యెను. అజ్ఞానతమోయవనికలు ఒకటి వెంబడి ఒకటిగా తొలగినవి. దివ్యజ్యోతియు దివ్యపురుషుడును ఇష్టదైవమునగు వాసుదేవుడు కృపామందహాసాంచితవదనుడై అతని హృదయముననే అతనికి ప్రత్యక్షమయ్యెను. ఆఅనుభూతి ఎంత నిజముగా నుండె ననగా, ఆదివ్యసాన్నిధ్యము ఎంతస్పష్టముగా నుండె ననగా—విషయప్రపంచము పూర్తిగా అదృశ్యమైపోయెను. ధ్రువుని ఆనందము అనిర్వచనీయముగ నుండెను. సర్వమందును బ్రహ్మాండాంతర్వ్యాప్తమైన ఆ భగవత్తేజమే అతనికి కనవగుచుండెను.

కాని ఈసమాధిదశ చిరకాలము సాగలేదు. వెంటనే అందుండి అతడు మేలుకొనెను. కనులు విచ్చెను. తనహృదయములో తానింత సేపును చూచుచుండిన వాసుదేవమూర్తి భౌతికనేత్రములకు ఎట్టయెదుట వెలసి యుండెను. ఆయనదీప్తి విశ్వవ్యాప్తమై యుండెను. దివ్యప్రేమచే ధ్రువునిడెందము కరగెను. పరిపూర్ణానందముతో అతడు దేవుని ఇట్లు స్తుతించెను:

నీ వఖండపరబ్రహ్మ మవుదు నాథ
లేదు నీ కొక మాఱుపు లేదు సాటి
లేదు మొదలును తుదయును లేదు నీకు
సచ్చిదానందమూర్తివి సరసిజాక్ష
దీనులకుఁ బేదలకు నీవె దివ్యసఖుఁడ
వందఱకు నీవె శరణంబ వౌదు, దేవ
జనన మరణాల సుడినుండి జలధిశయన
బ్రోచెదవు మమ్ము నందఱ భూరికృపను
భక్తి నొసఁగుముసామి నీపదములందు
భాగవతగోష్ఠిఁ బరఁగెడి భాగ్య మిమ్ము
శరణు జొచ్చితి నీ దివ్యచరణయుగళి॥

అంతట స్వామి అతనితో నిట్లనెను :

"వత్సా, నీ హృద్గతాభిప్రాయము నేనెఱుగుదు నోయి. రాజు కావలె నని నీవు కోరితివి. మీతండ్రిరాజ్యమును పెక్కు సంవత్సరముల కాలము నీ వేల గలవు. భువియందు నీ నిర్ణీత జీవితకాలము ముగిసిన వెంటనే నీవు దివియందు జ్యోతిర్మండలము నధిష్ఠింతువు. అచట నిన్ను వేల్పులును దేవయోనులును నక్షత్రములును నీ మహిమను కీర్తించుచు నిన్ను ప్రదక్షిణించుచుందురు. ఆగోళమునకు నీది కేంద్రస్థానమై యుండును. నీవు ధ్రువనక్షత్రమన బరగుచుందువు." ఇట్లానతిచ్చి దేవుడు అంతర్ధానము చెందెను.

ధ్రువుడు తనడెందమున విషణ్ణుడయ్యెను. తండ్రిప్రేమమీాద, తండ్రిరాజ్యమునకు తనకున్న హక్కులమీాద, అతని కొకప్పుడు మోజుండినది నిజమే. కాని ఇప్పుడు ఆత్మానందముతో పోల్చిచూచినప్పుడు అవి యెంత క్షుద్రములైనదియు అతనికి స్పష్టమయ్యెను. గంగగట్టున బావిత్రవ్వుకొన్న అవివేకివంటివాడను తాను అని అతడు గుర్తించెను. భగవత్ప్రీతియు భగత్సేవయు తప్ప ఇప్పు డతనికి వేఱేదియు గిట్టకుండెను.

అత డెట్లో తన్ను శాంతపఱచుకొని దేవుని సంకల్పమును మన్నించుచు తండ్రిరాజధానికి పోదమని బయలుదేఱెను.

తన కుమారుడు ధ్రువుడు వచ్చుచున్నాడని ఉత్తానపాదమహారాజునకు తెలిసెను. వెంటనే అతడు సురుచిని, ఉత్తముని, ధ్రువ మాతయగు సునీతిని పరిచారకులను పెక్కండ్రను సమావేశపఱచెను. ఉజ్జ్వలాలంకార యుతములగు వాహనములతో మహావైభవముతో గొప్ప ఊరేగింపుగా ధ్రువున కెదురేగెను.

సమీపించుచున్న ధ్రువుడు కనబడగనే రాజు పరుగునబోయి ఉప్పొంగు ప్రేమతో కౌగిలించుకొనెను. ధ్రువుడు తండ్రిపాదములకు సాష్టాంగముగ మ్రొక్కెను; పిదప సవతితల్లి యగు సురుచికి మ్రొక్కెను. ఆమె అతనిని కౌగిలించుకొని ప్రేమతో ముద్దుగొనుచు నిట్లనెను:

వత్సా చిరంజీవిగ నుండుము! దయచేసి నన్ను మన్నింపుమా, దేవున కెవడు ప్రియుడో అతడు సర్వప్రాణులకును ప్రియుడు. అతని యెదుట ఎట్టి పగయును, ద్వేషమును నిలువ లేవు. నిన్ను నాబిడ్డ యని చెప్పుకొని ఆనందించుచున్నాను, గర్వించుచున్నాను.

ధ్రువుడంతట అనురాగముతో తమ్ముడగు నుత్తముని కౌగిట గ్రుచ్చెను. అటు పిమ్మట నతడు తనతల్లిచరణములకు మ్రొక్కెను. ఆనందప్రవాహము పొంగిపొర్లు డెందముతో ఆమె అతనిని లేవ నెత్తెను.

నగరవీథులగుండ ధ్రువుడు రాజభవనమున కేగుచున్నప్పుడు సకలప్రజలకును అదొక మహోత్సవముగ నుండెను.

ధ్రువునకు యుక్తవయస్సు రాగానే ఉత్తానపాదు డతనికి రాజ్యాభిషేకము గావించి ప్రజల యనుమతిని జీవితశేషమును దైవధ్యానమున గడపుటకై నిర్జనవనము నాశ్రయించెను.

ఒకనాడు ధ్రువునితమ్ముడగు నుత్తముడు వేటాడుటకై పోయి యుండి అట నొక యక్షునిచే హతు డయ్యెను. ఆవార్త విని ధ్రువుడు మహోగ్రుడై ఉత్తరదిక్పతియు, నిధీశుడును, యక్షులకు ప్రభువు నగు కుబేరునిమీదికి యుద్ధమునకు పోయెను. యుద్ధము ఘోరముగా చెల్లుచుండినది. లెక్కకు మిక్కిలిగా యక్షులు హతు లగుచుండిరి. ధ్రువుని పితామహుడగు మనువు మునీంద్రానుగతుడై అచటి కరుదెంచి నిరపరాధులగు యక్షులనుచంప వల దనియు పోరు మాను మనియు ధ్రువుని ప్రార్థించెను. మను విట్లనెను :—

ఎందుల కిట్లు పోరాడుచున్నావు? తమ్ముని మరణదుఃఖమునకు వశుడవై వంచితుడ వైతివి. అరిషడ్వర్గముపైని నీ అదుపు సన్నగిల్లినది. మరణింపనివాని కొఱకై నీకు దుఃఖమేల? జననమరణములు దేహమునకే గాని, ఆత్మ నిత్యము కదా!

నీవు జ్ఞానము నధిగమించితివి. భగవద్భక్తిచే సిద్ధులను బడసితివి. ఐనను ఇంకను కొంత అజ్ఞానము నీలో నిల్చి యున్నది. సర్వగతమగు ఐక్యమును గుర్తింపక ఇంకను భేదభ్రాంతిలోనే ఉన్నావే. కావున ఇపుడు నీవు మహోన్నతపరమార్థమును అన్వేషింపవలెను. దానిని ప్రాప్తించితివేని దేవు డొక్కడే యని సకలచరాచరములకు అంతర్యామిగనుండు దివ్యాత్మ ఒక్కటే అని నీకు ప్రత్యక్ష మగును. మాయలో, ఇక నెన్నటికిని చిక్కుకొనని రీతిగ అందుండి విముక్తుడ వగుదువు.

మనువు ఈసత్యమును జ్ఞప్తి పఱుపగనే ధ్రువునకు తన గొప్ప తప్పు స్పష్ట మయ్యెను. తక్షణమే అతని కోప మంతయు పోయెను.

యక్షులతోడి యుద్ధము మానెను. విశ్వప్రేమ మరల నతని డెందమున నిండెను.

పోరు మానుకొంద మను ధ్రువుని నిశ్చయ మును యక్షనాథుడగు కుబేరుడు విన్న వెంటనే ఆయన ప్రత్యక్షమై ధ్రువుని సఖ్యమును కాంక్షించెను. మానవుల కోర్కెలను ఫలింప జేయ గల ప్రభావము కుబేరున కున్నందున ఆయన ధ్రువుని "నీ కిష్టమైన వరమును దేని నైనను వేడుము ఇచ్చెద"—ననెను.

ధ్రువు డంమల ట్లనెను :.

"నాహృదయాభీష్టమును నెఱవేర్ప నను గ్రహింతువేని భగవంతుని స్మృతి నాకు సదా ఉండునట్లు చేయుమా, నీవు నా కీయ వలసినది ఈ ఒక్కవరమునే. భగవంతుని నిరంతర స్మర ణములోనే ఎవడుండునో వాడు లౌకిక మాయల నుండి విముక్తుడగును".

అడిగిన తక్షణమే కుబేరు డా వరమిచ్చి అంతర్ధానము చెందెను.

ధ్రువుడు కొన్ని సంవత్సరములు శాంతి సంపన్నముగ రాజ్య మేలెను. పిమ్మట తన కుమారుడగు ఉత్కలునకు పట్టము గట్టెను. చిన్ననాడు భగవంతునితో తా ననుభవించిన ఐక్యానందమును మరల సాధింప గోరి ధ్రువుడు హిమాలయమునొద్ద బదరికాశ్రమమున కేగెను. అక్కడ ప్రతిదినమును ఏకాంతమున ధ్యాన దశలో, ఈశ్వరసంశ్లేష మనుభవించెను.—సాంతమును అనేకము నగు దృశ్యమాన జగ మును గూర్చిన స్మృతి అతడు మరల కోల్పో యెను. దివ్యమును విశ్వవ్యాప్తమును. అగు ఐక్యమును స్ఫుటముగ అనుభవించెను. తుదకు అతని అహంకారము పూర్తిగా అంతరించెను. నేనును భగవంతుడును ఒక్కరమే అనుకొనెడి ఏకాద్వితీయచైతన్యమున నతడు నిమగ్నుడై యుండెను. అఖండసత్తు అఖండచిత్తు అఖండా నందము—అను నది మాత్రమే అతని యెఱు కలో నుండెను. ప్రేమనాథుడును తానును ఒక్కరమే అని తుదకు అతడు గుర్తించెను.

ధ్రువునకు మామూలు స్మృతి మరలగానే తన ఆత్మకు వస్త్రస్థానమున నుండిన భౌతిక దేహమును విసర్జింపవలసిన సమయము సమీ పించుచున్న ట్లతనికి తెలిసెను. తటాలున నతనికి దివ్యదర్శనము కనిపించెను. తన్ను వైకుంఠమునకు కొని చనుటకు భాస్వరమైన యొక రథము దివినుండి దిగి వచ్చుచుండెను. దానికాంతి అతనిని అతనిసర్వస్వమును ఆవ రించెను. విష్ణుదేవు ననుచరు లిద్దఱు అరదము నుండి దిగి "నిన్ను తన దివ్యధామమునకు పిలుచుకొనిరమ్మని విష్ణుదేవుడు మమ్మంపెను." అని ధ్రువునితో ననిరి.

ధ్రువుడు వారిని భగవత్కింకరు లని గుర్తించి సాష్టాంగముగ మ్రొక్కెను. విష్ణు దేవునినామమును ఉచ్చరించినవెంటనే అతనికి భౌతికదేహము తొలగెను. అంత నతడు రథ మధిష్ఠించెను. ఆ రథమున పైకిపోవుచు నతడు దారిపొడుగునను సంకీర్తనలను ఆనందాను భూతులను చూచెను.

ఆనాడు స్వామి పలికినట్లు ధ్రువుడు జ్యోతి ర్మండలమునకు చేర్పబడెను. యుగయుగము నను సకలమానవకోటికిని దిగ్దర్శిగా ధ్రువ నక్షత్రముగా అతడు నెలకొనెను.



# ఆస్తిక్యం

## పాపపుణ్యవిచక్షణ

### శ్రీ పున్నావజ్ఝల సీతారామబ్రహ్మంగారు

సృష్టికర్త, సృష్టిభర్త, సృష్టిహర్త అయిన శక్తి భౌతికమైన అంధశక్తి కాదని, రసాయనిక ద్రవ్యాల కలయిక ఫలితం కాదని, అది కేవలం సచ్చిదానంద మయమయిన పరబ్రహ్మ మని మనస్సుకు తేటపడిన తరువాత ప్రార్థన ఏల అవసరమో, ప్రార్థనవల్ల కలుగగల పరమ ప్రయోజన మేమో, పాప పుణ్యాల కర్థ మేమో తెలుసుకొనడం కష్టం కాదు. సచ్చిదానంద పరబ్రహ్మము – దాని స్వరూప లక్షణాల దృష్ట్యా, అది శుద్ధచైతన్యం; జగత్తులోను, జీవులలోను దానికి గల సంబంధం దృష్ట్యా, అది పురుషుడు.

ఏకము అనేకమయినది. అంతటితో అది హరించిపోయినదా? లేదు. ఎందుకు హరించి పోతుంది? ఎలా హరించిపోగలదు? దానిని హరించే దెవరు? మరొక టేదీ లేనే లేదు కదా? పైగా, అది అనంతం. ఉనికియందు దనంతం, వ్యాప్తియం దనంతం, సీమయం దనంతం, కాలమం దనంతం, కార్య కారణ సంబంధమం దనంతం, శక్తియం దనంతం, జ్ఞానమం దనంతం, ఆనందమం దనంతం. అనేకం అనంతంగా దాని నుంచి ఉద్భవిస్తున్నప్పటికీ అది లవలేశమైనా తరుగుపోదు. అది అవ్యయం. అనంతంనుంచి అనంతం తీసివేస్తే మిగిలేది అనంతమే కదా!

అనేకంలోని ప్రతి ఒక్కటి తన ఉనికియందు ఏకమేవా ద్వితీయమైన సచ్చిదానంద పరబ్రహ్మముతో సర్వదా ఒక్కటే. వ్యవహారమందు మాత్రమే అది వేరయినది, పరిమితమైనది. అనేకంలోని ప్రతి ఒక్కటికి తక్కిన అన్నింటితో నిగూఢమయిన ప్రగాఢ సంబంధం ఉన్నది. ఆ సంబంధం ఏకమేవా ద్వితీయమైన సచ్చిదానంద పరబ్రహ్మమువల్ల కలుగుతున్నదే. కనుక అది అనివార్యమైన సంబంధం. అనేకంలోని ప్రతి ఒక్కటియందు సమస్తానేకం అంతర్నిహితమై ఉన్నది. అనేకమం దేకం ప్రతిష్ఠితమై ఉన్నది. "ఏకం సత్" అన్నప్పుడు "ఏకం" సంఖ్యావాచకం కాదు. తత్త్వతః పరస్పర విరుద్ధమైన దేదీ కాదని తాత్పర్యం. వస్తుతత్త్వంచేత అది సదా ఏకం, వికాస బహుళత్వంచేత అది సర్వదా అనేకం.

ఏకం తన్ను తాను ప్రకటించుకొనడానికే అనేకమయినది. ఏకమునం దున్న అనంతశక్తిని అనంతరీతుల వ్యక్తం చెయ్యడమే నానాత్వానికి ధర్మం. కాని, వ్యవహారంలో నానాత్వమే ప్రాబల్యం వహిస్తున్నది. ఎక్కడ చూచినా నానాత్వపు ఆర్భాటమే కనబడుతున్నది. నానాత్వమే వ్యవహార జగత్తుపై ఆధిపత్యం వహిస్తున్నది. దాని సందడియందు ఏకము మరుగుపడిపోయింది. ఏకత్వాన్ని బహుముఖంగా ప్రకాశింప జెయ్యవలసిన నానాత్వం, దానిని కప్పివేస్తున్నది. ఉన్నదంతా నానాత్వమే అనిపిస్తున్నది. ఒకచెంప తన సౌందర్యంతో, లావణ్యంతో ఆకర్షించి, మరొకచెంప జ్ఞానం కలిగించి, అక్కరలు తీర్చి నానాత్వం మనలను తన వశం చేసుకుంటున్నది. భవన సౌందర్యం చూచి ముగ్ధుల మవుతుంటాము.

దానిని భరించే పునాదిని గురించి ఆలోచించే దెందరు? చెట్లమీది పూలు, పండ్లు చూచి సంతోషపరవశుల మవుతుంటాము. వాటికి కారణమైన వేరును గురించి జిజ్ఞాసచేసే దెవరు?

నానాత్వానికి ప్రధాన లక్షణం భేదభావం. నా ఉనికికి కారణం నానాత్వం. భేదజ్ఞానం లేకపోతే నే నెక్కడ ఉన్నాను? నా ప్రత్యేకత ఎక్కడ ఉన్నది? ఇతర వస్తుజాలంనుంచి, ఇతర జీవులనుంచి, ఇతర మానవులనుంచి నన్ను గుర్తించడం ఎలా సాధ్యం? నా పుట్టుకకు, పోషణకు కారణం భేదభావం. నా ప్రత్యేకతకు, ఆధిక్యానికి సహాయపడుతున్నది భేదభావం. నా విశిష్టమైన సుఖానికి, వికాసానికి శక్తి నిస్తున్నది భేదభావం. నాకు యుక్తాయుక్త, నిత్యానిత్య, ఆత్మానాత్మ, ధర్మాధర్మ, సత్యాసత్య, పాపపుణ్య విచక్షణా జ్ఞానం కలిగిస్తున్నది భేదభావం. కనుక నానాత్వానికి నే నెంతగా ఋణపడి ఉండాలి? నానాత్వ ఋణం నే నెన్నటికి పూర్తిగా తీర్చుకోగలను? భేదభావాన్ని నే నెంతగా పూజిస్తే దానిని నే నెంతగా ఒంటపట్టించుకుంటే నా కంతగా శ్రేయస్కరం — ఈ భావం సహజంగా, అప్రయత్నంగా జీవునికి కలుగుతుంది. ఉపాధిని పురస్కరించుకొని ఏర్పడిన తన ప్రత్యేకమయిన పరిమిత వ్యక్తిత్వాన్ని రక్షించుకొనడం, దానిని అంతులేకుండా వృద్ధిచేసుకొనడం జీవితలక్ష్యమనిపిస్తుంది. తన సుఖ లాభాలకోసం, తన కష్ట నష్టాల నివారణకోసం చేసే ప్రతి పని [illegible]మనిపిస్తుంది.

ఈ విధమయిన వైఖరితో సర్వమానవులు, సమస్తజీవులు, సకలవస్తువులు వ్యవహరిస్తే కలిగే ఫలిత మేమిటి? ప్రళయం తప్ప మరే మైనా ఉన్నదా? సృష్టే ఉండదు. కేవలము జీవకోటిలో మాత్రమే ఈ వైఖరి ఉన్నదనుకుందాము. అప్పుడుమాత్రం జరిగే పనేమిటి? నిరంతర సంఘర్షణ, కలహం, యుద్ధం, స్పర్ధ, అసూయ, ద్వేషం. ఈ భేదభావం మానవజాతికి పరిమితమయినా, ఇదే ఫలితం. ఈ సంఘర్షణలో ఎప్పు డెవరు ఎక్కువ బలం ప్రదర్శించ గలిగితే, ఎప్పు డెవరు ఎక్కువ బలం ప్రదర్శించే అవకాశాలు కలిగితే అప్పటికి వారిది జయం. బలహీనులు, అవకాశాలు అనుకూలంగా లేనివారు చనిపోతారు; లేదా, విజేతలకు బానిస లయిపోతారు. కొందరు బానిసలుగా బ్రతుకుతూ తమకు మంచిరోజుకోసం ఎదురు చూస్తుంటారు.

ఒక ముహూర్తంలో గెలిచినవారు ఎప్పటికీ గెలిచినట్టు కాదు. తమ గెలుపును నిలబెట్టుకొనడానికి తమ గెలుపునకు సహాయపడిన ప్రవృత్తులను, గుణాలను నిరంతరం పదునుపెట్టుకుంటూ, పోషించుకుంటుండాలి. ఇట్టి భేదజ్ఞానంతో సంఘవ్యవస్థ అనేది ఉండడానికే వీలులేదు. మానవులకు పరస్పర సంబంధం సాధ్యం కాదు. గెలిచినవా రయినా సుఖంగా బ్రతకడానికి ఇతరుల సేవ, సహాయం కావాలి. పోరాటంలో కూడా ఇతరుల తోడ్పాటు అవసరం. ఎవరికి వారు ఒక్కరే ఏమి పోరాడగలరు? ఇతరుల తోడ్పాటు బొత్తిగా లేకుండా బ్రతుకే సాధ్యంకాదు. స్వవ్యాఘాతము, పరస్పర విరుద్ధము, సర్వానర్థదాయకము అయిన నానాత్వం, భేదజ్ఞానం సత్యము, ధర్మము కాజాలవు. స్వవ్యాఘాతం లేకపోవడం, పరస్పర విరుద్ధం కాకపోవడం, సర్వశ్రేయస్కరం కావడం సత్యానికి లక్షణం. ఒక సత్యానికి మరొక సత్యానికి ఘర్షణ ఉండదు.

కనుక స్పష్టంగానో, అస్పష్టంగానో, తెలిసో,

తెలియకో, ప్రత్యక్షంగానో, పరోక్షంగానో ఏకత్వాన్ని ఆశ్రయించడం అనివార్య మవుతున్నది. ఐకమత్యం, ప్రేమ, కరుణ, సంఘీభావం, సఖ్యం, సహనం, సానుభూతి, సహజీవనం, సామరస్యం, సమన్వయం, స్నేహం, సుహృద్భావం—ఇత్యాది పదాలు, భావాలు అవసరమని గ్రహించడం ఏకత్వాన్ని దిఙ్మాత్రంగా గుర్తించడమే. అయితే, యిది నానాత్వానికి లోబడిన ఏకత్వం; వ్యవహార జీవితానికి కనీసమాత్రంగా అవసరమయిన ఏకత్వం. ఈ మాత్రపు ఏకత్వాన్ని అయినా సహించలేక భేదభావం తరుచు దానిని అణచివేస్తుంటుంది. అంతట వ్యక్తికి వ్యక్తికి మధ్య, కుటుంబానికి కుటుంబానికి మధ్య, వర్గానికి వర్గానికి మధ్య, జాతికి జాతికి మధ్య విద్వేషాగ్ని ప్రజ్వరిల్లు తుంటుంది; జీవన్మరణ సమస్యలు ఉద్భవిస్తుంటవి; గోరంతలు కొండంత లవుతుంటవి. వాటిని ఉపశమింప జెయ్యడానికి మహాత్ములు అవతరించి ఐక్యమును మన్నించవలసిన ఆవశ్యకతను గురించి ఉపదేశాలు చేస్తుంటారు.

కనుక, నానాత్వ మయమైన సమస్త జగత్తుకు కారకుడు, ఆశ్రయుడు, పోషకుడు అయిన ఏకమేవాద్వితీయుడయిన పరబ్రహ్మమును విస్మరించడమే ''పాపం'' అని నిస్సంకోచంగా నిర్వచించవచ్చు. ఇదే అసలయిన పాపం. తక్కిన సమస్త పాపాలకు ఈ పాపం బీజరూపం. దీనిని బట్టి నానాత్వాన్ని నిరసించడమే కర్తవ్యమని అర్థం కాదు. నానాత్వం లేకపోతే ప్రపంచమే లేదు. నానాత్వం బ్రహ్మలీల. అయితే, నానాత్వం – ఏకత్వం ఆధారంగా, ఏకత్వానికి లోబడి ఏకత్వమందే, ఏకత్వపు విలాసంగా ఉండాలి. నానాత్వం వైవిధ్యం కాదగునే కాని, వైరుధ్యం కారాదు. ఏకత్వానికి నానాత్వాన్ని లోబరచడమే ''పుణ్యం'', నిజమైన పుణ్యం. తక్కిన సమస్త పుణ్యాలకు ఈ పుణ్యం బీజరూపం.

సమస్త పాప బంధంనుంచి పూర్తిగా విముక్తి చెందాలంటే నానాత్వం, నానాత్వంలోని ప్రతి ఒక్కటి స్వతంత్ర మన్న భ్రమను విసర్జించాలి; ఇతరులతో ఆత్మీయతను సాధించాలి. అయితే, ఇతరులతో పొందే ఆత్మీయత పరస్పర వ్యావహారిక ప్రయోజనం కోసం చేసుకునే ఒడంబడిక కారాదు. పరస్పరం వంచించుకొన డానికి అవలంబించే రాజనీతి కారాదు. పరస్పరం సద్యః ఫలితం పొందగోరే బేరం కారాదు. గత్యంతరం లేక చేసుకునే నిర్ణయం కారాదు. భయపడి మన్నించే సిద్ధాంతం కారాదు. అభిరుచులలో, అభిప్రాయాలలో, ఆశయాలలో, ఆచారాలలో, విచారాలలో, ప్రచారాలలో, అలవాటులలో, ప్రవృత్తులలో, స్వభావాలలో గల పోలికలు కలిగించే ఆకర్షణకు పరిమితం కారాదు. అంతమాత్రమే అయితే, వాటి ఫలితంకూడా అంతంతమాత్రంగానే ఉంటుంది. అట్టి పరిమితులకు లోబడిన ఆత్మీయత దురభిమానంగా పరిణమించి, విద్వేషాన్ని పురికొల్పగల ప్రమాదం ఉన్నది.

ఏ ప్రయోజన దృష్టిలేక, ఏ పరిమితి విధించక, జన్మచేతనే (సర్వము ఏకమేవాద్వితీయమైన భగవంతునినుంచి ఉద్భూతమయినదన్న ఎరుకతో) స్వతస్సిద్ధంగా ఉన్న అనుబంధాన్ని గుర్తించి, దానిని అనుభవగతం చేసుకొనడమే ఇతరులతో సాధించదగు పరమోత్కృష్టమైన ఆత్మీయత. తనయం దితరులను, ఇతరులయందు తన్ను దర్శించగల అనుభవ విశేష మది. ఇందుకు ముందుగా తనకు భగవంతునితో గల ఐక్యమును అనుభవగతం చేసుకోవాలి. భగ

వంతునియందు, భగవంతుని ద్వారా మాత్రమే ఇతరులతో ఏకాత్మత సాధ్యం. ఇతరులతో తనకు గల సంబంధానికి తనకు భగవంతునితో గల సంబంధమే కారణం. పరమాత్మయందు, పరమాత్మద్వారా, పరమాత్మ చిత్కణాలుగా ఇతర జీవులతో ఏకాత్మత పొందినప్పుడే అది సుస్థిర మవుతుంది. అప్పుడే అది అన్ని భూమికలందు, అన్ని అంతస్తులందు అనుభవంలోకి వస్తుంది. అప్పుడే అది అన్ని రంగాలలో వ్యక్తం కాగలుగుతుంది. అప్పుడే అది అన్ని వ్యత్యాసాలకు అతీతము, అంతర్గతము అవుతుంది. వ్యత్యాసాలను భరిస్తూ, మన్నిస్తూ వాటిని అతిక్రమించగలిగిన ఆత్మీయతే నిజమైన ఆత్మీయత.

నాటకంలో దుష్టునిపాత్ర ఉండడం అవసరమయినట్టే జగత్తులో పాపం విధిగా ఉంటుందని అదెప్పుడూ ఉండేదేఅని, దానిని పోగొట్టడానికి ప్రయత్నించడం నిష్ఫలమని మన జిజ్ఞాసువు అభిప్రాయం.

నాటకంలో దుష్టునిపాత్ర ఎందుకు ఉంటుంది? దుష్టునిపాత్రవల్ల కలిగే ప్రయోజన మేమిటి? దుర్మార్గంలోని నైచ్యం, వెలికితనం, అల్పత్వం బట్టబయలు. మనకు దుర్మార్గంమీద జుగుప్స కలిగించడమే నాటకంలోని దుష్టునిపాత్రవల్ల కలిగే ప్రయోజనం. విషాదాంత నాటకాల ఫలితం హృదయనైర్మల్యసాధనమని ఆరిస్టాటిల్ అన్నాడు. హృదయనైర్మల్యానికి చిత్తశుద్ధి అని మరొక పేరు. శిష్టత్వంలోని ఘనతను వ్యతిరేక మార్గాన నిరూపించడం దుష్టునిపాత్ర ప్రయోజనం. పుణ్యపాపాలు రెండూ ఒకే ఆశయాన్ని ప్రతిపాదిస్తవి. పుణ్యం అన్వయ (పాసిటివ్) రూపంలో ప్రతిపాదిస్తుంది; పాపం వ్యతిరేక (నెగెటివ్) రూపంలో ప్రతిపాదిస్తుంది. దుష్టుని పాత్ర గల ఉత్తమ నాటకాలలో దుష్టత్వం ప్రచ్ఛన్నరూపంలో ఉన్న శిష్టత్వమే అని సూచింపబడుతుంది. అంతట దుష్టునిమీద మనకు ద్వేషం కాక, జాలి కలుగుతుంది. దుష్టత్వం అజ్ఞానజన్యమని, దౌర్బల్యమని తెలుస్తుంది. హృదయమాలిన్యాన్ని క్షాళనం చెయ్యగల కరుణరసాన్ని సృష్టించడమే నాటక రచనలో దుష్టునిపాత్ర కల్పించడానికి కారణం. కరుణరసానికి భవభూతి అగ్రస్థాన మిచ్చాడు.

పాపం పరిమితమైన భౌతికవస్తువుగా సృష్టితోపాటు, సృష్టిలో పడవేసినది కాదు. కనుక ఎందరు దానిని దహించివేస్తున్నప్పటికీ అదెప్పటిలాగా ఉన్నదని నిరాశ చెంద నవసరంలేదు. పుణ్యపాపాలు సృష్టిలో లేవు. అవి మన దృష్టిలో ఉన్నవి. ఒక చూపు పుణ్యం, మరొక చూపు పాపం.

నడవడం నేర్చుకుంటున్న పసిబిడ్డలు పడిపోతుంటారు. నడక నేర్చుకునే ప్రణాళికలో పడ్డానికి స్థానం ఉన్నది. లక్ష్యం నడవడమే గాని పడ్డం గాదు. నడవడానికి సహాయపడ్డమే పడ్డానికి ప్రయోజనం. నడవడానికి ప్రయోజనం పడ్డానికి సహాయపడ్డం కాదు. నడవడానికి లక్ష్యం నడవడమే. నడవడం ఎవరు నేర్చుకుంటే వారు పడిపోయే స్థితిని అతిక్రమించినవారు. అనాదిగా పెక్కుమంది బిడ్డలు పడిపోకుండా నడవడం నేర్చుకొన్నంత మాత్రాన ఇకముందు పుట్టే బిడ్డలు నడక నేర్చుకొనడంలో పడవలసిన శ్రమ తగ్గిపోలేదని అసంతృప్తి చెందడం సబబు కాదనిపిస్తుంది.

ప్రార్థన విషయమై తరువాత మనవి చేసుకుంటాను.

# వార్తలు, విశేషాలు

### శ్రీరామకృష్ణమఠము - మద్రాసు
### శ్రీరామనవమి

తే 13-4-62 ది శ్రీరామనవమినాడు సాయం ఆరాత్రికానంతరం రామనామభజన - మఠ భజన బృందంచేత - శ్రీ శ్రీ ప్రియానంద స్వాములవారి ఆధ్వర్యాన కావింపబడింది. తే 15-4-62 ది ఆదివారం సాయంకాలం శ్రీరామనవమి బహిరంగోత్సవం జరుపబడింది. సాయంకాలం మఠమండపంలో సమావేశమైన భక్తసదస్సులో శ్రీ కే. పంజాబకేశయ్యరు ఎమ్. ఎ., ఎల్. టి. గారు శ్రీరామచంద్రుని పరమాదర్శజీవితవిశేషాలను శ్రీవాల్మీకి శ్రీశుక యోగిప్రోక్తక్రమాలను క్రోడీకరించి సరళమధురానర్గళాంగ్లంలో ఉపన్యసించారు.

### శ్రీహరేరామభజనభక్తసమాజము
### శ్రీలక్ష్మీనృసింహక్షేత్రం, కోరుకొండ, తూర్పుగోదావరిజిల్లా
### సప్తాహమహోత్సవనివేదిక

అష్టగ్రహకూట దోషశాంతికి లోకకళ్యాణమునకు తే 1-2-62 ది నుండి తే 7-2-62 ది వరకు కోరుకొండ శ్రీలక్ష్మీనృసింహస్వామి వారి దేవస్థానం ధర్మకర్తలు ఉ. వే. ప్ర. శ్రీమాన్ పరాశరసుదర్శనభట్టర్ అయ్యవార్లం గారి అధ్యక్షతను శ్రీహరేరామసమాజము వారిచే సమాజమందిరంవద్ద ఈ క్రింది కార్యక్రమంతో సప్తాహమహోత్సవం జరుపబడింది.

ఏడహోరాత్రములు "హరే రామ హరే రామ రామ రామ హరే హరే, హరే కృష్ణ హరే కృష్ణ కృష్ణ కృష్ణ హరే హరే" అను అఖండనామసంకీర్తనయున్ను, ప్రతిరోజు పండితులచే ఉదయం 8 గంటలనుండి 11 గంటల వరకు సహస్రనామపూజలున్ను, నవగ్రహజపములున్ను, మధ్యాహ్నం 3 గంటలనుండి 6 గంటలవరకు ఆధ్యాత్మికోపన్యాసములున్ను జరుపబడెను. ఉపన్యాసకులు 1. శ్రీవిశిష్టాద్వైత ప్రచారకసంఘకార్యదర్శియు, "భక్తినివేదన" పత్రికాసంపాదకులు న్యాయవేదాంతవిద్వాన్ "గీతాచార్య" శ్రీమాన్ ఉ. వే. ప్ర. తె. కం. గోపాలాచార్యులుగారు. 2. శ్రీమాన్ ఉ. వే. ప్ర. శ్రీమత్తిరుమల పురిఘళ్ల వేంకటాచార్యులుగారు. 3. శ్రీమాన్ ఉ. వే. ప్ర. శ్రీమత్తిరుమల వేంకటకోనప్పాచార్యులుగారు. 4. అధ్యక్షులు శ్రీమాన్ పరాశరసుదర్శన భట్టర్ అయ్యవార్లంగార్లు. తే 8-2-62 ది గురువారం పూర్ణాహుతి, బ్రాహ్మణులకు సమారాధన, బీదలకు అన్నదానము, కుంటి, గ్రుడ్డి, కుష్ఠు, సాధువులకు వస్త్రదానము జరుపబడెను.

### ఆధ్యాత్మికసేవాసదనం, తాడేపల్లిగూడెం
### మాతృశ్రీ శారదాదేవి 109 వ జయంత్యుత్సవము

ది 29-12-61 సం॥ ఉ॥ 8-30 గం॥ నుండి శ్రీ శారదాదేవికి 'లలితాసహస్రనామము'లతో పూజ, 'దుర్గాసప్తశతి' యందు నారాయణీస్తవపఠనము, ఆరాత్రికములతో 'ఆధ్యాత్మికసేవాసదనము' నందు పూజ జరిగినది. పూజానంతరము సుమారు 50 మంది భక్తులు తీర్థప్రసాదములను స్వీకరించిరి. బహిరంగసభ :—ది 1-1-62 హూణసంవత్సరాది పర్వదినమున, సా॥ 5 గం॥ నుండి స్థానిక "సాంస్కృతీకళాక్షేత్రం" ఆవరణయందు బహిరంగసభ జరిగినది. అధ్యక్షులు :—శ్రీ పసల సూర్యచంద్రరావుగారు (తాడేపల్లిగూడెం

ఆంధ్రప్రదేశ్ ఎసెంబ్లీ మాజీఉపాధ్యక్షులు - ఆంధ్రప్రదేశ్ వర్తమాన సంగీత నాటక ఎకాడమీ ప్రధానకార్యదర్శులు). వక్తలు :— 1. శ్రీ మలపాక వెంకటసుబ్రహ్మణ్యంగారు (కాలేజీ హైస్కూలు భీమవరం), 2. శ్రీ కొత్తపల్లి రామమూర్తిగారు (శ్రీ శారదా ధర్మ వైద్యశాల, పోలమూరు). శ్రీ సుబ్రహ్మణ్యంగారు మాతృశ్రీ బాల్యజీవితవిశేషములను, శ్రీ గురుదేవునితో ప్రథమసందర్శనమునాటి విషయవాంఛావిముఖతను, మూర్తీభవించిన పతిభక్తిపూర్వకశరణాగతి మొదలగు ముఖ్య విషయములను వివరించిరి. శ్రీ రామమూర్తి గారు, శారదాదేవి జీవితఘట్టమునుండి ఆమె వీరత్వమును ప్రకటించు సంఘటన నుదహరించుచూ, నేటిమహిళలు ఆమెవీరత్వమును అనుసరించవలసినదిగా హిత ముపదేశించిరి. తరువాత, పూజ్యపాద శ్రీ శ్రీ శ్రీ కేశవతీర్థస్వామి వారి సందేశమున్నూ, పూజ్యపాద శ్రీశ్రీశ్రీ నిర్వికల్పానందస్వాముల సందేశమున్నూ సభాముఖమున చదువబడ్డాయి. అధ్యక్షులయిన శ్రీ సూర్యచంద్రరావుగారు శ్రీ శారదామణి నిరాడంబరజీవితమును, పతిభక్తిపరాయణతను, నిరంతరసేవాతత్పరతను ముచ్చటిస్తూ ఇదే భారతనారీమణుల ఆదర్శమని, ఋగ్వేదసంహిత నుదహరిస్తూ ఉపన్యసించిరి. సభానంతరము "శ్రీశారదాబృందం" బాలికలు 'వీరనారి దుర్గావతి' చరిత్ర బుఱ్ఱకథను సభారంజకముగా, నవరసభరితముగా గానంచేసిరి. రాత్రి 10 గం॥ నుండి శ్రీ అనుభవానందస్వాములవారు వ్రాసిన మాతృశ్రీనామసంకీర్తనగేయములతో భజనయున్నూ, 7-1-62 తేది బీదలకు అన్నదానమున్నూ జరుపబడినది.



# గ్రంథపరిచయం

[సమీక్షకి గ్రంథాలు పంపేవారు రెండేసి ప్రతులు పంపవలె అని మనవి]

### జాతకకథాగుచ్ఛము

రచయిత, ప్రాప్తిస్థానము - శిరోమణి సన్నిధానము సూర్యనారాయణశాస్త్రిగారు, పి.ఓ.ఎల్. సంస్కృతోపన్యాసకులు, [R.B.V.R.R. మహిళాకళాశాల, హైదరాబాదు], 44, జీరా సికింద్రాబాదు; పుటలు - 284; వెల - ఆఱు రూపాయలు.

ఇవి గౌతమబుద్ధుని పూర్వావతారకథలనడం అందఱెఱిగిందే. మొదటి ముద్రణంలో వేఱు వేఱు మూడుభాగాలుగా వెలువడి, ప్రశంసలనందుకొని విశ్వవిద్యాలయాలవారిచే పాఠ్యగ్రంథంగా ఆదరింపబడ్డ ఇది మూడుభాగాలూ ఒక్క సంపుటంలోనే చేర్పబడి ఈ ద్వితీయ ముద్రణం వెలువడింది. మొదటిభాగంలో ఐదు కథలు, రెండోభాగంలో పది కథలు, మూడోభాగంలో ఎనిమిది కథలు—ఈలాగు మొత్తం ఇరవైమూడు కథలు ఇందులో ఉన్నాయి. కథారసమున్నూ కావ్యరసమున్నూ ఉత్తమ వృత్తోపదేశమున్నూ నిండి, గీటుగీటునా తెలుగు తియ్యదనం ఒలికిస్తుండే పద్యాలతో కూడిన యీ గ్రంథరాజమునకు స్వాగతం. ప్రభాకర్.

శ్రీ రామకృష్ణ ప్రభ

# కిలోలలో కొనండి

మెట్రిక్ తూనికలను ఇప్పుడు
దేశమంతటా విధిగా వాడితీరాలి.
పాత తూనికలను ఉపయోగించడం
చట్ట విరుద్ధముగా పరిగణింపబడుతుంది.

ధరల
మారకపు
పట్టీ
(సేరునుండి
కిలోగ్రాముకు)

సేరు ధర నయాపైసల నుండి కిలోగ్రాము ధర నయాపైసలలో

| న.పై./సేరు | న.పై./కి.గ్రా. | న.పై./సేరు | న.పై./కి.గ్రా. | న.పై./సేరు | న.పై./కి.గ్రా. | న.పై./సేరు | న.పై./కి.గ్రా. | న.పై./సేరు | న.పై./కి.గ్రా. |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 1 | 21 | 23 | 41 | 44 | 61 | 65 | 81 | 87 |
| 2 | 2 | 22 | 24 | 42 | 45 | 62 | 66 | 82 | 88 |
| 3 | 3 | 23 | 25 | 43 | 46 | 63 | 68 | 83 | 89 |
| 4 | 4 | 24 | 26 | 44 | 47 | 64 | 69 | 84 | 90 |
| 5 | 5 | 25 | 27 | 45 | 48 | 65 | 70 | 85 | 91 |
| 6 | 6 | 26 | 28 | 46 | 49 | 66 | 71 | 86 | 92 |
| 7 | 8 | 27 | 29 | 47 | 50 | 67 | 72 | 87 | 93 |
| 8 | 9 | 28 | 30 | 48 | 51 | 68 | 73 | 88 | 94 |
| 9 | 10 | 29 | 31 | 49 | 53 | 69 | 74 | 89 | 95 |
| 10 | 11 | 30 | 32 | 50 | 54 | 70 | 75 | 90 | 96 |
| 11 | 12 | 31 | 33 | 51 | 55 | 71 | 76 | 91 | 98 |
| 12 | 13 | 32 | 34 | 52 | 56 | 72 | 77 | 92 | 99 |
| 13 | 14 | 33 | 35 | 53 | 57 | 73 | 78 | 93 | 100 |
| 14 | 15 | 34 | 36 | 54 | 58 | 74 | 79 | 94 | 101 |
| 15 | 16 | 35 | 38 | 55 | 59 | 75 | 80 | 95 | 102 |
| 16 | 17 | 36 | 39 | 56 | 60 | 76 | 81 | 96 | 103 |
| 17 | 18 | 37 | 40 | 57 | 61 | 77 | 83 | 97 | 104 |
| 18 | 19 | 38 | 41 | 58 | 62 | 78 | 84 | 98 | 105 |
| 19 | 20 | 39 | 42 | 59 | 63 | 79 | 85 | 99 | 106 |
| 20 | 21 | 40 | 43 | 60 | 64 | 80 | 86 | 100 | 107 |

సేరు ధర రూపాయల నుండి కిలోగ్రాము ధర రూపాయలలో

| రూ/సేరు | రూ/కి.గ్రా. | రూ/సేరు | రూ/కి.గ్రా. | రూ/సేరు | రూ/కి.గ్రా. | రూ/సేరు | రూ/కి.గ్రా. | రూ/సేరు | రూ/కి.గ్రా. |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 1 07 | 11 | 11·79 | 21 | 22·51 | 31 | 33·22 | 41 | 43·94 |
| 2 | 2·14 | 12 | 12·86 | 22 | 23·58 | 32 | 34·29 | 42 | 45·01 |
| 3 | 3·22 | 13 | 13·93 | 23 | 24·65 | 33 | 35·37 | 43 | 46·08 |
| 4 | 4·29 | 14 | 15·00 | 24 | 25·72 | 34 | 36·44 | 44 | 47·15 |
| 5 | 5·36 | 15 | 16·08 | 25 | 26·79 | 35 | 37·51 | 45 | 48 23 |
| 6 | 6·43 | 16 | 17·15 | 26 | 27·86 | 36 | 38·58 | 46 | 49·30 |
| 7 | 7·50 | 17 | 18·22 | 27 | 28·94 | 37 | 39·65 | 47 | 50·37 |
| 8 | 8·57 | 18 | 19·29 | 28 | 30·01 | 38 | 40·72 | 48 | 51·44 |
| 9 | 9·65 | 19 | 20·36 | 29 | 31·08 | 39 | 41·80 | 49 | 52·51 |
| 10 | 10·72 | 20 | 21 43 | 30 | 32·15 | 40 | 42·87 | 50 | 53·58 |

**1 కిలోగ్రాం (1000 గ్రాములు) = 86 తులాలు**

భారత ప్రభుత్వముచే జారీచేయబడినది

# దేశానికి అధికాహారోత్పత్తి. . . .

ఆంధ్రప్రదేశ్‌లో అదనంగా ౨౬.౭ లక్షల టన్నుల ఆహారధాన్యం ఉత్పత్తి చేయాలని రాష్ట్ర తృతీయ పంచవర్ష ప్రణాళిక నిర్దేశిస్తున్నది. తత్ఫలితంగా ఆహార ధాన్యపు ఉత్పత్తి శక్తి ౫౫.౭౨ లక్షల టన్నులకు పెరిగే అవకాశముంది. ప్రణాళికలో వ్యవసాయరంగానికి రూ. ౭౩.౦౮ కోట్లు కేటాయించడం జరిగింది.



దక్షిణదేశపు ధాన్యాగారమైన ఆంధ్రప్రదేశ్‌లో అధికాహారోత్పత్తి సాధనకై చేస్తున్న కృషి జాతీయ స్వయం సమృద్ధికి దోహదమిస్తుంది.

సంపద, సమృద్ధి సాధనకై ప్రణాళికకు సహాయపడండి.

—స. పౌ. సం. శాఖ, ఆం. ప్ర.

సంపాదకులు : శ్రీ శుద్ధసత్త్వానందస్వామి, శ్రీ నేలటూరి భక్తవత్సలము,
శ్రీ. కే. ఎస్. ఎస్. రాజన్ గారిచే ది జ్యూపిటర్ ప్రెస్స్ ప్రైవేట్ లిమిటెడ్ (మద్రాసు - 18) న ముద్రింపబ

# శ్రీ రామకృష్ణ మఠ ప్రచురణములు

| | | |
|---|---|---|
| 740 పుటలు | శ్రీరామకృష్ణ సూక్తి సుధ (తొలికూర్పు) | రూ. 7/50 |
| 496 పుటలు | శ్రీ రామకృష్ణ లీలామృతము (ద్వితీయ ముద్రణము) | రూ. 5/- |
| 144 పుటలు | శ్రీ శారదాదేవి | రూ. 1-25 |
| 312 పుటలు | శ్రీ శారదా ప్రసంగములు | రూ. 3-00 |
| 540 పుటలు | శ్రీ రామకృష్ణ బోధామృతము (సంగ్రహ జీవితసహితము) | రూ. 3-50 |
| 432 పుటలు (సాదా) రూ. 3-50 | శ్రీవివేకానంద జీవితచరిత్ర (అట్టబైండు) | రూ. 4/- |
| 564 పుటలు | స్వామి - శిష్య సంవాదములు (ప్రథమ ముద్రణము) | రూ. 5/- |
| 344 పుటలు | బ్రహ్మానంద బోధనలు (ప్రథమ ముద్రణము) | రూ. 3-50 |
| 330; 324 పుటలు | సందేశతరంగిణి - 2 భాగములు (ఒక్కొక్కభాగము) | రూ. 3/- |
| 402 పుటలు | పారమార్థిక సంభాషణలు | రూ. 3/- |
| 504 పుటలు | శ్రీమద్భగవద్గీత (ఆఱవ ముద్రణము) | రూ. 4/- |

| | | | |
|---|---|---|---|
| జ్ఞానయోగము 4 00 రాజయోగము | 2 50 | గిరీశచంద్ర 0 75 భక్తిమార్గము | 0 50 |
| కర్మయోగము 1 50 భక్తియోగము | 1 50 | చికాగో నగరోపన్యాసములు ... | 0 50 |
| నారద భక్తి సూత్రములు ... | 3/- | గురూపదేశములు 0 50 శ్రీకృష్ణవాణి | 0 40 |
| పరతత్త్వప్రసంగము ... | 2/- | శ్రీ రామకృష్ణ ఉవాచ ... | 0 37 |
| శ్రీ నాగమహాశయుని జీవితచరిత్ర ... | 1 25 | శ్రీ వివేకానంద శంఖారావము ... | 0 87 |
| ప్రబోధరత్నాకరము ... | 2 25 | శ్రీ శారదా సూక్తి నవనీతము ... | 0 40 |
| శ్రీ శారదాదేవి చరిత్ర ... | 2/- | నా సంస్కరణ యుద్ధవిధానము ... | 0 87 |
| దేవీమాహాత్మ్యము ... | 2/- | నా గురుదేవుడు 0 40 బుద్ధ ఉవాచ | 0 37 |
| వివేకానందలేఖావళి (మొదటిభాగము) | 1 50 | శ్రీరామకృష్ణుడు, వివేకానందస్వామి | 0 25 |
| వివేకానందలేఖావళి (రెండవభాగము) | 1 75 | శ్రీ పరమహంస జీవిత సంగ్రహము... | 0 25 |
| శ్రీరామకృష్ణోపనిషత్తు ... | 1 25 | పరమహంస శ్రీరామకృష్ణుడు ... | 0 25 |
| హిందూ మతము ... | 1 25 | నవీన భారతదేశము . ... | 0 25 |
| అనుష్ఠాన వేదాంతము ... | 1 25 | తాపత్రయ చికిత్స ... | 0 25 |
| కులము, సంస్కృతి, సామ్యవాదము | 1/- | పవహారిబాబా 0 25 ముక్తిమార్గము | 0 19 |
| వివేక సూర్యోదయము ... | 1 25 | సర్వం విష్ణుమయం జగత్ ... | 0 19 |
| భారతీయ మహిళ ... | 1/- | శ్రీ రామకృష్ణ ఆరాత్రికము ... | 0 12 |
| కఠోపనిషత్తు ... | 0 80 | శ్రీరామనామసంకీర్తనము 0 6 యతిగీతము | 0 6 |
| శ్రీ పరమహంస నీతికథారత్నములు | 0 75 | నా మతము 0 8 వి. సింహగర్జనము | 0 8 |

శ్రీ దొడ్డ భాగవతము - మొదటి సంపుటము రూ. 6-50; రెండవ సంపుటము రూ. 5-50;
మూడవ సంపుటము రూ. 7-50 (మూడును ఒకేసరి కొన్నచో: రూ. 18-50)

ఇవియేకాక సంస్కృత, ఆంగ్ల, తమిళ, హిందీ, కన్నడ గ్రంథములు,

వేదాంత కేసరి (ఆంగ్లము) శ్రీ రామకృష్ణ విజయము (తమిళము)

అను మాసపత్రికలును మాయొద్ద దొరకును

అడ్రెసు : మేనేజరు, శ్రీరామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు - 4

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటము ౧౯ ౧౯౬౨, జూలై; శుభకృత్తు - ఆషాఢము సంచిక ౧

## విషయసూచిక

# విషయసూచిక

(౩-వ పేజీ తరువాయి)

# అందాలొలికే బొమ్మలు



ఆంధ్రప్రదేశ్‌లోని కళాకారులు అత్యంతసౌందర్యవిలసితములైన అలంకరణ సామగ్రిని ఆటవస్తువులను తయారుచేయడమే గాక పెక్కు జీవితోపయోగవస్తువులను లాలిత్యముతో తీర్చి దిద్దగలరు. మనదేశ సంస్కృతీ సాంప్రదాయాలలో భాగమైన వీటికి నిత్యప్రోత్సాహం అవసరం.

తృతీయ పంచవర్ష ప్రణాళికలో హస్తకళల పరిశోధన, డిజైన్ కేంద్రా న్నొకదానిని నెలకొల్పడానికి తీర్మానించారు. ఇది రాష్ట్రంలో హస్తకళల నిర్మాణ సాంకేతికాభివృద్ధికి ముఖ్యస్థానంగా విలసిల్ల గలదు.

లభ్యమయ్యే మరికొన్ని ముఖ్యమైన హస్తకళాసామగ్రి:—బిద్రీపాత్రలు; నిర్మల్‌వస్తువులు, దంతం, కొమ్ముచస్తువులు; వెండి నగిషీవస్తువులు; కొండపల్లి ఆటబొమ్మలు; నక్కపల్లి బొమ్మలు, నిర్మల్ ఆటవస్తువులు; తిరుపతి బొమ్మలు; మట్టిపాత్రలు; చర్మవస్తువులు; తివాచీలు: కంబళ్లు; చాపలు; పేముఫర్నిచర్ మొదలైనవి. ఇవి ఈ క్రింది వాణిజ్య కేంద్రాలలో దొరుకుతవి.

౧. ది హేండి క్రాఫ్ట్స్ అండ్ కాటేజి ఇండస్ట్రీస్ సేల్స్ ఎంపోరియం, హైదరాబాదు.

౨. వరంగల్ విక్రయశాల, వరంగల్.

౩. అనంతపూర్ విక్రయశాల, అనంతపూర్.

౪. ది సెంట్రల్ సేల్స్ ఎంపోరియం, విజయవాడ.

౫. ప్రభుత్వ కుటీరపరిశ్రమల వస్తువిక్రయశాల, విశాఖపట్నం.

౬. ప్రభుత్వ కుటీరపరిశ్రమల వస్తువిక్రయశాల, తిరుపతి.

౭. ప్రభుత్వ చేతిపరిశ్రమల, కుటీరపరిశ్రమల వస్తువిక్రయశాల, రాజమండ్రి.



‘అఖిలవిభు శరణొందుమ, యా క్షణంబ యతనికృప నీవ ననుభావ్య మగును వత్స.’

—శ్రీ శారదామణి.


# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము ౧౯ } ౧౯౬౨ - జూలై :: శుభకృత్తు - ఆషాఢము { సంచిక ౧


శ్రీః

## సౌందర్యలహరి

మూలము : శ్రీ శంకరభగవత్పాదులు

టీక : నే. భ.

త వాధారే మూలే సహ సమయయా లాస్యపరయా
నవాత్మానం మన్యే నవరస మహాతాణ్డవనటమ్
ఉభాభ్యా మేతాభ్యా ముదయవిధి ముద్దిశ్య దయయా
సనాథాభ్యాం జజ్ఞే జనకజననీమ జ్జగ దిదమ్ ॥ ౪౧

| | |
|---|---|
| (హే భగవతి) | (అమ్మా) |
| తవ | నీ |
| మూలే ఆధారే | మూలాధారచక్రమున |
| లాస్యపరయా | లాస్య (=నృత్త)మున ఆసక్తి గల |
| సమయయా | దేవితో గూడ |
| నవరస | తొమ్మిదిరసముల రూపొందినదగు, లేదా నిత్య నూతనమగు శృంగార రసమున రూపొందినదగు |
| మహాతాణ్డవనటమ్ | గొప్ప తాండవము ఆడునట్టి మహానటేశ్వరుని, ఆనంద భైరవుని |
| నవాత్మానం | పైని చెప్పిన నవవ్యూహాత్మకునిగ, లేదా నవరసాత్మకునిగ. కాదా నూతన శృంగారరసస్వరూపునిగ |
| మన్యే | తలంతును |
| ఇదం | అగపడుచున్న ఈ |

| | | | |
|---|---|---|---|
| జగత్ | స్థావరజంగమాత్మకమగు భువనము | | ఈ |
| | | ఉభాభ్యామ్ | సమయాంబా మహానటేశ్వరుల యిద్దఱిచేత |
| ఉదయవిధిమ్ | ఉత్పత్తివిధానమును | | |
| ఉద్దిశ్య | ఉద్దేశించి | జనకజననీమత్ | తండ్రియును తల్లియును గలదిగా |
| దయయా | దయతో | | |
| సనాథాభ్యామ్ | కూడుకొన్నవారగు | జాతమ్ | ఆయెను. |

తా॥ అమ్మా, తొమ్మిదిరసముల రూపొందిన, లేదా నిత్యనూతనశృంగారరసమున రూపొందిన, గొప్ప తాండవనృత్తము నాడు మహానటేశ్వరుడు (ఆనందభైరవుడు) లాస్యనృత్యాసక్త యగు సమయాంబికతో గూడి నీ మూలాధారచక్రమున వెలసియున్నాడు. ఆయన నవవ్యూహాత్మకు డని, నవరసాత్మకు డని, నిత్యనూతనశృంగారరసస్వరూపు డని నా తలంపు. విశ్వసృష్టికై సమయాంబామహానటేశులు దయాసనాథులైరి. వారి లాస్యతాండవముల ప్రారంభమే విశ్వసృష్టి; వారిలాస్యతాండవముల పరిసమాప్తియే విశ్వప్రళయము. ఈ విశ్వమునకు వారే తల్లిదండ్రులు.

గతై ర్మాణిక్యత్వం గగనమణిభి స్సాన్ద్రఘటితం
కిరీటం తే హైమం హిమగిరిసుతే కీర్తయతి యః
స నీడేయచ్ఛాయాచ్ఛురణశబలం చన్ద్రశకలం
ధను శ్శౌనాసీరం కి మితి న నిబధ్నాతి ధిషణామ్॥ ౪౨

| | |
|---|---|
| హే హిమగిరిసుతే | ఓ చలిమలపట్టీ |
| యః | ఏకవి |
| మాణిక్యత్వం | నవరత్నాలరూపమును |
| గతైః | దాల్చిన |
| గగనమణిభిః | పండ్రెండుసూర్యబింబాలచే |
| సాన్ద్ర | దట్టముగ |
| ఘటితం | ఖచితమైనదియు |
| హైమం | స్వర్ణమయమైనదియునగు |
| తే | నీ |
| కిరీటం | కిరీటమును |
| కీర్తయతి | వర్ణించునో |
| సః | ఆకవి |
| నీడేయ | గోళఖచితరత్నాల |
| ఛాయా | కాంతి |
| ఛురణ | వ్యాపించుటచే |
| శబలమ్ | వర్ణవైచిత్రిగల |
| చన్ద్రశకలమ్ | చంద్రఖండమును |
| శౌనాసీరమ్ | ఇంద్ర |
| ధనుః ఇతి | ధనుస్సు అను |
| ధిషణాం | భ్రాంతిని |
| ననిబధ్నాతికిమ్ | నిబంధింపకుండునా ? నిబంధించితీఱుననుట. |

తా॥ ఓ పర్వతరాజపుత్రీ, పన్నిద్దఱు సూర్యులు కామరూపధారణశక్తిగలవారు కావున వివిధరత్నములుగ రూపొందినారు. ఆ రత్నాలు నీ బంగారు కిరీటమున దట్టముగ చెక్కబడియున్నవి. ఆరత్నాలకాంతి, నీసిగపై నున్న చంద్రఖండముమీాదికి వ్యాపించి దానికి వర్ణవైచిత్రిని గూర్చుచున్నది. దానిని వర్ణింపబూనుకొన్న కవి 'ఇంద్రధనువు'గా రూపింపక మానడు.

ధునోతు ధ్వాన్తం న స్తులిత దళితేన్దీవరవనం
ఘన స్నిగ్ధశ్లక్ష్ణం చికురనికురుమ్బం తవ శివే
యదీయం సౌరభ్యం సహజ ముపలబ్ధుం సుమనసో
వస న్త్యస్మిన్ మన్యే వలమథనవాటీవిటపినామ్ ॥ ౪౩

| | | | |
|---|---|---|---|
| హేశివే | అమ్మా శంకరీ | ధ్వాన్తం | చీకటిని |
| ఘన | దట్టమైనదియు | ధునోతు | దులిపివేయును గాక |
| స్నిగ్ధ | నిగనిగనిదియు | యదీయమ్(=తదీయమ్)ఏ (ఆ) కేశపాశపు | |
| శ్లక్ష్ణం | మృదువైనదియు | సహజమ్ | స్వాభావిక |
| తులిత | సరిపోలబడిన | సౌరభ్యమ్ | పరిమళమును |
| దళిత | వికసించిన | ఉపలబ్ధుమ్ | పొందుటకై |
| ఇన్దీవరవనం | నల్లకలువల సమూహముగల దియు అగు | వలమథనవాటీ | దేవేంద్రోద్యానవనపు |
| | | విటపినామ్ | (కల్ప) వృక్షముల |
| తవ | నీ | సుమనసః | పుష్పములు |
| చికుర | కేశ | అస్మిన్ | ఈ కేశపాశమున |
| నికురుమ్బమ్ | పాశము | వసన్తి ఇతి | నివసించుచున్నవని |
| నః | మా (లోనున్న) | మన్యే | తలంతును. |

తా॥ అమ్మా, శంకరీ, నీ కేశపాశము దట్టముగ నున్నది, నిగనిగనిదై యున్నది, మృదువై యున్నది, వికసించిన నల్లగలువల సమూహమును బోలి యున్నది. నీ కేశపాశము నకు సహజపరిమళ మున్నది. ఆపరిమళమును తాము పొందవలె నను కోరిక దేవేంద్రోద్యాన వనమందలి కల్పవృక్షపుష్పములకు కలిగినది. అందుకే అవి నీకేశపాశమందు పొందుపడి యున్న వని నా తలంపు. అట్టి నీ కేశపాశము మాలో నున్న చీకటిని (=అజ్ఞానాంధకారమును) దులిపి వేయును గాక.

తనోతు క్షేమం న స్తవ వదన సౌన్దర్యలహరీ
పరీవాహస్రోతస్సరణి రివ సీమ న్తసరణిః
వహ న్తీ సిన్దూరం ప్రబలకబరీ భారతిమిర
ద్విషాం బృన్దై ర్బన్దీకృత మివ నవీనార్కకిరణమ్ ॥ ౪౪

| | | | |
|---|---|---|---|
| (హేదేవి) | (అమ్మా) | ప్రబల | గొప్ప |
| వదన | మోమునందలి | కబరీభార | కేశపాశమనెడి |
| సౌన్దర్య | చక్కదనపు | తిమిర | చీకటి మొత్తమనెడి |
| లహరీ | ప్రవాహపు | ద్విషాంబృన్దైః | శత్రుసమూహముల చేత |
| పరీవాహ | పొంగుయొక్క | బన్దీకృతం | చెఱపెట్టబడిన |
| స్రోతస్సరణిః ఇవ | వేగమార్గమువలెనున్నదియు | నవీన | బాల |

| | | | |
|---|---|---|---|
| అర్క కిరణమ్ ఇవ | సూర్యకిరణమునుబోలె | సీమన్తసరణిః | పాపటచాలు |
| సిన్దూరమ్ | సిందూరమును | నః | మాకు |
| వహన్తి | దాల్చియున్నదియు—అగు | క్షేమం | సుస్థితిని |
| తవ | | తనోతు | ఇచ్చుత; హెచ్చించుత. |

తా॥ అమ్మా, నీ నెమ్మోమునుండి ఉప్పొంగి పాఱు చక్కదనపు ప్రవాహమువలె నున్నది నీ 'పాపటచాలు'. సిందూరముతో నీవు పెట్టుకొన్న పాపటబొట్టు నీశిరోజముల మొత్తమనెడి చీకటిమొత్తము బంధించి యుంచిన తమశ్శత్రువగు బాలసూర్యుని కిరణమువలె నున్నది. అట్టి నీ 'పాపటచాలు' మాకు సుస్థితిని వర్ధిల్లచేయును గాక.

అరాళైః స్వాభావ్యా దళికలభసశ్రీభి రలకైః
పరీతం తే వక్త్రం పరిహసతి పఙ్కేరుహరుచిమ్
దరస్మేరే యస్మిన్ దశనరుచి కిఞ్జల్కరుచిరే
సుగన్ధౌ మాద్యన్తి స్మరదహన చక్షుర్మధులిహః ॥ ౪౫

| | | | |
|---|---|---|---|
| (హే దేవి) | (అమ్మా) | అరాళైః | వంపుగలిగినవియు |
| దరస్మేరే | ఇంచుక చిఱునవ్వుతో కూడినదియు | అళికలభ | చిఱుతుమ్మెదల |
| | | సశ్రీభిః | కాంతివంటి కాంతిగలవియు అగు |
| దశనరుచి | దంతములకాంతి అనెడి | | |
| కిఞ్జల్కరుచిరే | అకరువులచేసొంపైనదియు | అలకైః | ముంగురులచే |
| సుగన్ధౌ | పరిమళముగలదియు అగు | పరీతం | వ్యాప్తమైన |
| యస్మిన్ | ఏ నీ ముఖపద్మమున | (తత్) | (ఆ) |
| స్మరదహన | పరమశివుని | తే | |
| చక్షుః | నేత్రములనెడి | వక్త్రం | నెమ్మోము |
| మధులిహః | తుమ్మెదలు | పఙ్కేరుహరుచిమ్ | పద్మకాంతిని |
| మాద్యన్తి | ఆనందించుచున్నవో | పరిహసతి | గేలిసేయుచున్నది. |
| స్వాభావ్యాత్ | స్వభావముచేతనే | | |

తా॥ అమ్మా, సహజమైన వంపును తుమ్మెదతుటుముల కాంతివంటి కాంతియు గల ముంగురులు నీమోమును క్రమ్ముకొని యున్నవి. కాంతిలో పద్మమును మించి యున్నది నీ మోము. నీముఖ మొక కమలము. చిఱునవ్వు దాని వికాసము, దంతాల కాంతి అకరువుల సొంపు, దానిపరిమళమున ఆనందించు పరమశివుని నేత్రములే తుమ్మెదలు.

# అర్చన

## భార్గవ విద్యాదేవ కులపతి

నీ వత్యద్భుత చంద్రమండల హిమానీ శీతలానంద భా
వావేశాంతర శాంత రమ్య హృదయాహ్లాద ప్రసన్నాంశుమా
లావిన్యాస విశేషవిస్ఫురితలీలాలాలసస్ఫూర్తి, వో
దేవీ, మానవమాత, నాదు హృదయోద్వేగమ్ము వీక్షింపవే!

వీ డున్నా డొక ఉగ్రభావనుడు గంభీరస్వభావాంతర
వ్రీడాశూన్యుడు నీవెలుంగుకొఱకై వేవేవిధమ్మింతయున్
చూడన్ బోవడు దివ్యదర్శనమహాశ్శోభాయుతమ్మైన నీ
క్రీడాదృష్టి రచింప రాదె జనయిత్రీ, పుత్రవాత్సల్యవై?

ఇచ్ఛాశూన్య విహారవై జగతికై యే వింత కల్పింతువో,
గచ్ఛత్కావ్య విహారవై కవులకే కళ్యాణమూహింతువో,
స్వచ్ఛప్రాణ విహారవై ఋషులకే సత్యమ్ము నందితువో,
చిచ్ఛక్తీ, యెటులన్ తలంచెదము నీ చిత్రప్రభావమ్ములన్.

ఆగ్నేయంబగు నీ మహత్వమును కన్నారంగ వీక్షించి ఉ
ద్విగ్నం బైనది నా మనస్సు జనయిత్రీ, భక్తిపాథోధిలో
మగ్నంబైనది నీ పదాంబుజసుధామత్తద్విరేఫంబుగా
భగ్న బ్రహ్మకులంబులో నిక శుభప్రారంభముల్ కల్గునో

నాకున్ నీ వొకదాన వుంటివి రసానందాభిసంధాత్రివై
నీకో వందలు వేలు లక్షలు సుతుల్ నిత్యమ్ము నావంటివా
రాకల్పాంతము రాకపోకలను చేయం జొత్తు రీ సీమలో
నీకున్ నాకు సవిత్రి, యెట్లు కుదురున్ నిత్యానుబంధమ్మికన్?

ఈ ప్రాసంగిక పాంథ పండితవచో హేతుప్రకాశమ్ములన్
నా ప్రత్యేకత నీకు గుర్తు కలదో నాభావవిన్యాసమం
దే ప్రామాణ్యము నీకు నచ్చినదొ తల్లీ, ఈయహంకారరే
ఖా ప్రావీణ్యము లౌకికేచ్ఛకతనన్ కాంక్షించు ఆతత్త్వమున్.

# శ్రీ రామకృష్ణ ప్రభ

ఈ ప్రాపంచిక మూలసూత్రములలో ఏతత్త్వ మూహించినన్
కప్రంపుంబలుకుల్ కళాకలనముల్ కళ్యాణకాదంబముల్
సుప్రజ్ఞాపనముల్ వినంబడవు నీస్తోత్రమ్ము గావించు ఈ
విప్రాలాప విలాపముల్ త్రిజగతీ విభ్రాంతమై తోచెడున్.

ఇదుగో! ఏ డొక తీవ్రసాధకు డహో! హిందూమహాభూమిలో
అడుగంబోవడు మార్గ మెవ్వరిని ఇం దాగ్నేయచక్రంబులున్
సుడిగుండంబులు లేచి అడ్డముగ నిల్చున్ గాని మెట్లైన నీ
అడుగుందోయిని చేరుకోగలడు లేవమ్మా కృపాంభోనిధీ!

నాస్వాత్వ మ్మిది దాటిపోయినది యేనాడో సమస్తమ్మునున్
నాస్వాతంత్ర్యము చేతులార విడితిన్ త్వత్పాదపీఠమ్ముపై
ఆస్వాదింపగవచ్చు నీదు సదయవ్యాసంగసంగమ్ము నీ
భాస్వత్కాంతి సరోవరమ్ముకడ కీ ప్రత్యంగిరాపాదముల్.

ఈ సంఘర్షణలోన పుట్టిన మహోగ్రేరమ్మదజ్వాలకున్
దాసత్వంబు వహించె లౌకికజగద్భావప్రపంచావళీ
నాసీరంబులు శృంగభంగ మొకటైనన్ గాని సంపూర్తిగా
రోసంబున్ విడబోవు కట్టకడ కెట్లో మానవా, అంబికా.

ఆలోకించితి నిన్నినాళ్ళ కొక అత్యంతప్రసన్నాంశురే
ఖాలాలిత్యవిశిష్టమూర్తి నను నాగర్వమ్ము సర్వాధిక
శ్రీలేఖర్షభశక్తినందెడి తపశ్శ్రీమత్త్వమున్ పొందుచో
ఆలోకింపదు లోకవాసనల అమ్మా, నీకృపాశీస్సులన్

ప్రాతర్భాను మరీచి రోచిరుదయ స్వర్ణాయితాంభోరుహ
శ్రీ తారళ్యనవోదయమ్ములు రసార్ద్రీభూతసౌహార్దముల్
జ్యోతిర్మండలకాంతిపూర రమణీ యోంకార ఘుంటార్భటుల్
నీతత్త్వంబు లనూహ్యసత్త్వములు తల్లీ, నేను భావించెదన్.



# మానసబోధము

ఆచార్య శ్రీ దర్భా వేంకటకృష్ణమూర్తిగారు

క॥ ఉన్నది యున్నటు లనుచో నున్నాఁడే యెందు సైఁచుయోగ్యుం? డే దె
ట్లున్నను గనియును గనన ట్లున్నతఁడే 'పెద్దమనిషి' యుర్విన్ మనసా. 1

క॥ సత్యాసత్యవిచారణ సత్యాత్మం డొక్కరుండె చాలుం జేయన్;
సత్యము దాఁ గానియెడన్ సత్యం బెఱుఁగంగఁ దనకు సాధ్యమె మనసా? 2

క॥ అక్షయపదసిద్ధికి నే కక్షణమేన్ జాఱవిడువకయె, తగ సత్కా
లక్షేపము సేయవె, చిత్తక్షోభముకతన ముక్తి దవ్వగు మనసా. 3

క॥ అత్యాంతికతనఁ గడుఁ జిత్తక్షోభమె కాని, సిద్ధి దైవాఱునటే?
తత్క్షణమ యాపిశాచిని శిక్షింపంగదవె, శాంతి చేకుఱు మనసా. 4

క॥ నిస్సారము సంసారమె దుస్సహ, మటుపైని నీదుతుందుడుకులు; ఈ
దుస్సంధిం బడి ప్రాణా లుస్సు రటం చెగిరిపోవుచున్నవె మనసా. 5

క॥ బుద్బుద మీ జీవితమే, సద్బుద్ధిన్ మెలఁగ కేల సాగెదు? యత్కిం
చిద్బలము లేదె! అయ్యాపద్బాంధవుఁ దలఁపు, పరముఁ బడసెదు మనసా. 6

క॥ ద్వైతాద్వైతవిశిష్టా ద్వైతంబు లటంచు మువ్విధంబులు; కానీ
ద్వైతంబే మూలం బౌ ఆతతభక్తికి యథార్థ మరయన్ మనసా. 7

క॥ జీవితమే దుర్భరచిం తావాసం; బందు నీదుతత్త్వము కిష్కిం
ధావాసం బగుచో నీ జీవిత మెటు తెల్లవాఱుఁ? జెపుమా మనసా. 8

క॥ 'హం' శాంతింపక లోన శతాంశం బేనియును, మందహాసాల నప
భ్రంశంబుఁ గనుచుఁ, బైఁబయి 'ఓం శాంతి శ్శాంతి' యనఁగ నోరగునె మనసా? 9

క॥ జిహ్వాగవర్తన ముడుగక 'బ్రహ్మాస్మి' యటంచు నెపుడుఁ బలవింపఁగనే
బ్రహ్మవు గానేర్తువె? యంబ్రహ్మవె యయ్యెదవు గా కవశ్యము మనసా. 10

క॥ యంబ్రహ్మ వయ్యు, సారె 'కహం బ్రహ్మాస్మి' యని వదరినంత నహో యం
చుం బ్రమసి యందఱున్ నీకుం బ్రహ్మాంజలి ఘటింత్రోకో వెడ మనసా? 11

క॥ స్వార్థంబునకై యెంత యనర్థం బేనియును జేయ నంజ వదేమో!
వ్యర్థము గదె జన్మము పురుషార్థము సాధింపకున్న నకటా మనసా? 12

క॥ సంకల్పవికల్పము లిర్వంకల నట్టిట్టు నిన్నుఁ బట్టిపలార్పన్
బంకంబున దిగఁబడి యేవంకన్ నీ వింక ముక్తిఁ బడసెదు మనసా? 13

క॥ హంకారం బేచగ దుస్సంకల్పంబుల నహర్నిశంబున్ గడపన్
సంకటమై సంకరమై పంకిలమై పోదె నీదు బ్రతుకే మనసా? 14

క॥ వేదారులఁ బరువెత్తుచు వేదాంతోక్తులను వల్లెవేసినయంతన్
రాదే దాంతియు శాంతియు, లేదే సౌఖ్యంబు, ముక్తి లేదే, మనసా. 15

క॥ అల లడఁగినయావలనే జలకం బాడంగ నెంచి జలనిధికడనే
నిలిచి కనుచుందువటె? నీ తెలివికి నేమందుఁ? గన్ను దెఱవవె మనసా! 16

క॥ అడియాసలఁ బలుపాట్లుంబడు టొక్కటె కాని, ముక్తిపథమున నెపుడున్
నడవన్ నేరమిఁ గాదే జడముగ ని న్నెంచినారు జ్ఞానులు మనసా! 17

క॥ తన వదనం బన్యులకున్ గనరాకుండంగఁ బటమునన్ గప్పికొనన్
దన కన్యుల వదనంబులు గన నగునే? తెలియు మిదియె కపటము మనసా. 18

క॥ ఇమ్మహి నా కెందఱో మిత్రమ్ములు నా కేమటంచు దర్పింపకుమా,
తుమ్మిన నూడెడుముక్కులె సుమ్మీ యందఱును, జెడెదు సుమ్మీ మనసా. 19

క॥ నమ్మందగు దైవమ్మును నమ్మక, మఱి వారి వీరి నమ్మిన, బుడ్డన్
నమ్మి నడియేటఁ బడు చందమ్మే దద్దమ్మ, మేల్కొనంగదె మనసా. 20

(సశేషము)



# పవిత్రగ్రంథములు

## [సంపాదకీయము]

పవిత్రగ్రంథములకు సంఘమున మిక్కిలి చెల్లుబడి కలదు. ప్రజల ఆశలను, విధులను, ఆశయములను, జీవితమును, నడవడిని రూపొందించున వవి. సామాన్యముగా అన్నిగ్రంథములకును ఆ ప్రభావ మున్నది కాని పవిత్రగ్రంథములకు మఱింత హెచ్చుగా నున్నది. వానిలోను మూలభూతములైన గ్రంథములకు ప్రామాణ్యము చాల హెచ్చు. అనంతరగ్రంథములు పూర్వపూర్వగ్రంథములలోని పరమార్థమునే ప్రతిపాదించును కాని ఒక్కొక్కటి కొన్ని కొన్ని ప్రత్యేకాంశములపై ఊనిక నిడుచుండును. ప్రతిమతమందును పవిత్రగ్రంథములు గాఢముగ ఆదరింపబడుచుండును. ఏలయన అవి నిత్యసత్యావిష్కృతులు. ప్రజల మతవైజ్ఞానికసంపద అందు రూపొందియుండును. ప్రతిమతమునకు పవిత్రమతగ్రంథము లున్నవి. ఒక్కొక్క పవిత్రగ్రంథము ఒక్కొక్క యుగమున ఆవిష్కృతమై చెల్లుబడిగలిగియుండు నని సెమిటిక్కు మతాలవారి ఆశయము. ప్రాచ్య మతాలవారి నమ్మకములో ధర్మము సనాతనము. పవిత్రగ్రంథములు అనేకము లని వా రంగీకరింతురు.

హిందువులకు పరమ ప్రమాణ గ్రంథము వేదమే అనుటకు సందేహము లేదు. నిజమునకు వేదముల ప్రాముఖ్య మెంతటి దనగా వాని ప్రామాణ్యమును నమ్మినవారు మాత్రమే ఆస్తికులుగ గణింపబడుదురు. కావుననే జైన, బౌద్ధమతములు హిందూమతశాఖలే అయినప్పటికిని వేదప్రామాణ్యమును నిరాకరించినందువలన అవి నాస్తికమతములుగ పరిగణింపబడినవి. ప్రామాణ్యమున అగ్రస్థానము వేదములకే. స్మృతిపురాణేతిహాసాదుల ప్రాముఖ్యము వేదములకు వెనుకనే. 'వేదో ధర్మమూలమ్' – ధర్మమునకు మూలము వేదము. వేదములు నిత్యము లనియు అపౌరుషేయము లనియు అంగీకరింపబడుచున్నవి. అవి మంత్రద్రష్టలకు ఆవిష్కృతములైన సత్యములు. భగవంతుడు ఉపదేశింపగా ఋషులు విన్నవైనందుచేతనో గురువులచేత సంతచెప్పించుకొని విని శిష్యులు నేర్చుకొన్నవైనందుచేతనో వానికి శ్రుతులు అని పేరు. లక్ష్యసిద్ధికి అలౌకికోపాయ జ్ఞానమును తెలుపు గ్రంథము వేదము — అని శ్రీ శంకరాచార్యులవారు నిర్వచించిరి.

వేదములు—ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అథర్వవేదము అని నాలుగు. వ్యాసుడు వానిని వరుసగా తన శిష్యులైన ఫలిత, జైమిని, వైశంపాయన, సుమంతులకు ఉపదేశించెను. విశ్వమునకెల్ల ఆదిమగ్రంథము ఋగ్వేదసంహిత. అందు ఇంచుమించు 10,500 పద్యము లున్నవి. అవి 1017 ఋక్కులుగను, 10 మండలములుగను విభక్తములై యున్నవి. అవి వివిధదేవతల సంబోధించు గేయములు. వేదములన్నిటిలోను కట్టకడపటిది అథర్వవేదము. అందు ఉన్న తామరశ్రేష్ఠులపూజయు సర్వజనీనారాధనమును మిళితములై యున్నవి. మొదటి మూటికే వేదము లనెడి గణన యుండె

డిది. త్రయీ అను పదము మువ్వేదములకు వాచకము. ప్రతివేదములోను మరల నాల్గు భాగము లున్నవి — సంహిత, బ్రాహ్మణము' ఆరణ్యకము, ఉపనిషత్తు. సంహిత, బ్రాహ్మణము—అను రెంటికిని కర్మకాండ అని పేరు. ఆరణ్యకము, ఉపనిషత్తు — వీనికి జ్ఞానకాండ మని పేరు. శిక్ష, వ్యాకరణము, ఛందస్సు, నిరుక్తము, జ్యోతిషము, కల్పము—అనునవి ఆఱును వేదాంగములు.

హిందువుల వేదాంతదర్శనమునకు ఉపనిషత్తులే పునాది. వాని ప్రభావము ఇంతింతన రానిది. ఇప్పుడు ఇంచుమించు 250 ఉపనిషత్తు లున్నవి. వానిలో కొన్నిమాత్రమే మిక్కిలి ప్రాచీనములు. వానిలో పెక్కులు అనుకరణములు. కావున ప్రజలకు వానియందు గల ప్రీతి రుజు వగుచున్నది. మిక్కిలి ముఖ్యములును ప్రామాణికములును శ్రీశంకరభగవత్పాద వ్యాఖ్యాతములును అగు నుపనిషత్తులు 10 గలవు—ఈశ-కేన-కఠ-ముండక-మాండూక్య-ప్రశ్న-తైత్తిరీయ-ఐతరేయ - ఛాందోగ్య-బృహదారణ్యకములు. ఇవి గాక కౌషీతకి-శ్వేతాశ్వతర - కైవల్య-నారాయణ-జాబాల - నృసింహతాపని మున్నగునవి గూడ ప్రసిద్ధములై యున్నవి. ఉపనిషత్తులకే వేదాంతమనియు పేరు. వేదముల తుదిభాగములలో అవి ఉండుటచేతనో, అవి వేదసారములగుట చేతనో వాని కా పేరు కల్గినది. గురుముఖముగనే కాని వీని నేర్వ రానందున వీనికి రహస్యము లని మ ఱొక పేరు గలదు. ఉపనిషత్తులలో ముఖ్యముగ ప్రతిపాదింపబడునవి—చిత్తు, అచిత్తు, ఈశ్వరుడు, జీవబ్రహ్మైక్యము, ఆత్మైక్యము, మానవునికి సంక్రమించిన దివ్యసంపద అవతారకర్మసిద్ధాంతములు, ఈశ్వరుని సాకారతానిరాకారతలు, విముక్తి, తత్సాధనములు— ఇవి వేదాంతము ముఖ్యముగ మనకు తెలుపు విషయములు. వేదాంతసందేశము విశ్వజనీనము. బలమును అభయమును విశ్వాసమును నీతివిధానమును వేదాంతము మనకు ఒసగుచున్నది. వేదాంతము మనచూపును అంతర్ముఖమొనర్చి అనంతత్వమే మన లక్ష్యము అని సూచించుచున్నది.

వేదములకు తర్వాతిస్థానము స్మృతులది. ప్రజలకు కర్తవ్యాకర్తవ్యములను బోధించునవి ఈ ధర్మశాస్త్రములు. ఇవి యుగయుగమునకును మాఱుచుండును. స్మృతులలో మను, యాజ్ఞవల్క్య, పరాశర ప్రముఖ స్మృతులు సుప్రసిద్ధములు.

వాల్మీకిరామాయణమును, వ్యాసునిమహాభారతమును అజరామరములైనవి. వానికి ఇతిహాసము లని పేరు. భారతదేశమున ఎక్కువగ పారాయణములు చేయబడు గ్రంథము లివి. వీని అనువాదములును, అనుకరణములును వివిధభాషలలో వెలసినవి. ఇందలి కథలు, కథాపురుషుల ఉదాత్తగుణములు, భారతదేశమున ప్రతిబాలునకును, ప్రతిబాలికకును పరిచితములై యుండును. ఆ రీతిగ నివి ప్రజలశీలమును రూపొందించుచుండును. వేదసారస్వతములో నున్న మహోన్నతసూత్రముల అనుష్ఠానమును ప్రపంచించునవి కావున ఇవి ఇంతగా ప్రజాదరమును చూఱగొన్నవి. మూలకథకు చుట్టును లెక్కలేనన్ని ఇతరకథలు ఐతిహ్యములు సంవాదములు అమర్పబడియున్నవి. భగవద్గీత మహాభారతములో తానొకభాగముగ కాగల్గిన దిట్లే.

భగవద్గీతకు మన దేశమున ఎంతో చెల్లుబడి కలదు. అందు శ్రీకృష్ణునుపదేశములు కలవు.

శ్రీకృష్ణుడు వివిధసాధనలకు యోగములకు సమన్వయము కుదిర్చినాడు. భారతీయపారమార్థికవిజ్ఞానసారమును 700 శ్లోకములలో ఇమిడ్చి చెప్పునది కావున భగవద్గీతకు భారతీయసారస్వతమున అత్యున్నతస్థానము కలదు.

పారమార్థికాశయములను కథలద్వారా ప్రజలలో వ్యాపింపజేయుటే పురాణముల లక్ష్యము. ముఖ్యపురాణములు పదునెనిమిదియు, ఉపపురాణములు పదునెనిమిదియు నున్నవి. వివిధపురాణాలు, వివిధశాఖలవారికి ప్రియములై యున్నవి. అన్నిటికంటె జనప్రీతిని చూఱగొన్న పురాణము శ్రీమద్భాగవతము. విష్ణుదేవుని వివిధావతారచరిత్రములు అందు చెప్పబడియున్నవి. శ్రీకృష్ణుని చరిత్రమును, లీలలును ఇందు సమగ్రముగ అభివర్ణితములై యున్నవి. వైష్ణవుల కిది పరమప్రమాణము. శక్త్యుపాసకులకు ముఖ్యమైన దేవీమాహాత్మ్యము మార్కండేయపురాణమున నొక భాగము.

శైవ, శాక్త, వైష్ణవ మతానుసారము ఆరాధనవిధానముల తెల్పునవి ఆగమములు. తంత్రములు అనునవి కూడ ఆగమములే. శాక్తేయులును బౌద్ధులును విశేషముగ తంత్రములను అనుసరింతురు. ఆగమములెల్ల ఆరాధనప్రకారప్రతిపాదకములైయుండ, సాంఖ్యము, యోగము, న్యాయము, వైశేషికము, పూర్వమీమాంస, ఉత్తరమీమాంస (వేదాంతము) అను ఆఱు దర్శనములును సిద్ధాంతప్రతిపాదకములు.

హిందువులసిద్ధాంతప్రతిపాదకగ్రంథములలో మిక్కిలి ప్రామాణికమైనది బ్రహ్మసూత్రములు. వీనికే వేదాంతసూత్రము లనియు భిక్షుసూత్రము లనియు నామాంతరములు. ఉపనిషదుపదేశము లన్నియు ఈ సూత్రము లందు ఇమిడి యున్నవి. ఈ సూత్రములు సంక్షిప్తములుగను గహనములుగను ఉన్నందున వివిధవివరణములు ఏర్పడినవి. అందు ముఖ్యములు శంకర, రామానుజ, మధ్వభాష్యములు.

సాధనలను వివరించు గ్రంథములలో ఎక్కువ చెల్లుబడి గలిగియుండునది పతంజలి యోగసూత్రములు. ధ్యానప్రక్రియను ఆ గ్రంథము తెలియజేయును. అందు ప్రతిపాదితమైన అష్టాంగమార్గము ఆధ్యాత్మికసాధనాంగముగ ఇంచుమించు అన్నిమతాలవారును అంగీకరించిరి. ఎక్కువవ్యాప్తిలోనుండు మూడు ప్రమాణగ్రంథములు — ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రములు, భగవద్గీత. ఈ మూఁటింటికిని ప్రస్థానత్రయ మని పేరు. ఈ గ్రంథములందలి విషయములను ఆధారపఱచుకొని తమ సాధనానుభవములను తోడ్పఱచుకొని ఎందఱో యోగులును మునులును లెక్కకు మిక్కిలియైన గ్రంథములను బహుభాషలలో రచించి యున్నారు.

జైనులకు పవిత్రగ్రంథములు ఆగమములు. వానికి అంగములు ఉపాంగములు కలవు. జగము ముక్తిసిద్ధాంతము, సన్న్యాసనియమములు, సాధనలు, నీతులు — ఇవి ఆ గ్రంథములందలి విషయములు. జ్యోతిష శరీరశాస్త్ర భూగోళశాస్త్ర విషయములుగూడ అందు కలవు. శ్రుతులవలె ఇవియు గురువులు చెప్పగా శిష్యులు విని నేర్చుకొనుచుండిరి. క్రీస్తుశకము 5-వ శతాబ్దిలో కాబోలు ఇవి లిఖితరూపము దాల్చినవి.

ఇట్లే బుద్ధునుపదేశములుకూడ ఆయనకు చిరము తరువాత వర్గీకృతములై గ్రంథస్థములుగ నొనర్పబడినవి. వానికి త్రిపిటకము లని

పేరు. త్రిపిటకము లేవి యనగా—సూత్రపిటకము, వినయపిటకము, అభిధర్మపిటకము. మహాయానబౌద్ధులు ఆదరించు గ్రంథములు సద్ధర్మపుండరీకము, ప్రజ్ఞాపారమితము మున్నగునవి. ధర్మపథము అను గ్రంథము చిన్నదైనను మిక్కిలి వ్యాప్తిచెందినది. బుద్ధోపదేశసారమంతయు అందు కలదు.

సిక్కులకు పవిత్రగ్రంథము ఆదిగ్రంథము. నానక్కు మొదలు మొదటి అయిదుగురు సిక్కుగురువుల ఉపదేశములు అందు క్రోడీకరింపబడియున్నవి. — కబీరుజీవితప్రభావము నానక్కుపై నెంతగనో కలదు. వివిధదేవతలను సంబోధించు ప్రార్థనలు, గేయములు ఇం దెన్నో ఉండుటేగాక, ఈ గ్రంథమునే పీఠము నుంచి పూజింతురు.

సెమిటిక్కుమతములు ఇంచుమించు గ్రంథాశ్రితములే. మతస్థాపకునిబోధనలుగల గ్రంథము మతమునకంతటికిని కేంద్రస్థానీయమైయుండును. క్రైస్తవులకు బైబిలొక్కటే ప్రమాణగ్రంథము. అందును క్రొత్తనిబంధనము (న్యూ టెస్టమెంటు) ఎక్కువ ముఖ్యము.

యూదులమతమునకు ప్రా త ని బం ధ న ము (ఓల్డు టెస్టమెంటు)ను టాల్మూడును ముఖ్యములు. టాల్మూడు ప్రాతనిబంధనమునకు అనుబంధము అని చెప్పదగును యూదుల విజ్ఞానసర్వస్వము అందులో కలదు. చట్టములనుగూర్చి అది ముఖ్యముగ చెప్పును గాని మతము, నీతి మున్నగునవికూడ అందు చర్చింపబడియున్నవి.

ఇస్లామునకు పవిత్రగ్రంథము కొరాను. గేబ్రియలు అను దేవదూత అందించిన మహమ్మదుప్రభుని బోధనలు ఆ గ్రంథమున 114 సురలలోను 77639 పదములలోను పొందుపఱుపబడియున్నవి. "ఏకేశ్వరుని శరణు చొరుడు, ఏకైకమగు ఇస్లాము నాశ్రయింపుడు, అదే మోక్షమార్గము" అని అది బోధించును. పుణ్యపాపనిర్ణయదినము, బహుమానములు, దండనలు, చట్టములు మున్నగునవి సోదాహరణముగను సోత్సాహముగను చర్చింపబడియున్నవి.

జొరోస్ట్రియనుల పవిత్రగ్రంథము జెండ్ అవస్తా. నీతిని క్రతుకలాపములను భగవచ్ఛాస్త్రమును తెల్పు గ్రంథావళికి 'యాశ్న' అని పేరు. జారతుష్ట్రి రచించిన 'గాథాస్' — ఈ వర్గమునకు చెందినది. మఱికొన్ని ప్రకరణములలో 'అహురమజ్ద' దేవుని పరివారమును గూర్చిన ఆవాహనలు, స్తోత్రములు, పూజారి విధులు వివరింపబడియున్నవి.

చైనీయుల పవిత్రగ్రంథములలో అన్నిటికంటె పవిత్రములైనవి 'కన్ఫ్యూషియస్'ను అతనిశిష్యులును వ్రాసిపెట్టిన 'అనలెక్టులు'. ఇందు నైతికసంభాషణలు గలవు. టేయోస్టు వర్గమువారి పవిత్రగ్రంథము 'టేయో టేచింగ్'. జపానీయుల పవిత్రగ్రంథములలో ప్రధానములైనవి రెండు — కోజికి, నీహాంగీ.

ఇప్పుడు ప్రపంచమున నున్న మతములకు సంబంధించిన ముఖ్యప్రమాణగ్రంథము లివి. ఇవియు వీని ననుసరించిన అసంఖ్యాకములగు ఇతరగ్రంథములును ఉన్నతసత్యములను ప్రతిపాదించుచు సంఘమతజీవితపరిణతికి ఎంతయు తోడ్పడుచున్నవి.

# వేదములు

శ్రీ కనుపర్తి మార్కండేయశర్మగారు

లోకమునందు జనులప్రవృత్తి కావలసినవానిని సంపాదించుకొనుటయు, వ్యతిరేకము లయినవానిని పోఁగొట్టుకొనుటయు అను విషయములకు సంబంధించియుండును. అట్టి ప్రవృత్తి అల్పజ్ఞుఁ డగు జీవుఁడు ఏర్పఱుచుకొన్నచో, నతని యల్పజ్ఞతవలన అభీష్టము నిరంతరరాయముగ సిద్ధింపదు. కావున "ఇష్టప్రాప్త్యనిష్టపరిహారయో రలౌకిక ముపాయం యో వేదయతి స వేదః" అని ఆర్యులు వచించిరి. ఆ వేదము భగవత్కృతము. వేదములు ఋగ్వేదము యజుర్వేదము సామవేదము అథర్వవేదము అని నాల్గువిధములు. వేదము జ్ఞానస్వరూప మగుటచేతను జ్ఞానము పరమేశ్వరస్వరూప మగుటచేతను భగవత్కృత మనియు చిరకాలసముపార్జితమగు తపశ్శక్తిచేత మహర్షులు వేదమంత్రములఁ గనిపట్టి లోకహితార్థమై శిష్యుల కుపదేశించి రనియు, వారలు క్రమముగఁ దమతమ శిష్యుల కుపదేశించి రనియు ఈ తీరున లోకమునందు వేదము వ్యాపించిన దనియు ప్రాచీనులగు యాస్క, పాణిని, కాత్యాయన, పతంజల్యాది మునివర్యులును, ఆస్తికులగు దార్శనికులును ఏకగ్రీవముగ అంగీకరించుచున్నారు.

### ౧. వేదములు, మూఁడా? లేక నాలుగా?

అనువిషయము మనకు విమర్శనీయము. ఈ విషయము గహనమయినది. తీగెను కదలించిన పొద యంతయుఁ గదలునటుల వేదములన నేమియో ఇప్పుడు గ్రంథరూపములుగ నున్న వేదములస్థితి యేమియో తెలిసికొనినఁ గాని పై విషయము తెలియఁజాలదు. కావున తద్విషయమును వ్రాయఁబోవుచు వేదములు మూఁడనుటయు నాల్గనుటయు రెండును ఒకవిధముగ యథార్థములే యని మా పాఠకులకు నివేదించుచున్నాను.

### ౨. వేదములు మూఁ డనుట ఎట్లు?

మొదట నీశ్వరుని నిశ్వాసభూతము లగు వేదమంత్రములను మహర్షులు బ్రహ్మచర్యాది నియమపూర్వకమైన తపశ్శక్తిచేత సమాధిదశయందుఁ గనుగొన్నవారై లోకమున వ్యాపింపఁ జేసిరి. అసంఖ్యాకు లగు మహర్షు లసంఖ్యాకము లగు మంత్రముల నిటులఁ గనిపట్టిరి. ఏమంత్రమును ఏమహర్షి కనిపట్టినదియు ఇప్పటికిని ఆయామంత్రములకడ వ్రాయఁబడియే యున్నది. ఈవిషయము శౌనకాదికృత సర్వానుక్రమణికలందు స్పష్టము.

మహర్షిదృష్టము లగు మంత్రము లన్నియు రచనాభేదముచేత త్రివిధములు. వానిని ఋగ్యజుస్సామములు అనెదరు.

అనఁగా నియతాక్షరసంఖ్య గల పాదబద్ధమైన శ్లోకము ఋక్కు. పాదబద్ధముకానిది యజుస్సు. గానరూపమయినది సామము.

మహర్షులచేత తపశ్శక్తిని కనుగొనఁబడిన మంత్రము లన్నియు ఇట్లు ఋగ్యజుస్సామ రూపమగు త్రివిధరచనలలోఁ జేరి యుండుటచేత, ''త్రయి'' అని వ్యవహరింపఁబడుచుండెను. త్రయి అనఁగా ఋగ్యజుస్సామరూప త్రివిధ రచనాత్మకమయినది అని యర్థము.

ఋగ్రూపమంత్ర సమూహము గల వేదము ఋగ్వేదము, యజూరూపమంత్ర సమూహముగల వేదము యజుర్వేదము, గాన రూప మంత్రసమూహముగల వేదము సామవేదము— అని రచనాభేదము చేతను వేదములు మూఁడే కావున ''త్రయి'' అనుట న్యాయ్యము.

### ౩. వేదములు నాల్గనుట ఎట్లు?

యజ్ఞార్థము భగవంతుఁడు వేదముల నేర్పఱిచె ననియు యజ్ఞమే ప్రధానముగ నందు బోధింపఁబడిన దనియు ప్రాచీనులై తపఃప్రభావమున నాయా వేదములకు వ్యాఖ్యానరూపము లగు బ్రాహ్మణములఁ గనిపట్టిన మహర్షు లందఱు నభిప్రాయపడిరి. కల్పసూత్రకారులు వారినే అనుసరించిరి. అందఱకంటె నవీనుఁడగు యాస్కాచార్యుఁడు మాత్రము మంత్రార్థ విచారసమయమునందు అధియజ్ఞపరముగ నర్థముజేసి తరువాత ఆధ్యాత్మాధిదైవపరముగఁ గూడ నర్థమును చేసెను. అథర్వమహర్షియే ప్రథమమున యజ్ఞప్రక్రియను ప్రకాశింపఁజేసె నని ఋగ్వేదమునందే చెప్పఁబడి యున్నది.

యజ్ఞైరథర్వా ప్రథమః పథ స్తతే, (ఋ.సం. ౧. ౬. ౪. ౫.) అగ్నిర్జాతో అథర్వణా. (ఋ. సం. ౭. ౭. ౪. ౫.) త్వామగ్నే పుష్కరాదధ్యథర్వానిరమన్థత. (ఋ. సం. ౪. ౫. ౨౩. ౩.) అథర్వాణంపితరం దేవబంధుంమాతుర్గర్భం పితు రసుం యువానం, య ఇమం యజ్ఞం మనసా చికేత ప్రణో వోచ స్తమిహేహ బ్రవః॥ (ఋ. సం. ౭. ౧. ౨.) అని యున్నది. కావున అథర్వమహర్షియే యజ్ఞకార్యసౌకర్యార్థము హోతృమంత్రముల నొక్క గ్రంథముగను అధ్వర్యుమంత్రముల నొక్క గ్రంథముగను, ఉద్గాతృమంత్రముల నొక్క గ్రంథముగను, బ్రహ్మమంత్రముల నొక్క గ్రంథముగను ఏర్పఱచె ననియు దాని వలన నాల్గువేదము లను ప్రసిద్ధి కలిగిన దనియుఁ దెలియుచున్నది.

హోతృమంత్రములు పెక్కులు ఋగ్రచనాత్మకము లగుటచేత ఋగ్వేదమనియు హోతృవేద మనియు, అధ్వర్యుమంత్రములందు కొన్ని ఋఙ్మంత్రము లున్నను అనేకములగు మంత్రములు యజూరచనాత్మకము లగుటచేత యజుర్వేదమనియు అధ్వర్యువేద మనియు, ఉద్గాతృమంత్రములందు అధికసంఖ్యగలమంత్రములు సామాత్మకములగుటచేత సామవేదము అనియు నుద్గాతృవేదమనియు, హోత్రధ్వర్యూద్గాతృమంత్రములకంటె భిన్నము లగుమంత్రముల సంగ్రహమునకు రచనాత్రైవిధ్యము ననుసరించిన నామములు వేదత్రయమునకు చేర్చుట చేత తద్భిన్నమంత్రసమూహమునకు బ్రహ్మవేదమనియు అథర్వమహర్షియే ఈవ్యవస్థను ఏర్పఱచెను కాన అథర్వవేదమనియు జెప్పఁబడుచున్నవి.

కావున రచనాభేదముచేత వేదములుమూఁడనియు, తత్తన్మంత్రగతహౌత్రాదివిషయభేదము చేత వేదములు నాల్గనియు గ్రహించునది. కొందఱు విమర్శకులు మహాభారతాదిగ్రంథములందు వేదములుమూఁడని చెప్పఁబడియున్న వనియు నవీనము లగు శతపథాదిగ్రంథము లందు నాల్గని చెప్పఁబడి యున్న వనియు

వచించుచున్నారు. కాని ఆమాట గ్రంథము నంతయుఁ బరిశీలించి పలికినదికాదు. వారు ఏగ్రంథములందు వేదములు త్రివిధము లని చెప్పఁబడె ననిరో ఆగ్రంథములందే నాల్గనియు, నాల్గని చెప్పఁబడె ననిన గ్రంథములందు మూఁడనియు గలదు. చూడుఁడు: "అగ్నే ర్ర్చో వాయో ర్యజూంషి సామా న్యాదిత్యాత్। స ఏతాం త్రయీం విద్యా మభ్యతపత్॥ (ఛాం. ౬. ౧౭.) ఋగ్వేదం విజానాతి యజుర్వేదం సామవేద మాథర్వణం చతుర్థం॥ (ఛాం. ౭. ౭.) అరేఽస్య మహతో భూతస్య నిశ్వసిత మేతద్య దృగ్వేదో యజుర్వేదస్సామ వేదో ఽథర్వాంగిరసః॥ (బృహ. ౪.౪.౧౦) త్రయో వేదా అజాయంత॥ (శత. ౧౧.౫.౮)

అగ్ని వాయు రవిభ్యస్తు
త్రయం బ్రహ్మ సనాతనం
దుదోహ యజ్ఞసిద్ధ్యర్థ
మృగ్యజుస్సామ లక్షణం.
(మను. ౧. ౨౩.)

ఏకత శ్చతురో వేదా
భారతం చైకదేశతః
పురా కిల సురై స్సర్వై
స్సమేత్య తులయా ధృతమ్.
(భా. ఆది.)

ఇట్లు ద్వివిధములుగ చెప్పఁబడియుండుట చేతనే ఇదివఱకు వివరించియున్న రచనాభేద సంహితాభేదములే త్రివిధ, చతుర్విధ విభాగ ములకు హేతుభూతము లని ఎఱుంగునది.

## ४. వేదశాఖా భేదములు

ఋగ్వేదాదిభేదములు యజ్ఞానుష్ఠానార్థము ఏర్పడియున్నవి కావున తత్తన్మహర్షులు తమ తమ శిష్యపరంపరకు అధ్యాపన మొనర్చిన క్రమము, అగ్నిహోత్రాదికములందు చేసెడి క్రియలందు గల పౌర్వాపర్యభేదములఁ దెలిపెడి శ్రౌతసూత్రాదికముచేతను శాఖాభేదము లనేకము లేర్పడియున్నవి. పాణినిసూత్రము లందు కొన్ని శాఖల పేర్లు చెప్పఁబడినవి. పతంజలి మహాభాష్యమునందు ఋగ్వేదాది శాఖల సంఖ్య ఈ విధముగఁ జెప్పఁబడి యున్నది:

"చత్వారో వేదా స్సాంగా స్సరహస్యాః బహుధాభిన్నా ఏకశత మధ్వర్యుశాఖాః, (యజుర్వే. ౧౦౧.) సహస్రవర్త్మా సామవేదః (సామ ౧౦౦౦.) ఏకవింశతిధా బాహ్వృచ్యం (ఋగ్వే. ౨౧) నవధా ఽథర్వణో వేదః (అధర్వ. ౯.)" అచ్చటచ్చట వేర్వేఱుగను లెక్కింపఁబడినవి. ఋగ్వేదాదివేదములకు క్రమముగా ముక్తికోపనిషత్తు ననుసరించి ౨౧,౧౦౯,౧౦౦౦,౫౦ శాఖలును, మహాభాష్యము ననుసరించి ౨౧,౧౦౧,౧౦౦౦,౯ శాఖలును, స్కాందపురాణము ననుసరించి ౨౪,౧౦౧,౧౦౦౦,౧౨ శాఖలును గలవు.

ఒక్కొక్క వేదమునకు ఇట్లు శాఖాభేదములు చెప్పఁబడియున్నను భారతాదిగ్రంథములందు ప్రథమద్వితీయపర్వములందు ప్రతిపాదింపబడిన విషయము ఎటుల వేర్వేఱుగ నున్నదో అట్లే ఋగ్వేదశాఖలందు వేర్వేఱు విషయములు చెప్పఁబడ లేదు. ఋగ్వేదాది వేదచతుష్టయశాఖలలో కొన్ని శాఖల పేరులు మాత్రమే తెలియుచున్నవి. కాని ఆయా శాఖల సంహితాగ్రంథములు మాత్రమే ప్రచారమునం దున్నవి. మండలాధ్యాయసూక్త సంఖ్యాక్రమముగ ౧౦ మండలములు గల విభాగమును శాకలశాఖావాంతర శాఖవారగు శైశిరీయశాఖవారును; అష్టకాధ్యాయ వర

విభాగభేదములచేత ౮ అష్టకములుగ బాష్కల శాఖవారును అధ్యయనము చేయుదురు. వీరు పైని చెప్పఁబడిన తైత్తిరీయశాఖవారు పఠింపని వాలఖిల్యములను ౮౦ మంత్రముల నధికముగఁ బఠింతురు.

దీనివలన శాఖాభేదము, అధ్యయనక్రమ భేదమునను, మంత్రసంఖ్యాప్రయోగసూత్ర భేదమునను ఏర్పడుచున్నది అనఁదగును.

౨. ఇట్లే యజుర్వేదశాఖలలో కృష్ణయజుర్వేదమునకు ౮౬ శాఖలు శుక్లయజుర్వేదమునకు ౧౫ శాఖలు గలవు. వీనిలో కృష్ణయజుర్వేదశాఖలు ౮౬ లోను మైత్రాయణి, తైత్తిరీయము లని ప్రసిద్ధిగల ఔఖ్యాపస్తంబీయ కాఠకము లను ౪ శాఖలు గలవు. శుక్లయజుర్వేదశాఖలు ౧౫ లోను మాధ్యందిని, కాణ్వీయనుశాఖలు రెండును నిల్చియున్నవి. ఇతర వేదశాఖలకంటె ఈ యజుర్వేదమునందు కృష్ణ శుక్లసంహితలకు చాలభేద మున్నది.

3. సామవేదము శాఖలు ౧౦౦౦ లో "రాణాయని, కౌథుమి, జైమిని" అను మూఁడు శాఖలు మాత్రము గలవు.

౪. అథర్వవేదము ౯ శాఖలలో "శౌనక శాఖ" యొకటిమాత్రము గలదు.

లోపించిన శాఖలకు సంబంధించిన బ్రాహ్మణ గ్రంథములు శ్రౌతకల్పసూత్రములు కొన్ని కొన్ని గనంబడుచున్నవి. వాని వివరమునిచట గ్రంథవిస్తరభీతిచే వ్రాయలేదు.

## వేదములు, నవీనవిమర్శకులు

ఋగ్వేదము ప్రాచీనమనియుఁ బిదప కొంత కాలమునకు యజుస్సామములు రచితములనియు బ్రాహ్మణగ్రంథములు పుట్టినపిదప ఋగ్వేదాదిమంత్రములందు యజ్ఞపరమగునర్థము శబ్దములందు గనఁబడకపోయినను పూర్వవేద వ్యాఖ్యాతలు తెచ్చి పెట్టుచున్నారనియుకొంద అందురు. అథర్వవేదము అతినవీన మనియు, పాణినిసూత్రము లం దెచ్చట నథర్వవేద శబ్దము స్మరింపఁబడి యుండలేదనియు శంకరాచార్యాదులు ఉపనిషత్తులను వేదభాగము లని చెప్పుట గ్రంథగౌరవమున కనియు, పాణిని సూత్రములందు ఉపనిషచ్ఛబ్దము నిర్వచనము చేయఁబడ లేదనియు మఱికొందఱు చెప్పెదరు.

ఈవాదము సప్రమాణము గాదు. ఋగ్వేదమే మొదట పుట్టినచో, యజుస్సామవేదములు లేనియెడలను, ఋగ్వేదమునందు యజుస్సామపదము లుండరాదు గదా! కాని ఋగ్వేదమునందు యజుస్సామ పదములే గాక వామదేవ్యము, రథంతరము, బృహత్తు, మున్నగు సామభేదబోధక పదములుకూడ మిక్కుటముగఁ గనంబడుచున్నవి. యజ్ఞకర్తలగు రాజులు తద్దానములు యజ్ఞీయఋత్విక్కులహోత్రాదినామములును పలుతావుల చెప్పఁబడి యుండుటచేత నిది స్వకపోలకల్పితమనఁదగును.

పాణినిసూత్రము లందు అథర్వవేదపదము గనంబడనంతమాత్రాన అథర్వవేదము తత్కాలమునందు లేదని తలంచుట యుక్తిసహమా? పాణిని తనకాలమునందు లోకమున వ్యాపించి యున్నశబ్దముల కన్నిఁటికి స్వసూత్రములందు నిర్వచనము చేర్పఱచెదను అని ప్రతిజ్ఞ చేసి యుండలేదు.

శాకలబాష్కలాదిశాఖలకు ఋగ్వేదాది నామములు సాధారణములైనట్లే శౌనకాది శాఖలకు అథర్వవేద మని సాధారణనామము

గలదు. పాణినిసూత్రములలో ప్రోక్తాధికార మునందు శౌనకాదిభ్యశ్ఛందసి (౪.౩.౧౦౬) అని సూత్రము కలదు. దీనిచేత శౌనకసంహిత పాణినికి తెలియునని సిద్ధించుచున్నది. "ఛందసి" అనుటచేత ఛందోభిన్నమగు శౌనకీయ గ్రంథాంతరము కూడ పాణినికి తెలియుననియు సిద్ధించును. అయ్యది 'శౌనకీయశిక్షాగ్రంథము' ఇదియు పాణినికి తెలిసియేయున్నది. "కాశ్యప కౌశికాభ్యా మృషిభ్యాం ణినిః"(౪.౩.౧౦౩) అను సూత్రమువలన కౌశికఋషిప్రోక్తమును అథర్వవేద కల్పసూత్రమగు కౌశికసూత్రమును సైతము పాణిని ఎఱింగియే యున్నాఁ డన దగును. యాస్కాచార్యుఁడు పాణినికంటె పూర్వుఁ డని పలువు రంగీకరించు చున్నారు. తన్నిరుక్తగ్రంథమున మంత్రవ్యాఖ్యానకాల మునందు "ఇత్యపి నిగమో భవతి" అని అథర్వవేదీయ మంత్రములుకూడ గ్రహింపఁబడియే యున్నవి. అథర్వవేదీయ గోపథబ్రాహ్మణము నుండి కూడ నిరుక్తగ్రంథమునందు ప్రమాణార్థము వాక్యములు గైకొనఁబడినవి. కావున అథర్వవేదము పాణినికి తెలియ దనుటయు, తెలిసినను వేదములం దొకటిగ పాణిని కాలము నందు గ్రహింపఁబడుట లే దనియుఁ జెప్పెడి మాటను వేదజ్ఞు లంగీకరింపరు.

జీవికోపనిషదావౌపమ్యే (౧.౪.౭౯) అను నీ సూత్రమువలన "ఉపనిషత్కృత్య" అను పదము సిద్ధించును. పాణినికాలమునందు ఉపనిషత్తులప్రచార ముంటయే గాక ఉపనిషద్జ్ఞు లగువారిచేత రచనయందు భావమునందు ఉపనిషత్తులతో సమానము లగు గ్రంథములు రచింపఁబడిన వనియు కూడ పాణిని ఎఱింగి యున్నాఁడు. పాణినికంటె ప్రాచీనుఁ డగు యాస్కుఁడు 'యత్రా ఉసుపర్ణా అమృతస్య' (ఋ. సం. ౧. ౧౬౪. ౨౧.) అను మంత్రమునకు అధిదైవత వ్యాఖ్యాన మొనర్చుచు "ఇత్యుపనిషద్వర్ణో భవతి (నిరు. ౩. ౨. ౬) అని చెప్పెను. యాస్కునికే ఉపనిషత్తులఁ గూర్చి తెలిసినట్లు మనకు కనఁబడుచుండగాఁ నతని తరువాతవాఁ డగు పాణినికి ఉపనిషత్ పదము తెలియదనుట చింత్యము.

శుక్లయజుర్వేదము పాణినికి తెలియదని కొంద ఱందురు. కాని అదియు నసంగతమే.

## ఉపసంహారము

వేదములనుగుఱించి వ్రాయునప్పుడు ఆయా వేదశాఖలనామములను ఆయాశాఖలకు సంబంధించిన గ్రంథాంతరములను గూర్చి వ్రాయుట అత్యావశ్యకము. అయినను గ్రంథవిస్తరభీతి చేత ఇచ్చట నాల్గువేదములను గూర్చి మాత్రమే సంగ్రహముగ వ్రాసినాఁడను. వేద గ్రంథములను గూర్చియు, తత్కాలీనములగు ఆచారవ్యవహారాదికములను గూర్చియు వ్రాయఁబూనెడి విమర్శకు లందఱు తదుద్దిష్టము లగు నాయాగ్రంథములను తాము స్వయముగ పరిశీలించి సుతర్కముతో మీమాంసఁ జేసి తరువాత వానిని గ్రహించుటనో త్యజించుటనో చేయఁదగు నని ప్రార్థించెదను.

[1919 ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచిక నుండి].



# ఉపనిషత్తులు

## ఆచార్య శ్రీమతి వారణాసి వరలక్ష్మమ్మగారు

"సమస్తమైన ఉపనిషత్తులును, ఇతరమత గ్రంథములును నశించుట సంభవించినప్పటికిని ఈశావాస్యోపనిషత్తునందలి ప్రథమ వాక్య మొక్కదానిని హిందువులు జ్ఞాపక ముంచుకొనిన హిందూమతము శాశ్వతముగా జీవింపగలదు" అని నేను తుట్టతుదకు నిర్ణయము చేసికొంటిని. —గాంధీమహాత్ముడు.

ఉపనిషత్తు లీ నాటికిని మన కిట్టి సందేశములనే యిచ్చుచున్నవి. ఈ ఉపనిషత్తులు భారతీయభావములకును, సంస్కృతికిని మూలాధారములై యున్నవి. అవి సనాతనుల భావనా విధానమునకే గాక అధునాతనములైన విభిన్న భారతీయమతములకుకూడ ఉద్బోధకములై యున్నవి. భారతదేశమం దెట్టి పునరుద్ధారక మతములు ప్రారంభమైనను అవి ఉపనిషద్భావములను బలపఱచునవిగానే యున్నవి. ప్రతి హిందూమతసంస్కర్తయు, ప్రతిమతనాయకుడును కూడ ఈ అమరగ్రంథములందలి భావమును జ్ఞాపకపఱచుటకే పాటుపడిరి.

ఈ ఉపనిషత్తు లన్నియు ఒక్కనిచే వ్రాయబడినవి కావు. ఇవి వేదాంతముపై వ్రాసిన క్రమబద్ధవ్యాసములును కావు. ఇవి ప్రాచీనమహర్షులు తమ ఆంతరికదృష్టిచే తెలిసికొని పలికిన అనుభవవాక్యములు. కావుననే అవి ఆ పరమసత్య ప్రత్యక్షానుభవ వాసనలు కలిగి యున్నవి. వీనిని కథలరూపములోను, చర్చలరూపములోను, సంవాదరూపములోను కూర్చిరి. ఈ ఉపనిషత్తులను 'వేదాంత' మని పేర్కొనుచున్నారు. వేదాంత మనగా వేదములకు ముగింపు భాగ మనియు, ఉపనిషత్తులు బోధించు విషయములు వేదముల చరమలక్ష్యమునకు ప్రాతినిధ్యము వహించుచున్న వనియు భావమై యున్నది. 'ఉపనిషత్' పదమునకు ఉప=సమీపమందు, ని=భక్తితో, సద్=కూర్చుండుట అని యర్థమై యున్నది. ఈ అర్థము ఆనాడు ఉపనిషత్తుల నీవిధముగ నభ్యసించెడివా రను విషయమును సూచించుచున్నది. ఉపనిషద్విషయము ఆ పరమతత్త్వమును బోధించుటచే నవి వాని నభ్యసించు విద్యార్థులందు సామర్థ్యమును కోరుచున్నవి. ఇట్లు ఉపనిషత్తులు సమర్థులగు విద్యార్థులకు మాత్రమే బోధింపబడుచుండుటచే కొంతకాలమునకు ఉపనిషత్పదమునకు "రహస్యము" అను నర్థము చేర్పబడినది. తత్ఫలితముగా "ఉపనిషత్తులు" "గుహ్యాదేశములు" "పరమగుహ్యములు" అను పదములు ప్రచారములోనికి వచ్చినవి. ఉపనిషత్తులు అజ్ఞాన "నాశకము" లనియు, బ్రహ్మను "చేర్చున వనియు" శ్రీశంకరులవంటి వ్యాఖ్యానకర్తలు చెప్పిన అర్థము దూరాన్వయమైనప్పటికిని అది ఉపనిషదుద్దేశమును సరిగా నిర్వచించుచున్నది.

ఇట్టి యీ ఉపనిషత్తులు సుమారు రెండు వందలకు పైగా నున్నవి. శ్రీశంకరులవంటి వ్యాఖ్యాతలు వానికి భాష్యము వ్రాసియున్న లేదా వానినుండి యుదహరించియున్న ఆ గ్రంథములు ఉపనిషత్తులు అని నిశ్చయించు

టకు ప్రమాణములై యున్నవి. బృహదారణ్యకోపనిషత్తు, ఛాందోగ్యోపనిషత్తు నను నీ రెండును ప్రాచీనములైనవిమాత్రమే గాక, ఉపనిషత్తులందు సంప్రదాయానుగతమైన నిష్ప్రపంచవాదమును, సప్రపంచవాదమును ప్రత్యేకముగా ప్రవచించుటచేత నవి యన్నిటిలోను ముఖ్యతమములైన వని భావింపబడుచున్నవి. ఉపనిషత్తుల కాలము నెచటను పేర్కొనలేదు. అయినను అవి బుద్ధునికాలముకంటెను ప్రాచీనతరములైన వని తెలియుచున్నది. యాజ్ఞవల్క్యుడు ఉద్దాలకుడు మొదలైన మహర్షులు ప్రత్యేక వేదాంతశాఖలను నెలకొల్పి విశిష్టవిద్యార్థిబృందము నాకర్షించినారు. ఇట్లు వారు అందఱిలోను ప్రముఖులైనారు.

ఈ ఉపనిషద్భావము కర్మకాండను నిరసించుచున్నది. ఆత్మకంటె ఇతరదైవము నారాధించువారు దేవతల పెంపుడుజంతువులవంటివారని బృహదారణ్యకోపనిషత్తు చెప్పుచున్నది. ముండకోపనిషత్తునందు కర్మకాండపై కఠిన నిరసన కలదు. కర్మకాండను ఓటినావతో పోల్చి, దాని నాధారముగా పరిగణించువాడు జరామరణసంసారపుసుడియందు మరల మరల పడి కొట్టుకొనుచున్నా డని అచట చెప్పియున్నది. మఱి కొన్ని ఉపనిషత్తులు కర్మకాండ నంతగా నిరసింపక దానికి ఆధ్యాత్మికముగాను వేదాంతపరముగాను అర్థము చెప్పుచున్నవి. బృహదారణ్యకోపనిషత్తులో అశ్వమేధయాగమున కిట్టి ఆధ్యాత్మికమైన యర్థము కలదు. ఆ యాగము చేయువానికి భూసామ్రాజ్యాధిపత్యము కలుగు నని ఫలశ్రుతి. ఇచ్చట భూసామ్రాజ్యమును అశ్వరూపముగా చెప్పి దానిని త్యజించినవాడు విషయత్యాగమును చేసినవా డగుచున్నాడు కావున అతడు ఆత్మసామ్రాజ్యాధిపత్యమును పొందుచున్నా డని వివరించియున్నాడు. మానవునిజీవితమే సోమయాగమునకు ప్రతీకముగా నున్న దని ఛాందోగ్యము చెప్పుచున్నది. ఈ కర్మ లన్నియు పితృలోకమునకు మాత్రము తీసికొనిపోగలవనియు, ఆ కర్త మరల భూలోకమునకు తిరిగి రావలసియున్న దనియు ఇట్లు పునరావృత్తిని కలిగించు ఈ కర్మలు నీచములైన వని మఱి కొన్ని యుపనిషత్తులు చెప్పుచున్నవి. శ్వేతాశ్వతరాది అర్వాచీనోపనిషత్తులు కర్మకాండ నంతగా నిరసింపక పోయినను ఈ కర్మలు కేవలస్వర్గప్రాప్తిమాత్రఫలములు కా వనియు, లక్ష్యము పరమాత్మయే యనియు, అట్టి పరమాత్మజ్ఞానముచే సర్వబంధవిముక్తి కలుగు ననియు అవికూడ చెప్పుచున్నవి.

ఉపాసనావిధానముగల బ్రాహ్మణభాగముతో కాక ముఖ్యమైన యీ ఉపనిషత్సిద్ధాంతము అద్వైతతత్త్వమును బోధించు మంత్రభాగముతోనే సంబంధించియున్నది. ఆ మంత్రములు దేవతల అనేకత్వమును ఏకత్వమున పర్యవసింపజేయ ప్రయత్నించుచున్నవి. యాజ్ఞవల్క్యుడు మూడువేలమూడువందలఆఱుగురు దేవతలను ముందుగా పేర్కొని క్రమముగా ముప్పదిమువ్వురు, ఆఱుగురు, మువ్వురు, ఇత్యాదిగా తగ్గించి, తుట్టతుదకు ఒక్కదేవునే పేర్కొనెను. ఆ ఒక్కదేవుడే "బ్రహ్మ". అతని శక్తులే యితరదేవతారూపములో నున్నవి. ఆ బ్రహ్మయే సమస్తదైవీశక్తులకును మూలభూతమైన దను విషయమును హైమవతి యగు ఉమ కేనోపనిషత్తులో ఇంద్రునికి బోధించుచున్నది. ఏతత్ఫలితముగా ఋగ్వేదములోని "ఏకం సత్" అనునది ఉపనిషత్తులలోనికి "ఏకం ఏవ అద్వితీయం" అని మాఱినది.

ఉపనిషత్తులలో జ్ఞానము పరాజ్ఞానము, అపరాజ్ఞాన మని ద్విధా విభజింపబడినది. లౌకికశాస్త్రకావ్యాదులు, నశ్వరవిషయభోగాదులను బోధించు శాస్త్రగ్రంథాదులజ్ఞానము అపరాజ్ఞాన మనబడుచున్నది. ఆత్మజ్ఞానము పరాజ్ఞానమై యున్నది. "అది అజ్ఞేయము" అనుట విరోధాభాసమై తోచినను అజ్ఞానముగా నుండుటచే అది అజ్ఞేయము కాలేదు. అది సమస్తజ్ఞానములకును జ్ఞానమైయుండుటచేత జ్ఞానవిషయము కాకపోవుటచే అది జ్ఞేయము కాజాలదు. ఆత్మను సత్తామాత్రముగనే తెలిసికొనవలసియున్నది. కావున ఈ ఆత్మజ్ఞానమును కేవలపండితుడే గాక అనుభవశాలియగు ఆచార్యునినుండి మాత్రమే పొందవలసియున్నది. అహోగురుః! అహోజ్ఞానం! అహోజ్ఞాతా! అహోప్రవచనం! అహోశిష్యః!

భారతీయవేదాంతప్రాసాదమునకు పునాది రాళ్లవలె నిలుచునవి బ్రహ్మ, ఆత్మ అను నీరెండు పదములే. బ్రహ్మపదమునకు "ప్రార్థన, వాక్కు" అనియు, ఆత్మపదమునకు "ప్రాణ" మనియు వాచ్యార్థమై యుండియుండును. కాని తరువాతికాలమందు బ్రహ్మపదమునకు జగదాధారమనియు, ఆత్మపదమునకు ఒకజీవిలోనుండు ప్రత్యగాత్మ యనియు అర్థములు కల్పితములైనవి. ప్రాచీనఋషులు "అయం ఆత్మా బ్రహ్మ – ఈ ఆత్మయే ఆ బ్రహ్మ" యను ప్రశంసనీయమైన ఆవిష్కరణను చేసియున్నారు.

ఆత్మతత్త్వమునందు జిజ్ఞాసకలవాడై భృగువు ఈ జగత్తును విశ్లేషించి, పరిశీలించి తుదకు ఏకమైన అద్వైతబ్రహ్మతత్త్వమే బహుధా భిన్నమైన యీ జగద్రూపముగాను, అందనేక జీవరాసులుగను భాసించుచున్న దని కనుగొనెను. ఇట్టి యీ ఏకత్వసిద్ధాంతము ప్రపంచమునకే ఉపనిషత్తులిచ్చు మహత్తరమైన భావ మని చెప్పవచ్చును.

ఆతత్త్వము స్థూలరూపమునుండి సూక్ష్మరూపమునకు పోవుటయే విచారణావిధానమై యున్నది. వ్యష్టిసమిష్టుల వెనుక నాధారభూతమై యుండి, ప్రతివ్యక్తిలోను అంతరాత్మభూతమై ఆధిపత్యము వహించునదే ఆ పరమాత్మ" యని యాజ్ఞవల్క్యఋషి వివరించియున్నాడు. ఆత్మవివరణను కోరిన ఉద్దాలకు నుద్దేశించి. "సమస్తజగత్తునందును నిండియుండియు ఏది జగదతీతమై యున్నదో, దేనిని ఏదియు తెలిసికొనలేదో, సమస్తవిషయములు దేనికి ఉపాధిభూతములై యున్నవో, ఏది సర్వాంతర్యామియై శాసించుచున్నదో అదియే నీ ఆత్మ, ని అంతఃకరణమును శాసించునది. అది శాశ్వతమైనది." అని అతడు చెప్పియున్నాడు.

బ్రహ్మతత్త్వమును తెలిసికొనగోరిన తన పుత్రుడగు భృగువునకు వరుణుడు క్రింది విధముగా సూత్రప్రాయముగా చెప్పియున్నాడు: "దేనివలన ఈసమస్తభూతములు జన్మించినవో, జన్మించినవై దేనివలనజీవించుచున్నవో అదియే బ్రహ్మ" అని. ఈసూత్రమునను సరింప దలచిన భృగువు అన్న, ప్రాణ, మనోజ్ఞానములను జీవాధారములు కావని త్రోసివేసి "ఆనందమే బ్రహ్మ" యను నిర్ణయమునకు వచ్చినాడు.

అవస్థాత్రయవిచారణద్వారా ఆత్మజ్ఞానమును పొందుట ఉపనిషత్తులలో కనబడు మఱియొక విధానమై యున్నది. సర్వవేదాంతసార మనబడు మాండూక్యోపనిషత్తునందు ఈ విధానపు సంక్షిప్తసక్రమసంవిధానముకలదు. అ,ఉ,

మ్ అను త్రిమాత్రలు గల 'ఓం' అక్షరము ద్వారా క్రమముగా జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలను సూచించి, ''అమాత్ర ఓం'' అనగా మకారము తరువాతి మౌనమును తురీయావస్థగా పేర్కొని యున్నారు. ఆ తురీయ మీ మూడవస్థలకును మూలాధారభూతమైనప్పటికిని అది యీ మూడింటిలో చేర లేదు. పరివర్తనశీలమగు నీజగత్తున కతీతమైన యీ తురీయమే ఆ ఆత్మయై యున్నది. అది అద్వైతము, శాంతము అయిన ఆనందరూపము.'' ఈ విధముగా మాండూక్యోపనిషత్తు ఆత్మతత్త్వమును నిర్వచించి చెప్పియున్నది.

ఈ ప్రత్యగాత్మ ఆ పరమాత్మకంటె భిన్నము కాదని ఆత్మైక్యమును చెప్పినప్పటికిని ''ఆత్మయే సమస్తవిశ్వమున కాధార'' మని చెప్పినపుడు అది యీ ప్రత్యేకజీవాత్మ నుద్దేశించి చెప్పబడలేదు. సమష్టివాదమే జగదుత్పత్తిని వ్యష్టియగు జీవాత్మను కూడ వేఱువేఱుగా వివరించి చెప్పుచున్నది.

అద్వైతబ్రహ్మరూపియగు ఆత్మను రెండు విధములుగా పరిగణించుచున్నారు. సమస్త జగదాధారభూతమగు బ్రహ్మ - ఇది సప్రపంచ వాదము. జగత్తు కేవలము ఆభాసరూపమై ప్రతిభాసించుచున్నది - ఇది నిష్ప్రపంచవాదము. ఈ వాదములే తరువాతి కాలమున సగుణనిర్గుణ మార్గములకు దారితీసినవి. ఈ నిర్గుణ బ్రహ్మవాదమును (అసత్) శూన్యవాదముగా పరిగణింపరాదు. నిర్గుణమన కిచట ఆపరమసత్యమీ విభాగాదులచే పరిచ్ఛిన్నము కాజాలదనియే అర్థ మగుచున్నది. ''నేతి, నేతి'' ఇత్యాది వాక్యములుకూడ సచ్చిదానంద రూపమునే సూచించుచున్నవి. ఈ పదములను కూడ వాని వాచ్యార్థముమాత్రమే సరిపెట్టుకొని గ్రహింపరాదు. అవి యీ మానవబుద్ధికి గోచరమగు ఉత్తమ జ్ఞానమును సూచించుచున్నవి. బృహదారణ్యకములో బ్రహ్మను ''సత్యస్య సత్యం'' అని చెప్పి సత్యం అను పదమును స-తి-యం అను మూడువిధములుగా విభజించియున్నారు. ఈ పదమందు ఆద్యంతాక్షరములు సత్యమును, మధ్యాక్షరము అసత్యమును సూచించుటచే అసత్యము రెండువైపుల సత్యముచే చుట్టబడిన దని తెలియుచున్నది.

ఈ ప్రపంచసృష్టినిగూర్చికూడ ఉపనిషత్తులలో రెండువాదములుగలవు. సువర్ణమునుండి ఆభరణము లుప్పతిల్లినట్లు బ్రహ్మనుండి జగము లుప్పతిల్లినవనియు, రజ్జువునందు సర్పమువలె బ్రహ్మమందీ జగత్తు ఆభాసమాత్రముగా తోచుచున్న దనియు రెండు వాదములు గలవు. ఈ రెండును జగదుత్పత్తికి పరబ్రహ్మరూప పరమాత్మనే కారణముగా చెప్పుచున్నవిగాని మఱియే లౌకిక కారణమును చెప్పుట లేదు. జగత్కారణమును వివరించుచు కాలము, స్వభావము, నియతి, యదృచ్ఛ, భూతములు, యోని, పురుషుడు—ఇవన్నియు కారణములు కావనియు, ఒకవేళ అయినను అవి ముఖ్యకారణములు గాక గౌణకారణములు మాత్ర మగుచున్న వనియు ఛాందోగ్యోపనిషత్తు చెప్పుచున్నది. వీనికన్నిటికిని అతీతముగా ఆ భగవంతుని స్వీయగుణంబులలో అణగియున్న 'ఆత్మశక్తి' యొకటి కలదు. ఈ జగత్తునకు బ్రహ్మ అభిన్న, నిమిత్తోపాదాన కారణములుగా చెప్పబడుచున్నాడు. కేనోపనిషత్తు పేరులోనుండు ''కేన'' ''ఎవనిచేత'' అను ప్రశ్నలోనే జగత్కారణము సూచితమగుచున్నది. ఇందు బ్రహ్మను నిమిత్తకారణముగా

పేర్కొనియుండ ఈశావాశ్యమందు బ్రహ్మను ఉపాదానకారణముగా పేర్కొనియున్నారు. నిమిత్తోపాదానకారణములు రెండును అభిన్నము లని తైత్తిరీయమందలి "నన్ను నేను జగద్రూపములో సృష్టించుకొందునుగాక!" అను మంత్రమును "నేను బహుధా అగుదును గాక!" అను ఛాందోగ్యమునందలి మంత్రమునుచదివిన మనకు తెలియగలదు.

సాలెపురుగునుండి సాలెపట్టు వెడలినట్లును, అగ్నినుండి విస్ఫులింగములు వెడలినట్లును, భూమినుండి యోషధు లుద్భవించినట్లును ఈ జగత్తు ఉద్భవించిన దని జగత్సృష్టిని వివరించి యున్నారు. ఈజగత్తు అనేకధా ఉత్పన్నమగుటచే ఆ బ్రహ్మ కెట్టి లోపమును రా దను విషయమును కఠోపనిషత్తునం దీ క్రింది యుదాహరణముద్వారా వివరించియున్నాడు. జగచ్చక్షువగు సూర్యుడు చర్మచక్షువుల దృష్టిలోపముచే నే విధముగను ఎట్లు బాధింపబడడో అదే విధముగా బాహ్యమైన యీవిషయప్రపంచముచేత ఆంతరికమైన ఆత్మతత్త్వము ఏవిధముగను బాధింపబడదు" అని పంచజ్ఞానేంద్రియములు, వానితన్మాత్రలవివరణ నాధారముగాచేసికొని పృథివ్యాది పంచభూతముల పర్గీకరణము జరిగినది. ఈ పంచభూతముల నుండి యుత్పన్నమైన యీ విషయప్రపంచము పంచేంద్రియములు గల జీవునికి భోగసాధనమై అనుభవ క్షేత్రమును కల్పించుచున్నది.

అండజములు, జీవజములు, ఉద్భిజము లని జీవరాసులు త్రివిధముగా విభజింపబడినవి. తరువాత స్వేదజములు అను మఱియొక వర్గమును దీనికి చేర్చిరి. ఈ జననమరణావృత్తిని ప్రాచీనోపనిషత్తు లంతగా పేర్కొనలేదు. శ్వేతాశ్వతరోపనిషత్తులో నీ యావృత్తిని గుఱించి పెక్కుచోట్ల పేర్కొనియున్నారు. కల్పాదియందు సమస్తభూతములను సృష్టించి వానిని కల్పాంతమందు రుద్రుడు లయముచేయుచున్నాడు. ఇట్టి ఇంద్రజాలమును ఆ రుద్రు డనేకపర్యాయములు కల్పించుచున్నా డని అచట చెప్పబడియున్నది.

అజాతవాదము సృష్టిసిద్ధాంతము నంగీకరింమట్టిని, సువర్ణమును, అగ్నివిస్ఫులింగములను ఉదాహరించి సృష్టిని బోధించుట ఆ అభేదతత్త్వమును బోధించుటకే యగుచున్నది. ఈ జగత్తు కేవలము ఆభాసమాత్రమే కాని సత్యము కాదు. ఈ వాదములో "మాయ" యనున దొకటి కల్పితమైనది. ఈ మాయయే నిరుపాధికబ్రహ్మను సోపాధికముగా భాసింప జేయుచున్నది. ఈ మాయాసిద్ధాంతముకూడ ఉపనిషత్తులలో అంతగా కన్పించుటలేదు. అయినప్పటికిని యాజ్ఞవల్క్యాది ఆచార్యు లిట్టి మతమును నిర్వచించియున్నారు. ద్వైతమువలె భాసించుచోట ఒకడు మఱియొకదానిని చూచుట, మఱియొకదానిని వినుట ఇత్యాది జరుగుచున్నవి. ఇచట "ద్వైతమివ-ద్వైతమువలె" అనునప్పు డీ "వలె" యను పదమే జగత్తు సత్యము కా దనియు, మిథ్య యనియు, అది మాయ యనియు తెలియజేయుచున్నది. ఈ "మాయ" యను పదము ఋగ్వేదమందే కనబడుచున్నది. "ఇంద్రుడు మాయచే అనేక రూపములను చూచుచున్నాడు" అని అచట చెప్పబడియున్నది. సర్వభూతనాథు డగు ఈశ్వరుని "మాయావి" యని శ్వేతాశ్వతరోపనిషత్తు పేర్కొనుచున్నది. ఈ "మాయ" అనుదానితో సమానార్థముగల "అవిద్య" యను పదము కొన్ని ఉపనిషద్గ్రంథములలో

కనబడుచున్నది. ఈ మాయ, అవిద్య అను పదములు జగదుత్పత్తియే ఒక అద్భుత మని సూచించుచున్నవి. కాని యీ జగత్సృష్టి ఆ పరమాత్మ నేవిధముగను బాధింప దను విషయ మీ క్రిందివాక్యములచే దృఢపఱుపబడినది.

పూర్ణ మదః, పూర్ణ మిదం ...... పూర్ణమే వావశిష్యతే''.

సృష్టివాదము, అజాతవాదము ఈ రెండును ఈ జీవాత్మ ఆ పరమాత్మకంటె భిన్నము కా దను విషయము నంగీకరించుచున్నవి. ఆ పరమాత్మయే సమస్తజీవులలోని ప్రత్యగాత్మయై యున్నదని యాజ్ఞవల్క్యుడు చెప్పుచున్నాడు. ఒక్క చెట్టుమీదనే రెండుపక్షులు నివసించుచున్నవి. అందొకటి జీవుడు. రెండవది పరమాత్మ. ఉపాధిగతమైన యీ జీవాత్మ మనోబుద్ధులతో తాదాత్మ్యమునందుటచే తాను కష్టసుఖముల ననుభవించుచున్నా నని తలచుచున్నాడు. కావున ఆ జీవుడు జీవితములోని కష్టసుఖముల ననుభవించుచున్నాడు. ఇట్లతడు మర్త్యత్వమును పునర్జన్మను పొందుచున్నాడు. ఆ పరమాత్మ తానెట్టికర్మలను చేయక సాక్షిమాత్రమై యున్నాడు. ఇచట జీవాత్మపరమాత్మలు భిన్నములని భావింపరాదు. ఇది ఆభాసమాత్ర భిన్నత్వమునకు కారణమును మాత్రము సూచించుచున్నది.

ఈ జీవాత్మకు గల అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయ పంచకోశములను తైత్తిరీయోపనిషత్తు వివరించి చెప్పుచున్నది. వేదాంతములో అన్నమయ కోశమును స్థూలశరీరముగను, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయకోశములను సూక్ష్మ శరీరముగను, ఆనందమయకోశమును కారణ శరీరముగను వివరించియున్నారు. ఇవన్నియు కలిసి జీవునకు భౌతికదేహ మగుచున్నవి. ఇట్టి త్రయోపాధిగతుడైన జీవుడు కర్మఫలభోక్త యగుచున్నాడు. ఈ దేహమందలి పంచజ్ఞానేంద్రియములకును, పంచకర్మేంద్రియములకును కేంద్రభూతమై మనస్సు వానిద్వారా వ్యవహరించుచున్నది. మనస్సుకంటె పూర్వముగా చెప్పబడిన స్థూలదేహము కర్మానుభవక్షేత్రములకు, ప్రాణము జీవతత్త్వమునకు ఆధారభూతములై యున్నవి. విజ్ఞానమయ–ఆనందమయ కోశములు. మనస్సుకంటె ఉన్నతమైన వగుటచేత అవి ఉత్తమానుభూతికారణము లగుచున్నవి. బద్ధుడైయున్న జీవునికి ఆనందమే ఉత్తమోత్తను అనుభవస్థితియై యున్నది. ఇచట తాత్కాలికమైన శాంతిసుఖములను అత డనుభవించుచున్నాడు. ఇట్టి యనుభవము సుషుప్తిలో కలుగుచున్నది. కాని యీ అనుభవమును జాగ్రత్స్వప్నసుషుప్తుల కతీతమైన మోక్షముగా భావింప రాదు.

పునర్జన్మసిద్ధాంతమునుగూర్చి ప్రప్రథమముగా బృహదారణ్యకములో ప్రసంగింపబడినది. కర్మకు ప్రాధాన్య మిచ్చి ఒకడు పొందబోవు జన్మ అతనికర్మలపై ఆధారపడియున్నదని అచట చెప్పియున్నారు. మానవుడు పశుపక్ష్యాది నీచజన్మల నెత్తుటకూడ సంభవించుననియు, మరణానంతరము ఒకడు తనపుణ్యాపాపకర్మఫల మనుభవించుటకై స్వర్గనరకాది లోకములను ముందుగా అనుభవించియే పిమ్మట పునర్జన్మ నెత్తుచున్నా డనియు అచట చెప్పియున్నది. శారీరకనియమనము, నైతికమార్గానుసరణ మను 'ఋత' మనెడి వైదికమతమందును, స్వర్గాదిపుణ్యఫలముల నిచ్చు యజ్ఞయాగదానాది 'ఇష్టాపూర్తాదు'లందును కర్మ

సిద్ధాంతము ముందుగా ప్రారంభమైనది. ఈ కర్మచక్రమునుండి జీవునికి ముక్తిసాధ్యమే అని యుపనిషత్తులు పలుకుట గమనింపదగినవిష యమై యున్నది.

జన్మరాహిత్యమే మోక్ష మగుచున్నది. మరణానంతరముక్తిని విదేహముక్తి యనియు, ఈ దేహములోనుండగనే కలుగు ముక్తిని జీవన్ముక్తి యనియు యీ ముక్తిని రెండువిధము లుగా విభజించియున్నారు. మంత్రబ్రాహ్మణ ముల అస్తిత్వసిద్ధాంతములనుండి యుత్పన్న మైన యీ విదేహముక్తినే యుపనిషత్తులలోనికి అనువదించిరి. ఇందు తనకంటె భిన్నమైనదిగా తానగుట కాక తన స్వస్వరూపమైన బ్రహ్మ త్వము నందుటయే యిచట లక్ష్యమై యున్నది.

దేవయానము పితృయానముకంటె భిన్న మైనది. దేవయానము బ్రహ్మను చేర్చుచున్న ది. పితృయానము పునరావృత్తిని కలిగించు చున్నది. తరువాతికాలమందలి వేదాంతము నందు క్రమముక్తికిని, సద్యోముక్తికిని, విదేహ ముక్తికిని, జీవన్ముక్తికిని భేదము కల్పితమైనది. కాని మోక్షవిషయములోమాత్రము ఎట్టి భేద మును లేదు. మోక్ష మనగా బంధవిముక్తి. అది కేవలము దుఃఖాభావస్థితిమాత్రము కాదు. అది అచలమైన శాంతితో నిండిన బ్రహ్మానంద స్థితి.

మోక్షకామియగు సాధకు డవలంబింపవల సిన విధానమును అనేక ఉపనిషత్తులు బోధిం చుచున్నవి. మొత్తముమీద ఉపనిషత్తులు సాధకునికి ఉన్నతనైతికస్థాయిని విధించు చున్నవి. అవి యెక్కువగా నీతులను బోధింప కున్నను సాధకుని నైతికజీవితమునకు ప్రాము ఖ్యము నిచ్చుచున్నవి. వాస్తవములో (ఆత్మ) బ్రహ్మవిచారణ చేయుటకు ముందు సాధకునకు నైతికజీవన మత్యావశ్యకమై యున్నది. తైత్తి రీయాది యుపనిషత్తులలో ఇతరులవిషయమై ఒకడు ప్రవర్తించుకొనవలసిన సర్వసాధారణ విధానములుకూడ ఉండుట గమనింపవలసి యున్నది. దానవులకు దమము, మానవులకు దానము, దేవతలకు దయ అను నీ త్రిగుణము లలో సంపూర్ణసదాచారసిద్ధాంతము నిమిడ్చి యున్నారు. అట్టి సాధకుడు యదృచ్ఛాజీవి యనగా అతనిలో సహజముగానే నైతికజీవన మిమిడియుండును. అతనికి బాహ్యనియమునాదు లనవసరము. అంతేగాని స్వేచ్ఛాజీవి యన గానే యది యత డవినీతి జీవితమును గడపు టకు అధికారపత్రమువంటిది యని యర్థము మాత్రము కాదు.

ఆ తత్త్వమును తెలిసికొనక పోవుటచే బంధము కలుగుచున్నది. ఆత్మ, మనోబుద్ధిరూప జీవాత్మతో తాదాత్మ్యము నొందుటచేత జనన మరణరూపసంసారములో చిక్కుకొనుచున్నది. విముక్తి యనగా దీనికి వ్యతిరేకమైనది. ఈ జీవాత్మ నశ్వరజీవభావమునుండి విరమించుకొన వలయును. వైరాగ్యము నవలంబింపవలయును. జ్ఞానోదయమైననే వైరాగ్యము సంపూర్ణత నందుచున్నది. బ్రహ్మజ్ఞానముద్వారా అజ్ఞా నము నశించుచున్నది. బ్రహ్మత్వమునందుట ద్వారానే బ్రహ్మను తెలిసికొనుచున్నాము. ఇట్టి బ్రహ్మజ్ఞానప్రక్రియకు మూడవస్థలుకలవు. సరియైన గురువునొద్ద ఉపనిషత్తుల నభ్యసిం చుట (శ్రవణము), అభ్యసించిన దానిని శ్రద్ధగా విచారణచేసి సమాధానపడుట(మననము)అట్లు మననముచేసిన విషయమును నిరంతరముగా ధ్యానించుట (నిధిధ్యాస). ఈ నిధిధ్యాసయే

అంతమందు వివేకమును కలిగించుచున్నది. ''విద్యలు'' అనబడు అనేకవిధములైన ధ్యాన మార్గములు ధ్యానము చేయుటకు సహాయము లుగా ఉపదేశింపబడియున్నవి. అట్టి శిక్షణ లన్నియు అద్వైత బ్రహ్మజ్ఞానమే తమ లక్ష్య ముగా కలిగియున్నవి

ఇట్టి జ్ఞానోపార్జనకై ఉపనిషదృషులు ఈ క్రింది అమృతపదములలో ప్రార్థన చేసి యున్నారు

''అసతో మా సద్గమయ
తమసో మా జ్యోతిర్గమయ
మృత్యోర్మా అమృతం గమయ.

# భగవద్గీతయే ప్రత్యక్షగీతాచార్యుడు

ఆచార్య శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారు

''సర్వోపనిషదో గావో
దోగ్ధా గోపాలనందనః
పార్థో వత్సః సుధీ ర్భోక్తా
దుగ్ధం గీతామృతం మహత్॥''

ఉపనిషత్తులు గోవులు, ధేనువత్సము అర్జునుడు. పాలుపిదుకువాడు శ్రీకృష్ణుడు, పాలు గీతామృతము, క్రోలువారు శుద్ధాత్ములు. గీత ఉపనిషత్తులసారము, బ్రహ్మవిద్య; శ్రీకృష్ణార్జునులసంవాదము, యోగశాస్త్రము.

భగవద్గీతనుగుఱించి అపోహలను ప్రకటించువారికి, దుష్ప్రచారము చేయువారికి పూర్వోక్తవాక్యులు సముచితప్రత్యుత్తరములు. శ్రీకృష్ణుడు జారు డని, చోరు డని, హింసను బోధించినా డని గీతాతత్త్వ మెఱుగని కొందఱు క్రైస్తవమతాచార్యులు, తెలుపుచుండిరి. వారు సత్యమును గుర్తింతురు గాక!

కురుక్షేత్రము కర్మక్షేత్రము; జీవితక్షేత్రము; ధర్మక్షేత్రము. తన కర్తవ్యప్రాంగణమునుండి ఎవ్వడును తొలగ రాదు. నైసర్గికప్రతిభకు, అనుకూలమైన కర్తవ్యమును, కౌశలముతో నిర్వహించుట ధర్మము, యోగము. ''యోగః కర్మసు కౌశలం.'' విషాదముతో నెవ్వడును కర్తవ్యమును నిర్వహింప రాదు. ''వివేకమునకును, సంతోషమునకును మాత్రమే మోక్ష ద్వారమున ప్రవేశముండు''నని కదా యోగ వాసిష్ఠము తెలుపుచున్నది.

అసమయమున గాని, అస్థానమున గాని కరవ్యము జరుగ రాదు. సమయము దాటినను స్థలము దాటినను ముప్పు వాపురించును. నరునకు నారాయణుడు చేసిన ప్రబోధమం దీ భావము కలదు. ప్రపంచమహారచయితలు పల్వురు దీని ననువదించిరి; అనుకరించిరి; అనుసరించిరి. షేక్స్పియరుమహాకవి రచించిన ''జూలియస్సీజరు'' నాటకములో బ్రూటస్, ఇట్లనినాడు.

''మనుష్యక్రియాకలాపమున నొకప్రవాహము కలదు. సకాలమున దాని ననుసరించి పోవువాడు అదృష్టవంతు డగును; సమయము

మించినయెడల అతడు సుడిగుండములందు పడిపోవచ్చును''.

స్మైల్స్ మున్నగు రచయిత లీ భావమునే ''ఆత్మసాహాయ్యము'' మున్నగు గ్రంథము లందు వ్యక్తీకరించిరి.

తన కర్తవ్యాంగణమునుండి పోరా దని శ్రీకృష్ణుడు అర్జునుని హెచ్చరించెను.

స్వధర్మమునకు స్వస్తి చెప్పి అంతఃకరణ శుద్ధి నందక ఎవ్వరును తురీయాశ్రమమున ప్రవేశించుట కర్హులు కారు. అర్జునునకు యుద్ధ మనిన రోత పుట్ట లేదు. యుద్ధవీరులలో ఆత డద్వితీయుడు. ''నాబంధువులతో నాయాత్మీ యులతో నేను సమర మొనరింప జాల'' నని ఆత డనినాడు. తనవారియెడల ఆతని కెంతో మమకార ముండెను. అహంకార, మమకార, తృష్ణలు దుఃఖహేతువులు. ఇవి మోక్షమార్గ మును నిరోధించునవి. ఆశయే పాశమై జీవుని భవపరంపరలోనికి బరబర లాగును. ఆశలేని వానికి పాశము లేదు. మానవుని ఆశలు యమునిచేతిలో పాశము లగును. ఆశలేని మార్కండేయుని సమవర్తి ఏమి చేయజాలెను? ఏయొక్కరుని సమస్తప్రాణికోటినుండి మను జుడు వేఱుచేయ రాదు. ఎల్లప్రాణులందు భగవంతు డున్నాడు. ఈ యాశయములను గుర్తించువానికి ముక్తి ముంజేతికంకణమగును. వీని నెఱుగనివానికి విషాదయోగము తప్పదు.

యో మాం పశ్యతి సర్వత్ర
సర్వం చ మయి పశ్యతి
త స్యాహం న ప్రణశ్యామి,
స చ మే న ప్రణశ్యతి
సర్వభూతస్థ మాత్మానం
సర్వభూతాని చాత్మని
ఈక్షతే యోగయుక్తాత్మా
సర్వత్ర సమదర్శనః
సర్వభూతస్థితం యో మాం
భజ త్యేకత్వ మాస్థితః,
సర్వథా వర్తమానోఽపి
స యోగీ మయి వర్తతే
ఆత్మౌపమ్యేన సర్వత్ర
సమం పశ్యతి యోఽర్జున
సుఖం వా యది వా దుఃఖం
స యోగీ పరమో మతః
విద్యావినయసంపన్నే
బ్రాహ్మణే గవి హస్తిని
శుని చైవ శ్వపాకే చ
పండితా స్సమదర్శినః ॥

అని కదా భగవంతు డనినాడు. ఇవి భగవ ద్గీతామహిమను ప్రకటించు మహత్తరశ్లోక ములు. వీని మహితార్థమును మననముచేసి కొనియే శ్రీవివేకానందాదులు వేదాంతడిండి మమును ప్రమోగించిరి. జగతియందు విజృం భించు పైశాచికప్రవృత్తులు, దారుణవిభేద ములు క్షుద్రవ్యత్యాసములు వేదాంతప్రబో ధమువలననే, గీతాప్రబోధమువలననే సమసి పోగలవు. ''గీత'' ఏయొక్కజాతికిని చేయ బడిన ప్రత్యేకప్రబోధముగాదు. అందు ''నర'' ''మానవ'' శబ్దములే కలవు. ''హిందు'' అను శబ్దము లేదు. సమస్తమానవులు పురశ్చరణ మొనరించుకొనవలసిన దివ్యసూత్రములు గీతా వాక్కులు. ప్రాచీనమహర్షులుమాత్రమే కాక ఆధునికసాధకులు తిలక్కు గాంధి అరవిందప్రభృ తులు గీతామృతమును గ్రోలి ధన్యజీవులైరి. గీతాసుధను చవిజూచిన సామాన్యులును, గీత నాశ్రయించిన కుమతులు సయితము నిష్కృతి నందిరి.

"గీత"లోని పదునెనిమిది అధ్యాయములు మూడు షట్కములుగా విభజింపబడినవి. ఇవి కర్మజ్ఞానభక్తియోగములను గుఱించి తెలుపునవి. భాష్యకారులు తమప్రత్యేకప్రజ్ఞను నైసర్గికమైన శక్తిని పురస్కరించుకొని, సమకాల పరిస్థితులపై కన్నుంచి, ఈమూడుయోగములలో నొక్కొకయోగమునకు ప్రత్యేకప్రశస్తి నొసగుచు వ్యాఖ్యానించిరి. చార్వాకులను, శూన్యవాదులను ధిక్కరించుటకై శ్రీశంకర భగవత్పాదులు జ్ఞానయోగమునకు ప్రాముఖ్యమిచ్చిరి. పరమగురువైన గౌడపాదుని కారికలను మనసునం దుంచుకొని, మాండూక్యోపనిషత్తులోని ఓంకారనిర్వచనమందలి అంతరార్థమును హృదయమునందుంచుకొని, అందలి అ + ఉ + మ అనుమాత్రలు విశ్వ, తేజస, ప్రజ్ఞలను సూచించున వనియు, జాగ్రత్, స్వప్న, సుషుప్తులందలి చైతన్యావస్థల నవి దృష్టాంతీకరించు ననియు వారు తెలిపిరి. ప్రణవోపాసనవలన కలుగు మహిమను భగవత్పాదులు వివరించిరి.

జ్ఞానాగ్నివలన కర్మకాష్ఠములు భస్మములగు నని వారు వచించిరి. జ్ఞానాగ్నివలన మాలిన్య మంతరించును; పునరావృత్తి కడ ముట్టును.

జ్ఞానము కేవలము తార్కికసంశోధనము కాదు. జిజ్ఞాసువు కాంక్షించు పరిప్రశ్నమాత్రమే కాదు. ప్రత్యక్షజీవనవిధానమున నిది వ్యక్త మగును. ప్రతీచీతత్త్వశాస్త్రము మేధాసంపదను సమీక్షశక్తిని, హేతుబంధుర పరిశోధనమును వ్యక్తీకరించును. ప్రాచీతత్త్వశాస్త్రము మతమునకు సహపాఠియై అనుష్ఠానమున స్వీయచరితార్థత నందును.

అజ్ఞాని తాను శరీర మని, మన స్సని, బుద్ధి యని ఊహించును. ఈతడు మాయకు లొంగును. జ్ఞాని తా నాత్మయే యని, ఆత్మకు జనన మరణములు లేవని, అది అగ్నియందు దహింపబడ దని, నీటియందు తడియ దని, గాలిలో నెండునది కా దని, కత్తికోత కంద దని గ్రహించును. అతడు మాయావాగురలో పడడు. గీతాచార్యుడు పెక్కుమాఱులు మాయను జయించినవానిని ప్రశంసించెను. అత డే స్థితప్రజ్ఞుడు. అతడు త్రిగుణాతీతుడు. జీవన్ముక్తి నందినవాడు. అతడు ద్వంద్వాతీతుడు, శీతోష్ణములకును, సుఖదుఃఖములకును, మానావమానములకును భూషణదూషణములకును అతీతుడు. బంగారుముద్దను మట్టిముద్దను ఆతడొక్కతీరున నపేక్షించును. తనయింటిలో నొకడు పుట్టినను, వేఱొకడు గిట్టినను, ఏరీతిగను వాని హృదయము చలింపదు. శుకయోగి ఇట్టి స్థితప్రజ్ఞుడు. ఈతనిని పరీక్షించుటకై వ్యాసనారాయణుడు జనకునియొద్దకు పంపెను. తాను మానావమానముల కతీతుడ నని శుకుడు నిరూపింపజాలెను. ప్రాచీనమహర్షులలో పల్వురీ యద్భుతశక్తి నందినవారే. ఆధునికులలో విజయకృష్ణగోస్వామిప్రభృతులు కలరు. తన దుహిత అస్తమించినపుడు గోస్వామి దుఃఖింపలేదు. "తల్లీ, నీకు ముక్తి చేకుఱినది" అని తెలుపుచు ఆనందముతో ఆత డామె భౌతిక శరీరముచుట్టు నృత్యము సలిపెను. ఏది సత్యమో, ఏది అసత్యమో, ఏది నిత్యమో, ఏది యనిత్యమో, ఏది దేహమో ఏది దేహియో జ్ఞాని గుర్తించును. ఇది వివేకము. వివేకము జ్ఞానమే! ఆత్మ ఎట్టిదో అనాత్మ ఎట్టిదో ఆత డెఱుగును. పరివర్తనమునందు దృశ్యప్రపంచము నిత్యము కా దని ఆతడు గ్రహిం

చును. రజ్జువు సర్ప మని, ముత్యపుచిప్ప వెండితునక యని, ఎండమావులు జలప్రవాహ మని భ్రాంతిచెందునట్లు సత్యస్వరూపము నెఱుగనివారు, జ్ఞానప్రదీపితదృష్టి లేనివారు అనిత్యమును, అసత్యమును ఆశ్రయించి దుఃఖపడుచుందురు. జ్ఞానికి సత్యమెఱిగినవానికి దుఃఖము లేదు. ఇట్టి జ్ఞానము భవపరంపరలో చేసిన తపసువలన నిరంతర కృషివలన కలుగును.

అంతఃకరణశుద్ధి కలిగినపుడే హృదయదిగ్వలయముపై జ్ఞానభాస్కరు డుదయించును. శ్రీకృష్ణుని అనుసరించి, మహాప్రవక్త లీపాఠమును బోధించిరి. తనశిష్యుడైన ఆనందు నుద్దేశించి బుద్ధభగవానుడు "అబ్భ్యంతరమ్ తే అత్థి గహనమ్" (నీయంతరంగమున కాంతారముగలదు) అనెను. ఈకాంతారమును ఛేదించిన గాని, లోని మాలిన్యము తొలగిన గాని, జ్ఞానమరీచికాగుచ్ఛము ఆంతరంగికజీవనమున తేజరిల్ల నేరదు. మహిమోపేతమైన ఆంతరంగికజీవితము ననుసరించియే బాహ్యజీవితము నిర్దుష్టమై సత్యసందీపితమై, సౌందర్యసంశోభితమై యుండును. అపుడే సాధకుడు "శివోహం" అని తాను మంగళస్వరూపుడేయనిగుర్తించును.

భక్తియోగము సులభసాధ్యము. నిర్గుణోపాసనకంటె అవలీలగ ఆకళింత కందునది భక్తియోగము. శ్రీకృష్ణుడు దీనిని బహుభంగుల ఉగ్గడించినాడు. సమస్తజగతిలో శ్రేష్ఠమైన దేది కలదో, అందు తనవిభూతి కలదని బహుళదృష్టాంతములం దాతడు వివరించెను. ధర్మసంరక్షణార్థము దుష్టజనసంహారణార్థము తానవతరింతునని శ్రీకృష్ణుడు తెలిపెను.

"యదా యదా హి ధర్మస్య
గ్లాని ర్భవతి భారత
అభ్యుత్థాన మధర్మస్య
త దాత్మానం సృజా మ్యహమ్"
"పరిత్రాణాయ సాధూనాం
వినాశాయ చ దుష్కృతామ్
ధర్మ సంస్థాపనార్థాయ
సంభవామి యుగేయుగే".

అవతారములకు సంబంధించిన ఈ విశ్వాసము హిందూమతమునకు స్వతస్సిద్ధమైనది. సకలకల్యాణ గుణసముద్రుడు భగవంతు డని భక్తులు భగవంతు నారాధింతురు. వీరు సగుణోపాసనమున బద్ధదీక్షితులైన మహనీయులు. ఆళ్వారు లిట్టివారు. కొందఱు భక్తులు భగవంతుని "అమ్మా" యని సంబోధించి ఆరాధించిరి. దేవీకటాక్షమువలన కాళిదాసు మహాకవి ఆయెను. "అమ్మల గన్న యమ్మ ముగురమ్మల మూలపుటమ్మ, దుర్గ మాయమ్మ ఇచ్చుత మహత్వకవిత్వ పటుత్వ సంపదల్" అని విమలధిషిణాధురంధరుడైన పోతనామాత్యుడు ఈశ్వరిని సేవించెను. గదాధరుడు కాళీకటాక్షమువలన శ్రీ రామకృష్ణపరమహంస ఆయెను. దేవీ సాక్షాత్కారమునకై చంటిబిడ్డవలె ఆతడు పొగులువాడు. దక్షిణేశ్వరమందలి పంచవటిలోను, వియత్తలమున కాంతిలు వింతవింతరంగవల్లులందును, చూపు నాకర్షించు సమస్తదృశ్యములందును జగద్ధాత్రీ సందర్శనభాగ్య మంది, పరమానందభరితుడై ఆతడు సమాధిస్థు డగుచుండువాడు. జగతిలోని స్త్రీలందఱిలో దేవీస్వరూపమునే అతడు సాక్షాత్కరించువాడు. మందిరమందలి దుర్గాదేవి నాతడేదృష్టితో వీక్షించువాడో శయ్యాగృహమున అర్ధాంగి నా దృష్టితో వీక్షించి పూజించువాడు. ఇది 'షోడశీపూజ' యన బరగినది. కన్యాకుమారినుండి కాశ్మీరమునకు

భారతదేశమున పయనించితిమేని, అనుక్షణము మాతృసందర్శనభాగ్యము నందగలము. కంచిలో కామాక్షియు, మధురలో మీనాక్షియు, శ్రీశైలములో భ్రమరాంబయు, ప్రతాపగడమున భవానియు, కలకత్తాలో కాళియు, వింధ్యారణ్యమున వింధ్యవాసినియు, శృంగేరిలో ఉభయ భారతియు, బాదామిలో వనశంకరియు, కాశ్మీరములో సరస్వతియు, విజయవాడలో కనకదుర్గయు—రత్నవసనసుందరీమణులై మనసు నలరింతురు'' చెప్ప నేల? భారతాంబయే దేవియై ఆరాధింపబడుచుండును.

కొందఱు భగవంతుని "తండ్రీ" అని సంబోధింతురు. భారతీయసాంస్కృతిక సంస్పర్శ నందిన జీససు జగదీశుని "తండ్రీ" అనిపిలుచువాడు. "ప్రభూ" అని కొంద ఱీశ్వరు నారాధింతురు. హనుమంతు డట్టివాడు, రామనామ పురశ్చరణమువలన ఆత డద్భుతశక్తులనందెను. సముద్రమును దాటుటకై శ్రీరాముడు వారధి గట్టుకొనవలసివచ్చెను. కాని రామనామ ప్రభావమువలన మారుతి వియత్తలమున కెగసి లంకను చేరజాలెను. ఇది దాస్యభావము. వాత్సల్యభావముతో కొందఱు "బిడ్డా" అని దేవు నారాధింతురు. దేవకీవసుదేవులు శ్రీకృష్ణుని, కౌసల్యాదశరథులు శ్రీరాముని అట్లారాధించిరి. "మిత్రమా" అని కొంద ఱీశ్వరుని గొలిచిరి. ఇది సఖ్యభావము. కుచేలుడును, అర్జునుడును కృష్ణు నట్లు సేవించిరి. మఱి కొందఱు మధురభావముతో భగవంతు నారాధించిరి. వారిలో మీరాబాయి యొకర్తుక. శైశవమునుండి తన పతి శ్రీకృష్ణుడని నమ్మి ఆమె దేవుని ప్రేమించి, పూజించెను. విష్ణుచిత్తుని దుహిత శ్రీరంగనాథు నీ భావముతోనే యారాధించెను గదా! నేటి ఆండాళ్ వెనుకటి గోపికవంటిదే. చైతన్యస్వామి "ప్రాణేశ్వరా" అని శ్రీకృష్ణుని సంబోధించుచు తన్మయత్వముతో నృత్యముసలుపువాడు. అద్వైత సిద్ధాంతమహిమను అద్వితీయశక్తితో ఉగ్గడించిన శ్రీశంకరభగవత్పాదులు ఒకానొక సందర్భములో జగదీశుని "ప్రాణేశ్వరా" అని సంబోధించిరి.

చతుర్విధా భజంతే మాం
జనా స్సుకృతినో உర్జున
ఆర్తో జిజ్ఞాసు రర్థార్థీ
జ్ఞానీ చ భరతర్షభ.

కష్టసమయమున దుఃఖపడువారును, భగవత్తత్త్వమును గ్రహింప నుద్దేశించు జిజ్ఞాసువులును, ఐహికమైన ధనము నపేక్షించువారును, ఆత్మానాత్మ వివేకము గల జ్ఞానులును భగవంతుని సేవించుచుందురు. ద్రౌపది గజేంద్రుడు మున్నగువా రార్తులైన భక్తులు. ధ్రువుడర్థార్థి. జ్ఞానపిపాసువులైన సాధకులు జిజ్ఞాసువులు. భక్తియోగ జ్ఞానయోగ సంయుక్త శక్తిని ఆత్మజీవితమున వ్యక్తీకరించిన ప్రహ్లాదునిబోలు భక్తులు జ్ఞానులు.

అర్థార్థులు వాణిజ్యదృష్టిగలవారని శ్రీవివేకానందస్వామి పలికెను. వీరుకూడగణనీయులే యని శ్రీవినోబాజీ వచించెను. నిస్స్వార్థభక్తి గలవారు, ఏ వాంఛయు హృదయమున చోటీయక ఆత్మార్పణ మొనరించుకొను భక్తులు అగ్రస్థానమునలంకరించువారు. ప్రపత్తి ననుసరించు శరణార్థులు సమగ్రవిశ్వాసముగలవారు.

భగవద్గీతలో మిగుల ముఖ్యమైనయోగము కర్మయోగ మని లోకమాన్య బాలగంగాధర తిలకుగారి యుద్దేశము. కర్మజ్ఞానభక్తియోగములు, పక్షి రెక్కలను, తోకను పోలును.

ఏ రెక్కను విఱిచినను, లేక తోకను త్రెంపి నను పక్షి ఎగురలేదు. అట్లే ఈ మూడు యోగములలో దేనిని తొలగింప రాదు. మూడును అవినాభావసంబంధము గలవియే. ఈమూడు యోగములను మనుజుని శిరమునకును, హృదయమునకును, చేతులకును పోల్ప వచ్చును. శిరస్సు జ్ఞానయోగమునకును, హృదయము భక్తియోగమునకును, కరయుగము కర్మయోగమునకును పోల్పవచ్చును. భక్తి యనుడు, కర్మ యనుడు స్వార్థరహితమై యుండవలెను. నిస్స్వార్థప్రేమ ఎట్టిదో నిష్కామ కర్మయు అట్టిదే! "అర్జునా, నాకు వలసినదేమియు లేదు. కాని నిరంతరము నేను కర్తవ్యమును నిర్వహించుచుందును. నే నీ ధర్మమును నిర్వహింపని యెడల అనేకు లలసమార్గము ననుసరింతు" రని భగవంతుడు వచించెను. సర్వలోకనాథుడైనను శ్రీకృష్ణుడు అర్జునుని రథముపై సారథియై సేవించెను. అర్జునునిమాత్రమే కాక, ఆతనిగుఱ్ఱములకు సయితము భగవంతుడు సేవ సలిపెను. కృష్ణార్జునుల నిరంతర కర్తవ్యనిర్వహణమును శ్రీవివేకానందస్వామి ప్రశంసించువాడు. దృష్టి కర్తవ్యమునుండి ఫలముపై ప్రాలరాదు. కొండొక పొలమందలి పంటకాల్వమీది సన్నని త్రాటి బద్దెపై కాలుంచి నడచునపుడు ఆవలిగట్టుపై నున్న వృక్షమందలి పండుపై తెరువరిచూడ్కి సారింప రాదు. సారించె నేని, త్రాటిబద్దె మీదినుండి వానిచూపు సడలెనేని, ఆతడు దిగువ నున్న కాలువలో పడిపోవును. చేయుచున్న కర్తవ్యమునుండి మళ్లి వ్యక్తి దృష్టి, ఫలముపై పడెనేని, ఆతడు అపజయమంది కూలిపోవును.

ఫలముపై చూపు నిలుపకున్న యెడల ఫలము దక్కక పోదు. కారణకార్యసూత్రము ననుసరించి, ఫలము తలసూపును. తొలిభవమున నిషాదుడై దారులుగొట్టి బ్రతుకీడ్చు వాల్మీకి మండుటెండలో నడచిపోవు కొండొక పాంథు నవలోకించి, దయబూని వానికి పాదరక్షలను దాన మొనరించుటవలన మఱిజన్మమున నారదసందర్శనభాగ్యమును, తారకమంత్రోపదేశభాగ్యమును పడసి సంయమీంద్రుడై ఆదికవియై వెలసెను.

మహాభారతమందలి సక్తుప్రస్థుని కథ శ్రీ రామకృష్ణపరమహంస, శ్రీవివేకానంద, శ్రీ తిలక్ మహాశయ ప్రభృతుల మనసుల నాకర్షించెను. సక్తుప్రస్థుడు నిఱుపేదయై కుటుంబ భారమును వహించుచు, తిరిపెమెత్తి తనవారిని పోషించుకొనుచు, ఒకనాడు భోజన మొనరింప నుద్యమించుచుండ పేద యొకడు అన్నార్తుడై తన గృహమునకు రాగా, తమముందున్న ఓదనమును వానికి సమర్పించి, తరువాత ఆకటి బాధవలన తనవారితో గూడ నాత డసువులను పాసెను. స్వార్థముపై ఆవంతచూడ్కి నిలుపక, ఎదుటిప్రాణములను నిలుపుటకై తమ యసువులను నైవేద్యముగా నర్పించు మహనీయులు ధన్యజీవులు. ఇట్టి పరార్థజీవులే ఆదర్శ కర్మయోగులు.

రాజయోగముకూడ మిగుల గణనీయమైనది. ప్రాణాయామప్రత్యాహారాది నియమములను పాటించుచు అవిచలిత సూత్రముల ననుసరించి దైనందినజీవనమును నిర్వహించుచు, అపరిగ్రహదీక్షను పాటించుచు, కేవలము భగవంతునిచరణములనే ఆశ్రయించుచు జీవించువాడు మహిమోపేతు డగును. రాజయోగులందు శ్రీపవహారిబాబా శమంతకమణి యన జెల్లును. ఆకలి దప్పులను, భయసంశయ

ములను ఆతడు జయించెను. కొండొక నేల సొరంగమం దాతడు ఏయాహారమును గ్రహింపక పెక్కునెలలు సమాధిస్థుడై యుండువాడు. ఆత డుండు సొరంగమందు కోడెత్రాచులును ఉండెడివి. బెబ్బులులు కూడ అందు పరుండెడివి. బాబా కెట్టి బీతు లేదు. ఆత డేకాకియై యుండు వాడు. ఎప్పుడైన నెవరితోనైన ప్రసంగించినను మిగుల వినయముతో కొలది మాట లుచ్చరించువాడు. ఈమహాత్మునిపై శ్రీవివేకానందస్వామికి గల భక్తిశ్రద్ధలు అనిర్వచనీయములు. తఱచుగా ఘాజీపూరుప్రాంతమున వసించు బాబాను స్వామిజీ సేవించుచుండువాడు.

రాజయోగమునకును, హఠయోగమునకును ఎంతేని వ్యత్యాసము గలదు. హఠయోగము ఒకవిధమైన వ్యాయామమువంటిదే. రాజయోగిహృదయమున జ్ఞానప్రదీపకళిక కాంతిలుచుండును. ఇది పతంజలిమహర్షి ప్రోక్తమైనది. దీనినిగుఱించిన ఉల్లేఖనము భగవద్గీతయందు గలదు. అధికాహారమును గొనుట విశేషకాల మాహారమునే గైకొనకయుండుట యోగాభ్యాసమునకు కూడని పనులు. ఈనియమము బుద్ధుడు తెలిపిన మధ్యమార్గమునుబోలియున్నది. సమస్థలమున అధివసించి, ఏకాంతవాసమున, మౌనవ్రతము నవలంబించి ఈ యోగము నభ్యసింపవలెను.

సనాతనమతమున నుల్లేఖింపబడిన ప్రసిద్ధమార్గములు ప్రవృత్తిమార్గము, నివృత్తిమార్గము. ఈరెండింటి సమన్వయము నవలంబించుట గీతాయోగిధర్మము. వనమార్గముల నుండియే ముముక్షువు మోక్షమార్గము నన్వేషింప నక్కఱ లేదు. వనములకు తరలవచ్చును. తరలకపోవచ్చును. ప్రాపంచికవస్తువులపై ప్రాకృతబాంధవ్యములపై మమకారము వీడుటే సాధకుని లక్ష్యము. అతడు కర్మయోగి కావచ్చును; భక్తియోగి కావచ్చును; జ్ఞానయోగి కావచ్చును. నైసర్గికప్రతిభ కనుకూలమైన కర్తవ్యము కౌశలముతో నిర్వహించుతఱి నివృత్తిదృక్పథమే గలిగియుండి, తన ధర్మనిర్వహణమే పూజానిర్వహణ మని భావించునాతడు గీతాయోగి. ఈభావనము నలవఱచుకొనుటే ఆతని లక్ష్యము.

భగవద్గీతలో యోగారూఢుడు, స్థితప్రజ్ఞుడు, జితేంద్రియుడు, త్రిగుణాతీతుడు మున్నగువారిని గుఱించిన నిర్వచనము గలదు. వీరందఱు గీతాయోగులే! గీతలోను, ఉపనిషత్తులలోను, బ్రహ్మసూత్రములందును గల సూక్తులందలి గభీరార్థమును పెక్కు కథలందు శ్రీరామకృష్ణ పరమహంస నిర్వచించువాడు. త్రిగుణాతీతు డెట్లుండవలెనో ఆయన ఈకథయందు దెలిపెను:

పాంథు డొకడు సాంద్రారణ్యముగుండ పోవుచుండెను. ముగ్వురు దొంగలు వానిని పట్టుకొనిరి. మొదటివాడు మిగుల దుష్టుడు. పాప మా పాంథుని దునుమాడవలెనని ఆతడు యోచించెను. ''చంప నేల?'' యని వాని కాళ్లేతులను బంధించి, కొండొక డొంకలో రెండవదొంగ వానిని విడిచిపెట్టెను. వాని దుస్థితిని చూచి జాలిపడి మూడవదొంగ ఆ తెరువరిని డొంకనుండి తొలగించి, అల్లన నడవినుండి వెలుపలికిగొనిపోయి, కొండొక తెరువును జూపి ''నాయనా, ఈ తెన్ను బట్టిపొమ్ము. నిరపాయముగ నీయూరు చేరెదవు'' అని పలికెను. ఆశ్చర్యాన్వితుడైన బాటసారి ''అయ్యా,

నీవు చాల మంచివాడవు. నీవీ దొంగలందేల చేరితివి? నీమిత్రులు నా కెగ్గు దలపెట్టిరి. నీవు నన్ను కాపాడి నాయూరిదారిలో నన్ను నిలిపితివి. నిజముగ నాకు ప్రాణదానము చేసితివి. నాతో కూడ నా పల్లెకు రమ్ము, నీకు కృతజ్ఞతాపూర్వకముగ పెక్కు బహూకృతులను సమర్పించెదను'' అని పలికెను. ''నాయనా, నేను కూడ దొంగనే. నీవెంట వచ్చినయెడల రక్షకభటులు నన్ను పట్టి బంధింతురు. కావున నే జూపిన పథము ననుసరించి పొమ్ము. సుఖముగ నీయూరు జేరెద'' వని పలికి, మూడవదొంగ నిష్క్రమించెను.

ఈకథలోని అంతరార్థ మిది! తెరువరి సంసారగహనమున నడచువాడు. మువ్వురు దొంగలు తమోగుణ రజోగుణ సత్త్వగుణములు. తమోగుణ రజోగుణములు మొదటి దొంగను రెండవదొంగను సూచించునవి. సత్త్వగుణము తెరువరిని సంరక్షించిన మూడవదొంగ. ఇదికూడ ప్రకృతిలోని గుణమే! దీనినికూడ ముముక్షువు అతిక్రమించి తీఱవలెను. సత్త్వగుణము వానిని మోక్షమార్గమున నిలిపి వెనుకకు తరలును. అదియైనను వెంట రారాదు. మూడవదొంగ వెనుకకు తరలిపోలేదా?

తోతాపురియొద్ద సమస్తవేదాంతరహస్యములను శ్రీరామకృష్ణపరమహంస గ్రహించెను. తక్కిన మతాశయములనుకూడ ఆయా మతాచార్యులవలన దెలిసికొని వాని ననుష్ఠించెను. పథములు బహుళములు కావచ్చును. లక్ష్యము—మోక్షము—ఒక్కటియే! అన్ని పథముల గమ్యస్థల మొక్కటియే! సమస్త నదులును రత్నాకరమును చేరును. సమస్త మతములును ముముక్షువును మోక్షసాగరమున జేర్చును. గీతాచార్యుడు తెలిపిన భావమునే శ్రీరామకృష్ణపరమహంస వేఱు మాటలతో వివరించెను. జీవించియుండగనే ఆ మహానీయుడు లక్ష్యసిద్ధి నందెను. మనసు రాలినపుడే కదా భవపరంపర కడముట్టును. జన్మపరంపరకు హేతువులగు వాసన లందుండును. ఇంద్రియములకును మనస్సునకును సన్నిహిత సంబంధము గలదు. మనస్సును మించిన శక్తి బుద్ధి, బుద్ధిని మించినది బోధ. ఇది మహోజ్జ్వలముగ పరిఢవిల్లినపుడు తక్కిన శక్తులు దానికి లొంగును. సమాధిస్థుడైన సంయమీంద్రుని యందీ ప్రజ్ఞ కలదు. కొఱగానిదైన మనసు ఈతని నెట్లు పీడించును? దేహమందున్నను ఈతడు విదేహుడే! శ్రీరామకృష్ణపరమహంస ప్రభృతు లిట్టివారు.

క్రమసాధనవలన, క్రమమైన ఉపాసనవలన, క్రమమైన దీక్షవలన, క్రమమైన వ్రతమువలన మానవుడు దేవుడు కాగలడు. మానవుడయ్యు రానురాను తాను దేవుడని గుర్తింపగలడు. ఇట్లెఱిగిన మహానీయుని ప్రబోధదృష్టాంతములవలన బహుసంఖ్యాకు లుద్ధరింపబడజాలుదురు. ప్రపంచమే పునరుద్ధరణము నందును.

నేడు ప్రపంచపునరుద్ధరణము కావలసిన సమయము. ''భగవద్గీత''యే నేటి ప్రత్యక్ష గీతాచార్యుడు. గీతాతత్త్వమును చిత్తమున కెక్కించుకొని సాధనమార్గమున ముందంజవేయుట మన ధర్మము. ధర్మనిర్వాహణమైన మంగళముహూర్తమందే ధరయందు సుఖశాంతులు వెలయును గదా.

# రామాయణ నీతిసారము

## రామాయణ ప్రాముఖ్యము

శ్రీ యడ్లపాటి వేంకటసుబ్బారావుగారు

భారతీయ వివిధవాఙ్మయములందు రామాయణము మహోత్కృష్టస్థాన మలంకరించుచున్నది. భారతీయజీవితపరమార్థమును జీవిత రహస్యములను స్పష్టముగ విశదీకరించు గ్రంథ రాజములకు శిరోమణియై తనరారుచున్నది. అందు రాజకీయ మత సాంఘికధర్మములు భారతజాతి పూర్వుల ఉచ్చస్థితికి తార్కాణములై ఇప్పటివారికి ఆదర్శములై భారత దేశముననేకాక ఖండాంతరములందుసైతము పొగడ్తగాంచినవి. రామాయణము నీతులకు పెన్నిధి. అవి భారతసంప్రదాయప్రసిద్ధములు. రామాయణమువంటి ఉత్తమగ్రంథరాజమును బడయగలిగిన భారతీయులు ధన్యులు.

రామాయణము అయస్కాంతమువలె భారతీయుల హృదయాకర్షణమొనర్చుటకుగల కారణమెద్ది? భవభూతి ఉత్తరరామచరిత్ర వ్రాయుచు రసములలో కరుణరసమే ప్రధానమని వక్కాణించియున్నాడు. శృంగారరస ప్రాధాన్యమును నిరసించెను. కరుణరసమునగల మహాశక్తిని భవభూతి సంపూర్ణముగ గ్రహించెను. అందు లీనమై దాని సారమును గ్రోలి దానిని భారతీయులపై ప్రసరింపజేసెను. ఏదైన కరుణభూయిష్ఠమైన ప్రదర్శనమును తిలకించినపుడు మనహృదయములందు ఒకవిధమగు అనిర్వచనీయమెన దయారసము వెల్లివిరిసి సానుభూతి కలుగుచుండుట సహజము. అందులకు కారణము చిత్తసంస్కారము ఆ చిత్తసంస్కార మెందుకు కలుగునో విచారించినయెడల కరుణరసప్రభావమును తన్మూలమున కరుణరసప్రధానమైన రామాయణ నైతిక స్వరూపమును మనకు విస్పష్టమగును.

రామాయణావతరణమునకు మూలకారణమేది? బోయబాణమున విగతజీవములై భూమిపైబడిన క్రౌంచమిథునము వాల్మీకి దయార్ద్ర హృదయమును కరగించి అందునుండి శోకరస పూరితవాక్కును వెడలజేసెను. అదియే రామాయణావతరణమునకు కారణము. ఆ హృదయపరివేదన మెంత పవిత్రమైనది! దరిద్రుడు, నిరాధారుడు, కష్టపరంపరాపీడితుడు దీనవదనముతో మనయెదుట ప్రత్యక్షమైన మనహృదయము జాలికి లోనై వాని దుస్థితికి పరితపించును. దానితో ఒకవిధమైన చిత్త సంస్కారముకూడ కలుగును. ఈ స్థితికి మనము వచ్చినపుడు మనగతియు నింతయేకదా' వీనికి మనమేల దయ చూపరాదు? ఇట్టిభావములు మనోవీథిని ప్రచారము చేయుచుండును. ఆ భావములు మనలను వానివైపునకు నీడ్చుకొని పోవును; కాని శృంగారమునకీ మహత్తరశక్తి లేదు. విలాసదంపతులను చూచినపుడు, వారి చర్యల దిలకించినపుడు భావములు వేఱు. అవి క్షణికములు. వానివలన చిత్తసంస్కారముగాని ప్రపంచానుభవముగాని పొందజాలము.

అవి తాత్కాలికసుఖమున నోలలాడించి అంతర్ధానమగును. కాని కరుణము హృదయపేటికను నివాసమేర్పఱచుకొని నీతిపరంపరలను వెలికి జిమ్ముచుండును. ఈ పరమరహస్యము రామాయణమునందంతట ప్రసరించియున్నది. పట్టాభిషిక్తుడై మహారాజభోగము లనుభవింపనున్న రాముడు, పట్టమహిషియై అంతఃపుర పరిచారికలు సేవింప, హంసతూలికాతల్పములందు, ఉల్లాసమున నుండవలసిన సీతయు, నారచీరలు ధరించి కంటకారణ్యముల జరింపవలసి వచ్చినపుడు ఎవనిహృదయము కరగకుండును? అవసానకాలమున కుమారచతుష్టయములో నొక్కడైనను లేక ప్రాణము విడువవలసి వచ్చినపుడు దశరథుడు చేసిన ఆర్తరవము, ''రామా రామా'' అను అక్షరములు, భారతీయుని కర్ణపుటముల ధ్వనించుచుండునుగదా! పూర్ణగర్భిణి--ఇదివఱకే దుర్భరకష్టపరంపరల గ్రాగిన సీత జనాపవాదనివారణమునకై మరల వనవాసిని కావలసివచ్చినపుడు ఎవని హృదయము ద్రవింపకుండును?

రామాయణ ప్రధానపాత్రలయం దిట్టి విషాదవృత్తాంతము లుండుటవలన అది భారతీయుల హృదయములను అయస్కాంతమువలె నాకర్షింపగలిగినది. అవి ప్రపంచనైతికస్వభావమును చాటుచు భారతీయుల నిట్లు ప్రబోధించుచున్నవి. ఓ భారతీయుడా, నీకు మానవజన్మ కలిగినంతనే సంతుష్టి చెందకుము. కాలమంతయు సుఖప్రదముగ జరుగునని ఆశింపకుము. కష్టపరంపర లెదుర్కొన నున్నవి. వానిని ధీరుడవై మార్కొని జయముగాంచ ప్రయత్నింపుము. సన్మార్గ మవలంబింపుము. ఇహపరసుఖములు కలుగును. నీ కీర్తిచంద్రికలు దిశల గ్రమ్మి ప్రకాశించును.

## సీతారాములు—దాంపత్యము

రామాయణము హిందూధర్మములను, హిందూజీవితమును తెలియజేయుచు వాని నీతులను భారతీయులకు బోధించుచున్నది. సీతారాముల దాంపత్యము హిందూదాంపత్యనిదర్శనము! వారి అన్యోన్యప్రేమ, పవిత్రస్వభావము, నిష్కళంకహృదయము, హిందూసంసారప్రసిద్ధములు. వీరిచరిత సతీపతిధర్మమును నిర్వచించుచున్నది. భార్యకు భర్తయే దైవము; భర్తయే లోకము; భర్తయే స్వర్గము; భర్తృసాహచర్యమే పరమసుఖప్రదము; భర్తృప్రేమయే మహానందకరము. అనుభవింప మహాభోగములున్నను భర్తృప్రేమకు కొఱతగలిగిన భార్యకు సుఖముండదు. అదే విధముగ భార్యాప్రేమకు లోపముకలిగిన భర్తకు భోగభాగ్యములున్న ప్రయోజనము లేదు. ఇద్దఱిహృదయములు ప్రేమామృతపూరితములై అన్యోన్యభావదీపితములై తనరారును. అటులు గానిచో ఆ సంసారము సుఖకరము కాజాలదు.

సీత ప్రేమస్వరూపిణి; భర్తృసహధర్మచారిణి; రాముడు వనవాసప్రయాణమునకు సిద్ధపడెను. రామునకు సీతవచ్చుట యిష్టము లేదు. రాముడొక్కడే వెళ్లుటకు సీత కిష్టము లేదు. ఒకరిమీద ఒకరికున్న అత్యధికప్రేమయే కారణము. సీత కష్టము లనుభవింపవలసి వచ్చునే యని రాముని విచారము. రాము నెడబాసి సీత యుండగలదా! రాముడు అరణ్యములో కష్టములనుభవించుచుండ తానెట్లు గృహమందు భోగము లనుభవింపగలదు? భర్తృదర్శనములేని నిముసము అంధకారప్రాయముగదా! సీత కిదియే విచారము. రాముడు మాత్రము సీతాముఖసందర్శనములేనిది ఒక్క నిముసమైన నుండగలడా? కాని సీతకష్టములు

చూచి సహింపజాలడు. అందువలన రాముని ప్రేమ సీత గృహమం దుండవలయుననియే కోరెను. 'సీతా, అరణ్యవాసముతో చెరలాటము నీ సుకుమార దేహమునకు తగదు. కటికి రాల శయనింపజాలవు. నీ మృదుపాదములు కంటకబాధ కోర్వజాలవు. మృదుమధురరవముల కలవడిన నీ కర్ణపుటములు భీకరసింహ గర్జనములను సహింపజాలవు. పంచభక్ష్యముల కలవడిన నీవు కందమూలము లెట్లు భుజింపగలవు? మృదులదుకూలములు ధరించు నీవు బిరుసునారచీర లెట్లు ధరింపగలవు? చండ భాస్కర రణములు నీ ముఖాబ్జ మధువును స్వేదబిందు వ్యాజమున హరించుచుండ నే సహింపగలనా? నీ శ్రమ యేల? సుఖముగ గృహమందుండుము. నీవు సుఖముగనుండ నాకదే పరమానందము. అప్పుడు నాహృదయము దుఃఖమున కెడమీయదుసుమా?'

సీత కేదికష్టము? గృహమందు భర్తృవియోగమున నుండుటయా? అరణ్యమున భర్తృసహవాసముతో నుండుటయా? ఇక్కడనే భారతనారీమణిధర్మము నిలిచియున్నది. ఈ సందర్భమున సీత కనుపఱచిన హృదయము నిర్మలము; నిష్కళంకము; ప్రేమామృతమయము. ఆమె వాక్కునుండి వెలువడిన పలుకులు అమృతబిందువులు. శోషితభర్తృహృదయ క్షేత్రమును ఫలవంతముగ జేయునవి అవియే కదా. ప్రతిభారతనారీమణి హృదయఫలకమందు ఆ పవిత్రాక్షరములు స్వర్ణలిఖితములై తేజరిల్లుచుండునుగదా!

'నాథా, నేను మీవెంట వచ్చెదను. నన్నాటంక పెట్టవలదు. సతీధర్మము నిర్వహింపనిండు. జననీజనకులకన్న, సోదరసోదరీమణులకన్న నాకు నీవే ప్రాణాధికుడవు. నిన్ను విడిచి నే నొక్కనిముస ముండజాల. నీవు లేనప్పుడు నాకంతయు అంధకారము. నీ సమీపమున నుండనప్పుడు నాకీ రత్నకంబళములు, ఈ హంసతూలికాతల్పములు, ఈ దుకూలములు, ఈ ఆభరణములు సుఖము నిచ్చునా! నీవు నా కన్నులపండువుసేయుచుండ మహారణ్యము మహారాజ్యమగును. పర్ణశాలయే సౌధరాజము; పర్ణశయనమే హంసతూలికాతల్పము; కందమూలములే పంచభక్ష్యములు; పక్షిధ్వనులు మేలుకొల్పులు; సింహగర్జనములు వందిమాగధ స్తోత్రములు. ఇంక నాకు కావలసినదేమున్నది? మహాభోగ మక్కడ లేదా? ఆ పచ్చికబయళుల నీతో విలాసముగ విహరించెదను. మర్మరధ్వనితో ప్రవహించు ఆ సెలయేళ్ల నేత్రపర్వముగ విలోకించెదను. మార్గమధ్యముననున్న కంటకములు తొలగించి నీకు శ్రమలేకుండ జేసెదను. ఘుమఘుమ సౌరభములు వెదచల్లు పుష్పములు సమకూర్చి పుష్పహారములు నీ కంఠమున వైచెదను. పూపొదరిండ్ల నీతో విహరించెదను. కాసారమనోజ్ఞ దృశ్యముల దిలకించెదను. హంసకూజితముల కర్ణపర్వమొనర్చుకొందు. ప్రకృతిసౌభాగ్యము లనుభవింతు. ఆయా విషయములనుగూర్చి నిన్ను ప్రశ్నించి నీకు ఆనందము గూర్తును. నేను లేకున్న నీ కా యానంద మెట్లు కలుగును? నీవున్న చోట నుండుటయే నాకు స్వర్గము. అదియే ఆనందదాయకము. వచ్చుట కనుజ్ఞ నొసంగుము. నిన్ను ప్రార్థించెదను!'

ఈ ప్రేమ అగాధము; వర్ణనాతీతము; మధురము; పవిత్రము; సౌశీల్యసమన్వితము. ఈ ప్రేమ భారతస్త్రీలకు ఆదర్శమై నిరంతరస్మరణీయమై ముంగొంగుబంగారమై విలసిల్లుచున్నది. ఆహా! భారతీయుల దాంపత్యమన

నెట్టిదో సీతారాముల చరిత్రవలనగదా ప్రపంచమునకు వెల్లడియగుచున్నది!

## రాముడు—పితృభక్తి

రామాయణమునవచ్చు ముఖ్యపాత్రలన్నియు మానవసౌజన్యమునకు ప్రధానములైన నీతులను బోధించుచున్నవి. ఒక్కొక్క నీతికి ఒక్కొక్క పాత్ర పట్టుగొమ్మయై యొప్పుచున్నది. రామునివలన లోకము తెలిసికొనవలసిన నీతి పితృభక్తి. రాముడు పితృభక్తిస్వరూపుడు. వాని మనోవాక్కాయ కర్మల పితృభక్తియే తాండవించుచున్నది. తనయుని విధికృతములందు పితృభక్తియే ప్రథమస్థాన మలంకరింప వలయునని రామునిచరిత్ర ఉద్ఘోషించుచున్నది. రాముడు మహారాజకుమారుడు; సకలభోగములనుభవించుచున్నవాడు; జ్యేష్ఠుడు; సింహాసనమధిష్ఠింప సర్వాధికారి; ప్రజాహృదయములను చూఱగొన్నవాడు. అట్టి రాముడు, కామప్రేరితుడై, కైకమాయావాగురంజిక్కి, పూర్వమెన్నడో చేసిన వాగ్దాననిర్వహణమునకు నిర్బంధింపబడిన జనకుని కీర్తికి కళంకమొదవునేమో యను భయమున తానై కైక కోరికలను నిర్వహింప బూనుకొనుటకు ఎంత భక్తి, విశ్వాసము, వినయము, విధేయత, హృదయనైర్మల్యము కావలయునో విచారించిన రాముని సచ్చరిత్ర యేమి ప్రబోధించుచున్నదో విశదము కాగలదు. కైకవాంఛ దుష్టము. దశరథునిచర్య నింద్యార్హము. కాని రామునికి దశరథుడు తండ్రి. కైక సవతితల్లి. తల్లిదండ్రులను మనోవాక్కాయ కర్మల నిరసించుట పాతకము. జరిగినదానినిగుఱించి విచారింపలేదు. తండ్రిని దూరలేదు. తల్లిని నిందింపలేదు. పదునాలుగువత్సరములు సకలభోగములు వీడి కాఱడవుల సంచరింప వలయునే యని వెతనొందలేదు. జనకుని దూఱుచున్న లక్ష్మణుని నివారించెను. కైకపై వానికి గలిగిన ఆగ్రహము నణచిపెట్టెను. ఎంత సహనము! ఎంత ధీరహృదయము! కష్టసముద్రము నెదురీద బోవుచు ముఖకళ వీడదు. దీనవదనుడు కాడు. మందహాసచంద్రిక లెప్పటియట్లే ముఖచంద్రబింబమున ప్రకాశించుచుండెను. మనస్సులో వ్యాకులమున్నగదా ముఖమున ప్రతిఫలించుట! సంతోషపూర్వకముగ వనవాసదీక్ష గైకొని సీతాలక్ష్మణ సమేతుడై అరణ్యమున కేగెను. భరతుడువచ్చి ప్రార్థించెను. ప్రేమదృక్కుల వానిని వీక్షించి తన దృఢాభిప్రాయము తెలిపెను. కైకకు వరములిచ్చిన తండ్రి మరణించెను. భరతుడు వరముల ననుభవింప విముఖుడై స్వయముగ రాముని బ్రార్థించెను. రాముడు రాజ్యము స్వీకరించినను దోషము లేదు. కాని రాముడు పితృవాక్యపరిపాలకుడు. జనకుడు స్వయముగ ఆజ్ఞాపింపకున్నను ఆయన వాగ్దానమే తన కాజ్ఞ. దానిని శిరసావహింప వలసిన విధి వానియందున్నది. ఆ పదునాలుగేండ్లలో పల్లెగాని పట్టణముగాని చొరలేదు. అగ్నిసాక్షిగ స్నేహముచేసిన సుగ్రీవుని కిష్కింధయైనను చొరసాహసింపలేదు. పితృవాక్యపరిపాలన కింతకంటె ప్రబలనిదర్శన మేమి కావలయును?

## సీత.—పతిభక్తి

రాముడెటులు పితృభక్తిస్వరూపుడో సీతయటులు పతిభక్తిస్వరూపిణి. భారతనారీమణులకు పతిభక్తియే పరమాభరణము. ఆ యాభరణమును హృదయపేటికయందు పదిలపఱచి ఎటువంటి కష్టము లెదురుకొన్నను దానిని విడు

వరు. అది వారికి ప్రాణాధికము. సీత భారతస్త్రీలకు ఆదర్శ; సాధ్వి; పతిభక్తియే పరమవ్రతమని నమ్మిన నారీమణి. పతితోడిదే లోకమని విశ్వసించిన సహధర్మచారిణి. పతిసుఖము తనసుఖము. పతికష్టము తనకష్టము. మహాభోగములను త్యజించిన ధీరస్వాంత. చెఱయందున్న కాలమంతయు మలినవస్త్రధారిణియై భూతలశయనయై నిరంతరరామనామస్మరణతో కాలము గడపిన ప్రేమమూర్తి. లోకాపవాదనివారణార్థము తన్ను భర్త విసర్జించినపుడు సైతము నాథునిమీద అపరాధారోపణచేయని సహృదయురాలు. ఇదియే నిజమైన పతిభక్తి. అగ్నిపరీక్షయందు జయముగాంచిన మహాపతివ్రతామణి సీతామహాదేవియే. సీత జీవితము భారతచరిత్రమున పవిత్రమై స్త్రీజనాదరణాచరణయోగ్యమై తనరారుచున్నది. ఆ ప్రేమ, ఆ భావనైర్మల్యము, ఆ మహానందము, ఆ సుఖము, ఆ సంసారమాధురీమహిమ, సీతారాముల వనవాసక్లేశమేఘసంఘమునుండి విద్యుల్లతలవలె నిర్గమించుచు భారతసంఘమును తేజస్వంతముగ జేయుచున్నది.

## లక్ష్మణుడు, భరతుడు — భ్రాతృవాత్సల్యము

భరతలక్ష్మణులకు వనవాసము జనకుడు విధించినదికాదు. భ్రాతృవాత్సల్యము, భక్తి, విధించినవి; అగ్రజుడు ఒంటరిగ అడవులకేగిన బహుకష్టము లనుభవింపవలసివచ్చునే యని విచారించి ఆ కష్టములు తాను భరించి అన్నకేవిధమైన ఆయాసము లేకుండ వ్రతదీక్ష పరిసమాప్తి బొందించు నుద్దేశముతో లక్ష్మణుడు అడవులకేగ సంసిద్ధుడయ్యెను. అగ్రజుడు పూజ్యుడనుభావము లక్ష్మణుని హృదయక్షేత్రమున ముద్రితమై అనన్యసామాన్యభక్తిప్రేమలు నాటుకొనచేసినవి. తనకు రాముడు దశరథతుల్యుడు; సీత సుమిత్రాసమానురాలు; కనుక వారిద్దఱను జననీజనకులవలె సేవింపవలయును. అటులు సేవించి లక్ష్మణుడు కృతార్థుడయ్యెను.

భరతుని భ్రాతృవాత్సల్యము, భక్తి, అత్యద్భుతములు. సులభముగ చేతికందిన మహారాజ్యభోగములను త్యజించి రాముని రాజ్యస్వీకారముచేయ ప్రార్థించి విఫలమనోరథుడై రాజ్యముచేయనొల్లక రామపాదుకాపట్టాభిషేకము చేసి తాను వల్కలాజినములు ధరించి దీక్షానిష్ఠాగరిష్ఠుడై, పదునాల్గువత్సరములు పట్టణము చొరనొల్లక నందిగ్రామమున తపోవిధి గడపిన భరతుని చరిత్ర మెవ్వరికి ఆశ్చర్యము కలుగజేయదు! తన హృదయవేదన తెలుపుచు తల్లిని దూఱినవాక్యములు రామభరతవాత్సల్యమునేకాక భరతభ్రాతృవాత్సల్యమును వెల్లడి చేయుచున్నవి. "మహాపాతకీ, ఎంతపనిచేసితివి! నాకు పితృసమానుడగు రాముని అడవుల కంపితివి. పూజ్యుడగు జనకుని ప్రాణములను హరించితివి. రాముడు ఘోరాటవిలో జటాజినములు ధరియించి కందమూలముల క్షుద్బాధ నివారించుకొనుచు వర్షాతపముల నలమటించుచు దుర్భరకష్టముల క్రాగుచుండ నేను తగుదునని సింహాసన మధిష్ఠించి రాజ్యముచేయుచు మృష్టాన్నము భుజించుచు భూషణాద్యలంకారంబుల కులుకుచు మహాభోగము లనుభవింపగలనా? అకటా! ఇక అన్న మొగ మేమి తెఱగున చూడగలను? నీ కడుపునబుట్టబట్టిగదా నేనీ భువనగర్హణము పొందవలసి వచ్చినది".

## దశరథుడు — కామజితుడు

కామాంధుడగువాడు పతితుడగునను విషయము దశరథునివృత్తాంతమువల్ల విశదమగు

చున్నది. సకలభోగము లనుభవించి వృద్ధుడై అవసానకాలము నిరీక్షించుచున్న దశరథుడు కామము నడంపజాలక కైకచేతిలో కీలుబొమ్మ యై ప్రియసుతునకు కష్టములు దెచ్చిపెట్టి తాను దిక్కులేని చావుపాలాయెను. కైక మనోహర రూపలావణ్యములకు భ్రమసి వలలో చిక్కువడెను. ముప్పురు భార్యలలో కైక నెక్కుడు ప్రేమించి ఆప్రేమద్రవ్యము వెచ్చించి మృత్యువుగైకొనెను. బహుభార్యాత్వము సంసారసుఖ దాయకము కానేరదనియు ఏకపత్నీవ్రతున కున్న స్వేచ్ఛ ఆనందము సుఖము వాని కుండ వనియు నీ చరిత్ర బోధించుచున్నది.

## కైక—మంథర

కైక వరములడుగుటకు పూర్వము దుస్స్వభావయైనటుల గానరాదు. ఆమె నిజముగ సత్స్వభావురాలు. రాముని పట్టాభిషేకవార్త విని ఆనందించినది. కాని మంథర విషము తల కెక్కించినది. అంతటితో కైక బుద్ధి మారి దుస్స్వభావయై హృదయము వజ్రకాఠిన్యము దాల్చినది. దీనినిబట్టి రాజాంతఃపురపరిచారిక లేమి సామాన్యగృహపరిచారికలేమి సత్స్వభావలుగనుండిన క్షేమకరమనియు లేకున్న గృహ కలహములు సంభవించుననియు దుష్టులను చేర్పరాదనియు విశదమగుచున్నది. దుస్సాంగత్యము సర్వథా నిషేధింపవలసినది; అది పక్కలోని పాముకాటువంటిది.

## సుగ్రీవుడు—మిత్రత్వము

రామునకు సుగ్రీవునితో మైత్రి బహుకార్యసాధకమై మహోపకారకమైనది. రామసుగ్రీవులమైత్రి నిష్కళంకమై నిర్మలమై అన్యోన్యసుఖాస్పదమై యొప్పినది. మైత్రి యనగా నెటు లుండవలయునో అందువలన గలుగు లాభము లెవ్వియో స్పష్టమగుచున్నవి. సుగ్రీవుడు నూత్నప్రాప్తభోగపరుడై తాత్కాలికాజ్ఞానమునబడినను లక్ష్మణప్రబోధితుడై తెలివినొంది మైత్రీవిధానమునననుసరించి రామకార్యధురంధరుడై సకలసేనలతో సహాయపడి మిత్రునకు జయము చేకూర్చెను. రాముడు సుగ్రీవమైత్రి లేనిచో సముద్రము దాటుటగాని రాక్షసుల జయించుటగాని పొసగకపోవును.

## హనుమంతుడు—భృత్యత్వము

నిజమైన భృత్యు డెవరనిన హనుమంతుని పేర్కొనవలయును. భృత్యధర్మములన్నియు హనుమంతునియందు మూర్తీభవించియున్నవి. రామసుగ్రీవులమైత్రి చేకూర్చి సుగ్రీవునకు చేయవలసిన భృత్యధర్మము నిర్వహించెను. రామునికి భృత్యుడై నిరంతరరామకార్యాసక్తుడై రామునియందే మనస్సు లీనముచేసి రాముడేయై మెలగినవాడు. భృత్యున కుండవలసిన భక్తి, విశ్వాసము, వినయవిధేయతలు, కార్యజ్ఞానము, చాతుర్యము, ధైర్యము, సహనము, నిరీక్షణము, మెలకువ మొదలగు గుణరత్నములు లేకున్న హనుమంతుడు ఒంటరిగ లంకజొచ్చి సతాక్షేమ మరయలేకపోయెడివాడు. యజమానుని నోటనుండి యే మాట వెలువడునో, యేమి యాజ్ఞాపించునో యని మెలకువతో కనుపెట్టి చరించుట భృత్యుని ధర్మము. అందు హనుమంతుడు మేటి. ఎంతటి సాహసకార్యమునకైనను వెనుకంజవేయువాడు కాడు. ప్రాణములకైన తెగించి దుర్ఘటకార్యములనైతము సాధించువాడు. ఇవియే భారత భృత్యధర్మములు. హనుమంతుడు మార్గదర్శియై వీనిని భారతీయులకు చూపుచున్నాడు.

## ధర్మమే జయము

ఇందుకు నిదర్శనము రావణుడు. రావణుడు సాధారణ పురుషుడు కాడు. మహాబలశాలి; ముల్లోకములను గడగడలాడించిన వీర్యధనుడు; వేదరహస్యజ్ఞానదురంధరుడు; మహాతపశ్శాలి; అద్వితీయ శివభక్తుడు; కోటి శివలింగపూజాతత్పరుడు; అగణితవరసంపన్నుడు; అహంబ్రహ్మ యనువాడు. అట్టివాడు పరాజితుడగుటకు కారణమేమి? అతని అధర్మప్రవర్తనమే ముఖ్యకారణము. ధర్మమార్గావలంబనుడై చరించినంతకాలము జయలక్ష్మి వానిని వరించినది. ధర్మమార్గప్రవర్తనమనగా స్వధర్మనిర్వహణము. రావణుడు రాక్షసజాతికి రాజు. తనవిహితకృత్యమును నెఱవేర్పవలసిన బాధ్యత వానియందున్నది. విరోధుల నోడించి తనకు దాసులనుగా జేసికొనుట రాజధర్మము. ఇంద్రాదులు విరోధులు. కనుక వారి నోడించి తన భుజశక్తిని చాటెను; రాజ్యము విస్తరింపజేసెను; అధికారమును బలపఱచికొనెను; స్వమతస్థాపన మొనర్చెను; స్వమతభిన్నుల హింసించెను. క్రూరబాధలకు లోనుచేసి తన మతమునకు త్రిప్పుకొనెను. కానివారిని హత మొనరించెను. ఇవన్నియు స్వధర్మనిర్వహణార్థము చేసిన పనులు. అధర్మమార్గప్రవర్తన మనుటకు వీలులేదు. స్వధర్మము ఘోరమైనను దోషరహితమనియు న్యాయసమ్మతమనియు ధర్మవ్యాధుని చరిత్ర తెలుపుచున్నది. తాను మహాజ్ఞానియై యుండియు నిజధర్మము ననుసరించి కులవృత్తియగు మాంసవిక్రయము జేసెను. ఆ వృత్తి విసర్జించుట పాతకమని తెలియజేసెను. రాజైనవాడు స్వమత స్వధర్మస్థాపనార్థమై ఎన్ని అకృత్యములు ఈ కాలమున చేయుటలేదు? పశ్చిమదేశమున నెంతమంది రాజులు స్వమతేతరులను క్రూరదండనముల పాలొనరింపలేదు! ఎంతమోమంది స్వమతమును వీడక ప్రాణము లర్పించిరి. రాజ్యము లొండొంటి కబళింపజూచుట వింతకాదు. జర్మని బెల్జియమును మ్రింగజూచినది. ఫ్రాన్సును రూపుమాపదలచినది. ఆస్ట్రియాను కీలుబొమ్మవలె ఆడించినది. ప్రస్తుతకాలముననే ఈ విధముగ జరుగుచుండ, అవి రాజకీయతంత్రములని సమర్థింపబడుచుండ, ఇక ప్రాచీనకాలము సంగతి చెప్పవలయునా?

రావణు డెన్ని ఘోరకృత్యములు చేసినను వాని నణంప రాముడు ప్రయత్నము చేయలేదు. ఎందువలన? కలహకారణము లేకపోవుటవలన. రావణుడు చేసినవన్నియు కలహకారణములుగావా! కావనియే చెప్పవలెను. రావణుడు స్వధర్మప్రతిష్ఠాపన చేసికొనుచుండ పరరాజు అనవసరముగ జోక్యము కలుగజేసికొనుట రాజధర్మముకాదు. అటుల చేయుటే ధర్మమగునెడల సీతాపహరణపర్యంతము రాముడేల యూరకుండవలయును? అప్పటికి రాముడు అరణ్యవాసము చేయ మొదలుపెట్టి పదుమూడు వత్సరము లయ్యెను. రావణుని దుర్నయములను వినియుండెను. ఋషులెందఱో మొఱలిడుకొనిరి. కాని రాముడవి అధర్మములుగ భావించి యుండలేదు. తనధర్మమును నిర్వహింప తానేవిధముగ పాటుపడుచుండెనో ఆ విధముననే రావణుడు పాటుపడుచుండెనని తలచియుండవచ్చును.

కలహకారణము రావణుని అధర్మప్రవర్తనతో ప్రారంభమైనది. పరనారీహరణముతో రావణునికి ధర్మచ్యుతి కలిగినది. ఇంద్రియజితుడై అహంకారసమన్వితుడై అజ్ఞానాంధకారమున మునిగెను. అదియే వాని అధర్మ

ప్రవర్తనకు మూలము. అధర్మప్రవర్తనతో అధఃపతితుడయ్యెను. జయలక్ష్మి వానిని విడిచెను. అంతటితో బలము నశించెను. శౌర్యము పోయెను. తన దుష్కార్యమే గాలమై మనసును కలతపెట్టెను. ఆ సంక్షోభమే వానిని నిర్వీర్యునిగా జేసెను. రామరావణుల యుద్ధము ధర్మాధర్మ సమరము. రాముడు ధర్మస్వరూపుడు. రావణుడు అధర్మస్వరూపుడు. ధర్మస్వరూపమునకు ఆత్మవిశ్వాసము, ధైర్యము, ఉత్సాహము, ఆసక్తి మొదలగునవి చేదోడౌసంగును. అధర్మస్వరూపమునకు ఆత్మ సంశయము, అధైర్యము, నిరుత్సాహము, నిరాశ ప్రత్యక్షమై వెనుకకు లాగుచుండును. కనుక ధర్మమునకే జయము.

## మంత్రాలోచన—హితము

రామాయణకథవలన రాజనీతులు కొన్ని స్ఫురించుచున్నవి. రాజునకు మంత్రాలోచన ముఖ్యము. తానెంత సమర్థుడైనను రాజు మంత్రుల సలహా గైకొనవలయును. దీనికి నిదర్శనము విభీషణునికి శరణమిచ్చు సందర్భమున రాముడు తాను సర్వస్వతంత్రుడై యుండియు విభీషణుని మనస్సును వానిముఖముననే గ్రహించియు సుగ్రీవాదులను వారి వారి యభిప్రాయమును గుఱించి ప్రశ్నించెను. వాద ప్రతివాదముల కెడమిచ్చెను. దశరథుడు రామ పట్టాభిషేక ప్రయత్నములకు ముందు మంత్రులతోను పురోహితులతోను ప్రజలతోను సంప్రతించి కార్యమునకు పూనుకొనెను.

తన మేలుగోరి హితము సంగువారిని గర్హించి వారి హితము గైకొనక స్వబుద్ధి ననుసరించువారు చెడిపోవుదురు. తనకు సోదరుడై తనహితము గోరుచు న్యాయమార్గమును జూపిన విభీషణుని వెడలగొట్టి రావణుడు అధోగతి పాలాయెను.

## రాజు—ప్రజలు

రాజుప్రవర్తన ప్రజాప్రవర్తనకు మార్గదర్శకమని రాముని పరిపాలన తెలుపుచున్నది. ఈ సత్యమే సీతారాముల పునర్వియోగమునకు కారణమైనది. సీతను, పాతివ్రత్యప్రతిష్ఠాపనకై అగ్ని నుఱికి పవిత్రమైన సీతను—పూర్ణగర్భిణిని, రజకుడు ప్రల్లదమున ప్రేలిన నుడులు మనసును కలతపెట్ట వెనుకముందు లాలోచింక ప్రజాపరిపాలకుడగు రాముడు మరల అరణ్యమున కంపవలసినవాడయ్యెను. తన నడవడియే తన ప్రజల నడవడికి మార్గదర్శకమని విశ్వసించినవాడు. తనయందేమాత్రము కళంకమున్నను, ఉన్నదని ప్రజల కనుమానముతోచినను, అది ధర్మపరిపాలనకు కార్చిచ్చువంటిదగును. సీత పవిత్రయని తా నెఱుగును. కాని లాభమేమి! ప్రజలు నమ్మలేదు. కనుక సీతను విసర్జింపవలయును. లేకున్న పాలకుని అధర్మ మార్గప్రవర్తనము పాలితులకు మార్గదర్శకమగును. ప్రజాభ్యుదయము గోరిన రాజు స్వసౌఖ్యము సైతము విడనాడవలయును.

## రాజు—స్వమతస్థాపకుడు

మతస్థాపనచేసి దానిని రక్షించుట రాజ విధులలో నొకటి. మతమున లోపములున్న వానిని ఖండించుటయు, మతభిన్నప్రవర్తకులను శిక్షించుటయు రాజధర్మమై యుండెను. అప్పటి వేదమతప్రకారము ఒక్కొక్కతరగతికి ఒక్కొక్కవిధి నిర్వచింపబడి యుండెను. తద్భిన్న ప్రవర్తకులు శిక్షార్హులు. శంబుకవధ కిదియే కారణము. శూద్రునకు తపస్స్వాధ్యాయాదు

లను వేదమతము నిషేధించినది. తద్వ్యతిరేకముగ తపస్సు చేయుచున్న శూద్రుని వధించి వేదమతమును కాపాడవలసిన బాధ్యత రామునియందున్నది. అంతియేకాని యొకరువ్రాసిన నాటక ప్రకారము బ్రాహ్మణకుతంత్రము కానేరదు.

భారతీయులకు రామనామము పవిత్రమై ముక్తిప్రదమై వారిహృదయములందు లీనమైనది. పల్లెలు పట్టణములు రామనామమయములు. సీతారామలక్ష్మణవిగ్రహసుశోభితములు అవసానకాలమందు రామనామస్మరణతో భారతీయులు ముక్తిపొందుచున్నారు. రాముని పితృభక్తి, పితృవాక్యపరిపాలనాదక్షత, సత్ప్రవర్తన, ఏకపత్నీవ్రతము, స్నేహవాత్సల్యములు, సదాచారము, సీతాపాతివ్రత్యము, సహధర్మచారిణీత్వము, ప్రేమమాధుర్యము, భరతలక్ష్మణుల భ్రాతృవాత్సల్యము, భక్తి, అనిర్వచనీయములై ఆనందదాయకములై మార్గదర్శకములై భారతీయులను పవిత్రులనుగ జేసి వారి హృదయక్షేత్రములందు భక్తిజ్ఞానములను ప్రజ్వలింజేసి వారిజన్మమును ధన్యపఱచి ఆచంద్రార్కస్థాయిగా దివ్యత్వము నొందించుచున్నది.

[ఆంధ్రపత్రికవారి సౌజన్యముచే—1925 సంవత్సరాది సంచికనుండి]

# రామాయణము - భారతము

(వినోదపాఠము)

## శ్రీ క్రొత్తపల్లి సూర్యరావుగారు

ఎద్దానికిని సాజాత్యము, సాహాయ్యము, వివాదము లేక ప్రతిఘటనము లేకున్న గుణాగుణములు తెలియరావు. సాజాత్యంబున సమానగుణంబులుగల గురుత్వాగురుత్వములు వెల్లడి యగును. సాహాయ్యంబునఁ దనతోడు నందలి సుగుణంబులు దెలుప దుర్గుణంబుల వెలిపఱుప యత్నించును. ప్రతిఘటనంబున సామర్థ్యాసామర్థ్యములు తేటపడును. వివాదంబున రెండు పక్షంబు లేర్పడును. పక్షంబులవారా యిరుదెఱగుల యోగ్యతాయోగ్యతలఁ జర్చించి విషయనిర్ధారణము చేయుదురు. కొందఱు ప్రతిపక్షుల లోపంబు లెంతురు. కొందఱు మేళ్లం జూప నెంతురు. శాంతచిత్తులు రెండునుం దేటపడ వివరింతురు. పండితులందలి మేలెర్చి సత్యనిర్ధారణము గావింతురు. కావున నొక్కొక విషయంబున నోగుబాగులు తెలిసికొనుటకు సమయమగును. చీకటి యనుభవ మున్నపుడే వెన్నెల యుపయోగము గోచరించును. "ఏ మహాత్ములుగల్గ భూమిని సభలలోఁ గవులకు నధికవిఖ్యాతి గల్గు". అద్దకపుబట్టలకొట్లు రెండున్నపుడే బందరద్దకము గొల్లపాలెపుటద్దకముల మంచిచెడ్డలు తేలును. ఇట్లెన్నియో పిచ్చిమాటలు వ్రాయవచ్చును. ప్రస్తుత మేమన:—

వాల్మీకిరామాయణముం గాంచి దాని విఖ్యాతి దిలకించి యిటీవల వ్యాసుఁడు రచి

యించిన భారతమునకు వచ్చిన గౌరవముఁ దద్వ్రితయమునకుఁ గల సమానగౌరవము మున్నగునవి గొన్ని యిచ్చో వివరింపఁదలఁచితిని. బారెఁడు మూరెఁడు పీఠిక లెందుకు?

కాలనిర్ణయము:—రామాయణము ముందు పుట్టినదా భారతము ముందు పుట్టినదా యను విచారమునకుఁ దగిన యాధారములు దొరకవు. అది ముందని యిది ముందని మా చిన్ని సోదరులు కొందఱు వెడవ్రాఁతలు వ్రాయుదురు. శాసనాధారమును చరిత్రాధారమునుగల ఇతర కవులు మొదలగువారి విషయములలో నాల్గు మూఁడు శతాబ్దములనాఁటివానికే కాలనిర్ణయము కుదరక పండితులు తికమకలాడుచున్నారు. అట్టిచో నెవ్వ రేమని తలంచినను యుగములు దాఁటిపోయిన వని మేము తలంచు నీ రెండు గ్రంథములకుఁ గాలనిర్ణయము చేయుటకు శక్తి నాకు లేదు. ఎన్ని కవులచరిత్రము లున్నను నెన్ని గ్రంథములున్నను మా యూరికి దగ్గఱనుండు కూచిమంచి జగ్గకవి కృతియిచ్చిన చీమలకొండ సీనయ్య యే యూరివాఁడో తెలియరాలేదు. కావునఁ గవిజీవితములు కవుల చరిత్రలు నాకు నచ్చలేదు. ఇట్లని యూహాలను బోఁగొట్టుకొనవచ్చునా యని యొక్కింత యీ పిచ్చియూహాలను గ్రంథస్థము చేయఁదలఁచితిని. నమ్మిన నమ్మవచ్చును; మానిన మానవచ్చును; నా కా విషయమునఁ బట్టుదలలేదు. ఇతరుల పూర్వపక్షములకు సిద్ధాంతము చేయఁబూనను. రామాయణ మెప్పుడు పుట్టినది? వేదములో రామశబ్దము లేకున్నను రాముని గుణములుగల యొక్కని గుణములు రాముఁడే యనిపించునవి కనఁబడుచుండుటచే — నతి ప్రాచీనకాలమునుండి రాముఁడు తలంపునకు వచ్చువాఁడుగదా. ఆ రామునిగూర్చి వ్రాయఁబడిన శ్రీమద్రామాయణము కాలమెప్పుడను టకు—ఎట్లయిన వేదకాలమున కీవలనే పుట్టియుండును. గుంతవానిపాలెము చింతపండు పాఱునని కాని బిచ్చగాండ్రకు జ్ఞప్తికిరాదు. కావున నంతవఱకు నది లేదనవచ్చునా? పాండవుల పేరులు వేదములలోఁ గనఁబడవు. నీవు వేదము చదివినావా యని యడిగితిరా యెన్నో ప్రశ్నలు నేను వేయవలసివచ్చును. భారతము వేదకాలమున కీటీవలి దనుటకు సంశయ ముండఁగూడదు. అది చాల నవీనము. ఇతరాధారములు మనభాషలో మనదేశములో లేవు. అవు డితరభాషలలో నున్నవా, యెంతకాలము క్రిందటివి? ఎన్ని భాషలున్నను మనకుఁ బ్రామాణ్యమునకుఁ దగిన భాష కావలయును. పశ్చిమ దేశముం దీసికొందము. పూర్వము హిందూ ర్యులతో నీదేశమునకు వచ్చి సింధుమైదానములో వసియించి యార్య్య లనార్య్యులైన పిమ్మట వారియింటఁ బనులు చేసికొని జీవించుట కుపపత్తి లేక వారివలెనే దిగంబరులై గంజము జిల్లాలోనో, తోఁటపల్లి, బురదకోట, బవుర్వాక కొండలలోనో తిరుగుచుండు లంబాడీలు, బుడబుక్కలు, గదబలు, కోయలు మొదలగువారికి బట్టల కట్టుకొనుట నేర్పి చనవు చేసికొని యెవ్వరి కతపాలలోనుండియో రామాయణమును మనవా రపహరించిరని తోఁచుచున్నది. ఈ రహస్యము నా కంగారకునిలో నావురుదుబ్బులు ప్రమాదమున నగ్గిచేఁ గాలిపోయినపుడు చంద్రునిలోని పంటకాల్వలలోని నీరు పాఱించి యార్పిన యొకఁడు తీఁగలేని వార్త పంపినాఁడు. దానిని నేను వ్రాసికొనకుండ లోలోన దాఁచుకొన్నాఁడను గావున తోఁచుట యేమిటి— నిజమే—భారతము మనదేశమునకు వచ్చిన దాని కేమాత్రమును నెవ్వడును జెప్పలేదు.

కాఁబట్టి పాశ్చాత్యదేశాధారము మనకు నమ్మఁదగినవానిలో ముఖ్యమైనది. ఒక్క యక్షర శాస్త్రజ్ఞుఁడు "రామస్ బాతః" అనుపదము నుగ్గడించినాఁడు. ఆ శాస్త్రజ్ఞుఁ డక్షరము లెట్లు పుట్టినవో యను చర్చ మిన్నగాఁ జేసెను. తోఁకలు ప్రమాదమునఁ దెగిపోయిన రెండు క్రోఁతులవల్ల బుట్టిన మనుష్యులు మొదలుకొని భాష యెట్లు వృద్ధియైనదియు నాతఁడు వ్రాసినాఁడు. ఎ. అబ్రాహాములింకను. బి. బేబరు కంటె ముందని యి ట్లక్షరక్రమమునుబట్టి ఆర్. రామునికంటె ఎస్. సీతచిన్నదియని వ్రాయఁబడినది. అందు "రామస్‌బాతమ్" పదునాఱుపదునేఁడు మెట్టులకీవలఁ బడవైచినాఁడు. నారదవ్యాకరణమునకు వ్యాఖ్యవ్రాసి సహజవైరముచే దేవతలను నిరసించుచు రావణుఁడు తెనుఁగు మాసొంతభాషయని నిశ్చయించినట్లు తెల్పఁబడినది.

కప్పదాఁటులువైచుచు సంస్కృతముమాట యం దెత్తఁబడినది. ఫుల్ మూన్ - అనుదాని నుండి పూర్ణిమ పుట్టిన ట్లొప్పుకొనవచ్చును గాని పూర్ణిమకుఁ దెనుఁగుపున్నమకు సన్నిహితసంబంధము కానరాదని యక్షరశాస్త్రముచే రుజువుచేసినాఁడు. నాకు నచ్చలేదు. కోకనాడ, కాకినాడ, రాజమండ్రి, రాజపుటానా, మసూలిపటేమ్, బొదగాడకు బోడ్‌గోడ, గొల్లప్రోలుకు గాలప్‌రోల్ - ఇట్టి రైలుస్టేషను (భాష) బల్లలు చూచిన మీకే విశదము. ఈ శాస్త్రజ్ఞుఁడు చెప్పినదానికిసరిగా పిట్టపూర్ పిఠాపురము, పిత్తాపురము కాఁగలదు. ఇంతకంటె లోఁతున కిప్పుడు దిగవలదు. ఇదియంతయు నా యాంధ్రవాఙ్మయచరిత్ర సంగ్రహములోఁ బూర్తిగా విమర్శించినాఁడను. పెద్దల యభిమానమున్న స్వల్పకాలమునసే యిందు వెంట బైటఁబెట్టెదను. లోఁతునకు దిగితిమా తలమునకలై యొడ్డుఁజేరలేక యెట్లో ఘటముఁ జేరవేయవలసివచ్చును.

రామస్ బాతమ్‌నకు నేనిట్లర్థముచెప్పి నాపక్షమును సమర్థించెదను. రామ + స్ = రామసు; రామస్ (ః) రామః- సుప్పులోపమైన రామయైనది. భాకు బా పూర్వోచ్చారణము- చూ- గృహ్ణామి తేసుప్రజా- వదుమశత సమృద్ధిరస్తు- గోకూలాతిలూకం, ఇత్యాదులు. దీనిని ఛాందసమందురు. ఇట్టి ప్రమాదములు పూర్వము చాలఁగలవు.

"రసనైవ రతిప్రియస్యనూనం రశనాసావితి లేఖకప్రమాదః", "ప్రమాదోధీమతామపి" యని కలదుగదా. దీనినిబట్టియో లేక వర్ణలోప వర్ణాగమ ఇత్యాదిసూత్రముచేతనో రకారము లోపించినది. అపుడు భారతము బాతమయ్యెను. రామశబ్దముపిమ్మట భారతశబ్దముండుటచే రామాయణముకంటె భారతము తరువాతిదని యీపదమేచెప్పుచున్నది. ఇది యొక్క శాస్త్రజ్ఞుఁడు వ్రాసిపెట్టినది. ఇక గాలిప్రోగుచేసి మేముచేయునూహ. రాముఁడు వేదములోనున్నాఁడఁట. బ్రాహ్మశబ్దము వేదములోనున్నది. ఈ రెంటిలో నేది మొదటిదియని తేలవలయును. బ్రాహ్మణబాలురు (వైదిక బ్రాహ్మణబాలురుమాత్రమే) రామశబ్దమును ముందుగానేర్చుకొనుటచేత "రామోహరిః కర" యను ప్రాచీనశ్లోకము నాధారముచేసికొని బ్రాహ్మణులకంటె లేక బ్రాహ్మణబాలురకంటె నొకటిరెండుశతాబ్దములు రామశబ్దమే ముందని చెప్పవచ్చును. రామశబ్దముముందా శబ్దమంజరిముందా- యిది యిపుడు తెమలదు. ఎంతసాహసించినను రామాయణముకంటె శబ్ద

మంజరిని ముందుఁబెట్టుటకుఁ దగిన పూర్వాధారము చిక్కనిదే మనసొప్ప లేదు

నిర్మాణకాలము: ఒక్కదానినిబోలినది వేఱొక్కటియుండవచ్చును కథనుబోలిన కథలు ప్రతిదేశములోనుగలవు. పింగళి సూరన్న పేకివంటిది- ఇంగ్లండులోనొక దొరసాని నాశ్రయించి యెన్ని చెప్పినను—పని చెప్పు పని చెప్పుమని బాధించి యిసుక సన్నగా జల్లించి త్రాఁడు పేడికొనిరమ్మనఁ బాఱిపోయినట్లు చెప్పఁబడుచున్నది. ముంగి బ్రాహ్మణుని కథ వంటిది ఇంగ్లీషులో ''కుక్క- యజమాని''యని కలదు. రావణాసురునివల్ల కాడునుబట్టి బైబిలులో, ఆఖానుకుటుంబము - అఖోనులో నిప్పటికిని దగులఁబడిపోవుచున్నట్లు వ్రాయఁబడినది. దీనిఁబట్టి క్రీస్తు కాలము రావణుని కాలముకంటె నిటీవలి దని నేను నిర్ణయించితిని. దగినఁగాని లోఁతు తెలియదు. చర్చించినకొలఁది నాకిట్టి వెన్నియో సమాధానమగుచున్నవి. సామెత లంజూడుడు. రాణియందలమెక్కినఁ గుమ్మరి యెల్లి గుడిసె యెక్కినది. పులినిజూచి నక్క వాతపెట్టుకొన్నది. నెమలివలె గ్రుడ్డు పెట్టవలెనని పూరేడు యత్నించినది. ఎద్దునాకంటెఁ బెద్దదియాయని కప్ప యుబ్బి తబ్బిబ్బయినది. లోకోక్తులననుసరించి లోకములో వ్యవహారముగనుండు- బట్టలయంగడి యొక్కఁడు పెట్టినా వానిప్రక్కనో వానికెదురుగనో యింకొక్కయంగడి- ముద్రాయంత్రములలోపోటీ- ఉగాదిసంచికకుపోటీ- గ్రంథమాలలలో ప్రతిఘటనము- జంటకవులలో నుద్రేకము- ఇపుడేమి, యపుడేమి- యసూయ యేనాఁటను గలదు. ఒక్కఁడు రచించిననవల ''సమయానుగుణముగా లేదు. పూర్వకాలవిషయ మిప్పటి దానిం బోలినట్లువ్రాసినాఁ''డని దూరదృష్టిలేకయందుము- వెఱ్ఱివారముగాని- యన్నియు నన్నికాలములలోను గలవు. కావునఁ గవులు నిరంకుశులు గావలసినదే. ఒక్కదానిప్రక్కనింకొకటి లేచినపుడు మొదటి దానికంటె రెండవది మిన్నగా నుండునట్లు యత్నింపవలయును. ఈయత్నము ప్రతితావుననుగలదు. ఈతలంపుచేఁ బ్రతిమానవుని హృదయమునను దావులేకయున్నది. వసిష్ఠునికంటె గొప్పవాఁడననిపించుకొన విశ్వామిత్రుని యత్నము. పేరు బలము- అమృతాంజనము పేరు- న్యూరలైనుకు వచ్చినదా? తక్కిన బాము లెన్ని బాములు పడినవి? దేనికోయొక్కదానికిగాని రెంటికి సమాన గౌరవమును వృద్ధియును దఱచు తోఁచుట లేదు. నేను వ్రాయఁబోవునది రెంటికి సమానగౌరవమును వృద్ధియును గలదియని నమ్ముచున్నాఁడను.

పుట్టలోఁబుట్టిన వాల్మీకి రామాయణమును రచించెను. రాముఁడు పుట్టిన తర్వాతనే రామాయణమునురచించెనని కొందఱమతము. ''కోన్వస్మిన్ సాంప్రతం లోకే'' యనుదాని కర్థమేమి? 'స్థాపయిష్యతి' 'నియోక్ష్యతి' 'బ్రహ్మలోకం గమిష్యతి' యనువానికర్థమేమని వర్తమానవాదు లడుగుచున్నారు. లోతునకు దిగవలదు. పైపైమాట చెప్పుకొందము. రామాయణము ఋషిప్రోక్తము. దీనివంటి మహాకావ్యము జగత్తులో లేదు- (జగత్తనఁగా నాప్రమాణములనుబట్టి యిండియా) వేదతుల్యముగా నెల్లవారును బఠించు చున్నారు.

దీనింగాంచి తిట్టలోఁ బుట్టినవ్యాసుఁడు భారతమును రచియించెను. భారతము పాండవులు స్వర్గారోహణము చేసినపిమ్మట వ్రాయఁబడినట్లు చెప్పుచున్నారు. కారణము తమ పెద్దలవృత్తాంతము జనమేజయుఁ డడుగుటయే.

ఒకమంచివస్తువున్నపుడు, దానికంటెమంచిదని కాని, తుల్యమని కాని యనిపించుకొనుట కెన్నెన్నో ప్రకటనలు, ఎంతమందినో నిర్బంధ పెట్టి యోగ్యతాపత్రికలు పుచ్చుకొనుట, మంచిది మంచిదని తామే యుపన్యాసము లిచ్చుట, ఇట్టికష్టములు పడవలయును. వ్యాసుడు భారతమునువ్రాసి శిష్యులకు నేర్పి యొక్కొక్కరి నొక్కొక్కచోటఁ జదువుమని పంపి పంచమవేదమని తానే వ్రాసికొని ప్రసిద్ధికై యెన్నియోకష్టములు పడినాడు. కొందఱు వ్యాసుడిట్లు కష్టపడుట వాల్మీకి కుశలవులచే రామాయణమును రామునియొద్దఁ జదివించుటవంటిదని చెప్పెదరుగాని, యాతని యుద్దేశము వేఱు. వాల్మీకికంటె వ్యాసుడు స్వాతంత్ర్యముం గనఁబఱచుచున్నాఁ డన వలయును.

రామాయణమును వ్యాసుఁడెఱుఁగనే యెఱుఁగఁడని కొందఱు వాదించుచున్నారు. ఎఱుఁగకున్న, భీముఁడు హనుమంతుఁడు పెంచినతోఁకను "తొల్లి శతయోజనవిస్తారంబైన సముద్రంబు లంఘించి లంకకుబోయిన హనుమంతునట్లు నిన్ను నీ పర్వతంబు లంఘించి పోదు" నని చెప్పినట్లు కలదేయని ప్రతిపక్షు లడుగుచున్నారు. సంస్కృతముచూడని నా తమ్ములు – 'యెఱ్ఱాప్రగ్గడ రామాయణము వేఱుగా లేదు. భారతములోనిదే' యనికొందఱు, 'పత్రములు తాఱుమాఱుగా గ్రుచ్చఁబడిన యారణ్యపర్వము చివరవ్రాసిన రామాయణమునే యెవ్వరో ప్రతివ్రాసికొనువారారణ్యపర్వములోఁ దూర్చివ్రాసి మనల నందఱఁ దబ్బిబ్బుచేసినా'రని కొందఱు. ఎఱుఁగకపోఁడు; ఈసందేహము నేమసీదు ఆతి మీఁదనో యేయిటికావములోనో చరిత్రశోధకులు వెదకి తీయఁగలరు. పార్శీ భాష చదివిన వారు జందావస్తాలో నున్నదని చెప్పిరి. నేను జెట్టుపేరు చెప్పి కాయలమ్ముట యిపుడిపుడే నేర్చుచున్నాఁడను.

వాల్మీకి వైదికి. లౌక్యవైదికము లిక్కడఁ దేకున్న వలనుపడ లేదు. వ్యాసుడు పరమ లౌక్యుఁడు. వాల్మీకి కులబ్రాహ్మణుఁడు; వ్యాసుఁడు లోకజ్ఞుఁడు. కావుననే వేదసారమంతయు నిందిమిడ్చి లోకములోని పిట్టకథలుపెట్టి గడుసరికావున సందర్భవశమున రామాయణము నేయం దెక్కించెను. అంతియకాని రామాయణము నెఱుఁగనే యెఱుఁగఁడనరాదు. వాల్మీకివ్రాసిన విషయములట్టివే వ్రాసినాఁడని రామాయణమునే యందుఁజేర్చినపుడు వేఱ చెప్పనక్కఱ లేదు.

ఈరెండుగ్రంథములపై నెంతెంతవిమర్శములు వ్రాయువారమైనను మనమేమి చదివినారము? మనకంటెఁ బూర్వస్త్రీ పురుషులు చక్కఁగాఁ జదివినారు. కొన్నికొన్నిఘట్టము లొక్కొక్కరికిఁ గంఠపాఠముగా వచ్చును. ఇప్పటికిని గొన్నిపల్లెటూళ్లలోఁ దెల్లవాఱు జామున వినుండు, తాతలు "ఇతిశ్రీ వైయాసిక్యాం మహాభారతే భీష్మపర్వణి కృష్ణార్జునసంవాదే" మొదలుకొని యధ్యాయములు పఠించెదరు. ఏదీ? రామాయణముపై లేక భాగవతముపై నభిమాన మని దొర్లు మనము వానిగద్యలెట్లున్నవో యెఱుఁగము – పుస్తకాపేక్ష! ఎంత శ్రద్ధగఁ జదువకున్న, బాలరామాయణము, భగవద్గీత, రుక్మిణీకళ్యాణము, గజేంద్రమోక్షము, మొదలైనవి యెట్లువచ్చినవి? సారమేఱి చదువువారు. ఎంతశ్రద్ధగాఁజదువకున్న నెంత పరిశీలింపకున్న నాబాలగోపాలమునకు నష్టిగతములైయున్న కొన్ని విషయములపై

(striking points) (నేనుగూడనిట్లు నడుమ నింగ్లీషు చొనుపవలెననుకొందును. చట్టున వచ్చునంతటి జ్ఞాన మాభాషలో లేదు.) లోకో క్తులు బైలుదేఱవు. కనుఁడు.

రామాయణలోకోక్తులు:— ౧. ఓసీ కైక, ౨. అగస్త్యభ్రాత, ౩. రామునివంటిరాజున్న హనుమంతునివంటి బంటుండును, ౪. సీతమ్మ శోకము, ౫. తాటకరా యిది, చుప్ప నాతిరా, ౭. చూచిరమ్మనిన఼ గాల్చివచ్చెను, ౮. రంభారావుళ్లు (రంభారావణులు), ౯. అలో లక్ష్మణాయని, ౧౦. రామరావణయుద్ధము, ౧౧. కుంభకర్ణనిద్ర, ౧౨. నేలకుఁగోలకుఁ దెచ్చెను, ౧౩. అంగదరాయభారము, ౧౪. కాలనేమిజపము, ౧౫. (స్థూలశరీరుని జూచి నపుడు) కబంధం నామరూపేణ వికృతం ఘోర దర్శనం, ౧౬. కలియుగ రావణాసురుఁడు, ౧౭. రావణాసురుని వల్లకాఁడు, ౧౮. (కలి యుగ) లంకరాక్షసులు, ౧౯. లంకలోఁబుట్టిన వారందఱు రాక్షసులే, ౨౦. పుట్టినాఁడు కట్టి నాఁడు కొట్టినాఁడు, ౨౧. వనవాసము చేయు చున్నాను, ౨౨. భగీరథప్రయత్నము, ౨౩. రామునిరాజ్యము భరతుని పట్టము, ౨౪. ఇంటిగుట్టు లంకకుఁజేటు, ౨౫. కిష్కింధా పురాగ్రహారికులు, ౨౬. సుగ్రీవాజ్ఞ, ౨౭. రామాయణమంతయువిని రామునకు సీత యేమగునని, ౨౮. రామభూషణ కైక దూ షణ, ౨౯. తాఁజెడ్డకోతి వనమెల్లఁ జెఱిచెను, ౩౦. రామాయణము అంకు భారతముబొంకు, ౩౧. రామాయణము చదివి భారతమున కర్థముచెప్పెను, ౩౨. సీతపుట్టినదనిన లంక చెడెననుట, ౩౩. ఉడతాభక్తి, ౩౪. పెద్ద మండోదరిలాగున్నది, ౩౫. ఏమిటా రావణ కేకలు, ౩౬. రామాయణమువినవచ్చినకులట భార్య 'ఇక్కడను నీమొగమే యిూడ్చినా' రన్నదట. పండితులింకను జెప్పగలరు. పండి తులేగాదు. ప్రతిపామరునికి నీసామెతలు తెలిసి యున్నవి.

భారతలోకోక్తులు :— ౧. ఏసకట్టము - (వ్యాసఘట్టము) ౨. చేటభారతము, ౩. సవాలచ్చగ్రంథము, ౪. గజకచ్ఛపకలహము, ౫. గొంతెమ్మ కోరికలు, ౬. పంచపాండ వులను నేనెఱుఁగనా—౭. మేనమామ అస్థి కలుదాఁచినట్లు (అస్థికునిదాఁచుట), ౮. భీష్మిం చినాఁడు, ౯. దుష్ట చతుష్టయము, ౧౦. అభి మాన దుర్యోధనుఁడు, ౧౧. ధర్మరాజు, ౧౨. భీమ బలము, ౧౩. సహేంద్ర తక్షకాయ స్వాహా, ౧౪. అజ్ఞాతవాసము, ౧౫. పెద్ద కొడుకుపెండ్లి-అసురకు భోజనము, ౧౬. బకా సురుఁడురా, ౧౭. అట్టేయక్షప్రశ్నలువేయకు, ౧౮.ఉత్తరకుమారప్రజ్ఞలు—౧౯.సైంధవలడ్డు, ౨౦. శల్యసారథ్యము, ౨౧. పాండవులధనమం తయు దుర్యోధనాదులతద్దినములకుఁ జాలదు, ౨౨. యాదవకులమునకు ముసలము పుట్టినది, ౨౩. అరయంగాఁ గరుఁడీలె నారుఁర చేతఁగా, ౨౪. గ్రుడ్డి శుక్రాచార్యుఁడు, ౨౫. ఒంటిచేతి భూరిశ్రవుఁడు, ౨౬. వీఁడు కర్కోటకుఁడు, ౨౭. నలపాక భీమపాకములు, ౨౮. వింటే భారతమే వినవలయు, తింటే గారలే తినవల యును, ౨౯. వ్యాసప్రోక్తము, ౩౦. భారత సారముద్యోగము, ౩౧. విదురుఁడు విల్లుపట్టినఁ గృష్ణుఁడు చక్రముపట్టఁడా, ౩౨. దుర్యోధన సంపత్తి; ఇఁక నెన్నియోకలవు. ఇట్టివి పుట్టుట కేనవలాపఠనము నేపత్రికాపఠనము సాయ డును ? స్వల్పకాలము పట్టునా ?

కథాసామ్యములు :— రామాయణము మహాకావ్యముకావుటంజేసియే భారతము

మహేతిహాసము కావింపఁబడినది. రామాయణము గాయత్రీ మంత్రాక్షరముల లెక్క నిరువదినాల్గువేల గ్రంథముల గౌరవము గాంచిన భారతము ౧౨౫ వేల శ్లోకములచే 'భారతత్వాచ్చ' భారతమయ్యెను. రామరావణయుద్ధము త్రేతావసానమున జరిగినది కావునఁ బాండవ ధార్తరాష్ట్రియుద్ధము ద్వాపరావసానమున జరిగెను. ఏడుకాండముల రామాయణమున కేడుదినముల యుద్ధము. పదునెనిమిది పర్వముల భారతమునకుఁ బదునెనిమిది దినముల యుద్ధము - బదునెనిమిది యక్షౌహిణులసేనయు. దశరథునకు ముగ్గురు భార్యలవలన నలుగురు కొడుకులు నొక్కకూఁతురుఁ బుట్టిన, పాండురాజున కిద్దఱు భార్యలవలన నైదుగురు పుత్రులే పుట్టింపఁబడిరి. మఱి ధృతరాష్ట్రునకు నూర్గురు కొడుకులకుఁ గడగొట్టొక్క కూఁతురు. దశరథునకు జాలకాలము సంతానము లేదు. కావున నేకారణముననైననేమి భారత కథానాయకులకును సంతానముగలుగ లేదు. దశరథుఁడు వేఁటకేఁగెనని పాండురాజును వెళ్లెను. అతఁడు నీరుముంచుచున్న మునిబాలుని సారంగము (ఏనుఁగు) అనిచంపెను. ఈతఁడు విహరించు మునిదంపతులను సారంగము (లేళ్లు) లనిచంపెను. ఆరాజునకుఁ బుత్రవియోగమున మరణమని శాపమువచ్చిన నీరాజునకు భార్యాసంగమమున మరణమని శాపమిప్పించెను. మొదటిరాజు పుత్రకామేష్టి యను జన్నముచేయఁగాఁ బాయసపుముద్దలను యజ్ఞపురుషు డొసంగెను. రెండవరాజుభార్యకే యొకముని మంత్రముపదేశించె. రెండుముద్దలు ముగ్గురుస్త్రీలు నాలుగుభాగములుగాఁ బంచుకొని నలువురుబిడ్డలంగనినట్లు రామాయణముం జదివి యొకమంత్రముననే యిద్దఱుస్త్రీలకు నైదుగురు పుత్రులుపుట్టునట్లు చెప్పెను. (ఇందును బాయసపుముద్దవలె మంత్రోచ్చారణములును నాలుగే). లక్ష్మణశత్రుఘ్నులు కవలవారైనందున నకులసహదేవులునైరి. రామాదులకుఁ బ్రథమమున గురువు వసిష్ఠుఁడు. పిమ్మట విశ్వామిత్రుఁడు, నగస్త్యుఁడు నూరకయే విలువిద్యనేర్పిరి. భారతములో మొదటఁ గృపాచార్యుఁడు, తర్వాత ద్రోణాచార్యులు జీతగాండ్రై నేర్పిరి. ఇంద్రుఁడును, శివుఁడును సాయపడిరి. తన బాహుబలమున యుద్ధములలో దశరథుఁ డింద్రునకు సాయపడిన గ్రుడ్డిధృతరాష్ట్రునొక్కచోఁ గూర్చుండబెట్టి పాండురాజు తన బాహుబలమున రాజ్యమునడపెను. అతని కొడుకర్జునుఁ డింద్రునకు సాయపడి నివాతకవచాదులనుజంపెను. తనపుత్రుఁడగు భరతునకు రాజ్యము కావలయునని కైక తంత్రము లిక్కడ (సవతితల్లి) చేసి రెండువరములమిషపై రాము నడవికిఁ బంపఁగాఁ బిన్నతండ్రికొడుకు లగు పాండవులకు భాగమీయవలసివచ్చునని పెద్దతండ్రికొడుకులు రెండుసారులు జూదమాడి యోడించి యడవికిఁబంపిరి. ప్రోత్సాహకులలో మంథరకు మాఱు శకునిం జెప్పవచ్చును. దశరథుఁడు మృతినొందినపుడు ముగ్గురుపత్నులు మిన్నకుండిరని పాండుని మృతియప్పుడు చిన్న భార్యను సహగమనము చేయించెను. దశరథునిమృతి యప్పటి తైలద్రోణిసందర్భము వ్యాసుఁడు దుర్యోధనాదులు పుట్టునపుడు కుండలలోఁ బెట్టించుటగా ననుకొనవచ్చును. రాముని పట్ల ముువ్వురుతమ్ములు నెంతభక్తిగలిగియుండిరో ధర్మజునిపట్ల నలుగురుతమ్ములు నంతభక్తిగలిగియుండిరి. శాంత మొదటఁబుట్టిన, నామెను రాజునకుఁ బెంపిచ్చి; బ్రాహ్మణునకుఁ బెండ్లిచేసినందునఁ బెండ్లికాకమున్నె కుంతికిఁ బుట్టిన

కర్ణుని సూతకులమువారు పెంచుకొనిరి. రామాయణములో సూర్యవంశపురాజులు, భారతములోఁ జంద్రవంశపురాజులు. రామాదులు విష్ణ్వంశము; పాండవులు ధర్మ, వాయు, శక్రాదుల యంశములు, ధార్తరాష్ట్రులు కలి ద్వాపరాదుల పాళ్లవలనఁబుట్టిరి. వాల్యర్జును లింద్రపుత్రులు; సుగ్రీవకర్ణులుసూర్యపుత్రులు; హనుమంతుఁడును భీముఁడును వాయుపుత్రులు. ఇట్లే యంశముల జన్మము తెలియంగునది. రామలక్ష్మణులు మునివేషము వేసిరి. భరతుఁడన్న రాజ్యము నేనెట్లు హరింతునాయనివిచారించెను. దుర్యోధనుఁ డన్నదమ్ముల రాజ్యము లెట్లు హరింతునాయని విచారించెను. (ధ్వనియందుఁ బ్రధానము). లంకాదహనమునకే లాక్షాగృహదహనము– స్వయంప్రభగుహాకే యుప్పరిత్రవ్విన భూబిలము. శూద్రముని తపంబు నుండి బ్రాహ్మణబాలుని రాముఁడు రక్షించెను–(చచ్చినవానిని బ్రతికించెను). భీముఁడు బకాసురుని నోటఁబడి చావఁబోవు బ్రాహ్మణ బాలుని బ్రదికించెను. ఇంక నెన్నియోనిఁ జెప్ప వచ్చును.

వివాహములు:—సీత పూర్వజన్మమునఁ దన్నవమానపఱచిన రావణునిఁ రెండవజన్మమునఁ దనభర్తచేఁ జంపింపఁ బ్రతినపట్టి తొలి మేను నగ్ని కర్పించి యజ్ఞప్రదేశమున నేలలోఁ జాలులో నుద్భవించినది. మఱి ద్రౌపది తొలి పుట్టువున వివాహమునకు భంగము కావించిన భీష్ముని మఱుజన్మమునఁ దనభర్తచేఁ జంపించుటకై తొల్లింటి మేను నగ్ని కిచ్చి ద్రుపదుని యజ్ఞకుండములోనుండి పుట్టుటయే కాదు; తన తండ్రిని బరాభవించిన ద్రోణునిఁ జంపుటకని యొకసోదరుని వెంటఁ బెట్టుకొనివచ్చినది. దశరథుని పుత్రకామేష్టిలో కుండమునుండి యజ్ఞపురుషుఁడు వెడలెను. ద్రుపదుని యజ్ఞకుండములోనుండి ధృష్టద్యుమ్నుఁడు ద్రౌపదియు నిద్దఱు వచ్చిరి. జనకుఁడు పెంచుట, భూమిలోఁ బుట్టుట, చాలులో నగపడుట—యీ కారణములచే సీత–జానకి, భూపుత్రి–సీత యైనందున ద్రౌపది–ద్రుపదుని పెంపుచే ద్రౌపది, యాజ్ఞసేని, ఇత్యాది. సీతాద్రౌపదులు రాముని నర్జునుని బెండ్లియాడఁ బుట్టిరి. రావణుని జంపునట్టి బలవంతుని వెదకుటకు దైవచోదితుఁడై జనకుఁడు శివుని విల్లెక్కుపెట్టినవానికి సీతనిచ్చుటకుఁ బ్రతినచేయ, ద్రుపదుఁడు, నర్జునుఁడు మాఱువేసములో నెక్కడనైన నున్నాఁడా, లక్కయింటఁ గాలినాఁడా, యని తెలిసికొనుటకు మత్స్యయంత్రము—అక్కడను విల్లెక్కు పెట్టుట—ఇట్లు కల్పించెను. అక్కడను బలువురు రాజపుత్రులు విల్లును బట్టలేక భంగపడిరి. ఇక్కడను నట్లే. రాముఁడను క్షత్రియ పుత్రుఁడు బ్రహ్మర్షియగు విశ్వామిత్రునితో విల్లెక్కుపెట్టు చోటికి వచ్చెను. పాండవులను క్షత్రియకుమారులే బ్రాహ్మణవేషములతో బ్రాహ్మణబృందములోఁ గలసి వచ్చిరి. విల్లు విఱిచిన రాముని మూలమున నలుగు రన్నదమ్ములకు నలువురు కన్యలతోఁ బెండ్లియైనది. అర్జునుని మూలమున నైదుగు రన్నదమ్ములకు నొక్క కన్యతోఁ బెండ్లిచేయఁబడినది. విశ్వామిత్రుఁడు రాముని పేరు వినికిడి కానలెనని రామలక్ష్మణులను దండ్రినడిగి తీసికొనివెళ్లెను. ద్రోణాచార్యుడు శిష్యులనందఱిం బిలిచి ద్రుపదుని బట్టువా రెవ్వరని వెదకెను. చెట్టుచివర మాయపక్షిని బెట్టి ద్రోణాచార్యులు చేసిన చిత్రము – (వ్యాసుఁడు సమయము వచ్చినప్పుడెల్ల రెండు మూఁడు విధములఁ జమత్కరించుచుండును). వాలింజంపుటకు సమర్థుని వెదకు

టకు దుందుభి కళేబరము - సప్తతాళములు సుగ్రీవుఁడు కల్పించుట కావచ్చును.

వనవాసము :— వనవాసమునకు వాల్మీకి యొక్క కాండము నరణ్యకాండము రచించెను. వ్యాసుఁ డొక్క యారణ్యపర్వమును వ్రాసెను. చిత్రము, రాముని వనవాసము పదునాలుగేఁడులు. పాండవుల వనవాసమున వ్యాసుఁ డొక్క యేఁడు తగ్గించి పండ్రెండేఁడులు సాధారణము - నొక్క యేఁడు కఠినము - ఈ యేఁడే యజ్ఞాతవాసమని యెంతచిత్రముగానైన నల్లినాఁడు. రాముఁడు పదునాల్గేండ్లు వనములోఁ దిరిగివచ్చునప్పటికి భరతుఁడు నాఁటుకొనునని కైక తలంపు. పాండవులు మరల రానే లేరు. అజ్ఞాతవాసములోఁ బట్టుకొందుమని దుర్యోధనాదుల తలంపు. రాముఁడు వచ్చినను జనులు భరతుని పాలనము లెస్సగా నున్నదందురు. కాని రాముఁడు బలవంతుఁడని కైక బెదరు. పాండవులు బలవంతులు; ధర్మరాజు వచ్చెనా, నన్ను జనులు వలదందురు. పదుమూఁడవయేఁడెక్కడ నున్ననుఁ బట్టుకొనుచుంటిమా వారి కెప్పటికి వనవాసము, నా కెప్పటికి రాజ్యలాభమని దుర్యోధనుఁడు - ప్రక్క బెదరుచేఁ జేసినది. రావణుఁడు దుర్యోధనుఁడు, నొక్క రీతిగాఁ జూడవచ్చును గాని గుణభేదము కలదు. రామాయణ భారతములు చదివినవారి సారవంతమైన వాక్యరాజమున 'రావణుఁ డెఱిఁగిన మూర్ఖుఁడు' 'దుర్యోధనుఁ డెఱుఁగని మూర్ఖుఁడు' నని నిగ్గుఁ దేల్చినారు. అడవులలో రామునకుఁ బాండవులకు మునులు మేల్కొనరించిరి. జంతువులంగొట్టి తెచ్చికొని తినినంత తిని పిదప మిగిలిన మాంసము నెండఁబెట్టి దాఁచుట సీతపనియైనది. పాపము ద్రౌపది కేయాకులు నలములు తెచ్చి యిచ్చిననుఁ బంచభక్ష్యపరమాన్నములు చేయు వర మొసంగఁబడినది. తల్లులతో వసిష్ఠాదులతో సదుద్దేశమున భరతుఁ డడవికి రాముం జూడఁబోయిన, దురుద్దేశముతో దుర్యోధనుఁడు గోవులను జూచుటకను మిషఁ స్త్రీజనముతో బాండవులంజూడ వెళ్లి ''కాఁదలఁచినపనిని గంధర్వులు తీర్చ''నట్లు చేసికొని వచ్చెను. విషయము తెలియని గుహాదులు భరతునిపైఁ గినిసిరి. తెలిసిన మునులు మొదలగువారు దుర్యోధను శపించిరి. రాముఁ డయోధ్యకు రానిన భరతుఁడు నేను నిందే యుందునని పలికి నీవు వత్తునని చెప్పుదాఁక నేలఁ బండుకొందునని పట్టుపట్టినదానికే గంధర్వులవమానించి రని దుర్యోధనుఁడు ప్రాయోపవేశము చేయఁబోయినది. మాయలేడిని సీత కోరెను. సౌగంధికమును ద్రౌపది కోరెను. సీతను రావణుఁడు హరించెను. ద్రౌపదిని సైంధవుఁడు పట్టుకొనిపోయెను. సీతయొద్ద లక్ష్మణుని గాఁపుంచెను. ద్రౌపదియొద్ద ధౌమ్యుని బెట్టెను. జటాయువు ధౌమ్యుఁడు సమాన ధర్మము గలవారు. రాక్షసస్త్రీ శూర్పణఖ రామునిఁ బెండ్లియాడఁ గోరినది. పొసఁగలేదు. హిడింబ భీమునిఁ బెండ్లియాడినది. రామునకది యపకారము, పాండవులకిది యుపకారము చేసిరి. కిష్కింధ - విరాటునిపట్టణము. సుగ్రీవుఁడు - విరాటుఁడు; వాలివధాదులు సుగ్రీవునకు రామునకుఁ దోడుపడెను. గోగ్రహణాదులఁ బాండవులు విరాటునకుఁ దోడైరి. లాలించి సీతనుగొన రావణుఁడు తలఁచెను. బలవంతమున ద్రౌపది నవమానపఱచి దుర్యోధనాదులు చేయఁబోయినది చాలక సింహబలుఁ డొక్కఁడు దాఁపరించినాఁడు. సీతను వెదకుటకు సముద్రలంఘనాదులుఁ, బాండవులను వెదకుటకు గోగ్రహణపాంచరాత్రాదులును.

యుద్ధము:—రావణుని చేష్టలు విభీషణునికి నచ్చక రామునితోఁ జేరుటకే విదురుఁడు - యుయుత్సుఁడును పాండవులం జేరుట. రావణుఁడు తమ్ముఁడగు విభీషణునిఁ దన్నినదానికే ధృతరాష్ట్రుఁడు తమ్ముఁడగు విదురుని దఱిమివేయుట. నా పక్షములోనివా రా పక్షమునకు బోవువారు, ఆ పక్షమునుండి నా పక్షమునకు రాఁగోరువారుఁ గలరా యని ధర్మరాజు పలికిన పలుకులు వ్యాసుని కొంటెయుక్తులలోనివి. మఱియుఁ బాండవులలోఁ జేర్పకుండఁ గర్ణుని మొదటినుండియు విరోధిపక్షముననే యుంచెను. తఱిమివైచిన విదురుని మరలఁ బిలుచుకొనియెను. అంగదుని రాయబారమునకు, శ్రీకృష్ణుని రాయబారము, సంజయుని రాయబారమును. మీఁదుమిక్కిలి విరాటుని పురోహితుఁడు, తొడలు విఱుగ శాపమిచ్చిన ముని. అందు హనుమంతుఁడు పోరి యలసి కాబోలు నిందు ధ్వజమెక్కి చూచుచుండెను. శ్రీహరి నరుఁడై క్రోఁతులు కొండముచ్చులతోఁగూడి యుద్ధము చేయ శ్రీకృష్ణుఁడై శ్రీహరి తాను గత్తి ముట్టక మనుష్యులచేఁ బోరించెను. అందును శక్తిప్రయోగము, నిందునను శక్తిప్రయోగము. అందు నాగబాణప్రసంగము, నిందు నాగబాణ ప్రసంగము. బ్రహ్మాస్త్రములు రెంటను గలవు. రావణుని పాతాళహోమము దుర్యోధనుహ్రద ప్రవేశము. నా గురువు విల్లువిఱిచినాఁడని పరశురాముఁడు రామునిపైఁ గినిసిన నా శిష్యు నన్యాయముగఁ దొడలు విఱిచినాఁడని బలరాముని కోపము. విరోధివధము, పట్టాభిషేకము, అశ్వమేధము (రాజసూయము) నిందు నందునను గూడఁ గలవు.

విశేషములు:—నందిగ్రామములో భరతుని యునికికి సభానిర్మాణమును, దానిం జూచి యోర్వని దుర్యోధనుని దుఃఖమును బోల్పవచ్చును (తృప్తిగాఁ దోఁపదు). రామునియుద్ధమును దశరథుఁడు స్వర్గమునుండివచ్చి విమానముమీఁద నిల్చి చూచెను. పాండురాజు ధర్మరాజు నొద్దకు నారదునిచేత స్వర్గమునుండియే వార్తపంపెను. అరణ్యమునకు భరతుఁడు వచ్చినపుడు రాముఁడు నీ వందఱఁ గాపాడుచున్నావా, జీతములు నెలనెల కిచ్చుచున్నావా యని యొక్క యధ్యాయము చెప్పిన దానికి నారదుఁడే యీ రీతిగా ధర్మరాజు నడిగినాఁడు. ఛాయాగ్రాహిణి మొదలగు సముద్రమధ్యగ్రహములను హనుమంతుఁడు చంపుటయు నర్జునుఁడు సముద్రమధ్యమున నుండు క్షుద్రుల శిక్షించుట. హనుమంతు డొక భూతముచేత మ్రింగఁబడి దాని ప్రేగులు తెమల్చినదానికి గరుత్మంతునిచే మ్రింగఁబడి యొక బ్రాహ్మణుఁడు గొంతు గుండెలు మండించినాఁడు. కుశలవులు వనమున ఋష్యాశ్రమమునఁ బుట్టిన కారణమునఁ, బాండవులును మునిపల్లెలోఁ బుట్టినారు. దశరథుఁడు రెండువరములు కైకకిచ్చిన ధృతరాష్ట్రుఁడు ద్రౌపదికిఁ గావలసినన్ని వరము లడుగుమనెను గాని యామెయు రెండు వరములకంటె నెక్కువ యడుగక దానికి సూత్రములు గనఁబఱిచినది. అంగదుఁడు మండోదరిని దలపట్టి యీడ్చిన దుశ్శాసనుఁడు ద్రౌపదిని దలపట్టి యీడ్చి గుడ్డలుకూడ విప్పెను. రావణాదులు తపస్సుచేసి బ్రహ్మవలన వరంబు లంగొనిన నర్జునుండు తపస్సున నింద్రు నీశ్వరు మెప్పించుట. రామాయణములోని రాక్షస మాయలకు హైడింబునిచేఁ గొన్ని మాయలు చేయించుటకుఁగా నొక్కరాక్షసుని బెట్టెను. హనుమంతుని విశ్వరూపము శ్రీకృష్ణపరమాత్మ విశ్వరూపము. దుష్టుల (రావణాదుల) బాధ

లకు బ్రహ్మాదులు విష్ణుమూర్తికడ మొఱపెట్టు కొనుటచే భూభారము మాన్పఁ గోరఁబడినది. రాక్షసకులక్షయము, సర్పకులక్షయము, ధృతరాష్ట్రవంశక్షయము. అందు నిందు దేవదాన వాంశములఁ బలువురు పుట్టిరి. అనసూయ సీత కంగరాగాదులిచ్చుట, పతిభక్తి బోధించుట సత్యాద్రౌపదీ సంవాదముతో సరిపెట్టుకొన వచ్చును. మండోదరి మొదలగు రాక్షసస్త్రీల యేడ్పునకు స్త్రీపర్వమే. లక్ష్మణవిదురుల దేహత్యాగ మొక్క జత. రాముఁ డయోధ్యావాసుల నందఱ సరయూనదీమార్గమున స్వర్గమునకుఁ బంపిన వ్యాసుఁడు భారతరణమృతుల గంగానదిలో నుండి లేవదీసి వారి వారి విధవలను వారివారితో గంగలోఁ ద్రోసి పంపెను. ఈతనికి విడోల (విధవల) మీఁద దయ యెక్కుడు. బ్రహ్మ పంపున రాముని యొద్దకు యముఁడువచ్చెను. ధర్మరాజునొద్దకుఁ గాలుఁడు కుక్క వేషముతో వచ్చెను. ఇందు నందు మహాప్రస్థానము. రామాయణములో రామునియొద్ద వసిష్ఠుఁ డన్నిటికిని – ధర్మరాజునొద్ద వ్యాసుఁడు మంత్రాలోచనాదు లన్నింటికి. వాల్మీకి రామాయణగ్రంథకర్త మాత్రమే. వ్యాసుఁడో యనేక గ్రంథకర్త – భారతములోఁ గథానాయకుఁడే యాతఁడనవచ్చును. రాముఁడు కథానాయకుఁడును శ్రీహరియు; భారతమునఁ గథానాయకుఁడు వేఱు; శ్రీహరి వేఱు. దశరథునికొఱకే పుత్రకామేష్టి యని రహస్యముగా నొకరు చెప్పిరి. సర్పయాగము "సీతదర్థముగాఁగ దేవవినిర్మితము" అని సర్పయాగము నెవ్వరుం జేయలేదు. సర్పయాగం బిట్టిదని శాస్త్రవిధానంబు లేదని ఋత్విజులు చెప్పిరి. సీతను బెండ్లియాడిన పిదప వచ్చి రామునిపైఁ గోపించిన పరశురాముఁడే భారతములో భీష్ముని నీ వంబను బెండ్లియాడుమని కోపించెను. ఇందు విశేషమేమన, నొక్కఁడు నాకు వలదని విడిచిన కన్యను బ్రహ్మచర్యవ్రతభంగముచేసికొని పెండ్లియాడుమనుట. గురువుగారి విల్లు విఱిచినందున శిష్యుఁడు రామునితోఁ గయ్యముచేయరాఁగా గురువు శిష్యునితోనే (పరశురాముఁడు భీష్మునితో) పోరవచ్చెను. తెల్లవాఱకుండ ద్రోణపర్వతముం దెచ్చినగాని లక్ష్మణుఁడు బ్రదుకఁడని, ప్రొద్దుగ్రుంకకుండ సైంధవుని జంపకున్న నర్జునుఁడు బ్రదుకఁడఁట. రామాయణములో ద్రోణపర్వతమునకు, మహాభారతములో ద్రోణపర్వము (మహాభారతము ద్రోణపర్వతము). తండ్రిని జంపిన కారణమునఁ బరశురామునిచే క్షత్రియ సంహారము చేయఁబడినది. తండ్రిఁ జంపిన కారణమునవే యశ్వత్థామ ధృష్టద్యుమ్నుని జంపినది. ఇద్దఱును బ్రహ్మచారులు; ఇద్దఱు బ్రాహ్మణులు; ఇద్దఱుఁ జిరంజీవులు. శివశిష్యుఁడొకఁడు, శివభక్తుఁడొకఁడు. పరశురాముఁడు స్వర్గమునకుఁ బోకుండ రాముఁడు మార్గనిరోధముచేసిన నశ్వత్థామను స్వర్గమునకుఁ బోకుండ వ్యాసుఁడు దనతోడ భూలోకమున నుంచుకొనియెను. సీత ముందుగాఁ భూమిలో జొచ్చినది. ద్రౌపది ముందుగా భూమిమీఁదఁ బడినది. రాముఁడు లక్ష్మణుని బ్రతికియుండఁగనే తఱిమివేయునపుడుకొంచెము నిందించెనని ధర్మరాజు తమ్ములు భూమిమీఁదఁ బడిన పిమ్మట వీని కిట్టి గర్వము వీని కిట్టి స్వాతిశయమని నిరసించి విడిచిపెట్టెను.

చిత్రములోఁ జిత్రము:—క్రొత్తవాల్మీకులు క్రొత్తవ్యాసులు బైలుదేఱిరి. క్రొత్తవాల్మీకులు, విచిత్రరామాయణములు, ఆనందరామాయణములు, అద్భుతరామాయణములు, హనుమద్రామాయణములు, అధ్యాత్మరామాయణ

ములు, శతకంఠరామాయణములు, సహస్రకంఠరామాయణములు (అర్థములేని పేరులు) రచియించిరి. క్రొత్తవ్యాసులు చిత్రభారతములు మొదలయినవి లిఖించిరి. ప్రక్షిప్తము లిందును గలవు. నవీనవాల్మీకుల వింతలు చెప్పనలవి కాదు. వాల్మీకిరామాయణములోని రాముని చారిత్రమునకు భంగముం దెచ్చు గాథలు వ్రాయఁబడినవి. వారు చెప్పిన భాగము నొకదాని నెత్తి బదులలోఁ భాగము పెట్టినారు. దానిపేరు ''వేడుకయే వెతగొలుపును''. చిన్నతనమునఁ దనతమ్ములు పాలుత్రాగకున్నఁ దాను త్రాగని రాముఁడు కుంటిదని గూనిదని మంథరను వెక్కిరించి గూనుమీఁదఁ గొట్టె కైకకుఁ గోపమురాఁగా నింత కష్టపడినాఁడని వ్రాసెను. ఆహా! ఇక్కవి రామగుణము లెంతగా విమర్శించినాఁడు. నాయనా, నీవు రామాయణము లెన్ని చదివితివి? వాల్మీకి లక్షణము నీవెట్లు లెఱుఁగుదువు. విషయ వినాశమగు నను భయముచే సందర్భము దొరకిన చోటనెల్లఁ గథాచ్ఛలంబున నితర గాథలం దెల్పు వాల్మీకి – విశ్వామిత్రునిచేతనే విశ్వామిత్రచరిత్రముం జెప్పించినవాఁడు – రాముఁడు మంథరఁ గొట్టినఁ దిట్టిన వేళాకోళము చేసినఁ జెప్పఁడా? రామునినోట నొరులు నొచ్చుకొను పరిహాస వచనమే వెడలదే; యట్టివాఁ డాఁడుదానిఁ గొట్టునా! తిట్టునా! అట్టి వచనమే వెడలిన వాల్మీకి చెప్పక మానఁడు. త్రిజటుఁడను బ్రాహ్మణునితో రాముఁడు ''తమువాచ తతో రామః పరిహాస సమన్వితమ్'' అనికూడఁ దెల్పినాఁడు. ఆ పరిహాస మెంత చక్కని సందర్భమున నున్నదో రామాయణముఁ జదువుఁడు. మైనమువలె, నూబిలోని రాటలవలె నెటు వంచిన నటు వంగును. బాలురహృదయములలో నిట్లు రాముని దోషగుణములు కల్పించి చెప్పు వాల్మీకులకు నమస్కారము.

ఆర్యులారా, ఇట్టివి వ్రాయుటకుఁ జిరకాలము క్రిందట (1896 లో) కీర్తిశేషులు బ్ర. శ్రీ. గురుజాడ శ్రీరామమూర్తిపంతులుగారు విజయనగరములో శ్రీవ్యాసనారాయణస్వామి యాలయముకడఁ బర్వతముమీఁద గూర్చుండి చెప్పిన కొన్ని బీజవాక్యము లాధారమైనవి.

[ఆంధ్రపత్రికవారి సౌజన్యముచే—1925 సంవత్సరాది సంచికనుండి]

# అష్టాదశ పురాణములు

## శ్రీ దై. కోటీశ్వరశర్మ శాస్త్రిగారు

కర్మభూమియగు ఈ భరతఖండమునందు బ్రహ్మక్షత్రియ వైశ్యశూద్రులనునాల్గు ప్రధాన వర్ణములు సృష్ట్యాదినుండి యేర్పడియున్నవి. ఆయావర్ణములకు నియమింపఁబడిన ఆచార వ్యవహారాది సకలవిషయములను పరమేశ్వరుఁడే స్వయముగ నేర్పఱిచి సృష్ట్యాదియందు హిరణ్యగర్భున కుపదేశించెను. అవియే వేదములనంబడుచున్నవి. అట్టి వేదములయర్థమును గ్రహించుటకు సాధనభూతముగా శ్రీ మహావిష్ణువే స్వయముగ వ్యాసమహర్షి రూపమున

నవతరించి అల్పాయుష్కులును, అల్పమేధగల వారలును అగువారికిగూడ సుబోధమగునటులు వేదములను జక్కఁగా విభజించి లోకమునందు వ్యాపింపఁ జేయుటచేత వేదవ్యాసుఁడనఁ బ్రసిద్ధిని వహించుచున్నాఁడు. అట్టివేదార్థమును సర్వసాధారణముగఁ దెలుపునవియును; సృష్ట్యాదినుండి సదాచారము, సత్ప్రివర్తనము, వితరణము, శౌర్యము, గాంభీర్యము, సత్యవాక్యము, మాతాపితృ భ్రాతృభృత్యపరిపాలనము మున్నగు సద్గుణములచేత వన్నెకెక్కి యశశ్శరీరులయినట్టియు అనుకరణీయచరితులయినట్టియు మహాత్ముల సచ్చరిత్రములకు అద్దమువంటివియును—అగు అష్టాదశ పురాణములనుగూడ వేదవ్యాస మహర్షియే రచించి జగంబున కెంతయో యుపకారము సల్పియున్నాఁడు. నానావిధ పుణ్యతీర్థముల వివరణము, వ్రతోపవాసాది నియమములు, ధర్మశాస్త్రచర్చలు, రత్న, సాముద్రిక, జ్యోతిష, భూగోళ, ఖగోళ, సంగీత, వైద్య, యుద్ధవ్యూహాది, శాస్త్రములకు సంబంధించిన సకలవిషయములును, అధికారతారతమ్యము ననుసరించి యుపదేశింపఁబడిన నానావిధ దేవతోపాసనలును, సాంఖ్యయోగాది శాస్త్రరహస్యములును వివిధోపాయములచేత వీనియందుఁ జేర్కొనఁబడినవి. ఇట్టి పురాణములన్నిటిని ఆంధ్రభాషయందు సరళమయిన వచనముగరచించి ప్రచురించినఁగాని మనపూర్వుల యథార్థస్థితిని అందఱుంగఁ జాలరు. అట్టియూహను మనయాంధ్ర దేశీయులగు విద్వాంసులకు భగవానుఁడు కలుగఁజేయుఁగాక. ప్రకృతమున సంగ్రహముగ ౧౮ పురాణములమాత్రము గూర్చి యొకింత ఇట వ్రాయుచున్నాఁడను.

## అష్టాదశ పురాణసంగ్రహ వివరణము

### ౧. బ్రహ్మపురాణము

అష్టాదశపురాణములలోపల బ్రహ్మపురాణము మొదటి దని ౧౫ పురాణము లంగీకరించినవి. శ్లోకసంఖ్య, ౧౦౦౦౦. మత్స్యపురాణము ౧౩ వేల శ్లోకసంఖ్యయనియు, అగ్నిపురాణము ౨౫ వేల శ్లోక సంఖ్యయనియు చెప్పుచున్నవి. ఈ పురాణమునందు దాదాపు ౮ వేల శ్లోకసంఖ్యగల గోదావరీమాహాత్మ్యము గలదు. వేంకటేశ్వరప్రెస్సువారు గోదావరీ మాహాత్మ్యమును ప్రత్యేకముగ ముద్రించిరి. ఆనందాశ్రమసిరీసు, పునా, వారి ముద్రణమునందు ౭౭ వ అధ్యాయమునుండి గోదావరీ మాహాత్మ్యము ప్రారంభింపఁబడినది. ఈ రెండు ముద్రణములందుగల శ్లోకసంఖ్య దాదాపు ౧౩ వేలకు పైఁగాఁ గలదు. లక్నోయందు ముద్రించిన బ్రహ్మపురాణమునందు గోదావరీమాహాత్మ్యమే లేదు. ఐతరేయబ్రాహ్మణము, శతపథ బ్రాహ్మణము, బృహద్దేవత మున్నగు వైదిక గ్రంథములందుగల ఆఖ్యాయిక లనేకములు అతిప్రాచీన వైదికభాషయందే ఇందుగనంబడుచున్నవి. మహాభారతమునందును, విష్ణుపురాణమునందును ఈపురాణమునందుగల శ్లోకములట్లే గ్రహింపబడి యున్నవి.

ఆంధ్రీకరణము:—ఇంతవఱ కెవ్వరును ఈ పురాణమును గద్యయందుగాని పద్యములందుగాని ఆంధ్రీకరించియుండలేదు. 'బ్రహ్మపురాణ విమర్శము' అనుపేర సుమారు ౧౦ సంవత్సరములక్రిందట నేను ౮౦ పుటలు గల చిన్న గ్రంథమును మాత్రము ప్రకటించితిని.

## ౨. పద్మపురాణము

ఈ పురాణమును అష్టాదశపురాణములలో రెండవ పురాణమునుగా ౧౮ అంగీకరించినవి. కాని స్కాందపురాణముమాత్ర మేలకో ఈ పురాణమును అష్టాదశపురాణములలో చేర్ప లేదు. శ్లోకసంఖ్యమాత్రము ౫౫ వేలు అని పురాణములన్నియు అంగీకరించినవి.

సృష్టిఖండము, భూమిఖండము, స్వర్గ ఖండము, పాతాళఖండము, ఉత్తరఖండము అని ౫ ఖండము లిందు గలవు. ఈ పురాణము దేశభేదములనుబట్టి భిన్నభిన్నముగ కొన్ని విషయములందు చూపట్టుచున్నది. కాళిదాసో పజ్ఞమని మనము తలంచుచున్న అభిజ్ఞాన శాకుంతలమునందలి దుర్వాసుని శాప వృత్తాంత మీ పురాణమునందుఁ జెప్పఁబడి యున్నది. పాతాళఖండమునందుఁగల రామా శ్వమేధపర్వమునందు వాల్మీకి రామాయణ గ్రంథ సారమంతయుఁ జెప్పఁబడి యున్నది. కాని అచ్చట బాలకాండమును గూర్చిన వివరమంతయుఁ జెప్పి ఆ బాలకాండ మునందే అయోధ్యాకాండమునందుఁగల విష యమునుగూడ వివరించి అరణ్యకాండమునందలి విషయమును బరామర్శించినాఁడు. ఈ విషయ మును సావధానముగ విద్వాంసులు విమర్శిం చుట యుక్తము.

ఆంధ్రీకరణము :— శ్రీనాథకవిసార్వభౌముని పితామహుఁడగు కమలనాభామాత్యుఁడు (౧౩ శక శతాబ్దియందున్నవాఁడు) ఆంధ్రీకరించి నటుల ప్రసిద్ధిగలదు గాని గ్రంథము లభింపదు. ఉత్తరఖండమును మాత్రము మడికి సింగన (౧౮ వ శతాబ్దమునందున్నవాఁడు) తెనిఁగిం చెను. ముద్రితము లభించును.

## ౩. విష్ణుపురాణము

ఈ పురాణము పురాణములలో అతిప్రాచీన మైనదనియు, దీనియందు ప్రక్షిప్తభాగములు లేవనియు ఆంగ్లవిద్వాంసుల యభిప్రాయము.

ఈ పురాణము పూర్వోత్తరభాగద్వయ ములు గలిగి ౨౩ వేల శ్లోకసంఖ్య కలిగి యున్నది. దాదాపు ౬ వేల శ్లోకములుగల ౬ అంశములుగల గ్రంథమే మొనమొన్నటి వఱకు ముద్రితమయి లభ్యమగుచుండెను. శ్రీధర విష్ణుచిత్తీయ వ్యాఖ్యానములతో ఆంధ్రాక్షరములందును నాగరాక్షరములందు ను ఈ పురాణము ముద్రితమయియున్నది. దాదాపు ౧౬ వేల శ్లోకసంఖ్యగల విష్ణుధర్మో త్తరగ్రంథమును అతిప్రయాసముచేత సంపా దించి వేంకటేశ్వరప్రెస్సు బొంబాయివారు ముద్రించిరి. బ్రహ్మగుప్తుఁడను జ్యోతిషశాస్త్ర జ్ఞుఁడు తన జ్యోతిషశాస్త్రపద్ధతిని విష్ణుధర్మో త్తరపురాణమునుండి సంగ్రహించినటుల ఐతి హ్యము గలదు. శ్రీమచ్ఛంకరభగవత్పాదా చార్యులవారు విష్ణుపురాణమనియు, విష్ణుధర్మో త్తరమనియు వేర్వేఱుగ గ్రహించినను నారద పురాణమునందుఁగల విష్ణుపురాణసూచియందు విష్ణుధర్మోత్తరముకూడ విష్ణుపురాణాంతర్గతమే యని చెప్పఁబడియున్నది. అన్నిపురాణముల యందు విష్ణుపురాణశ్లోకసంఖ్య ౨౩ వేలని ఏక గ్రీవముగ చెప్పఁబడియుండుటచేత ఇదియే యుక్తమని తలంచుచున్నాఁడను.

ఆంధ్రీకరణము :— వెన్నెలకంటి సూరన (౧౬ శతాబ్ది) పద్యకావ్యముగను, దాసకవి తుపాకుల అనంతభూపాలుఁడు వచనముగను ఆంధ్రీకరించిరి. మొదటి ౬ అంశములను మాత్రమే వీరు ఆంధ్రీకరించిరి.

### ౪. వాయు (శివ) పురాణము

ఈ పురాణవిషయమునుగూర్చి మతభేదము చాలగలదు. కొందఱు శైవపురాణమన్నను వాయుపురాణమన్నను ఒకటియే యని భావించుచున్నారు. విష్ణు, పద్మ, మార్కండేయ, కూర్మ, వరాహ, లింగ, బ్రహ్మవైవర్త, భాగవత, స్కాందపురాణములు శైవపురాణమును ౧౮ పురాణములలో నొకటియని పరిగణించినవి. దేవీభాగవత, మత్స్య, నారదపురాణములు 'వాయు'పురాణము ౧౮ పురాణములలో నొకటియని పరిగణించినవి. వాయుపురాణాంతర్గతమగు రేవా మాహాత్మ్యమునం దీ పురాణమునుగూర్చి వివరించుచు, వాయుప్రోక్తమగుటచేత వాయుపురాణమనియు, శివమహిమాప్రతిపాదకమగుటచేత శైవపురాణమనియు, ఈ పురాణశ్లోకసంఖ్య ౨౪ వేలనియు చెప్పఁబడియున్నది. వాయుపురాణమనియు, శైవపురాణమనియు, పేర్లతో వేర్వేఱుగ నాగరాక్షరములందు ముద్రింపఁబడియున్న గ్రంథములందు నారదపురాణమునందుఁగల పురాణసూచియందు చెప్పిన విధముగ సకల లక్షణములుసరిపోవుటలేదు. పూర్వభాగముమాత్రమే ఇప్పుడు ముద్రింపఁబడియున్నదనియు కొందఱు విమర్శకులు తలంచుచున్నారు.

ఆంధ్రీకరణము :. బద్దెపూడి పెద్దయ్య (౧౬ వ శతాబ్ది).

### ౫. శ్రీమద్భాగవతము

శ్రీమద్భాగవతము (విష్ణుభాగవతము) దేవీభాగవతము అని రెండుగా భాగవత గ్రంథములు లోకమునందు వ్యాప్తిచెందియున్నవి. చిరకాలమునుండి విష్ణుభాగవతము అష్టాదశపురాణాంతర్గతమని వైష్ణవులును, దేవీభాగవతమే అష్టాదశపురాణాంతర్గతమని శైవులును, శాక్తేయులును వాదించుచుఁ దమతమ మతమును సమర్థించుచు యుక్తిప్రయుక్తులనుదాహరించి గ్రంథములనుగూడ వ్రాసియున్నారు.

ఈ వివాదము నవకాశముచేసికొని దయానందసరస్వతీప్రభృతులు విష్ణుభాగవతము ఆర్షేయమే కాదనియు ౧౧ వ శతాబ్దియందలి బోపదేవుఁడను పండితుఁడే యీ విష్ణుభాగవతమును రచించి గ్రంథప్రశస్తికై వ్యాసకృతమని చెప్పెననియు చెప్ప మొదలిడిరి. కాని వారి వాక్యములన్నియు ప్రత్యక్షప్రమాణవిరుద్ధములు. అష్టాదశమహాపురాణాంతర్గతము దేవీభాగవతమా? లేక విష్ణుభాగవతమా? యని పూర్వులు సంశయించిరి. కాని రెండు భాగవతములు ఆర్షేయములే యను విషయమునందుఁ బ్రాచీనపండితులందఱు అంగీకారము కలిగియే యున్నారు. ఈ విషయమునకు సంబంధించిన వివరమంతయు ఇచ్చట వ్రాయునెడల ప్రత్యేక మొకగ్రంథమగును. కనుక ఆ పద్ధతిని విడనాడి భాగవతద్వయమునుగూర్చి యిట కొంచెము వ్రాయుచున్నాఁడను.

విష్ణుభాగవతము :— ౧౨ స్కంధములు, ౩౩౨ అధ్యాయములు, ౧౮ వేల శ్లోకసంఖ్య కలిగి యున్నది. భగవద్భక్తియందు తన్మయులగునటుల చేయుటయందు ఈ పురాణము వన్నెకెక్కియున్నది. లీలామానుషవిగ్రహుఁడగు శ్రీకృష్ణభగవానుని దివ్యచరితమును వివరించుచు వేదవ్యాసమహర్షి అధ్యాత్మతత్త్వమును జనులహృదయమునందుఁ జక్కఁగా నెలకొల్పియున్నాఁడు. దాదాపు ౧౦౦ వఱకు వ్యాఖ్యానము లీ భాగవతమునకు ఆయా విద్వాంసు లొనర్చిరి. వైష్ణవులేకాక వేదాంతులుకూడ ఈ పురాణమునందు ఎక్కువ

గౌరవమును గనంబఱుచుచున్నారు. అష్టాదశ పురాణములలోపల ఈ పురాణమునకుఁగల లోకప్రీతి మఱొకపురాణమునకు లేదు.

ఆంధ్రీకరణము:—బంగారమునకుఁ బరిమళ మబ్బినటుల భక్తశిఖామణియు, జ్ఞాన, భక్తి, వైరాగ్యములకుఁ బట్టుకొమ్మయు నగు బమ్మెర పోతనామాత్యుఁ డీ మహాపురాణమును గద్య పద్యాత్మకముగ నాంధ్రీకరించెను. సంస్కృత గ్రంథమునందుఁ గల విషయమంతయు భాషాంతరీకరణమునందు గనంబఱుచుట సాధారణ ముగ శక్యముకాని విషయము సుప్రసిద్ధమయి నను, మనపోతనామాత్యుఁడుమాత్ర మీ నియ మమునకు గుఱిగాక సంస్కృతమునందున్న భావమునంతయు భాషాంతరీకరణమునందు గనంబఱుచుటయే కాక శాంతి, భక్తి, వైరాగ్య విషయముల నుద్బోధించు పట్టులయందు మాత్రము పాఠకులు తన్మయులగునటుల లలిత పదమధురముగ మూలముకంటె నెక్కుడు రసవంతముగ రచించెను. ఆంధ్రభాషయందుఁ బండితపామరభేదము లేక సర్వజనాదరణ మును గాంచిన గ్రంథము మఱొక్కటి లేదు. వచనము:—శతఘంటము వేంకటరంగశాస్త్రి ప్రభృతులు.

దేవీభాగవతము:— ఇదియు ౧౨ స్కంధ ములు ౩౧౮ అధ్యాయములు ౧౮ వేల శ్లోక సంఖ్య కలిగియున్నది. నీలకంఠకృతవ్యాఖ్య మాత్రము సుప్రసిద్ధముగ నున్నది. తక్కిన వ్యాఖ్యానములుండిన నుండవచ్చునుగాని వా నికిఁ బ్రసిద్ధిలేదు. విష్ణుభాగవత పురాణము నందు దేవీభాగవతమునుగూర్చిన ప్రశంసయే లేదు గాని దేవీభాగవతమునందు మాత్రము విష్ణుభాగవతము ఉపపురాణమని చెప్పఁబడి యున్నది.

ఆంధ్రీకరణము:— ౧. త్రిపురాన తమ్మి దొర, ౨. ములుగు పాపయ్య, ౩. దాసు శ్రీ రాములు (౧౯ శతాబ్దము), ౪. తిరుపతి వేంక టేశ్వరకవులు, ౧౯, ౨౦ శతాబ్దములు, పం డిత సూర్యనారాయణ తీర్థులవారు యథా మూలముగ వచనము వ్రాయఁ బ్రారంభించి ౧, ౨ స్కంధములను మాత్రము ఇంతవఱకుఁ బ్రకటించియున్నారు.

## ౬. నారదపురాణము

పురాణములకు సంబంధించినవిషయములను గుఱించి సవిమర్శముగఁ జర్చించువారికి నీ పురా ణము మిక్కిలి తోడ్పడును. ఒక్కొక్క పురా ణమున కొక్కొక్క అధ్యాయముచొప్పున సంగ్ర హముగ పురాణవిషయసూచి, శ్లోకసంఖ్య, అంశములు, పర్వములు, ఖండములు మున్నగు గ్రంథగత విభాగములును ఇందుఁ జక్కఁగ వివరింపఁబడియున్నవి. చాలవఱకు నారదపురా ణసూచిననుసరించియే పురాణములందు గ్రంథ పాతము, ప్రక్షిప్తము మున్నగువానిని విమర్శ కులు నిర్ణయించుచున్నారు. ఈ పురాణముల శ్లోకసంఖ్య ౨౫ వేల శ్లోకములని చెప్పఁ బడియున్నది. కాని ముద్రితగ్రంథమునందు దాదాపు ౨౩ వేల శ్లోకము లున్నవి. బృహ న్నారదీయమని యొకపురాణము ముద్రితము గనఁబడుచున్నది. కాని యది యుపపురాణ ములలోఁ జేరుచున్నది. లఘుబృహన్నార దీయమని యింకొక యుపపురాణముకూడఁ గనంబడుచున్నది.

ఆంధ్రీకరణము :— అల్లాడి నరసింహకవి యనునాతఁడు దీని నాంధ్రీకరించెను.

## ౭. మార్కండేయ పురాణము

ఈ పురాణమునందు శ్రీవిద్యాపరాయణు లందు వేదతుల్యముగ గౌరవింపఁబడుచున్న దేవీసప్తశతి యను గ్రంథభాగము హిందూదేశ మునందుఁ జాల ప్రఖ్యాతగౌరవమునుగాంచి పలువురిచేత వ్యాఖ్యాతమై పఠనపాఠనప్రచా రములనందియున్నది. ఈ పురాణగ్రంథసంఖ్య ౯ వేల శ్లోకములని పురాణములందంతట చెప్పఁబడియున్నను ముద్రితమయి ప్రచారము నందున్న గ్రంథమునందు దాదాపు ౬౯౦౦ శ్లోకములుమాత్రమే కనంబడుచున్నవి. తక్కిన ౨౧౦౦ శ్లోకము లెట్లు లోపించినవో తెలియ వచ్చుట లేదు. ఇప్పటి మార్కండేయ పురాణపు చివర నరిష్యంతచరిత్రము గనం బడుచున్నది. నారదపురాణసూచన ననుసరించి యింకనుఁ గొంత కథాభాగముండిలీఅవలయు ననితోఁచుచున్నది. ఆకథాభాగముకూడ లభిం చినయెడల ౯ వేల శ్లోకసంఖ్య పూర్తికావ చ్చును. ఆంధ్రాక్షరములయం దీపురాణము సంస్కృతశ్లోకములతోఁ దిమ్మరాజు లక్ష్మణ రాయలనువారిచేత సంగ్రహముగ వ్రాయఁ బడిన యాంధ్రవచనముతోడఁ జేర్చి ముద్రిం పఁబడినది.

ఆంధ్రీకరణము:— ౧౩ వ శతాబ్దియం దున్న మారనకవిచేత గద్యపద్యాత్మకముగ ఆంధ్రీకరింపఁబడినది.

## ౮. ఆగ్నేయ పురాణము

ఈ యాగ్నేయపురాణము ఇతర పురాణ ములకంటె విలక్షణమయి యున్నది. దాదాపు ప్రపంచమునందుఁగల సకల విషయములు ఇందులో వివరింపఁబడియున్నవి. తర్క, వ్యా కరణ, మీమాంసాది శాస్త్రవిషయములును, నిఘంటువులుమున్నగు సాహిత్యవిషయములన్ని యు, వాస్తు, మంత్ర, పాక, శాస్త్రవిషయము లును, అవియివియని వచియింప నవసరములేక సకలవిషయములును ఇందుగలవు. నారదపురా ణమునందుగల పురాణసూచియందున్న విష యములన్నియు ఇప్పుడు ముద్రింపఁబడి యున్న అగ్నిపురాణమునందు గలవు. కాని నారదపురాణమున ౧౫ వేల శ్లోకములనియు, మత్స్యపురాణమున ౧౬ వేల శ్లోకములనియు ఈపురాణశ్లోకసంఖ్య చెప్పబడియుండ ఇప్పటి ఆగ్నేయపురాణమున దాదాపు, ౧౨ వేల శ్లోకములు మాత్రమే కనంబడుచున్నవి. నారదపురాణసూచియందు ప్రథమమునఁ జెప్పఁబడిన "వసిష్ఠాగ్నిసంవాద" రూపముగు కథాభాగము ఇప్పుడు లభించుచున్న ఆగ్నేయ పురాణమునఁ గనంబడుటలేదు. ఆ గ్రంథ భాగము లభించునెడల దాదాపు ౧౫ వేల శ్లోకములసంఖ్యకు గ్రంథము సరిపోవచ్చు నేమో.

## ౯. భవిష్యపురాణము

ఈపురాణ విషయమయి చాల గందర గోళము గలదు. నారదపురాణసూచియందు చెప్పబడినప్రకారము బ్రహ్మపర్వ, విష్ణుపర్వ, శైవపర్వ, సౌరపర్వ, ప్రతిసర్గపర్వములను ౫ పర్వములుగా విభాగింపఁబడిన గ్రంథ మిప్పుడు వ్యాప్తియందులేదు. ఇప్పుడు మనకు లభ్యమగు చున్న గ్రంథమునందు ప్రథమభాగమగు బ్రహ్మ పర్వమునందు ౨౧౬ అధ్యాయములు గలవు. సూర్యస్వరూపుఁడగు పరబ్రహ్మమునుండియే బ్రహ్మ నారాయణుఁడు మున్నగు చరాచరా త్మకమగు జగమంతయు ఉత్పన్నమాయెనను విధముగ సూర్యమహిమయే ఇందు ముఖ్య ముగ నిరూపింపఁబడియున్నది. బ్రహ్మ

పర్వపు ౪ వ అధ్యాయమునందు ఉపనయన సంస్కారవర్ణనమును ప్రారంభించి ౧౬ వ అధ్యాయము చివరవఱకు గృహస్థధర్మము, స్త్రీధర్మము, స్త్రీకర్తవ్యము మున్నగు సకల విషయములును వివరింపఁబడియున్నవి. ఈ భాగము చాలవఱకు వాత్స్యాయనకృత కామశాస్త్రమును, బాభ్రవ్యపాంచాలకృత మగు కామశాస్త్రమును అనుసరించుచున్నది. నారదపురాణసూచియందుఁ గల విష్ణుపర్వ, శైవపర్వ, సౌరపర్వములు గనంబడక పోయినను తత్స్థానమున ''మధ్యమపర్వ'' మని క్రొత్తవిభాగ మొకటి ముద్రితగ్రంథము నందుఁ గనంబడుచున్నది. నారదపురాణము నందు ఈపురాణశ్లోకసంఖ్య '౧౪ వేలు' అని చెప్పియుండఁగా అందుగల పర్వములు రెండిందు లేకపోయినను ముద్రిత భవిష్యపురాణమునందు శ్లోకసంఖ్య దాదాపు, ౨౭ వేల వఱకు పెరిగినది.

ఇప్పటి భవిష్యపురాణ గ్రంథసంఖ్య:

| పర్వ. | అధ్యా. | శ్లోకసంఖ్య. |
|---|---|---|
| బ్రహ్మపర్వ | ౨౧౬ | ౯౦౩౬ |
| మధ్యమపర్వ | ౬౧ | ౩౧౧౪ |
| ప్రతిసర్గపర్వ | ౧౦౦ | ౬౨౩౭ |
| భవిష్యోత్తరపర్వ | ౨౦౮ | ౮౫౯౭ |
| పర్వ. ౪ | అధ్యా. ౫౮౫ | శ్లో. ౨౬౯౮౪ |

ఈ పురాణమునందుఁగల భవిష్య వర్ణనము చూడఁ జాలవఱకు ప్రక్షిప్తమని తప్పక తోఁచు చున్నది.

భవిష్యోత్తరపర్వమనునది ప్రత్యేకపురాణము కాని భవిష్య పురాణమునకుఁ జేరిన గ్రంథభాగము కాదని కొందఱు విమర్శకులు తలంచుచున్నారు.

ఆంధ్రీకరణము :— భవిష్యపురాణము (ఉత్తరభాగమును) మాత్రము తిరుమలరాయ కవి ఆంధ్రీకరించెను.

## ౧౦. బ్రహ్మవైవర్తపురాణము

ఈపురాణము బ్రహ్మా, ప్రకృతి, గణేశ, కృష్ణ ఖండములను ఖండ చతుష్టయముకలిగి ౧౮ వేల శ్లోకసంఖ్య కలదని నారదపురాణ సూచియందుఁ జెప్పఁబడియున్నది. కాని ప్రచలితబ్రహ్మవైవర్తపురాణమునందుఁ గొంత విషయమే కనంబడుచున్నది. కాని ఆవిషయమంతయుఁ గనంబడుటలేదు. శరద్రాత్రులందు గోపికలతోడ శ్రీకృష్ణుఁడు రాసక్రీడ సలుపుటయు, రాధామాధవ సంబంధము, మున్నగు కృష్ణావతార సంబంధముగల విషయమంతయు నిందు కృష్ణఖండమున విపులముగ నిరూపింపఁబడియున్నది. గణేశ కృష్ణఖండములం దుండవలసిన విషయమంతయు నిందుఁగలదు. ప్రక్షిప్తముగాని గ్రంథపాతముగాని యున్నయెడల బ్రహ్మా, ప్రకృతిఖండములందుమాత్రమే కలదని విమర్శకులు తలంచుచున్నారు.

ఆంధ్రీకరణము :— చిలకపాటి వేంకటరామానుజశర్మ, (వచనము).

## ౧౧. లింగపురాణము

ప్రచలితమగు లింగపురాణము మత్స్య నారద పురాణములందుఁ జెప్పఁబడిన పురాణలక్షణము ననుసరించియున్నది. శ్లోక సంఖ్య ౧౧ వేలు అని చెప్పబడినప్రకారమే కలదు. కేవలము శివలింగమాహాత్మ్యము మాత్రమే కాక గాయత్రీమహిమ, శ్రాద్ధప్రకరణము, నానావిధదానముల వివరణముకూడ నిందుఁ గలదు. ఆంధ్రాక్షరములయందుగూడ నీ సంస్కృతపురాణము ముద్రింపఁబడియున్నది.

ఆంధ్రీకరణము:—ఇంతవఱ కెవ్వరును ఈ పురాణము నాంధ్రీకరింపలేదు.

## ౧౨. వరాహపురాణము

ఇప్పుడు లభించుచున్న వరాహపురాణమునందు నారదపురాణ సూచియందున్న విషయమంతయు సమగ్రముగ లేదు. మఱియుఁ బురాణసూచియందు ౨౪ వేల శ్లోక సంఖ్య చెప్పఁబడియుండఁగా ముద్రితగ్రంథమునందు ౧౦౭౦౦ శ్లోకములు మాత్రమే కనంబడుచున్నవి. ఈ ప్రచలితమగు వరాహపురాణ భాగము పూర్వభాగముమాత్రమే కానోపును. పులస్త్యకురురాజ సంవాదము సవిస్తరముగఁ దీర్థమాహాత్మ్యము మున్నగు కథాభాగము గల ఉత్తరభాగముకూడ లభించునెడల ౨౪ వేల శ్లోకసంఖ్య సంపూర్ణము కావచ్చును.

ఆంధ్రీకరణము:— ౧౫ శతాబ్దియందున్న నందిమల్లన ఘంట సింగనలను జంటకవు లీ పురాణమును దెనిఁగించిరి.

## ౧౩. స్కాందపురాణము

పురాణము లన్నింటిలో అధికశ్లోకసంఖ్య కలిగి శివమహిమాప్రతిపాదకపురాణ మని ప్రఖ్యాతిగాంచిన యీ పురాణముయొక్క సంపూర్ణగ్రంథము స్వతంత్రగ్రంథముగ నెక్కడను లభించుటలేదు. అనేకసంహితలు, ఖండములు, నూర్లకొలఁది వేలకొలఁది మాహాత్మ్యములు కలసి స్కాందపురాణమని మనము గ్రహింపవలయునేకాని పురాణసూచియందున్న క్రమము ననుసరించి క్రమముగాఁగల స్వతంత్రగ్రంథము కనంబడుటలేదు.

కొన్నిగ్రంథములందు స్కాందపురాణము :

| | | | |
|---|---|---|---|
| ౧. సనత్కుమారసంహిత | శ్లో.సంఖ్య | ౩౬ | వేలు |
| ౨. సూతసంహిత | ,, | ౬ | ,, |
| ౩. శంకరసంహిత | ,, | ౩౦ | ,, |
| ౪. వైష్ణవసంహిత | ,, | ౫ | ,, |
| ౫. బ్రాహ్మసంహిత | ,, | ౩ | ,, |
| ౬. సౌరసంహిత | ,, | ౧ | ,, |
| | మొత్తము. | ౮౧ | వేలు |

అని సిద్ధించుచున్నది. ఆనందాశ్రమ ముద్రితసూతసంహితయందు, సనత్కుమారసంహిత ౫౫ వేల శ్లో. సంఖ్యగలదని చెప్పఁబడినది. అప్పుడు స్కాందపురాణము ౧ లక్ష శ్లోకములు గలదని సిద్ధించును. ౬ సంహితలు, ౫౦ ఖండములు, ౧ లక్ష శ్లోకములు అని శ్రీనాథాది కవివర్యులు తదనుయాయులును దలంచిరి. కాని, నారదపురాణసూచియందు స్కాందపురాణము ౭ ఖండములుగను, ౮౧ వేల శ్లోకములు కలదిగను వర్ణింపఁబడియున్నది. ఇట్టివిభాగముగలదానినే వేంకటేశ్వరప్రెస్సువారు ముద్రించి ప్రకటించుచుండాము ముద్రించినదే స్కాందమహాపురాణమనియు; సంహితాత్మక విభాగముకలిగి లక్ష శ్లోకాత్మకముగల స్కాందపురాణము ఉపపురాణములలో జేరుననియు ఉపోద్ఘాతమునందుఁజర్చించి నిర్ణయించి యున్నారు. ఈవిషయము విమర్శింపఁదగియున్నది.

ఆంధ్రీకరణము:—సమగ్రగ్రంథము నెవ్వరు ఇంతవఱకు ఆంధ్రీకరించి యుండలేదు.

౧. కాశీఖండమును, శ్రీనాథకవియు(౧౪శతా);
౨. భీమఖండమును, ,, ,,
౩. ధర్మఖండమును, భవానీశుడు, ౨. అనుమంచి జగన్నాథుఁడు;

౪. శివరహస్యఖండమును, ౧. కోడూరు వేంకటాచలకవి (౧౭ శతా); ౨. వీరభద్రకవి; ౩. రేవూరి అనంతయజ్వ; ౪. ముదిగొండ బ్రహ్మాయలింగయారాధ్యులు;

౫. బ్రహ్మోత్తరఖండమును, ౧. ప్రాతకోట పుల్లయ్య, ౨. ముత్తరాజు వేంకటకృష్ణకవి, ౩. శ్రీధరమల్లి వేంకటకృష్ణస్వామి;

౬. శ్రీశైలఖండమును, ౧. అత్తలూరు పాపకవి (౧౮ శతా) ౨. శేషనారాధ్యుఁడు;

౭. సేతుఖండము, పాపనామాత్యుఁడు;

౮. నాగరఖండము:—డా. పట్టాభిరామశాస్త్రి గారు; (తెనిఁగించుచున్నారు.);

౯. సూతసంహిత, ౧. పట్టమట్ట సోమనాథుఁడు;

౧౦. హాలాస్యమాహాత్మ్యము ౧. తిరుమలసెట్టి జగన్నాథదాసుడు, ౨. భూజనంజరాజు, ౩. వేంకటనారాయణకవి, ౪. జనమంచి శేషాద్రిశర్మ.

### ౧౪. వామనపురాణము

నారదపురాణసూచియందున్న విధముగ ఇప్పుడు ముద్రితమయియున్న వామనపురాణము గనంబడుచున్నను ఉత్తరభాగము మాత్రము ఆసూచీక్రమము ననుసరించి దానియందుఁ గనంబడుట లేదు. పురాణసూచియందుఁ జెప్పఁబడిన విధముగ ౧౦ వేల శ్లోకసంఖ్య గనంబడుట లేదు.

ఆంధ్రీకరణము:—౧౭ వ శతాబ్దియందున్న లింగమకుంట రామకవి యనునతఁడు దీని నాంధ్రీకరించెను గాని లభింపదు.

### ౧౫. కూర్మపురాణము

బ్రాహ్మీసంహిత, భగవతీ సంహిత, సౌరీ సంహిత, వైష్ణవీసంహిత యను సంహితాచతుష్టయ సమన్వితమయి ౧౭ వేల శ్లోకసంఖ్యగల ఈ పురాణరాజము సమగ్రముగ లభించుట లేదు. నారదపురాణ సూచి ననుసరించి విమర్శించితిమేని మనకిప్పుడు లభించిన ౬ వేల శ్లోకసంఖ్యగల కూర్మపురాణము, పూర్వోత్తరభాగద్వయముగల బ్రాహ్మీసంహిత యను ఒక సంహితామాత్రమే యనియు,

| | | | |
|---|---|---|---|
| ౨. భగవతీసంహిత | ౫ పాదములు. | శ్లో. | ౪ వేలు |
| ౩. సౌరీసంహిత | | ,, | ౨ వేలు |
| ౪. వైష్ణవీసంహిత | ౫ పాదములు | ,, | ౫ ,, |

అనగా, ౧౧ వేల శ్లోకసంఖ్యగల ౨, ౩, ౪ సంహితలు మనకు లభింపలేదనియు దెలియవచ్చెడిని.

ఆంధ్రీకరణము :— ౧. రాజలింగకవి, (౧౭ శతాబ్ది) ౨. మండ చిట్టికామశాస్త్రి, (౧౯ శతాబ్ది).

### ౧౬. మత్స్యపురాణము

ప్రళయకల్పమునందు శ్రీ మహావిష్ణువు మత్స్యావతార స్వరూపియై రాఁబోవుసృష్టికి వలయువానిని బీజరూపముగ సంగ్రహించి సంరక్షించి కాపాడె ననువిషయమును, ధర్మశాస్త్ర సంబంధములను, ప్రవరాధ్యాయమునకు సంబంధించిన విషయములను విపులముగ వర్ణించునట్టి ఈపురాణరత్నము పురాణసూచి ననుసరించి ౧౪ వేల శ్లోకములు కలిగి యున్నది. ఈపురాణము ఆంధ్రాక్షరములందు సంగ్రహరూపముగ వచనముతోడ ముద్రింపఁబడియున్నది.

ఆంధ్రీకరణము:—౧ లింగముకుంట రామకవి, ౨. హరిభట్టు, (౧౭ వ శతాబ్ది) తెనిఁగించిరి.

## ౧౭. గరుడపురాణము

పురాణసూచియందుఁ జెప్పినరీతిగా ముద్రితమయిన గరుడపురాణమునందు సకలవిషయములు చాలవఱకు సరిపోవుచున్నవి. గ్రంథశ్లోకసంఖ్య ౧౯ వేలును ముద్రితగ్రంథమునం దున్నవి. పూర్వభాగమునందు సూర్యాది దేవతాపూజావిధానములు, దేవతాప్రతిష్ఠలు, వర్ణాశ్రమధర్మములు, మన్వంతరాఖ్యానములు, ఆయుర్వేదాది సకల శాస్త్రముల సంగ్రహము, ఆహ్నికవిధులు, సాంఖ్యవేదాంతాది తత్త్వనిర్ణయములును, ఉత్తరఖండమగు ప్రేతఖండమునందు యమలోకము, తద్గతి, ప్రేతచిహ్నములు, జన్మాంతరగతకర్మానుసారము జీవుల సుఖదుఃఖము లున్నగువాని వినిర్ణయము, సుస్పష్టముగఁ జెప్పఁబడియున్నది.

ఆంధ్రీకరణము:— ౧. పింగలి సూరన (౧౭ వ శతాబ్ది); ౨. వరదరాజకవి.

## ౧౮. బ్రహ్మాండపురాణము

ఈ పురాణమునుగూర్చి మతభేదము చాల గలదు. బ్రహ్మాండపురాణమనునది వేఱుగా దనియు వాయుపురాణమే బ్రహ్మాండపురాణమనియుఁ గొందఱు తలంచుచున్నారు. ఈవిషయమునుగూర్చి సంశయించుటకుఁ దగినకారణముల నిట వివరించుట యనావశ్యకము. ఈ పురాణశ్లోకసంఖ్య ౧౨ వేలు, ప్రక్రియాపాదము, అనుషంగపాదము, ఉపోద్ఘాతపాదము, ఉపసంహారపాదము, అని నాలుగుపాదములుగా గ్రంథము విభక్తమయినది. ఈపురాణమునందు 33 వ అధ్యాయము మొదలుకొని ౫౮ వ అధ్యాయమువఱకు బ్రహ్మాండాంతర్గతమగు భూగోళముయొక్క నానాస్థానములనుగూర్చినవర్ణన మిందు విపులముగఁ గలదు. మఱియేగ్రంథమున నింతవిపులముగ నీ విషయము వర్ణింపబడి యుండలేదు. బ్రహ్మాండపురాణము ఈ విషయమునందు అన్వర్థనామమగుచున్నది.

ఆంధ్రీకరణము:—జనమంచి శేషాద్రిశర్మగారు గద్య పద్యాత్మకముగ ఆంధ్రీకరించిరి.

## ఉప పురాణములు

సూతసంహితయందు ఉపపురాణముల నామము లిటుల చెప్పఁబడియున్నవి.

౧. సనత్కుమారపురాణము, ౨. నృసింహపురాణము, ౩. నందిపురాణము, ౪. శివధర్మపురాణము, ౫. దుర్వాసపురాణము, ౬. నారదోపపురాణము, ౭. కపిలపురాణము, ౮. మానవపురాణము, ౯. ఉశనసపురాణము, ౧౦. బ్రహ్మాండోపపురాణము, ౧౧. వారుణపురాణము, ౧౨. కాళీపురాణము, ౧౩. వాసిష్ఠలింగపురాణము, ౧౪. మాహేశ్వరపురాణము, ౧౫. సాంబపురాణము, ౧౬. సౌరపురాణము, ౧౭. పారాశరపురాణము, ౧౮. మారీచపురాణము, ౧౯. భార్గవపురాణము.

ఈ ౧౯ ఉపపురాణములేకాక ౧. ఆదిపురాణము, ౨. ముద్గలపురాణము, ౩. గణేశపురాణము, ౪. దేవీ పురాణము, ౫. దేవీభాగవతపురాణము, ౬. ఆదిత్యపురాణము మున్నగు కొన్ని యుపపురాణములుకూడఁ గనంబడుచున్నవి. వీనిలోఁ గొన్ని దాదాపు

క్రీ. శ. నాల్గవశతాబ్దమునుండికూడ ప్రామాణికగ్రంథములుగఁ బరిగణింపఁబడు చున్న టులు నిదర్శనములు గనంబడుచున్నవి.

పురాణగ్రంథములందు జనసామాన్యమునకుఁగలగౌరవము నవకాశముచేసికొని కొంద ఱాధునికులు తమకు తోఁచినవిషయమును ఛందోబద్ధముగ నొనర్చి పురాణాంతర్గతమనియు, లేక ప్రత్యేకపురాణమనియుఁ జెప్పి జనులకు సంశయము కలిగించి పురాణములందు జనులకు ప్రమాణబుద్ధి తొలఁగునటుల చేయుచున్నారు. అట్టియకార్యమును మానునట్టి యుదారబుద్ధిని ధర్మనిర్ణేతయగు పరమేశ్వరుఁడు వారి కొసంగుఁగాక.

[ఆంధ్రపత్రికవారి సౌజన్యముచే—1925 సంవత్సరాది సంచికనుండి]



# వైష్ణవుల వేదశాస్త్రాదిగ్రంథములు

## శ్రీ నే. రామదాసయ్యంగారు

మనదేశమున వైష్ణవము పెక్కుతెగల జనులకు చెందు సాధారణమైన పేరు. ఎల్ల తెగల వైష్ణవులును సామాన్యముగా విష్ణువును ఆరాధించువారు. అట్లే అందఱును దేవుని సాక్షాత్కరించుకొనుటకును మోక్షమునకును భక్తి సులువైన ఉపాయమని యెంతురు. మఱి తత్త్వము అరసిన వైష్ణవమునను పెక్కు మత భేదములు కలవని ఎఱుంగనగును. వల్లభాచార్యులది శుద్ధాద్వైతము, రామానుజాచార్యులది విశిష్టాద్వైతము, మధ్వాచార్యులది ద్వైతము. వీరందఱును విష్ణువే పర దైవతమని ఆరాధించువారే.

'విష్ణవ్యాప్తౌ' అను ధాతువునంబుట్టిన విష్ణు నామమునకు సర్వవ్యాపకుడు అని అర్థము. విష్ణువు సర్వవ్యాపకుడు, త్రిమూర్తులలో బ్రహ్మ సృష్టింపగా శివుడు లయమొందింపగా విష్ణువు కాపాడువాడు.

అన్ని తెగల వైష్ణవులును శబ్దమును అనగా, వేదమును, వేదాంతమైన ఉపనిషత్తులను అపౌరుషేయమగు శ్రుతిగా ప్రధానముగా ప్రమాణీకరించి, పౌరుషేయములగు స్మృతులను ఇతిహాసములను పురాణములను ఆగమములను వానికి ఉపబృంహణములుగా వేద సిద్ధాంతములకుప్రబలోదాహరణములు దృష్టాంతములు కలవిగా ప్రమాణీకరింతురు. స్మృతీతిహాస పురాణములు పౌరుషేయములైనను, ఆపురుషులు పరాశర వ్యాస వాల్మీకులంబోలిన వారు భూత భవిష్యత్తులయెఱుకయు పరతత్త్వ దర్శనమునుగల మహాత్ములు. కావున వైష్ణవులకు వేదమనగా అందు ఇవెల్ల చేరును.

వైష్ణవము ఇటీవలిది, రామానుజాచార్యులవారు కల్పించినది అని కొందఱు భ్రమింతురు. నిజముగా అది చాల ప్రాచీనము, వేద మూలము. వేదమున విష్ణువు సర్వవ్యాపకు

డనియు మూడు అడుగులలో విశ్వమును కప్పిన వాడనియు కలదు. ఆ విష్ణువు 'తద్విష్ణోఃపరమం పదమ్' అని పరమపదము నెలవుగాగల వాడనియు కలదు. కాగా ఎల్ల తెఱంగుల వైష్ణవ మతముననుగల విష్ణుని పరత్వమును అట్లే సర్వ వ్యాపకత్వమును వేదమూలకములే.

ఇకను ఉపనిషత్తులు విశేషముగా ప్రతిపాదించినది, దేవునింగూర్చిన వైష్ణవుల మఱి యొకభావము: దేవుడు అంతర్యామిగా ప్రతి ప్రాణి హృదయములోను నెలకొనియున్నాడనుట. పరిశుద్ధచిత్తముతో అంతర్ముఖుడగు నేని మనుష్యుడు తన ఆత్మలోనే ఆతని నిత్య సన్నిధానమును అరయ వచ్చును. అతిదూరమున అందని పరంధామమున ఉండు విష్ణువు అతిసమీపమున అందుపాటుగా ప్రతి జీవుని ఆత్మలోను చోటుగొన్నాడు! ఇందుండి జీవాత్మ పరమాత్మల శేష శేషిభావము, ప్రేమబంధము,

'శ్రవణం కీర్తనం విష్ణోః
స్మరణం పాదసేవనమ్
అర్చనం వన్దనం దాస్యం
సఖ్య మాత్మ నివేదనమ్.'

అను నవవిధ భక్తి మొదలైనవి బయలువెడలినవి. అట్లే 'ధాతుఃప్రసాదః' అన్నట్లు వైష్ణవమునగల భగవత్ ప్రసాదము, అనుగ్రహము, కృప, అది నిర్హేతుకమగుట మొదలైనవియు నెగడినవి. చెప్పబడినది కదా కఠోపనిషత్తున 'నాయమాత్మా ప్రవచనేన లభ్యో నమేధయా న బహునాశ్రుతేన ; యమేవైషవృణుతే తేనలభ్యః; తస్యైష ఆత్మా వివృణుతే తనూం స్వామ్.' అని, పరమాత్మను వాద ప్రతివాదముల చేతగాని, నేర్పుచేతగాని, బుద్ధిబలము చేతగాని చదువులచేతగాని వినుకలిచేతగాని పొంద శక్యముగాదు. ఆతడై ఎవనిని కోరు కొనునో వానికి తాను దక్కును; తనరూపమును ప్రకటించును.'' అని, దీనింబట్టి మోక్షము నీచాతినీచునికిని క్షుద్రాతిక్షుద్రునికిని పేదకును నిఱుపేదకును చదువులునేర్వనివానికిని అక్షరమే అభ్యసింపనివానికింగూడ భక్తిచే నిరాఘాటముగా లభ్యమగును, హృదయము మాత్రము అయ్యో నేనుచేయనిపాపము లేదు గదా, దేవుడా, అను పశ్చాత్తాపతప్త స్ఫటిక శుద్ధమైన చాలును, అను మొదలగు భావము లెల్ల వైష్ణవమతమున ఉదయించినవి. మఱియు ఈ మతమున పరబ్రహ్మకు తక్కిన పెక్కు తెగల వేదాంతులు చెప్పు నిరాకారతానిర్గుణతాదిని నిరసించి, రామానుజాచార్యులవారు శ్వేతాశ్వతరోపనిషత్తును ప్రమాణీకరించి సాకారత అపహతపాప్మత కల్యాణగుణాకరతలను కూర్చినారు.

ఇట్లు వైష్ణవమతమునందలి పెక్కు భావములు వేదమూలకములైయున్నవి. మఱి భగవద్గీత యన్ననో వైష్ణవమతమునకు ఉత్తమోత్తమమగు ప్రమాణము. లోకమున ధర్మమడగుటయు అధర్మము లేచుటయు కలిగినపుడెల్ల దీనిని అణచి దానిని లేపి ప్రతిష్ఠించుటకు యుగయుగమున తాను అవతరించునట్లు ద్వాపరయుగమున అవతరించిన భగవంతుడే కృష్ణుడు సొంతముగా ఆడినమాట, పాడిన పాట అది, 'భగవద్గీత', భగములనగా జ్ఞాన శక్త్యాది కల్యాణగుణములు. అవి కలవాడు భగవంతుడు. భగవద్భక్తులు భాగవతులు, వారిమతము భాగవతధర్మము, గీతలో బ్రహ్మముయొక్క సర్వవ్యాపకత పూసలలో దారము దూఱినట్లు, 'సూత్రే మణిగణా ఇవ' అని చెప్పబడినది. అంతర్యామిత 'సర్వస్యచాహంహృది సన్నివిష్టః' అని చెప్పబడినది. ఇదెల్ల మునుపు

నారాయణానువాకమున చెప్పబడినమాటయే— 'అన్తర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణః స్థితః' అని. పరబ్రహ్మమునకు వాసము పరమపదమనియు వైకుంఠము — ఏకుంఠము బోసియులేనిది అనుట—అనియు, ఆయన ప్రసాదము కురిసి తన భక్తులను ప్రోచుననియు గీతాప్రతిపాదనము. అనగా దేవుడు సర్వాతిశాయి, సర్వాంతర్యామి, సర్వానుగ్రహశాలి అనుట. తరువాతి వైష్ణవభేదము లన్నియు కాలానుగుణముగ ఇంచించుక మార్పులుగలవైనను ఈ సిద్ధాంతములనుండి పుట్టినవే.

భగవద్గీత సర్వశ్లాఘ్యమగు భక్తిమార్గోపదేశిని. కర్మయు జ్ఞానమును భక్తికి లోబడిన అంగములు. జ్ఞానము దేవునిగూర్చినది భక్తిగా పరిణమింపవలయును. కర్మ భక్తిప్రేరితమగు తదారాధనగా పరిణమింపవలయును. ఈ భావము పెంపొంది, 'రక్షిష్యతీతి విశ్వాసః' అన్నట్లు ఆనమ్మకమున సర్వాత్మార్పణ రూపమగు ప్రపత్తిగా పండవలయును. ఈ యుపదేశము కృష్ణుడు గీతలో చరమశ్లోకమున రూఢిచేసెను. 'సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణంవ్రజ। అహంత్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి, మాశుచః'. అర్జునునికి చెప్పుచున్నాడు — యజ్ఞయాగాది సకలధర్మములను అడుగంట విడిచి నన్ను ఒక్కనినే శరణుపొందుము. నేను నిన్ను అన్నిపాపములవలన విడిపింతును. కంట తడిపెట్టకుము — అని. భక్తుడు భరన్యాసముచేసి అభయము పొంది ప్రశాంతుడు కావలెను. శ్రీ అరవిందుడు ఈ చరమశ్లోకమునే మహావాక్యము అనెను. రామానుజాచార్యులవారును తదనుయాయులును ఈచరమశ్లోకమును దేవుడు మనుష్యునికి చేసిన అభయప్రదానమనియు, ఆతనికి అన్ని కష్టములయందును చిక్కులయందును తానుతద్భక్తిప్రీతులకొలది ప్రియమిత్రునివలె అండగా నిలుచుననియు గట్టిగా అవలంబించిరి. చెప్పినాడు గదా కృష్ణుడు 'తేషాం యోగక్షేమం వహామ్యహం' అని.

ఈభగవద్గీత మహాభారతాంతర్గతము. ఇదియేకాక, మహాభారతమున భాగవతమతమునకు స్పష్టమగు సూచనలు ఇంకను పెక్కుచోటుల కలవు. శాంతిపర్వమున మోక్షధర్మమను ఒక యధ్యాయముగలదు. అందు నారాయణీయము ఒక భాగము. అందు విష్ణువు నారాయణ భగవద్ వాసుదేవ నామముల పరదైవతమని చెప్పబడియున్నాడు. మహావిష్ణువు నారాయణరూపమున తన శిష్యుడగు నరునికి చేరరాని చలిమంచు కొండ దుర్గముల విరాజిల్లు శ్వేతద్వీపమున వైష్ణవసంతితిరహస్యములను ఉపదేశించెనను కథ అందు ఉదాహృతమైయున్నది. అందు ప్రధానమైనది స్వచ్ఛమగు విశిష్టాద్వైతమును పశుహింసనముగల యజ్ఞయాగాదుల అనావశ్యకతయు. ఈనారాయణీయమును వైష్ణవులు, విశేషముగా శ్రీవైష్ణవులు 'ఓం నమో నారాయణాయ' అను అష్టాక్షరిని ఏక మహామంత్రముగా జపించువారు, తమకు మిక్కిలి ముఖ్యముగా కొందురు. ప్రాతభాగవతుల తెగకు చెందిన 'ఓం నమో వాసుదేవాయ' అను మంత్రము ఇపుడు అంతగా కైకొనబడుట లేదు. అంతకుముందు వైష్ణవము మాత్రముగానున్నట్టిది రామానుజాచార్యులవారును వారి పూర్వాచార్యులును ఆళ్వారులును, స్వీకరించిన శ్రీవైష్ణవముగా పరిణామము చెందినది.

మహాభారతమున కృష్ణుడు విష్ణునవతారము, 'మమ ప్రాణాహి పాణ్డవాః' అన్నట్లు పాండవు

లకు ప్రాణమిత్రము,—అని వ్యాసమహాముని చెప్పినాడు. రామాయణ రచయిత వాల్మీకి మహాముని రామునికథానాయకునిచేసి, ఆతనిని సకలకల్యాణగుణపరిపూర్ణునిగా అభివర్ణించెను. రాముడును భగవద్గీతలో చెప్పిన దుష్టనాశన శిష్టరక్షణప్రయోజనముకోసమే, మానుష రూపమున విష్ణువు దిగివచ్చిన మఱియొక అవతారము. గీతాచరమశ్లోకమున కృష్ణుడు ఇతరములెల్ల మాని తన్ను శరణుజొచ్చిన తాను సర్వపాపమోక్షణము గావింతుననెనుగదా. రాముడును అట్లే, అంతకన్నను గట్టిగా— 'సకృదేవ ప్రసన్నాయ తవాస్మీతి చ యాచతే। అభయం సర్వభూతేభ్యో దదామ్యేత ద్వ్రతం మమ॥' అని 'నేను నీవాడను అని ఒక్కమాత్రే యాచించిన ప్రపన్నునికి, అనగా నన్నాశ్రయించినవానికి సకలభూతములవలనను అభయమొసంగెదను. ఇది నా వ్రతము' అని నొక్కి వక్కాణించెను. దానిని నమ్ముకొని మనుష్యుడు ఏ దిగులును లేక ప్రశాంతముగా జీవయాత్ర గడపుకొనవచ్చునుగదా. ఇందువలననే వైష్ణవ భక్తుడు రామాయణమును శరణాగతిశాస్త్రముగా ఎంచుకొనును. రాము డన్ననో రూపుగొన్న ధర్మము, 'రామో విగ్రహవాన్ ధర్మః'. రాముని తమ్ముడు లక్ష్మణుడు రామునికి సర్వకాల సర్వావస్థల కింకరుడు; ప్రతిఫలము కోరక దొరయానందమే తనయానందముగా తలచి చేయు శ్రీవైష్ణవభగవత్ కైంకర్యమునకు సాటిలేని లక్ష్యము. రావణుని తమ్ముడు విభీషణుడు తనవానిని తనవారిని, అనగా ఐహికమగు అన్ని తగులములను విడిచిపెట్టి, దానివలన కలుగతగిన నిందలను బాధలను సరకుసేయక, ఓర్చుకొని భగవదేకప్రపన్నుడగుటకు ఏకోదాహరణము. హనుమంతుడు రామదాసుడు, తాను చేయు దాస్యమునకు అట్లు తన్ను చేయనిచ్చుటే మహాప్రసాదమని తలంచువాడు. సీత మేనుదాల్చిన క్షమ, తన్ను పీడించినవారినైనను 'లోకాన తప్పు చేయనివారెవరు'—'న కశ్చి న్నాపరాధ్యతి'— అని మన్నించి కాపాడునది, దేవదయారూపిణి, పాపము చేసియు పశ్చాత్తప్తుడగువానియెడ అతివత్సల, దేవునికి సిఫారసుచేయు ఉదారురాలు. శ్రీవైష్ణవగురుపరంపరలో 'లక్ష్మీనాథ సమారమ్భాం' అని ఆమెది తొలిపేరు. ఇట్లు సమస్తమును పరిశీలింపగా రామాయణము సత్యసౌశీల్యసౌందర్యరాశియై పరమపదము నుండి దిగిన చక్రవర్తి అను అదుపుతోడనే స్నేహముతో చిత్తమును బందిగొను అందముతోడి రాముని శరణాగతరక్షణదీక్షాగ్రంథము, వైష్ణవ-ఆళ్వార్లకు మైమఱపు కలిగించినట్టిది.

మహాభారత రామాయణములు వేదోపబృంహణములలో చెప్పిన ఇతిహాసములు. అంగములకైన పురాణములలో విష్ణుపురాణమును భాగవతమును మిక్కిలి ప్రసిద్ధములు. విష్ణుపురాణమును వైష్ణవులు పురాణరత్నమని ప్రబలప్రమాణముగా మన్నింతురు. అందు విష్ణుని యవతారములెల్ల, విశేషముగా కృష్ణచరితము, సమగ్రముగా వర్ణింపబడినది. అందే కలదు ప్రసిద్ధమగు బాలభక్తప్రహ్లాదచరితము. అతడు తన హరిభక్తికై కన్నతండ్రివలన ఓర్వరాని యాతనలు అనుభవించినవాడుగదా. అతడు వైష్ణవభక్తులకెల్ల గుఱి. 'ఇందు గలడందు లేడని సందేహము వలదు, చక్రి సర్వోపగతుండు' అని శాంతముగా ఎత్తిఁగినవాడు. అట్లని తన్ను అదలించి నొప్పించుచున్న నాయనతో తనకంటియెదుట తోచుచున్న సత్యమును ధీరముగా పలికినవాడు. ప్రహ్లాదుడు

వైష్ణవమతసారమగు మనుష్యుని మంచినడువడిని ఇట్లు చెప్పినాడు. ''పరోపకారపరతకును, పరనిందావమత్యసత్యములవిముఖతకును, పరదారధనాదుల కోరమికిని, జనులయెడ అద్వేషమునకును కేశవుడు కరము సంతోషించును''— అని. రాగద్వేషములును ఈర్ష్యాసూయలును గాఢమైన దేవునియందలి ప్రేమచే తప్ప మఱి దేనిచేనైనను తుడిచివేయను శక్యముగాదు. శ్రీకృష్ణుని శిశుయువచేష్టలన్నియు ఈ పురాణమున చెప్పబడినవి. వానిని వైష్ణవులు దివ్యలీలలు అని తలంతురు.

భాగవతపురాణము ఎల్లతెగల వైష్ణవులకును, ముఖ్యముగా మాధ్వచైతన్యసంప్రదాయములవారికి, మిక్కిలి ప్రధానమైనది. ఇందును కృష్ణుని బాల్యలీలలు చెప్పబడినవి. మఱిక్రొత్త విశేష మే మనగా, కృష్ణజీవితమున గోపికలు గొను ఎక్కువ పాలు. గోపికాప్రేమ తనకు సమాభ్యధికములు లేని గాఢతగలది, ఎల్లవారికి గుఱియైనది. ఆస్తికులగు వైష్ణవులు ''గోపికలు పూర్వయుగములలో దేవుని సౌందర్యమునకు సొక్కి అతనిని వల్లభునిగా కౌగిలించి అనుభవించి తనియగోరిన ఋషుల అవతార''మని నమ్ముదురు. తైత్తిరీయమున దేవుడు 'రసో వై సః' 'ఆనన్దో బ్రహ్మ' అని చెప్పబడినాడు. కావున దేవుడు ఊరక ధ్యానమాత్రవిషయమగుట అ దేపాటి? అతడు అనుభవించి ఆస్వాదింపవలసినవాడు. భాగవతమున ఇది ప్రధానభావముగా క్రొత్తగా అగపడుచున్నది. ఇది భక్తికి ఒక క్రొత్త వన్నెయు వాసియు కలిగించును. భగవంతుడు భువనైకసుందరుడు, జీవునియందు ప్రేమను పొంగించి ఆతని ఎప్పుడు కలయుదునా అని ఉవ్విళులూరించును. దీనినే మధురభావము అందురు, దీనిచే వైష్ణవభక్తుడు ఆళ్వారు తన పరమభక్తిచే అనిర్వచనీయమగు ప్రేమపారవశ్యమున ఓలలాడును. ఇట్లు ఈ భాగవత మార్గము రసాస్వాదమార్గము.

ఇట్లు వేదమునం బుట్టి ఇతిహాసముల పెరిగి పురాణముల పెంపారిన భక్తి మహాతత్త్వమై శాస్త్రములకు ఎక్కగా, అన్ని శాస్త్రముల వలె అదియు నారద శాండిల్యాది మహర్షులచే సూత్రీకరింపబడినది. నారదభక్తిసూత్రములును శాండిల్యభక్తిసూత్రములును భాగవతమున పుట్టినవని తలంపనగును. అట్లేగదా వారి భక్తిలక్షణము—ఈశ్వరునియందు ఉత్కటమగు అనురక్తి భక్తి—'పరానురక్తి రీశ్వరే.' ఎవడు దేవునియందు పరరక్తిచెందునో, అతడు మఱి యన్నింటివలననువిరక్తిచెందును. 'పరమాత్మనియోర క్తః విరక్తః అపరమాత్మని'. ఇతరముమాత్రమే కాదు, తనకు తానే అక్కఱలేదు, ఒక్కపరమాత్మయే అక్కఱ. దీనిచే భగవద్భాగవతులయందు అనురాగము గలిగి, వారికి ఆత్మను అర్పణచేసి, వారిసేవలో తాను సంతోషముతో ఈ దేహమును అఱుగదీయుటకు ప్రేరితుడు అగును. మాధవభక్తి తత్సకలసృష్టియందును భక్తిగా పరిణతిచెందును; మాధవసేవగా రూపొందును. అట్లే రామానుజాచార్యులవారి శ్రీవైష్ణవమున భాగవతుల ప్రేమించి గౌరవించి సేవించుట భగవత్సేవ కంటెను ఉత్కృష్టావహము. భాగవతాపచారము నిజముగా భగవదపచారము; కాదా, అంతకంటెను పాపీయము.

శ్రీవైష్ణవులు రామానుజసంప్రదాయస్థులు పాంచరాత్రాగమమును గొప్ప ప్రమాణముగా స్వీకరింతురు. 'ప్రవక్తాఛన్దసాం వక్తా పాంచరాత్రస్య యః స్వయమ్' అని భగవంతుడు ఛంద

స్సులకు 'ప్రవక్త', వివరించినవాడుమాత్రమే; పాంచరాత్రాగమమునకన్ననో తానే వక్త—అసలు పలికినవాడు. పెక్కండ్రు ఆచార్యులు ఆది శంకరులుకూడ ఆగమమును అవైదికమని ప్రమాణములలో చేర్పరైరి. శ్రీవైష్ణవమున దానికి ప్రబల ప్రామాణ్యము అంగీకరింపబడినది. యామునాచార్యులవారు రామానుజప్రాచార్యులు ఆగమప్రామాణ్యమను గ్రంథమును రచించి ఆ ప్రామాణ్యమును నెలకొల్పిరి. తరువాత వేదాంతదేశికులు పాంచరాత్రరక్ష అను గ్రంథమును అందులకే రచించిరి. పాంచరాత్రాగమము విష్ణుని అర్చను గూర్చినది, విగ్రహనిర్మాణము, దానికి దేవళము, అందలి పూజావిధానము మొదలైనదానిని గూర్చిన శాస్త్రము. పరరూపమున దేవుడు మూర్తముగాక అందరాకయుండగా, అందుండి వ్యూహములు నాలుగు వెలువడినవి. అటు తర్వాత అందుండి అవతారములు దిగినవి. వాని యద్భుతచరిత వైభవముంబట్టి వానికి దేవుని విభవమని పేరు కలిగెను. ఆపర దేవత జీవుల యాత్మలో పదముగొనుట అంతర్యామిత అని పేర్గాంచెను. వీనిని వేనినిగాని అందుకొన లేనివారికి కైంకర్యజీవనులగు భక్తులకు ఒదవి తృప్తికలిగించుటకు దేవుడు తన అతి సౌలభ్యముచే అర్చారూపముగొనెను. ఆళ్వారులును ఆచార్యులును వైష్ణవుల యెల్లతెగల దేశికులును పుణ్యక్షేత్రములలో దేవళములలో, ఇంటి మందసములలో అర్చలపూజను మిక్కిలి ఊని చెప్పినారు. పాంచరాత్రాగమమున దేవళములు కట్టుటకైన శాస్త్రము, ఆరాధనకువలయు సామగ్రి, పూజల ఆచార వ్యవహారములు, పెక్కు తత్త్వవిషయములు ఇంకను ఏమేమోకలదు. పాంచరాత్రాగమమున కొన్ని ప్రధానగ్రంథములు అహిర్బుధ్న్యసంహిత, జయాఖ్యసంహిత మొదలగునవి.

ద్రవిడదేశపు మునులను ఆళ్వారు లందురు. వారు దేవునిభక్తిలోమునిగి ఆమత్తెక్కినవారు. వారు తమ హార్దమగు భక్తి కలుజుతెగి పాఱినట్లుగా మధురమైన దేవుని పాటలుపాడినారు. వానినెల్ల నాథముని అను శ్రీవైష్ణవాచార్యుడొకడు సేకరించి నాలాయిర దివ్యప్రబంధముగాకూర్చి వానిని దేవళమున పూజాసమయమున వేదముతో సమానముగా పాడవలసినదని నియమము చేసెను. అది పెద్ద విషయము. ఏలన వానికి వేదముతో సామ్యము చెల్లునా అని అడుగదగును. శ్రీవైష్ణవులలో తెంగలై అను ఒక తెగవారు అవి ప్రామాణ్యమునను పవిత్రతయందును నాలుగువేలును నాలుగువేదములకును ఇంచుకయు తక్కువగాక సమానము అని అంగీకరించిరి. నమ్మాళ్వారు పాడిన తిరువిరుత్తము ఋగ్వేదమునకును, తిరువాయిమొఴి సామవేదమునకును, తిరువాశిరియము యజుర్వేదమునకును, పెరియతిరువందాది అథర్వవేదమునకును ప్రతి అని గ్రహించిరి. వేదాంతదేశికులవారు ప్రధానాచార్యులైన 'వడగలై' తెగవారు అంతదూరము ఒప్పుకొనకున్నను వారును నాలాయిరప్రబంధములను మిక్కిలి గౌరవించువారే. కావుననే ఆళ్వారుల యీ పాటలు శ్రీవైష్ణవుల ప్రమాణమగు వేదశాస్త్రములలో ప్రాధాన్యము చెందినవి. మఱి వైష్ణవాచార్యులన్ననో మహాపండితులు తత్త్వజ్ఞులు. యామునాచార్యులు రచించిన సిద్ధిత్రయమును, గీతార్థసంగ్రహమును శ్రీవైష్ణవులకు గొప్ప ప్రమాణగ్రంథములు. తమ గీతార్థసంగ్రహమున గీతలో

తొలి ఆఱు అధ్యాయములు తత్త్వమును, రెండవ ఆఱు అధ్యాయములు హితమును, మూడవ ఆఱు అధ్యాయములు పురుషార్థమును ప్రతిపాదించునని వివరించెను.

ఈ సందర్భమునుండి రామానుజాచార్యుల వారి మతమును, తత్త్వమును వెలువడినవి. ఆయనకు రెండు సంప్రదాయములు దిగివచ్చినవి. ఒకటి గీర్వాణవేదములది, మఱియొకటి ఆళ్వారుల అఱవప్రబంధములది. ఆయన రెంటిని సరిగా అవిరుద్ధముగా అనుకూలముగా కలిపి, విశేషముగా ప్రబంధము స్త్రీశూద్రాధికారమును అగుటంబట్టి దానిద్వారమున ఉపనిషత్తుల తత్త్వోపదేశమువెల్ల సామాన్యజనమునకు సులువుగా అందించి, వారి మనసులు కరగించి, అట్లు మతమును లోకాన మిక్కిలి పర్వింపవచ్చునని తలంచెను. ఆయనవలన శ్రీవైష్ణవము మహాజనమతమాయెను. రామానుజుల వారు ఇట్లు (గీర్వాణ, ద్రావిడ) ఉభయవేదాంత ప్రవర్తక బిరుదమును ప్రసిద్ధిని కాంచెను.

రామానుజాచార్యులు ప్రతిపాదించిన 'భక్తిరూపాపన్నజ్ఞానము', జ్ఞానముయొక్క భక్తిరూపపరిణామము ఆయనకు ఆళ్వారుల వలన సంక్రమించినది కాబోలు. ఆయన ఉపదేశించిన భగవత్ప్రీమ తాను ధ్యానోపాసన భక్తులను పర్యాయపదములుగా గొనుటచేత జ్ఞానమున పుట్టవలసినదని తేలినది. శ్రీభాష్య మంగళశ్లోకమున 'శ్రుతి శిరసి విదీప్తే బ్రహ్మణి శ్రీనివాసే భవతు మమ పరస్మిఞ్ఛేముషీ భక్తిరూపా' అని తాను అట్లే ప్రార్థించినాడు. శ్రీభాష్యముననేకాదు, రామానుజాచార్యులు తన వేదాంతసార వేదార్థసంగ్రహములందును ఈ భావమును ప్రతిపాదించినాడు. భక్త్యావేశపూరితమయిన గద్యత్రయమున తనకును దేవునికిని జరిగిన సంవాదరూపమున ఉన్నదాని యందు తన హార్దభావములను కుమ్మరించినాడు.

తన గీతాభాష్యమునను వార్తామాలలోను రామానుజాచార్యులు శ్రీవైష్ణవలక్షణమును విద్యా ధన ఆభిజాత్య మదములను వీడుట అని నిర్వచించెను. అట్లే జీవుడు జ్ఞానము ఆనందము కలిగియుండుటయే కాక, ఆకించన్యము—అయ్యో, స్వామీ నాకు మఱేమియు గతి ఉపాయము లేదు, నేను నీకు శేషుడను అను భావము—కలిగియుండవలయును. ఈ శేషత్వము రామానుజతత్త్వప్రపంచమున మిక్కిలియు ముఖ్యము, ఆయన రచించిన యెల్ల గ్రంథములయందును ఎత్తిచూపబడినది. కావున రామానుజులవారి రచలనన్నియు మోక్షమునకు మానరానివి అని ఎల్ల శ్రీవైష్ణవులును తలదాల్తురు.

ఆయనకు తరువాతి ఆచార్యులలో ఎన్నికగన్న మిక్కిలి గొప్పవాడు వేదాంతదేశికులు. ఆయన గొప్పపండితుడు, వైయాకరణుడు, కవి తార్కికసింహము, నాటకకర్తయు. ఆయన యందును రామానుజులవారియందువలెనే జ్ఞానమును, భక్తియు ఒకమూసలో కలసి కరగినట్లు కలసిపోయినవి. తాను తనపుడిపాండిత్యమున అలసిపోగా ఆళ్వారుల తియ్యని పాటలకు మరలి అందు ఆత్మకు వలయు హాయిని పొందినాను అని చెప్పెను. వేదాంతదేశికులు వడగలై శ్రీవైష్ణవులకు ప్రధానాచార్యుడు. మోక్షమునకు మర్కటకిశోరన్యాయమున జీవుడు తాను భగవంతుని అరసి పట్టుకొనుటే ఉపాయము కాని మార్జారకిశోరన్యాయమున తన్ను భగ

వంతుడే అరసి పట్టుకొనుట కాదు అని ఆయన యభిప్రాయము.

ఆయనకు సమసమీపకాలముల వయసున ఇంచుక పిన్నలై ఇరువురు గొప్ప తెంగలై ఆచార్యులు పిళ్లైలోకాచార్యులును, మణవాళ మహామునులును వెలసిరి. లోకాచార్యులు తాను గీర్వాణమున ఒక్కటియు వ్రాయను అని ప్రతినపూని, మణిప్రవాళమెన—ము తెములు, పగడములు కలిపి కూర్చినట్టిదైన అఱవము, సంస్కృతము కలసినదైన భాషలో పదునెనిమిది రహస్యములు అనుగ్రహించెను. ఆయన గొప్పతత్త్వవేత్త, దేనినైనను విశదముగా ఆకళింపుకొని సుబోధముగా చెప్ప నేర్చును. రామానుజులవారి చిదచిదీశ్వరములను మూడు తత్త్వములను తన తత్త్వత్రయ మను గ్రంథమున నిపుణముగా వ్యాఖ్యానించెను. భక్తిప్రపత్తుల విషయమున ఆయన ప్రకటించిన ఉదాత్తత, ఔదార్యము ఆ కాలమున అసితిరసులభము. ఆయన ఇతర ప్రధాన రచనలు శ్రీవచనభూషణమును, ముముక్షుప్పడియు, ఆయన తమ్ముడు అళహియ మణవాళ పెరుమాళ్ నయనార్ అను ఆయన ఆచార్యహృదయమను గ్రంథమున ఆళ్వారులయు ఆచార్యులయు, విశేషముగా నమ్మాళ్వారులయు హృదయమును అనగా హృద్గతభావమును దివ్యముగా విప్పిచెప్పెను. తెంగలై సంప్రదాయమున భగవత్కృప అనుగ్రహము నిర్హేతుకము, తనంతట కలుగునది, జీవుని ప్రయత్నమున సిద్ధించునది కాదు, అదే పూర్వోక్తమగు మార్జారకిశోరన్యాయము.

లోకాచార్యుల భావోదాత్తతౌదార్యములు విశదవాక్ శిఖామణి అని ప్రసిద్ధిగన్న ఆయన శిష్యుడును ఆగ్రంథముల వ్యాఖ్యాతయు అగు మణవాళమహామునులకును కలదు. వీరిదువు రునువారి అనుయాయులును ప్రపత్తిమార్గమును మిక్కిలి విరివిగా వ్యాఖ్యానించి భక్తిసామ్రాజ్యమున "గొప్ప" "కీత" భేదముగాని పండిత పామరభేదముగాని లేదనియు పరమపదప్రవేశమునకు వలసినది నిరహంకారమును నిర్మమమును అకించనతా పూర్ణమును భగవత్ప్రేమ నిబిడమును భూతదయాఘనమునగు నిర్మల హృదయ మొక్కటే అనియు ఎల్లరచిత్తముల కెక్కునట్లు ఉపదేశించిరి.

ఇకను వంగ మహారాష్ట్ర కర్ణాటక దేశము లందు వైష్ణవభక్తులు పెల్లుగా పాడినారే, అందలి వైష్ణవము ఎట్టిదో చూతము. వంగదేశపు వైష్ణవమునకును తక్కిన తెగలవైష్ణవమునకును సామ్యము ఎక్కువగానే యున్నను, అందు మరెందును లేని విశేషము కృష్ణునికి రాధ వల్లభయగుట. భాగవతపురాణమున ఆమె లేదు; నారదశాండిల్య భక్తిసూత్రముల లోను లేదు, ఆమెను మాధ్వులు తలంపరు, మరాఠులును తలంపరు. మఱి నింబార్కులును చైతన్యులును వల్లభులును ఆమెను అంగీకరించి కృష్ణుని నిత్యవల్లభగా అభివర్ణింతురు. రాధ యనగా హృదయబృందావనమున కాంతుని కృష్ణుని వెదకిపట్టి కలయగోరు జీవాత్మ. ఈ భావముంబట్టి అతి మధురమైన పాటలు జయదేవకవి గీతగోవిందమువంటివి పుట్టినవి, భగవంతుని కోసము జీవుని యొక్క భావము కలగిపోని భక్తితోడి అతిస్నేహప్రేమలు అట్టివాని లోని విషయము. చైతన్యచరితామృతమును విద్యాపతి చండీదాసుల పాటలును ఈ తెగలో మిక్కిలి ప్రచారముగన్నవి. శాహూరు రవీంద్ర

నాథుడును వారి మహిమకు లోగినవాడే. మరాటిభక్తులు ఒడలు తెలిసిన వినీతులు. వారు రుక్మిణిని కృష్ణవల్లభగా పూజింతురు. రాధ యొక్క హద్దుమీఱిన చాపల్యపు రాగము వీరి మనసుకు రాలేదు; మఱి ఇంత మచ్చిక పడిన రుక్మిణి స్వీయారాగము వీరికి నచ్చినది. ఈ మార్గమున జ్ఞానేశ్వరముని గీతపై జ్ఞానేశ్వరి అను మిక్కిలి సరసమగు వ్యాఖ్యానము రచించెను. ముక్తాబాయి, నామదేవుడు ఏకనాథుడు తుకారాముడును దరులు పొరలని యేటి శాంత గంభీర ప్రవాహముబోలిన భక్తి భావముతో ఘనమగు 'అభంగములు' పాడిరి. వారిభక్తియు నడువడియు వర్ణాశ్రమ సేతువుల త్రెంచుకొన్న మిక్కిలి కలుపుగోలుతనము గలవి. ఇది జ్ఞానదేవుని సూక్తి — 'దేవునికి గొప్ప కీత భేదములేదు; అందఱు సమానులే. గంగ ఎట్టివారు మునిగినను అపవిత్రముగాదు, గాలి ఎట్టివారు పీల్చినను దూషితముగాదు, నేల ఎట్టివారు నడచినను మైలపడదు.' అని.

కబీరుని వైష్ణవము మరాటిభక్తుల వైష్ణవమునకన్నను నిర్బంధములు లేనిది, ఔదార్య శోభితము, సర్వజనగ్రాహకము, హిందూ ముస్లిము భేదమును పాటింపనిది అల్లాను రాముని సమానముగా పూజించునది. కబీరు అంతఃశుద్ధి లేని ఉపవాసములు యాత్రలు పూజలు పురస్కారములు ఎందులకు?–అనును. అట్టివి కొఱగావు. సన్న్యాసము పనికిమాలినది. పస్తులకు ఎండినను స్తుతులకు అఱచినను ఆచారములకు కట్టువడినను పరమపదము దక్కదట. చిత్తము మలినపు తెరలు లేక పటికతునుకలవలె నిర్మలము గావలయునట.

తులసిదాసును వైష్ణవుడు రామభక్తుడు. అతని గ్రంథము రామచరిత మానసము. అతడు దేవుడు అంతర్యామియై ఎల్లచిత్తముల నెలకొని ఏలును అనుచు త్రికరణశుద్ధమగు భగవత్పాదభక్తిని కోరినాడు.

ఉదయపూరు రాణి మీరాబాయి ద్రావిడాళ్వారుల ఆండాళువలెను కర్ణాటకుల అక్కమహాదేవివలెను కృష్ణుని చరణసన్నిధి చేర తన పాటలలోనే పయనించెను. గాంధికి అతి ప్రియమైన పాట 'వైష్ణవజనతో తేనే కహియె' ఇత్యాది గుజరాతి భక్త నరసిమెహతాది.

కర్ణాటక హరిదాసుల పాటలతో ఈ వైష్ణవ గ్రంథ ప్రస్తావమును ముగింపదగును. వారి పాటలను కన్నడ ఉపనిషత్తులందురు. మాధ్వులకు ఈపాటలు గీర్వాణవేదములంత పవిత్రములు. ఈహరిదాసులలో అగ్రగణ్యులు పురందరదాసు కనకదాసు. వారిపాటలు మిక్కిలియు భగవత్ప్రేమ మధురములు. జీవితములోని యెగుడు దిగుడులకు ఒడుదుడుకులకు కలగకుండుటయు ప్రశాంతి కలిగియుండుటయు వినీతియు వారి పాటలబోధ. అన్నిజాతుల కర్ణాటకుల జీవితములును ఈ పాటలచే మధురమై ఉదాత్తత చెందినవే.

ఇట్లు వేదశాస్త్రగీత స్తోత్రాది సకలవైష్ణవ మతగ్రంథములును దేవుని మనుష్యుని స్మృతికి తెచ్చి, భగవద్భక్తి లేపి, ఐహిక రసహీన జీవితగర్తమునుండి దివ్యోన్నతికి ఆతనిని ఎగిరించి, తన ఆత్మ పరమాత్మకు నిలయముకాగా తాను దేవుని 'నడ దేవళమును' ప్రియవాహనమును అను తలపులు కలిగించి ఉదాత్తము సేయును. ఇంతకన్న మఱి కోరదగినది ఉండునా?

# శైవ వాఙ్మయము

శ్రీ ఎన్. వి. డి. శర్మగారు

మానవునికిని, ఆ మానవుని సృజించిన పరమాత్మునికిని గల సంబంధమును తెలియఁజేసి, సర్వసృష్టియును తానై, సర్వసృష్టియందును వ్యాపించియున్న ఆ పరమాత్మతత్త్వము నరయుటకు సాధనములైనవియే మతసిద్ధాంతములు. అవి యా యా దేశకాలవర్తమానములను బట్టి వేర్వేఱుగా నున్నను, పరమాత్ముని అస్తిత్వమును తేటతెల్లముగ చాటుచున్నవి. భారతదేశమునందును అందును విశేషముగ దక్షిణభారతమున వ్యాపించి, భారతీయుల జీవితమును పునీతమొనరించియున్న మతసంప్రదాయములందు శైవసాంప్రదాయము చాల పురాతనమైనది. భారతీయులే కాక, భారతీయ మతసిద్ధాంతములను అవలోడన మొనరించిన సజ్జాన్మార్షలు మొదలగు పాశ్చాత్యపండితులును, రెవరెండ్ డాక్టర్ పో! మున్నగు క్రీస్తుమతప్రవక్తలును ఈ విషయమున ఏకీభవించియున్నా రనుట నిస్సందేహము.

సనాతనమతసంప్రదాయములందు శైవసంప్రదాయము అతిప్రాచీనమైనది. దాని ప్రారంభదశనుగూర్చి ఇదమిత్థ మని చెప్పుటకు సాధ్యము గాదు. పరమశివుని ఆధిక్యమును వ్యక్తపఱచు మతము శైవ మనబడుచున్నది. శివ మనగా సుందరము, ఆనందము, మంగళ మనియు నర్థములు. అదియే పరమాత్మ తత్త్వము. శివమునకు సంబంధించి, ఆ శివమునందు పునర్జన్మరహితమైన ముక్తి నొందు మార్గమును వ్యక్తపఱచునదియే శైవము, శైవసిద్ధాంతము. ఇది హిందూమతశాఖలైన షణ్మతములలో ప్రధానమైయున్నది. ఇందు పరమాత్మను శక్తి, గణపతి, స్కంధస్వరూపునిగా ఆరాధించు తత్త్వము ఇమిడియున్నది. మతములన్నిటికిని వేదములే ప్రమాణగ్రంథములు. అట్టి వేదములును, ఆ వేదములలోని జ్ఞానకాండయు, శివాగమములును ఈ శైవసిద్ధాంతములకు పరమప్రమాణములు. పరమశివుడే వీని ప్రవక్త యని శైవుల దృఢవిశ్వాసము.

ఆగమ మనగా మలమును క్షాళన మొనర్చి మోక్షమార్గమును జూపునది యని యర్థము. ఇతరాగమములకును శివాగమములకును గల భేదమును వ్యక్తపఱచుటకొఱకు వీనిని దివ్యాగమము లందురు. ప్రధానములైన దివ్యాగమములు ఇరువదియెనిమిది గలవు. ఈ ఆగమములనుబట్టి పరమశివుడే తనపంచముఖములనుండి వీనిని బహిర్గత మొనర్చియున్నట్లు తెలియుచున్నది. కామికాగమము వీనియందు మొదటిది. పరాగమము కడపటిది. వీనికాలము వేదములకును పురాణములకును మధ్యకాల మని విమర్శకులు ఊహించియున్నారు. పురాణకాలమునకు పూర్వము వెలసిన గ్రంథములందును, రామాయణ, భాగవతములందును, మానవధర్మశాస్త్రమందును ఈ శివాగమములను గూర్చిన ప్రసక్తి కాననగును. అనగా వీని కాలము క్రీస్తుపుట్టక పూర్వము దాదాపు 1000 సంవత్సరము లని తెలుచున్నది.

ఈ యిరువదియెనిమిది శివాగమములకును 207 ఉపాగమము లున్నవి. వానియందు కొన్ని కోట్ల శ్లోకము లుండెడివి. కాని వానిలో నిప్పటికి మిగిలియున్నవి కొన్నిమాత్రమే. కొన్ని శతాబ్దులకు పూర్వము ఆగమాచార్యులు కొందఱు ఆగమసాగరమును మథించి, వాని తత్త్వామృతమును గ్రహించి, దానిని గ్రంథస్థముచేసియున్నారు. ఆ తత్త్వములనే శైవ పద్ధతు లందురు. ఈ పద్ధతులను శివాలయము లందు శివార్చకులు పాడుచుందురు.

వేదవిరుద్ధములైన ఆగమములను శైవ సిద్ధాంత మంగీకరింపదు. తిరుమూలరును, నీలకంఠశివాచార్యులును 'వేదములు సర్వమానవాధ్యాత్మికవికాసమునకును, శివాగమములు ఆ యాధ్యాత్మికపథమును కొంత సాధించిన మానవులకును తోడ్పడుచున్న' వని వ్యక్తీకరించియున్నారు. తమిళకవి యొకడు వేదము ప్రణవక్షేత్రమందలి వృక్షమనియు, శైవసిద్ధాంతము దాని మధురాతిమధురమైన ఫలమనియు కీర్తించియున్నాడు. మఱియొకకవి వేదముల నొకగోవుతోడను, శైవసిద్ధాంతమును ఆ గోవు క్షీరముతోడను పోల్చియున్నాడు. అందువలననే శైవము వైదికశైవమనియు, ఆగమాంతమనియు, సిద్ధాంతమనియు, వేదాగమోక్త శైవసిద్ధాంతమనియు ప్రసిద్ధికెక్కినది.

ఉత్తరభారతమున వ్యాప్తిలోనున్న కాశ్మీర శైవము, కర్ణాటకదేశమున ప్రబలియుండిన వీరశైవము, దక్షిణాదిని వ్యాపించియున్న ఆదిశైవము—ఇవి యన్నియు శివాగమములను ప్రమాణగ్రంథములుగనే అంగీకరించుచున్నవి.

శివసాయుజ్యమునందుటకు గల నాలుగు ముక్తిమార్గములను గుఱించియు శివాగమములు వివరించుచున్నవి. ఆ మార్గములు జ్ఞాన క్రియా యోగ చర్యలను పేర నొప్పుచున్నవి— (1) జ్ఞానపాదమునందు పతి, పశు, పాశము (దేవుడు, జీవులు, మలము) అను మూడింటికిని గల పరస్పరసంబంధము, ఆత్మపారిశుద్ధ్యము నందుటకు గల క్రమపద్ధతులును, పరాత్పరునితో నైక్యమందు పరిణామము మొదలగు విషయములు వివరింపబడియున్నవి. (2) క్రియాపాదమునందు దేవాలయములందును, వ్యక్తిగతపూజలందును లోకసంగ్రహణార్థమై యుపయోగింపబడు పూజావిధానమునందలి మంత్రములు, భావనలు, క్రియలు మొదలగు వానిని గూర్చియు, పండుగలను గూర్చియు, వాని అంతరార్థమును గూర్చియు తెలుపబడియున్నది. (3) యోగపాదమునందు ప్రాణాయామవిధానము, ఆత్మశుద్ధి, అంతర్యాగము మున్నగు విషయములు విపులీకరింపబడియున్నవి. (4) చర్యాపాదమునందు చిత్తనైర్మల్యము నిచ్చు పూజాపరికరములన్నియు విశదీకరింపబడియున్నవి. శైవాగమములు దేవాలయనిర్మాణప్రతిష్ఠావిధానములను విధించుచున్నవి.

శైవవాఙ్మయములోని గ్రంథము లన్నియు తిరుముఱలు సిద్ధాంతశాస్త్రములు అని రెండు తెగలుగా విభజింపబడియున్నవి. తిరుముఱలనునవి పండ్రెండు. సిద్ధాంతశాస్త్రములు పదునాలుగు. తిరుముఱ లనునవి శివునిగుణసంకీర్తనముచేయు కీర్తనలు. అవి మొత్తము పదునెనిమిదివేలకు పైబడియున్నవి. శైవము యొక్క ధర్మతత్త్వములనుగూర్చి చెప్పునవియే సిద్ధాంతశాస్త్రము లనునవి. తిరుజ్ఞానసంబంధరు, తిరునావుక్కరసు, సుందరమూర్తినాయనారు, మాణిక్యవాచకరు అను దక్షిణాదశైవాచార్యులు మొదటి యెనిమిది తిరుముఱలకు కర్తలు. వారు పాడిన కీర్తనలలో మనకిప్పుడు

మిగిలియున్నవి 8,908 మాత్రమే. మొదటి ముగ్గురు కృతులకును తేవార మనియు, మాణిక్యవాచకరు పాడిన కీర్తనలకు తిరువాచక మనియు పేళ్లు.

మాణిక్యవాచకరుకాలము క్రీ. శ. 3 వ శతాబ్ది. తిరుజ్ఞానసంబంధరు, తిరునావుక్కరశు లిద్దఱు 7 వ శతాబ్దికి చెందినవారు. సుందర మూర్తినాయనారు 9 వ శతాబ్దివాడు. శైవ బౌద్ధ జైనమతములకు తఱచుగా పరస్పరవాగ్యుద్ధములు జరుగుచుండెడి వని ఈ ఆచార్యుల జీవితచరిత్రలనుబట్టియు, వీరిగ్రంథములనుబట్టియు మనకు తెలియనగును. ఈ ఆచార్యు లొనరించిన కృషికి ఫలితముగనే శైవము తమిళ దేశమున తనపూర్వస్థానము నంద గలిగినది.

ఈ మహాభక్తులు తమకృతులలో పరబ్రహ్మమును సగుణముగాను నిర్గుణముగాను ఆరాధించి ముక్తిని బొంద వచ్చు నని తెలిపియున్నారు. భగవంతుడు బ్రహ్మాండముల సృష్టిస్థితిలయములకు కర్త యనియు, సర్వోత్కృష్టుడనియు తమ స్వానుభూతితో ప్రమాణపూర్వకముగా వక్కాణించియున్నారు. ఆత్మసాక్షాత్కారమునకు ఆటంకమైన కర్మపాశమునుండి విడివడి మానవుడు జీవన్ముక్తుడగుటకు పరమాత్ముని సేవించుటయే ముఖ్యము. ప్రకృతియే పరమాత్ముని శరీరము. దాని శక్తిసౌందర్యములు అతనికి చెందినవే. ఈ జీవయాత్రలో స్త్రీలు, పురుషులకు సహధర్మచారిణులుగా నుండి సాయపడుచుందురు గావున వారు పురుషుల కెంతమాత్రమును తీసిపోరు.

నిత్యసత్యవ్రతము, స్వార్థరహితమైనప్రేమ- ధార్మికజీవనమునకు అత్యంతావశ్యకములు. చిత్తనైర్మల్యము, శీలపారిశుద్ధ్యము, అచంచలభక్తి అనునవియే మానవుని గౌరవార్హతను గీటురాళ్లు. శివభక్తులై, పంచాక్షరీమంత్ర పఠన మొనరించినచో అస్పృశ్యతాదోషము నివారింపబడగలదు. సమస్తలోకములందును గల సమస్తప్రాణికోటికిని శివపరమాత్మయే అధిపతి. సంస్కృత తమిళములు రెండును మానవునికి రెండుకన్నులవంటివి. రెండును సమానగౌరవార్హములే. రెండును అత్యవసరములే.

శేక్కిళరు అను శివభక్తుడు ఒకప్పుడు చోళచక్రవర్తికి ప్రధానమంత్రిగా నుండెను. ఆయన వ్రాసిన శివభక్తచరితమే తిరుత్తొండ పురాణ మనబడుచున్నది.

శైవమతమునకు నలుగురు ఆచార్యపురుషు లుండుట మనకు విచిత్రముగా తోపవచ్చును. ప్రతి ఆచార్యపురుషుని జీవితచరిత్రమును పైన చెప్పబడిన కార్య క్రియా యోగ జ్ఞానము లనెడి నాలుగు పద్ధతులకును తార్కాణము లగుచుండుటయే అందుకు కారణము. తత్త్వాన్వేషకుడైన భక్తుడు ఈ పద్ధతులలో మొదటిదైన కార్యపద్ధతియందు పరమాత్మను సేవ్యభావముతోను, రెండవదైన క్రియాపద్ధతియందు పితృభావముతోను, మూడవదైన యోగపద్ధతియందు మిత్రభావముతోను, కడపటిదైన జ్ఞానపద్ధతియందు కాముకభావముతోను కొలుచుచున్నాడు. ఆస్తికమతము లన్నియు నీపైన చెప్పబడిన నాలుగుపద్ధతులలో నేదే నొక పద్ధతికి చెందిన మార్గమునే యనుసరించుచున్నవి.

తమిళదేశచరిత్రలో నేర్పడిన క్లిష్టపరిస్థితులలో తేవారకర్తలైన ముగ్గురు ఆచార్యపురుషులును అవతరించియున్నారు. వైదికసాంప్రదాయములను త్రోసిరాజని మన దేశమున బౌద్ధ జైనాదిమతములు విజృంభించినవి. అవి వేద ధర్మములను దూషించుచు వేదధర్మములలో

నొకటియగు అహింసాధర్మమును మాత్రము గైకొని ప్రచార మొనర్చుచు ప్రజల నాకర్షింప సాగినవి. నాస్తికనిరీశ్వరవాదములు ప్రబలినవి. సామాన్యజనానీకము వేదధర్మరహస్యముల నెఱుగలేక బౌద్ధ జైనుల వాగురలలో దగు ల్కొనిరి. దేశమునందంతటను కర్మసిద్ధాంత మునకు అత్యంతప్రాముఖ్య మీయబడియుం డెను. సన్న్యసించినవారి యందును బూటకము ప్రబలియుండెను. సనాతన హిందువులుగా నిలి చినవారిలో పుట్టుకచే వచ్చిన వారి వారి వర్ణా శ్రమధర్మములందు మఱింత పట్టుదల హెచ్చి యుండెను. ఆర్య ద్రావిడ, సంస్కృత తమిళ వాదములు అప్పుడే సంఘమున ప్రవేశించియుం డెను. అట్టి క్లిష్టపరిస్థితులలో నీ ఆచార్యపురు షులు వెలసి, తమ ఆదర్శజీవితముల చేత జన సామాన్యముల నుద్ధరించి వారిని వైదికమార్గ మునకు త్రిప్పుట కెంతయో కృషి చేసిరి. వీరు దేశ మెల్లయెడలకును సంచారములు సాగిం చిరి. శివపరమాత్మను గూర్చి భక్త్యావేశముతో హృదయంగమముగా ననేకకీర్తనలను ఆశు వుగా పాడి, వీరు తమనాటి సంఘమును పునీత మొనర్చి తీర్చిదిద్దిరి.

ఈ శైవాచార్యులు మహిమాన్వితులై ఎన్నెన్నియో అద్భుతకార్యము లొనర్చినట్లు మనకు ప్రబలమైన గ్రంథస్థసాక్ష్యము లనేకము లున్నవి.

పైన పేర్కొనిన తిరుముఱలలో కొన్నిటి ప్రాశస్త్యమును గూర్చి కొంత చూతము. ఎనిమిదియవ తిరుముఱయగు తిరువాచకము శైవమతగ్రంథములలో తలమానికమువంటి దని తమిళదేశమున మిగుల ప్రసిద్ధి గన్నది. ప్రసిద్ధతత్త్వశాస్త్రవేత్తయు మనభారతప్రభు త్వాధ్యక్షుడు నగు శ్రీ డా॥ రాధాకృష్ణపండి తుడు "అజ్ఞానపాశమునుండి విడివడి జ్ఞానపథ మునకును, కామబంధమునుండి విడివడి భక్తి మార్గమునకును జీవుడు సాగించు ప్రయోగమును గూర్చి వర్ణించుచు ఆస్మవికాసమున కెంతయు తోడ్పడు గ్రంథరాజ" మని తిరు వాచకము నెంతయో ప్రశంసించియున్నారు.

మాణిక్యవాచకరు ఒకప్పుడు పాండ్యప్రభు వునకు ప్రధానమంత్రిగా నుండెను. ఇప్పు డాయన 'తిరుక్కోవైయారు' అను గ్రంథ మునుగూడ రచించియుండెను. అందు తమిళ కవితాసంప్రదాయము ననుసరించి అవస్థ కాముకీకాముకుల వివిధమనఃప్రవృత్తులను, అవస్థలను చిత్రించుచు, పరమాత్మానుసంధా నమునకై తహతహపడుచు జీవాత్మ సాగిం చు ప్రయాగమునుగూర్చి యెంతయో హృద యంగమముగా వివరించియున్నారు.

తిరుజ్ఞైప్పా, తిరుప్పళ్ళియెళుచ్చి అను గ్రంథ ములే తొమ్మిదియవ తిరుముఱ యనబడు చున్నవి. ఇది 10, 11 శతాబ్దులలో జీవించి యున్న తొమ్మండుగురు గ్రంథకర్తలు రచిం చిన మధురాతిమధురములైన గేయముల సంపుటి.

తిరుమూలరను సిద్ధుడు తిరుమంత్రమును రచించెను. అదియే పదియవ తిరుముఱ. అత డే కాలపువాడో ఇంకను సరిగా నిర్ణయింపబడ లేదు. అయినను అతడు 6 వ శతాబ్దికి ముం దున్నవా డని విమర్శకు లూహించియున్నారు. నవతంత్రములుగా విభజింపబడియున్న మూడు వేలపద్యములు గలిగి యీగ్రంథము మిక్కిలి ప్రాముఖ్యము నందినది. ఇది యొక ఆగమ గ్రంథము. ఇందు శైవసిద్ధాంతతత్త్వము లనే కము లున్నవి. మతసిద్ధాంతమునకు సంబంధిం చిన మంత్రములు, శైవధర్మానుష్ఠానమునందలి

ముద్రలు, వానియంతరార్థములు, యోగులయు సిద్ధులయు రహస్యానుభూతులు మున్నగు విషయములు ఇందు వివరింపబడియున్నవి. ఆధ్యాత్మిక, ధార్మికవిషయముల కిది యొక నిధివంటిది. ఈ సిద్ధుని జీవిత చరిత్ర తిరుత్తొండరు పురాణమున విపులముగా నీయబడినది.

పదునొకొండవ తిరుముఱై యనునది యొక కావ్యసంపుటి. ఇందు నలుబది పద్యకావ్యము లున్నవి. అవి పండ్రెండుగురు కవీశ్వరులచే వ్రాయబడినవి. వారు 10 వ శతాబ్దివఱకు జీవించియుండిరి. కారైక్కాల్ అమ్మైయారు అను యోగిని ఆ పండ్రెండుగురు కావ్యకర్తలలో చేరినదే. ఆమె జీవితచరిత్రనుగూర్చిన వివరములు శేక్కిళారు తనగ్రంథములో విపులీకరించియున్నాడు. అర్పుదతిరువందాది యనునది యామెగ్రంథము. అందు ఆధ్యాత్మికానుభూతికి సంబంధించిన యమూల్యవిషయము లెన్నియో గలవు.

పెరియపురాణ మని ప్రసిద్ధిగాంచిన 'తిరుత్తొండరు పురాణము' ఈ పండ్రెండు తిరుముఱైలలో కడపటిది. రెండవ కులోత్తుంగ చోళుడను చక్రవర్తి వేడికోలుపై శేక్కిళారు ఈ గ్రంథమును 12 వ శతాబ్దిలో వ్రాసియుండెను. ఇందు శివభక్తాగ్రేసరులైన అఱువదిమూవురు నాయనారుల జీవితచరిత్రములనుగూర్చియు, తొమ్మిదివర్గములకు చెందిన భక్తుల చరిత్రములనుగూర్చియు శేక్కిళారు 4,286 పాటలలో పాడియున్నాడు. ప్రధానమంత్రిగా నుండిన ఈ శేక్కిళారు విశేషముగా దేశసంచారము చేసి అప్పటికి ప్రచారములో నున్న పురాణేతిహాసములను, పూర్వగ్రంథములను, శాసనాదులను పరిశీలించుటకు తగిన అవకాశము గలిగియుండెను. క్రీ. శ. 4 వ శతాబ్దినుండి ఆఱు శతాబ్దులవఱకును గల తమిళదేశములోని ధార్మికేతిహాసిక చరిత్రనుగుఱించి యీ యమూల్యగ్రంథము విశదీకరించుచున్నది. ఈ పెరియపురాణము అనేక శివభక్తుల జీవితములను తీర్చి దిద్దజాలిన గ్రంథమని ఆచార్య శ్రీ నీలకంఠశాస్త్రిగారు దీనిప్రాశస్త్యమును అనేకవిధముల కొనియాడియున్నారు.

ఇంక పదునాలుగు సిద్ధాంతశాస్త్రములనుగూర్చి చూతము. ఇవి యన్నియు శైవసిద్ధాంతమతతత్త్వములనుగూర్చి ఏకగ్రీవముగా చాటుచున్నవి. వీనిలో శివజ్ఞానబోధము, శివజ్ఞానసిద్ధియారు, శివప్రకాశము అను మూడును ముఖ్యములు. మెయ్కండదేవుడు రచించిన శివజ్ఞానబోధము యుక్తియుక్తముగను, అత్యంత సూత్రప్రాయముగను నున్నది. ఇందలి తత్త్వబోధ యంతయు పండ్రెండు సూత్రములుగా విభజింపబడియున్నది. ఈ గ్రంథమున నలుబది పాదములుగల తమిళపద్యము లున్నవి. ప్రపంచమునం దెచ్చటను గానరాని హేతుయుక్తమైన ధార్మిక తత్త్వములతో గూడియుండు అమూల్యగ్రంథములలో నిది యొకటి యని రెవరెండు పయట్ మున్నగు పాశ్చాత్యులు దీనినిగూర్చి ప్రశంసించి యున్నారు.

అరుళ్ నంది శివాచార్యులు రచించిన 'శివజ్ఞానసిద్ధియారు'లో 624 పద్యము లున్నవి. ఈయన మెయ్కండదేవునకు శిష్యుడు, 'శివజ్ఞానబోధ'లోని సూత్రవివరణమునకే యీ కృతి నతడు తనగురునాదేశముచొప్పున వ్రాసెను. తక్కిన దార్శనికులు లేవదీయగల వాదప్రతివాదములను తనగ్రంథమున పేర్కొని వానికి చక్కని సమాధానములతో శైవసిద్ధాంతతత్త్వములను వివరించియున్నాడు. ఈ ఉభయులును 13-వ శతాబ్దిపూర్వభాగమున

ప్రబలిన బౌద్ధ జైనములనుండియేగాక యితర దార్శనిక వాదములనుండియు శైవసిద్ధాంతమును రక్షించుకొనుటకే యీ గ్రంథములను రచించి యున్నారు.

'శివప్రకాశము' 14 వ శతాబ్ది పూర్వార్థమునందు జీవించిన ఉమాపతిశివాచార్య కృతము. ఇతడు చిదంబరక్షేత్రమున నున్న 3000 అర్చకులలో నొకడు. శివప్రకాశమున 100 పాటలలో శైవసిద్ధాంతతత్త్వము లన్నియు చక్కగా సంగ్రహింపబడియున్నవి. పై రెండు గ్రంథముల కిది యొక పీఠికవంటిది. పదునాలుగు సిద్ధాంతశాస్త్రములలోని వైన ఆఱు చిన్నకృతులనుగూడ ఈతడురచించియున్నాడు. వానిలో నొకటి శైవసిద్ధాంతమునకు సంక్షేపరూపము. మిగిలిన యైదింటిలో పర్వదినములలో ఆలయములందు జరుపబడు ధ్వజారోహణమునకుగల గూఢార్థము, పంచాక్షరీమహామంత్రమహిమము మొదలగు విషయము లెన్నియో గలవు.

'తిరువుంతియారు', 'తిరుక్కళిట్రుప్పడియారు' అనునవి 14 సిద్ధాంత శాస్త్రములలో మిగులప్రాచీనములైనవి. వీనిని తిరువియలూరు ఉయ్యవంద దేవనాయనారును, అతని శిష్యుడైన తిరుక్కడఉరు ఉయ్యవంద దేవనాయనారును రచించిరి.

'శీర్కాళి తత్త్వనాడారు' అను భక్తుడు తన 'ఉణ్మెయ్ నెరివిళక్క' మను గ్రంథములో జీవాత్మ, పరమాత్మలో నైక్యమగుటకు పొందు దశావస్థలను గుఱించి వివరించియున్నాడు.

తక్కినసిద్ధాంతశాస్త్రములలోని తత్త్వాంశములన్నియు తిరుమంత్రము, తిరువాచకము, తేవారము లను ప్రసిద్ధగ్రంథములలో నుపదేశింపబడినవే.

ఆచార్యపురుషులకు తరువాత, సిద్ధులను గూర్చియు బ్రహ్మజ్ఞానులనుగూర్చియు మనము తెలిసికొందము: సిద్ధులు యోగులు మున్నగువారు తరువాతి కాలమునకు చెందినవారు. అణిమాది అష్టసిద్ధులను పొందినవారు సిద్ధు లనబడుదురు. వారు మానవదేహమునకు సంబంధించిన వృద్ధిక్షయములకు గాని, భౌతిక మానసికసూత్రములకుగాని లోబడినవారు కారు. వారు మహిమాన్వితులై స్వేచ్ఛగా ననేకాద్భుతకార్యము లొనరింపగలరు. తిరుమూలరు మొదలగు పదునెనమండుగురు సిద్ధులును తమిళదేశమునకు చిరపరిచితులు. వీరు రచించిన వైద్యశాస్త్రము, జీవితరహస్యములు మున్నగు గ్రంథములు నేటికిని మన కుపలభ్యములుగనే యున్నవి. కాని వాని నెవ్వరును పరిశోధనాదృష్టితో పరిశీలించినవారు లేరు. సిద్ధు లనువారు అనాదికాలమునుండియు నున్నవారే. వా రిప్పుడును నున్నారు. కాని, ఆధునికులు వారిని గుర్తింప లేకున్నారు. శివపరమాత్మని జటాజూటము, బాలచంద్రుడు, తలమీది గంగ, నీలకంఠము, విషములోచనము, చితాభస్మము, ప్రాకుచున్న పాములు మొదలగునవి ఆదర్శసిద్ధుని ఆనవాళ్ళు.

మొహంజదారో అవశేషములందు లభించిన కొన్ని ముద్రలవలన ఐతిహాసికయుగమునకు పూర్వమునుండియు సిద్ధు లుండియున్నట్లు మనకు వ్యక్త మగుచున్నది. దక్షిణదేశమున నీ సిద్ధులు కనిపట్టిన వైద్యపద్ధతి సిద్ధవైద్యమను పేర నింకను వాడుకలో నున్నది. చెన్నరాజధానిలోని దేశీయవైద్యకళాశాలలో ఈశాఖకు చెందిన వైద్యపద్ధతి నిన్న మొన్నటివఱకును బోధింపబడుచుండెడిది.

సిద్ధుల మంత్రశక్తిని అభివృద్ధిచేయుట కిష్ట పడు యోగులును అనాదినుండి యుండెడివారు. వారి యేకైకలక్ష్యము పరమాత్మతో నైక్య మగుటయే. ఎప్పుడో యొకప్పుడు మాత్రము దైవప్రేరణముచే నీ జ్ఞానులయందు అద్భుత శక్తులు కనిపింపగలవు. ఇటీవలి వఱకు నీమంత్ర సిద్ధులు దక్షిణాదిని గల శైవమతములలో నుం డెడివారు. ఆ మతములలోమాత్రమేగాక ఇతరత్ర నేటివఱకు ఇట్టి సిద్ధులు కనబడుచునేయున్నారు. పట్టినత్తారు, తాయుమానవరు, కుమారదేవరు, రామలింగస్వామి, రామకృష్ణపరమహంస, రమణమహర్షి మొదలగు వారందఱును ఈ కోవకు చెందినవారే. వీరిలో ననేకులు తరు వాతి కాలమువారికొఱకు అనేకగ్రంథములను రచించి యున్నారు.

శైవమునుగూర్చియు, శివభక్తులనుగూ ర్చియు, శైవగ్రంథములనుగూర్చియు నెఱిగిన తరువాత వసిద్ధాంతసారము నెఱుగుటయు ముఖ్యము.

1. పరమాత్మ, జీవాత్మ, పాశము (అనగా ఆణవము, కర్మ, మాయ) అను నవి నిత్యతత్త్వములు.
2. భగవంతుడు నామరూపరహితుడు; అవాఙ్మనసగోచరుడు.
3. శివుడు, బ్రహ్మ విష్ణురుద్రులలో నొకడు కాడు; త్రిమూర్తులకును అతీతుడైన పరాత్పరుడు; సర్వమంగళుడు; సర్వ జ్ఞుడు; నిర్వికల్పుడు, నిత్యసత్య స్వరూపుడు.
4. శివుడు అభవుడు.
5. ఈశ్వరుడు, జగత్తుతోడను, జీవాత్మల తోడను అవినాభావసంబంధము కల వాడు.
6. శైవము, ద్వైతముగాని, అద్వైతము గాని, విశిష్టాద్వైతముగాని కాదు; శుద్ధాద్వైతమే.
7. భౌతికప్రపంచము, భౌతికదేహములు, అంతరింద్రియములు మున్నగునవి య న్నియు షట్త్రింశత్తత్త్వములనుండి సృజింపబడినవే.
8. యమనియమములతోగూడిన నైతిక విధానమే ధార్మికజీవన సౌధమునకు పునాది.
9. భగవత్సాక్షాత్కారమే మానవజీవిత మునకు పరమావధి.
10. భగవంతుడు తన ఒక్క అంశవలననే ఈసృష్టినంతయు వహించుచున్నాడు.
11. ఆలయములు, వానియందుండు ప్రతి మలు, వానికి చేయు పూజావిధాన ములు, ఉత్సవాదులు—ఇవి యన్నియు శైవులచే ధరింపబడు విభూతిరుద్రాక్షల వలెను, పఠింపబడు పంచాక్షరీ మహా మంత్రమువలెను గూఢార్థముతో నిండి యున్నవి.
12. చార్య క్రియా యోగ జ్ఞానము లనబడు నాలుగు పద్ధతులును ధార్మికమతము లన్నియు సమానప్రాధాన్యముగల వియే.
13. బ్రహ్మానందమును మించిన యానందము లేదు ; మిగిలిన యానందము లన్నియు అనిత్యములు క్షణికములును.
14. మోక్షసముపార్జనమునకు జ్ఞానమే సాధ నము.

ఈ పైయంశములందు శైవసిద్ధాంత సారమంతయు నిమిడియున్నది. దానిని ప్రతిపాదించుచు వ్రాయబడినవే శైవమతగ్రంథములు. అవి తమిళమున వ్రాయబడినవి. వానిలోనుండి కొన్ని యుదాహరణములను చూచిన మనకీ మతప్రాశస్త్యము సువిదితమగును.

1. 'శివజ్ఞానసిద్ధియార్' అను గ్రంథములో "ఎట్టి సంప్రదాయముతోను విభిన్నముగా నుండక అన్నిటియందును సర్వసమత్వమును చూపునదియే యథార్థమైన మతము" అని వాకొనబడినది.

2. శ్రీఅప్పరు తనగ్రంథమున నిట్లు వాకొనెను: 'సంకుచితహృదయులు కొందఱు క్రొత్తమతమును స్థాపించి కోపావేశముతో దేవుని నిందించినను అది ఆయన కంగీకారమే'.

3. 'మహానగర మొక్కటియే, దాని కేడు మార్గములు గలవు. అట్లనే మన షణ్మతములును' అని తిరుమంత్రములో నున్నది.

4. 'అజ్ఞులు కొందఱు ప్రేమయు, భగవంతుడును వేఱని తలతురు కాని ప్రేమయే భగవంతుడని ఎఱుగరు. ప్రేమప్రాశస్త్యమును తిరుమంత్రము కొనియాడును.

విశ్వమానవసౌభ్రాత్రమునకును సర్వమానవసమైక్యమునకును మతము లన్నియు ప్రేమనే ప్రోత్సహించును గాక!



# వార్తలు, విశేషాలు

## మహాసమాధి

దుఃఖవార్త: తే 16-6-62 ది శనివారము ఉదయము 9-07 గంటలకు శ్రీరామకృష్ణమఠమిషనుల అష్టమ కేంద్రాధ్యక్షులు శ్రీమద్విశుద్ధానందస్వామి మహారాజులుంగారు, కల్కత్తా పార్కునర్సింగ్హోములో మహాసమాధి చెందారు.

హుగ్లీజిల్లా గురూప్గ్రామమున 1882 జూలైలో జన్మించారు. 1906 లో మాతృశ్రీ శారదామణిచరణముల ఆశ్రయించి మంత్రోపదేశం పొంది 1907 లో ఈ సంప్రదాయమున

ప్రవేశించారు. బాల్యంనుంచి కూడా వీరికి మతగ్రంథపఠనంలో ఆసక్తి మిక్కుటం. కల్కత్తా ఇంపీరియల్ లైబ్రరికి తరచు పొయ్యేవారు. అక్కడ శ్రీరామకృష్ణునిగూర్చి మాక్సుమ్యుల్లరు వ్రాసిన గ్రంథం చదివి గురుదేవుని ఉపదేశాలచే ఆకృష్టు లయ్యారు. 1906 సంవత్సరాంత్యంలో సన్న్యసించి గాఢతపస్సు చేదా మనే సంకల్పంతో వారణాసికి పాదచారులై బయలు దేరారు. జయ్రామ్బాటిలో మాతృశ్రీ ఆయనను 'వారణాశిలోని శ్రీరామకృష్ణాశ్రమంలో ఉండు' మని ప్రోత్సాహించింది. వారణాశి - మద్రాసు - నాట్టరాంపల్లి - మాయవతి - బెంగుళూరు - భువనేశ్వరం - రాంచి మున్నగా పెక్కు కేంద్రాలలో ఆయన ప్రశాంత ధ్యాన జీవితం గడిపారు. రాంచిలోని మోరాబాడి ఆశ్రమానికి ఆయన చిరకాలం అధ్యక్షుడుగా ఉండినాడు. 1922 లో రామకృష్ణమిషను పాలక పరిషత్తులోకి ఎన్నిక అయ్యారు. 1947 లో ఉపాధ్యక్షులుగా ఎన్నుకోబడ్డారు. 1956 లో మద్రాసుకు వచ్చి కొన్నాళ్లుండి మాతృశ్రీ శతితమజయంతిస్మారకంగా నిర్మితమైన ధర్మ వైద్యభవనానికి ప్రారంభోత్సవం చేశారు. తే 6-3-1962 దినాడు కేంద్రమఠాధ్యక్షులుగా ఎన్నుకోబడ్డారు. వేలకొలదిగా ఆశ్రయించిన మగువలకు మగవారికి పరమనిర్వృతికరమైన ఆధ్యాత్మిక సందేశం అందజేస్తూ దేశంలో ఆయన ఎంతో సంచారం చేశారు. ఆయన సంభాషణలు 'సత్కథా' అనే పేరుతో బెంగాలి భాషలో రెండుభాగాలుగా ప్రకటింపబడి ఉన్నాయి. తమ పారమార్థికజీవితాన్ని ఆయనచే తీర్చించి దిద్దించుకొన్న సహస్రాధిక సంఖ్యాకులగు భక్తులకు స్వామి నిర్యాణం తీఱని నష్టం. ఓం శాన్తి శ్శాన్తి శ్శాన్తిః.

## శ్రీరామకృష్ణమఠధర్మవైద్యశాల, మైలాపూరు
## 1961-62 సంవత్సర నివేదిక

ప్రజాసేవాంకితమైన యీ ధర్మవైద్యశాల జీవితంలో ముప్పైఐదు సంవత్సరాలు నిండాయి. మనం సమీక్షిస్తుండే సంవత్సరంలో ఇక్కడ వైద్యసాహాయ్యం పొందిన రోగుల సంఖ్య 1,66,371. వివరాలు—

కంటివైద్యం—

| | |
|---|---|
| క్రొత్తరోగులు | 2,474 |
| ప్రాతవారు | 828 |
| మొత్తం | 3,302 |
| ఆపరేషన్లు | 11 |
| వక్రీకరణాలు | 37 |

శ్రోత్రఘ్రాణకంఠవైద్యం—

| | |
|---|---|
| ప్రాతరోగులు | 8,445 |
| క్రొత్తవారు | 4,689 |
| మొత్తం | 13,134 |
| టాన్సిలెక్టామీలు | 61 |

దంతవైద్యం—

| | |
|---|---|
| పెఱికించుకొన్నవారు | 3,419 |
| కారీ | 3,104 |
| పయోరియా | 2,224 |
| మొత్తం | 8,747 |

ఎక్సేరే—

| | |
|---|---|
| పటాలు తీయించుకొన్నవారు | 426 |
| పటాలు పరిశీలింపించుకొన్నవారు | 121 |

లాబరేటరీలో 914 దినుసులు పరీక్షింపబడ్డాయి. పేదలయిన మహిళలకు శిశువులకు మొత్తం 1,96,229 మందికి పాలు పంచిపెట్టబడింది. కృశరుగ్ణశిశువులకు 6,987 మందికి మందుకలిపినపాలు పంచిపెట్టబడింది. 17,996 ఇంజెక్షన్లు చేయబడ్డాయి. 671 మందికి చిన్న శస్త్రచికిత్స చేయబడింది. 16,365 మందికి కట్లుకట్టబడ్డాయి. ఈ సంవత్సరం వచ్చుబడి మొత్తం ర్పూ. 24,716.21; ఖర్చులు ర్పూ. 28,355.08. కాబట్టి వచ్చుబడికంటె వ్యయం ర్పూ. 3,638.87 ఎక్కువ. నిర్వాహకవర్గం వారు సానుభూతితో సహాకరించిన ఉదార మహాజనులకు కృతజ్ఞత తెలుపుకొంటూ 'సానుభూతి సహకారాలను ఇతోధికంగా చేయవలసిం' దని ప్రార్థిస్తున్నారు.

---

# గ్రంథపరిచయం

[సమితికి గ్రంథాలు పంపేవారు రెండేసి ప్రతులు పంపవలె అని మనవి]

## హరినామ మహిమ

పాకెట్టు సైజు చిన్నపుస్తకం, తెనాలి సాధన గ్రంథమండలివారు ప్రచురించింది. పోతనామాత్యుని భాగవతంలోనుండి నామమహిమోద్ఘాటకములైన గద్యపద్యాలను ఏటి శ్రీ అవధూతేంద్రసరస్వతీస్వాములవారు ఈమాలికగా గ్రుచ్చినారు. ముచ్చటగొలుపు సంపుటం. వెల : 25 నయాపైసలు ; ప్రాప్తిస్థానం : జి. హైమవతి, సంకీర్తనభవన్, రైలుపేట, బాపట్ల.

## శ్రీసత్యదేవసంప్రార్థనము

'శ్రీరత్నాద్రినివాస భక్తవరదా శ్రీసత్యనారాయణా' అనే మకుటంతో విద్వాన్ శ్రీ బులుసు వేంకటేశ్వర్లు, ఎమ్. ఏ. గారిచే వ్రాయించి కాకినాడ రామారావుపేట బి. వి. అండ్ సన్సువారు ప్రచురించిన మకరందపేశలములైన పద్యాల నూటొకటి దింటి కూర్పు ఇది:—వెల : పావులా.

—ప్రభాకర్

---

విజ్ఞప్తి:—'జైన' 'బౌద్ధ' 'క్రైస్తవ' 'మహమ్మదీయ' సారస్వతములను గూర్చిన వ్యాసములు, ఈ తొలిసంచికలోనే ప్రకటితములు కావలసినవి, స్థలాభావముచే పై నెల సంచికలో తప్పక వెలువడును. —[సం.]

# ఏరా టెలిగ్రాము

ఏ భారతీయ
భాషలోనైనా
మీరు టెలిగ్రాం
పంపించ
వచ్చును



మీరు
పంపించే సందేశం
దేవనాగరి లిపిలో
వ్రాసినట్లయితే

తంతి, తపాలా శాఖ

DA 61/609

# ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం

## సమాచార ప్రజా సంబంధశాఖ, హైదరాబాదు

### ప్రచురణల పట్టిక

| | | రూ.న.పై. |
|---|---|---|
| ఇంగ్లీషు :— | | |
| 1. అరకులోయ | .... | 0—60 |
| 2. ఆంధ్రప్రదేశ్ విశేషాలు | .... | 0—25 |
| తెలుగు :— | | |
| 1. శ్రీ అల్లూరి సీతారామరాజు జీవిత చరిత్ర | .... | 2—75 |
| 2. 'ప్రగతి గీతాలు' | .... | 0—25 |
| 3. మూడవ మెట్టు | .... | 0—25 |
| ఉరుదు :— | | |
| 1. ఆహారోత్పత్తి | .... | 0—12 |
| 2. గిరిజన సంక్షేమం | .... | 0—12 |
| 3. మత్స్య సంపద | .... | 0—12 |

(పోస్టేజి అదనం)

### అందరూ చదువవలసిన "ఆంధ్ర ప్రదేశ్"

కథలకు గాథలకు, నాటికలకు నాటకాలకు, గీతాలకు గేయాలకు, కవితలకు కావ్యాలకు, సాహిత్య వ్యాసాలకు సాహిత్యవిమర్శలకు, వినోదానికి, విజ్ఞానానికి, అభ్యుదయ పథాలు అభివృద్ధి పథకాలను గూర్చిన వార్తలకు మూర్తులకు, అశేష విశేషాలకు, సచిత్ర మాసపత్రిక "ఆంధ్ర ప్రదేశ్" చదవండి. అతితక్కువ చందాలో అందరికీ అందుబాటులో ఉన్న పత్రిక. సంవత్సరం చందా రూ. 3.00 మాత్రమే. విడి ప్రతి 00.25 నయాపైసలు.

పై గ్రంథాలకు "ఆంధ్ర ప్రదేశ్" పత్రికకు వెంటనే యీ క్రింది చిరునామాకు వ్రాయండి :

సమాచార ప్రజా సంబంధశాఖ, సమాచార కేంద్రం,
హైద్రాబాదు - (దక్కను).

బిచ్చగాండ్రను, అవీ, ఇవీ అమ్మేవాండ్లను రైలుబండ్ల లోనికి ప్రవేశింపనీయకుండడానికి సహాయపడండి. శోధించి పట్టుకోడం, న్యాయస్థానాలలో చర్య తీసుకోడం మొదలైన మార్గాలలో ఈ విషయంలో రైల్వేవారు సాధ్యమైనంతవరకు తామే చేస్తున్నారు. కాని ప్రయాణికుల మనఃపూర్వక సహకారం లేనిదే పూర్తివిజయం సాధ్యం కాదు. రైలు బండ్లలో బిచ్చగాండ్రకు బిచ్చంపెట్టడం, అమ్మడానికి వచ్చిన వారిదగ్గర వస్తువులు కొనడం — వారిని తప్పక ప్రోత్సహిస్తాయి. బండ్లలో త్రొక్కిసలాట కలగటమే గాక, అమ్మబడే వస్తువులు మంచివిగాను ఉండవు. బిచ్చగాండ్రను, ఈ అమ్మకాలవాండ్రను రానీయకుండ చేసుకుంటే ప్రయాణాలు మరింత సౌఖ్యంగాను, భద్రంగాను సాగుతాయి. బిచ్చంపెట్టి బిచ్చగాండ్లను, వస్తువులు కొని అమ్మకాలవాండ్రను ప్రోత్సహించకుండ ఉందురుగాక!

[దక్షిణ రైల్వే ప్రకటన]

# OUR ENGLISH PUBLICATIONS

| | Price. Rs. | nP. |
|---|---|---|
| Sri Ramakrishna the Great Master (2nd Edn.) (Calico) | 25 | 00 |
| ,, ,, (Morocco) | 35 | 00 |
| The Gospel of Sri Ramakrishna (3rd Edn.) (Calico) | 20 | 00 |
| ,, ,, (Morocco) | 30 | 00 |
| Ramakrishna: Prophet of New India | 10 | 00 |
| Sri Ramakrishna .. | 1 | 50 |
| Sayings of Sri Ramakrishna (9th Edn.) | 5 | 00 |
| Ramakrishna Upanishad (2nd Edn.) | 1 | 00 |
| Tales and Parables of Sri Ramakrishna (2nd Edn.) | 2 | 50 |
| The Ramakrishna Mission its ideals and activities .. | 0 | 50 |
| Sri Ramakrishna and His Mission (2nd Edn.) | 0 | 62 |
| The Master and the Disciple .. | 2 | 00 |
| Sri Ramakrishna and Sarada Devi | 2 | 50 |
| Holy Mother Sri Sarada Devi (Gambhiranandaji) (Ordinary) | 7 | 00 |
| ,, ,, (Calico) | 9 | 00 |
| Sri Sarada Devi the Holy Mother (Tapasyanandaji) (Ordinary) | 6 | 50 |
| ,, ,, (Calico) | 8 | 00 |
| Inspired Talks (Swami Vivekananda) (8th Edn.) (Board) | 2 | 00 |
| ,, ,, (Calico) | 3 | 00 |
| Hinduism (4th Edn.) .. | 1 | 00 |
| Education (6th Edn.) .. | 1 | 00 |
| The Eternal Companion (3rd Edn.) (Ordinary) | 2 | 25 |
| ,, ,, (Calico) | 3 | 25 |
| For Thinkers on Education (Swami Ramakrishnananda) | 3 | 00 |
| The Story of a Dedicated Life (Life of Swami Ramakrishnananda) | 3 | 00 |
| The Message of Eternal Wisdom (Swami Ramakrishnananda) | 3 | 00 |
| God and Divine Incarnations (Swami Ramakrishnananda) | 2 | 25 |
| The Ancient Quest (Swami Ramakrishnananda) | 1 | 50 |
| Sri Krishna, The Pastoral and King-maker) (Swami Ramakrishnananda) (5th Edn.) .. | 1 | 25 |
| Life of Sri Ramanuja (Board) .. | 4 | 00 |
| ,, ,, (Cloth) .. | 5 | 00 |
| Isavasya Upanishad (7th Edn.) .. | 0 | 75 |
| Kena Upanishad (6th Edn.) .. | 0 | 75 |
| Katha Upanishad (8th Edn.) .. | 1 | 50 |
| Adventures in Religious Life (2nd Edn.) (Board) | 4 | 00 |
| (Cloth) | 5 | 00 |

| | Price. Rs. | nP. |
|---|---|---|
| Prasna Upanishad (5th Edn.) .. | 1 | 00 |
| Mundaka Upanishad (6th Edn.) .. | 1 | 00 |
| Mandukya Upanishad (7th Edn.) .. | 0 | 75 |
| Taittiriya Upanishad (4th Edn.) .. | 2 | 00 |
| Aitareya Upanishad (3rd Edn.) .. | 1 | 00 |
| Svetasvatara Upanishad (3rd Edn.) | 1 | 50 |
| Chandogya Upanishad .. | 8 | 00 |
| Brihadaranyaka Upanishad (2nd Edn.) | 7 | 50 |
| Mahanarayanopanishad .. | 5 | 00 |
| Srimad-Bhagavad-Gita (Swami Vireswarananda, with Sridhara's Gloss) .. | 7 | 00 |
| Bhagavad-Gita: the Song of God (4th Edn.) | 2 | 75 |
| Upadeshasahasri .. | 3 | 50 |
| Atmabodha .. | 4 | 00 |
| Yatindramatadipika .. | 5 | 00 |
| Srimad Bhagavatam: The Wisdom of God .. | 3 | 50 |
| Stotraratna (2nd Edn.) .. | 0 | 75 |
| Divine Life (4th Edn.) .. | 3 | 00 |
| Universal Prayers (5th Edn.) .. | 2 | 25 |
| Prince of Ayodhya (Ordinary) | 3 | 00 |
| ,, ,, (Calico) | 4 | 50 |
| Vedic Religion and Philosophy (4th Edn.) | 2 | 50 |
| Narada Bhakti Sutras (3rd Edn.) .. | 3 | 00 |
| Vakyavritti & Atmajnanopadeshavidhi (2nd Edn.) .. | 1 | 00 |
| Devi-Mahatmyam (Chandi) (2nd Edn.) | 2 | 00 |
| Saint Durga Charan Nag (3rd Edn.) | 2 | 25 |
| Thus Spake Sri Ramakrishna (7th Edn.) | 0 | 40 |
| Thus Spake Holy Mother (2nd Edn.) | 0 | 37 |
| Thus Spake Vivekananda (8th Edn.) | 0 | 40 |
| Thus Spake The Buddha (2nd Edn.) | 0 | 40 |
| Thus Spake Sri Krishna (2nd Edn.) | 0 | 40 |
| Thus Spake The Christ (2nd Edn.) | 0 | 40 |
| Thus Spake Prophet Muhammad . | 0 | 40 |
| Worship of Sri Ramakrishna .. | 1 | 00 |
| A Man of God (Ordinary) | 3 | 00 |
| ,, ,, (Calico) | 4 | 00 |
| Buddha and Our Heritage .. | 0 | 40 |
| Swami Vivekananda, My Master .. | 0 | 37 |
| Path to Perfection .. | 0 | 37 |
| Consolations .. | 0 | 31 |
| Women of India .. | 0 | 25 |
| Spiritual Life .. | 0 | 06 |
| Path Beyond Sorrow .. | 0 | 06 |

**Please ask for the Detailed Catalogues of our Tamil and Telugu Books**

**SRI RAMAKRISHNA MATH,** ***Publication Dept.,*** **MYLAPORE, MADRAS-4**






సంపాదకులు : శ్రీ శుద్ధసత్త్వానందస్వామి, శ్రీ నేలటూరి భక్తవత్సలము,
శ్రీ కే. ఎస్. ఎస్. రాజన్ గారిచే ది జ్యూపిటర్ ప్రెస్స్ ప్రైవేట్ లిమిటెడ్ (మద్రాసు - 18) న ముద్రింపబడి,
శ్రీ శుద్ధసత్త్వానందస్వామిచే శ్రీ రామకృష్ణమఠము (మైలాపూరు) నుండి ప్రచురింపబడినది.

# OUR ENGLISH PUBLICATIONS

| | Price. Rs. | nP. |
|---|---|---|
| Sri Ramakrishna the Great Master (2nd Edn.) (Calico) | 25 | 00 |
| ,, ,, (Morocco) | 35 | 00 |
| The Gospel of Sri Ramakrishna (3rd Edn.) (Calico) | 20 | 00 |
| ,, ,, (Morocco) | 30 | 00 |
| Ramakrishna : Prophet of New India | 10 | 00 |
| Sri Ramakrishna .. | 1 | 50 |
| Sayings of Sri Ramakrishna (9th Edn.) | 5 | 00 |
| Ramakrishna Upanishad (2nd Edn.) | 1 | 00 |
| Tales and Parables of Sri Ramakrishna (2nd Edn.) | 2 | 50 |
| The Ramakrishna Mission its ideals and activities .. | 0 | 50 |
| Sri Ramakrishna and His Mission (2nd Edn.) | 0 | 62 |
| The Master and the Disciple .. | 2 | 00 |
| Sri Ramakrishna and Sarada Devi | 2 | 50 |
| Holy Mother Sri Sarada Devi (Gambhiranandaji) (Ordinary) | 7 | 00 |
| ,, ,, (Calico) | 9 | 00 |
| Sri Sarada Devi the Holy Mother (Tapasyanandaji) (Ordinary) | 6 | 50 |
| ,, ,, (Calico) | 8 | 00 |
| Inspired Talks (Swami Vivekananda) (8th Edn.) (Board) | 2 | 00 |
| ,, ,, (Calico) | 3 | 00 |
| Hinduism (4th Edn.) .. | 1 | 00 |
| Education (6th Edn.) .. | 1 | 00 |
| The Eternal Companion (3rd Edn.) (Ordinary) | 2 | 25 |
| ,, ,, (Calico) | 3 | 25 |
| For Thinkers on Education (Swami Ramakrishnananda) | 3 | 00 |
| The Story of a Dedicated Life (Life of Swami Ramakrishnananda) | 3 | 00 |
| The Message of Eternal Wisdom (Swami Ramakrishnananda) | 3 | 00 |
| God and Divine Incarnations (Swami Ramakrishnananda) | 2 | 25 |
| The Ancient Quest (Swami Ramakrishnananda) | 1 | 50 |
| Sri Krishna, The Pastoral and King-maker) (Swami Ramakrishnananda) (5th Edn.) .. | 1 | 25 |
| Life of Sri Ramanuja (Board) .. | 4 | 00 |
| ,, ,, (Cloth) .. | 5 | 00 |
| Isavasya Upanishad (7th Edn.) .. | 0 | 75 |
| Kena Upanishad (6th Edn.) .. | 0 | 75 |
| Katha Upanishad (8th Edn.) .. | 1 | 50 |
| Adventures in Religious Life (2nd Edn.) (Board) | 4 | 00 |
| (Cloth) | 5 | 00 |

| | Price. Rs. | nP. |
|---|---|---|
| Prasna Upanishad (5th Edn.) .. | 1 | 00 |
| Mundaka Upanishad (6th Edn.) .. | 1 | 00 |
| Mandukya Upanishad (7th Edn.) .. | 0 | 75 |
| Taittiriya Upanishad (4th Edn.) .. | 2 | 00 |
| Aitareya Upanishad (3rd Edn.) .. | 1 | 00 |
| Svetasvatara Upanishad (3rd Edn.) | 1 | 50 |
| Chandogya Upanishad .. | 8 | 00 |
| Brihadaranyaka Upanishad (2nd Edn.) | 7 | 50 |
| Mahanarayanopanishad .. | 5 | 00 |
| Srimad-Bhagavad-Gita (Swami Vireswarananda, with Sridhara's Gloss) .. | 7 | 00 |
| Bhagavad-Gita : the Song of God (4th Edn.) | 2 | 75 |
| Upadeshasahasri .. | 3 | 50 |
| Atmabodha .. | 4 | 00 |
| Yatindramatadipika .. | 5 | 00 |
| Srimad Bhagavatam : The Wisdom of God .. | 3 | 50 |
| Stotraratna (2nd Edn.) .. | 0 | 75 |
| Divine Life (4th Edn.) .. | 3 | 00 |
| Universal Prayers (5th Edn.) .. | 2 | 25 |
| Prince of Ayodhya (Ordinary) | 3 | 00 |
| ,, ,, (Calico) | 4 | 50 |
| Vedic Religion and Philosophy (4th Edn.) | 2 | 50 |
| Narada Bhakti Sutras (3rd Edn.) .. | 3 | 00 |
| Vakyavritti & Atmajnanopadeshavidhi (2nd Edn.) .. | 1 | 00 |
| Devi-Mahatmyam (Chandi) (2nd Edn.) | 2 | 00 |
| Saint Durga Charan Nag (3rd Edn.) | 2 | 25 |
| Thus Spake Sri Ramakrishna (7th Edn.) | 0 | 40 |
| Thus Spake Holy Mother (2nd Edn.) | 0 | 40 |
| Thus Spake Vivekananda (8th Edn.) | 0 | 40 |
| Thus Spake The Buddha (2nd Edn.) | 0 | 40 |
| Thus Spake Sri Krishna (2nd Edn.) | 0 | 40 |
| Thus Spake The Christ (2nd Edn.) | 0 | 40 |
| Thus Spake Prophet Muhammad .. | 0 | 40 |
| Worship of Sri Ramakrishna .. | 1 | 00 |
| A Man of God (Ordinary) | 3 | 00 |
| ,, ,, (Calico) | 4 | 00 |
| Buddha and Our Heritage .. | 0 | 40 |
| Swami Vivekananda, My Master .. | 0 | 37 |
| Path to Perfection .. | 0 | 40 |
| Consolations .. | 0 | 31 |
| Women of India .. | 0 | 25 |
| Spiritual Life .. | 0 | 06 |
| Path Beyond Sorrow .. | 0 | 06 |

**Please ask for the Detailed Catalogues of our Tamil and Telugu Books**

**SRI RAMAKRISHNA MATH,** *Publication Dept.*, **MYLAPORE, MADRAS-4**

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటము ౧౯   ౧౯౬౨, ఆగస్టు; శుభకృత్తు - శ్రావణము   సంచిక ౨

## విషయసూచిక



'అఖిలవిభు శరణొందుమ, యీ క్షణంబ యతనికృప నీకు ననుభావ్య మగును వత్స.'

—శ్రీ శారదామణి.


# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము ౧౯ } ౧౯౬౨ - ఆగస్టు :: శుభకృత్తు - శ్రావణము { సంచిక ౨


శ్రీః

## సౌందర్యలహరి


మూలము : శ్రీ శంకరభగవత్పాదులు

టీక : నే. భ.


లలాటం లావణ్యద్యుతివిమల మాభాతి తవ యద్
ద్వితీయం త న్మన్యే మకుటఘటితం చన్ద్రశకలమ్
విపర్యాసన్యాసా దుభయ మపి సమ్భూయ చ మిథ
స్సుధాలేపస్యూతిః పరిణమతి రాకాహిమకరః ॥

| | | | |
|---|---|---|---|
| (హే దేవి) | (అమ్మా) | (ఇతియత్) | (అనుట ఏదికలదో) |
| లావణ్య | లావణ్యమనెడి | (తస్మాత్) | (అందువలన) |
| ద్యుతి | కాంతిచేత | మకుటఘటితం | కిరీటముపై కూర్పబడియున్న |
| విమలమ్ | నిర్మలమైన | చన్ద్రశకలం | చంద్రఖండము |
| తవ | నీ | ద్వితీయం | రెండవది |
| లలాటం | నొసలు | అభవత్ | ఆయెను (అని) |
| ఆభాతి | [చందమామవలె] వెలుగొందుచున్నది | మన్యే | తలంతును |

| | | | |
|---|---|---|---|
| విపర్యాసన్యాసాత్ | ఊర్ధ్వకోటియగు చంద్రఖం | మిథః | అన్యోన్యము |
| | డమును అధఃకోటియగు | సమ్భూయ | కలసి |
| | నొసటిని త్రిప్పి పెట్టుట | సుధాలేపస్యూతిః | అమృతరసలిప్తమగు |
| | వలన | రాకాహిమకరః | పున్నమచందమామగా |
| | రెండును | పరిణమతి | రూపొందును. |

తా॥ అమ్మా, విశుద్ధమై లావణ్యము దొలకు నీ నుదుటిని జూడగా అది శృంగములు క్రిందికి వంగిన నెలవంకవలె నున్నది. నీ కిరీటముపై శృంగములు పైకి తిరిగి యున్న నెలవంక రెండవ దగుచున్నది. రెంటిని తలక్రిందులు చేసి కలిపిన పున్నమచందమామగా రూపొందును.

భ్రువౌ భుగ్నే కిఞ్చి ద్భువనభయభఙ్గవ్యసనిని
త్వదీయే నేత్రాభ్యాం మధుకరరుచిభ్యాం ధృతగుణమ్
ధను ర్మన్యే సవ్యేతరకరగృహీతం రతిపతేః
ప్రకోష్ఠే ముష్టౌచ స్థగయతి నిగూఢా నర ముమే ॥ ౪౭

| | | | |
|---|---|---|---|
| హే ఉమే | ఓ ఉమా, | ధృతగుణం | ధరింపబడ్డ అల్లెత్రాడు గలదై, |
| భువన | లోకాల | | |
| భయభఙ్గ | ఆపదల పోగొట్టుటయందు | సవ్యేతరకర | ఎడమచేత |
| వ్యసనిని | ఆసక్తికలదానా, | గృహీతం | పట్టుకొనబడినదై, |
| త్వదీయే | | ప్రకోష్ఠే | ముంజేయియు |
| కిఞ్చిద్ | ఇంచుక | ముష్టౌచ | పిడికిలియు |
| భుగ్నే | వంపబడ్డ | స్థగయతిసతి | కప్పుచుండగా |
| భ్రువౌ | బొమలజంట | నిగూఢాన్తరం | మఱుగుపడ్డ నడిభాగముగల |
| మధుకర | తుమ్మెదల | రతిపతేః | మన్మథుని |
| రుచిభ్యాం | కాంతివంటికాంతిగల | ధనుః | ధనువు అని |
| నేత్రాభ్యాం | కన్నులచే | మన్యే | తలంతును. |

తా॥ లోకముల భయముల పోగొట్ట ఆత్రపడు అమ్మా, ఉమా, ఇంచుకగా వంపబడ్డ నీ బొమలజంట మన్మథునిధనువుగా నాకు కననగుచున్నది. తుమ్మెదల కాంతివంటి కాంతిగల నీనేత్రములే దానికి అల్లెత్రాడుగ నమరి యున్నది. అది మన్మథుని యెడమచేత పట్టుకొబడి యున్నది. వింటినడిభాగమును పిడికిలియు అల్లెత్రాటి నడిపట్టును ముంజేయియు కప్పియున్నవి.

అహః సూ్తే సవ్యం తవ నయన మర్కాత్మకతయా
త్రియామాం వామం తే సృజతి రజనీనాయకతయా
తృతీయా తే దృష్టి ర్దరదళితహేమామ్బుజరుచి
స్సమాధత్తే సన్ధ్యాం దివసనిశయో రన్తరచరీమ్ ॥ ౪౮

| | | | |
|---|---|---|---|
| (దేవి) | (అమ్మా) | సృజతి | సృజించును |
| తవ | నీ | తే | నీ |
| సవ్యం | కుడి | దర | ఇంచుకగా |
| నయనమ్ | కన్ను | దళిత | వికసించిన |
| అర్కాత్మకతయా | సూర్యాత్మకమగుటచే | హేమామ్బుజరుచిః | పైడితామరకాంతిగలదగు (అగ్న్యాత్మకమగు) |
| అహః | పగటివేళను | | మూడవ |
| సూతే | ఉత్పాదించును | | |
| తే | నీ | దృష్టిః | కన్ను |
| వామం | ఎడమ | దివసనిశయోః | పగలింటికిని రాత్రికిని |
| నయనమ్ | కన్ను | అన్తరచరీం | నడుమనుండు |
| రజనీనాయకతయా | చంద్రాత్మకమగుటచేత | సన్ధ్యాం | సంధ్యవేళను |
| త్రియామాం | రాత్రిని | సమాధత్తే | కలిగించును. |

తా॥ అమ్మా, నీ కుడికన్ను సూర్యుడగుటచే పగటివేళను సృజించుచున్నది. నీ యెడమకన్ను నిశానాథుడగుటచే నిశాకాలమును ప్రవర్తింపజేయుచున్నది. ఇంచుకవిచ్చిన పొందామర మిసిమి గల నీ మూడవకన్ను అగ్న్యాత్మక మగుటచే రాత్రింబగళ్లకు నడిమిదైన సంధ్యాకాలమును గలిగించుచున్నది.

విశాలా కల్యాణీ స్ఫుటరుచి రయోధ్యా కువలయైః
కృపాధారా ధారా కిమపి మధురా భోగవతికా
అవన్తీ దృష్టి స్తే బహునగరవిస్తారవిజయా
ధ్రువం తత్ త న్నామ వ్యవహరణయోగ్యా విజయతే ॥ ౪౯

| | | | |
|---|---|---|---|
| (హే దేవి) | (అమ్మా) | అయోధ్యా | పోరాడుటకుశక్యముకానిది |
| తే | నీ | కిమపి | ఇట్టి దట్టిదనరాక |
| దృష్టిః | కన్ను | మధురా | హృద్యమైనది |
| విశాలా | విస్తారమైనది | భోగవతికా | సుఖానుభవములుగలది |
| కల్యాణీ | మంగళకరమైనది | అవన్తీ | రక్షించునది |
| స్ఫుటరుచిః | ప్రస్ఫుటకాంతిగలది | బహు | పెక్కు |
| కువలయైః | కలువలచే | నగర | నగరాలను |

| | | | |
|---|---|---|---|
| విస్తార | వైశాల్యాదిగుణ యోగము చేత | వ్యవహారణ | నిర్దేశింపబడ తగినది |
| విజయా | గెల్చునది | యోగ్యా | |
| తత్ తత్ | ఆయా | ధ్రువం | నిశ్చయముగ |
| నామ | పేళ్లతో | విజయతే | సర్వోత్కృష్టముగనున్నది. |

తా॥ (౧) విశాల (౨) కల్యాణి (౩) అయోధ్య (౪) ధార (౫) మధుర (౬) భోగవతి (౭) అవంతి (౮) విజయ—అను నెనిమిది నగరా లున్నవి. ఆ నగరాలకు ఆపే ళ్లున్నవి కాని ఆపేళ్ల కర్థములగు గుణములు అమ్మా, నీ కంటికే గలవు. కావున నిశ్చయముగ ఆపేళ్లతో నీ కంటిని నిర్దేశించుట ఉచితము.

కవీనాం సన్దర్భ స్తబకమకరన్దైకరసికం
కటాక్షవ్యాక్షేప భ్రమరకలభౌ కర్ణయుగళమ్
అముఞ్చన్తౌ దృష్ట్వా తవ నవరసాస్వాదతరళా
వసూయాసంసర్గా దళికనయనం కిఞ్చి దరుణమ్ ॥ ౫౦

| | | | |
|---|---|---|---|
| (హే భగవతి) | (అమ్మా) | ఆస్వాద | క్రోలుటయందు |
| కవీనాం | కవీశ్వరుల | తరళౌ | లమ్పటములునగు |
| సన్దర్భ | కావ్యఘట్టములనెడి | కటాక్షవ్యాక్షేప | కడకన్నులనెడి |
| స్తబక | పూలగుత్తుల | భ్రమరకలభౌ | తుమ్మెదలజంటను |
| మకరన్ద | తేనెయందు | దృష్ట్వా | కాంచి |
| ఏకరసికమ్ | ముఖ్యరసికమగు | అసూయా | అసూయతో |
| తవ | నీ | సంసర్గాత్ | కూడుటచే |
| కర్ణయుగళమ్ | వీనుగవను | అళికనయనం | నుదుటికన్ను |
| అముఞ్చన్తౌ | విడువనివియు | కిఞ్చిద్ | ఇంచుక |
| నవ | తొమ్మిది | అరుణమ్ | కెంజాయ నెనసినది. |
| | రసముల | | |

తా॥ అమ్మా కవీశ్వరుల కావ్యఘట్టములే పూలగుత్తులు, శృంగారాది రసములే అందలిపూదేనె. దాని ననుభవించు రసికములు నీ వీనులు. నీకడకన్ను లనెడి తుమ్మెదలును ఆరసపానమందలి లోభముచేతనో యన వీనుగవను వీడ కున్నవి. దానిని గాంచి అసూయచేతం బోలె నీ నుదుటికన్ను కెంజాయ నెనసియున్నది. రెండుకన్ను లాకర్ణాంతము లనియు నల్లడాలు గల వనియు మూడవకన్ను అరుణదీధితి గల దనియు తాత్పర్యము.—

# శశిమహారాజ సంస్మృతులు

[సంపాదకీయము]

## (1) శ్రీ శివానందస్వామి

శశిమహారాజు పరమపావనుడు, నిష్కళంకుడు. ఆయనజీవితమును పరిశోధించువారు ఎవరైనను తప్పక మహానందమును చెందుదురు. అప్పటముగా కైంకర్యమునకే అంకితమైన జీవితము ఆయనది. తపస్సునుగూర్చి ఆయన మాటలు పల్కడు. హిమాలయప్రదేశమున తపసుచేయు సంకల్పమే ఆయనకు లేదు. ఆయన కాశికైనను పోయినవాడు కాడు. కేవల మొక్కసారి ఆయన పడమటిదిక్కుగా పయనించి బర్ద్వానుజిల్లాలో నున్న మంగర్ అను గ్రామమువఱకు మాత్రమే పోయియుండెను. ఒకదిన మాయన శ్రీ వివేకానందస్వామితో "శ్రీరామకృష్ణునికి సమర్పించుటకై నాకు పదునొక్క తమ్ములపాకులు కావలె" నని చెప్పెను. అందు కాయన "అది సాధ్యపడదు. అంత మనము భరింపలేము. మిగిలిన, నీవు నాలుగు తమ్మలపాకులనుమాత్రము పెట్టుకోవచ్చు" అని బదులు చెప్పెను. ఆ దినములలో నాలుగు తమ్మలపాకుల వెల పరకఅణా. అయినను అప్పుడు బరానగరమఠములో కాలము అంతకష్టకాలముగా నుండినది. శశిమహారాజు "అలాగైనచో నేనిచ్చట నిలువను" అని బదులు చెప్పెను. అందుకు వివేకానందుడు "చాల మంచిది, చెడ్డబ్బాయి, నీవు నీకు నచ్చినచోటికి పోవచ్చు" అనెను. శశిమహారాజు మఠమును విడిచి చనెను. కాని మంగర్ వఱకే. మఠమునకు వెలుపల పలుకష్టములకు గురికావలసివచ్చెను. ఆయనకు ఇట్టివి వాడుకలో లేవు. కావున మంగర్‌లో ఆయనకు జ్వరము వచ్చెను. కాని ఆయన భక్తుడు కదా. ఆయనకు అంతటి దుఃఖము కలుగునా? ఒకరు (వ్యాపారికాబోలు) ఆయనను చూచి తమయింటికి పిలుచుకొనిపోయి ం డ ను మందును ఇంకను కావలసినవానిని ఇచ్చి చక్కగా చికిత్స చేసిన పిమ్మట మాకొక జాబునుకూడ వ్రాసినాడు. మేమును ఆయనను గూర్చి మిక్కిలి చింతించితిమి. తుదకు నిరంజన్ (శ్రీ నిరంజనానందస్వామి) ఆయనను అచ్చట పట్టుకొని "చాలు, మూఢా, మనము పోదము, నీకు తపస్సు సమృద్ధిగా సిద్ధించినది ఇప్పుడు నాతో రమ్ము" అన్నాడు ఆ సోదరశిష్యుడు. మఠమునకు మరలివచ్చినవెంటనే శశిమహారాజు వివేకానందునితో "ఇక నేను ఒక్క అడుగైనను వేఱుచోట ఎత్తిపెట్టజాలను. నేను నీకు క్రిందివాడను. నన్ను నీ వెచ్చట నుండుమనినను అట్లే చేసెదను" అని చెప్పినాడు. అటు పిమ్మట నిజముగనే ఆయన వెలుపల ఉండినదే లేదు. మహిమాచరణ్ బరానగరులో ఒకహైస్కూలును ప్రారంభించి ఉండినాడు. సాధువులను ఆయన ఉపాధ్యాయులుగా నుండుడని వేడుకొనెను. శశిమహారాజు అచ్చట గణి

తము పాఠముచెప్పుచుండెను. తండ్రిగారికి సాయము చేయుటకును, శ్రీరామకృష్ణుని సేవ కొఱకును ఏబదిరూపాయల నెలజీతమును స్వీక రించుచుండెను. సమర్థుడైన ఉపాధ్యాయు డను పేరు సంపాదించుకొనెను. కాని ఒకటి రెండు నెలలకంటె ఎక్కువ కాలము ఆ ఉద్యోగమును చేయ లేకపోయెను.

## (2) శ్రీ సర్వానందస్వామి

శశిమహారాజు బలిసిన దేహమును ముఖ వైఖరియు మొట్టమొదట నా డెందమున భయ మును ఆదరమును కలిగించినవి. ఎవరినైనను సరే లొంగదీసి ఏలు సామర్థ్యము ఆయనముఖ లక్షణములలోనే అమరియుండినది.

మొట్టమొదట వచ్చినప్పుడు సాయంకాలము చాల పొద్దుపోయిన పిమ్మటనే నేను మఠమునకు చేరితిని. వచ్చి, విచారించుకోవలసినవాని నన్ని టిని ముగించిన పిమ్మట ఆయన గురుదేవుని కొఱకై నే నేమి తెచ్చితినో అని నన్నడిగెను. ఆలాగు దేనినైనను తేవలె ననుట నాకు తెలియ దనియు వేఱెవరును నాకు చెప్పనైన లే దనియు ఆయనతో అన్నాను. అప్పుడు ఆయన శాంత ముగనే ఐనను శాసించుతీరుతో "వెలుపలి నుండి నీవు మఠమునకు వచ్చునప్పుడెల్ల గురు మహారాజునకు ఏమైనను తెచ్చుచుండవలెను" అన్నాడు. ఇదే ఆయన నాకు బోధించిన మొదటిపాఠము. నేను సిగ్గుపడితిని. ఆయన నన్ను "నీ గంపలో నుండున దేమి" అని అడి గెను. వచ్చుదారిలో భుజించుటకై తెచ్చు కొన్న పండ్లును తినుబండములును అందుండిన వనియు భుజించినవి పోగా శేషించిన విప్పు డున్న వనియు నే నంటిని. విని సంతోషించి "దోషము లేదు, ఆ మామిడిపండ్లను ఇటు తే ; వానిని గురుమహారాజున కిమ్ము" అన్నాడు. అది భుక్తశేష మని నేను చెప్పగా ఆయన "ఫరవాలేదు, పండును ఒకరొకవైపు తిని యుండినను మిగిలిన భాగమును కడిగి సమ ర్పింపవచ్చు"నని నిక్కచ్చిచేసినాడు. నాటి రాత్రి తక్కినవస్తువులతోపాటు గురుదేవునకు ఆ మామిడిపండ్లును సమర్పింపబడినవి.

* * *

నేను మఠమునకు వచ్చిన కొన్నిదినములలో శశిమహారాజు మాయొద్ద ఎదురుచూచునది ఫలానా అని కనుగొంటిని. ఆయన కోరిన దేమన — చక్కగాను వేళ తప్పకయు సక్ర మముగను చుఱుకుగను పనులను నెఱవేర్చుట తోబాటు, ఏ పని చేసినను నిండుమనస్సుతో చేయుట. పూజాగృహకర్తవ్యములను శ్రీ గురు దేవునకు చేయవలసిన సేవలను గొప్పగను అధికశ్రద్ధతోను చేయుట — వీనిని ఆయన మాయొద్ద నిరీక్షించును. వచ్చిన రెండవదినమే పూజాగృహమున ఒకానొక సేవచేయుచున్న ప్పుడు ఆయన నాతో "బాలకా, దీనిని గమ నింపుము, ఇచ్చట పటమును శ్రీరామకృష్ణుని పటము అని మాత్రము తలంపకు. గురుదేవుని యథార్థసాన్నిధ్యము ఇచ్చట ఉన్నది. గురు దేవుని సజీవసాన్నిధ్యమును సాక్షాత్కరించు కొన పాటుపడుచు నీ కర్తవ్యములను గురుదేవు నెదుట చేసినట్లు చేయుము" అని చెప్పినాడు. ఈ మహాసీయునొద్ద నేను నేర్చిన రెండవ పాఠము ఇదే.

మఱుదినము గుడికి సంబంధించిన పనులలో నే నించుక అజాగ్రత్తగా ఉంటి నని ఆయన నన్ను అందుకై ఎంతయు ఖండించెను. అట్టి

ఖండనలకు వాడుకపడినవాడను కానందుచేతను అల్పకారణమునకు అంత తీవ్రముగా ఆయన ఖండించినందువలనను నేను ఓర్చుకోలేక పోయి తిని. నేను ఏడ్చుచుండుటను గుర్తించి ఆయన మనసు కరగి మిక్కిలి ప్రేమతో ఈలాగు చెప్ప నారంభించెను. శ్రీరామకృష్ణుడు ఏమి చెప్పునో నీకు తెలియునా? కమ్మరి ఇనుపతునుకను నిప్పులో వేయును. అది ఎఱ్ఱగ గ్రాగిన పిమ్మట దానిని దాగలిపై నుంచి సుత్తెతో కొట్టి వల సిన రూపమును దాల్పజేయును. ఆ యినుప తునుక మన కుపయోగపడు ఉపకరణముగ నగుటకై దాని నట్లు చేయవలయును. మీ రందఱును రూపుదాల్చుటకు మునుపటి ఆ యినుపతునుకవంటివారు. మిమ్ము ఇటువంటి ఖండనలచేత వేడెక్కించి సుత్తెతో కొట్టుటచే మేలు ఫలించును. ఇ దంతయును మీ మేలు నకే.'' ఆయన కరుణాపూర్ణమైన కంఠము నా కించుక ధైర్యమును గూర్చినది. ఈ సంభవ మునకు మఱునాడు మే మందఱమును భుజింప కూర్చున్నప్పుడు చక్కని మల్గోవాపండ్లను వడ్డించినారు. మొదట ఒకపండును శశిమహా రాజు కిచ్చినారు. తన కిచ్చిన పండులో ఆయన ఇంచుక రుచి చూచి ''ఎంత తియ్యగ నున్నది, బలే! బలే!'' అని చెప్పుచునే మాతృప్రేమతో ఆ పెద్దపండును నా ఆకులో వేసినారు. ఈచిన్న ప్రేమకార్యము ఆయన హృదయమును నాకు తెలిపినది. ఆ క్షణము మొదలు ఆయన తిట్లు నన్ను నొప్పించుటలేదు, మనోవ్యథకూర్చుట లేదు. ఏలయన ఆ దండనలకును బొమముడుల కును వెనుకనున్న మాతృహృదయమును ప్రేమ యు నాకు సదా కనవగుచుండినవి.

ఒకదినము సాయంకాలము నాలుగుగంట లకు శ్రీరామకృష్ణునకు సమర్పించుటకు ఆహా రము మఠములో ఏమియు లేకపోయెను. అప్పుడు చేత దమ్మిడియు లేదు. మూడుగంట లప్పుడు ఆ పరిస్థితి తెలియరాగానే శశిమహా రాజు మిక్కిలి కలవరపడినాడు. అది శ్రీరామ కృష్ణుడు చేయు శోధన అని అనుకొన్నాడు. మ మ్మెవ్వరిని నిందింపలేదు. ''అతడు లేక ఒక్క అణువైనను కదలదు కదా'' అని తలంచి శ్రీరామకృష్ణునిమీద కోపముచెంది గదిలో అటు ఇటు పచారుచేయుచు ''నీవు నన్ను శోధించుచున్నావు. నేను మట్టిని తినియైనను స్వామిజీ (వివేకానందుడు) నా కప్పగించిన పనిని ఇచ్చట చేసియే తీరెదను. నా నిశ్చయదార్ఢ్య మును పరీక్షింపగోరుదువా, ఇచ్చటనే నేను ప్రాణములనైన విడుతునే గాని ఒక్క అడుగై నను వెలుపలికి కదలను. ఎన్ని కష్టములనైన, నీ కిష్టమైనయెడల, నాకు కలిగింప వచ్చు'' అని ఊఱుముచు ముఖము జేవురింప ఉల్లము దుఃఖింప అరగంటసేపు మండిపడినాడు. సకాల మునకు నివేదనము అర్పింప సాధ్యము కాకుండు టను స్మరించి దుఃఖించుచున్నను ''సర్వేశ్వరుడు సర్వశక్తి''అను నమ్మకము ఆయనకు తొణకలేదు. అప్పుడు మఠపువాకిలితలుపును ఎవరో మెల్లగా తట్టినట్లు నాకు వినబడినది. మాలో కొందఱము వెలుపలికి వచ్చి తలుపు తెఱచితిమి. శశిమహా రాజు ప్రాతశిష్యు డొకడు కొంజయ్యసెట్టి అను నతడు చేత నొక గంప నెత్తుకొని ఎదుట నిలిచి నాడు. అతడు లోని కేగి శశిమహారాజు నెదుట తాను తెచ్చిన గోధుమపిండిని, నేతిని, కల కండను, పండ్లను, ఐదురూపాయలను పెట్టి నాడు. అప్పుడు గంట మూడున్నర. సాయం నైవేద్యమునకు ఇంకను అరగంట ఉండెను. శశిమహారాజు ఆనందముతో పసిబాలునివలె ఘోషించి రెండు స్టౌలను వెలిగించి కావలసిన

భక్ష్యములను తయారుచేయవలసినదని ఆజ్ఞాపించినారు. నాలుగుగంటలకు అన్నింటిని శశిమహారాజు స్వయముగ సమర్పించినారు. మేము శశిమహారాజుభక్తిని శ్రీరామకృష్ణునికృపను అట్లు ప్రత్యక్షముగ చూచి ఆశ్చర్యసముద్రమున మునిగితిమి.

నా డెందమును అడుగంట కలచివైచిన వేఱొకసంభవమును చెప్పుట ఇచ్చట నెంతయు ఉచితము. ఆంగ్లప్రభువులు బంగాళమును రెండుగా విభజించి బెంగాలీల హృదయమును గాఢముగ నొప్పించియుండిన కాల మది. బంగాళయువకులమైన మేము ఆ విభజనము జరిగిన సెప్టెంబరు పదునాఱవ తేదీనాడు ప్రతి సంవత్సరమును ఉపవసింపవలెనని, ఆ విభజనను రద్దుచేయించుకొనుటకై ఆందోళన సాగింపవలెనని, శపథము చేసికొంటిమి. తదనుసారము ఆ దినము రాగా నేను పస్తుందమని అనుకొంటిని. దీని నెఱిగిన శశిమహారాజు ఆగ్రహించి "మఠమునకు చెందినవాడవైన త్వాత గూడ రాజ్యాంగవ్యవహారముల జోలి వదలకున్నావా" అని చాల కఠినముగ నన్ను ఖండించినాడు. పాశ్చాత్యుల రాజకీయపద్ధతులను విడిచిపెట్టి, వివేకానందస్వామి నెలకొల్పిన జ్ఞానమార్గము ననుసరించుటే దేశోన్నతికి మార్గ మనియు మనదేశమునకు ఉచితమైన సేవ అదే అనియు ఆయన వాక్రుచ్చెను. రాజకీయపద్ధతులు నచ్చని ఆయన ఉపదేశములు నా మనస్సును మార్చనందున నేను వ్రతమును నెఱవేర్పవలె నని పట్టుపట్టితిని. గురువునకు విధేయుడు కాని శిష్యుడు గొప్పమేలును పొందలేడు అను సత్యమును ఈనాడు నేను ఎఱిగియున్నాను. కాని ఆనాడు విప్లవోత్సాహము నాలో పొంగెక్కి యున్నందున ఆయన మాటను గీటున బుచ్చితిని. ఆయనయు "నా మాట వినని వానిని ఇచ్చట ఉండనీయను, నీవు బయటికి పో" అన్నాడు. నేనును నా సామానులను కైకొని బయలుదేఱ సిద్ధపడితిని. అప్పు డచ్చట నుండిన శ్రీ విమలానంద స్వామి నన్ను సముద్రతీరమునకు పిలుచుకొనిపోయి హిత ముపదేశించి పరమార్థమును వివరించెను. ఆయన ప్రేమకును ఉపదేశమునకును వశుడనై మనసు మాఱి మఠమునకు మరలి వచ్చితిని. శశిమహారాజునకు మ్రొక్కి మన్నింప వేడుకొంటిని. ఆయనయు మన్నించి కరుణ వర్షించి శ్రీరామకృష్ణుని బోధనలను చెప్పి జ్ఞానోదయము కలిగించినాడు. మఠపుసరిహద్దుల లోపల రాజ్యాంగవిషయచర్చలు గాని వార్తాపత్రికలపఠనమును గాని ఆయన ఇష్టపడడు. వార్తాపత్రికలను ఉంచిన చోట గంగాజలమును చల్లి శుద్ధి చేయువా డాయన.

[సశేషము]

"నతగీర్వాణ మురారిబాణ కృతనానాలోకనిర్మాణ సం
తతసర్వోపనిషత్ప్రమాణ త్రిజగత్కల్యాణ సద్భక్తసం
తతిసంత్రాణధురీణ పుంగవలసత్కంఖాణ భాస్వన్మహా
పతితోద్ధారకళాప్రవీణ శివ సాంబా భక్తచింతామణీ॥"

—కూచిమంచి సోమసుందర కవి

# గంగాధర స్తవము

'నాట్య కవితా కళానిధి' - 'మహాకవి'
విద్వాన్ దర్భా వేంకటకృష్ణమూర్తిగారు, ఎం. ఏ.

శా॥ తామే తెల్వి గలార మంచు, నితరుల్ దద్దమ్మలే యంచుఁ, దా
మేమో చేయఁగలార మంచుఁ దమ కడ్డే లే దటంచున్, బలే
ధీమాతో నధికారవైభవమదాంధీభూతులై త్రుళ్లు దు
స్స్వాముల్ సూపు నవజ్ఞ కెయ్యది చికిత్సారీతి గంగాధరా? ౧

శా॥ సత్యంబే జయమొందితీరు ననుశాస్త్రాలే నిజం బైనచో,
సత్యాలాపికి భంగ మంచుఁ గలదే? సాక్ష్యం బపేక్షించునే?
అత్యాచారములున్ గుతంత్రములు నన్యాయంబు వర్ధిల్లునే?
సత్యంబే కద దైవమున్ మఱి ప్రపంచస్థాయి గంగాధరా! ౨

శా॥ రక్షింపం దగు నాథులే కటకటా! రాకాసులై ప్రాణులన్
భక్షింపం దొరఁకొన్న నేగతి భరింపన్ వచ్చు? అవ్వారలన్
శిక్షింపం గల దక్షు నొక్కరుని సృష్టింపంగ లేవొక్కొ? ఫా
లాక్షా, యేటి కుపేక్ష దీను లిడుమొ త్రాలింప గంగాధరా? ౩

మ॥ గ్రహచారంబున దొడ్డమార్పు గలుగంగానోపుఁ, గాదేని దు
స్సహదుర్దాంతదురంతదుస్తరదురాశాపూరితం బై దురా
గ్రహముల్ ద్రోహము నాస్తికత్వమును స్వార్థంబున్ ఘనీభూత లై
బహుధా దేశము నాశముం బొరయు నీపా ల్లేల గంగాధరా? ౪

మ॥ 'మన మెవ్వానికి నెట్టికీడు నొనరింపంబోముగా యెన్నఁడున్,
మన కెవ్వాఁడును నేల ద్రోహ మొనరింపం బూను' నం చెంచఁగాఁ
జన దీపాడుయుగాన ; దుష్టులకు సాజం బద్ది; తా నేల చ
చ్చునటుల్ గుట్టును నే నొనర్చితి మటంచున్ దేలు గంగాధరా? ౫

శా॥ ఆటంబాంబులు చాల వంచు జగ మాహారింప హైడ్రోజి నన్
ఘూటౌ బాంబు లోనర్పసాగిరి కడున్ గష్టించి సైంటిస్టు, లీ
పా టేలా, తెఱవంగరాదొకో భవత్ఫాలాక్షి ? అవ్వారి యా
రాటం బంతయుఁ దీఱుఁ గాదె యొకపర్యాయంబె గంగాధరా!

మ॥ రణకండూతియె యెందుఁ జూచిన, జగద్గ్రాసోగ్ర దుర్వారమా
రణయంత్రంబులె యెందుఁ గన్గొనిన, దుర్మంత్రంబులే కాని, సై
రణయున్ శాంతియు నార్జవంబు నణుమాత్రంబున్ గనన్ రావు; కా
రణ మేమయ్య జగంబు నేఁ డిటులు తార్మారొంద గంగాధరా?

శా॥ ఎన్నో సంఘము, లెన్నియో సమితు, లెన్నెన్నో సమాజంబు; ల
య్యన్నింటన్ వహవా కనంబడు నపూర్వాదర్శముల్; దూరమం
దున్నం దాఁక వినోదముం గొలుపవాకో బాణసంచుల్ గడున్ ?
అన్నన్నా! మఱి యందు వ్రేలిడిన నేమౌనయ్య గంగాధరా?

శా॥ కాకం బెప్పుడు నింటిముంగలనె కావ్ కా వంచు దా నార్చునే
కా కద్దాని నొకించుకేనియు బుధుల్ కర్ణంబులం జొన్ప; రా
రా కోకో యని యేడనో యెపుడో కూయన్ హాయిహా యంచుఁ దా
మాకర్ణింతురు కోకిలమ్ము; నిది యేన్యాయంబు గంగాధరా ?

మ॥ అమృతంబా తమ కెల్ల ? లోకముల నాహారించు నాకాలకూ
టము నీకా? అమరాళికే యిటులు కట్టా! సామరస్యంబు శూ
న్యము గాఁగా, నరు లింక స్వార్థపరు లన్నన్ వింతయే ? యేమిభే
ద మిఁకన్ మర్త్యులకున్ దివౌకసులకున్ దర్శింప గంగాధరా!

శా॥ నాకుం దోఁచినభావముల్ మనసులోనన్ నిల్పికోలేక, నీ
వాకర్ణింతు వటంచు మొఱ్ఱిడితి, నన్నాలించి పాలింతువో,
చీకా కొందెదవో, యెదైన సరె, నీచిత్తంబు నాభాగ్యమున్ ;
నీకన్నన్ మఱి నాకు దైవతము లేనేలేదు గంగాధరా!

# జైనమత-గ్రంథములు

శ్రీ అం. కృష్ణమూర్తిగారు

జైనగ్రంథములు చదువుటవలన లాభములు గలవు. ఈ మతము చాలపురాతనమైనది. భారతీయసంస్కృతిని వెల్లడించుచున్నది. బ్రాహ్మణ, బౌద్ధమతములు కాలప్రవాహములో కొలది మార్పులు చెందినను జైనమతముమాత్రము యథాతథముగ ఉన్నది. మహావీరుని నిర్యాణానంతరము రాజకుటుంబములతో ఈ మతమునకు సంబంధము లేదు. ఈ మతవ్యాప్తికి, అందులోని పరివ్రాజకులు కారకులు. జైనమత సాహిత్యము వివిధకాలములలో, భాషలో వచ్చిన మార్పులను తెలియపఱచుచున్నది. జైనులు సంఖ్యాబలము తక్కువైనను, ప్రజల మనసులయందు స్థిరముగ నిలిచి ఉన్నారు. అందుకు కారణము వారి మతసిద్ధాంతమే.

జైనమతము గ్రంథములను ప్రామాణికములుగ తీసికొనుచున్నది. ఆ గ్రంథములు గొప్పవారి అనుభవములు. జైనమతముప్రకారము ఆత్మ కర్మబంధములనుండి విముక్తి చెందినపుడు పరమాత్మ యగును. మఱియొక విషయము ఏమన, ఈ గ్రంథములలోని మాటలు మోక్షప్రాప్తినొందిన పుణ్యపురుషుల మాటలు కాకపోవచ్చును. వారిమాటలలోని సారాంశము సూచింపవచ్చును.

మహావీరుడు ప్రస్తుతజైనమతస్థాపకుడు. జైనమతాచారప్రకారము ఋషభదేవుడు దీని స్థాపకుడు. అతనిని వేదములు అవతారపురుషునిగ భావించుచున్నవి. ఋషభదేవుని తదుపరి ఇరువదిముగ్గురు తీర్థంకరులు ఉండినట్లు చరిత్ర చాటుచున్నది. పార్శ్వనాథుడు ఇరువది మూడవవాడు.

పార్శ్వనాథుని కాలములో జైనసూత్రములు పదునాలుగు 'పూర్వము'లుగ విభజింపబడినవి. ఇవి కొలదికాలము మహావీరుడు రచించిన పండ్రెండు అంగములతోబాటు ప్రామాణికములుగ తీసికొనబడినవి.

నందిసూత్రములయందు ఈ పదునాలుగు 'పూర్వము'ల పేర్లు తెలియపఱుపబడియున్నవి. విశేషావశ్యకభాష్యమందు మహావీరుడు రచించిన పండ్రెం డంగములు ఈ 'పూర్వము'ల నుండియే తీయబడినట్లు చెప్పబడినది. మహావీరునికి పూర్వము జైనమతస్థులు శిక్షాక్రమము కంటె బుద్ధిచాకచక్యమందు ఎక్కువశ్రద్ధ చూపినట్లు కనబడుచున్నది.

ప్రస్తుతజైనాగమములు రెండు ముఖ్యభాగములుగ విభజింపబడియున్నవి. మొదటిది 'శ్రుతిపురుషాంగములు'. సుధర్ముడు దీని రచయిత. రెండవభాగము మహాపురుషుల వచనములు.

బౌద్ధమతము తనగ్రంథములను త్రిపిటకములుగ విభజించినట్లు, జైనమతము తనగ్రంథములను నాలుగుతరగతులుగ విభజించినది. అవి ఏవన, ద్రవ్యానుయోగము, గణితానుయోగము, చరణకారణానుయోగము, ధర్మకథానుయోగము అనునవి. మహాయోగియైన రాజచంద్రుడు వీని ఉపయోగములను తెలిపియున్నాడు:—సందేహము వచ్చినపుడు తత్త్వ

గ్రంథమును సంప్రదింపు మని, బద్ధకించినపుడు నీతిశాస్త్రమును, ఇంద్రియేచ్ఛ కలిగినపుడు మహాపురుషుల జీవితములను పఠింపుమని, మనసు మొద్దుబాఱినపుడు గణితశాస్త్రమును పఠింపు మని.

జైనమతములోని దిగంబరులసంప్రదాయ ప్రకారము రెండుగ్రంథములు ప్రామాణికములుగ తీసికొనబడినవి. అవి ఏవన, షట్ఖండాగమము, కాషాయప్రాభృతము. ఇందు పదునొకండు భాగములు గలవు. వాస్తవమునకేమో పండ్రెండు భాగము లున్నట్లు తెలియుచున్నది. పండ్రెండవభాగమైన దృష్టివాదము కాలప్రవాహములో మఱుగుపడినది. జైన భిక్షువులు శిక్షాజీవితమునకు ఇచ్చిన ప్రాముఖ్యము వాదప్రతివాదములకు ఈయలేదు. సిద్ధసేన, సామంతభద్రులకు పూర్వము, ప్రతికక్షిమతవాదులను ఎదుర్కొనినట్లు ఆధారములు లేవు. వీరిద్దఱు క్రీ. వె. ఐదవశతాబ్దమునకు చెందినవారు.

ఈ జైనమతగ్రంథభాగములకు 'గణిపిటకములు' అనికూడ పేరు. ఏలన, ఈ రచించిన గ్రంథములు పెట్టెలయందుంచి బట్టలతో కట్టెడి వారు. ఇప్పటికికూడ ఈ ఆచారము ఉన్నది.

ఆయారాంగము, ఆచారాంగము అనునది ప్రథమభాగము. ఇందు రెండు ప్రకరణము లున్నవి. మొదటి ప్రకరణమందు మహావీరుని వచనములు, సూక్తులు ఆయన సొంతమాటలయందు తెలుపబడినవి. భారతీయతత్త్వశాస్త్రములో ప్రథమముగ వేయు ప్రశ్న ఇందు తర్కింపబడినది. అది ఏదన, జరామరణములకు అతీతమైనట్టి ఆత్మనుగూర్చి. చాలమంది తమపుట్టుకకు పూర్వస్థితిని, చనిపోయినతర్వాతి స్థితిని గ్రహింపలేరు. అట్లు గ్రహించినటువంటి వారు కొన్నివిషయములందు నమ్మక ముంతురు అని ఏవన (1) ఆత్మ ఉన్న దని, (2) విశ్వమున్న దని, (3) కర్మచేయవలె నని, (4) కర్మఫల మున్న దని. ఈ నాలుగు మూలసూత్రములమీద జైనమతతత్త్వము ఆధారపడి యున్నది.

'అహింస' జైనమతసారము. ఏజీవికిని మనోవాక్కాయములద్వారా హాని కలిగింపకుండుటయే మానవుని లక్ష్యముగ ఉండవలెను. సత్యముగూడ అహింసకు లోబడినట్టి శిక్షణ. ఇందుకు కారణ మేమన, నీవు ఇతరులకు హాని తలపెట్టినపుడు నీకు నీవె హాని కలిగించుకొనుచున్నావు. ఈ సూత్రమును తెలిసికొన్న మహాపురుషులు తాము హాని కలిగింపరు. హాని కలిగించునట్టి కారణములకు దోహద మీయరు. ప్రతిజీవియు ప్రాణమును, సుఖమును కోరుకొనును. బాధకును, మరణమునకును వెఱచును.

మహావీరుడు ఆత్మోద్ధరణ అను ఒక గొప్ప విషయమును తెలిపియున్నారు. నిన్ను నీవే ఉద్ధరించుకొనవలెను, ఎవరిమీదను ఆధారపడకు. ఆత్మనిగ్రహము వలన కష్టసుఖములన్నిటిని దాటగలవు. మహావీరుడు మానవుని ఆత్మశక్తియందు నమ్మక ముంచినాడు. దైవోపాసన చేసి భీతిచెందుటకంటె నీమీద నీవు ఆధారపడి మోక్షమును పొందగలుగుట ముఖ్యము. కులగోత్రములకు ఈ మతమునందు తావు ఈయలేదు. "ఆత్మను తెలిసికొనినపుడు, అన్నిటిని తెలిసికొందువు; అన్నిటిని తెలిసినపుడు ఆత్మను తెలిసికొనినట్లే."

మనకు కనబడు వస్తువులలోని ఆకర్షణ మనము చేయు పాపకార్యములకు కారణము. సంసారబాంధవ్యములుగూడ మోక్షప్రాప్తికి అడ్డంకులు. మహావీరుడు ఈ భాగములయందు

మానవునికి మోక్షమార్గమునందు కలుగు అవరోధములను సూచించియున్నాడు. అవి, ద్వేషము, తృష్ణ. మఱియొకచోట మోక్షస్థితి వర్ణించియున్నాడు. అది ఎట్లుండు ననిన, జరామరణములకు అతీతమైనదియు, మాటలకు అందుబాటులో లేనిదియు, మనసునకు అగోచరమైనదియు. ఉపనిషత్తులలోను మోక్షస్థితి పైవిధముగానే వర్ణింపబడియున్నది.

ఆయారాంగమందు సాధుజీవితములో అవలంబింపవలసినట్టి శిక్షణను వివరించియున్నాడు. దిగంబరులైనవారు ఎంత చలియైనను ఓర్చుకొనియుండవలెను. ఆరోగ్యము సరిలేక బలహీనముగ ఉన్నను, ఉపవాసమును విడువరాదు. ఇందుకు కారణమేమన, వారు దేహముపై ఎట్టి మోహమును పొందియుండకూడదు. బాహ్యాంతర ప్రపంచములయందు వాంఛవీడి మోక్షప్రాప్తికై సాధన చేయవలెను.

రెండవ అంగము 'సుయగడ'. ఇందు ఆ మతములోని భిక్షువులు ఇతరమతసిద్ధాంతముల విశ్వసింపకుండుటకై మార్గములు సూచింపబడినవి. జైనమతసిద్ధాంతములందు సంపూర్ణవిశ్వాసముతో నడచుకొనవలెను. భిక్షుజీవితములోని అడ్డంకులను వానిని ఎదుర్కొను మార్గములు గూడ సూచింపబడినవి. మిత్రులుగాని, బంధువులుగాని సాంసారికజీవితములోని సుఖములను వర్ణించి త్రిప్పుకొనుటకు ప్రయత్నించినను, ఆ ఆలోచనలను భిక్షువులు ఏ విధముగ ఎదుర్కొనవలెనో చెప్పబడియున్నది. కామినీ కాంచనముల బంధములనుండి ఎటుల విముక్తి పొంద వీలుపడునో కూడ సూచింపబడినది. ఈ విధమైనటువంటి జాగ్రత్తలు బౌద్ధ, జైన మతములలోనే హెచ్చుగ కానవచ్చుచున్నవి.

మూడు, నాలుగు అంగములయందు మానవుని వివిధాశ్రమములలో గడపవలసినజీవితమును గూర్చి తెలుపబడినది. పంచమాంగమునకు 'భగవతి' అని పేరు. జైనమతమునుగూర్చి సంపూర్ణముగ ఇందు వ్రాయబడియున్నది. ప్రశ్నోత్తరరూపములలో ఇది వ్రాయబడియున్నది. షష్ఠాంగమునందు ఉదాహరణములు, కథలు వ్రాయబడియున్నవి. సప్తమాంగమందు సాంసారికజీవితమును గడపుచు జైనమతసిద్ధాంతములను ఎటుల అనుసరింపవచ్చునో తెలుపబడియున్నది.

అష్టమ నవమాంగములందు మహాపురుషుల జీవితవిశేషములను వారు సాధనద్వారా మోక్షముపొందినట్టి స్థితిని వివరించియున్నారు. దశమాంగమందు పంచమహాపాతకములను, పంచమహాగుణములను గూర్చి వివరింపబడియున్నది. ఏకాదశాంగమందు కర్మ, దాని ఫలితములనుగూర్చిన విశేషములు కథలద్వారా వ్రాయబడియున్నవి.

ఈ పండ్రెండు అంగములకు సహాయభూతములుగ ద్వాదశోపాంగములు గలవు. ఇందు ఉపాంగ మనిన స్వతంత్రమైనటువంటి రచనయే కాని కేవలము 'అంగమునకు సహాయభూతము' మాత్రమే కాదు. ప్రథమోపాంగమందు స్వర్గనరకలోకములందు పుట్టుకలనుగూర్చి వివరించియున్నది. ద్వితీయోపాంగమందు 'సూర్యాభుని' యాత్రను గూర్చి వ్రాసియున్నారు. సూర్యాభుడు మహావీరునియొద్దకు ఏ విధముగ వచ్చినది, అతని కార్యనిర్వహణనుగూర్చి వివరముగ వ్రాయబడియున్నది. తృతీయోపాంగము ఇరువదిభాగములుగ విభజింపబడియున్నది. చతుర్థోపాంగము జైనమతములోని ముఖ్యసూత్రములను తెలుపుచున్నది. ప్రాచీనమాన

వులు ఏ విధముగ ఇరువదిఆఱు దేశములందు వ్యాప్తిచెందియున్నారో తెలుపుచు భౌగోళిక శాస్త్రాభ్యాసమునకు తోడ్పడినది. పంచమ, షష్ఠ, సప్తమాంగములు విజ్ఞానశాస్త్రమును ముఖ్యముగ ఖగోళ, భౌగోళికశాస్త్రములను గూర్చి తెలుపుచున్నవి. మిగిలిన ఐదు అంగములు కథలరూపమున ఉన్నవి. జైనమతములో పది 'పైన్నము' లున్నవి. ఇవి స్వతంత్రమార్గమవలంబించి మోక్షప్రాప్తిని పొందిన మహాపురుషుల అనుభవములు. అందు ముఖ్యముగ భిక్షుకుల అంత్యదశను గూర్చి వ్రాయబడినది. జైనమతము ప్రకారము మరణము రెండువిధములు : మొదటిది 'పండితమరణము'. అది ఏమన, అంత్యదశలో అజ్ఞానతృష్ణలను విడనాడి శాంతియుతముగ చనిపోవుట. మతసిద్ధాంతములందు నమ్మకములేక కడపటి రోజులయందును, బంధుమిత్రులయందు వ్యామోహము కలిగి మరణించుటకు 'బాలమరణము' అని పేరు.

దీని తరువాత ఆఱు ఛేదసూత్రము లున్నవి. భిక్షువులు వారిజీవితములో పొరపాటు పడినప్పుడు భిక్షుజీవితమును ఛేదించి శిక్ష విధింపబడును.

ఆపై, నాలుగు మూల సూత్రము లున్నవి. ఉత్తరాధ్యయనము, ఆవశ్యకము, దశవేయలీయ, పిండనిజ్జుత్తి అనునవి. ఉత్తరాధ్యయనము పద్యరూపములో నుండి ముప్పదియాఱు ప్రకరణములుగ విభజింపబడియున్నది. మహాభారతములోని శాంతిపర్వమువలెను, బౌద్ధుల ధర్మపాదమువలెను జైనులకు 'ఉత్తరాధ్యయనము' మతగ్రంథము. మొదటి ప్రకరణమున శిష్యులు అవలంబింపవలసిన పద్ధతులనుగూర్చి చెప్పబడియున్నది. జ్ఞానవృద్ధులముందు శిష్యుడు మాటలాడకూడదు, ఎవరును అడుగకయే మాటలాడకూడదు, కోపమును జయింపవలెను, సుఖదుఃఖములను సమానముగ చూడవలెను. రెండవప్రకరణములో శిష్యుడు తన మార్గములోని అడ్డంకులను వానిని ఎట్టుల ధైర్యముతో ఎదుర్కొనవలయునో సూచింపబడియున్నది. భిక్షువును ఎవరైన దూషించిన వారిపై కోపగించుకొనరాదు. కఠినమైన దుర్భాషలాడిన, హృదయములో వానికి తావు ఈయకూడదు. ఎవరైనను కొట్టిన వారిని కోపగించుకొనరాదు. మూడవ ప్రకరణమునందు శిష్యుని ఆధ్యాత్మికాభివృద్ధిని గూర్చి తెలుపబడినది. ఈ ప్రపంచములో నాలుగు విషయములు — మానవుడుగ జన్మించుట, మతసిద్ధాంతములలో అధ్యయనము, అందు విశ్వాసము, క్రమశిక్షణ — ముఖ్యమైనవి. నాల్గవప్రకరణమున ప్రాపంచికసుఖములలోనుండు నిజస్వరూపమును వివరించియున్నారు. ఐదవప్రకరణమునందు మూర్ఖునిమృతికి, జ్ఞానిమృతికి గల వ్యత్యాసములను వివరించియున్నారు. తొమ్మిదవ ప్రకరణమునందు 'నమి' అను మహర్షి జీవితమును వివరించియున్నారు. పదవప్రకరణములో జీవితము ఒక ఎండుటాకుకు పోల్చబడియున్నది. పదునొకండవ ప్రకరణమున పండితునిగూర్చి వ్రాయబడినది. పన్రెండవప్రకరణమున 'హరికేశి' యను హరిజన భిక్షువు జీవితమును వివరించియున్నారు.

రెండవది 'అవశ్యకము'. ఇందు భిక్షుదినచర్యనుగూర్చి వ్రాయబడియున్నది. మూడవమూల సూత్రము 'దశవేయలీయ'. ఇందు ధర్మములోని మూడురూపములను వివరించియున్నారు— అహింస, నిష్ఠ, తపస్సు. భిక్షువు తనఆహారమును సేకరించువిధము తేనెటీగ ఏ విధముగ పలుపుష్పములనుండి తేనెను సేకరించునో అటుల సేకరింపవలెనని పోల్చి చెప్పియున్నారు.

భిక్షువు ఏ విధముగ నడువవలెనో, కూర్చుండవలెనో, నిద్రింపవలెనో, ఆహారపానీయములు తీసికొనవలయునో వివరించియున్నారు. నాలుగవ మూలసూత్రము 'పిండనిజ్జుత్తి'. ఇందు భిక్షువులకుమాత్రమే సంబంధించినవిషయములు తెలుపబడియున్నవి.

ఈ మూలసూత్రములకు నాలుగురకములైనటువంటి టీక వ్రాయబడినది. అందు 'నిజ్జుత్తి' ప్రాచీనమైనది. అది ప్రాకృతములో వ్రాయబడియున్నది. నిజ్జుత్తి తరువాత భాష్యములు. ఇవిగూడ ప్రాకృతములోనే వ్రాయబడియున్నవి. ఆపై 'చుణ్ణిలు' అను చిన్నటీకలు వ్రాయబడియున్నవి. ఇవి 'సంఘదాసగణి' యనువారిచే రచింపబడియున్నవి. నాలుగవది 'అభయదేవ', 'మలయగిరి', 'శీలాంకులు' రచించిన టీకలు.

పై చెప్పినటువంటి గ్రంథములే కాక జైనమతమునందు మఱికొన్నిగ్రంథములుగూడ నున్నవి. భారతీయసంస్కృతీసాహిత్యములకు ఈ గ్రంథములు చాలవఱకు తోడ్పడియున్నవి.



ఓం శ్రీ కృష్ణాయనమః

# త్రిపిటకములు

## శ్రీ చిలువూరి మాధవకృష్ణకవిగారు

శ్రీబుద్ధభగవానుడు, ఆయనశిష్యులు లోకమును ప్రబోధించిన సందేశమునందలి సూక్తిరత్నములే యీ త్రిపిటకములు. ఇవి మూడును పాళీభాషయం దున్నవి. ప్రాచీనసంఘత్రయమునం దివి ప్రస్తావింపబడియున్నవి. లోకసంగ్రహమునిమిత్తము థేరవాదప్రాంతములం దివి సంకలనమొనర్పబడి సంగుప్తముగా సంరక్షింపబడినవి.

ఈ పవిత్రబోధనలు శతాబ్దములకొలది మానవసామాన్యమును ప్రబోధించి, విజ్ఞానభిక్ష నిడినవి; నిర్వాణపథమును బోధించినవి. సత్యాన్వేషణమున ప్రజల కెంతయో సాయపడినవి. 'త్రిపిటకము' లను పాళీశబ్దమునకు 'మూడుగంపలు' అని యర్థము. సంస్కృతమునందును 'పిటకము' అను శబ్దమునకు 'గంప' యనియు, 'చిన్నపెట్టె' యనియు నర్థముగలదు. ఉన్నచోటనె యుండి మధురాతిమధురమగు తమ పరిమళమువలన రసికుల నాకర్షించు పూలగంపలవలె నివియు జిజ్ఞాసువుల నాధ్యాత్మికపథమున కాకర్షించుచుండు సన్నయర్థమిం దిమిడియున్నది. ఈసంకలనత్రయము శ్రీబుద్ధభగవానుని సందేశమును గురుశిష్యపరంపరన్యాయమున, మొక్కవోనితీరున, లోకమున కందించినవిధాన మత్యద్భుతము.

వినయపిటకము, సుత్తపిటకము, అభిదమ్మపిటకము అనునవియే యీ త్రిపిటకములు. ఇందు వినయపిటకము భిక్షుకసంఘనియమములగూర్చియు, ఆశయములగూర్చియు, నాటి

సాంఘికావసరములగూర్చియు జర్చించును. సుత్తపిటకమున ఆధ్యాత్మికబోధనలతాత్త్విక సారప్రస్తావము గలదు.

వినయపిటకమును, సుత్తపిటకమును ప్రాచీనము లయినవి. అవి క్రీ పూ. 5-వ శతాబ్దమునకు జెందినవి. అభిధమ్మపిటకము అర్వాచీనము — క్రీ. పూ. మూడవశతాబ్దమునకు జెందినవి. అర్వాచీనాచార్యుల రచనలును నందు గలవు.

లంక, బర్మా, సయాములందు వృద్ధాచారమనుసరింపబడుచున్నది. పాళీభాషయందున్న త్రిపిటకములు ఈ దేశములందు మిక్కిలిపవిత్రములుగను, పూజ్యములుగను, ప్రామాణికములుగను పరిగణింపబడుచున్నవి.

ఈ పాళీత్రిపిటకములే కాక, సంస్కృత బౌద్ధగ్రంథములును, నేపాలీగ్రంథములును, మధ్యాసియా, చీనా, టిబెట్టు — ఈ దేశములన్నింటికి సంబంధించినవి ఎన్నియో గలవు. ప్రస్తుతపు పాళీగ్రంథములు ప్రాచీనకాలమునందలి విభాజ్యవాదుల పవిత్రగ్రంథప్రతినిధులై వెలయుచున్నవి. అందు కొంతభాగము ప్రత్యేకముగ పరిష్కరింపబడి లంకయందలి అనురాధపురమునగల మహావిహారమను సన్న్యాసనిలయమున నేటికిని ఉపయోగింపబడుచున్నది.

త్రిపిటకములు పారమార్థికములే యని యంగీకరింపబడినను అవి సాక్షాత్కారప్రకటనసమర్థములని గాని, ఆధ్యాత్మికమహానుభూతివలన ప్రభవించినవని గాని తలంపరాదు. అవి పవిత్రములు, అపూర్వములు ననుటయే వాని కట్టిప్రతీతి కలుగుటకు కారణము. అవి యే ప్రత్యేకశాఖకును జెందినవి కావు; సర్వసాధారణములు; ప్రజాసామాన్యమెల్ల పఠించి తరింపదగినవి.

బౌద్ధపారంపర్య మనియు, బుద్ధభగవానునిచే స్వయముగా బోధింపబడిన - సంభాషింపబడిన - భాషయనియు ప్రసిద్ధినందిన పాళీభాషయందే ఈ త్రిపిటకములు రచింపబడియున్నవి. మగధదేశమునందు జనసామాన్యవ్యవహారసమ్మతమై యున్న 'మాగధీ' భాషయే పాళీ. ఈ త్రిపిటకములందలి భాష గంభీరమును, సులభసుందరమును, శ్రుతిపేయమును భావాలంకారాది కవితామాధుర్యసంభరితమునై యలరారుచున్నది. భావగాంభీర్యమును, ఆధ్యాత్మికశ్రద్ధాసక్తియు నిక జెప్ప ననవసరముగదా!

ఈ గ్రంథములం దందందు విసుగెత్తించు పునరుక్తు లున్న మాట నిజమే. ఈ పిటకములు ఎంతయో కాలము లిపిబద్ధములు ములు గాక గురుపరంపరగ శిష్యులకు ముఖాముఖగ సంక్రమింపజేయబడుటయే ఈవిచిత్రపునరుక్తికి కారణము! క్రీ.పూ. 80-వ సంవత్సరప్రాంతముననే - నాటి లంకారాజ్యాధిపతి యగు పదగామ్ని అభయునికాలముననే - ఈ త్రిపిటకములు ప్రప్రథమముగా లిఖితములుగావింపబడినవి.

నిజముగా త్రిపిటకములు విశ్వాసపాత్రములు, చారిత్రకములు. అందు ముఖ్యముగా-ఎక్కువగా-బుద్ధభగవానునిబోధనలును ఆయనశిష్యసందోహబోధనలును గలవు. అజాతశత్రువు సింహాసన మధిష్ఠించిన యెనిమిదవయేట బుద్ధభగవానుని మహాపరినిర్వాణానంతరము కొలదిరోజులకు రాజగృహమున జ్యేష్ఠకాశ్యపుని ఆధిపత్యమున జరిగిన మొదటి సంఘసమ్మేళనమున ఈ బోధనలు సంకలితము చేయబడి పొందుపఱుపబడినవి. భగవానుని ప్రియశిష్యుడును, విశ్వాసపాత్రుడును, సంఘ

సేవకుడును నగు ఆనందుడు సుత్తపిటకమును పరిష్కరించెను; జ్యేష్ఠోపాలి వినయపిటకమును చక్కదిద్దెను. తరువాత నొక శతాబ్దమునకు ద్వితీయసంఘసమ్మేళనము వైశాలీనగరమున సమావేశపఱుపబడెను. తదుపరి అశోకచక్రవర్తికాలమున మొగలిపుటతిస్సుని పర్యవేక్షణ క్రింద మూడవసంఘసమ్మేళనము కావింపబడెను. అందే యీ త్రిపిటకములు పూర్తిగా పరిష్కరింపబడి, పారమార్థికములుగా నామోదింపబడెను. ఈతృతీయసంఘ సమ్మేళనము క్రీ.పూ. 272 న, అనగా శ్రీబుద్ధభగవానుని మహాపరినిర్వాణానంతరము 236 సంవత్సరములకు, పాట్నాయని నేఁడువ్యవహరింపబడుచున్న పాటలీపుత్రమునందు సమావేశమయ్యెను. అభిదమ్మపిటక మీ కాలముననే పారమార్థిక గ్రంథసమూహమునఁ జేర్పఁబడెను.

ఈపిటకత్రయమున, 'వినయమున'సన్న్యాస జీవనమున నవలంబింపవలయు నియమములు, సాధనలు, సంఘసభ్యుల నిత్యజీవనమున—వారి శీలము, సేవ, ప్రవర్తన—వీనియందు పరిశీలింపదగు మనోజ్ఞములగు విశేషవిషయములు గలవని మనము గుర్తించితిమి. కర్తవ్యాకర్తవ్యముల నిర్ణయమే యిందనుసరింపబడిన ప్రాతిపదిక. సుత్తవిభంగ మీ వినయపిటకమువనే గలదు. ఇందు పరాజికపాళియనియు, పచిత్యపాళియనియు భాగద్వయము గలదు. ఇవియే కాక శ్రీబుద్ధభగవానునియొక్కయు, తదితరులయొక్కయు జీవితఘట్టములును, చారిత్రికాంశములును, నాటిసంఘచర్చలును, బోధనలును వినయపిటకమున గలవు. చుల్లవగ్గయనియు, మహావగ్గయనియు వ్యవహరింపబడు భాగద్వయసమన్వితమగు భాండకమున నివి సంకలితము చేయబడియున్నవి. మఱియు నిద్వజ్జనర్తనీయమయిన ఈ క్రిందిభావముగల ప్రవచన మీ మహావగ్గయందే గలదు :

'ఓభిక్షులారా, పొండు, అనేకులలాభము కొఱకు, అనేకుల క్షేమముకొఱకు, జగత్తునందలి యనుకంపవలన, మానవులయొక్కయు, దేవతలయొక్కయు క్షేమముకొఱకు పర్యటింపుడు. ఓభిక్షులారా పవిత్రమయిన ధర్మమును ఎలుగెత్తి చాటుడు. పవిత్రము, పరిపూర్ణము, పరిశుద్ధము నగు జీవనమును బోధింపుడు.'

బుద్ధభగవానుని బోధనలయందు చాల భాగము 'సుత్తపిటకము'న గలదు. అందు 'దిగ్ఘ', 'మజ్ఝమ', 'సంయుట్ట', 'అంగుట్టర', 'క్షుద్దక' అని పంచనికాయములు గలవు. ఇందలి సూక్తు లన్నియు ప్రత్యేకమయిన శ్రద్ధయు, స్వాతంత్ర్యమును బురికొల్పుచుండును. ఈసూక్తులవలననే బుద్ధభగవానుని వ్యక్తిత్వము మానసగోచరమగుచున్నది. అనేకసూక్తులలో గాంభీర్యము, భాషాలంకారము, రచనానైపుణ్యమును వెల్లడియగుచున్నవి. ప్రతిసూక్తము, జాలియు, జ్ఞానమును జనసామాన్యము నెడ అపారకారుణ్యమును గల బుద్ధభగవానుని దివ్యస్వరూపమును మన కన్నులయెదుట గోచరింపజేయును. ఈ సుత్తపిటకమును జదువునపుడు పాఠకుడు అందు వివరింపబడియున్న మహావాక్యములకు ముగ్ధుడగుటయే కాక, భగవానుని గంభీర వాణీ ప్రతిధ్వనిని అనుభవించిమించును.

పంచనికాయములందు మొదటినాలుగును గద్యరచనలు. క్షుద్దకమను పంచమనికాయము ముఖ్యముగా పద్యమయము, విషయసంకలనమున సమ్మిశ్రితము. 'దిగ్ఘనికాయమున ముప్పదినాలుగు ప్రసంగములు గలవు. 'దిగ్ఘ' (దీర్ఘ) అనగా పొడవైన యని యర్థము.

అందువలన నతి దీర్ఘములగు ప్రసంగము లన్నియు నిందు సమకూర్చబడియున్నవి. ఇవన్నియు కేవలప్రబోధమాత్రములు గావు. అవి వివిధరూప ప్రదర్శకములు. కొన్నిటియందు మనము శ్రీబుద్ధభగవానుని నిత్యనూతనప్రవ చనముల గనిపట్టగలము. కొన్ని పూర్వగాథల వివరించును. ఇందలి మొదటి పదుమూడు సూక్తులును పరిష్కరింపబడినవి. స్వయముగా భగవానుని ప్రవచనమనదగు పరినిర్వాణ సూక్తము వివిధరచనావిధానములను, విభిన్న శైలీపాకములు గలిగి యుండి ననేకముగ సమ కూర్చబడుట గమనార్హము.

మజ్జమనికాయమున సామాన్యప్రసంగ ములు సమకూర్చబడియున్నవి. మజ్జమసూక్త మత్యంతప్రాచీనము మాత్రమే కాదు; పరి పూర్ణమును, ఉత్తేజకరమును. అది భగవా నుని హృదయమును —— శీలము, జ్ఞానము —— బడయ ననువగు భావానుభూతిని గలిగింప సమర్థము.

సంయుట్టనికాయము, అంగుట్టరనికాయము వివిధవర్గములకు జెందిన భగవానుని సూక్తులు గలిగియున్నవి. సంయుట్టమునం దనేక సూక్తులు గలవు. అందు చాలవఱకు అన్నియు సంగ్రహములు. ఒక్కొక్కటియు నొక్కొక్క విషయమునుగూర్చి చర్చించును. అంగుట్టము నందు సూక్తులన్నియు సంఖ్యానియమబద్ధము లొనర్చబడినవి. 'ఖుద్దక' నికాయమున పదు నైదు గ్రంథములు సంగ్రహింపబడినవి. ఇవ న్నియు చక్కనిభాషయు, భావమును గలిగి ఉత్తేజకరములుగ నున్నవి. ఈ గ్రంథము లన్నియు పద్యాత్మకములు. అచ్చటచ్చట ద్విపదలను బోలిన చిన్న పద్దెములును గలవు. ప్రశస్తమయిన 'ధమ్మపద' మీ నికాయమునకు జెందినదే. 'సుత్తనిపాత' 'తెర' 'తెరఘాల' 'ఉదాన' మున్నగున వీ ఖుద్దకమునందలి ముఖ్యగ్రంథములు. కాని యందలి గ్రంథములు కొన్ని ప్రత్యేకతరగతికి జెందినవి. ఇవన్నియు భగవానుని మాహాత్మ్యాదులను ప్రస్తావించు చున్నవి.

అభిదమ్మపిటకము సార్థకనామము గలది; అన్నింటిని మించినది. ఇందలి విషయవిభాగము, ఆశయము — ఇవియే దీని శ్రేష్ఠ్యమునకు కార ణము. భగవానుడు బోధించిన విషయముల నన్నింటిని ఇది క్రమరీతిని జర్చించుచున్నది. ఇందలి రచనావిధానము సంపూర్ణముగా సాం కేతికము. అందువలన నిందలి గ్రంథములు, సూక్తులు గురుముఖముననే కాని గ్రహింప నలవికా కున్నయవి. ఇందు గల గ్రంథములు ఏడు. 'ధమ్మసగని' ఈ అభిదమ్మతాత్త్విక మార్గమునకు మూలకందమై యలరారు చున్నది. మానసిక నైతికసూక్తులకు సంబం ధించిన సాంకేతికశబ్దము లెన్నియో యిందు గూర్చబడియున్నవి. అశోకుని కాలమున క్రీ. పూ. 250 ప్రాంతమునపెద్ద 'తిస్సా మొగాలిపట్టని'చే రచింపబడిన 'కథావత్తు'గూడ నిందు జేర్చబడి యున్నది.

ఆధునిక కాలమున నీత్రిపిటకములు ఆంగ్లము, ఫ్రెంచి మున్నగు ననేకభాషలలోనికి అనువ దింపబడినవి. ఇక నీ త్రిపిటకములయందలి ముఖ్యాంశముల నందందు పరిశీలింతము.

"సముద్రమునందలి జలమంతయు నొక్క రుచియే —— ఉప్పదనము — కలిగియున్నట్లే, బుద్ధభగవానుని సూక్తు లన్నియు —— బోధన లన్నియు —— ఒక్క ఆశయమే గలిగియున్నవి. అదియే ముక్తి, నిర్వాణము".

బుద్ధభగవానుడు తన ప్రథమానుశాసనమున — భిక్షుకపంచకమునకు — నిట్లు ప్రవచించెను : స్వార్థాభిలాషయందును, భోగలాలసత్వమునందును, శరీరసంశోషణమునందును బ్రహ్మచర్యాదినిష్ఠయందును అత్యంత అసిధారావ్రతమునుపోని అత్యంత తీవ్రమార్గమును వీడి తథాగతుడు మధ్యమార్గమును—సాక్షాత్కారము, జ్ఞానము, శాంతము నిర్వాణము గలిగింపగలదానిని — కనుగొనెను. ఆ మధ్యమార్గ మేది? అదియే ఉత్తమోత్తమమయిన అష్టాంగమార్గము. అదియే నిర్వాణసంధాయకము.

బుద్ధభగవానుని బోధన జీవితమునకు వెలుగును, పరిపూర్ణతను గూర్పగల మార్గము. జ్ఞానమార్గమునకు అంతస్స్థాపన — నైతిక పరివర్తన — మానవుని జిజ్ఞాసువునొనర్చి అంతర్దృష్టినిగలిగించి, సత్యాన్వేషణమునకు దారి జూపును. ఇందులకు మూలము మనస్సు — మానవమనస్సే.

ధమ్మపద మిట్లు వక్కాణించుచున్నది:—

స్మృతిపథమున గల బాటలకెల్ల— రాష్ట్రముల కెల్ల — మనమే అగ్రగామి. అదియే ప్రధానము. తక్కిన వన్నియు మనఃకల్పితములే. నిష్కల్మషమయిన మనస్సుతో, మానవు డేమాటాడినను, ఏకార్య మొనర్చినను, 'వీడనినీడవలె' ఆనంద మాతని ననుగమించును.

మధ్యమార్గమును—అష్టాంగమార్గమును—అనుసరించుటయందలి ఆంతర్యము కష్టము, దుఃఖము, నిరాశాపూరితమగు నైహికజీవితావగాహానము, పరిశీలనము, అనుభవము అనువానియం దిమిడి యున్నది.

'జన్మము దుఃఖము; క్షైణ్యము దుఃఖము; వ్యాధి దుఃఖము; బాధ దుఃఖము; మరణము దుఃఖము; అనిష్టవస్తుసంబంధము దుఃఖము; ఇష్టవస్తువియోగము దుఃఖము; అనిష్టవస్తు సంప్రాప్తియు దుఃఖమే'.

ఈ దుఃఖమునకు కారణము లోభము. ఈ లోభమే పునర్జన్మమునకు కారణము. దుఃఖమునకు మూలకారణమగు లోభమును జయించినచో — మన మీ దుఃఖమునుండి విముక్తులము కాగలము. అష్టాంగమార్గమే దీని కనువైనది. కావున దానినే మానవు డనుసరింపవలయును.

పరినిర్వాణసూక్తమునందు పరివేదనాకులుడయిన ఆనందుని భగవాను డిట్లు ప్రబోధించెను : 'ఆనందా, సత్యజ్యోతియే నీఆశ్రయము. తదితరము నెందును దేనిని ఆశ్రయింపకుము. ఇప్పు డేనియు, నాయనంతర మేనియు ఇతరము నాశ్రయింపక జ్ఞానజ్యోతిని ఆశ్రయించువారే నాశిష్యులలో శ్రేష్ఠులు. వారే జిజ్ఞాసువులు కాగలరు...'

భగవానుని బోధనల హృదయపూర్వకముగ ననుసరించువాడు స్వయముగా అనుభూతి నందక కేవల మంధవిశ్వాసము కారణముగా దీనిని విశ్వసింపడు.

ఒకానొకచో భగవాను డిట్లు నుడివి -యున్నాడు : కర్ణాకర్ణిగ వినుటవలనను, పారంపర్యమను నెపమునను, ప్రమాణగ్రంథములం దున్నంతమాత్రముననను, తర్కసమ్మతమగుట వలనను, ఒకానొక మహనీయుడు ప్రవచించి నందువలనను దేనిని విశ్వసింపకుము.

నీయంతట నీవు విషయమును సాక్షాత్కరించుకొనగలిగినపుడు అనుభూతి నందినపుడు—

నీ జీవితమున ననుసరించినపుడు—ఆవిషయము నీకును నితరులకును శ్రేయస్కర మని గుర్తించి నపుడే దానిని విశ్వసింపుము, పరిగ్రహింపుము.

అంధవిశ్వాసములన్నియు ఆటంకములే యయినటుల శుష్క సిద్ధాంతము లన్నియును నిష్ఫలములే. సత్యాన్వేషికి తాత్త్వికచింతనము వృథాకాలయాపనమే. తాత్త్వికసిద్ధాంతములు, చింతనము పరమార్థజ్ఞానాన్వేషణమునకు బనికిరానియట్లే యజ్ఞయాగాదులు సైతము సత్యాన్వేషణమున నిష్ప్రయోజకములే.

మధ్యమనికాయమున నిట్లు గలదు: అజ్ఞానము పటాపంచలై జ్ఞానము త్రిప్తమానమయినపుడు మానవుడు ఇంద్రియసుఖములకు, విషయగ్రంథులకు, ఆచారనియమాదులకు, ఆత్మసిద్ధాంతమును పరిగ్రహింపడు.

ఆధ్యాత్మికరంగమున, ధర్మసాధనమున కుల మతభేదములు, వీనియందలి తరతమభేదములు నుండవు. మానవుని ఉత్తమునిగగాని, అధమునిగగాని చేయునది శీలమే కాని జాతియు, మతమును, విద్యయు నే మాత్రము కావు.

త్రికరణశుద్ధిగ నెవడు పరులకుకీడుసేయడో, త్రికరణముల నెవడు జయించునో ఆతడే ఉత్తముడు. క్రోధోన్మత్తుడును, దురాలోచనగలవాడును, పాపియు, ఈర్ష్యాళువును, పాపచింతలు గలవాడును, వంచకుడును ఐయిన మానవుడే అధమాధముడు.

ధ్యానాయత్తచిత్తతయు, నైతికజీవనమును నిర్వాణప్రాప్తికి మార్గములు. ధ్యానసాధన కనుకూలములగు మార్గము లెన్నియో యీ త్రిపిటకములం దుల్లేఖింపబడియున్నవి. ఈ మార్గములందు 'చతుర్బ్రహ్మవిహార'. సాధనయే ఉత్తమోత్తమముగా పరిగణింపబడుచున్నది. ప్రేమమార్గము, అనుకంపమార్గము, శాంతమార్గము, ఆనందమార్గము అనునవియే యీ చతుర్బ్రహ్మవిహారములు. వీనిని సాధించినజిజ్ఞాసువు అరిషడ్వర్గముల జయింపగలడు. సమస్తభావాతీతుడై యతడు జ్ఞానార్జనమున పురోగమించును. మమతాహంకారరాహిత్యమే పరిపూర్ణజన్మము...

ఇట్టిసూక్తు లెన్నియో యీత్రిపిటకముల యందు గలవు. అవి జ్ఞానార్జనమునకు మానవ లోకమున కెంతయో తోడ్పడ గలవు...

"సమస్తప్రాణులు ఆనంద మనుభవించుగాక. సమస్తప్రాణులు జ్ఞానోత్తేజము నందుగాక!"

మరణంబు లేకుండ మందు చేఁగలిగినఁ, గాలున కేటికిఁ గలఁగఁబాఱ?
ప్రాయంబు చెడని యుపాయంబు దొరకిన, నేమెడ ముదిమికి నేల తలఁకఁ?
గామితార్థము లిచ్చు కామధేనువు గల్గఁ, గఱవున కేటికి వెఱచి యొదుఁగ?
వజ్రదేహంబుగా వరము సిద్ధించిన, శస్త్రాస్త్రముల కేల జలదరింప?
శరణు సొచ్చిన యటువంటి జనుల కెల్లఁ గావఁ బ్రోవఁగ దాతవు గలవు నీవు
కలితలక్ష్మీశ సర్వజగన్నివేశ విమలరవికోటిసంకాశ వేంకటేశ॥

—శ్రీ తాళ్లపాక పెదతిరుమలాచార్యుడు

# న్యూటెస్టమెంటు - క్రొత్తనిబంధనము

ఆచార్య శ్రీ కొమాండూరి కల్యాణరాంగారు

న్యూటెస్టమెంటు అనునది ప్రపంచములోని క్రైస్తవుల కందఱికిని పూజ్యమైన పవిత్రమత గ్రంథము. 27 కాండములు గల్గిన యీ గ్రంథము తొలిక్రైస్తవదేవాలయములన్నిటి లోను ఉపయోగింపబడుచుండిన ప్రతులనుండి సంకలింపబడినది. ప్రథమములో గ్రీకుభాష యందు వ్రాయబడిన యిది తర్వాత ప్రపంచ ములోని అన్నిభాషలలోనికి తర్జుమా చేయ బడినది. ఇంగ్లండు రాజగు మొదటిజేమ్సు ఆజ్ఞ మేరకు ఆంగ్లభాషలోనికి తర్జుమా చేయబడి క్రీ. శ. 1611 లో ప్రకటింపబడిన గ్రంథమును 'అధికారపూర్వకభాషాంతరీకరణ' మని పేర్కొం దురు. ఈ గ్రంథమూలములైన మొదటివ్రాత ప్రతు లన్నియు పోగా, ఇపుడుండునవి యన్ని యు ఆ వ్రాతప్రతుల నకళ్లకు నకళ్లు. 4 నుండి 10 వ శతాబ్దమునకును చెందిన యీ వ్రాత ప్రతులు సుమారు 1,700 లు పురావస్తుశాలల లోను, గ్రంథాలయములలోను పదిలపఱుప బడియున్నవి.

ఈ గ్రంథమున కొంతవఱకు జొరాస్ట్రియన్ మత (అనగా పార్శిమత) ప్రాబల్యము కన్పట్టు చున్నది. బైబిలులో వర్ణింపబడిన పిశాచాధి పతి (సైతాను), దేవదూతలు, రాక్షసులు, అవతరింపబోవు రక్షకుడు, పునరుత్థానసూత్ర ము, తుదితీర్పు, స్వర్గవాసభావము మొదలగు విషయములు జొరాస్టరు మతములోనుండి గ్రహింపబడినవి.

ఈ గ్రంథము జూదులమతగ్రంథమగు 'ఓల్డు టెస్టమెంటు' (ప్రాతనిబంధనగ్రంథము) లో నుండి మొలచిన దనియు, దీనిపై ఓల్డుటెస్ట మెంటు ప్రాబల్యము ఎక్కువగా నున్న దనియు దీనినివ్రాసిన ప్రముఖు లభిప్రాయపడుచున్నారు. కాని యూదుమతగ్రంథమగు 'ఓల్డుటెస్టమెంటు' నకును, క్రైస్తవగ్రంథమగు 'న్యూటెస్ట మెంటు'నకును కొన్ని ముఖ్య భేదము లున్నవి. క్రైస్తవగ్రంథము జీసస్సును మహనీయుని గుఱించియే యున్నది. యూదులగ్రంథము ఒక్కగా నొక్క దేవుని నమ్మి ఆయన దుష్ట శిక్షకు డనియు, శిష్టరక్షకు డనియు, జంతుబలి వలన మానవులపాపములు పరిహారమగునని యు నొక్కి చెప్పుచు, శిష్టుడైన మానవు డాచ రింపవలసిన కర్మకాండను పేర్కొనియున్నది.

'న్యూటెస్టమెంటు'లోని మొదటి నాల్గు కాండములు జీసస్ యొక్క జీవితచరిత్రను వర్ణించుచున్నవి. ఒకబీదవడ్రంగికి కుమారు డుగా పుట్టిన శ్రీజీసను బాల్యమునుగుఱించి వివరములు తెలియవు కాని పండ్రెండేండ్ల బాలుడుగానున్నప్పుడే దేవాలయములో విద్వాంసుల గోష్ఠులలో కూర్చుండి ఆధ్యాత్మిక విషయములలో తనకు గల ఇష్టమును ప్రకటిం

చెను. ముప్పదియేండ్ల వయస్సువఱకు ఇంటిపట్టున అజ్ఞాతముగా నుండి, అప్పుడు తనమతమును బోధింప ప్రారంభించెను. క్రమమైన బడిచదువు లేనివాడయ్యు అద్వితీయమైన ఆధ్యాత్మిక, నైతికజ్ఞానము కల్గినవాడయ్యెను. సిద్ధాంతముల లోని శబ్దార్థములకును, భావార్థములకును కల భేదమును గ్రహించి అనుభవించి మానవలోకమున నవతరించిన క్రీస్తు అనగా రక్షకుడు ఎట్లుండవలె నన్నది ఆచరించి చూపెను.

తొలి నాల్గు కాండములలో మొదటిది, మొట్టమొదట వ్రాయబడిన దని నిర్ధారణచేసి చెప్ప వీలులేదు. 'లెవి' యను పేరు గల పన్నులు వసూలుచేయువాడొకడు జీససుకు అనుచరుడై 'మాథ్యూ' అని పేరుమార్చుకొని క్రీస్తుశకము 70—90 సంవత్సరముల ప్రాంతమున దీనిని వ్రాసె నని ప్రతీతి. 'అపోసిల్స్' అనబడు క్రీస్తుఅంతరంగికశిష్యులు పన్నిద్దఱిలో నితఁ డొకడు. యూదుమతమునుండి క్రైస్తవ మతమునకు మార్చబడినవారికి క్రీస్తుగుణగణములను బాగుగా తెల్పు ఉద్దేశ్యముతో ఇది వ్రాయబడె నట. క్రైస్తవప్రపంచమున అతి ముఖ్యమైన గ్రంథములలో నిది యొకటి.

రెండవకాండము క్రీ. శ. 63–70 సంవత్సరములలో 'జాన్ మార్కు' అనువానిచే వ్రాయబడెను. ఇతడు పీటరునకు సన్నిహితస్నేహితుడు, శిష్యుడునుకూడ. మాథ్యూ, ల్యూకుల కాండముల కన్న ముందే వ్రాయబడిన యిది వర్ణనవిశిష్టత కథాచమత్కృతి కలిగియున్నది. ఇది యూదులుకానివారిని ముఖ్యముగా రోమనులను ఉద్దేశించి వ్రాయబడినది.

మూడవకాండము 'ల్యూక్' అను సంక్షిప్త నామముగ 'ల్యూకనస్' అను సిరియాదేశస్థునిచే వ్రాయబడెను. అతడు యూదుకాడు, వైద్యుడు, సెంటుపాలునకు సన్నిహితస్నేహితుడు. ఇతడు విద్వాంసుడగుటచే తనగ్రంథమును స్వచ్ఛమైన గ్రీకుభాషలో వ్రాసెను. దీని రచనాకాలము క్రీ. శ. 80 అని విజ్ఞులు అభిప్రాయపడుచున్నారు. ఈ గ్రంథమున పొందుపఱుపబడిన పదునెనిమిది నీతికథలును, ఆఱు అద్భుతలీలలును వేఱెచ్చటను కానరావు. ఈ పుస్తకము అన్ని విషయములును సంపూర్ణముగ గల్గియుండుటయే గాక సంఘటనలను కాలానుక్రమముగ వర్ణించియున్నది. ఇది యూదులను, ఇతరులను అందఱిని ఉద్దేశించి వ్రాయబడినది.

'జాన్ సువార్త' అనునది నాల్గవ కాండము. జీసస్ ఆంతరంగిక భక్తుడగు 'జాన్' నను వానిచే క్రీ. శ. 80-110 సంవత్సరములలో ఇది వ్రాయబడెను. జీసను, దేవునికుమారుడు, రక్షకుడను నమ్మకము క్రైస్తవులలో గాఢముగా నాటుకొనునట్లు చేయుటకై యిది వ్రాయబడెను. జాన్ గొప్పతత్త్వవేత్తయు, వేదాంతియు అగుటచే గ్రీకువేదాంతమున కనుగుణముగా జీసస్సును వర్ణించెను. ఇతరకాండములలో నున్న అనేకవిషయము లిందు లేవు గాని, వానిలో లేని అనేకవిషయములు ముఖ్యముగా జీసస్సు యొక్క సూక్తులు, ఆధ్యాత్మికచర్చలు ఇందు గలవు. ఆచార్యుడుగాను, మతసంస్కర్తగాను అందఱిచేతను గ్రహింపబడిన జీససునకు జాన్, మానవాతీతమును గొప్పదియు వర్ణింపరానిదియు అగు నొకయౌన్నత్యమును కల్పించెను.

ఈ నాల్గుకాండముల కనంతరము జీససు అంతరంగభక్తులగు అపోసిల్స్ అను వారి కార్యములను వర్ణించు కాండము కలదు. దీన్ని

వ్రాసినది రెండవకాండపుకర్తయగు ల్యూక్ మహనీయుడే. ఇందు తొలిక్రైస్తవదేవాలయము లెట్లేర్పడినదియు వర్ణింపబడియున్నది. అంతే గాక జీససుకు సాక్ష్యము బల్కి జీసను సేవలో జీవమును కోల్పోయిన స్టీఫెన్సుకథ ఇందు కలదు. రాళ్ళచే కొట్టి చంపబడిన యీతడు అవసానకాలమున తనపై రాళ్లు రువ్వినవారిని గూర్చి 'తండ్రీ, వీరిని క్షమింపుము; తాము చేయున దేదియో వారికే తెలియదు' అని ప్రార్థించెను. రాళ్లు రువ్వినవారిని ప్రోత్సహించిన సాలుడను నతడు ఎట్లు హృదయ పరివర్తనము కల్గి జీససుభక్తుడై సెంటుపాల్ గా మారెనో అదియు విపులముగ వర్ణింపబడియున్నది. యూదులనూతయగు పీటరు పరివర్తనముగూడ ఇందు వర్ణింపబడియున్నది. జీససునందలి నమ్మకము భక్తివ్యాపించుటకు ముఖ్యకారకులు పీటరుపాలులే!

తొలిరోజులలో క్రీస్తు మతావలంబకులు ఎక్కువగా బాధింపబడుచుండుటచే వారు భయపడి దేశమును వదలి నలుమూలలకును పోయిరి. పోయినచోట్ల నెల్ల వారు క్రైస్తవమతవ్యాపక కేంద్రములుగా ఏర్పడిరి. అట్టివారికి ఉత్సాహము, ప్రోత్సాహము కల్గించుటకు పీటరు, పాలులు వివిధప్రాంతములనున్న వారికి లేఖలు వ్రాసిరి. వీనినే 'పత్రములు' (లేఖావళి) (ఎపిసిల్సు) అందురు. ఈ పత్రముల కదంబము న్యూటెస్టమెంటులోని ఒకకాండముగా ఏర్పడెను. ఇందు పాలు వ్రాసిన లేఖలు నాలుగు. అవి రోమనులకు, కొరింతియా దేశస్థులకు, గెలాటియన్లకు వ్రాయబడెను.

హీబ్రూ లనబడువారికి వ్రాయబడిన లేఖలు ఎవరిచే వ్రాయబడినదియు తెలియదు. అక్విలా అను నతని భార్యయగు ప్రిస్కిలా అను విదుషీమణి, ఒక గొప్ప రోమన్ వంశమునకు చెందిన నారీమణి యిద్దానిని వ్రాసె నని కొందఱి యూహ.

ఈ లేఖలకాండమున తర్వాత వచ్చునది జేమ్సు లేఖావళి. జీసస్ యొక్క కుటుంబవివరములును, ఆయన తోబుట్టువుల విషయమును గుఱించియు ఎక్కువ తెలియదు. జీసస్ కు సోదరుడును, మేరియమ్మ రెండవకుమారుడును అగు జేమ్సు ఈ పత్రములను వ్రాసెను. జీసస్ ను గుఱించిన అనేకవివరములు, స్మృతులు బైబిలులోని యితర కాండములందు చెప్పబడనివి అనేకములు ఇందు కలవు. ఇతనిసూక్తులలో ప్రధానమైనవి దేవుని నమ్మి ఆయన ఆజ్ఞలను పరిపాలింపుమనుటయే. సత్యమైనదియు, పరిశుద్ధమైనదియు అగు ధర్మము అనాథులైన శిశువులను, అభాగ్యులైన విధవలను రక్షించి కాపాడుటయే. అదియే జగత్పితయగు దేవునికి ఇష్టము.

జీసస్ కుటుంబమును గుఱించి "ది హిడన్ రొమాన్స్ ఆఫ్ ది న్యూటెస్టమెంట్" అను పుస్తకములో డాక్టర్ రాబర్ట్సన్ ఈవిధముగా చెప్పుచున్నాడు: "జీసస్ కుటుంబములో పెద్దకుమారుడగు జీసస్ చిన్నతనముననే ఆధ్యాత్మికజ్ఞానముపొంది మతసంస్కర్తయై దైవసాన్నిధ్యముపొంది మానవాళిని తరింపజేయువాడయ్యెను. రెండవకుమారుడగు జేమ్సు అట్టి జ్ఞానము లేనివాడయ్యును సదాచారసంపన్నుడు ఆయెను. ఈ ఇరువురి భావములకును సంఘర్షణ తప్ప దయ్యెను. అందఱితోచేరి యితడును తన అన్నను పిచ్చివానిగ తలచెను. కడపట జీసస్ ప్రాణాపాయస్థితిలో నున్నాడని తెలియగనే,

ఆయనయొక్క నైర్మల్యము, సౌమ్యత, ప్రేమ, దయ, తాను నమ్మినదానికై మృత్యువును సహితము ఎదుర్కొను ధీరత, మొదలగు సుగుణములు హృదయమునకు ఆకళింపునకు వచ్చి పశ్చాత్తప్తుడై కుటుంబముతోసహా జీసస్ ఉండు తావునకు పోయెను, కాని యితడు అక్కడికి చేరునప్పటికి జీసను అసువుల బాసియుండెను. పశ్చాత్తాపముతో క్రుంగిన మనస్సుగల జేమ్సు తన యన్న వచ్చి తన్ను క్షమింపనిదే ఎట్టి ఆహారమును కైకొనననని ప్రతినబూనెను. జీసను తన తమ్మునికి కనపడి, తన కష్టములకు, శిక్షకు ప్రేమ, ప్రేమస్వరూపుడగు దేవుడు తప్ప మఱెవ్వరును బాధ్యులు గారని పల్కి ఊరడించి అదృశ్యుడయ్యెనని 'పాలు' మహాశయుడు చెప్పుచున్నాడు.

జీసనుమతమునకు ముఖ్యప్రవక్తయైన జేమ్సు గొప్పవాడై ప్రాతమతమును ఈ క్రొత్తమతమును సమన్వయించుటకు ఎక్కువ శ్రమపడెను. క్రీ. శ. 70 లో రోమునగరపతనసమయమున ఈ క్రొత్తమతమును అణగద్రొక్కవలయునని సంకల్పించిన మతగురువులు, జేమ్సును, అతనిసోదరునివలెనే, విచారించి, కొండపై నుండి క్రిందికి త్రోసి చంపవలసినదిగా తీర్మానించిరి. అట్లు త్రోయబడియు మరణింపని జేమ్సును ప్రాణము పోవువఱకు రాళ్ళచే రువ్వించిరి. అట్లు తనపై రాళ్ళరువ్వువారిని ఉద్దేశించి, పూర్వము జీసనువలెనే, "ఓ ప్రభూ, నాతండ్రీ, వీరిని మన్నింపుము; తామేమి చేయుచున్నదియు వారెఱుగరు" అని ప్రార్థించెను. జేమ్సు లేఖావళికి తర్వాత వచ్చునవి పీటరు, జానుల లేఖావళి. పీటరు వ్రాసిన మొదటిపత్రము నీరో అను రాజునకు భయపడి ఏషియామైనరు దేశమునకు పరారియైన క్రైస్తవులను [illegible]జపఱచుటకు వ్రాయబడినది. క్రైస్తవుల నందఱిని ఉద్దేశించి వ్రాయబడిన జేమ్సు పత్రావళి సారము ఇది:—"దేవుడు ప్రేమస్వరూపుడు. ప్రేమ నెఱుంగనివాడు దేవుని ఎఱుంగలేడు. దేవుని ప్రేమించువాడు దేవుని సృష్టియగు ప్రతి మనుజుని సోదరప్రేమతో చూడవలయును."

ఈ గ్రంథములోని ఆఖరుకాండము జాన్ రచించినది. దీనిని 'ప్రకటనగ్రంథము' (బుక్ ఆఫ్ రెవలేషన్) అందురు. శ్లేషార్థాలంకారభూయిష్ఠమగు నీగ్రంథమును నానార్థముల నిచ్చునట్లు అనేకవిధములుగ వ్యాఖ్యానించియున్నారు. ఇందు దేవుడు తనమాతల ద్వారా మున్ముందు జీసను జన్మింపబోవునదియు, ఆయన ఎట్లు క్రైస్తవమతమును వ్యాపింపజేసి భూలోకమునంతయు ప్రభుని సామ్రాజ్యముగా మార్పబోవునదియు భూలోకపుప్రజలకు తెలియజెప్పిన క్రమము కలదు.

ప్రపంచములో 60 కోట్ల జనులచే అవలంబింపబడిన క్రీస్తుమత నూతన నిబంధనగ్రంథ సారము ఇది. ప్రపంచములో మఱి ఏ ఒక్క మతమును గాని యిందఱు ప్రజలు అవలంబించి యుండలేదు.

ఇక క్రీస్తుమతమున కంతయు ప్రధానలక్ష్యమగుజీసనుక్రీస్తునుగుఱించి విచారింతము. జీసను యొక్క బోధనలసారము "ప్రేమస్వరూపుడగు దేవుని ప్రేమింపుము. దేవుడు మనల నందఱిని ప్రేమించును గాన దేవుని ప్రేమించుటయే గాక అతనిచే సృష్టింపబడిన ప్రతిమానవుని తప్పక ప్రేమింపవలయును. అపకారికి అపకారము చేయుటకంటె, ఉపకారము చేయుటయే గొప్ప. నిన్ను ప్రేమించువారినే ప్రేమించుటకన్న నీ

విరోధులను ప్రేమించుటయే ఉత్తమలక్షణము.”

బీదలను, రోగులను ఎందరినో ఆయన కాపాడెను. అప్పటి క్రైస్తవేతరమతాచార్యులకును ఈయనకును ఎన్నియో సంఘర్షణలు కల్గెను. వారు తాము చేయుచున్నది తప్పని తెలిసియు తగ్గిపోవుట మర్యాదకు గౌరవమునకు హానికర మని పశ్చాత్తాపము చెందరైరి. మీదుమిక్కిలి జీససుపైనే కత్తిగట్టిరి. దేవుని పూజకై ఏర్పాటైన పవిత్ర దేవాలయములలో అర్చకులు వ్యాపారదృష్టి కల్గి బలి కై కొని వచ్చిన జంతువులను ఎక్కువధరకు వేలము పాడుట మొదలగు హీనకార్యములను సహింపక వీనిని తన శక్తికొలది అణపదలచెను. జనసామాన్యము ఆయన ఉద్దేశ్యములను మెచ్చుకొని ఆయనకు అండగా నిలిచిరి. అధికారులు, జనులలో జీససుకు గల పలుకుబడిని సహింపక ఆయనను తుదముట్టించుటకు నిశ్చయించిరి. తాను మానవపుత్రుడనే యని జీసస్ చెప్పుచున్నను మున్ముందు, తాను దేవునిపుత్రుడనని కూడ చెప్పుకొను వెనుదీయ డను భావముతో ఆయన విరోధులు ముందుపడిరి.

యూదులు జీససుక్రీస్తు తమకు రాజగునని ఎదురుచూచిరి కాని అత డెట్లు ఆ పదవికి వచ్చునో ఊహించుకయేని గుర్తింపరైరి. బీద కుటుంబములో పుట్టి బీదజనులతో మెలంగుచు ప్రేమను చాటుచు దేశాటనము జేయు ఈయన ఎట్లు తమకు రా జగునో వారికి తెలియలేదు. ప్రాపంచికస్థాయిలో యోచించువారికి, పరమార్థపుస్థాయిలో జీసస్ సాధించువిజయములు అర్థము కాలేదు. తుదకు ఆయనపై పగబూని, ఆయనను పట్టి, విచారించి మరణశిక్షను విధించి సిలువపై కొఱత వేసిరి. కొఱతలో కూడ ఆయన ప్రేమచే నిండినహృదయావేదనముతో ‘‘తండ్రీ, వీరిని మన్నింపుము. తాము చేయునది ఎద్దియో వీరికే తెలియ’’ దని దేవుని సంబోధించి ప్రార్థించెను. ఆయన తుదిమాటలు ఒక అద్భుతానుభవము. ఎవరును ఎదురు చూడనిది.

మరణానంతరము పాతిపెట్టబడిన ఆయన మూడవరోజు లేచి వచ్చి తన్ను నమ్మిన అంతరంగికశిష్యులకు దర్శనము ఇచ్చి ప్రేమను సత్యమును చాట నియోగించెను. ఆయనదర్శనము చేత దుఃఖితులు సంతోషాంతరంగులైరి. భీరులు ధీరులైరి. అనేకులు తమ ప్రాణములను సయితము లెక్కసేయక ఆయన ఆజ్ఞప్రకారము జీససుసూక్తుల ప్రచారమునకు గడంగిరి. అట్టి లోకోత్తరుని అడుగుజాడల నడచి సర్వేశ్వరుని ఆధ్యాత్మికపూజచే తృప్తిపఱచుటయే మన ఏకైక కర్తవ్యము.

పేసరికి యిచ్చు దాతకుఁ గాసు సుమీ మేరువంత కనకంబైనన్
కాసే మేరువు లోభికి వాసిగ మఱి కుందవరపు కవిచౌడప్పా॥

‘పరవిత్తము గోమాంసము, పరసతి తనతల్లి’ యనుచు భావించిన యా
నరుడు నరుండా, రెండవ కరివరదుడె కుందవరపు కవిచౌడప్పా॥

—కవిచౌడప్ప

# ఖురానె షరీఫ్

ఆచార్య శ్రీ డి. చిన్నికృష్ణయ్యగారు

'ప్రవక్తా, నీతో వాదము చేయువారితో నిట్లనుము : మేము మీరు ప్రకటించిన సత్యమును, మీ ప్రవక్తలు ప్రకటించిన సత్యమును విశ్వసింతుము. మీ దేవుడును మా దేవుడును ఒకడే. మేము అతనికే విధేయులము'. ఈ ప్రవచనము ఖురానులో నట నట పునరుక్తము. శాంతియుతసహజీవనము నాశించు నాధునిక యుగమున వివిధ విశ్వమతములందు విశ్వాసము, సహనశీలము, సత్యగ్రహణపరాయణత్వము లనునవి యత్యవసరములు.

ముప్పదికోట్ల ముస్లిముజనులకు కొంగు బంగారము ఖురాను. ఇస్లాము మతమునకు వేదము. అల్ ఖురానను నామ మా గ్రంథమున పెక్కుచోట్ల కన్పట్టుచున్నది. ఖరా ధాతువు నుండి యీశబ్దము నిష్పన్నమందురు. ఖరా అనగా 'అతడు మొత్తముగా సమకూర్చినది' యని యర్థము. ఖుర్ ఆన్ అనగా 'గ్రథిత మైనది లేక పఠింపబడినది' యని భావము. విశిష్టమతోపదేశ మిందు నిహితమై యుండుట చేతను, నిత్యపఠనమునకై యిది నిర్దిష్టమగుట చేతను నీనామకరణము సమీచీనమైయున్నది. నిజమునకు, ప్రపంచమతగ్రంథములలో ఖురానువలె విశ్వవ్యాప్తమై, అసంఖ్యాకపాఠక లోకము నాకర్షించిన గ్రంథము మఱొకటి కానరాదు. భగవత్ప్రేరితమై మహమ్మదు ప్రవక్త హృదయఫలకమున నవతీర్ణమైన గ్రంథరాజము. తేజోమూర్తియు జ్ఞానమూర్తియునగు అల్లా యొక్క సత్యసందర్శన మని ఈ వేదము నాదరింతురు. మహమ్మదునకు దివ్యోపదేశములు జిబ్రాయిలను దేవదూత మూలమున వ్యక్తీకరింపబడినవి, 'రమదాన్' మాసమున 25 లేక 27-వనాటి రాత్రి ప్రథమోపదేశము లభ్యమైనది. ఇది అరబీభాషయందు 'లయలత్ అల్ ఖదర్' అని వ్యవహృతము.

ఖురాను బహునామకము. అల్-కితాబ్ - అనగా స్వయంసంపూర్ణమైనది; అల్-ఫుర్ ఖాన్ - సదసద్వివేచనము కలది; అల్-ధికర్ అనగా విశ్వశ్రేయమైనది; అజ్జికర్ - జ్ఞాపకము చేయునది; అల్-ముహైమిన్ - వెనుకటిసత్య వేదముల సంరక్షించునది - ఇత్యాది నామములు పెక్కులు ఖురానునందే యట నట గలవు.

ఈ గ్రంథమందలి యధ్యాయములకు 'సూరా' లని వ్యవహారము. మొత్తము 114 సూరాలు కలవు. 'సూరా' శ్రేష్ఠతావాచకము. అంతస్తు అని అర్థము. సూరాలు రెండు విధములు : దీర్ఘములు, హ్రస్వములు. సూరాలలోని ప్రవచనముల లఘుగురువిస్తృతిక్రమమున నవరింపబడి సమీకృతములై యుండుటయే ఖురాను అధ్యాయవిభజనములోని వైశిష్ట్యము. మిక్కిలి పెద్దదియగు సూరాయందు 286 శ్లోకములును, మిక్కిలి చిన్నది యగు సూరాయందు మూడు

శ్లోకములును కలవు. అయినను ప్రతి సూరాయును స్వయంసంపూర్ణమైనది. దీర్ఘాధ్యాయములు. (సూరాలు) పెక్కు 'రుకూ' లుగ విభజింపబడినవి. ప్రతిరుకూయందు నొక్కొక్కవిషయమునుగూర్చిన చర్చ కలదు. రుకూలు పరస్పర సంబంధము కలవియై విషయ మనుస్యూతమై యొప్పుచుండును. రుకూలు మరల 'ఆయతు'లుగా విభక్తములు. ఆయతు అనగా సూక్తి, ప్రవచనము, శ్లోకము, 'చిహ్నము, గుర్తు' అని వాచ్యార్థము, భగవత్సందేశ మనియు వివరింప వచ్చును. ఖురానులో 6360 ఆయతులు కలవు.

పారాయణసౌలభ్యము నాశించి ఖురానును ముప్పదిభాగములుగ విభజించిరి. ఒక్క నెల దినములలో పారాయణము ముగియవలయు నను సౌకర్యార్థము చేయబడిన విభజనమిది. ఒక్కొక్కభాగమునకు 'జుజ్' అని పేరు. ఇది గాక ఏడుదినములలో పారాయణయోగ్యమై యుండ వలయునని ఈ గ్రంథము నేడుభాగము లుగ విభజించియున్నారు. ఒక్కొక్కభాగము నకు 'మంజేలున్' అనిపేరు. ఈ విభాగములలో విషయవిభజనము లేదు.

మహమ్మదు ప్రవక్తకు త్రివింశతి వత్సర కాలమున బోధితమైన సత్యసూక్తులు. ఆప్రవక్త చేతనే సంకలితములై ఖురానయ్యెను. భగవత్సందేశము మానవహృదయమున వ్యక్తీకృత మగుటను అరబీభాషలో 'వహీ' అందురు. జిబ్రాయిలను దేవదూత భగవదాజ్ఞానుసారముగ తదుపదేశములను ప్రవక్త కందజేసె ననుటవలన ఖురాను భారతీయవేదములవలె నపౌరుషేయ మనుట గమనార్హము. అహమ్మతి కారణముగ నిందలి సత్యముల ననుమానించుట శ్రేయస్కరము కాదు. అది అనుభవైక వేద్యము. తన యిరువదియైదవయేట మహమ్మదు ఖదీజాయను నలువదియేండ్ల వితంతువును వివాహ మయ్యెను. పిదప మక్కా సమీపమందలి హీరాపర్వతగుహలో నేకాంత వాసప్రియుడై ధ్యానతపోనిష్ఠుడై యుండెను. దివ్యసందేశము లొక్కొక్కతఱి చిఱుగజ్జెల మ్రోతలవలె వినవచ్చుచుండెను. శ్రుతిగతము లైన శబ్దములు కాలక్రమమున స్పష్టములై యతని స్మృతిపథమున ముద్రితము లైనవి. గ్రథనపఠనాజ్ఞుడైన ప్రవక్తకు గ్రహణధారణ పటుత్వము మిక్కుటమై యుండినది. తానెఱిగిన సత్యమును శిష్యులకు ప్రబోధించువాడు. మహమ్మదునకు పదుమూడేండ్లు మక్కాపట్టణమునందును, పదియేండ్లు కారణాంతరములచే ప్రవాసస్థానమైన మదినాపట్టణమందును ప్రవచనములు ప్రోక్తము లైనవి. 93 అధ్యాయములు మక్కాలోను, 21 అధ్యాయములు మదినాలోను ప్రబోధితము లయ్యె నని గ్రంథమును పరిశీలించిన గ్రహింపగలము. ప్రవక్త శిష్యులలో నగ్రగణ్యుడును ప్రథమఖలీఫాయు నగు అబూబకర్ మహాశయుడు ఉపదేశ క్రమము ననుసరించి పెక్కుప్రతులువ్రాయించి ప్రపంచమందలి ముస్లీము కేంద్రములకు ప్రచారార్థము పంపించెను. ఉథ్మాను నతడుచేసిన సేవయు నిట్టిదే. మహమ్మదు ప్రవక్తయే తద్వేదమును పఠించి తదనుగుణముగ ప్రవర్తించుచు ననుయాయులకు మార్గదర్శకు డయ్యెను. ఖిల కాండములుగాని, ప్రక్షిప్తములుకాని, పాఠాంతరములుగాని లేక ప్రపంచమంతటను నొక్క ప్రతియే ప్రచారమందుట ముస్లీములమత ప్రత్యయమునకు ప్రత్యక్షనిదర్శనము. ఈభాగ్యమునకు తదితర మతగ్రంథము లెవ్వియు నోచు

కొన లేదు. ''ఈగ్రంథమునాచే ప్రోక్తమైనది. నేనే దీనికి సంరక్షకుడనుగ నుందును'' – అని ఖురానులోని భగవద్వచనము.

ప్రజానీకము నైహికపారమార్థికముగా పరిపక్వదశకును, సంపూర్ణస్థితికిని కొని పోగల చైతన్యశక్తి ఖురానునకు కలదు. తన్మతోద్దేశము నట్టిదే. దైహికమానసిక సంబంధములైన ఆధివ్యాధులను హరించి యారోగ్య మొసర్చునది కావున నీగ్రంథమునకు 'షిఫా' అనియు నామాంతరముకలదు. ఖురాను తాను బోధించిన మతమును 'ఇస్లామ్' అని పేర్కొన్నది. 'ఇస్లామ్' అనగా 'శాంతివహించుట' యని అర్థము. 'సలమ్' అనగా శాంతి. ఆత్మశాంతిని పొందినవాడు 'ముస్లీమ్' అగును. మహామతములు పెక్కులు మతకర్తల నామములతో ప్రసిద్ధికెక్కినవి. 'మహమ్మదీయుల'ను వ్యవహారము పాశ్చాత్యకల్పితమే కాని ఖురానునందు కానరాదు.

ఖురానుగ్రంథము క్రొత్తవేదము కాదు, ఇస్లాము మత మొక క్రొత్తధర్మమును కాదు. సత్యమువలె రెండు ననాదిసిద్ధములైనవే. ''ఇప్పుడు మీయొద్దనున్న సత్యమును నిరూపించుచు ఇది వెలువఱుప బడినది'' అనియే ఖురాను చాటుచున్నది. సత్య మొక్కటే. అది సనాతన మైనది. 'ఏకం సత్' ప్రతిజాతి యొక్క మూలమత మొక్కటే. అది మానవుని ప్రకృతియందు స్థగితమై యున్నది. వివిధ ప్రవక్తలు దేశకాలపాత్రానుసారముగ నీ మూలమతమును – సత్యమును – కొన్ని యాచారవ్యవహారములతోడను, సంప్రదాయములతోడను వ్యాపింపజేయుచున్నారు. కాని యీ యాచారవ్యవహారములును, సంప్రదాయములును వాని నాధారముగ జేసికొని ప్రవృద్ధమైన మన సత్త్వమును ప్రబలి మూలసత్యమునకువిరుద్ధమగునపుడు ధర్మచ్యుతి కలుగును. సత్యమునకంటె సంప్రదాయము బలవత్తర మగునపుడు ధర్మముపతనమై ఆచారము దాని స్థానము నాక్రమించును. నిరాత్మకమైన ఆచారము మాత్రము తలయెత్తినచో నది మనస్వభావములో భాగమై, మనస్తత్త్వమున లీనమై నిత్యమగు సత్యమునకు మూలచ్ఛేదకారణమగును. ''ఆచారప్రభవో ధర్మః ధర్మస్య ప్రభురచ్యుతః'' – అనుటలోని యాంతర్య మాచారమువలన ధర్మము ప్రభవింపవలయు ననియే గాని చ్యుతము కావలయు నని కాదు. మూలమతమును 'దీన్' అనియు, దానితోబాటు ప్రవక్తలు కాలానుగుణముగ స్థాపించు జీవిత విధానమును 'మిల్లత్' అనియు నిస్లాము వ్యవహరించుచున్నది. జీవితవిధానమునకు సంబంధించిన ధర్మమగు 'మిల్లతు'న మార్పులేర్పడుట సహజ మనియు నైనను మూలమతమున విపర్యాస మేర్పడుటకు వీలు లే దనియు ఖురాను సుబోధము చేయుచున్నది.

ప్రపంచచరిత్రలో నీ మహత్తరమతగ్రంథము కొనివచ్చిన పరివర్తన మత్యపూర్వమైనది. నిజజీవితకాలముననే జాతీయజీవనమును సంస్కరించి మహోన్నతమైన విపరిణామమునకు కారకుడైన మహమ్మదు ప్రవక్త వంటి మతసంస్కర్త 'నభూతో నభవిష్యతి', విగ్రహములను, శిలలను, చెట్టు చేమలను, ఇసుకదిబ్బలను దివ్యములని విశ్వసించి పూజించుచుండిన అరబ్బుదేశీయులను నిరువదియైదు సంవత్సరములలోనే ఖురానుసంపూర్తిగ మార్చి వేసినది. వారు విగ్రహారాధనమునకు వైదొలగి యేకేశ్వరోపాసకులైరి. మూఢవిశ్వాసములకు విముఖులై ధర్మవిచయనపరాయణు

లైరి. వివృతవివేకులైరి. నిరంకుశమైన వారి దౌష్ట్య మదృశ్యమై ఉదాత్తకార్యాచరణములకును సంఘసేవకును దారితీసినది. పుత్రికలు పుట్టినచో సజీవముగ పాతిపెట్టుట, విమాతను వివాహమగుట, కామాసక్తి మున్నగు దురాచారములు మాటు మణగినవి. మద్యపాన నిరసనము, స్త్రీపుంవిభేదములేక ఆస్తియందు సమభాగము, పవిత్రమైన వైవాహికబంధము, పాతివ్రత్యప్రభావము, నైతికజ్ఞాన మిత్యాదులు నెలకొనినవి. జీవచ్ఛవమై యుండిన జాతిని మేలుకొలిపి, నూతనాభిరుచులను కలుగజేసినది. ఐహికాముష్మిక వైజ్ఞానిక పథములలో అరబ్బీయులకు నూతనాధ్యాయ ముదయించినది. వ్యక్తి, కుటుంబము, సంఘము, జాతి, దేశము – అన్నిటియందును ఖురాను సంస్కారములను కొనివచ్చినది. నిద్రాణమై, శోభాదరిద్రాణమై యుండిన సంఘమున యుగయుగములకు నసాధ్యమైన సంస్కరణాభ్యున్నతిని 'ఖురాను' అచిరకాలముననే సాధింపగలిగినది. మతగ్రంథములకు ముఖ్యముగా నుండవలసిన చైతన్యశక్తి యిట్టిదే.

స్వమతాభిమానమును పరమతాసహనమును లేని ప్రజాతతి యరుదు. తత్త్వజ్ఞులు వీనికి సుదూరముగ సంచరింతురు. భగవదైక్యము, మానవైక్యము అనెడు ధర్మద్వయమును ప్రతిపాదింపవలయు ననుటయే ఖురాను యొక్క యేకైకోద్దేశము. మానవైక్యసిద్ధాంతము నంగీకరించినచో జాతి, కుల, వర్ణ, దేశాదిభేదములు, సంఘర్షము నశించుటకు వీలగును. "ఏకమే వా ద్వితీయం బ్రహ్మ" అనుటయే గాని బహుదైవతారాధనము మె అశాంతికి కారణమైనది.

"యేన ద్యౌ రుగ్రా పృథివీ చ దృఢ
యేన సువ స్తభితం యేన నాకః
యో అన్తరిక్షే రజసో విమానః
కస్మై దేవాయ హవిషావిధేమ?"

అనుచు నాటి ఋషిసత్తములు బహుదేవతార్చనమునకు పరాఙ్ముఖులైరి గాని నేటి స్థితిగతులను పరిశీలించినచో

"చిన్నచిన్నరాళ్లు చిల్లరదేవుళ్లు"

అను విధమున పరిహాసమునకు దారితీసినది. భగవంతుని అనంతగుణములను వర్ణించు నామము లెన్ని యున్నను నవి యన్నియు నతని యంశలనుమాత్రమే నిర్దేశింపగలవు. పరిపూర్ణుడగు బ్రహ్మమును నిర్దేశించు శబ్దము సాధకులకును సామాన్యులకునుకూడ నత్యావసరము. "నేదం య దిద ముపాసతే" అను నుపనిషద్వచనమును, "యాన్తి దేవవ్రతా దేవాన్, పితౄన్ యాన్తి పితృవ్రతాః, భూతాని యాన్తి భూతేజ్యా, యాన్తి మద్యాజినో ఽపి మామ్" అను గీతావచనమును భగవంతుని సంపూర్ణ దర్శనమునకు గుణనామకీర్తన ముపకరింప దని విశదము చేయుచున్నది. శ్రుతియు "అంధం తమః ప్రవిశన్తి య ఉ సంభూత్యాగ్ం రతాః" అని నొక్కి వక్కాణించుచున్నది. కావున ఖురాను అచిన్త్యరూపమును, అవాఙ్మానసగోచరము ననంతమునైన శుద్ధబ్రహ్మమునకు సర్వార్థనామక మగునట్లు "అల్లాః" అను శబ్దమును కల్పించినది. ఈ శబ్దమునకు వ్యుత్పత్తిగాని, లింగవచనములు గాని లేవు. ఇది యెట్టి యాకారమునకును 'చిహ్నము' కాదు. బహుదేవతార్చనమును నిషేధించి, శుద్ధబ్రహ్మమునకు సంజ్ఞావాచకమైన 'అల్లాః' శబ్దము నేర్పఱచినది.

మతప్రవక్తయగు మహమ్మదుకూడ పూజార్హుడు కాడని ఖురాను బోధించును.

మహాత్ములైన మతాంతర ప్రవక్తలయందును, నితరమతసత్యములందును విశ్వాసముంపవలయు నని ఖురాను శాసించుచున్నది. మతస్వీకరణమునకు బలాత్కారమువనికిరాదనియు, మతస్వీకరణము వ్యక్తియొక్క స్వాభిప్రాయమునకు సంబంధించిన విశ్వాసమనియు ఖురాను సందేశము.

మృత్యనంతరజీవితమునుగూర్చి ఖురానులో వలె మతెందును విస్పష్టవివరణము లేదు. మృతితో మానవుని జీవిత మంతమగుట లేదు. అది జీవునియొక్క తర్వాతి యున్నతావస్థకు గొనిపోవుచున్న దట. "అతీంద్రియములైన తత్త్వములందు విశ్వాసముంపుము" అని ఖురానుయొక్క ఆదేశము. విశ్వాసము 'ఆస్తిక్యము'కు పునాది. 'విశ్వాసము'నకు 'ఈమాన్' అరబీమూలము. 'ఈమాన్' అనగా అచంచల మగు ఆస్తిక్యబుద్ధి. ఆర్షవ్యవహారమున 'శ్రద్ధ' యని రూపాంతరము కలదు. 'శ్రద్ధాతపః' అను శ్రుతిసూక్తి సర్వవిదితము.

మానవహక్కుల విషయమున 'ఇస్లాము' ప్రతిపాదించిన వైప్లవిక సిద్ధాంతములలో స్త్రీస్వాతంత్ర్య మొక్కటి. ప్రతిమతమునందును నబలల కుచితస్థాన మొసగబడలేదు. స్త్రీ పురుషునితో నన్నివిధముల సమానురాలేయని ఖురాను పెక్కుచోట్ల స్పష్టము చేసినది.

ఖురాను నాధారముగ జేసికొని 'ఇస్లాము' మత మొక ఆదర్శసంఘమును నిర్మించినది. ఈ యాదర్శసంఘము నైదుసిద్ధాంతములు స్తంభములవలె సంరక్షించుచుండును. అందు ఏకేశ్వరోపాసనము ప్రథమ స్తంభము. భగవత్ప్రార్థనము లేక నమాజ్ రెండవ స్తంభము. 'జకాత్' మూడవ స్తంభము. 'జకాత్' అనగా దాతృత్వము. అందును నైచ్ఛికమగు దాతృత్వముకాక నిర్ణీతమగు దాతృత్వమునకు 'జకాత్' అని వ్యవహారము. ఉపవాసము నాల్గవ స్తంభము. మక్కాయాత్ర లేక 'హజ్' అనునది అయిదవ స్తంభము. ఈ సిద్ధాంతములకు విపుల వివరణము ఖురానునందు కలదు.

ఒకచేతియందు ఖురాను నుంచుకొని, మఱొకచేతియందు కత్తి నుంచుకొని మహమ్మదు 'ఇస్లాము' మతమును వ్యాపింపజేసెనను అపోహ పెక్కురకు కలదు. యుద్ధమెట్టి పరిస్థితులలో విహితమను ప్రశ్నకు ఖురాను సదుత్తర మొసగగలదు. కురుక్షేత్రయుద్ధరంగమున నుదయించినంత మాత్రమున గురుబంధువధ విధిగ బోధింపబడినంత మాత్రమున గీతోపదేశము సమాదరణీయము కాకపోవునా ?

ఖురానునందు వేదాంతము, నీతిశాస్త్రము, కర్మకాండలకు సంబంధించిన విధులు, ధర్మశాస్త్రము — మున్నగున వన్నియు కలవు. ముస్లిముప్రపంచమున సర్వశాస్త్రములు అత్యద్భుతముగ వృద్ధినొందుటకు ఖురాను ప్రోద్బలమే పరోక్షకారణము. దీనిని మహమ్మదు ప్రవక్తయొక్క మాహాత్మ్యమందురు. ఖురానునందలి విషయవైవిధ్యము విశ్వవిశాలమైనది.

అవిజ్ఞాతే పరే తత్త్వే
శాస్త్రాధీతిస్తు నిష్ఫలా
విజ్ఞాతే ఽపి పరే తత్త్వే
శాస్త్రాధీతిస్తు నిష్ఫలా.

# వార్తలు, విశేషాలు

## శ్రీమత్స్వామి మాధవానందజీమహారాజు రామకృష్ణమఠ - మిషనులకు క్రొత్త కేంద్రాధ్యక్షులు

శ్రీమద్విశుద్ధానందజీమహారాజుగారి కనంతరం శ్రీమత్స్వామి మాధవానందజీమహారాజుగారు రామకృష్ణమఠమిషనుల కేంద్రాధ్యక్షులుగా ఎన్నుకోబడ్డారు.

శ్రీమన్మాధవానందస్వాములవారు తే 15-12-1888 దినాడు జన్మించారు. ఇల్లు విడిచి భగవదన్వేషకులై 1910 జాన్యువరిలో బేలూరుమఠంలో చేరారు. వీరు మాతృశ్రీ యొద్ద మంత్రోపదేశం పొంది, శ్రీరామకృష్ణుని ప్రత్యక్షశిష్యు లందఱితో సన్నిహితసంబంధం గల్గి ఉండిన ధన్యులు. 1916 జాన్యువరిలో వీరు శ్రీ బ్రహ్మానందస్వాములవారియొద్దనుండి సన్న్యాసదీక్షాస్వీకారం చేశారు.

వీరు 1910 లో మాయవతి అద్వైతాశ్రమంలో చేరి, 1918 లో దానికి అధ్యక్షులయ్యారు. 1927 వఱకు ఆ స్థానంలో ఉండినారు. 'ప్రబుద్ధభారత' పత్రికకు వ్యాసములు వ్రాస్తుండినారు. 'సమన్వయ' అను హిందీపత్రికను ప్రారంభించి దానికి సంపాదకులుగా ఉండినారు. 1918 లోనుండి అద్వైతాశ్రమధర్మకర్తలలో వీరొకరుగ ఉండినారు. ఈయన పరిపాలనాకాలంలోనే 1920 లో కల్కత్తా అద్వైతాశ్రమం పుట్టింది.

1927 మే నెలనుండి 1929 జూను నెలవఱకు శ్రీమన్మాధవానందస్వాములు సాన్ఫ్రాన్సిస్కో-వేదాంతసొసైటికి సెక్రిటరిగా అమెరికాలోనే ఉండినారు. భారతదేశమునకు మరలి వచ్చింతర్వాతనే వీరు రామకృష్ణమఠమిషనుల అసిస్టెంట్సెక్రిటరి (సహాయకార్యదర్శి) లలో ఒకరుగ అయ్యారు. మఠమిషనుల నిర్వాహక పరిషత్తులో సభ్యులుగను ధర్మకర్తలలో ఒక్కరుగను వీరు 1922 నుండి ఉంటుండినారు. 1938 నుండి 1961 వఱకు వీరు 'మఠ-మిషను'ల జెనరల్ సెక్రిటరిగా ఉండినారు. ఆ కాలానికి నడుమ 1949 కును 1951 కును నడుమ రెండేండ్ల కాలం మాత్రం అనారోగ్యకారణంచేత వీరు విశ్రాంతిలో ఉండినారు. 1962 మార్చిలో వీరు మఠమిషనులకు ఉపాధ్యక్షులు (వైస్ప్రెసిడెంటు) గ అయ్యారు.

వాఙ్మయసముద్రానికి వీరు అగస్త్యులు అన వచ్చు. అంత కూలంకషమైన పాండిత్యం వీరిది. హిందూమత ప్రమాణ గ్రంథాల సంప్రదాయ రహస్యార్థములు వీరికి కరతలామలకం. పెక్కు ఉద్గ్రంథాలకు వీరు రచించిన ఆంగ్లానువాదాలు పరమప్రమాణపదవిని అధిష్ఠించి ఉన్నవి. శ్రీశంకరభగవత్పాదుల బృహదారణ్యకోపనిషద్భాష్యమునకు వీరు ప్రసాదించిన ఆంగ్లానువాదం అవిస్మరణీయ గ్రంథరాజం.

### శ్రీవివేకానందస్వామిశతతమజయంతి మహోత్సవము, తిరునెల్వేలి

1962 వ సంవత్సరము జూలై 12 వ తేదీ నాడు తిరునెల్వేలి పౌరులు సమావేశమై తమ జిల్లాలో వివేకానందస్వాముల శతతమ జయంతి మహోత్సవమును సముచితరీతిని జరుపుటకు మండలపరిషత్తును ఏర్పాటుచేసినారు. ఏబది వేల రూపాయలదాకా పైకమును ప్రోగు చేయవలసిన దనియు స్వామిజీ స్మృతికంకిత ములుగ ఒకప్రార్థనకూటమును గ్రంథాలయ మును నిర్మింపవలసినదనియు తీర్మానము చేయ బడెను.

## గ్రంథపరిచయం

[సమీక్షకి గ్రంథాలు పంపేవారు రెండేసి ప్రతులు పంపవలె అని మనవి]

### ఆత్మానుభవము

ఇది శ్రీకాళహస్తి శ్రీభగవద్గీతాప్రబోధ సంఘాధ్యక్షులగు శ్రీ నిత్యానందస్వాములవారు ఆంధ్రతాత్పర్యసహితముగ ప్రచురించిన హస్తామలకస్తోత్రము. ఉపోద్ఘాతమున హస్తామలకాచార్యుల చరిత్రము పొందుపఱుపబడియున్నది. తుదను శ్రీశంకరభగవత్పాదుల నిర్వాణ షట్కము కీ. శే. బలిజేపల్లి లక్ష్మీకాంతకవి గారి యనువాదపద్యములతో జేర్పబడియున్నది. ఇది సకలాద్వైతగ్రంథసారమనవచ్చు. పాకెట్టు సైజు; పుటలు 32; వెల లేదు.

### మన భవితవ్యం

పంజాబు ప్రాంతీయులైన శ్రీ సంత్రామ్, బి. ఏ. గారు ఉర్దూలో వ్రాసిన 'భారత్ కా భవిష్య' అను పుస్తకమునకు శ్రీ నేడిది విశ్వనాథముగారు సామాన్యప్రజానీకానికి సుగ్రహంగా ఉండే వాడుక తెలుగులో వ్రాసిన అనువాదం ఇది. ఆర్యసమాజప్రచురణము. భారతదేశమును బానిసగ చేసిన కులమత తత్త్వాల నిర్మూలించవలెననేది ఇందలి ఉపదేశం. ప్రాప్తిస్థానము – 'సంగమేశ్వర్ సంగమ్' మంత్రి, ఆర్యసమాజం, జోగిపేట, మెదక్ జిల్లా, ఆంధ్రప్రదేశ్; పుటలు – 26; వెల – 20 నయే పైసలు

సంపాదకులు : శ్రీ శుద్ధసత్త్వానందస్వామి, శ్రీ నేలటూరి భక్తవత్సలము,
శ్రీ. కే. ఎస్. ఎస్. రాజన్ గారిచే ది జ్యూపిటర్ ప్రెస్స్ ప్రైవేట్ లిమిటెడ్ (మద్రాసు - 18) న ముద్రింపబడి,

# శ్రీ రామకృష్ణ లీలామృతము

(లేక శ్రీరామకృష్ణ జీవిత చరిత్ర)

అనువాదకులు :

కీ. శే. వెదురుమూడి కృష్ణరావుపంతులుగారు, బి. ఏ; శ్రీ కందుకూరు మల్లికార్జునంగారు, బి. ఏ.

ప్రశస్తమైన వస్తువు, అకలంకమైన జీవితము, లోకోత్తరమైన సందేశము. దేహమును పులకరింపజేయు ఆధ్యాత్మికానుభవములు—శైలి సరళము, మధురము. భాష నిర్దుష్టము.—సర్వార్థముల సమూల్యమైన గ్రంథరాజము.

—శ్రీ పా. వే. రాజమన్నారుగారు, గౌ॥ ప్రధాన న్యాయమూర్తి, మద్రాసు.

* * * ఈ గ్రంథము విషయానురూపమై సుబోధమైన శైలిలో రచింపబడినదనుటకు ఎట్టి సందియమును లేదు. * * *

—శ్రీ పింగళి లక్ష్మీకాంతంగారు.

* * * ఆధునిక కాలములో వెలువడిన కొలది మహాగ్రంథములలో, అన్నివిధముల నిది యొకటి. * * *

—శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారు.

526 పుటలు (తృతీయ ముద్రణము) వెల : రూ. 5/-

---

# శ్రీ వివేకానంద జీవితచరిత్ర

(శ్రీ చిరంతనానందస్వామి ప్రణీతము)

ఇందు శ్రీ స్వాములవారి జీవితమున నింతకు పూర్వము గ్రంథస్థములుగాని ముఖ్య సంఘటన లెన్నియో శ్రీవారి సోదరశిష్యులవలన విని వ్రాయబడినవి. ఇది శ్రీ స్వాముల వారి సంపూర్ణ చరిత్ర!

నిర్దుష్టమైన భాష, అందమైన అచ్చు, ఆకర్షకమైన రూపము.

438 పుటలు (అష్టమ ముద్రణము) వెల : { సాదా ప్రతి రూ. 3-50; అట్ట బైండు రూ. 4/- }

---

# శ్రీ శారదాదేవి చరిత్ర

(మూడవ కూర్పు)

రచయిత : శ్రీ చిరంతనానందస్వామి

ప్రతి స్త్రీయును పురుషుడును...చదువవలసిన గ్రంథ మిది...అమృతకలశము!... అనన్యసామాన్య నీతిమంజరి...తియ్యని తెలుగు...పాలవంటి శైలి... —ఆంధ్రప్రభ

246 పుటలు వెల : రూ. 2/-

---

అడ్రెసు : మేనేజరు, శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు - 4

# OUR ENGLISH PUBLICATIONS

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటము ౧౯    ౧౯౬౨, సెప్టెంబరు; శుభకృత్తు - భాద్రపదము    సంచిక ౩

## విషయసూచిక



'అఖిలవిభు శరణొందుమ, యా క్షణంబ యతనికృప నీవ ననుభావ్య మగును వత్స.'

—శ్రీ శారదామణి.

# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము ౧౯ } సెప్టెంబరు : : శుభకృత్తు – భాద్రపదము { సంచిక ౩

శ్రీః

## సౌందర్యలహరి

మూలము :

శ్రీ శంకరభగవత్పాదులు

టీక

నే.

శివే శృఙ్గారార్ద్రా, తదితరజనే కుత్సనపరా,
సరోషా గఙ్గాయాం, గిరిశచరితే విస్మయవతీ,
హరాహిభ్యో భీతా, సరసిరుహసౌభాగ్యజననీ,
సఖీషు స్మేరా, తే మయి, జనని, దృష్టి స్సకరుణా ॥ ౫౧

| | | | |
|---|---|---|---|
| జనని | అమ్మా | గిరిశచరితే | త్రిపురవిజయాది శివచరితమునందు |
| తే | నీ | విస్మయవతీ | అద్భుతరసావిష్టము |
| దృష్టిః | చూపు | హర | శివుని |
| శివే | సదాశివునందు | అహిభ్యాం | పాములవలన |
| శృఙ్గారార్ద్రా | శృంగారరససంపృక్తము | భీతా | భయరసావిష్టము |
| తదితరజనే | తక్కినవారియందు | సరసిరుహ | తామరల |
| కుత్సనపరా | బీభత్సరసావిష్టము | సౌభాగ్య | ఎఱుపునకు |
| గఙ్గాయాం | గంగాదేవియందు | | |
| సరోషా | రౌద్రరసావిష్టము | | |

| | | | |
|---|---|---|---|
| జననీ | జన్మస్థానము (వీరరసావిష్ట మనుట) | స్మేరా | చిఱునవ్వుతోకూడినది (హాస్యరసావిష్టము) |
| సఖీషు | చెలులందు | మయి | నాయందు |
| | | సకరుణా | కరుణరసావిష్టము. |

తా॥ అమ్మా, నీ చూపు సర్వరసావాసభూమి. శివునివిషయమున శృంగారరసమయము; ఇతరులవిషయమున బీభత్సరసపూర్ణము; సవతియందు రౌద్రరసనిబిడము; శివచరిత్రముల విషయమున అద్భుతరసావిష్టము; శివునిహారములగు సర్పములయెడ భయరసాప్లుతము; ఎఱ్ఱదామరలకాంతికలిమిచే వీరరససంపృక్తము; చెలులందు హాస్యరససంపుష్టము; నాయందు కరుణరససాంద్రము.

గతే కర్ణాభ్యర్ణం గురుత ఇవ పక్ష్మాణి దధతీ
పురాం భేత్తు శ్చిత్తప్రశమరసవిద్రావణఫలే
ఇమే నేత్రే గోత్రాధరపతికులోత్తంసకలికే
త వాక ర్ణాకృష్ట స్మరశరవిలాసం కలయతః ॥ ౫౨

| | | | |
|---|---|---|---|
| (హే) | (ఓ) | ప్రశమరస | నైస్పృహ్యమును |
| గోత్రాధరపతి | పర్వతరాజ | విద్రావణఫలే | పోగొట్టు (శృంగారరసమును కల్గించు) ప్రయోజనము (బాణాగ్రము) గలవి యా - అగు |
| కుల | వంశమునకు | | |
| ఉత్తంస | శిరోభూషణమైన | | |
| కలికే | కల్పపుష్పకోరకమా, | | |
| కర్ణాభ్యర్ణం | చెవులసమీపమువఱకు | తవ | నీ |
| గతే | వ్యాపించినవియు (ఆకర్ణపూర్ణములును) | ఇమే | ఈ |
| | | నేత్రే | కన్నులు |
| గరుత ఇవ | ఱెక్కలనుదాల్చినట్లుగా | ఆకర్ణ | చెవివఱకు |
| పక్ష్మాణి | ఱెప్పలను | ఆకృష్ట | లాగబడిన |
| దధతీ | దాల్చినవియు | స్మరశరవిలాసం | మన్మథబాణాల సౌభాగ్యమును |
| పురాంభేత్తుః | త్రిపురాంతకుని (శివుని) | | |
| చిత్త | మనస్సునందలి | కలయతః | వహించుచున్నవి. |

తా॥ అమ్మా, నీవు పర్వతరాజువంశమునకు సిగదండవు. చెవివఱకు లాగబడిన మన్మథ బాణాల చక్కదనము ఆకర్ణాంతములైన నీ నేత్రాలకు గలదు. బాణములకు ఱెక్కలవలె నీ నేత్రాలకు ఱెప్ప లున్నవి. త్రిపురాంతకుడగు పరమశివుని చిత్తమున నైస్పృహ్యమును పోగొట్టి శృంగారరసము నుత్పాదించుట నీ నేత్రాల ఫలము (ఈ బాణాల కొస).

విభక్తత్రైవర్ణ్యం వ్యతికరితలీలాఞ్జనతయా
విభాతి త్వన్నేత్రత్రితయ మిద మీశానదయితే
పున స్స్రష్టుం దేవా న్ద్రుహిణహరిరుద్రా నుపరతా న్
రజ స్సత్త్వం బిభ్ర త్తమ ఇవ గుణానాంత్రయ మివ ॥ ౫౩

| | | | |
|---|---|---|---|
| హే ఈశానదయితే | ఓ మహాదేవప్రియా | ద్రుహిణ | బ్రహ్మ |
| వ్యతికరిత | కలిసిపోయిన | హరి | విష్ణువు |
| లీలా | విలాసార్థము పెట్టుకోబడిన | రుద్రాన్ | రుద్రుడు అనెడి |
| అఞ్జనతయా | కాటుకకలదగుటచే | దేవాన్ | దేవతలను |
| విభక్త | సంకీర్ణములైన | పునఃస్రష్టుం | మరల సృజింప |
| త్రైవర్ణ్యమ్ | (తెలుపు - ఎఱుపు - నలుపు అను) మువ్వన్నెలుగల | రజః సత్త్వమ్ తమః ఇతి | రజము సత్త్వము తమము అను |
| ఇదం | ఈ | గుణానాంత్రయమ్ | గుణాల మూడింటిని |
| | నీ | బిభ్రత్ ఇవ | తాల్చియున్నదో అనదగి |
| నేత్రత్రయమ్ | కన్నుల మూడింటి మొత్తము | విభాతి | ప్రకాశించుచున్నది. |
| ఉపరతాన్ | విలీనులైన | | |

తా॥ అమ్మా మహాదేవప్రియా, నీవు విలాసమునకై పెట్టుకొన్న కాటుక కాంతి కలిసిపోవుటచేత నీ నేత్రాలయందు తెలుపు, ఎఱుపు, నలుపు అను మువ్వన్నెలు సంకీర్ణములై యున్నవి. ప్రళయవిలీనులగు త్రిమూర్తులను మరల సృజింపగోరిన నీ కన్నులు మువ్వన్నెల రూపాన సత్త్వము, రజము, తమము అను త్రిగుణముల దాల్చియున్నట్లు ప్రకాశించుచున్నవి.

పవిత్రీకర్తుం నః పశుపతిపరాధీనహృదయే
దయామిత్రై ర్నేత్రై రరుణధవళశ్యామరుచిభిః
నద శ్శోణో గఙ్గా తపనతన యేతి ధ్రువ మముం
త్రయాణాం తీర్థానా ముపనయసి సమ్భేద మనఘమ్ ॥ ౫౪

| | | | |
|---|---|---|---|
| హే పశుపతి పరాధీనహృదయే | ఓ శివాధీనచిత్తా | ధవళ | తెల్లని |
| | | శ్యామ | నల్లని |
| నః | మమ్ము | రుచిభిః | కాంతులుగలవియు అగు |
| పవిత్రీకర్తుమ్ | పవిత్రీకరించుటకు | నేత్రైః | కన్నులచేత |
| దయామిత్రైః | దయతోగూడినవియు | శోణః నదః | శోణనదము |
| అరుణ | ఎఱ్ఱని | గఙ్గా | గంగ |

| | | | |
|---|---|---|---|
| తపనతనయా ఇతి | యమున అను | సమ్భేదమ్ | సంసర్గమును |
| త్రయాణాంతీర్థానామ్ | మూడు తీర్థములకు | ఉపనయసి | కల్గించుచున్నావు |
| అముమ్ | ఈ కననగుచున్న | ధ్రువమ్ | (ఇది) సత్యము. |
| అనఘమ్ | పాపహరమైన | | |

తా॥ శివాధీనమైన చిత్తముగల ఓ జననీ, దయాసనాథములగు నీ మూడుకన్నులలో నొకదాని కాంతి ఎఱుపు, ఒకదాని కాంతి తెలుపు, ఒకదాని కాంతి నలుపు. ఒక్కచోట ఈ మూడు కాంతులును కలియుట ఎట్లున్న దనగా, మమ్ము పవిత్రీకరింపగోరిన నీ సంకల్పము చేత శోణయు (ఎఱ్ఱప్రవాహము) ను, గంగయు (తెల్లప్రవాహము) ను, యమునయు (నల్లప్రవాహము) ను ఒక్కచో కూడిన ట్లున్నది.

నిమేషోన్మేషాభ్యాం ప్రళయ ముదయం యాతి జగతీ
త వే త్యాహు స్సన్తో ధరణిధరరాజన్యతనయే
త్వ దున్మేషా జ్జాతం జగ దిద మశేషం ప్రళయతః
పరిత్రాతుం శజ్కే పరిహృతనిమేషా స్తవ దృశః ॥ ౫౫

| | | | |
|---|---|---|---|
| ధరణిధర రాజన్య తనయే | పర్వతరాజపుత్త్రీ | త్వ దున్మేషాత్ | నీ నేత్రోన్మీలనముచే |
| | | జాతమ్ | పుట్టిన |
| తవ | .. | అశేషమ్ | సమస్తమగు |
| నిమేష+ఉన్మేషాభ్యామ్ | కన్నులమూతచే తెఱచుటచే | ఇదం | ఈ |
| | | జగత్ | జగత్తును |
| జగతీ | విశ్వము | ప్రళయతః | ప్రళయమునుండి |
| ప్రళయమ్ | సంహారమును | పరిత్రాతుమ్ | కాపాడుటకై |
| ఉదయమ్ | ఉద్భవమును | తవ | నీ |
| యాతి ఇతి | పొందును అని | దృశః | కన్నులు |
| సన్తః | సత్పురుషులు, వ్యాసాదులు | పరిహృతనిమేషాః | ఱెప్పపాటు మానియున్నవి |
| ఆహుః | పల్కుదురు | ఇతి శజ్కే | అని తలంతును. |
| | కావున | | |

తా॥ అమ్మా పార్వతి, నీవు కన్నులు మూసికొన్న విశ్వము సంహృత మగు ననియు, నీవు కన్నులు విచ్చిన విశ్వము పుట్టువొందు ననియు వ్యాసాదులు పల్కుదురు. అట్లగుటంబట్టి, నీకన్నులు విచ్చినందున ఉత్పత్తిల్లిన యీ సమస్తవిశ్వమును ప్రళయమునుండి కాపాడుటకే కాబోలు నీ నేత్రములు ఱెప్పపాటు మానియున్నవి అని తలంచుచున్నాను.

# శ్రీ కృష్ణ సంస్మృతి

## [సంపాదకీయము]

యద్ య దాచరతి శ్రేష్ఠ
స్తత్త దే వేతరో జనః
స యత్ప్రమాణం కురుతే
లోక స్తదనువర్తతే.

"శ్రేష్ఠుడు ఏదేది ఆచరించునో ఇతరజనులును దానినే ఆచరింతురు. అతడు దేనిని ప్రమాణీకరించునో లోకము దానినే అనుసరించును" — అన్నాడు శ్రీకృష్ణుడు భగవద్గీతలో. మన తత్త్వశాస్త్రరంగమున ఇది గొప్ప సత్యము. అనుకరించుట మానవుని సహజప్రవృత్తి. ఏ మానవుని ఏ సంఘమును మనము మెచ్చుకొందుమో ఆ మానవుని ఆ సంఘమును తెలిసియో తెలియకో మన మనుకరింతుము. గ్రుడ్డిగా కాక వివేకముతో అనుకరించుట ఆవశ్యకము.

నాటకములో ఎందఱో పాత్ర లుందురు. ప్రతిపాత్రయు తనవంతును చక్కగా నిర్వహించిననే నాటకము చక్కగ నున్న దనిపించుకొనును. జగన్నాటకములో ఆత్మధర్మోపదేశక పాత్రమును మతగురుపాత్రమును నిర్వహించువంతు భారతదేశము దాయెను. భారతమాత ఆ పాత్రను పెక్కుసహస్రాబ్దులుగా చాల చక్కగ నిర్వహించుచున్నది. సుస్థితిలోనున్నప్పుడును దుఃస్థితిలోనున్నప్పుడును భారతదేశము మతజ్యోతిని లోకమున ప్రసరింపజేయుచునే ఉండెను. ధర్మమునకు గ్లానియు అధర్మమునకు అభ్యుత్థానమును గలిగినప్పుడెల్ల ధర్మతేజోనిధు లీ భరతఖండమున అవతరించి ధర్మస్థాపన చేసి యున్నారు.

దుష్టులు చెలరేగి శిష్టులు అడుగారి ధర్మము నిరాశ్రయమైన ఒక అదనున సాధుపరిత్రాణమునకైయు దుష్కృతులవినాశనమునకైయు ధర్మసంస్థాపనకైయు శ్రీకృష్ణు డవతరించెను. 'నీ మేనల్లుడే నీకు మృత్యువు' అని ఆకాశవాణి లోకకంటకుడైన కంసునకు తెల్పినది. ఆ విధి నిర్ణయమును అన్యథాకరింప కంసుడు పడని పాటు లేదు. కాని నెగ్గినాడా? దేవకీపుత్రుల నందఱిని వరుసగా చంపెను. తనకు మృత్యువు కాదగినవారి నెవరినిగాని ప్రపంచమున నుండ నీయరాదను పెట్టిపట్టుదలతో, తనరాజ్యమున క్రొత్తగపుట్టిన బిడ్డల నెల్ల జంపించెను. కాని దేవకికి ఎనిమిదవ గర్భము రాగానే, అతని ధైర్యము తగ్గసాగెను. ఏలన తన్ను జంపునదిగా చెప్పబడినది ఆ అష్టమగర్భమే. దేవకీ వసుదేవులను చెరయందుంచి, తన నమ్మిన బంట్లను కాపుంచెను. శిశువు పుట్టిన తత్క్షణమే ఆ వార్తను తన కందింపవలసినది అని ఆజ్ఞాపించియుండెను. కాని ఆ నిర్ణీతదినమున అతని జాగరూకత అంతయు, కాపుదల అంతయు, పూర్వసన్నాహములన్నియు వ్యర్థములాయెను, మగశిశువు పుట్టెను. వే ఱొకచోటికి మార్పబడెను, దాని స్థానమున ఒక ఆడశిశువు పెట్టబడెను. ఈ మార్పు కారాగారరక్షకులకు తెలియనే తెలియదు. దేవకిప్రక్కన నున్న బిడ్డ ఆమెకు గల్గినబిడ్డ అనియే వా రనుకొనిరి.

కంసు డెంత జాగరూకుడై యున్న నేమి, అతని శత్రువు క్షేమముగ తప్పించుకొనెను. తానుగా కంసుడు తన మృత్యువును ఆహ్వానించుకొను వఱకు అతని శత్రువు అతనికి అందనిచోట వర్ధిల్లుచుండెను. ఇహసౌఖ్యమే పరమపురుషార్థ మనుకొను వారి కెల్ల మచ్చుతునుకే కంసుడు. సమయము వచ్చినప్పుడు వెలువడుటకై కంసత్వము మన అందఱిలోను ఉన్నది. కేవలము సుఖమయమైన జీవితము కావలె ననియు, అట్టి జీవితము శాశ్వతముగ నుండవలె ననియు కోరిక మన కందఱికి నున్నది. మన కోర్కెలను తీర్చుకొనుటకై మనము ఒరులను కొల్లగొట్టుదుము, వంచింతుము, హింసింతుము, హత్యలను సైత మొనర్తుము. కంసున కెంత బల మున్న నేమి, ఎంత ధన మున్న నేమి, నెగ్గ లేక పోయినాడు. కంసుని పతనము మనచే ఐహికసుఖవాంఛలవ్యర్థతను గుర్తింపజేసి, మనదృష్టిని నిత్యమును అవ్యయము నైన దానివంకకు మరల్పవలయును.

ఇక దేవకీవసుదేవుల గమనింతము. భగవద్భక్తులైన వారి కంతటి దుఃఖములు గలుగ నేల? భక్తికి దుఃఖమే ఫలమైనచో భక్తి ఎందులకు? ఈ ప్రశ్నములు మన డెందములలో ఉప్పతిల్లునే కాని నిజమైన భక్తుని హృదయమున పుట్టవు. మిగుల నొచ్చినప్పుడు భక్తుడు మీరాబాయివలె —

దుఃఖమే ప్రేమఫల మని తొలుత నాకుఁ *
దెలిసియుండినఁ 'ప్రేమింప వల' దటంచు
డవిణ కొట్టుచుఁ జాటనే భువన మెల్ల ?—

అని పల్కినను భగవంతుని తాను ప్రేమింప బూనుకొన్నందుల కత డెప్పుడును చింతిల్లడు. అంతే కాదు, భగవంతునకై తా ననుభవించు నిడుమలలోనే అతడు సుఖమును గనును. నిత్యజీవితమున తనశిశువుల పోషణకై పడరాని తల్లులను మనము చూచుచుండ లేదా? అవి కష్టములుగా వారు భావించుచున్నారా? లేరు, ఏల? వారికి తక్కిన అన్నికంటె తమ శిశువులు ప్రియతరులు. అట్లే భక్తునకు అన్నిటికంటె భగవంతుడే ప్రియతరుడు —

తదేతత్ ప్రేయః పుత్రాత్
ప్రేయః విత్తాత్
ప్రేయో ఽన్యస్మాత్ సర్వాత్
అన్తరతరం యదయ మాత్మా.

'ఆత్మ పుత్రునకంటె ప్రియము, విత్తమునకంటె ప్రియము, తక్కిన అన్నిటికంటె ప్రియము, అన్నిటికంటె ఆంతరమైనది' అను (బృ. ఉ. 1-4-8) శ్రుతివాక్యముల నిజమైన అర్థము అతడు తెలిసికొనియున్నాడు. భగవంతు డతని ఆత్మకు ఆత్మ, ప్రాణమునకు ప్రాణము. ఐహికపరులు ఐహికవస్తువులకై ఎన్ని యిడుములనైన బడుటకు సంసిద్ధులై యున్నట్లు భగవత్సాక్షాత్కారమునకై భక్తు డెన్ని యిడుములనైన బడుటకు సంసిద్ధుడై యుండును. ఆ సంసిద్ధతనే మనము దేవకీవసుదేవులయొద్ద కాంచుచున్నాము.

పెనువాన కురియుచు, మధురయందును గోకులమందును సకలప్రాణులును గాఢనిద్రాపరవశులై యున్న ఆ రాత్రి వసుదేవుడు బిడ్డ నెత్తుకొని, కారాగారమునుండి వెలువడి,

* జో మై జానతీ ప్రేమకియే దుఃఖహోయ
నగర డిండోరా పీటతీ ప్రేమ న కీజే కోయ,

యమునను దాటి, గోకులమున కేగి, తనమిత్రు డగు నందుని భార్య యశోదప్రక్కన ఆబిడ్డను పరుండ బెట్టి, అంతకుముందే యశోద కని యుండిన స్త్రీశిశువును తాను తెచ్చుకొనెను. భగవన్మాయామోహితులై అందఱును గాఢ నిద్రాపరవశులై యున్నందున ఈ మార్పు ఎవరికిని తెలియదాయెను. అందఱును లేచి చూచు సరికి యశోద ప్రక్కన ఏ శిశు వుండెనో ఆ శిశువు ఆమె కన్న బిడ్డే అని తలంచిరి.

అంతట శ్రీకృష్ణుని దివ్యచరిత్రములో అతని లీలల కాండ మారంభమాయెను. అతని దివ్య సౌందర్యము గోకులమందలి యెల్లర హృదయ ముల, ముఖ్యముగ మగువల హృదయముల, నాచికొనెను.

శ్రీకృష్ణునకు కలుగుచుండిన ఆపదలు వాని నుండి అతడు తప్పించుకొనుచుండిన విధము ఎల్లరను ఆశ్చర్యస్తబ్ధులను జేసెను. తల్లి సదా అతనికై ఆందోళన పడుచుండెడిది. అతని దివ్యత్వము మాటిమాటికిని ప్రకట మగుచుండె డిది. దానిని వారు అర్థము చేసికొనులోపుగనే మాయ వారిని ఆవహించెడిది. శ్రీకృష్ణు డొక నాడు మన్ను దినెను. దానిని కన్న వారు యశోదకు తెల్పిరి. యశోద చాల దిగుల్పడి బాలుని పట్టుకొని నోటిని తెఱువుమనెను. ఆ నోట, ఆమెకు సమస్తవిశ్వము కన నయ్యెను. దిగ్భ్రాంతయై ఆమె ఆలోచించి బాలుని పరా త్పరుడని నిర్ణయించుకొనునంతలో, ఆదృశ్యము అదృశ్యమయ్యెను. 'చిన్ని కృష్ణుడు నాబిడ్డ' అను మాయ మరల ఆమెను ఆవరించెను. నానాటి కిట్టి లీలలు చెల్లుచు అచటివారికి పర మానందమును కూర్చుచుండెను.

'శ్రీకృష్ణసంశ్లేషము నారీతి ననుభవించు టకు గోకులవాసు లెంత భాగ్యవంతులో కదా' అని అనంతరకాలమున శ్రీకృష్ణుని దర్శించి నప్పుడు మథురప్రజ లనుకొనిరి. నిజముగ గోకులవాసులు భాగ్యవంతులే. భగవదను గ్రహమునకు వా రంతగా భాజను లగుటకు కారణ మేమి? అమాయికతయే మనలను భగవంతుని సమీపమునకు జేర్చుగుణ మని శ్రీరామకృష్ణుడు చెప్పెడివాడు. గొల్లల అమా యికతయే వారిని భగవత్ప్రీతిపాత్రుల నొనర్చి నది.

ఒక యద్భుతైతిహ్యము :—ఒకనాడు ఆవుల మేపుచు శ్రీకృష్ణుడు గోపబాలురతో చాల దూర మేగెను. ఆ బాలురకు బడలికయు ఆకలియు గల్గినవి. వారు శ్రీకృష్ణునితో జెప్పు కొనిరి. వా రుండు చోటికి అనతిదూరమున నొక తపోవన ముండెను. "ఆ మునులయొద్ద కేగి నే నడిగితి నని చెప్పి అన్న మడుగు" డని శ్రీకృష్ణుడు గోపబాలుర నంపెను. శ్రీకృష్ణ లీలలును శ్రీకృష్ణనామమును ఎల్లెడల వ్యాపించి యున్నందున శ్రీకృష్ణుడు విశ్వసంరక్షకు డను నమ్మకము గల గోపబాలురు మునులయొద్ద తమకు అన్నము తప్పక లభించు ననుకొనిరి. కాని శ్రీకృష్ణునిపేరు చెప్పుకొనుచు వారు అన్న మడుగగనే, మునులు వారిని తఱిమి వైచిరి. శ్రీకృష్ణుడు కేవల మొక కొంటెగొల్ల పిల్ల డనియే ఆ మునులు తలంచిరి. విఫలాశులై మరలి బాలురు శ్రీకృష్ణునితో జరిగిన సంగతి తెల్పిరి. అంత శ్రీకృష్ణుడు నవ్వుచు వారిని మునిపత్నులయొద్ద కంపెను. శ్రీకృష్ణుడు తమ తపోవనమున కంత సమీపమునకు వచ్చి యున్నా డని విని మునిపత్నులు బ్రహ్మానందము చెందిరి. రకరకములైన మేలి భక్ష్యములను గొని వారు శ్రీకృష్ణునొద్దకు గోపబాలుర వెంబ డిని వచ్చిరి. శ్రీకృష్ణుని గూర్చి వా రెంతో

విని యుండిరి. అతడు సాక్షాన్నారాయణుఁడనియే వారి నమ్మకము. ఆయనను దర్శింపవా రాత్రపడుచుండిరి. దర్శించినవెంటనే వారి సంసారబంధములు తెగినవి. వారిక ఇండ్లకు పోజాలమనిరి. కాని శ్రీకృష్ణుఁడు 'మీ పతులు మిమ్మాదరింతురు, గృహములకే మరలు' డని సమ్మతింపజేసి పంపివైచెను. ఒకముని తన పత్ని నడవడి నాక్షేపింపగా ఆమె శ్రీకృష్ణుని చరణముల ధ్యానించుచు, ఉద్దామధ్యానముచే కర్మబంధముల ద్రెంచుకొని ముక్తి నందెను.

దీనిని జూచి మునులు తమ తప్పిదమును గుర్తించి పశ్చాత్తప్తులై ఇట్లు ఆక్రందించిరి—

*'కటా! భగవానుడు నరరూపమును దాల్చి యాచించెను. ఆ రహస్యంబు నెఱుంగక వాని ననాదరించి మహాదోషం బొనర్చితిమి. అహో! స్త్రీమాత్రులగువారికిని భగవంతు నెడ నెంత భక్తి కుదిరెను. ఆ భక్తిలో నావగింజంత మాత్రమేని మాకుఁ గలుగదయ్యెఁ గదా! మాయట్టి పాపాత్ములు మను టేల? శౌక్ల్యము సావిత్రము దైక్ష మని జన్మము ముప్విధము. భగవద్విముఖులకు నిట్టి జన్మత్రయంబు గలిగియు వ్యర్థ మగును. మఱియు భగవదనుగ్రహార్థము కొందఱు కఠినబ్రహ్మచర్యవ్రతంబును బూనుదురు; కొందఱు సర్వవేదంబుల వల్లింతురు; కొందఱు నిఖిలకర్మంబుల ననుష్ఠింతురు. గోరంతభక్తి లేనినాఁ డివి యెల్ల నిరుపయోగంబులు. అహో! భగవన్మాయ నేమన వచ్చు! అది యోగులనుగూడ మోహవశులఁ జేయుననఁగా మాబోఁటి స్వార్థపరుల సంగతి చెప్పనేల? అహో! మాపత్నులభాగ్యమే భాగ్యము. వారు స్త్రీమాత్రులై యుందురు; ఉపనయనసంస్కారం బెట్టిదో యెఱుంగరు; గురుకులవాసంబు సేయరు; ఎట్టి తపం బొనర్పరు; ఆత్మవిచారం బన్న నెట్టిదో తెలియరు; శౌచపుణ్యకర్మాదు లెవ్వియుఁ గావింపరు; ఇవన్నియు మనము చేసి చేసి యలసి సొలసితిమి. ఇంత చేసినను మనకు భక్తి లేశ మేనియుఁ గుదురదు. ఏమియు నెఱుంగని స్త్రీలకు భగవానుని పయి స్థిరభక్తి కుదిరెను. మన యీ స్థితికిఁ గారణ మేమి? గృహాసక్తిం జేసి స్వార్థమూఢుల మగుటయే కారణము. ఈ కారణంబున మనకు భగవానుఁడు గోపకుమారకుల వచనంబుల బోధించెను. ఎట్లందురా? భగవానుఁడు పూర్ణకాముఁడును లోకేశ్వరుఁడు నగును. అట్టివాఁడు పిడికెడన్నంబు నిమిత్తము చేసి గోపకుమారులను మనయొద్దకుఁ బంపెను. వాని భావంబును మనము గ్రహింపమైతిమి. పరమేశ్వరుఁ డెక్కడ! యాచించుట యెక్కడ! దేశకాలద్రవ్యమంత్రతంత్రంబులొండె ఋత్విగ్యజమానాగ్ని దేవతలొండెఁ గ్రతుధర్మంబులొండె నెవనిమయత నొప్పారునో, ఎవని పాదసేవకై సిరి తన చాంచల్యంబును మాని నిరంతరముఁ బరితపించుచుండునో యట్టి యోగీశ్వరేశ్వరుఁడు భగవానుఁడు యదువంశంబునఁ బుట్టె నని చెవులార వినియు మాఢ్యంబునఁ జేసి తత్త్వము గ్రహింపక మోసపోయితి' మని లోలోన వగఁగుంది చేతులు జోడించి 'కృష్ణా, నీ మాయామోహితులమై కర్మమార్గంబునఁ బడి త్రిమ్మరుచు నీ ప్రభావం బెఱుంగక నీయెడ మహాపరాధంబుఁ గావించితిమి. మా యీదోషంబునకు నీ మాయయే కారణంబు గావున మమ్ము క్షమించుట నీకుఁ దప్పదు.'

గోపికలతోడి శ్రీకృష్ణుని సాహచర్య మొక గంభీరఘట్టము. దాని నెవరును అర్థము చేసికో

* దొడ్డభాగవతము, III-126.

లేకున్నారు. అందఱును దాని నపార్థము చేసికొనుచున్నారు. కామదోషదూషితమగు దృష్టి గల మనము దానిని అనుచితరీతుల వివరింప జూతుము. కాని అనాదికాలమునుండియు భగవంతుని ప్రాణకాంతునిగ ప్రేమించిన భక్తులున్నారు. అట్టిరాగభక్తిని భక్తిశిఖర మనజెల్లును. అట్టి ప్రేమలో బేరమాడుట లేదు, బదులుకు బదులు ఇచ్చిపుచ్చుకొనుటలు లేవు. భక్తుడు తన సర్వస్వము నొసంగ గోరును. కావున గడనపైనే మనసు గల మనకు వారి తీరు అవగాహన కాదు. గోపికల ప్రేమను గూర్చి శ్రీ వివేకానందస్వామి ఇట్లనెను — * "ఆ బృందావనమనోజ్ఞలీలలో ప్రకటితమైన మహావిచిత్రవిశాలవికసితవిశుద్ధప్రేమదివ్యతత్త్వమును గ్రహించుట అట్టి దివ్యమధురభావరసపానము చేసి, నిష్కళంకప్రేమోన్మత్తచిత్తుడైనవానికే సాధ్య మగును. అహో! గ్రహించుట బహుదుర్లభ మగు ఆ అద్భుతజీవితఘట్టమును పరమపవిత్రుఁడును పూర్ణనిష్కళంకుడును అగు పర్యంతము ఏవాడును గ్రహింప బ్రయత్నింప రాదు. ఆ గోపికల ప్రేమస్పందనముల నెవరు గ్రహింపజాలుదురు? ఆదర్శరూపమగు ఆ ప్రేమ! ప్రతిఫలాపేక్ష ఏ కోశమునను లేని ప్రేమ! స్వర్గమును సైతము లెక్కసేయని ప్రేమ! ఇహమునందు గాని పరమునందు గాని ఎద్దానిని స్మరణయందైనను నిలుపనోపని వినిర్మలప్రేమ!" గోపికల శ్రీకృష్ణతృష్ణను ఏ శ్రీరామకృష్ణుడో ఏ శ్రీకృష్ణచైతన్యుడో మాత్రమే తమ అనుభూతిలో కనగలరు. మనకు అర్థము కానట్టి విషయమును ఖండింపదొరకొని దైవదూషణకు పాల్పడకుందుము గాక. అంతే కంటె భక్తికర్హత నొసగు పావిత్ర్యము గడింప ప్రయత్నింతము గాక.

శ్రీకృష్ణుని యీ లీలలను వర్ణించుచు ప్రజలు వీనిని ఏ దృష్టితో గ్రహింపవలెనో శ్రీ శుకయోగి ఇట్లు చెప్పియున్నాడు — † "కొన్ని కార్యంబులు లోకదృష్టికి ధర్మవ్యతిక్రమంబులుగా సాహసికంబులుగా గాన్పింపవచ్చును... ఈశ్వరులు మహాతేజస్వంతులు. అగ్ని సమస్త పదార్థంబులను గాల్చును. దగ్ధవస్తువుల గుణదోషంబు లగ్నికి నంటునా? అట్లే తేజస్వంతుల సంగతియు అని గ్రహింపవలయును. ఈశ్వరుఁడు సముద్రమథనజనితహాలాహలంబును ద్రావెను. ఆ పని యెల్లరుఁ జేయఁ గలరా? ఒక వేళ సాహసించె నేని యయ్యధముఁడు వెనువెంటనే నశించును. పెద్దల హితోపదేశంబును బిన్నలు దలఁ దాల్ప వగునే గాని వారు నడచిన ట్లెల్లప్పుడు నడవరాదు" —

"గోపజనములందు గోపికలందును
సకలజంతులందు సంచరించు
నా మహాత్మునకుఁ బరాంగన లెవ్వరు?
సర్వమయుఁడు లీల సలిపెఁ గాక"

శ్రీకృష్ణుని బృందావనలీలల కనంతరకథ విధిచోదితుడై కంసుడు 'శ్రీకృష్ణుని మధురకు పిలుచుకొనిర'మ్మని అక్రూరుని బంపుట. భక్తవతంసుడగు అక్రూరుడు తనకు లభించిన శ్రీకృష్ణసందర్శనభాగ్యమునకు సంతోషించి —

"అలకభ్రాజితమై సుధాంశునిభమై
హాసప్రభోద్దామమై
జలజాక్షంబయి కర్ణకుండలవిరా
జద్గండమై యున్న నీ

* సందేశతరంగిణి, I-277.

† దొడ్డభాగవతము, III-169.

విలసద్దివ్యముఖంబుఁ జూచు కలిమిన్
వేఁ గాంతుఁ బో నాకు నా
వల దిక్కేఁగుచు నున్న యీ వనమృగ
వ్రాతంబు లీ త్రోవలన్''

అనుకొనెను. అక్రూరుని వెంట శ్రీకృష్ణుడు మథురకు జని తన్ను చంపుటకై కంసుడు కావించిన యేర్పాటుల నన్నిటిని భగ్నమొనర్చి లోక కంటకుడగు కంసుని సంహరించి జగత్కల్యాణ మొనర్చెను.

శ్రీకృష్ణునితో అర్జునునకును ఉద్ధవునకును కుచేలునకును సాగిన చుట్టరికమును గూడ మన మిట గమనింప దగును. అర్జునుఁడు శ్రీకృష్ణునకు సవయస్కుఁడు, మేనత్తకుమారుడు వారి సఖ్యము లోకోత్తరము. శ్రీకృష్ణుడు పార్థునకు సారథియునై అతని గుఱ్ఱముల కడిగెను!

ఉద్ధవుడును శ్రీకృష్ణు నెడబాసియుండలేని మిత్రుఁడు. కాని అతని డెందమున నొకప్పుడు తాను భక్తశ్రేష్ఠుఁడ నను అహంకారము పొడసూపగా గోపికల భక్తి నతడు చూచును గాక అనుకొని శ్రీకృష్ణు డతనిని గోపికలయొద్దకు పంపును. వారి భక్త్యుత్కటతను స్వయముగ జూచి ఉద్ధవుడు వారినే ఇట్లు ప్రార్థించెను —
* ''కల్యాణులారా, తమవారి నెడబాసియుండుట యెంతటివారికిఁ గష్ట మగు. అంత కష్టకార్యంబునకుఁ గూడ మీరు సాహసించితిరి. సర్వార్థసాధనంబునకు ధర్మంబు మూల మగు. దానిని గూడ మీరు త్యజించితిరి. ఎట్టకేలకు శ్రుతిమృగ్యమైన ముకుందపదంబును గాంచితిరి. పరమ పుణ్యవతులారా, మీ పాదరేణువుపైన సోకినఁ జాలు. అందులకుగా నేను బృందావనమందుఁ జెట్టుగానో, గుట్టగానో, తీఁగెగానో యోషధిగానో పుట్టుదుఁ గాక. మీ బృందావనవిహారంబులందు మీ పాదధూళి నాపయి పడుఁగాక.''

కుచేలోపాఖ్యానమున శ్రీకృష్ణకుచేలుర సఖ్యము స్పృహణీయముగ వర్ణింపబడియున్నది. సాందీపనియొద్ద ఈ యిరువురు సహాధ్యాయులు. విద్యాభ్యాసానంతరము విడిపోయిరి. కుచేలుడు వివాహితుడై బహుసంతతి గలవాడయ్యెను. జితేంద్రియుడు ప్రాప్తసంతుష్టుడు, సదా భగవద్గతచిత్తుఁడుగ నత డుండెను. కాని అతనియిల్లాలు పేదఱికము నోర్వలేక 'శ్రీకృష్ణుని దర్శించి ర'మ్మని అతనిని బంపును. కుచేలుఁడు ద్వారకకు బోవుచు శ్రీకృష్ణున కర్పింప తనయొద్ద వేఱేమియు లేక పోగా కొంత అటుకుల నొక బొంతలో ముడుచుకొని తీసికొని పోయెను. † ''శ్రీకృష్ణభగవానుఁడు దూరాననే కుచేలుని గుర్తించి పాన్పునుండి తటాలున లేచి యెదురేఁగి కవుంగిట గ్రుచ్చి యాదరించి యానందబాష్పములు నించుచు నవ్విప్రునిఁ జేయిఁబట్టి తెచ్చి తనపాన్పుపయిఁ గూర్చుండఁబెట్టి స్వయముగాఁ బూజాద్రవ్యంబులు గొనివచ్చి పాదంబులు గడిగి లోకపావనమైన యా విప్రపాదజలంబులఁ దలఁదాల్చి దివ్యచందనం బలఁది పుష్పమాల లర్పించి ధూపదీపంబు లిచ్చి తాంబూలంబును గోవును నివేదించి 'మిత్రవర్యా, స్వాగతమే కదా' యని యడిగెను. కేవలము శుష్కించి నరాల ప్రోవుగా నున్న యా పేదపాఱుని గోచిగుడ్డరాయనిఁ గృష్ణుఁ డంతభక్తిప్రీతులతో నర్చించుట రుక్మిణీదేవి చూచి యాశ్చర్య మందియుఁ

* దొడ్డభాగవతము, III-248.
† దొడ్డభాగవతము, III-

బతిప్రతామణి గావున భర్తృహృదయంబు గ్రహించి తాను చామరంబుఁ జేతఁబట్టి వీచుచు నవ్విప్రునకు నుపచారంబులు చేయసాగెను. ......కుచేలుని కొంగుముడి కృష్ణుని కంటఁ బడెను. కృష్ణుఁ డది చూచి 'విప్రోత్తమా, నాకై యేదేనియు నుపహారంబు దెచ్చితివా? భక్తు లణుమాత్రం బిచ్చిన నయ్యది నిండు ప్రేమతో నియ్యంబడును గావున నాకుఁ గొండంత యగు. భక్తిలేని యర్పణము మేరువైనను నాకుఁ బ్రీతిఁ గూర్పదు. పత్రమో పుష్పమో ఫలమో తుదకు గరిటెడు నీరో యేదేని భక్తితో నిత్తురేని దానిని మహాప్రీతితో గ్రహింతును. భక్తియే ప్రధాన మగు; పదార్థ గురుత్వము ప్రధానము గాదు' అని పలికెను. కుచేలుఁ డా మాటలు విని 'జగదీశ్వరుఁ డెక్కడ? నా తెచ్చిన యడుకు లెక్కడ? అవి శ్రీపతికి నెట్లు సమర్పింతు' నని లోలోన సిగ్గుపడి తలవంచి మిన్నకుండెను. భగవానుఁడు వానిభావము గ్రహించి 'ఈ బ్రాహ్మణుఁడు పతివ్రతయైన పత్ని బలవంతపెట్టగా సంపదర్థియై యిందు వచ్చెను. ఇతనికి దేవదుర్లభశ్రీల నీయ నగు' నని తలంచి, వాని కొంగుమూట విచ్చి యం దడుకు లుండుటఁ జూచి ''మిత్రమా, ఇంతకన్న నాకుఁ బ్రియపదార్థంబు గలుగ'' దనుచుఁ బిడికెడు తీసికొని భుజించి వేఱొండు పిడికెడు గ్రహింప నుండెను. రుక్మిణీదేవి యది చూచి భర్త చేయిపట్టుకొని 'విశ్వాత్మా, నీ వారగించిన పిడికె డడుకులతోనే యీ పేద బ్రాహ్మణునకు నీ తలంచినట్లుగా నిహపరంబుల రెంట సర్వసంపత్సమృద్ధి చేకూరును' అని యడ్డుపడెను. ...కుచేలు డంత తన యూరు చేరి చూచుకొనుసరికి ఇతని పేదగుడిసె కుబేర సంపత్సంపూర్ణమగు భవనరాజముగ మాఱి యుండెను. దీనినే శ్రీ వేదాంతదేశికులవారు 'ధానాముష్టిముచే కుచేలమునయే ధత్తేస్మ విత్తేశతామ్'

ప్రీతి నటుకులం బిడికె డర్పించినట్టి
మిత్రుని కుచేలుని కుబేరు మీఱఁ జేసె.

అని స్తుతించిరి.

ఇట్లు శ్రీకృష్ణుని పలువురు పలువిధముల నుపాసించిరి. యశోదానందులు దేవకీవసుదేవులు పుత్రభావమున; ఉద్ధవార్జునకుచేలురు మిత్రభావమున; గోపికలు 'ప్రాణకాంత' భావమున; గోకులవాసులు 'జగద్రక్షక' భావమున. అందఱిని అత డాదరించెను. భగవద్గీతలో 'యే యథా మాం ప్రపద్యన్తే తాం స్తథైవ భజామ్యహమ్' 'ఎవరు నన్ను ఏరీతి నాశ్రయించిన వారి నారీతి నాదరింతు' నని ఆయనయే చెప్పెనుకదా.

## ఆసి ం

### శ్రీ పున్నావఝ్ఝల సీతారామబ్రహ్మంగారు

స్వాభావికం, సర్వజనీనం'

దేవు డున్నాడని చెప్పినవారు వైదిక ఋషులు మాత్రమే కారు. భగవదాస్తిక్యాన్ని ఉద్ఘోషించిన మహాత్ములు అన్ని కాలాలలోను, అన్ని దేశాలలోను కలరు. ఈశ్వరుని ఉనికి ఇతరు లెవరో ఒక వార్తగా మన చెవిని పడ

వేస్తేనేగాని తెలియనంతటి పరాయివిషయం కాదు. ఒకానొక ప్రవ ర్తయందు అమోఘమైన భక్తి కుదిరితేనేగాని గ్రహించడానికి సాధ్యం కాని అస్వాభావిక విషయంకాదు. కేవలం తర్కించేసే నిర్ణయంతో సంతృప్తిపడవలసిన పరోక్షవిషయంకాదు. విద్యాధికులకు మాత్రమే బోధపడి, సామాన్యులకు అవగాహనకాని బుద్ధిగతవిషయంకాదు. సమస్త సృష్టి భగవంతుని ప్రకాశమే. ప్రకృతియందలి ప్రతివస్తువు, ప్రతి దృశ్యము మన కతీతమైన శక్తినో, సౌందర్యాన్నో, ప్రజ్ఞనో, మహిమనో స్ఫురింపజెయ్యడం లేదా? జీవిత సంఘటనలు, చావు పుట్టకలు, విచిత్రానుభవాలు, వివిధానుబంధాలు, సంయోగ వియోగాలు, మన శరీర యంత్ర నిర్మాణం, ఈయంత్రంలో మన ప్రయత్నం లేకుండానే మనకొఱకు నిరంతరం క్రమబద్ధంగా సాగుతున్న వ్యాపారాలు జ్ఞానాత్మకమైన శాసనాన్ని తలపింపజెయ్యడంలేదా?

పుట్టిన ప్రతిజీవి గిట్టక తప్పదని ప్రతివారికి తెలుసు. జీవులవయస్సులను గాని, సమయ సందర్భాలను గాని, ఔచిత్య అనౌచిత్యాలను గాని మృత్యుదేవత పరిగణించదని తెలియని వారు లేరు. ఎవ రేఘడియలో చనిపోతారో ఎవరికీ తెలియదు. మృత్యువు క్షణమైనా ముందుగా చెప్పిరాదు. కాని, అందఱు తమ మృత్యువును గుఱించిన ఆలోచనే లేకుండా తమ భావిభాగ్యోదయాన్ని గుఱించి ఆలోచనలు చేస్తున్నారు; ఉత్సాహంతో జీవిత వ్యాపారాలు నిర్వహిస్తున్నారు. ఎందుచేత? పోనీ, మృత్యువంటే ఎవరికీ భయంలేదా? మృత్యువు పేరుచెబితే గడగడలాడనివారు లేరు. ముచ్చెమటలుపోయనివారు లేరు. ఆత్మీయుల వియోగానికి వెక్కివెక్కి దుఃఖించనివారు లేరు. చీకటిలో తాడును చూచి పాము అని భ్రమపడితేనే ప్రైప్రాణాలు పైనపోతవి కదా! తాను చితిమీది కెక్కడం నిశ్చయమన్న సత్యం హృదయాన నాటుకుంటే చిత్తస్వాస్థ్యం ఉంటుందా? అనుక్షణం మృత్యుదేవత వికటాట్టహాసంతో మనచుట్టూ చిందులుత్రొక్కుతూ ఎన్నెన్నో జీవులను తనపొట్టనుపెట్టుకుంటున్న సంగతి ప్రత్యక్షంగా చూస్తున్నప్పటికీ, మృత్యువుమాట చెబితేనే బెదరిపోతున్నప్పటికీ తమకు మృత్యువు కలదన్న భయాందోళనలు లేకుండా, నిశ్చింతగా, ఉల్లాసంతో జనులు జీవితాన్ని అనుభవించగలుగుతున్నారు. తమకు చావు నిజమని హృదయంతో ఎవ్వరూ నమ్మలేకపోతున్నారు—ఏమి ఈ చోద్యం?

పొగడ్తలకు ఉబ్బితబ్బిబ్బులుకానివారు లేరు కదా! దేవతలు మొదలుకొని తిర్యగ్జంతువుల వఱకు సర్వజీవులు ముఖస్తుతులకు వశమైపోతున్నవి. పూర్వం రాజులు వేటలలో కుక్కలను ఉపయోగించేవారు. ఒక్కపరుగున పోయి మృగాలను పట్టుకొనితీరాలని జాగిలాల కుతూహలం. మృగం చిక్కక తప్పించుకొని పోయినదా, తల కొట్టి వేసినట్టు కుక్కలు నిరుత్సాహంతో చతికిలపడేవి. అంతట మృగయులు వాటిని సమీపించి, వీపు నిమిరి, భుజం తట్టి, కుషామత్ చేసేసరికి అవి అపూర్వమైన పౌరుషం, సాహసం ప్రదర్శించి చెంగునపోయి వేటజంతువులను పట్టితెచ్చేవి. నెత్తిమీద రూపాయిపెడితే, నయాపైస విలువచెయ్యనివారు కూడా "నీ అంతటివారు లేరు. నీవుకాబట్టి ఈపనిచేశావు. మఱెవరివల్ల అవుతుంది? నిజానికి ఈ మాట నీ ఎదుట అనవలసినది కాదు" అనగానే ఏనుగు అంబారీమీద కూర్చోబెట్టి మేళతాళాలతో ఊరేగించినంతగా పొంగిపో

తాడు. స్తోత్రపాఠాలను అసహ్యించుకునేవారు, తమ అనర్హతలను బాగా తెలుసుకున్నవారు కూడా తమకే తెలియకుండా చల్లగా పొగడ్తలకు లోబడిపోతారు. తమ్ము గురించి చెబుతున్న మాటలు పొగడ్తలే అని గ్రహించినప్పటికీ సంతోషం తగ్గదు. శీతకాలంలో వేడినీళ్ళ స్నానంలాగా సుఖంగా ఉంటుంది. స్తుతివిద్యలో ప్రవీణులైనవారు అదనుచూచి పదునుగాచేసే స్తోత్రాలకు శత్రువులు సహితం మిత్రులుగా మారిపోతారు. అనేక మానసిక వ్యాధులకే గాక, కొన్ని శరీరరుగ్మతల చికిత్సకుకూడా "ఆత్మవిశ్వాసం పూరించడం" పేరుతో, "పుర్కళిపులను తోలగించడం" పేరుతో పొగడ్తలు ఔషధాలుగా వినియోగింపబడుతున్నవి. కొంచెం మించుమించుగా ప్రతివారు హనుమంతునివలె తమశక్తి తెలుసుకొనలేనివారే. తమ అల్పత్వం స్పష్టంగా గ్రహించినప్పటికీ, లేని సుగుణాలు ఉన్నట్టు, ఉన్న అవగుణాలు లేనట్టు శ్లాఘిస్తుంటే మంత్రముగ్ధులయిపోవడానికి కేమి కారణం?

స్వేచ్ఛ, స్వాతంత్ర్యం అక్కర లేదనేవారు లేరు. నిజానికి అవి ఎక్కడ ఉన్నవి? అవి వినబడేవేగాని కనబడేవికావు. ఎవరు స్వేచ్ఛావిహారులు? ఎవరు స్వతంత్రులు? ప్రతివారు ఒక విషయంలో స్వతంత్రులయితే నూరువిషయాలలో పరతంత్రులు. ఆకలిదప్పులు లేనివారెవరు? చావుపుట్టుకలను జయించిన వారెవరు? మన దేహంలోని రక్తం మన అనుమతి లేకుండానే ప్రవహిస్తున్నది. శ్వాసక్రియ మన ఆజ్ఞకొరకు వేచిఉండడంలేదు. మన ఇచ్ఛాజ్ఞాన క్రియాశక్తులు సహితం, ఆ ప్రవృత్తుల ప్రేరేపణ మనకు ఒత్తిడి కలిగించినప్పుడే పని చేస్తున్నవి. మనం ఆలోచన చేస్తామనడం కంటె ఆలోచన మనకు తోస్తుందనడమే ఎక్కువ నిజం. సమస్త విశ్వము స్థలంచేత, కాలంచేత, కార్యకారణ సూత్రంచేత శాసింపబడుతున్నది. దేహధారి అయిన వాడెవ్వడు సర్వసంపూర్ణ స్వతంత్రుడు కాలేడు. అయినప్పటికీ ప్రతిజీవి తన బ్రతుకుకంటెకూడా స్వాతంత్ర్యాన్నే అధికంగాపరిగణిస్తుంది. జీవికి ఉచ్ఛ్వాస నిశ్వాసాలకంటె స్వాతంత్ర్య పిపాసే ఎక్కువ సహజం. బిచ్చగాడు ఒక్కపూట గంజితాగుతూ స్వేచ్ఛగా బ్రతకడానికి ఇష్టపడతాడు శరణాలయంలో చేరి, అక్కడి నిర్బంధాలకు కట్టుపడ్డానికి సమ్మతించడు. పక్షి సహితం వేళకు కావలసినంత మేత మేస్తూ, సురక్షితంగా పంజరంలో బంధింపబడ్డానికి అంగీకరించదు. ఆహారం కొరకు వెదకుకొనవలసివచ్చినా, అపాయాలను ఎదుర్కొనవలసి వచ్చినా అంతరిక్షంలో స్వేచ్ఛగా విహరించాలనే కాంక్షిస్తుంది. జీవుల స్వాతంత్ర్యతృష్ణకు అంతు లేకున్నది. ప్రతిజీవి సర్వసృష్టిపై ఆధిపత్యం వహించాలని కోరుకుంటుంది. మృగతృష్ణవంటి ఈ స్వాతంత్ర్యంకోసం ఆరాటపడ్డానికి అర్థమేమిటి?

ఎంతటి పాపాత్ముడు కూడా తాను నిజంగా పాపి నని అంతరాంతరంలో విశ్వసించలేడు. ఒకచెంప తన దౌర్బల్యాలసంగతి తనను బాగా తెలిసినప్పటికీ, బుద్ధిపూర్వకంగా దారుణమైన పను లనేకం చేస్తున్నప్పటికి తన స్వభావమే పాపమయ మని, తాను శిక్షార్హుడనని, క్షమార్హుడను కానని భావించడు. సంఘ మర్యాదను, సంప్రదాయాన్ని మన్నించి తానుజేసే యీపనులు కొన్ని చెడ్డవే అని ఒప్పుకోవచ్చు. కాని, తన దుష్టత్వానికి తనయందు దెవ్వరు అపరాభిమానాలు చూపరాదని, తన్ను బహిష్క-

రించాలని, హింసించాలనిభావించే వారెవరైనా ఉన్నారా? తాను ఉరిశిక్షకు, చిత్రవధకు అర్హుడనని వేయిమందిని చిత్రహింసచేసినవాడు కూడా తలంచడు. ఎందుచేత? తమ్ము తాము ద్వేషించుకునే వారెవ్వరూ లేరు. ఎటువంటి దుర్మార్గుడైనా తన దుష్టవర్తన విషయమై నిశ్చింతగా ఉండగలగడానికి, తన దుష్టప్రవర్తన లాభదాయకంగా ఉన్నప్పుడు మఱింతగా అనందించగలగడానికి హేతువేమిటి?

సుఖపడాలనే కోర్కె లేని జీవి పుడమిని లేనిజీవి. ఎవరేపనిచేసినా, ఏపని చెయ్యడం మానివేసినా సుఖంకోసమే. సుఖసాధనకు దుఃఖనివారణకు ఒక్కొక్కజీవి ఎంతెంత శ్రమ పడుతున్నది! భవిష్యత్తులో లభించగలదనుకునే సుఖం కోసం ఎన్నెన్ని కష్టాలను ఏరికోరి తెచ్చిపెట్టుకుంటున్నారు! నాగరకత ఎక్కువవుతున్నకొద్దీ ఎన్నెన్నో సుఖాలను ఊహించుకొని వాటినిపొందడానికి ఆరాటపడుతున్నారు. ''ఆశవలదు. తృప్తిచెందుడు'' అని అనాదిగా మహాత్ములు ఉపదేశిస్తునే ఉన్నారు. కాని, ఉపదేశం ఫలించినట్టు కనబడదు. సుఖాన్వేషణలో సుఖానికి బదులు దుఃఖమే బహుళంగా ఎదురవుతున్నది. సుఖం కలిగినప్పుడు కూడా మొదట ఆశించినంత సుఖం అనుభవంలోకి రావడంలేదు. అనుభవంలోకి వచ్చిన సుఖం నిలవడం లేదు. సుఖం ఈ వస్తువులో ఉన్నదని ఒకప్పుడు, ఆ వస్తువులో ఉన్నదని మఱొకప్పుడు వాంఛ కొరివిదయ్యం లాగ భ్రమ గొలుపుతూ జీవులను ఒక వస్తువునుంచి మఱొక వస్తువుకు పరుగెత్తించి, ముప్పతిప్పలు పెడుతున్నది. సుఖం అనుభవంలోకి రాక పోవడంచేత ఆస్తిపాస్తులను ఆర్జించి, నిల్వచేసి, వృద్ధిచేసి, జాగ్రత్తచేసి వాటిని తలుచుకొంటూ సంతృప్తిపడదామనిపిస్తుంది. వస్తువుపై యాజమాన్యంకొఱకు మనస్సు ఆరాటపడుతుంది. ఈ సుఖాభిలాషకు అర్థమేమిటి? శతవృద్ధు సహితం భవిష్యత్తునందు ఆశ విడిచిపెట్టలేక పోతున్నాడు—ఏమి ఈ ఆశ్చర్యం?

ఎల్లకాలం సర్వజీవులలో గల ఈ పరస్పర వైరుద్ధ్యాల అంతర్యమేమిటి? ఏతర్కశాస్త్రం, ఏమనస్తత్వశాస్త్రం, ఏ భౌతికవాదం, ఏఅజ్ఞేయవాదం, ఏ ద్రవ్యవాదం, ఏ నాస్తికవాదం ఈ మర్మాన్ని భేదించగలదు? ఒక కార్యానికి గల కారణాన్ని ఆకార్యంలోనుంచే చూపాలి గాని బయట దేనితోనో ముడిపెట్టిచెప్పడం తాత్త్విక వైఖరికి, వైజ్ఞానిక వైఖరికి విరుద్ధం. ఈ వైపరీత్యాలకు వేదాంతశాస్త్రం చెబుతున్న అర్థమిది: మృత్యువు సమీపించలేనిది, ఎన్ని పొగడ్తలకైనా అర్హత కలిగినది, బ్రహ్మాండమంతటిని శాసిస్తున్నది, సర్వతంత్ర స్వతంత్రమైనది, పాపం తాకలేని పరమపవిత్రమైనది, సర్వసుఖాలకు నిలయమైనది, నిరంతరం ఏకవిధంగా ప్రకాశించేది, ధ్రువతారవంటిది జీవునియందున్నది. స్వయంప్రకాశమైన ఆ ధ్రువతారే భగవంతుడు. దేహాలెన్ని దగ్ధమై పోతున్నా, మనశ్శరీరాలెంత దుర్బలములైనా, పరతంత్రములైనా, జీవిత మెంతగా మోయలేని బరువుగా ఉన్నా అంతరాళంలోని ఆ తేజఃపుంజమే మించి ప్రకాశించి తన్నుతాను నిరూపించుకుంటున్నది.

(సశేషము)

# ధర్మ విజయము

## శ్రీ ఓగోటి ఆనందరాముగారు, బి. ఏ. (ఆనర్సు)

ప్రాచీనకాలములో యూదులు ప్రఖ్యాతి చెందియుండినారు. వారు ఏకేశ్వరోపాసకులు. మోసెసు ధర్మముల ననుసరించి ప్రవర్తించుచు, ప్రవక్తలవల్ల తమ కాధ్యాత్మికౌన్నత్యము లభింప గలదని విశ్వసించిరి. వారిని ధర్మమార్గములో నడిపించుటకు దశాజ్ఞలు నిర్దేశింపబడినవి. జెరూసలేములో ఒక మహోన్నత దేవాలయములో వారు సకలవిధములైన లాంఛనములతో పూజాదికములు నిర్వర్తించుకొనుచుండిరి.

ఆకాలములో ఎక్కువ అభ్యున్నతి చెంది యుండుటవలన వారిలో గర్వము ప్రబలినది. తాము భగవంతుని అభిమానపుత్రుల మని తమ ఇరుగుపొరుగు రాజ్యములను జయించి, పాలింపవలసినంతటివార మని విఱ్ఱవీగ సాగిరి. దీనితో ఆధ్యాత్మికపతనము ప్రారంభమైనది. భగవంతునిపట్ల సహజమైన ఆసక్తి తగ్గి బాహ్యాడంబరము అధికమైనది. దేవాలయములో పూజారులు మతగ్రంథముల అంతరార్థము మఱచి, యాంత్రికముగ పూజలు జరుపుచుండిరి. మతమనగా దేవాలయమునకు పోయి పూజలు జరుపుటమాత్రమే అన్న భావము ప్రబలమైనది. దేవాలయప్రాంతములోఅంగళ్ళు వృద్ధియైనవి. వానిలో పూజాద్రవ్యములు, బలిపశువులు విపరీతపు ధరలకు విక్రయింపబడుచుండినవి. దేవాలయాధికారులు, పూజారులు కూడ ఈదుర్వ్యాపారములో పాల్గొని ధనికులైనారు. ఆలయప్రాంగణములో వంచన, మోసము క్రూరత్వము ప్రబలినవి. దేవుని కొఱకు నిర్మించిన ఆలయములో అనేకదురంతములు జరుగసాగెను. యూదులగురువులైన జెర్మియా మొదలగువారే ఈ వినాశనము గుర్తించి వారిని తమ దుశ్చేష్టలను నిలిపి వాస్తవమతము నవలంబింపు డని హెచ్చరించిరి. ప్రపంచమును ఈదురదృష్టపరిస్థితిలో నుండి ఉద్ధరించుటకు ఒక దేవదూత అవతరించునని వారు విశ్వసించిరి. అతడే జీససుక్రైస్తు.

బెత్లెహేములో మేరీయనుకన్యయు జోసెపు అను యువకుడును నివసించుచుండిరి. పెద్దలు వారికి వివాహముచేయ నిశ్చయించిరి. ఇంతలో ఆమె గర్భవతిగా నుండుట తెలిసి జోసెపు ఆమెను విడనాడసంకల్పించెను. అప్పు డొక దేవదూత అతనికి స్వప్నములో ప్రత్యక్షమై ''నీభార్యను స్వీకరించుటకు భయపడకుము. ఆమె పరిశుద్ధాత్మవలన గర్భవతియైనది. ప్రజలను పాపపంకమునుండి రక్షించు కుమారుని ఆమె కనును. ఆయనకు జీసను అని నామకరణముచేయు'' మని ఆదేశించెను. జోసెపు దానిని తు. చ. తప్పక పాటించినాడు.

క్రైస్తుప్రభువు జన్మించినప్పుడు లోకములో శుభసూచకచిహ్నము లనేకములు గోచరించెను. అది తెలిసికొన్న కొందఱు జ్ఞానులు ప్రభువైన జీససును వెదకుచు బయలుదేఱినారు. అప్పుడు యూదుదేశమును జెరూసలేము ముఖ్యపట్టణముగా హేరోదు రాజు పరిపాలించుచుండినాడు. వారు ఆరాజుదగ్గఱకు

పోయి "యూదులకు రాజుగాపుట్టినవాడు ఎక్కడ ఉన్నాడు? ఆయననక్షత్రమును చూచి నాము, ఆయనను పూజింపవలెనని తహతహ పడుచున్నా" మనిరి. ఇది విని రాజును ప్రజలును కలవరపడిరి. వెంటనే హేరోదు మతాధికారులను విచారించి క్రైస్తు బెత్లెహేములో పుట్టు నని, నక్షత్రము గోచరించిన కాల మిది యని తెలిసికొనెను. అతడు జ్ఞానులను పిలిచి "మీరు వెళ్లి ఆశిశువునుగూర్చి తెలిసికొని రండి" అని వారిని బెత్లెహేమునకు పంపినాడు. వారు బయలుదేఱగనే ఇదివరలో చూచిన నక్షత్రము వారిముందు పోసాగెను. అది దేవుని కుమారుని సమీపించి ఆగిపోయినది. అత్యంతానందముతో వారు క్రైస్తుప్రభువుదర్శనము చేసికొని, కానుక లర్పించినారు. ఆరోజురాత్రి వారికి స్వప్నములో "హేరోదునొద్దకు మరలి పోవ" ద్దని దైవసందేశము వచ్చెను. అందుచేత ఆ జ్ఞానులు వేఱొకమార్గములో స్వస్థానములు చేరినారు.

ఇంతలో జోసెపునకు ఒకస్వప్నమువచ్చెను. దేవదూత ప్రత్యక్షమై "హేరోదు శిశువును సంహరించుప్రయత్నములు చేయును. మీరు ఈజిప్టునకు పొండు" అని యానతిచ్చెను. . వెంటనే జోసెపు రాత్రికిరాత్రే శిశువును మేరీని తోడ్కొని ఈజిప్టునకు వెళ్లెను. వారు వెళ్లిన తర్వాత హేరోదు బెత్లెహేమునకు వచ్చి, జ్ఞానులు వెళ్లిపోయినది తెలిసికొనెను. వారు మరలి వచ్చి శిశువువర్తమానము తెలుపలేదని మహాగ్రహము చెంది", "వీరిలో ఒకడై యుండడా" యని రెండు సంవత్సరములలోపు మగశిశువు లందఱిని వధించెను.

హేరోదుమరణించినతర్వాత జోసెపు, మేరీ, జీససు ఇస్రాయేలుదేశమునకు వెళ్లిరి. అచటినుండి గలిలియా ప్రాంతమునకుపోయిరి. ఆదినములలో జోర్దానునదీతీరమున 'జా' నను మహానుభావు డుండెను. అసంఖ్యాకప్రజలు ఆయనయొద్దకు వచ్చి తమ పాపములను ఒప్పుకొని, జోర్దానునదిలో బాప్తిసము పొందుచుండిరి. ఆయన "స్వర్గరాజ్యము ఆసన్నమైనది. పునీతమనస్కులు కండు. నా వెనుక వచ్చువాడు నాకంటె శక్తిమంతు"డని జీససును గూర్చి ప్రకటించుచుండెను. జీససుకూడ బాప్తిసము పొందుటకై ఆయనదగ్గఱకు వచ్చెను. జాను "నాకంటెను శక్తిమంతుడవైన నీకు నేను బాప్తిసము ఇచ్చుట సరిగా" దని అభ్యంతర పెట్టెను. కాని జీసను బలవంతమువల్ల ఆయనకు బాప్తిసము నిచ్చెను. క్రైస్తు బాప్తిసము పొంది నీళ్లలోనుండి బయటికిరాగానే దైవాత్మ పావురమువలె ఆప్రాంతమున విహరించెను. "ఈయనే నాప్రియపుత్రు" డని ఆకాశవాణి పల్కినది.

అంతటితో క్రైస్తుకు పరిశోధన ప్రారంభమైనది. ఆయన దురారణ్యమధ్యమునకు తీసికొనిపోబడెను. నలువదిరోజులు ఆయన ఉపవసించినాడు. అప్పటి కాయనకు ఆకలి వేసినది. సైతాను ఆయనదగ్గఱకు వచ్చి "నీవు దేవుని కుమారుడవైనచో ఈరాళ్లురొట్టె లగునట్లు ఆజ్ఞాపింపు" మనెను. దానికి జీససు— "రొట్టెలవల్ల కాదు, దేవునిపల్కులవల్ల మనుష్యులు జీవించెదరు" అనెను. అప్పుడు ఆయనను సైతాను పరిశుద్ధపట్టణదేవాలయగోపురముపైకి తీసికొనిపోయి "నీవు భగవత్పుత్రుడవైనచో క్రిందికి దుముకుము. దేవదూతలు నిన్నెత్తుకొందురు" అని చెప్పినాడు. అది విన్న జీసను "దేవుని శోధింపరా" దని బదులుపల్కెను. తర్వాత సైతాను ఆయన

నొక గొప్పకొండశిఖరముపైకి తీసికొనివెళ్లి ఇహలోకరాజ్యములను, వానివైభవసంపదలను చూపి "నాకు సాగిలపడి నమస్కరించిన ఇవన్నియు నీవి అగును" అని ప్రలోభపెట్టెను. క్రైస్తు ఈమాటలను అసహ్యించుకొని "ఓసైతానూ, దూరముగా పో. దేవునికి మాత్రమే అభివాదనము చేయవలెను" అని చెప్పెను. సైతాను పాఱిపోయెను. అప్పుడు దేవదూతలు వచ్చి భగవత్పుత్రునికి పరిచర్యలు చేసినారు.

పిమ్మట జీసను ఇరుగుపొరుగుదేశములలో సంచరించుచు ప్రజలకు సత్యజీవితమునుగూర్చి, దివ్యసందేశము లీయ సాగెను. కొంత మంది శిష్యులను సమకూర్చుకొని, ప్రజలకు కల్గిన బాధలు నివారించుచుసంచరించెను. ఈమాహాత్మ్యముచూచి అనేకు లాయన ననుగమించిరి. అప్పు డాయన సమీపములో ఉన్న కొండనెక్కి ఆజనసమూహమును చూచి ఈవిధముగా ప్రబోధించినాడు: "ఆత్మవిషయమై దీనులైనవారు ధన్యులు. పరలోకరాజ్యము వారిది. దుఃఖపడువారు ధన్యులు. వారు ఓదార్చబడుదురు. సాత్వికులు ధన్యులు. వారు భూలోకమును స్వాధీనము చేసికొందురు. నీతికొఱకు అంగలార్చి, తపించువారు ధన్యులు. వారు తృప్తిపొందుదురు. ఆత్మశుద్ధిగలవారు ధన్యులు. వారు దేవుని చూచెదరు. శాంతిదాయకులు ధన్యులు. వారే భగవత్పుత్రులు. నీతికొఱకు హింసను సహించువారు ధన్యులు. స్వర్గరాజ్యము వారిదే."

నానిమిత్తము జనులు మిమ్ములను నిందించినప్పుడు, అసత్యారోపణము చేసినప్పుడు తొణకక సంతోషముగానే ఉండవలెను. అందువలన స్వర్గములో మీఫలము ఎక్కువగును. పూర్వపుప్రవక్తలు ఈవిధముగానే హింసింపబడిరి.

మీసహోదరులపై కోపింపవద్దు. తనసహోదరునిమీద కోపపడు ప్రతివాడు విమర్శకు లోనగును. అతనిని ద్రోహి యనువాడు నరకాగ్నికి లోనగును. కావున బలిపీఠము మీద నైవేద్యము అర్పించునప్పుడు నీసహోదరునితో విరోధ మేమైనను కల దని జ్ఞాపకము వచ్చిన, అది అక్కడ విడిచి పెట్టి పోయి, నీ సహోదరునితో సమాధానపడి, అటుపిమ్మట అర్పణ సమర్పింపుము.

నీప్రతివాదితో నీవే సమాధానపడుము. లేకున్న అతడు నీపై వ్యాజ్యము వేయును. న్యాయాధిపతి నిన్ను శిక్షించి బంట్రోతుకు అప్పగించును. నిన్ను చెరసాలలో త్రోయుదురు. కడపటికాసు చెల్లించువఱకు అక్కడ ఉండవలసినదే.

వ్యభిచారము చేయవ ద్దని చెప్పు మాటను మీరు విన్నారు కదా. పరస్త్రీని మోహముతో చూచు ప్రతివాడు అప్పుడే తన హృదయమందు ఆమెతో వ్యభిచరించినవాడగును. నీ కుడికన్ను నిన్ను ప్రలోభపెట్టిన దానిని పెరికి పాఱవేయుము. నీదేహమంతయు నరకములో బడకుండ నీ అవయవములలో ఒకటి నశించుట నీకు ప్రయోజనకరము గదా!

ఎంతమాత్రము ఒట్టుపెట్టుకొనవద్దు. 'ఆకాశముతో' డనవద్దు. అది దేవుని సింహాసనము. 'భూమితో' డనవద్దు. అది ఆయనపాదపీఠము. 'నీతలతో' డని ఒట్టుపెట్టుకొనవద్దు. నీ వొక వెంట్రుకనైనను తెలుపుగా గాని నలుపుగాని చేయలేవు.

"కంటికి కన్ను పంటికి పల్లు" అను మాట మీరు విన్నారు కదా! కాని స్వర్గమునం

దున్న మీ తండ్రికి తగిన పుత్రులవలె మీ శత్రువులను ప్రేమింపుడు మిమ్ములను హింసించువారి కొఱకు ప్రార్థన చేయుడు

మీ ప్రార్థనాదికములలో వేషధారులవలె ఉండవద్దు. ధర్మము చేయునప్పుడు నీధర్మము రహస్యముగా నుండునిమిత్తము నీ కుడిచెయ్యి చేయునది నీయెడమచేతికి తెలియకఉండవలెను. ప్రార్థనచేయునప్పుడు మనుష్యులకు కనబడవలె నని సమాజమందిరములలోను, వీధులమూలలలోను నిలిచి ప్రార్థన చేయవద్దు. గదిలోనికి వెళ్లి తలుపు మూసి రహస్యముగ నీతండ్రిని ప్రార్థింపుము. అప్పుడు వ్యర్థప్రలాపములు చేయ వద్దు. అడుగకయే ఆయన మీ కవసరమైనవి ప్రసాదించును.

కాబట్టి మీ రీలాగున ప్రార్థనచేయుడు—స్వర్గలోకమందున్న మాతండ్రీ, నీ నామము పతితపావన మగుగాక. నీరాజ్యము వచ్చుగాక. నీయానతి స్వర్గమునందు నెఱవేఱుచున్నట్లు భూమియందును నెఱవేఱు గాక. మా అనుదినాహారము నేడు మాకు దయచేయుము. మాఋణస్థులను మేముక్షమించినట్లు మమ్ములను క్షమింపుము. మమ్ములను శోధనలోకి తేక తప్పింపుము!

భూమిపై మీకొఱకు ధనము సమకూర్చుకొనవద్దు. ఇక్కడ అది నశించును. పరలోకమందు మీకొఱకై ధనము కూర్చుకొనుడు. అచ్చట అది త్రుప్పు పట్టదు. దొంగలు దొంగిలింపరు. మీరు దేవునికిని సిరికిని — రెంటికి దాసులుగా ఉండలేరు. కాబట్టి ధనమోహము వద్దు. ఆహారముగూర్చి, వస్త్రములగూర్చి కూడ చింతింపవద్దు. పక్షులను దేవుడు పోషించుట లేదా. అడవిగడ్డిని – నేడు ఉండి రేపు పోవు గడ్డిని దేవుడు అలంకరించును. కాబట్టి వానికంటె శ్రేష్ఠులైన మీఅవసరములు తప్పక తీర్చును. మీరు మొదట ఆయన రాజ్యమును గూర్చి, నీతినిగూర్చి ఆకాంక్షపొందుడు.

మీ రితరులనుగూర్చి తీర్పు ఇయ్యవద్దు. నీకంటిలోని దుమ్ము గమనింపక నీసహోదరుని కంటిలోని ధూళి చూచు టెందుకు?

అడుగుడు మీకు ఈయబడును. వెదకుడు మీకు దొరకును. తట్టుడు మీకై (తలుపు) తీయబడును.

నాశనమునకు పోవుద్వారము విశాలము. దాని ద్వారా ప్రవేశించువారు అనేకులు. భగవంతునియొద్దకు పోవు ద్వారము ఇఱుకు. దానిని కనుగొనువారు కొందఱే.

నామాట వినువాడు రాతిపై ఇల్లు కట్టుకొన్నట్లు సురక్షితముగా నుండును. వాన కురిసినను, వఱదలు వచ్చినను, గాలి వీచినను అది కూలిపోక దృఢముగా ఉండ గలదు.

ప్రభువు ఆమహాప్రబోధము పూర్తిచేయగానే జనులు ఆశ్చర్యసాగరములో మునిగిపోయిరి. శాస్త్రమును గ్రుడ్డిపాఠముగ చెప్పినట్లు గాక, స్వానుభవము కలవానివలె జీసను ప్రభువు హృదంతరమునుండి ప్రసంగించెను.

అటుపిమ్మట బాధానివారణకొఱకై జీససు నొద్దకు వచ్చు జనసందోహము అవధులు మీఱినది. వీలైనంతత్వరలో వారికి స్వాస్థ్యము చేకూర్చుటకు ఆయన తన పండ్రెండుగురు శిష్యులకు అధికార మిచ్చెను.

కాని ఆయనమాహాత్మ్యము జెరూసలేము, ప్రధానయాజకులకు, ఫారిసీలకు అవగాహన కాలేదు. పైగా వారు ఆయననుగూర్చి వదంతులు ప్రచారము చేసిరి. ''వాడు దయ్యముల రాజు కనుకనే దయ్యములను పాఱద్రోలుచున్నాడు'' అనసాగిరి. అది విని ఆయన

"తనగోయి తానే త్రవ్వుకొను మూర్ఖు డెవ" డని బదులు చెప్పినాడు. కాని వారాయనను వీలుదొరకినప్పుడెల్ల చిక్కులో పడవేయవలె నని ప్రయత్నించినారు. ఒకసారి 'విశ్రాంతి దినమున' ఆయన అవిటివానికి చేయి బాగు చేసెను. దానికి వారు 'ఈలాగున చేయ వచ్చునా?' అని ఆక్షేపించిరి. జీససు "మీలో ఎవరిగొఱ్ఱె అయినను ఈరోజు గుంటలో పడిన మీరు పైకి లాగరా? దానికంటె మనుష్యుడు శ్రేష్ఠుడు కాడా?" అని వారినోళ్ళ మూయించెను.

కాని వారప్పటినుండి ఆయనకు హాని చేయుటకు మార్గమన్వేషించుచుండిరి. త్రికాలవేదియైన క్రీస్తు తాను జెరూసలేముకు వెళ్లి అచ్చటి వారిచే వధింపబడుదు నని, మరణానంతరము మూడవదినమున పునర్దర్శన మిచ్చెద నని శిష్యులకు తెలిపినాడు.

కొంతకాలమునకు తర్వాత ఆయన జెరూసలేముకు వచ్చి అచ్చటి దేవాలయములో బోధింపసాగెను. ప్రధానయాజకులు, అధికారులు ఆయనదగ్గఱకు వచ్చి "ఈ అధికారము నీ కెవ డిచ్చె" నని ప్రశ్నించినారు. దానికి జీససు "జాను ఇచ్చిన బాప్తిసము ఎక్కడనుండి కలిగినది?" అని మాఱుప్రశ్న వేసెను. వారు "పరలోకమునుండి యందుమా, మీ రెందుకు అతనిని నమ్మలే దనును. జనులనుండి అందుమా, జనులే జానును ప్రవక్త అని విశ్వసించుచున్నా" రని తర్జనభర్జనలు చేసికొని క్రైస్తుకు బదులు చెప్ప లేదు. కాని జీససు ఊరకుండలేదు. వారితో ఈవిధముగా చెప్పినాడు: "ఒకనికి ఇద్దఱు కొడుకులు. అతడు వారిని తోటపనిచేయు మని ఆజ్ఞాపించినాడు. రెండవవాడు సరే యని వెళ్ల లేదు. పెద్ద కొడుకు వెళ్ల నని తర్వాత పోయి నాడు. ఇందులో ఎవ రుత్తముడు?" ఇది విని యాజకులు "పెద్దకొడుకే" అని చెప్పినారు. వెంటనే జీససు "అట్లే జానును నమ్మిన పాపులు, వేశ్యలు స్వర్గము చేరుదురు. మీ రతనిని విశ్వసింపలేదు" అని మందహాసము చేసెను.

ఇంతలో పస్కాపండుగ సమీపించినది. జీససును ద్వేషించువారు ఆయనను చంపుటకై కుట్ర చేయసాగిరి. దురదృష్టవశమున ఆయన శిష్యులలో ఒకడైన ఇస్కారియటుజూడా ప్రధానయాజకులదగ్గర ముప్పది వెండినాణెములు తీసికొని ఆయనను అప్పగించుటకు అంగీకరించినాడు. పస్కాపండుగ నాడు జీససు శిష్యులతో "మీలో ఒకడు నన్ను అప్పగించును" అని చెప్పెను. వారు కలవరపడిరి. ప్రతి ఒకడు 'నేనా' అని అడిగినాడు. జూడా "నేనా" అనగానే "అవును" అని పల్కినాడు క్రైస్తు.

పస్కాపండుగనాటిరాత్రి జీససు తనశిష్యులలో పీటరు, జేకోబు, జానులను వెంట పెట్టుకొని వెళ్లినాడు. వారిని వదలి కొంతదూరము పోయి ప్రార్థనలు చేసినాడు. మూడుసార్లు ప్రార్థించినతర్వాత వచ్చి వారితో సంభాషించుచుండెను. అప్పుడు జూడా ఆయుధములు ధరించిన ఒకజనసమూహముతోపాటు అక్కడికి వచ్చినాడు. జీససును సమీపించి కపటముగా "బోధకుడా, నీకు శుభము" అని అభినందించినాడు. అది విన్న జనసమూహము జీససును గుర్తించి ఆయనను పట్టుకొనిరి. తక్షణమే క్రైస్తు అనుచరు డొకడు కత్తి దూసెను. కాని కరుణారూపుడైన ప్రభువు అతనిని ఈవిధముగా వారించినాడు: "కత్తి పట్టుకొన్నవాడు దానిచేతనే నశించును,

ఇప్పుడు నేను వేడుకొన్న నాతండ్రి నన్ను రక్షింపడా! కాని ఇదంతయు జరుగవలసినట్లే జరుగుట నిశ్చయము.'' ఇది వినగానే ఆయన శిష్యులు ప్రభువును విడిచిపెట్టి కాలికి బుద్ధి చెప్పినారు.

జను లాయనను తీసికొని పోయిరి. ప్రధాన యాజకుడైన కయప అధ్యక్షతన సమకూడి ఆయన విరోధులు విచారణ మొదలుపెట్టినారు. కాని జీససుకు వ్యతిరేకసాక్షియే రాలేదు. కడపట ఇద్దఱు వచ్చి ''వీడు దేవాలయమును పడగొట్టి మూడు దినములలో కట్టగలడట'' అని చెప్పినారు. కయప ''నిజమేనా'' అని ప్రశ్నించినాడు. క్రైస్తు బదులుచెప్పినాడు— ''నీ వన్నట్టే ఇక మీద మనుష్య కుమారుడు సర్వశక్తుని కుడిపార్శ్వమున కూర్చుండును.'' అది విన్న సభ్యులు ''వీడు దేవదూషణ చేసెను. మరణమునకు పాత్రు'' డని నిశ్చయించినారు.

ఈఘోరవార్త విన్న జూడా ఉరితీసికొన్నాడు.

క్రైస్తు విరోధు లాయనను తీసికొనిపోయి అధిపతియైన పిలాతున కప్పగించిరి. అతడు జీససును ఆయనవిరోధు లప్పగించి రని తెలిసికొని ప్రభువును విడిచిపెట్టుటకు ఉపాయాన్వేషణ చేసినాడు. కాని దేవాలయాధికార్ల ప్రేరేపించుటవల్ల జనసమూహము ''క్రైస్తును సిలువవేయు'' మని కేకలు వేయుటచేత పిలాతుకు గత్యంతరము లేక పోయినది. నీళ్ళు తీసికొని చేతులు కడుగుకొని ''ఈయనరక్తము చిందుటకు నేను బాధ్యుడను కా''నని ప్రభువును సిలువవేయుట కప్పగించెను.

భటులు క్రైస్తును తీసికొని పోయి ముండ్ల కిరీటము పెట్టి, ఎఱ్ఱగుడ్డలు కట్టి, కొరడాలతో కొట్టి బందిపోటులతోపాటు సిలువవేసిరి. మానవచరిత్రలో ఇంతవఱకు జరిగిన ద్రోహ కార్యములలో ఇది క్రూరాతిక్రూరము. మహాత్ములు మానవాళికొఱకు చేసిన త్యాగములలో జగద్రక్షకుడైన జీససుప్రభువు త్యాగము మహోన్నతమైనది. సిలువపైనుండికూడ ఆకరుణాళువు తన్ను హింసించినవారినిగూర్చి ''తండ్రీ, వా రేమి చేయుచున్నారో వారికి తెలియదు. వారిని క్షమింపు'' మని ప్రార్థించినాడు.

మధ్యాహ్నము మొదలు మూడుగంటలవఱకు ఆదేశమంతట చీకట్లు కమ్మెను. మూడుగంటలప్పుడు జీసస ''ఏలీ ఏలీ లామా సబక్తానీ?'' (దేవా, దేవా నన్నెందుకు విడిచితివి?) అని కేక వేసెను. కొంతసేపటికి మరల కేక వేసి స్వర్గములో నున్నతండ్రిదగ్గఱకు పోయినాడు. అప్పుడు భూమివణకెను. బండలు బద్దలైనవి. దేవాలయపుతెర రెండుగాచీలినది. ఆమహోత్పాతములకు జనులు భయపడిపోయినారు.

సాయంకాలము అరిమితయియయోసేపు అను భక్తుడు జీససుదేహమును సమాధి చేసెను. మూడు దినముల తర్వాత ప్రభువు సమాధినుండి లేచి వచ్చి తనశిష్యులను కలిసికొని ''మీరు సమస్తజనులను శిష్యులుగా చేయుడు. యుగసమాప్తివఱకు మీతోనే యుందును'' అని ఉత్సాహపఱచినాడు.

అవును నిజమే. నేటికిని జీససుక్రైస్తు ఆయన అనుచరులతో ఉన్నాడు. సర్వకాలముల వారిని కాపాడుచున్నాడు. కాని — ఒక మాట. జీససుక్రైస్తు అనుచరు లనగా తాము క్రైస్తవుల మని, ప్రపంచములో అధిక సంఖ్యాకులు తామే యని ఇతరుల నపహాసిం

చుచు విఱ్ఱవీగువారు కాదు. ఆయన జీవిత సందేశము అర్థముచేసికొని దాని ప్రకారము జీవించు పవిత్రమానవులే — ఏమతస్థులైనను — నిజమైన క్రైస్తవులు.

అటువంటి మహాత్ముడే గాంధి. ఆయన క్రైస్తు అపరావతారము. స్వాతంత్ర్యముకై పోరాటము ముమ్మరముగా నున్న దినములలో కూడ ఆయన తన కార్యక్రమము పోలీసులకు తెలుపక దాప లేదు. దేశమునకు చాల గడ్డు రోజులలో అహింసపట్ల తన విశ్వాసము వీడ లేదు. భారతజాతీయకాంగ్రెసు ఏకైకప్రతినిధిగా ఆయన రెండవరౌండుటేబిలు సమావేశమునకు వెళ్లినప్పుడు జవహర్లాలు "హింసామార్గమున ఒకసంవత్సరములో స్వరాజ్యము సాధింతమా ? అహింసామార్గమున ఒకశతాబ్దమునకు స్వతంత్రులమాదమా" అని కేబులు పంపినాడట. గాంధీజీ లక్ష్యసిద్ధికై ఎంతజాగైనను 'అహింసా పరమో ధర్మః' అన్నారట. ఆయనక్రైస్తవత్వము ఎంత ప్రశంసనీయమైన దనగా — ఒకప్రసిద్ధ పాశ్చాత్య రచయిత "గాంధిజి క్రిస్టియనైస్డ్ అన్క్రిస్టియన్ క్రిస్టియానిటి" అని పొగడినాడు. కనుకనే ఆయన ఇంతవిశాలదేశమునకు రక్తపు బొట్టు చిందనీయక స్వరాజ్యము సముపార్జించినాడు.

దీనివల్ల తెలిసినది ఒకటే. అది అందరికిని అప్పుడు ఇప్పుడు ఎప్పుడు తెలిసినదే — ధర్మము శాశ్వతమైన దని, అంతిమ విజయము దానిదే అని.

ధర్మ ఏవ హతో హన్తి
ధర్మో రక్షతి రక్షితః.

# శ్రీ మద్గురు గీతామాల

శ్రీ మల్లాది సూర్యనారాయణమూర్తిగారు, ఎమ్. ఏ.

శ్రీమత్కారుణికున్ మహాగుణనిధిన్ శ్రీచిత్తసంతోషకున్
ధీమంతున్ నిరపేక్షకాము నతులున్ నిర్ద్వంద్వు నిస్సంగు ని
స్సీమానందమయున్ ప్రభానిధి జగత్సృష్ట్యాద్యు శ్రీమంతునిన్
నేమం బొప్ప మహాత్ముఁ గృష్ణగురు ధ్యానింతున్ సదా భక్తిమై ॥

ఎవని వేదాంతవేత్తలు నితరజనులు బ్రహ్మమును బురుషోత్తముఁ బరునిగాఁగ
విశ్వకారణు నీశుగా విశ్వసింతు రట్టి విఘ్ననివారణు నాశ్రయింతు !

పరమాత్ముండు సదాశివుండు ఋషి విశ్వస్వామి ఛందస్సు, స
ద్గురుదేవుండు విశిష్టదైవము, మహాత్ముం డా సకారస్వరూ
పరసానందుడు శక్తి, బీజము ''హ'' జీవవ్యక్తి, సోఽహంపు బం
ధరహస్యంబు, జపంబు సిద్ధి – గురుగీతామంత్ర మిట్లొప్పెడిన్ !

దీపిత సర్వలోకమును దివ్య మనంతము, సుప్రకాశహం
క్షాపరివృత్తపత్రజలజంబు, స్వతంత్ర, మనంతవిశ్వర
క్షాపరతంత్ర మక్షరము జ్ఞానరసాభ్యుచితంబు, సృష్టి పూ
ర్వాపరసంస్థితైక సుమహత్వము, బ్రహ్మపదంబుఁ గొల్చెదన్ !

నిత్యోద్బుద్ధసహస్రపత్ర సుషమానీకాంచ దూనాక్షర
ప్రత్యగ్రాద్భుతమండపంబునను, విశ్వంబందు సువ్యాప్తమై
నిత్యానందమయంబు హంసపరమై నిత్యంబు సత్యంబునై
యత్యంతామలమై సుఖైకనిలయంబౌ స్వప్రభన్ గొల్చెదన్ !

ఘనసర్వోపనిషత్ప్రసిద్ధు భువనోంకారాఖ్యసింహాసనా
సను వేదప్రతిపాదితున్ శుభకరున్ షట్చక్రసంచారకున్
కనదద్వైతవిభాస్వరూపు నమలున్ గంభీరశాంతాత్మకున్
మనసా, శ్రీగురుపంకజంబును నసామాన్యంబు నర్చింపుమా !

పరమశాంతుని, సాక్షాచ్ఛివస్వరూపు ముక్తికామార్థసిద్ధిదు, పూర్ణపురుషు,
యోగపీఠస్థు, నతిభక్తియుక్తి నెపుడు మహితగురుమూర్తి శిరసా నమస్కరింతు

యోగ్యసితపద్మసమలంకృతోత్తమాంగు నేత్రభుజయుగ్మ సందర్శనీయు, శాంతు,
కృతవరాభయముద్రు, స్మరింప వలె విభాతముల గురు నామపూర్వకముగాఁగ !

సకలాదిత్యవరస్వరూపు నమలున్ శాంతున్ బ్రసన్నాక్షుఁ బ
ద్మకలాపమ్యముఖున్ గురున్ దలఁచుచున్ దత్పాదనిర్ణేజనో
దకధారాపరిసిక్త శుద్ధసకలాంతర్బాహ్యదేహుండుగా
నకలంకస్ఫటికాకృతిన్ మెఱయు నత్యంతంబు శిష్యుండు దాన్ !

# శ్రీ శివానందస్వామి - స్మృతికథ

## (బ్రహ్మచారిణి లలిత)

[ఒక వృద్ధస్వామివారి నోటినుండి వినిన వృత్తాంతము]

క్రీ. శ. 1920 లో నేను త్రివేంద్రములో ప్రొబేషనర్‌గా శ్రీరామకృష్ణాశ్రమమున చేరితిని. నాకు తులసీమహారాజుతో పరిచయము కలదు.

క్రీ.శ. 1923 వేసవికాలమున నేను బేలూరు మఠమునకు వెళ్ళితిని. మొట్టమొదటసారి శ్రీ మహాపురుషమహారాజుగారిని దర్శించినదియు అపుడే. హౌరాస్టేషనునుండి నేరుగా బేలూరు మఠమునకు చేరితిని — ప్రాతకట్టడపు వరండాలో బెంచిపై శ్రీమహాపురుష మహారాజు గారును, శ్రీశారదానందస్వామియుకూర్చుండి యుండిరి. తులసీమహారాజుగారు నారాక తెలుపుచు ఉత్తరము వ్రాసియుండిరి. నేను వెళ్ళి వారికి నమస్కరించితిని. మహాపురుషులను చూచి నపుడు నాకేమియు క్రొత్త వారుగ తోపలేదు. కాని శారదానందస్వామిని చూచుటతోడనే నాకేమో గంభీర స్వభావులని తోచినది. కాని వారి కోమల హృదయమును వెనుక తెలిసికొంటిని. కుశల ప్రశ్నాదికముల పిదప నన్ను వారు భుజించుటకై పంపిరి.

కొన్ని దినములు నేను బేలూరుమఠములోనే యుంటిని. నామనస్సులో పెక్కుసంశయము లుండెను. వాని నెల్ల తీర్చుకొనవలెనను కోర్కెతో ఒకనాడు నేను ఒంటరిగ మహాపురుష మహారాజుగారి గదికి వెళ్ళితిని. వారు ఉత్తరములు వ్రాయుచుండిరి. నేను వెళ్ళుట తోడనే తల పైకి ఎత్తి నన్ను చూచి తన ప్రక్కగా నేలపై కూర్చుండు మని సంజ్ఞ చేసిరి. నేను మెల్లగా వెళ్ళికూర్చుంటిని. వారు ఉత్తరములు వ్రాయుట పూర్తి కావించి, నా రాకకు కారణ మడిగిరి. నేనీ విధముగ బదులిడితిని ''పెక్కు సంశయములు నాకు కల్గినవి. వానిని తీర్చుకొను ఉద్దేశ్యముతో నేను మీ యొద్దకు వచ్చితిని. కాని ప్రస్తుతము నా సంశయము లన్నియు తీఱిపోయినవి.'' అంత వారు ''సరే'' అని నవ్వి కొంతవడి యూరకుండిరి. అటుపై వారిట్లనిరి. ''నేను రేపు నీకు మంత్రదీక్ష యొసంగెదను. స్నానాదికములు ముగించి నిరాహారివై భగవానునిమందిరము నొద్ద వేచియుండుము.'' అట్లే నేను మరుసటి దినము కాలకృత్యములు తీర్చుకొని మందిరమునొద్ద (బేలూరు మఠములోని ప్రాతమందిరము. అప్పటికి ప్రస్తుతమున్న క్రొత్తమందిరము కట్టబడలేదు) కాచుకొని యుంటిని. ఆలయములోపల రెండు ఆసనములు పరువబడి యుండెను—ఒకటి భగవానునికి అభిముఖముగను — మఱొకటి దక్షిణాభిముఖముగను. మహాపురుషులు వచ్చి దక్షిణాభిముఖముగ నున్న ఆసనముపై కూర్చుండి నన్ను రెండవ దానిపై కూర్చుండుమనిరి. నేనట్లే కావించితిని. వారు భగవానునికి పుష్పము లర్పించి

కొంతసేపు ధ్యానించిరి. అంత ఒక సంస్కృత ప్రార్థనాశ్లోకార్థమును ఇంగ్లీషులో చెప్పుచు నన్ను (మనస్సులోనే)మాతృభాషలో,తర్జుమా కావించుకొని మనస్సులోనే వల్లించుకొను మనిరి. పిదప ధ్యానింప వలసిన పద్ధతి తెల్పిరి. అటుపై ఒక చేతితో నా రెండు చేతులను జోడించి పట్టుకొని రెండవచేయి నామస్తకముపై ఇడి మూడుమార్లు మంత్రమును చెప్పుచు నన్ను పలుకు మనిరి. ఉదయ సాయంసమయము లందు కనీసము ఆఱుమార్లు మంత్రోచ్చారణ చేసి ధ్యానింపవలసినదిగ ఆజ్ఞాపించిరి. నేను లేచి నమస్కరింప బోవ "దక్షిణ ఎక్కడ" అనిరి. "నాకు దక్షిణవిషయ మేమియు తెలియదే! నే నేమియు తీసికొని రాలేదే!" అంటిని. వారిట్లనిరి. "నీవు క్రిందికి వెళ్ళి స్టోరుకీపరును అడిగి ఒక మామిడిపండు తీసికొని రా." నేనట్లే మామిడిపండు తెచ్చి వారి చేతి కిచ్చి ప్రణమిల్లితిని. నన్నచటనే కూర్చుండి కొంతసేపు ధ్యానింప వలసినదిగా ఆజ్ఞాపించి, వారు తమగదికి వెళ్ళిరి. నే నా దినము అనుభవించిన ఆనందము చెప్పజాలను.

వేఱొక దినము నేను వారి నిట్లు ప్రశ్నించితిని: "నే నీజన్మములోనే తరింపకల్గుదునా?" వారించుక మౌనము వహించి, పిదప ఇట్లనిరి. "నీవు డిగ్రీ పొందుటకు శ్రమించిన విధముగ శ్రమింప గల్గిన తప్పక తరింప గలవు." ఈ జవాబు నాకెంతో ధైర్యోత్సాహముల నిచ్చినది.......మహాపురుష మహారాజుగారికి సేవ చేయవలె నని నాకెంతో ఆశ యుండెను. ఒకదినము సాయంత్రము మామూలుగ నేను వారిని దర్శించుటకై వారి గదికి వెళ్ళితిని. అప్పుడు వారు గదిప్రక్కన ఆరుబయట కుర్చీలో కూర్చుండియుండిరి. ఒకసాధువు వారి పదసేవ చేయుచుండెను. వారేదో బంగాలీలో సంభాషించుచుండిరి. నేను మెల్లగా వెళ్ళి నమస్కరించి అచటినుండి తొలగిపోయి వారి వెనుకభాగమున దూరముగా ఒకమూల నిలబడి యుంటిని. కొంతసేపైనపిదప వారు నన్ను తటాలున పేరు పెట్టి పిలిచి తన పదసేవచేయుమని కోరిరి. వారు నా మనోభావము గ్రహింపగల్గిరని నా కాశ్చర్యము కల్గినది.

ఒకదినము నేను వారి గదికి వెళ్ళగా వారిట్లనిరి: "నీకు రేపు నేను బ్రహ్మచర్యదీక్ష ఇచ్చెదను". ఈవార్త విని నాకు పరమానందమైనది—నేను బ్రహ్మచర్యవిషయమై ప్రస్తావింపనే లేదు. తులసీమహారాజుగా రేమైన వ్రాసినారో ఏమో. నా బ్రహ్మచర్యదీక్ష నిర్విఘ్నముగా జరిగినది.

నేను బేలూరుమఠములో ఉండినసమయమున నా ఆరోగ్యము కొంత చెడెను. అటుపై ఉబ్బసము పొడసూపెను. అచ్చటి ఆహారము నాకు బొత్తుగ సరిపడలేదు. ఆ కాలమున బేలూరుమఠములో అతిసామాన్యమైన ఆహారము. చోటుమార్పు నాకు స్వస్థత కల్గింపకలదేమో అని కాశీకి నన్ను కొంతకాలము పంపిరి. కాశిలో అద్వైతాశ్రమములో ఉంటిని. సేవాశ్రమమునుండి నాకు భోజనము పంపెడివారు. మూడు నాల్గు మాసములు అచ్చట ఉండినాను. నా ఆరోగ్యములో ఎక్కువ మార్పేమియు కాన రాలేదు. బేలూరు మఠమునకు తిరిగి వచ్చితిని. నేను త్రివేంద్రమునకు తిరిగిరావలసినదిగా వర్తమానము వచ్చెను. నేను మహాపురుషులయొద్ద సెలవు తీసికొనుటకై వెళ్ళితిని. వారిట్లనిరి: "కొన్ని దినాలలోనే సురేశ్, వేఱొకబ్రహ్మచారి దక్షిణదేశము పోనున్నారు. వారలతో కలసి

పొమ్ము'', నే నందులకు సమ్మతించితిని. మా ప్రయాణపు రోజు నిశ్చయింపబడినది. ఇక కొన్ని దినాలు మాత్రమే కలదు. ఒక దినము మహాపురుషుల సేవకులగు శంకరమహారాజు (అపూర్వానందస్వామి) నాతో ఇట్లనిరి: ''మహాపురుషజీని సన్న్యాసదీక్ష ఈయవలసిన దిగా కోరుము. త్రివేంద్రము తిరిగి వెళ్లులోపుగ సన్న్యాసము కూడ ముగించుకొని పోయిన బాగుండును''. అందులకు నే నిట్లు బదులిడితిని: ''నా కేమియు తెలియదు. నా బాగోగులు వారే ఎఱుగుదురు, కాన నే నేమియు అడుగను.'' వెంటనే శంకరమహారాజు లేచి ''నీవు అడుగకున్న నేనే వారిని అడిగెదను,'' అని వెంటనే గది నీడి వెళ్ళిరి. అప్పుడు మహాపురుషులు శ్రీరాంపూరులో కొన్ని దినములు నివసించుటకై వెళ్ళియుండిరి. శంకర మహారాజు వారికి ఫోన్ చేసి తిరిగివచ్చి వా రిట్లనిరి: ''నేను వారికి ఫోన్ చేసితిని. వారు నీ సన్న్యాసమునకు సమ్మతించిరి. అయినను రేపు ఉదయము నీవు స్వయముగా వెళ్ళి వారి అనుమతి తీసికొని రమ్ము''. నే నట్లే మరుసటి దినము శ్రీరాంపూరు వెళ్ళితిని. మహాపురుషులు నారాకకు కారణ మడిగిరి. శంకరమహారాజు చెప్పిన విషయము తెల్పితిని. వా రిట్లనిరి : ''నీవు రావలసిన అవసరమే లేదు. వచ్చితివి కాన భోజనముచేసి కొంతసేపు విశ్రాంతి తీసికొని పొమ్ము.'' నే నట్లే కావించితిని.

రెండునాళ్ళపిదప మహాపురుషులు బేలూరు మఠమునకు తిరిగి వచ్చిరి. పౌర్ణమి (జగన్నాథ ఉత్సవము) నాడు నాకును వేఱొక బ్రహ్మచారికిని (పవిత్రానంద)సన్న్యాసదీక్ష యొసంగ నిశ్చయింపబడెను. ముండనము, శ్రాద్ధాది కర్మలు ముగిసినవి ___ ఓంకారానందస్వామి మాకు నియమము లన్నియు తెల్పిరి. సన్న్యాస దినము వచ్చెను. ఆ దినమంతయు నిర్జలోపవాసము. రాత్రి మేము మహాపురుషులగదికి వెళ్ళితిమి. అప్పుడు భోజనముగంటపడెను. ''నే డేమిభుజించితి'' వని వా రడిగిరి. ''నేనేమియు భుజింప లేదు - నిర్జలోపవాస'' మంటిని. ''నీశరీర మస్వస్థముగ నున్నది కాన నీవుఉపవసింప నక్కర లేదు'' అని పల్కి శంకరమహారాజును పిలిచి భగవానునికి నివేదించిన ప్రసాదము పండ్లు, భక్ష్యములు, పాలు వెంటనే తీసికొని ర మ్మని ఆజ్ఞాపించిరి. ప్రసాదము తెచ్చిన వెంటనే ''ఇది భగవానుని ప్రసాదము, భుజింపుము'' అని ఆజ్ఞాపించిరి. ''శ్రీవారు ఆజ్ఞాపించినపుడు నాకు సంకోచ మేల? వెంటనే నిస్సంకోచముగ భుజించితిని. వేకువ నాల్గు గంటలకు మాకు సన్న్యాస మీయబడెను. సన్న్యాసదీక్షసమయమున (విరజాహోమసమయమున) శ్రీ ఓంకారానందస్వామి మాపురోహితులు. వారు మంత్రములు చెప్పుచుండిరి - మేము వారి ననుసరించి పల్కుచుంటిమి. కాని ఒక్కొక్కచోట వారి సంస్కృతోచ్చారణ (సాధారణముగ బంగాలీలు సంస్కృతమును సరిగా ఉచ్చరింపజాలరు) బోధపడనిచోటులెల్ల మహాపురుషమహారాజు ఆమంత్రముల స్పష్టముగ (నే నడుగకయే) చెప్పుచుండిరి. మహాపురుషులు బనారసులో సంస్కృతపండితుని యొద్ద సంస్కృతము నేర్చుకొని యుండుటచే స్పష్టముగ చెప్పగల్గిరి. నాకెంతయో ఆనందము కల్గెను. ఉదయము మేము శ్రీవారికి ప్రణామములు కావించుటకై వెళ్ళగా ''నాకొఱకై ఏమి తెచ్చితివి?'' అని అడిగిరి. నే నేమియు లే దంటిని. వారు నాతో సహాస్యముగ ఇట్లు పల్కిరి: ''ఆహా! డి-ప్రమోషను అయినది

కదా! పరమేశ్వరుడవుగా ఉంటివి — ఇప్పుడు ఈశ్వరుడ వైతివి!''

ఒకనాడు నేను కలకత్తాకు వెళ్ళి యుంటిని. తిరిగి వచ్చునప్పుడు వారికొఱకు సందేశ (బంగాలీ తీపి పిండివంట) కొని తెచ్చితిని. వెంటనే వారి గదికి వెళ్ళితిని. గదితలుపు నొద్దకు పోవుసరికి శ్రీమహాపురుషులు చిన్న బాలునివలె గంతులు వైచుచు, పాటలు పాడుచు, గది నాల్గుమూలల చుట్టుచు నృత్యము సల్పుచుండిరి. ఈ అపూర్వదృశ్యమును జూచి నిశ్చేష్టుడనై నిలబడితిని. అది బంగాలీపాట అయినందున పూర్తిగా అర్థము కాలేదు కాని కృష్ణునిమీదపాట అనిమాత్రము అర్థ మైనది. మహాపురుషులు భావావస్థలో నుండిరి. ఆనందము వారిముఖములో తాండవ మాడుచుండెను. ఈ బాహ్యజగత్తునే మఱచిరి. నేను వారిని ఈభావావస్థలో ఇదే మొదటిసారి చూచినది. నామనస్సుకూడ ఆసమయమున అతీంద్రియావస్థకు పోయెను. నేనును తిను బండారపొట్లమును చేతనిడికొని గదివెలుపల గుమ్మమునొద్దనే నిల్చియుంటిని. ఇట్లు కొంత కాలము గడచెను. నృత్యము చేయుచు చేయుచు కొంతబాహ్యబోధరాగా, తటాలున నాయొద్దకు వచ్చి, నాచేతిలోనుండి పొట్లమును (నేనియ్యకమునుపే) ''నాకై తెచ్చితివా ?'' అనుచు తీసికొనిరి. ఆభావావస్థ నన్నాశ్చర్య చకితునొనర్చినది. నేటికిని ఆదృశ్యము నాహృదయఫలకమున నిశ్చలముగ నిల్చియున్నది.

# శ్రీమద్భాగవతము - శ్రీకృష్ణసందేశము

## [శ్రీమత్పురిభవానందవాణి]

### చతుర్థస్కంధము

#### తృతీయాధ్యాయము

#### పృథు మహారాజు

ధ్రువవంశసంజాతుడగు పృథుమహారాజు మహోదాత్తుడు, మహోదారుడు.

ఆయన పట్టాభిషేకముముగిసినను, అందుకు సంబంధించిన ఉత్సవములు సభలో ఇంకను జరుగుచుండగానే రాజ్యమున ఘోరక్షామము గల్గిన దను వార్త వచ్చినది. వేలకొలది ప్రజలు తిండిలేక మరణించుచుండిరి. ఆవార్తాహరులు ప్రభువుతో విన్నవించుకొనుచున్నప్పుడే గుంపులు గుంపులుగ జనులు 'అన్నమో రామచంద్రా' అని ఆక్రందించుచు రాజభవనమునొద్దకు రాసాగిరి.

తనకు పాటిల్లిన ఆపద ఎంత దారుణమో రాజు గ్రహించెను. భూమిలో చాలినంతపంటలు పండుట లేదని గుర్తించెను, ప్రజలకు ఈ బాధను దీర్చు మార్గ మేమా అని ఆయన వెజుగుపడెను. అంతంగూర్చి ఆయన ధ్యానించుచుండగనే సాక్షాద్భూదేవియే ఒక గోరూపమున ఆయనఎదుట కనిపించెను.

పడయుటకు మానవుడు శక్తి వంచన లేక పాటుపడవలయునే కాని. అతనికి కావలసిన సర్వస్వము నొసంగుటకు తనకు శక్తియు ఇచ్ఛయు కల దని భూమాత రాజునకు సూచించెను. అన్ని ప్రాంతాల ప్రజల కందఱికిని తగిన రకరకాల ఆహారమును ఇతరావశ్యకాలను తాను పండింపగల నని ఆమె పల్కెను.

పృథుమహారాజు తన ప్రజలను కొందఱిని పిల్చి భూమాత తనకు చెప్పినదాని నెల్ల మెలకువతో ఓర్పుతో వివరించి తెల్పెను. తర్వాత ప్రజలయు ప్రభునియు పరిశ్రమకు ఫలితముగ భూమాత మానవుల శరీరావశ్యకములగు వరిని ఓషధులను మొలకలను వృక్షములను సమృద్ధముగ పిదికెను. ఋషులకు ఆధ్యాత్మికాహారమును — వేదములను—ప్రసాదించెను. వేల్పులకు అమృతత్వమును మనశ్శక్తిని ఇంద్రియపాటవమును దేహశక్తి నొసగెను. రాక్షసులకు కైపుగల్గించు పానముల నొసగెను, గంధర్వులకుసౌందర్యమాధుర్యములను, సిద్ధులకుయోగశక్తులను, విద్యాధరులకు విద్యల నిచ్చెను. ఈ విధముగ భూమాత తన ప్రజ లందఱికోర్కెల సఫలములుగ నొనర్చెను.

పృథుమహారాజు దయతో నేలుచుండిన కాలమున కోటలు మహానగరములు పట్టణములు గ్రామములు ఇండ్లు కర్మాగారములు నిర్మితము లైనవి. వీనివలన ప్రజలకు సుస్థితియు సంరక్షణమును గలిగినవి. వారు సుఖించిరి, అభ్యుదయము నొందిరి. సుదీర్ఘకాలము సాగిన ఆతని యేలుబడిలో ఇక నెట్టి కాటకమును లోటును లే దాయెను.

భువిని శాంతిసౌఖ్యములు నెలకొన్న పిదప ఒక మహాయజ్ఞమును జేయ దొరకొని పృథుమహారాజు అందులకు భువిని గల సమస్తప్రజలను దివినిగల సమస్తసురలను ఆహ్వానించెను. అతని ప్రార్థనను మన్నించి శ్రీవిష్ణుదేవుడు తన మహోన్నత స్థానమునుండి దిగి విచ్చేసెను. తనభక్తుడగు రాజును దీవించి భగవంతు డతని కిట్లు ఉపదేశించెను:—

జ్ఞాని ఎవనినిగాని ద్వేషింపడు, హింసింపడు. ఎల్లరయందు నతడు పరమాత్మను సాక్షాత్కరించుకొనును. అజ్ఞానముచే దేహమే ఆత్మ అని అనుకొనువాడు కర్మబంధముల కగ్గమగు నని ఎఱిగిన వివేకి. దేహాసక్తి నొందడు, దేహాసక్తి వీడినవానికి ఇహలోకమున సంగము ఉండదు.

శరీరమునకంటె ఆత్మ వేఱు. ఈ ఆత్మ ఏకము, అద్వితీయము, శుద్ధము, స్వయంప్రకాశము, నిర్గుణము, ముక్తము, విశ్వవ్యాప్తము, నిత్యసాక్షి. ఆత్మజ్ఞానము పడసినవాడు ధన్యుడు. ఏల యన శరీరమున నున్నను అతడు దాని గుణపరిణామములకు లోనుగాడు. నాతోడి నిత్యయోగము గలవా డతడే.

కామరహితుడై, తనహృదయమును మనస్సును నాయందు లీన మొనర్చి నన్నారాధించు

వానికి అచిరకాలముననే ఆనందము గల్గును. అతనిహృదయము నాయందే ఆనందించుచు గుణముల సంగమునుండి విడుపొందును. అతడు తత్త్వద్రష్ట [ఋషి] అగును, నిత్యశాంతిని నిత్యముక్తిని నాయందు కనును.

ఆత్మ నిత్యముక్తము. మేనికిని ఇంద్రియములకును మనస్సునకును బుద్ధికిని నియామకము ఆత్మయే అని ఎఱిగిన వారికి అభయమును సర్వబంధవిముక్తియు గల్గును. జనన మరణములు దేహమునకే అనియు, అమర మనియు నిత్యముక్త మనియు వారెఱుగుదురు. ప్రేమలో నాతో ఐక్యమొందినవారు కనుక వారెట్టిదుఃఖమునకును లోను గారు.

రాజా, నీవు వివేకివి. సుఖదుఃఖములచే వంచితుడవు కాకుము, సర్వప్రాణులందును సమదృష్టితో, ఇంద్రియములను మనస్సును పూర్తిగా అదుపులో ఉంచుకొని ఈ రాజ్యము నేలుము.

యోగతపోమహిమలచేత నన్ను గాంచుట సులభము కాదు. సమచిత్తులైన సజ్జనుల చిత్తంబుల నేను వసించుచుందును.'

పృథుమహారాజు ప్రేమనాథుని చరణములకు మ్రొక్కి ఇట్లు ప్రార్థించెను:—

"హృదయాధినాథా, నేను సదా నీకీర్తినే వినుచుందును గాక, నీకీర్తినే పాడుచుందును గాక, నాడెందము సదా నీకొఱకైన ప్రేమతో నిండియుండును గాక, ఇదొక్కటే నే గోరునది."

శ్రీమహావిష్ణువు భక్తుని పూజలు స్వీకరించి అంతర్ధానము చెందెను. కాని పృథుమహీశుని హృదయములో సర్వేశ్వరుడు నిత్యసన్నిహితుడై యుండెను.

మనసులను హృదయములను భగవద్ధ్యానమున లీనమొనర్చి హృదయపూర్వకముగ భగవంతు నారాధించుటెట్లో స్వారాజ్యము నధిగమించుటెట్లో రాజు ప్రజలకు కఱపెను. పెక్కుజన్మములుగా ప్రోగువడియుండు పాపములను పాపుటకు భగవంతు నారాధింపవలె నను ఆశయే చాలును అనియు, భగవచ్చరణారవిందములకు తన్ను అర్పించుకొనువాడు ధన్యుడు అనియు, అత డన్ని సంగములనుండియు దురితములనుండియు విడుపొందుననియు, తత్త్వజ్ఞానమునొందు ననియు మృత్యువును జయించు ననియు — రాజు ప్రజలకు బోధించెను.

ఒకనాడు ప్రజలు నిండు మనసులతో తమ ప్రియప్రభువును ప్రశంసించుచుండ సనత్కుమారాది మహామునులు నల్వురతనికి ప్రత్యక్షమైరి. వారి రూపములు, పరమభాస్వరములై యుండెను. వారి వదనములలో బ్రహ్మజ్ఞాన తేజస్సు వెలుగొందుచుండెను.

(సశేషము)

# వార్తలు, విశేషాలు

## శ్రీ రామకృష్ణమఠము, మదరాసు - 4

### వివేకానంద సెంటినరీ గరల్సు హైస్కూలు ఆవిష్కరణమహోత్సవము

ఈ హైస్కూలు ఉత్తరమద్రాసులో టంకసాలయొద్ద గవర్నమెంటుప్రెస్సు సమీపమున శరవణ మొదలివీథిలో 13 & 14 నెంబర్లు గల ఇండ్లలో నున్నది. 19-7-1962 తేదీనాడు మద్రాసు శ్రీరామకృష్ణమఠమిషనుల ప్రెసిడెంటు మహారాజు శ్రీమత్కైలాసానందస్వామి ఒక దీపమును వెలిగించి ఈ హైస్కూలుకు ప్రారంభమంగళమును అనుగ్రహించినారు.

మేనేజరు మహారాజగు శ్రీ శుద్ధసత్త్వానంద స్వాములు అధ్యక్షునకును అతిథులైన మహిళలకును మహాజనులకును స్వాగతాశీర్వాదము పలికి స్కూలు పెట్టియున్న చోటును సర్కారు వారియొద్దనుండి తాము సంపాదించిన విధమును మూడువారములలోగా బడికి కావలసిన పందిళ్లను, తక్కిన ఏర్పాట్లను పూర్తి చేసిన విధమును వివరించి 170 మంది బాలికలతో స్కూలు ప్రారంభమగుచున్నదని చెప్పినారు.

డెప్యూటీ డైరెక్టరు ఆఫ్ పబ్లిక్ ఇన్స్ట్రక్షన్ శ్రీ టిటస్‌గారు శ్రీరామకృష్ణమఠమిషనుల కార్యక్రమాలను ముఖ్యముగ విద్యారంగమున వారు నిర్వహించుచున్న సేవను అభినందించి లాభకరమైన విద్యను గడింప బాలికలను ఆ పాఠశాలకు పంపవలసినదని తల్లిదండ్రులను వేడుకొనిరి.

హైస్కూల్స్ ఇన్‌స్పెక్ట్రెస్ శ్రీమతి రాజాంబాళ్ తర్వాత ప్రసంగించుచు "ఇంత స్వల్ప కాలములో ఈ చక్కని అనుకూలపరిసరములలో మఠాధికారులు ఈ స్కూలును ప్రారంభింపగలిగినందులకు నాకు ఎంతేని సంతోషము. ఈ ప్రాంతములకు ఇట్టి స్కూలు చాల జరూరని ఎన్నాళ్లగనో అందఱును గుర్తించిన విషయము. దీనికి అన్ని విధముల సహకారము సాయము తప్పక చేసెదము" అనిరి.

ప్రెసిడెంటు మహారాజు ఉద్రిక్తభావనిబిడముగ కావించిన ఉపన్యాసములలో భారతదేశమున ఆదర్శపౌరులుగ నగుటకు విద్యార్థులకు మతవిద్యగఅపుట ఎంత ఆవశ్యకమో వివరించినారు.

ప్రధానాధ్యాపకురాలు కుమారి సుబ్బలక్ష్మి, ఎమ్. ఏ., బి. ఎస్‌సి., బి. టి. గారు మఠాధ్యక్షులకును తోడ్పడిన యెల్లరకును కృతజ్ఞతాభివందనములు సమర్పించినారు.

ఇద్దఱు బాలికలు శ్రీ వివేకానందస్వామి గ్రంథావళినుండి కొన్ని భాగములను ఆంగ్లము

నను తమిళమునను వల్లించిరి. జాతీయగీతముతో నాటి శుభకార్యక్రమము ముగిసినది.

## శ్రీమత్స్వామి రామకృష్ణానందుల జయంతి

శ్రీమత్స్వామి రామకృష్ణానందుల నూఱవ జయంతిమహోత్సవము తిథిపూజ 1962వ సంవత్సరము జూలై తే 29ది నాడు కొనియాడబడినది. గుడిలో ప్రొద్దున ఆరతికి అనంతరం రామకృష్ణమిషను స్టూడెంట్సు హోము విద్యార్థులు ఉపనిషత్తులనుండి భగవద్గీతనుండి కొన్ని భాగాలు పారాయణం చేశారు. సాధువులున్నూ దుర్గాసప్తశతిని గీతను విష్ణుసహస్రనామమును పారాయణం చేశారు. విశేషపూజకు ఆరతికి భజనకు హోమమునకు అనంతరం దాదాపు 1150 మంది భక్తులకు 650 మంది దరిద్రనారాయణులకు అన్నసంతర్పణ జరిగింది. సాయంపూజానంతరం శ్రీశుద్ధసత్త్వానందస్వాములును శ్రీపరమాత్మానందస్వాములును శ్రీమత్కైలాసానందస్వాములును శశిమహారాజుల జీవితోపదేశాలనుగూర్చి ఉపన్యసించారు.

తే 5-8-62 ది ఆదివారమునాడు బహిరంగోత్సవము జరుపబడినది. మధ్యాహ్నానంతరం 3-30 గంటలనుండి 5 గంటలవఱకు శ్రీ యు. వి. రాజగోపాలశర్మగారు ప్రహ్లాదచరిత్రము హరికథాకాలక్షేపము చేశారు. 5-30 గంటలకు బహిరంగసభ సమావేశమైంది. శ్రీ కె. బాలసుబ్రహ్మణ్యఅయ్యరు ఆధ్యక్ష్యంవహించారు. శ్రీమత్కైలాసానందస్వాములు సదస్సుకు స్వాగతాశీస్సులు అనుగ్రహించారు. వివేకానందకాలేజి ఫిలాసఫి శాఖకు చెందిన డాక్టరు ఆర్. బాలసుబ్రహ్మణ్యముగారు ఆంగ్లములోను పినాంగ్ సుప్రీముకోర్టు అఫిషియల్ అడ్మినిస్ట్రేటరుగా ఉండి రిటైరు ఐన శ్రీ ఎల్. నటరాజనుగారు తమిళంలోను రామకృష్ణానందస్వాముల జీవితవిశేషాలను గుణవైభవాలను ఉపదేశాలను గూర్చి ఉపన్యసించారు. సభాధ్యక్షులు తమబాల్యంలో శ్రీశశిమహారాజుతో తమకు ఘటిల్లిన పరిచయవిశేషాలను తెల్పారు. జైన్కాలేజి ప్రిన్సిపాలుగారగు శ్రీ ఏ. ఎల్. కృష్ణనుగారు అందఱికి కృతజ్ఞతాభివందనాలు చెల్లించారు. ఆరాత్రికానికి పిమ్మట మఠభక్తబృందంచేత కాళికీర్తన చేయబడింది. రాత్రి 9-15 గంటలకు ప్రసాదవినిమయంతో నాటి కార్యక్రమం పూర్తి ఐంది.

## శ్రీరామకృష్ణసేవాశ్రమము - చెట్లతాండ్ర

శ్రీకాకుళంజిల్లా టెక్కలితాలూకా, చెట్లతాండ్రగ్రామం శ్రీరామకృష్ణసేవాశ్రమసర్వసభ్యసమావేశము శ్రీ డాక్టరు టి. జోగారావుగారి అధ్యక్షతను తే 15-8-62 దీ సాయంకాలము 4 గంటలకు జరుపబడినది. శ్రీ పంగ అప్పారావుగారు. శ్రీ రఘుపాత్రుని పద్మనాభరావుగారు దయతో ఇచ్చిన య. 0-50 ట్లు భూమిని కట్టించిన సేవాశ్రమమును స్వీకరించుటకు అంగీకరింపబడినది. ఈ సంస్థ ఇండియన్ సొసైటీల చట్టముక్రిందను రిజిష్టరుచేయించుటకు నిశ్చయింపబడినది. ప్రతినెల పౌర్ణమికి ఆధ్యాత్మికవిషయాలను చర్చించుటకు ఒక సమావేశము ఏర్పాటుచేయుటకు నిర్ణయింపబడినది. మానవుడు శాంతిని పొందు విధానము గూర్చి శ్రీ భద్రాచలం రామమూర్తిగారు

ఉపన్యసించిరి. ఈ క్రిందివారు పాలకవర్గముగా నియమింపబడిరి. శ్రీ భద్రాచలం రామమూర్తి (అధ్యక్షులు), శ్రీ పంగ అప్పారావు, పొన్నాన సూర్యనారాయణగార్లు (ఉపాధ్యక్షులు); శ్రీ రఘుపాత్రుని పద్మనాభ రావుగారు(కార్యదర్శి;) శ్రీ పి. అప్పలస్వామి, జి. అప్పలస్వామి, వి. దాసన్నగార్లు (సభ్యులు).

# గ్రంథపరిచయం

[సమీక్షకి గ్రంథాలు పంపేవారు రెండేసి ప్రతులు పంపవలె అని మనవి]

## భారతీయహృదయము నా సత్యాన్వేషణము

డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణుల 'ది హార్ట్ ఆఫ్ హిందుస్థాన్; మై సర్చ్ ఫార్ ట్రూత్' అను ఆంగ్లగ్రంథాలకు అనువాదాలు ఇవి. అనువాదకర్త – శ్రీ బులుసు వేంకటేశ్వర్లు, ఎం. ఏ. ధర – మొదటిది మూడురూపాయలు, రెండవది రెండురూపాయలు. ప్రతులకు – బి. వి. అండ్ సన్స్, రామారావుపేట, కాకినాడకు వ్రాయాలి.

డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణులు జగద్విఖ్యాతులు. వారి తత్త్వచింత, శ్రద్ధాసక్తులు, విద్యాతృష్ణ, సమన్వయశక్తి, సులభము, సుందరము అయిన వ్యాఖ్యానవైఖరి, మనస్సునుబట్టి వచ్చు భాషామాధుర్యము మొదలయినవి కారణాలుగా వారి రచనలు జగత్ప్రసిద్ధిని బడసినవి. ఇంకా ఇంకా ప్రఖ్యాతికి రావలసినవి. ప్రతిమనిషీ చదువుకొని, రాధాకృష్ణుల మననధారను మననంచేసుకొని, తన తన అంతస్థుకు తగినటుల హృదయసంస్కారమునకు ఉద్యమించుటకు గానైనవి. ఇట్టి ఉద్గ్రంథములు ప్రతి భాషలోను వెలయుట అవసరము. తెనుగున ఈ పనిని నిర్వహిస్తూన్న శ్రీ బులుసు వేంకటేశ్వర్లుగారు అభినందింపవలసినవారు.

మానవుడు భూమిమీద పడిన తరువాత, భూమిని విడిచి వెళ్లేలోగా, ఎప్పుడో ఒకప్పుడు దైవాన్నిగురించి తెలుసుకోవలసిన అవసరం తటస్థించక మానదు. మన చిత్తశుద్ధి, తీవ్రత ఎంతగా ఉంటే, ఆ దైవమూ అంతగానూ మనకు తెలియక తప్పదు. ఒకవిధంగా, ఈ జీవితం పరీక్ష. కావలసినన్ని 'ఎర'లూ ముందు ఉంచి, – వాటి ఇంద్రజాలంలో నడిపిస్తూ, 'ఏం చేస్తావు ఇప్పుడు' అని పరీక్షించేదిగా కనబడుతుంది. ఇట్లాంటి వేదనలకు తాము లొంగిగాని, లొంగక గాని, తపస్సు చేసి తెలుసుకొన్న పెద్దలు, ఈశ్వరవాణిని విన్న పెద్దలు తాము తెలుసుకొన్న సత్యాలను ఇతరులకు చెప్పారు.

''భద్రంకర్ణేభిః శ్రుణుయామ దేవాః,
భద్రం పశ్యే మాక్షిభి ర్యజత్రాః స్థిరై రంగైః
తుష్టువాగ్ స స్తనూభిః వ్యశేమ దేవహితం యదా

యః'' అన్న వైదిక శాంతిపాఠము, మానవుడి నడవడుల విషయంలో – దారి చూపునదిగా తోస్తుంది. మహాభారతంలోని (వనపర్వం) నలోపాఖ్యానంలో – ఇందు కొక చక్కని ఉదాహరణ ఉంది. తాను ప్రేమించిన దమయంతిదగరకు, ఇంద్రాదుల దూతగా తాడు నలుడు. ఇది దేవకార్యం గనుక నలుడు వెళ్లాడు. అందుచేత ఆయన నిషధయోగ్యుడైనాడు. మనజీవితము సార్థకం కావాలంటే దేవహితజీవితం అవసరం అని తెలుతుంది.

ఈ జీవితం నాటకం అని తెలుసుకొని తన పూనిక స్వార్థనాశనాని తన తెలివితేటలు, పరోపకారానికి వెచ్చించేవాడు సార్థకజన్ములని తేలుతుంది.

భూమి విశాలం అయింది. అక్కడక్కడి ప్రజలకు అక్కడక్కడి ఋషులు దైవవాణిని విన్నవారు, తాము తెలుసుకొన్నదాన్ని తెలియజెప్పారు. ప్రతిదీ సత్యమే. అహంకార శాస్త్రపాండిత్యాన్ని వదిలించుకోటం కష్టం – ఐనా, వదిలించుకొని చూస్తే – ప్రతిదీ సత్యాన్ని చెప్పినట్లే తెలుస్తుంది. చిల్లరసంగతులే ప్రధానం అనుకుంటే – తగాదాలు, చెడటాలూనూ.

శ్రీ రాధాకృష్ణులు 'నిజం ఏది ?' అని ప్రశ్నించుకొని, చదువుకొని, తెలుసుకొని, ఖండశః ఖండశః తెలిసినదాన్ని సమన్వయించుకొని, తిరిగి అర్థానిని విపులముగా వ్యాఖ్యానించిన వీ గ్రంథాలు. నిండుహృదయం పలికిన పలుకులు.

ఇహామునుగాని, పరమునుగాని త్రవేయక చేసిన సమన్వయాలు. కనుకనే, సత్యపూర్ణములు.

''మనగతజీవితములలోని తీరని కోరికల వలన మన మీ లోకమున జన్మించుచున్నాము. దుఃఖాగ్నితప్తులమగుటచేతనే మనము దౌర్బల్యమును బలముగాను, అజ్ఞానమును జ్ఞానప్రభావమయముగాను మార్పుచేసికొనగలము. ఆత్మనిగ్రహముతో దుఃఖము ననుభవించుట వలన మానవజీవితదోష ముపశాంతి నొందగలదు. ఆశ్రమశబ్దమునకు వ్యుత్పత్త్యర్థము 'కష్టానుభవ' మనియే. కష్టానుభవము లేనిదే అభ్యుదయము లేదు; మరణము లేనిదే పునర్జీవితము లేదు''. (భారతీయహృదయము. 46 వ పేజీ).

''మన మున్నతి కాంచినకొలదియు భారమధికమగును; మనభారపరిమాణము ననుసరించి మన మెంత పైకెక్కుదుమో యంతగా మనబలము పెంపొందవలెను.'' (భారతీయహృదయము. ౕ౫ వ పేజీ).

సమున్నతభావసంపదగల భారతీయహృదయము, అట్టిదే యగు నా సత్యాన్వేషణము, ప్రతి తెలుగువ్యక్తి చదివి మననము చేయ తగినవి.

అనువాదకులు, ''కళాశాలలో జదువుచున్న విద్యార్థిలోకమునకు శ్రీ రాధాకృష్ణపండితుల భారతీయహృదయము నందజేయుటే నా యనువాదలక్ష్యము'' అని నొక్కి చెప్పారు. శ్రీ రాధాకృష్ణుల పరిణతవాణిని ''కళాశాలా విద్యార్థులే'' గాక ప్రతిఒక్కరూ చదవవలసి, మననం చేసుకోవలసి ఉంటుంది. అనువాదలక్ష్యం ఎంత విశాలం అయితే అంత మేలు.

–శ్రీ జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రి

# శ్రీ వివేకానందస్వామి శతతమ జయంతి ప్రచురణములు

## ఆంధ్రపాఠకులకు అమూల్యతరుణము

# శ్రీవివేకానంద సంపూర్ణగ్రంథావళి

ప్రతిభోజ్జ్వలులైన ఆంధ్రపండితులచే ఆంధ్రీకరింపబడి 10 సంపుటాలుగా ప్రకటింపబడుతున్నది. ప్రతి సంపుటంలోను దాదాపు 500 పుట లుంటాయి. అసలు ఖరీదు అట్టబైండుసెట్టు రు. 50 లు. కాలికోబైండుసెట్టు రు. 65 లు. పోస్టేజి ప్రత్యేకం.

స్వామిజిసందేశం మాతృదేశభక్తిభరితం, ప్రాణప్రదం, ఆత్మోత్తేజకరం, విశ్వజనీనం. అది సమగ్రంగా ఆంధ్రమహాజనులకు అందడం ఇదే మొదటిసారి. స్వామిజీది దివ్యదృష్టి. ఆయన అమోఘ పరిష్కారవిధానం సూచింపని ముఖ్యసమస్య అంటూ లేదు. ఆయన గ్రంథావళిని చదివినవారికి ఉత్సాహమును ఉదాత్తతయున్నూ కలుగక తప్పదు.

వివరములు :

| | | | | |
|---|---|---|---|---|
| మొదటి సంపుటము | 575 పుటలు | అట్టబైండు రూ. 5/- | క్యాలికో రూ. 6-50 |
| నాల్గవ సంపుటము | 592 ,, | ,, రూ. 5/- | ,, రూ. 6-50 |
| అయిదవ సంపుటము | 544 ,, | ,, రూ. 5/- | ,, రూ. 6-50 |
| ఆఱవ సంపుటము | 585 ,, | ,, రూ. 5/- | ,, రూ. 6-50 |

విలాసము :

మేనేజరు,

రామకృష్ణ మఠము

మైలాపూరు : : మద్రాసు - 4



భారతీయ కళాకారుల సృజనాత్మక ప్రతిభను ప్రతిబింబింపచేసే చేతికళల వస్తువులలో నిర్మల్ కళాఖండాలు ఒకవిశిష్టస్థానాన్ని ఆక్రమిస్తాయి. పహారీ, కాంగ్డా, అజంతా కళారీతులలో రూపొందించబడిన మొఘల్ చిత్రాలు, వర్ణచిత్రాలవంటి మనోహరమైన అపూర్వకళాఖండాలతో యీ పరిశ్రమ విలసిల్లుతుంది. ఇందులోగల నిత్యజీవితోపయోగమై, సుందరమైన వస్తుసంచయం మీ అభిరుచికి, మీ కొనుగోలు శక్తికి తగినదిగా ఉంటుంది.

ఈ పరిశ్రమలో కొన్ని పేరెన్నికగన్న వస్తువులు: కార్డుపెట్టెలు, సిగరెట్ పెట్టెలు, యాష్ట్రేలు, స్టాండర్డ్ టేబిల్ లాంప్స్, బీర్ పాత్రలు, కాఫీసెట్లు, డ్రాయింగ్, డైనింగ్ గదుల సెట్లు మొదలైనవి.

హైదరాబాద్‌లో ఉన్న ఖైరతాబాద్‌లోని మా ఫ్యాక్టరీకి, షో రూమ్‌కు మీరు విచ్చేయడానికి ఇదే మా హృదయపూర్వక ఆహ్వానము.

వర్తక వివరాలకు:

"మేనేజింగ్ మెంబర్, నిర్మల్ ఇండస్ట్రి, ఖైరతాబాద్, హైదరాబాదు-4" కు వ్రాయండి.

—స. పౌ, సం. శా., ఆం. ప్ర.

# శ్రీ రామకృష్ణ ప్రభ

**సంపుటము ౧౯  ౧౯౬౨, అక్టోబరు; శుభకృత్తు - ఆశ్వయుజము  సంచిక ౪**

## విషయసూచిక

# శ్రీ రామకృష్ణమఠ ప్రచురణములు

| | | | |
|---|---|---|---|
| 740 పుటలు | శ్రీరామకృష్ణ సూక్తి సుధ (తోలికూర్పు) | రూ. | 7/50 |
| 496 పుటలు | శ్రీ రామకృష్ణ లీలామృతము (ద్వితీయ ముద్రణము) | రూ. | 5/- |
| 144 పుటలు | శ్రీ శారదాదేవి | రూ. | 1-25 |
| 312 పుటలు | శ్రీ శారదా ప్రసంగములు | రూ. | 3-00 |
| 540 పుటలు | శ్రీ రామకృష్ణ బోధామృతము (సంగ్రహ జీవితసహితము) | రూ. | 3-50 |
| 432 పుటలు (సాదా) రూ. 3-50 | శ్రీవివేకానంద జీవితచరిత్ర (అట్టబైండు) | రూ. | 4/- |
| 564 పుటలు | స్వామి - శిష్య సంవాదములు (ప్రథమ ముద్రణము) | రూ. | 5/- |
| 344 పుటలు | బ్రహ్మానంద బోధనలు (ప్రథమ ముద్రణము) | రూ. | 3-50 |
| 330; 324 పుటలు | సందేశతరంగిణి - 2 భాగములు (ఒక్కొక్క భాగము) | రూ. | 3/- |
| 402 పుటలు | పారమార్థిక సంభాషణలు | రూ. | 3/- |
| 504 పుటలు | శ్రీమద్భగవద్గీత (ఆఱవ ముద్రణము) | రూ. | 4/- |

| | | |
|---|---|---|
| జ్ఞానయోగము 4 00 రాజయోగము | 2 | 50 |
| కర్మయోగము 1 50 భక్తియోగము | 1 | 50 |
| నారద భక్తి సూత్రములు ... | 3/- | |
| పరతత్త్వప్రసంగము ... | 2/- | |
| శ్రీ నాగమహాశయుని జీవితచరిత్ర ... | 1 | 25 |
| ప్రబోధరత్నాకరము ... | 2 | 25 |
| శ్రీ శారదాదేవి చరిత్ర ... | 2/- | |
| దేవీమాహాత్మ్యము ... | 2/- | |
| వివేకానందలేఖావళి (మొదటిభాగము) | 1 | 50 |
| వివేకానందలేఖావళి (రెండవభాగము) | 1 | 75 |
| శ్రీరామకృష్ణోపనిషత్తు ... | 1 | 25 |
| హిందూ మతము ... | 1 | 25 |
| అనుష్ఠాన వేదాంతము ... | 1 | 25 |
| కులము, సంస్కృతి, సామ్యవాదము | 1/- | |
| వివేక సూర్యోదయము ... | 1 | 25 |
| భారతీయ మహిళ ... | 1/- | |
| కఠోపనిషత్తు ... | 0 | 80 |
| శ్రీ పరమహంస నీతికథారత్నములు | 0 | 75 |
| గిరీశచంద్ర 0 75 భక్తిమార్గము | 0 | 50 |
| షికాగో నగరోపన్యాసములు ... | 0 | 50 |
| గురూపదేశములు 0 50 శ్రీకృష్ణవాణి | 0 | 40 |
| శ్రీ రామకృష్ణ ఉవాచ ... | 0 | 37 |
| శ్రీ వివేకానంద శంఖారావము ... | 0 | 37 |
| శ్రీ శారదా సూక్తి నవనీతము ... | 0 | 40 |
| నా సంస్కరణ యుద్ధవిధానము ... | 0 | 37 |
| నా గురుదేవుడు 0 40 బుద్ధ ఉవాచ | 0 | 37 |
| శ్రీరామకృష్ణుడు, వివేకానందస్వామి | 0 | 25 |
| శ్రీ పరమహంస జీవిత సంగ్రహము... | 0 | 25 |
| పరమహంస శ్రీరామకృష్ణుడు ... | 0 | 25 |
| నవీన భారతదేశము ... | 0 | 25 |
| తాపత్రయ చికిత్స ... | 0 | 25 |
| పవహారిబాబా 0 25 ముక్తిమార్గము | 0 | 19 |
| సర్వం విష్ణుమయం జగత్ ... | 0 | 19 |
| శ్రీ రామకృష్ణ ఆరాత్రికము ... | 0 | 12 |
| శ్రీరామనామసంకీర్తనము 0 6 యతిగీతము | 0 | 6 |
| నామతము 0 3 వి. సింహగర్జనము | 0 | 3 |

శ్రీ దొడ్డ భాగవతము - మొదటి సంపుటము రూ. 6-50; రెండవ సంపుటము రూ. 5-50;
మూడవ సంపుటము రూ. 7-50 (మూడును ఒకేసరి కొన్నచో: రూ. 18-50)

ఇవియే కాక సంస్కృత, ఆంగ్ల, తమిళ, హిందీ, కన్నడ గ్రంథములు,

వేదాంత కేసరి (ఆంగ్లము) శ్రీ రామకృష్ణ విజయము (తమిళము)

అను మాసపత్రికలును మాయొద్ద దొరకును

అడ్రెసు : మేనేజరు, శ్రీరామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు - 4



‘అఖిలవిభు శరణొందుము, యీ క్షణంబ యతనికృప నీవ ననుభావ్య మగుదు వత్స.’

—శ్రీ శారదామణి.


# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము ౧౯ } ౧౯౬౨ – అక్టోబరు : : శుభకృత్తు – ఆశ్వయుజము { సంచిక ౪


శ్రీః

## సౌందర్యలహరి

మూలము : శ్రీ శంకరభగవత్పాదులు — టీక : నే. భ.

తవాపర్ణే కర్ణేజపనయనపైశున్యచకితా
నిలీయన్తే తోయే నియత మనిమేషా శ్శఫరికాః
ఇయం చ శ్రీ ర్బద్ధచ్ఛదపుటకవాటం కువలయం
జహాతి ప్రత్యూషే నిశి చ విఘటయ్య ప్రవిశతి ॥ ౫౬

| | | | |
|---|---|---|---|
| హే అపర్ణే | ఓ పార్వతీ | నిలీయన్తే | దాగుచున్నవి |
| తవ | నీ | నియతమ్ | నిజము |
| కర్ణే | కర్ణములకు | కిఞ్చ | మఱి |
| జప | సదా సమీపముననున్న | ఇయఞ్చశ్రీః | ఈ లక్ష్మియు |
| నయన | నేత్రములచే కావింపబడు | బద్ధ | సంకలితమైన |
| పైశున్య | మర్మోద్ఘాటనమునకు | చ్ఛదపుట | దొప్పలవంటి దళములగమి అనెడి |
| చకితాః | వెఱచినవై | | |
| శఫరికాః | మీనాంగనలు | కవాటమ్ | తలుపుగల |
| అనిమేషాః | ఱెప్పపాటులేనివై | కువలయమ్ | ఇందీవరమును |
| తోయే | నీట | ప్రత్యూషే | ఉషఃకాలమున |

| | | | |
|---|---|---|---|
| జహాతి | విడుచును | విఘటయ్య | తెఱచుకొని |
| నిశిచ | రాత్రియందన్ననో | ప్రవిశతి | ప్రవేశించును. |
| తత్ | దానిని | | |

తా॥ అమ్మా పార్వతీ, నీ నేత్రములు ఆకర్ణాంతములు. సుందరనేత్రములకు లోకములో సామాన్యముగ ఉపమానములుగ జెప్పబడునవి మీనములు. అవి నీ నేత్రాలమేలిమిని గుర్తించి ఆ నేత్రాలయెదుట తాము నడయాడ వెఱచి, నీట దాగి, తెప్పపాటు మాని కనుపెట్టియున్నవి. ఈ లక్ష్మియు తన యిల్లగు నిందీవరమునకు రేకులగమి అనెడి తలుపు బిగించి ఉషఃకాలముననే దానిని వీడి ఎటకో ఏగును. రాత్రులందుమాత్రము వచ్చి ఆ తలుపులను తెఱచుకొని ఆయింట నుండును. లోకములో అవమానము చెందినవారు రాత్రులందు రహస్యముగ ఇండ్లలో నుండి, పగటివేళల వాకిండ్లకు బీగములు వేసి తాము ఎక్కడెక్కడనో అజ్ఞాతవాసము చేయుచుందురు కదా — అటు.

దృశా ద్రాఘీయస్యా దరదళితనీలోత్పలరుచా
దవీయాంసం దీనం స్నపయ కృపయా మా మపి శివే
అనే నాయం ధన్యో భవతి, న చ తే హాని రియతా,
వనే వా హర్మ్యే వా సమకరనిపాతో హిమకరః॥ ౫౭

| | | | |
|---|---|---|---|
| శివే | ఓ మంగళాత్మికా | ధన్యః | కృతార్థుడుగ |
| ద్రాఘీయస్యా | దీర్ఘతరమును | భవతి | అగును |
| దరదళిత | ఇంచుక విచ్చిన | ఇయతా | ఇంతమాత్రము చేత |
| నీల+ఉత్పల | ఇందీవర పుష్ప కాంతివంటి | తే | నీకు |
| రుచా | కాంతికలదియు అగు | హానిః న చ | నష్టమును లేగు |
| దృశా | (నీ) చూపుచేత | హిమకరః | చంద్రుడు |
| దవీయాంసం | దూరవర్తియు | వనే వా | నిర్జనారణ్యముననైనను |
| దీనమ్ | దరిద్రుడునగు | హర్మ్యే వా | శృంగార నాయికా నాయకుల భోగభూమియగు ప్రాసాదమునందైనను |
| మామ్ అపి | నన్ను కూడ | | |
| కృపయా | దయచేత | | |
| స్నపయ | తడుపుము | సమకరనిపాతః | సమానముగ కిరణములు పఱపువాడు కదా. |
| అయమ్ | ఇతడు ( = నేను) | | |
| అనేన | ఇంతమాత్రము తడుపుట చేత | | |

తా॥ భక్తులకు మంగళము లొసగు నా తల్లీ. నేను దూరముననున్నాను. దీనుడనై యున్నాను. కలువలకాంతివంటి కాంతిగలది నీ సుదీర్ఘకటాక్షము. దాని విలోకనము నాపైని కూడ. పఱపి నీ దయారసమున నన్ను తడుపుమా. తడిపినంతమాత్రము చేత నాకు ధన్యత

గలుగునే కాని నీ కెట్టి నష్టమును కలుగదులే. 'వనము' 'భవనము' అను భేదము చూడక చంద్రుడు తనకిరణములను సర్వత్ర పఱపుచుండ లేదా.

అరాళం తే పాలీయుగళ మగరాజన్యతనయే
న కేషా మాధత్తే కుసుమశరకోదణ్డకుతుకమ్
తిరశ్చీనో యత్ర శ్రవణపథ ముల్లఙ్ఘ్య విలస
న్నపాఙ్గవ్యాసఙ్గో దిశతి శరసన్ధానధిషణామ్ ॥ ౫౨

| | | | |
|---|---|---|---|
| హే అగరాజన్య తనయే | ఓ పర్వతరాజపుత్త్రీ | పాలీయుగళమ్ | చెవితమ్మెలజంట |
| యత్ర | ఎచ్చట | అరాళమ్ | వంపుగలదై |
| అపాఙ్గ వ్యాసఙ్గః | కటాక్షముల దీర్ఘత్వము | కుసుమశర | మన్మథుని |
| తిరశ్చీనః | అడ్డముగ ప్రసారితమై | కోదణ్డ | విండ్లు అను |
| విలసన్ | వెలుగొందుచు | కుతుకమ్ | ఆస(లూరించుతలంపు)ను |
| శ్రవణపథమ్ ఉల్లఙ్ఘ్య | చెవిదారిని దాటి | కేషాం | ఎవరికి |
| శరసన్ధానధిషణామ్ | బాణసంయోజనభ్రాంతిని | న ఆధత్తే | కలిగింపదు (ఎల్లరకును తప్పక కలిగించి తీరు ననుట). |
| దిశతి | కలిగించుచున్నదో అట్టి | | |
| తే | నీ | | |

తా॥ అమ్మా, పార్వతీ, వాలికలగు నీ కడకన్నుల చూపులు అడ్డముగ ప్రసరించుచు నీ శ్రవణపథమును దాటుచున్నవి. నీ చెవితమ్మెలకు వంపుసొంపున్నది. వానిని దాటి వెలుగొందుచున్న నీ చూపులకు గల తూపుల పోలికచేత ఆ తమ్మెలకు ధనుస్సామ్యము గల్గుచున్నది.

స్ఫురద్గణ్డాభోగప్రతిఫలితతాటఙ్కయుగళం
చతుశ్చక్రం మన్యే తవ ముఖ మిదం మన్మథరథమ్
య మారుహ్య ద్రుహ్య త్యవనిరథ మర్కేన్దుచరణమ్
మహావీరో మారః ప్రమథపతయే సజ్జితవతే ॥ ౫౩

| | | | |
|---|---|---|---|
| (హే భగవతి) | (ఓ దేవి) | ఇదం | ఈ |
| స్ఫురద్ | ప్రకాశించు | ముఖం | ముఖము |
| గణ్డ+ఆభోగ | విశాలములగు చెక్కిళ్ళ యందు | చతుశ్చక్రం | నాల్గుచక్రములుగల |
| | | మన్మథరథమ్ | మన్మథునిరథము అని |
| ప్రతిఫలిత | ప్రతిఫలింపచేయబడిన | మన్యే | తలంతును |
| తాటఙ్కయుగళమ్ | కమ్మలజంటకలదైన | యమ్ | దేనిని |
| తవ | నీ | ఆరుహ్య | అధిరోహించి |

| | | | |
|---|---|---|---|
| మారః | మన్మథుడు | అవనిరథమ్ | భూరథమును |
| మహావీరఃసన్ | మహావీరుడై | సజితవతే | ఆయత్తపఱచుకొన్న |
| అర్కేన్దుచరణమ్ | సూర్యచంద్రులనెడి రెండేచరణములుగల | ప్రమథపతయే | పరమశివునికి |
| | | ద్రుహ్యతి | పరాభవముచూర్చును. |

తా॥ అమ్మా, విశాలములగు నీ మెఱుగుచెక్కిళ్ళయందు చెవులకమ్మలజంట ప్రతిఫలించుచున్నది. కమ్మలు రెండును ప్రతిబింబములు రెండును చేరిన మొత్తము నాలుగగును. ఈ నాలుగును చక్రములు. ఈ చక్రములుగల నీ ముఖము రథము. ఇది మన్మథు డధిష్ఠించు రథ మని నేను తలంచుచున్నాను. మన్మథుని శత్రువైన శివునకు రథము భూమి. దానికి చక్రములు రెండే. ఏ వనగా సూర్యచంద్రబింబములు. ఆ నాల్గు చక్రాలరథ మెక్కిన మన్మథుడు, ఈ రెండు చక్రాల రథము నాయత్తపఱచుకొన్న శివుని పరిభవింపగలడు.

సరస్వత్యాస్సూక్తీ రమృతలహరీకౌశలహరీః
పిబన్త్యాః శర్వాణి శ్రవణచుళుకాభ్యా మవిరళమ్
చమత్కారశ్లాఘాచలితశిరసః కుణ్డలగణో
ఝణత్కారై స్తారైః ప్రతివచన మాచష్ట ఇవ తే ॥ ౬౦

| | | | |
|---|---|---|---|
| శర్వాణి | ఓ శివుని రాణీ | చమత్కారశ్లాఘా | చమత్కారముతోఁగూడిన పొగడ్తయందు |
| అమృతలహరీ | సుధాప్రవాహపు | | |
| కౌశలహరీః | సౌభాగ్యమును హరించునవగు | చలిత | కదల్పబడిన |
| | | శిరసః | శిరముకలదానవును అగు |
| సరస్వత్యాః | సరస్వతీదేవియొక్క | తే | నీ |
| సూక్తీః | మధురవచనములను | కుణ్డలగణః | కర్ణాభరణముల సమూహము |
| శ్రవణ | చెవులనెడి | తారైః | బిగ్గఱయైన |
| చుళుకాభ్యామ్ | చేరలతో | ఝణత్కారైః | ఝుణఝుణ మను చప్పుళ్లచే |
| అవిరళమ్ | నిరంతరము | ప్రతివచనమ్ | ప్రత్యుత్తరమును |
| పిబన్త్యాః | ఆస్వాదించుదానవును | ఆచష్ట ఇవ | చెప్పుచున్నట్లున్నది. |

తా॥ అమ్మా, శర్వాణి, సరస్వతీదేవి పల్కునట్టి సూక్తులందలి సుధాప్రవాహమును నీవు వీనుజేరల జుఱ్ఱుచుందువు. చమత్కారముతోఁగూడిన ప్రశంసను సూచించుచు నీవు తలను కదల్తువు. అప్పుడు నీ కర్ణాభరణములు ఝుణఝుణ మ్రోగును. ఈ ఝుణత్కారము, సరస్వతిసూక్తులకు నీవు పల్కు ప్రత్యుత్తరము లనదగి యుండును.

# మాతను గూర్చి గురుదేవుని బోధామృతబిందువులు

## అను : శ్రీ చిరంతనానందస్వామి

12. చిన్నపిల్లలు పంచపాళిలో విచారము భయము ఆటంకము అనునవి లేకుండ, బొమ్మలు పెట్టుకొని స్వేచ్ఛగా ఆటలాడుకొను చుందురు. కాని తల్లి కనబడగానే బొమ్మల నన్నిటిని త్రోసి పాఱవేసి 'అమ్మ, అమ్మ', అనుచు ఆమెకడకు పరుగిడుదురు. ఓనరుడా, నీవును ఈలోకమున వ్యామోహమున జిక్కి ధనకీర్తి గౌరవములను బొమ్మలతో ఆటలాడు కొనుచున్నావు. నీ కేమియు భయముగాని విచారముగాని లేకున్నది. కాని నీ కొక్కసారి ఆ దివ్యమాతృ దర్శనము లభించెనా, వీనిలో దేనియందును మక్కువ యుండదు. వీని నన్నిటిని తృణీకరించి ఆ దివ్యజననిసన్నిధికి పరుగిడుదువు సుమీ.

50. బ్రహ్మమునకును శక్తికిని గల సంబంధము అగ్నికిని దహనశక్తికిని గల సంబంధము వంటిది.

51. పొడిమట్టితో కుమ్మరి కుండలను జేయజాలడు, అందులకు నీరుకూడ కావలసియున్నది. శక్తియొక్క సాయము లేకుండ శివు డొక్కడే సృష్టింప జాలడు.

63. బ్రహ్మసాక్షాత్కారము గలిగించునది మాయయే. శక్తిని దర్శింపకుండ భగవంతుని గనజాలము.

65. పిల్లి తనకూనలను పండ్లతో కఱచి పట్టుకొనునప్పుడు ఆకూనల కే అపాయము నుండదు. కాని ఆపిలి యెలుక నటు పట్టుకొను నేని అది చచ్చును. అటులనే మాయ యితరులను నాశనముచేయును గాని భక్తుల నెన్నడును నశింపజేయదు.

441. నీకు దైవానుగ్రహము వలయు నెడల పరాశక్తియగు జగన్మాతను సంతుష్టురాలి నొనర్పుము. ఔను ఆమెయే మహామాయ. సమస్తజగత్తును భ్రమింపజేయున దామెయే. సృష్టిస్థితిలయములను మహాలీల నామెయే సాగించుచున్నది. సర్వము నామె అజ్ఞానముచే గప్పియున్నది. మోక్షద్వారమును ఆమె తెఱవనిదే ఎవ్వరును ఆత్మసౌధమున బ్రవేశింపజాలరు. బైటనుండి మనము కేవలము బాహ్యావిషయములను జూచుచున్నాము. సచ్చిదానందమయుని స్వరూపము సర్వదా మనకు అతీతమై అగోచరమైయున్నది.

విద్య – అవిద్య అని దివ్యశక్తి రెండు రూపముల వెలయుచున్నది. కామినీకాంచనములచే అవిద్య జగమును భ్రమింపజేయుచు సంసారబద్ధ మొనర్చుచున్నది. విద్యయో — భక్తికిని జ్ఞానమునకును, ప్రేమకును, కారుణ్యమునకును నిలయమై మనలను పరమేశ్వరుని సన్నిధికి గొనిపోవును.

* మా మఠప్రచురణమగు 'బోధామృతము' నుండి.

ఈయవిద్యాశక్తిని సంతుష్ట నొనర్చుటకే మాటలు గాదు. మహాకఠినమైన ప్రమాద శక్తిపూజ విధింపబడియున్నది. ఇందులకై వివిధ కరమైన—సాధనలతో గూడుకొనియున్నది మార్గములు కలవు. సాధకుడు తన్ను ఆమె జగజ్జననిసఖి ననుభావముతో నేను రెండు యొక్క సఖిగాగాని భర్తగాగాని బిడ్డగాగాని సంవత్సరములు సాధన చేసినాను, ఐనను నాది భావించుకొనవచ్చును. శక్తిసాధన యనగా పుత్త్రభావము — శిశుభావము.



# జగన్మాత

## శ్రీ వివేకానంద దివ్యవాణి

శాక్తేయులు విరాట్ఛక్తిని మాతృభావమున పూజింతురు,—వారికి తెలిసినంతవఱకు మాతృనామమే మధురతమము! ఏలన మాతృత్వమే భారతనారీత్వ మహోన్నతాదర్శము. భగవంతుడు మాతృభావమున, ప్రేమస్వరూపుడుగా, ఆరాధింపబడునపుడు హిందువులు దీనిని 'దక్షిణమార్గము' అందురు, అది పారమార్థికపరతను జేకూర్చునేకాని, ఐహికసంపదనెన్నడు నీయదు. భగవంతుడు వాని భీషణరూపమున, అనగా వామాచార మార్గమున, పూజింపబడునెడ, సాధారణముగా అది విస్తారమగు ఐహికసంపదలను ఒనగూర్చును, కాని పారమార్థికపరతనుగల్గింపదు; కాని వామాచారము తుదకు పతనమునకును వంశనాశనమునకును హేతుభూతమగుచుండును.

శక్తి ప్రప్రథమమున మాతృరూపముననే ఆవిష్కృతమగును. తండ్రిగ దలంచుటకంటె తల్లిగదలంచుట పైమెట్టుగా పరిగణింపబడుచున్నది. బిడ్డ తన తల్లినిగూర్చి 'యేకార్యమునైనను జేయగల సర్వశక్తిమంతురా'లని భావించు చందమున మాతయనుపేరు చెప్పినంతనే దివ్యశక్తియనియు సర్వశక్తిస్వరూపిణియనియు మనకు స్ఫురించును. మనయందు నిద్రాణమైయున్న కుండలినీశక్తియే జగన్మాత. ఆమె నారాధింపనిదే మన మెన్నటికిని ఆత్మజ్ఞానమును బొందజాలము. దయామయి, శక్తిస్వరూపిణి, సర్వమయి—యనునవి లోకమాతృవిశేషణములు. విశ్వశక్తి పుంజీభావమే జగన్మాత; విశ్వమందు ఏ శక్తి వ్యక్తమగుచున్నను అది మాతయే. ఆమెయే ప్రాణము, ఆమెయే జ్ఞానము, ఆమెయే ప్రేమ. ఆమె విశ్వమందున్నను విశ్వముకంటె వేఱే. (శ్రీరామకృష్ణుడు ఆమెను దర్శించిన చందమున, గ్రహించిన చందమున) మనముకూడ ఆమెను దర్శింపవచ్చును, గ్రహింపవచ్చును,—ఆమె సాకార మాతృభావమున సుప్రతిష్ఠితులమైనచో, మన

* సంపూర్ణగ్రంథావళి I-442.

మే కార్యమునైనను జేయవచ్చును. ఆమె మన ప్రార్థనను అవిలంబితముగ సఫలమొనర్చును.

ఏరూపముననైనను ఏగుణముననైనను ఆమె మనకు తన్ను చూపుకోగలదు. లోకజననికి నామరూపములు రెండు నుండవచ్చు, రూపము లేక నామముమాత్రమే ఉండవచ్చు. ఈవివిధవైఖరుల ఆమె నారాధించుచుందు మేని నామరూపరహితమగు కేవల చిత్స్వరూపము నందుకోగలము.

శరీరమునందలి జీవాణువులన్నిటి సముదాయమే వ్యక్తి. ఇట్లే ప్రతిజీవియు ఒక అణువు. వానియన్నిటి సముదాయమే ఈశ్వరుడు. ఈశ్వరునకును పైది నిర్గుణబ్రహ్మము. శాంతస్థితియందుండు సాగరమే నిర్గుణబ్రహ్మము; అలలతో ప్రచలితమైయుండునపు డాసాగరమే జగన్మాత. ఆమెయే దేశకాలనిమిత్తములు. భగవంతుడే మాత. సోపాధికము, నిరుపాధికమునని యామెకు రెండు ప్రకృతులు (అవస్థలు) గలవు. సోపాధికావస్థయం దామె దేవుడుగను జీవుడుగను ప్రకృతిగను భాసించుచున్నది. నిరుపాధికావస్థయం దామె తెలియబడనిది, తెలియరానిది. అపరిచ్ఛిన్న బ్రహ్మమునుండియే జీవుడు, దేవుడు, ప్రకృతియునను త్రిపుటి వెలువడియెను. ఇదియే విశిష్టాద్వైతమతము.

జగన్మాతయం దొకచుక్క కృష్ణుడుగనయ్యెను, మఱియొకటి బుద్ధుడై యొప్పెను, వేఱొకటి క్రీస్తై భాసించెను. జగన్మాత్రంశము లోకమున మన తల్లియందు లేశమైనను గని యామెను ఆరాధించుచో మనకది మహత్త్వమును గలుగజేయును. భక్తిజ్ఞానములు వలయుచో ఆమెను ఆరాధింపుము.

# శ్రీ వివేకానందవా

## సాంఘికపరిషత్సముఖమున కావించిన ఉపన్యాసము*

## [అనువాదము : సంపాదకీయము]

(భారత) దేశీయులను సృష్టించినవాడు దేవు డట! యూరోపియనులను సృష్టించినవాడు దేవు డట! కాని మిశ్రజాతిని సృష్టించినవాడు వే ఱెవడో ఒక డట! దైవమునే ఘోరముగ దూషించుచు ఆంగ్లేయుడు చెప్పిన యీ మాట విన్నాము.

(ఇండియనోస్పెషల్కాన్ఫరెన్సు=) భారతీయ సాంఘికపరిషత్తువారి సంస్కరణాభినివేశమును ఘోషించుచు న్యాయమూర్తి రనడేగారు కావించిన ప్రారంభోపన్యాసము మన యెదుట నున్నది. ప్రాచీనకాలమున జరిగిన వర్ణాంతర వివాహోదాహరణాల పెద్ద జాబితా అం

* The Social Conference Address. The Complete works of Swami Vivekananda Vol. IV—303-307.

దున్నది. ప్రాచీనక్షత్రియుల ఔదార్యమును గూర్చి అం దెక్కువగ చెప్పబడియున్నది. విద్యార్థులకు శ్రేయస్కరమును గంభీరమునగు హితోపదేశ మందు కలదు. యథార్థసదుద్దేశముతోను మృదుశైలిలోను ఇవన్నియు ప్రకటింపబడియున్నవి. ఆఉద్దేశమును శైలియు నిక్కముగ ప్రశంసార్హములు.

పంజాబులో ప్రబలమై ఉన్న నూతనోద్యమమునకై ఒక గురుబృందము నేర్పఱుపవలెనను సలహా రనడేగారి ఉపన్యాసపుచరమ భాగమున నున్నది. ఒకానొక సన్న్యాసి స్థాపించిన ఆర్యసమాజమే ఆ నూతనోద్యమమని మన కర్థమగుచున్నది. ఉపన్యాసమందలి ఆ భాగమును జదివి ఆశ్చర్యపడి మనలనే మన మిట్లు ప్రశ్నించుకొందుము:—

బ్రాహ్మణునేమో దేవుడే సృజించినట్లున్నది. క్షత్రియుని (కూడ) దేవుడే సృజించెను. మఱి సన్న్యాసిని సృజించిన దెవరు?

మనకు తెలిసిన ప్రతిమతములోను సన్న్యాసు లింతకుముందును ఉండియున్నారు. ఇప్పుడును ఉన్నారు. హిందుసన్న్యాసు లున్నారు. బౌద్ధసన్న్యాసు లున్నారు. క్రైస్తవసన్న్యాసు లున్నారు. ఇస్లాముసైతము తన కఠినని షేధమును కట్టిపెట్టి పరివ్రాజకసన్న్యాసులను తండతండములుగా అంగీకరింపవలసివచ్చెను.

సన్న్యాసులలో తలలను పూర్తిగా గొఱిగించుకొన్నవా రున్నారు, కొంతభాగము గొఱిగించుకొన్నవా రున్నారు. పొడుగుకుంతలాలవా రున్నారు, కుఱుచకుంతలాలవా రున్నారు, పెనగొన్న కుంతలాలవా రున్నారు వేఱు రకరకకాల కేశపాశాలవారును ఉన్నారు. దిగంబరు లున్నారు, బొంతల ధరించువా రున్నారు, కాషాయాంబరు లున్నారు, పసుపు వన్నె బట్టలవా రున్నారు, కృష్ణాంబరులగు క్రైస్తవు లున్నారు, నీలాంబరు లగు ముసల్మాను లున్నారు. వివిధమార్గములలో తమ శరీరములను హింసించుకొన్నవా రున్నారు, తమ ఒడళ్లను సారోగ్యసుస్థితియం దుంచుకొనన భిమానించినవా రున్నారు. ప్రాచీనకాలమున ప్రతిదేశమునను ప్రతిపక్షనిర్మథనదక్షులగు సన్న్యాసులుగూడ నుండి యున్నారు. సహూంతరమార్గాలలో ఇట్టి ఉత్సాహమే ఇట్టివేషాలే మహిళలలోను — సన్న్యాసినులలోను చెల్లుచున్నవి. రనడేగారు భారతీయ సాంఘికపరిషదధ్యక్షులగుటే కాదు, వారు ధైర్యౌదార్య సమంచితులు. శ్రుతులలోను స్మృతులలోను పేర్కొనబడిన సన్న్యాసినులపట్ల ఆయనకు సంపూర్ణసంతృప్తియే ఉన్నట్లున్నది. ప్రజాపతి ప్రజలకు ఏర్పఱచిన ముఖ్యమైన కట్టుపాటు 'బిడ్డలను కనవలె పెంచవలె' నని యట! ప్రాచీనకాలమున ఒక రాజాస్థానమునుండి మఱొకరాజాస్థానమునకు పర్యటించుచు వాదములందు మహాతత్త్వజ్ఞులతో డీకొనుచుండిన బ్రహ్మచారిణులు బ్రహ్మవాదినులు పైని చెప్పిన 'కట్టుపాటు'నకు విఘాతము చేసి రని రనడేగారు తలంపలేదు. సన్న్యసించినవారికి మానవానుభవాల సమగ్రతయు వైవిధ్యమును ఉండ దని రనడేగారు బలీయులగు మగవారి విషయమున తలచిరి కాని అబలలవిషయమున ఆలాగు తలంప లేదు.

కావున ఆక్షేపణకు గుఱి కాక తప్పించుకొన్న ఆ ప్రాచీనసన్న్యాసినుల జోలియు వారి ఆధునికాధ్యాత్మికసంతతివారిజోలియు మనకు వలదు.

మగవాడుమాత్రమే ముఖ్యాపరాధి, రనడే గారి విమర్శభరమును మోయవలసినవాడు. ఆబరువుత్రొక్కిడి కతడు బ్రతుక గలడో లేడో పరీక్షింతము—

విశ్వవ్యాప్తమై యున్న యీ సన్న్యాస వ్యవస్థ మొట్టమొదట పుట్టుపొందినది మన వింతదేశములోనే అనుట సర్వపండితుల యేకాభిప్రాయముగ కననగుచున్నది. మఱి సంఘమును సంస్కరింపవలసిన ఆవశ్యకతయు నే డెక్కువగ మనదేశములోనే ఉన్నట్లున్నది!

గురువులలో కొందఱు పెండ్లిచేసికొన్న వారుగ నుండుట కొందఱు పెండ్లిమానుకొన్న వారుగ ఉండుట అను ఆచారము వేదము లెంత ప్రాచీనములో అంత ప్రాచీన మైనది. వివాహితుడై సోమపానముచేయుచు సర్వతో ముఖానుభవముగల ఋషి ముందు పుట్టెనా పెండ్లి మానుకొనుటచే మానవానుభవ రహితుడైన ఋషి ముందు పుట్టెనా అను విషయము నిప్పుడే నిర్ణయించుట కష్టము. పాశ్చాత్యగీర్వాణవిద్వాంసుల వినుకలి నివేదిక లపై ఆధారపడక స్వతంత్రముగనే, ఈ సమస్యను మనకు శ్రీరనడెగారే పరిష్కరించి పెట్టుదు రేమో! అంతవఱకు ఈ సమస్య, ప్రాచీనకాలపు 'కోడిపెట్ట - గ్రుడ్డు' సమస్య వలె నిలబడి యుండును.

వారు పుట్టిన వరుస ఏ మైన నగు గాక, వివాహితులగు గురువులస్థానమునకంటె శ్రుతు లలోను స్మృతులలోను పేర్కొనబడిన అవివా హితగురువుల స్థానము పూర్తిగా వేఱైనది. వారిది అస్ఖలితబ్రహ్మచర్యము.

వేదములలో కర్మకాండకు యజ్ఞానుష్ఠానము, ముఖ్యమగుట ఎంత నిజమో, జ్ఞానకాండకు బ్రహ్మచర్యము ముఖ్య మగుటయు అంత నిజమే.

ప్రాణుల నెత్తురు కార్చు యజ్ఞకరలు ఉపనిషత్ప్రవ కలుగ ఏల ఉండ రాదు? ఏల?

వివాహితుడగు ఋషి ఒకవై పుండినాడు, అతని క్రతువులు అర్థము లేని వని, విపరీతము లని, దారుణము లని, అతని నీతిజ్ఞత అస్పష్ట మని చెప్పుదుమేని, చెప్పవలసినదానిలో చాల తక్కువే మనము చెప్పినట్లు. బ్రహ్మచర్యనిష్ఠ లగు సన్న్యాసులు మఱొకవై పుండిరి. వారికి మానవానుభవాలు లేవు కాని, నీతికిని ఆధ్యాత్మికతకును ప్రభవస్థానముల ద్వారములను తెఱచినవారు వారు. ఆద్వారములగుండ వెలువడిన ప్రవాహమును జినులును, బుద్ధులును, శంకర - రామానుజ - కబీరు - చైతన్యులవఱకు నున్న సన్న్యాసులు—ముక్కుమునుగ పానము చేసి, అద్భుతాధ్యాత్మిక సాంఘికసంస్కారముల ప్రవర్తింపజేయు శక్తిని గాంచిరి. వారి సందేశమును ఎరవు కై కొన్న వారిలో పాశ్చాత్యులు మూడవతరమువారో నాల్గవతరమువారో అగుదురు. పాశ్చాత్యుల నుండి ప్రతిఫలించిన మన సన్న్యాసులసందేశమే సన్న్యాసులనే విమర్శించునంతటి శక్తిని మనసంఘసంస్కర్తలకు ఒసగుచున్నది.

భారతదేశమున ప్రస్తుతము మన సంఘ సంస్కర్తలకువచ్చు జీతములతోను వారికుండు అనుకూల్యములతోను పోల్చి చూతుమేని, భిక్షువులకు లభించు జీతమును అనుకూల్యము లును ఏపాటివి? నిశ్శబ్దముగను నిస్స్వార్థముగను సన్న్యాసి ప్రేమతో సల్పు సేవతో పోల్చి చూతు మేని సంఘసంస్కర్త సాధించుచున్నదే పాటిది?

కాని తమ గొప్పలను తామే చాటుకొను ఈకాలపు పద్ధతిని, పాపము, సన్న్యాసులు నేర్చుకోలేదు.

ఐహికజీవితము కల అనియు కల్ల అనియు హిందువు ఉగ్గుపాలతో నేర్చుకొన్నాడు. ఈ విషయమున అతడును పాశ్చాత్యులును ఏకాభిప్రాయులే. కాని పాశ్చాత్యున కింతకంటె ఏమియును తెలియదు. అతని నిర్ణయము చార్వాకుని నిర్ణయమే. "(ఎండ ఉన్నప్పుడే గడ్డిని ఎండబెట్టుకొనవలె) దొరికినప్పుడే జవురుకొనవలె". "ఈలోకము దుఃఖగర్తము. కావున మనకు దక్కెడి సంతోషలవములను యావచ్ఛక్తి అనుభవింతము గాక." మఱి హిందువున కన్ననో భగవంతుడును ఆత్మయు మాత్రమే సత్యములు. ఈ జగమునకంటె ఇంతంతనరానంత ఎక్కువ నిజములు. కావున దేవునకై యు ఆత్మకైయు, ఈజగమును విడనాడుటకు, హిందువు సదా సంసిద్ధుడే.

తన మోక్షముకొఱకును లోకహితముకొఱకును సర్వస్వపరిత్యాగముచేయవలె నను సహజోద్రేకము భారతదేశ మహిళలలోను మహాజనులలోను కలదు. దాని నణచుటకు ఆంగ్లీకృతులైన మనసోదరు లుద్యమించుచున్నారు. దేశప్రజలమనసులలోని త్యాగప్రవణత అట్టిదిగా ఉన్నంతవఱకును — అది సదా అట్టిదిగానే ఉండవలె నని మా ప్రార్థన— ఆంగ్లీకృతసోదరుల ఉద్యమము నెగ్గు ఆసపాటు ఏదీ?

సన్న్యాసులు అవివాహితులైనందున వారికి జీవితానుభవమున సమగ్రతయు వైవిధ్యమును ఉండ వట! ఇది క్రుళ్లిన శవమును బోలిన వాదము. ఈ వాదమును మొట్టమొదట ఉపయోగించుకొన్న వారు యూరపులోని ప్రాటెస్టెంటులు. వారియొద్దనుండి దానిని బెంగాలీ సంస్కర్తలు ఎరవు తెచ్చుకొన్నారు. దానినే ఇప్పుడు మనబొంబాయిసోదరులు అవలంబించినారు. బ్రాహ్మణాగ్రగణ్యుల వంశపూర్వులను గూర్చిన పురాణముల వక్కణమున కేమేని విలువ యున్నచో — ఆవంశపూర్వు లెంతో పేరు గాంచిన వారే! వారిపట్ల వారిసంతతి వారగు బ్రాహ్మణులకు ఎంత పితృభక్తియున్నదనుకొన్నను— ఈ సారికి, ముఖ్యముగ 'ప్లేగు' వ్యాధి వ్యాపించియున్న ఈరోజులలో, ఈవాద శవము, మరలి పైకి రాని రీతిగా అరేబియా సముద్రగర్భమున మునిగిపోవునని మేమాశించుచున్నాము.

మఱొక మాట. వివాహితులైనను జీవిత వివిధానుభవాల ఆస్వాదింప బొత్తిగా ఇష్టపడని తల్లిదండ్రులకు జన్మించిన బిడ్డలలో అధిక సంఖ్యాకులను పెంచి చదువు చెప్పించినవారు సన్న్యాసులును సన్న్యాసినులును.

ప్రతిశక్తిని దేవుడు మన కేదో ఒక ఉపయోగముకొఱకే ఇచ్చియున్నాడు లెండు. కాబట్టి సన్న్యాసులు బిడ్డలను కనకపోవుట తప్పే. వారు పాపులే! కోపించుశక్తియు కామించుశక్తియు క్రౌర్యమునెఱపుశక్తియు దొంగిలించుశక్తియు దోచుకొనుశక్తియు వంచించుశక్తియు— ఇవికూడ మనకు అలాగే ఈయబడియున్నవి. ఏలయన మనసంఘజీవితము సంస్కారమొందినను ఒందకున్నను దాని నిలుకడకు ఈశక్తులలో ప్రతిదియు మిక్కిలి ఆవశ్యకమే. వీనిని గూర్చి ఏ మందురు? 'వివిధానుభవ' సిద్ధాంతానుసారము ఈశక్తులనుకూడ నిందుపదనులో ఉంచుకోవలసినదేనా? అక్కఱలేదా? ఈ సంఘసంస్కర్తలు సర్వశక్తియగు భగవంతుని ఆయనసంకల్పములను ఆంతరంగికముగ ఎఱిగి

యున్నారు. కావునవారు పై ప్రశ్నకు ''ఉంచు కోవలసినదే'' అను జవాబు చెప్పక తప్పదు. పాలతుల తోడి పొత్తున, అత్రి విశ్వామిత్రా దులు క్రూరులై వర్తించిరి, వసిష్ఠవంశీయులు. 'రకరకాల అనుభవమును నిండు అనుభవ మును' గడించిరి. వివాహితులైన ఋషులలో అత్యధికసంఖ్యాకులు ఋక్కులను పాడుటయం దును సోమపానమందును ఎంత ప్రసిద్ధులో, వీలుకలిగిన వేళలందును తావులందును బిడ్డ లను కను ధారాళతయందును అంత ప్రసిద్ధులే. మనము అత్రివిశ్వామిత్రాదుల అనుసరింతమా? వసిష్ఠవంశీయుల అనుసరింతమా ? లేక పెండ్లి మానుకొని ఆధ్యాత్మికపరతకు బ్రహ్మచర్యము అనివార్య మనుటను నిలబెట్టిన ఋషులను అనుసరింతమా ?

ఇక సన్న్యాసులలో మామూలు పతితు లున్నారు, తమ లక్ష్యము నంటిపట్టుకొన లేని వారు, దుర్బలులు, దుష్టులు, వారు నిందా భారము మోయవలసినవారే.

లక్ష్యము మంచిదిగను నిర్వక్రమగను ఉండి, సన్న్యాసి దానిని చేరలేక స్ఖలనమొంద వచ్చు, అట్టి సన్న్యాసిసైతము—'ప్రేమింపకే ఉండుటకంటె ప్రేమించి కోల్పోవుట మేలు' అను సూత్రము ప్రకారము—గృహస్థునకంటె చాల పై మెట్టువాడే.

ఎప్పుడు కాని ప్రయత్నమే చేయని పిఱికి పందకంటె అతడు నీరుడే.

మన సంఘసంస్కర్తలమనువారు తమ శోధనదీపపు వెలుగును తమ అంతఃప్రవృత్తుల మీదికి మరలించిచూచుకొందు రేని ఒక్కొక్క నూఱుగురిలో పతితులగు వారు గృహస్థులలో ఎందఱో సన్న్యాసులలో ఎందఱో దేవదూతలు గుర్తింపవలసియుండును. దీనిని వ్రాసిపెట్టు దేవదూత మనహృదయమందే ఉన్నాడు.

ఒంటరిగా ఉండుట, ఏసాయమును తనకు వల దని త్యజించుట, జీవితఝంఝానిల ముల ఎదుర్కొనుట, ఎట్టి ప్రతిఫలమును కోరక పాటుపడుట, 'ఇది నావిధి' అను నిర్బంధకలుషితచిత్తము లేక పాటుపడుట, కల్ల ప్రేమచేతగాని లోభముచేతగాని బానిసల వలె బలాత్కరింపబడక, జీవిత మంతయు ఆనందముతో పాటుపడుట, స్వేచ్ఛతో పాటు పడుట — అనెడి యీ అద్భుతానుభవమును గుఱించి యే మందురు ?

ఈయద్భుతానుభవము సన్న్యాసికి మాత్రమే శక్య మగును. మతమునుగుఱించి ఏమి? అది ఉండవలెనా, పోవలెనా? అదిఉండు నేని, అందు నిష్ణాత లుండ వలెను, దానికై పోరాడు యోధు లుండ వలెను. మతమును జీవితతారగా కావించుకొన్న వాడు సన్న్యా సియే కావున మతమందు నిష్ణాతు డతడే. దేవుని యుద్ధభటు డతడే. అట్టిగల సన్న్యాసుల బలగ మున్నంత వఱకు ఏమత మంతరించును?

కాథలిక్కు సన్న్యాసులు ముందు కురవ డించుటను చూచి ప్రాటెస్టెంటులగు ఇంగ్లీషు వారును అమెరికనులును ఎందులకు గడగడ లాడుచున్నారు ?

రనడేగారికిని సంఘసంస్కర్తలకును దీర్ఘా యువుకల్గుత. కాని అయ్యో! ఓభారతభూమీ, ఆంగ్లీకృతమైన ఓభారతభూమీ, బిడ్డా, ఈ సంఘమందు సమస్య లున్నవనుటను, అవి నీకు గాని, నీపాశ్చాత్యగురువునకు గాని, అర్థమే కా వనుటను, అర్థ మగుటకంటె అవి మీాచే పరి ష్కృతము లగుట మఱింత అసంభవ మను టను—మఱువకు.

# భారతీయ దర్శన గ్రంథములు

శ్రీయుతులు పాటీలు తిమ్మారెడ్డి, ఎం. ఏ.
బోయనపల్లి రామారావు, బి.ఏ., గారలు

భారతీయప్రాచీనవాఙ్మయమున దర్శనములకు మిక్కిలి ప్రాధాన్యము గలదు. న్యాయ వైశేషికాది షడ్దర్శనములనామములు వినని భారతీయు డుండడు. ఇవి యార్షసిద్ధాంతప్రతిపాదకములగు దర్శనములు. ఇవిగాక భారతదేశమున విభిన్నమతసంప్రదాయములను ప్రతిపాదించు విభిన్నదర్శనగ్రంథములు వ్యాప్తియందు గలవు. ఆయామతసంప్రదాయముల మూలసిద్ధాంతముల నవి ప్రతిపాదించును. పెక్కుమంది షడ్దర్శనములు గాక అన్యదర్శన గ్రంథముల నెఱుగరు. వారుగూడ చాలమంది వాని పేరు లెఱుగుదురే కాని అవి ప్రతిపాదించు తత్త్వము నెఱుగరు. ఏదర్శనగ్రంథములచే భారతదేశము ప్రపంచమున ఆధ్యాత్మికౌన్నత్యముగలదేశముగా గుర్తింపబడెనో ఆ యాదర్శనగ్రంథములు ప్రతిపాదించు తత్త్వము సిద్ధాంతము తెలిసికొనుట భారతీయుని కర్తవ్యము. ఎంతసంక్షేపముగ వ్రాసినను ప్రతి దర్శనగ్రంథమునుగూర్చి పెక్కుపుటలు పెరుగుట సత్యము. కావున అతివిస్తృతికాకుండ ఆయాదర్శనముల మూలసిద్ధాంతముల వివరించుటకు యథాసాధ్య మీ యల్పజ్ఞానముచే ప్రయత్నము చేయబడును.

## నాస్తికదర్శనము

ఇంద్రవిరోచనులకథ ఉపనిషత్తులయందే కలదు. ఇరువురును తత్త్వజ్ఞానమునకై బ్రహ్మను సమీపించిరి. బ్రహ్మ "జలమునందును, దర్పణమునందును, నేత్రములందును కనిపించునదే ఆత్మ" అని చెప్పెను. ఈ మూడిటియందును శరీరము ప్రతిబింబించుట ఎల్లరెఱుగుదురు. కావున అదియే ఆత్మ యని విరోచనుడు తలపోసెను. ఈశరీరమునకు మూలబింబ మొకటి నిత్యధామమున కల దనియు అదియే ఆత్మ యనియు ఆత డెఱుంగ డయ్యెను. అంతటితో అతడు సంతుష్టు డయ్యెను. కాని ఇంద్రు డది మననముచేసినకొలది పెక్కు సందేహములు పొడమి మరల బ్రహ్మను జేరి తత్త్వోపదేశము గాంచెను.

విరోచనుడు తన తత్త్వజ్ఞానమును రాక్షసులలో ప్రచారము చేసెను. వారు దేహాత్మవాదు లైరి. ప్రహ్లాదాదులు వాస్తవికతత్త్వజ్ఞానమునందియు వాసనాబలముచే దేవతల సంగతిని దోషముగనే భావించిరి. వారికి దేహమే ముఖ్యము. కామోపభోగములే వారి లక్ష్యము. ఈదేహాత్మవాదము రెండుశాఖలై ఒకటిభారతదేశమునందును మఱొకటి విదేశములందును వ్యాప్తి గాంచెను.

సత్య మెప్పుడును భ్రాంతిహీనము. కుంఠితముకాని తత్త్వవిచారము ఎప్పుడును ఎవ్వరిని భ్రమావిష్టులను జేయదు. ఈ దేహాత్మవాదముపై పాశ్చాత్యభూములందు మిక్కిలి తర్కవితర్కములు జరిగినవి. కాలక్రమమున మానవ

మస్తిష్కములు కుంఠితములై దార్శనికవిచారణలను గ్రహింప నసమర్థములు కాగా స్థూల దృష్టిచే భోగప్రధానమగు ఆసురీతత్త్వము స్వీకృత మయ్యెను. కాని యూరపునందుకూడ సత్యగవేషణశీలురగువారు భౌతికవాదమును నిరాకరించి ఆస్తిక్యవాదమునే గ్రహించుచున్నారు.

సుకరాత్, కాంట్, షెల్లీ మొదలగు పాశ్చాత్యదార్శనికులపై భారతీయప్రభావ మెంతైన గలదు. కాని డార్విన్ ఐన్‌స్టీన్‌ల వంటి జడవాదులును లేకపోలేదు. ఐన్‌స్టీన్ సాపేక్షవాదము జడతత్త్వమునకు పరాకాష్ఠ. "ఇది యేమి?" అని యెఱుగుట కష్టము. దృశ్యమానమగు నిదంతయు అపేక్షాకృతము. దేశకాలపదార్థము లన్నియు పరస్పరసాపేక్షములు"—అని ఐన్‌స్టీన్ చెప్పెను

ఇది యేమి? అనుట అనుభూతి విషయము. దీని నన్వేషింపబూనినచో "న ఇతి, న ఇతి" యని నిషేధరూపమగు సమాధానము లభించును. సమస్తము కల్పితము, సర్వము సాపేక్షము. అని జడవిషయమున శాస్త్రములు కూడ పేర్కొనును. ఇట్లు పాశ్చాత్యజడవాదము సాపేక్షవాదమే చివరి దని తేల్చినది.

## లోకాయతదర్శనము

నేడు ప్రపంచమున మిక్కిలి వ్యాప్తిగాంచిన మార్క్సువాదము భారతదేశమున నాదికాలము నుండిగల దేహాత్మవాదమునకు మాఱురూపము. చార్వాకదర్శన మను పేర నేడు గ్రంథ మేదియు లభింపకున్నను ఈ దేహాత్మవాద సిద్ధాంతము లోకమున విశేషప్రచారము గాంచుటచే నిది లోకాయత మనబడెను. దీని ప్రవర్తకుడు బృహస్పతియట. ఇతడు దేవగురువ కన్న భిన్నుడు.

చార్వాకదర్శనము కేవల ప్రత్యక్షప్రమాణమునే అంగీకరించును. "గంధకాదిపదార్థముల మేళనముచే వేడిమి (అగ్ని) జనించునట్లు, పృథ్వీ జలాగ్ని వాయువుల మేళనముచే చైతన్యము జనించినది" అని యిది పేర్కొనును. ఇది యాకాశతత్త్వము నంగీకరింపదు. మొదట పాశ్చాత్యదార్శనికులుకూడ నాల్గే తత్త్వముల నంగీకరించుట యిట స్మరింప నగు నంశము. వారీ పరంపరలోనివారు.

చేతన శరీరమున కన్న భిన్నతత్త్వము కాదు. ఇది శరీరముతోనే నశించును. ఉచితానుచితముల లెక్కింపక శరీరమును సుఖపెట్టుటే పరమపురుషార్థము. పరలోకము, స్వర్గనరకములు, పునర్జన్మము ఇవి మూర్ఖుల మాటలు. భగవంతుడు లేడు. ధర్మము కర్మము సదాచారము - ఇవి యన్నియు తెలివిని వారిని మోసగించుటకు పుట్టినవి. పూజలు పురాణములు పారాయణములు శ్రాద్ధములు పిచ్చివారి చేష్టలు. ధూర్తులు తమస్వార్థమునకై శాస్త్రములు నిర్మించిరి. "ఋణం కృత్వా ఘృతం పిబేత్" ఏదో విధముగ సుఖ మనుభవింపుడు. ప్రపంచమున అర్థకామములు రెండే ముఖ్యములు. ధర్మమోక్షములు బూటకములు. నేటి ప్రగతి వాదము దీనికంటె విలక్షణమైనదా? నేటి జడవాదులు మార్క్సు కన్న చార్వాకునకు మిక్కిలి ఋణపడి యున్నారు. ఆతడే వారి ప్రథమాచార్యుడు. నేటిప్రపంచము ఈ మార్గమునెడల మిక్కిలి సుముఖమై యున్నది.

## బౌద్ధ దర్శనములు

బుద్ధుని నివృత్తిమార్గమునకు దూరస్థుని జేయుటకై తండ్రి పడినపాటులు వ్యర్థములైనవి. లోకపునశ్వరత్వమును గాంచిన యాతడు దుఃఖితుడై దానికి మార్గాంతర మన్వేషింప సమకట్టి సాధించెను. బుద్ధునిధర్మబోధ 'సత్యము, అహింస, దయ, ధర్మము'' అను నాలుగు ఆర్యమతసిద్ధాంతములపై ఆధారపడియున్నది. దాని కతనిశిష్యులు విస్తృతభాష్యములు రచించిరి. తత్ఫలితముగా బౌద్ధము మూడు ప్రధాన శాఖలుగ విడిపోయెను. అవి (1) హీనయానము, (2) మహాయానము, (3) వజ్రయానము. హీనయానము గౌతమబుద్ధుని ఒక మహాపురుషునిగ అంగీకరించును. అతడు సాధన ద్వారా నివృత్తినొందినవాడు. ఇది నివృత్తి ప్రధానమతము. అర్హతులారాధ్యులు. అర్హతుడగుట జీవితలక్ష్యము. మహాయానము భక్తి ప్రధానము. హీనయానమందలి భావుకులగు భక్తులు దీని నారంభించిరి. హీనయానమత గ్రంథములు పాలీభాషయందు గలవు. మహాయానమునకు సంస్కృతమున విస్తృతసాహిత్యము కలదు. మహాయానపంథీయుల కారాధ్యుడు 'బోధిసత్త్వుడు'. ఇత డవతారవ్యక్తిగాని సామాన్యమహాపురుషుడు గాడు. బౌద్ధధర్మమున తరువాత తాంత్రికసాధనలు మొండయ్యెను. వానికి ప్రధాన్య మిచ్చినది వజ్రయానము.

బౌద్ధమున పెక్కురు మహావిద్వాంసులు విలసిల్లిరి. వారు దానికి దర్శనములు రచించిరి బుద్ధుడు ప్రత్యక్షమునే కాక అనుమానమును గూడ ప్రమాణముగ అంగీకరించెను. కావున బౌద్ధదర్శనము లీ రెంటిని స్వీకరించెను. దర్శన దృష్టిచే బౌద్ధధర్మమును (1) మధ్యమదర్శనము, (2) యోగాచారము, (3) సౌత్రాంతికము, (4) వైభాషికము – అని నాలుగు విభాగములుగ పేర్కొనవచ్చును.

## మధ్యమదర్శనము

ప్రాపంచికపదార్థము లన్నియు క్షణికములు. దేనికిని ఎట్టి స్థిరరూపమును లేదు. పరమాణువుల అవిరళప్రవాహధారయే ఆకృతులుగ ఏర్పడును. పరమాణువులును క్షణికములు. క్రియాస్వభావమే అస్తిత్వము, క్రియతో అస్తిత్వము సమాప్తమగును. క్షణికములే గాక సర్వమును దుఃఖస్వరూపములు కూడ. ఈదృశ్యజగతి ఎట్టిదో చెప్పజాలము. ఇది స్వలక్షణము – ఎట్లున్నదో అట్లేయున్నది. దీనికి భిన్నము సమానమునగు అస్తిత్వము మఱొకటి లేనందున దీనికి వేఱొకలక్షణము దుశ్శకము. సర్వము శూన్యము. ఏలన ఏపదార్థమునుగాని సత్తు, అసత్తు అని చెప్పలేము. ఈమతము ననుసరించి బౌద్ధికజ్ఞానముసత్యము, బాహ్యజగత్తు శూన్యము. అప్రాప్యప్రాప్తికి శంకించుట సాధనము 'పర్యనుయోగ'మే యోగము. గురూపదేశము స్వీకరించుట యాచారము. శూన్యత్వక్షణికదుఃఖరూపతాదులను భావించి శూన్యమున విలీన మగుటయే ముక్తి,నిర్వాణము—అనబడును. ఇదియే పరమప్రాప్యము. యోగాచారము'లు శిష్యుః కనుష్ఠేయములు.

## యోగాచారము

కేవలాచారముతో సంతృప్తి నందని బౌద్ధజనులు యోగసాధనల నవలంబించిరి. వారు దర్శనములను తమకుగా తీర్చిదిద్దిరి. దీని ననుసరించి 'బుద్ధికి గ్రాహ్యమగు పదార్థ మేదియు

లేదు, బాహ్యరూపములందు స్వయముగా బుద్ధియే మూర్తమైనది. వాస్తవమునకు గ్రాహ్యగ్రాహకగ్రహణములు మూడును పరస్పరాభిన్నములు. సమస్తము జ్ఞానమే. బుద్ధి (జ్ఞానము) స్వయ మనుభూతము, నానాత్వప్రతీతి భేదవాసనకు కారణము. ఈ వాసనా ప్రవాహము అవిచ్ఛిన్నము. సాకారపదార్థలాభముచేతనే మనకు సంతోషము తృప్తి కలుగుట చూచుచున్నాము. పదార్థనిరాకారభావధ్యానముచే తృప్తి లేదు. బాహ్యపదార్థములు శూన్యము. జ్ఞానమే సత్యము. దీని సాక్షాత్కారము - బాహ్యజగతినుండి నివృత్తిపొందియంతఃకరణమున తదుపలబ్ధి గాంచుటయే ముక్తి. జ్ఞానాస్తిత్వము నంగీకరించుటచే ఈ దర్శనము 'విజ్ఞానవాద' మని ప్రసిద్ధి కెక్కెను.

## సౌత్రాంతికము

మధ్యమదర్శనము భావస్తరమున జగదభివ్యక్తిని వ్యక్తీకరించినది. యోగాచారము భావస్తరముతోపాటు భావజగతినికూడ సాక్షాత్కరింపజేసినది. తర్కయోగములచే దీనికి పైమెట్టు దుస్సంభవము, సౌత్రాంతికదర్శనప్రవృత్తియే భిన్న మయ్యెను. దానిపై శాక్తదర్శనప్రభావము కలదు. దానిచే భుక్తిముక్తులు రెండింటికిని సాధకులు బయలుదేఱిరి. వజ్రయానతాంత్రికమార్గ మీ దర్శనమునే యనుసరించును. భావజగతి —— పదార్థముల బుద్ధిస్థితరూపము, బాహ్యస్థితదృశ్యరూపము రెండును సత్యము లని యీ దర్శన మంగీకరించును.

'అహం' శుద్ధజ్ఞానరూపము, 'ఇదం' జ్ఞానము కేవలజాగ్రత్స్వప్నములందే కలదు. సుషుప్తియం దది లోపించును. కాన నది 'అహం'వలె నిర్బాధజ్ఞానము కాదు. కావున 'అహం, ఇదమ్' జ్ఞానములు భిన్నములు. బాహ్యపదార్థాస్తిత్వము లేక 'ఇదం' జ్ఞానము లేదు. కావున జ్ఞాతజ్ఞేయము కాలేదు. ఇదం జ్ఞానము శూన్యము కాదు. ఇదం జ్ఞానముచేతనే బాహ్యపదార్థాస్తిత్వ మనుమానింపబడుచున్నది. ఆలయ విజ్ఞాన (అహం) ముండగనే ప్రవృత్తిజ్ఞానము (ఇదం) ఉండవచ్చును. కావున నవి రెండును భిన్నములు. ఏలన ఒక్కయస్తిత్వమే ఒక్కసారియే రెండురూపములం దుండదు. రూపవిజ్ఞానవేదనాసంజ్ఞాసంస్కారములు పంచజ్ఞానస్కంధములు. జ్ఞానేంద్రియములు తద్విషయములు రూపములు. అహంబోధ ఇదంబోధలు విజ్ఞానములు. ఈ జ్ఞానములచే ఉత్పన్నమగు సుఖదుఃఖాదులు వేదనలు. ఈ వేదనచే ఉత్పన్నమగు రాగద్వేషాదులు సంస్కారములు. విశ్వమున గల నామభేదములు సంజ్ఞలు. ఈ యైదు రూపములందు విస్తృతమగు జ్ఞానవృక్షమే ఆత్మ. ఈ వృక్షపు ఈ యైదుస్కంధములు దుఃఖరూపములు. పంచజ్ఞానేంద్రియములు వాని యైదువిషయములు మనోబుద్ధులు - ఇవి ద్వాదశ దుఃఖాయతనములు. రాగద్వేషాది సంస్కారసముదాయము దుఃఖసాధనలు. సర్వము క్షణికమను భావనయే ఈ దుఃఖపరిత్రాణమార్గము.

## వైభాషికము

బాహ్యఆంతరపదార్థముల రెండింటి యస్తిత్వ మంగీకరించుటచే ఈ దర్శనము 'సర్వాస్తివాద' మనబడును. ఇది జడవాదముదెస తిరిగి వచ్చెను. భుక్తిముక్తులు రెండిటిని సాధనయందు లగించుటచే సౌత్రాంతికుల వజ్రయానము తుదకనాచారదూషితమగుట చారిత్రకసత్యము. చార్వాకజడవాదమునే ఉన్నతరూపమున నీ దర్శనము స్వీకరించెను. ద్వాదశాయతనభిన్న

మగు నస్తిత్వము నిది యంగీకరింపదు. ఆత్మ వీనిలో నేదియు గానందున దానియస్తిత్వము నిది యంగీకరింపదు. మూర్తము (బాహ్యము) చిత్తము (అంతరికము) అని జగత్తు రెండువిధములు. ఈ రెండిటి యస్తిత్వము స్వతంత్రము, అనగా పరస్పరనిరపేక్షము.

## ఆర్హత (జైన) దర్శనములు

సర్వమును క్షణికమైనచో కర్మములకర్తయు క్షణికు డగును. రెండవక్షణమున నుండని కర్తకు పూర్వకర్మఫల మెట్లు లభించును? కావున కర్త క్షణికుడు కాడు. ఫలభోక్త నిజపూర్వకృతకర్మ ఫలము ననుభవించుట నెఱుగును. కాన అది స్థిర మనుట సత్యము. స్మృతి (ఎఱుక) అనుభవము లేకాధారములు. ఈ జగత్తు అనాది. సత్తు క్షణికము కాదు. అది యుత్పత్తివినాశ రహితము.

లోకమున చిత్ – అచిత్ అని రెండు తత్త్వములు కలవు. రెండిటి సమ్యగ్విచారమే వివేకము. అన్యవస్తువులను పనిగొనుట చేతన లక్షణము. తద్భిన్నము – అచిత్తు, జడము. లోకమున నైదు అస్తికాయములు(అస్తిత్వము గల తత్త్వములు) కలవు. అవి – జీవాకాశ ధర్మాధర్మ పుద్గలములు. జీవులు ముక్తులు ప్రాపంచికు లని రెండు తెగలు. ప్రాపంచిక జీవులందును కొన్ని మనోరహితములు (త్రస స్థావరములు) మఱికొన్ని మనస్సహితములగు ప్రాణులు. అవకాశము నిచ్చు తత్త్వ మాకాశము. ముక్తిసాధనము ధర్మతత్త్వము. ధర్మాచరణముచే జీవి యాలోకాకాశమున నరుగుటచే ముక్తి లభించును. అధర్మమే ముక్తి ప్రతిబంధకతత్త్వము.

స్పర్శరసవర్ణసహితతత్త్వము పుద్గలము. ఇది యణుస్కంధభేదముచే ద్వివిధము. దీని యణు రూపము భోగాశక్యము. పృథివ్యప్తేజోవాయువులు నాలుగును పుద్గలములు. కొందఱు జైను లేదు తత్త్వములు కైకొందురు. — అవి జీవాజీ వాస్రవ బంధ సంవర నిర్జర మోక్షములు. ఇందు జీవాజీవములు (ఆకాశధర్మాధర్మపుద్గలములు) మీఁద వివరింపబడినవి. బంధహేతు వాస్రవము. మనోవాక్కాయములచే నాస్రవము స్ఫురిత మగును. మిథ్యాదర్శన, అవిరతి, ప్రమాద, కషాయములు కారణముగా ఆస్రవముద్వారా జీవునకు పుద్గలసంయోగ మేర్పడును. ఈ సంబంధమే బంధము. ఆస్రవరూపమగు సంసారప్రవాహమును మూయునది సంవరము. గుప్తి (మనోవాక్కాయముల నశుభము నుండి యడ్డగించుట) సమితి (అహింస) నిర్జరణము (తపముచే సంచితకర్మనాశము) అనుట సంవరస్వరూపము. సమ్యగ్దర్శనము, సమ్యక్చారిత్రము, సమ్యగ్జ్ఞానము. ఇవి మూడును మోక్ష మార్గములు.

జైనధర్మసాహిత్యము తద్దర్శనము లత్యంత విస్తృతములు. చారిత్రకులు దీనిని బౌద్ధమున కన్న ప్రాచీన మందురు. దీని ప్రవర్తకుడు ఋషభభగవానుడు. బౌద్ధధర్మమున నాదిదర్శనమగు మధ్యమాచారలక్ష్యమగు నర్హాతత్త్వము జైనధర్మనిత్యాత్మయగు నర్హాత్తు కన్న భిన్నమయ్యును సామ్యము కలది. జైనీయమగు నహింసాతత్త్వమే బౌద్ధమును జొచ్చెను. జైన ధర్మము తపస్సునకు మిక్కిలి ప్రాధాన్యము నొసగెను. బుద్ధుడుకూడ మొదట నుగ్రతప మొనర్చినవాడే.

జైనము బౌద్ధమునకన్న ప్రాచీనము. ఆ లోకాకాశదివ్యజగత్తులవిషయమున బౌద్ధదర్శ

నములకంటె విశదవర్ణనము కలదు. అట్లే జైన బౌద్ధసిద్ధాంతములందు క్షణికవాదవిషయమున మూలభేదము కలదు. జైనసనాతనధర్మముల నడుమ భేదము మిక్కిలి తక్కువ బౌద్ధధర్మము దాని కొకింతదూరమున్నట్టిది.

## ఆస్తికదర్శనములు

'వేదప్రమాణము నంగీకరింపనివాడు నాస్తికుడు' అని శాస్త్రకారులు నిర్వచించిరి. ఈ నిర్వచనమున భగవానుని పరలోకమును విశ్వసించుట విశ్వసింపమి యను ప్రశ్న రాలేదు. ఈ నిర్వచనము నేటి నాస్తికశబ్దార్థముకన్న భిన్నము. శరీరభిన్నమగు జీవు నంగీకరింపని వారు నేడు నాస్తికు లనబడుచున్నారు. మరణోత్తర జీవితమున విశ్వాసములేనివాడును నాస్తికు డన బడును. ప్రస్తుతము 'నాస్తిక - ఆస్తిక' శబ్దములు ప్రాచీననిర్వచనార్థమున ప్రయుక్తమైనవి.

ఆస్తికదర్శనము లారు కలవు. ఇవి యధికారిభేదము ననుసరించి తత్త్వమును ప్రతిపాదించును. సర్వజ్ఞులగు మహర్షులు తత్త్వజ్ఞానమున పరస్పరభేదము కలవారు కారు. శ్రుతి పురాణములను వారు సమగ్రముగ దర్శింపలేదని చెప్ప సాహసింపజాలము. కాని అందఱును అన్నివిషయములకు సమానాధికారులు కారు. సర్వుల బుద్ధి సమానసూక్ష్మగ్రాహితకలది కాదు. నిమ్నకోటివారికి స్థూలతర్కముచేతను, ఉన్నతవర్గాధికారులకు సూక్ష్మతర్కముచేతను తత్త్వబోధ చేయ వచ్చును. ఇట్లివి తరగతుల పాఠ్యపుస్తకములవలె క్రమము ననుసరించి రచింపబడినవి.

ప్రపంచతత్త్వము జీవతత్త్వము నెఱిగించుటే దర్శనశాస్త్రముల యుద్దేశము. ఈ జగత్తేమిటి? ఎవరు దేనికి నిర్మించిరి? దీని నియమము లేవి? మన మీ లోకమున కేల వచ్చితిమి? అను జిజ్ఞాస స్వాభావికము, ఆవశ్యకము. మన మెచటికేని పని చేయబోయినచో నా క్షేత్రస్వరూపము, కార్యోద్దేశ్యము నెఱిగి యుండు టావశ్యకముగదా! ఇక నెవ డెంత గ్రహింపగలడో వా డంతే గ్రహింపగలడు. ఈ దృష్టితో ఋషులు దర్శనశాస్త్రములు నిర్మించిరి. వైశేషిక-న్యాయ-సాఖ్య-యోగ-పూర్వోత్తరమీమాంసలు ఉత్తరోత్తర మున్నతశ్రేణికి చెందినవి. వీనియం దగపడు భేదము తాత్త్వికము కాదు, కాన తదితర దర్శనభేదములవలె నిందు హ్రాసవికాసభావన యసంగతము.

దర్శనశాస్త్రములు శ్రేణీక్రమమున వ్యక్తిని (అధికారిని) శ్రుతుల సమగ్రదర్శనమువఱకు గొనిపోవును. కావున వానిని ఆ శ్రేణీక్రమమున వివరించుట లగ్గు. ఇందు స్థూలబుద్ధియగు సామాన్యాధికారికొఱకు కణాదమహర్షి వైశేషికమును నిర్మించెను.

## వైశేషికము

ఈశ్వరుడు జీవుడు ఇవి నిత్యతత్త్వములు. ధర్మపాలనము లోకమున జీవికర్తవ్యము. అభ్యుదయమును నిఃశ్రేయససిద్ధిని ఒసంగునదియే ధర్మము. ధర్మాచారవిధానము వేదములందుగలదు. వేదము భగవద్వాణి. వేదము ధర్మములను ఉద్దేశ్య (నామనిర్దేశము) విభాగ లక్షణ (వస్తుధర్మనిరూపణము) ములచే వర్ణించును. ద్రవ్యగుణకర్మసామాన్యవిశేష సమవాయాభావములు సప్తపదార్థములు. ంచమహాభూతములు, కాలము, దిక్కు, ఆత్మ, మనస్సు. ఇవి నవద్రవ్యములు. ఈ

ద్రవ్యములే క్రియాగుణాశ్రమములు. సమవాయీ కారణములు. స్పర్శ, రూప, రస, గంధ, సంఖ్యా, పరిణామ, పృథక్త్వ, సంయోగ, విభాగ, పర, త్వాపరత్వ, సుఖ, దుఃఖ, బు, ద్ధీచ్ఛా, ద్వేష, ప్రయత్న, గురుత్వ, ద్రవత్వ, స్నేహ, సంస్కార, ధ, ర్మాధర్మ, శబ్దములు – ఇవి యిరువదినాల్గు గుణములు. ఇందు రూప మేడు విధములు, రస మాఱు తెఱగులు, గంధము ద్వివిధము (సుగంధ దుర్గంధములు), బుద్ధి రెండు తెగలు (సంశయాత్మక, నిశ్చయాత్మక) నిశ్చయాత్మకబుద్ధి ప్రమ (విద్య). అనిశ్చయాత్మకబుద్ధియగు నప్రమ (అవిద్య) సంశయ విపర్యయ (వ్యతిరేకజ్ఞానము) స్వప్నము లని త్రివిధము. ప్రమాబుద్ధి ప్రత్యక్షానుమానముల యాధారముపై వెలయును. వేగ, భావనా, స్థితిస్థాపక భేదముచే సంస్కారము త్రివిధము. ఉత్సర్పణము, అపసర్పణము, ఆకుంచనము, ప్రసారణము, గతి అని కర్మ యైదు విధములు. సర్వ పదార్థములందు గల యేకత్వము సామాన్య తత్త్వము. పరమాణువులపార్థక్యమునకు కారణమగు వానియందలి యతీంద్రియతత్త్వము విశేష తత్త్వము. పదార్థముల నిత్యసంబంధము సమవాయము. ప్రాగభావ, ప్రధ్వంసాభావ, అన్యోన్యాభావ, అత్యంతాభావములు నాలుగును అభావములు

## న్యాయము

ప్రమాణ, ప్రమేయ, సంశయ, ప్రయోజన, దృష్టాంత, సిద్ధాంత, అవయవ, తర్క, నిర్ణయ, వాద, జల్ప, వితండా, హేత్వాభాస, ఛల, జాతి, నిగ్రహస్థానము లనెడు ఈపదునాఱింటి యథార్థప్రమ (జ్ఞానము) ముక్తికారణము. జ్ఞానమునకు ప్రత     అనుమాన, ఉపమాన, శబ్దములనెడి నాలుగు సాధనములు కలవు. ఆత్మ, ఆయతన (దేహము), ఇంద్రియ, అర్థ (విషయము), మనో, బుద్ధి, ప్రవృత్తి, దోష, ప్రేత్యభావ, ఫల, దుఃఖ, అపవర్గము లనబడు వీనిజ్ఞానమే మోక్షకారణము. ఇచ్ఛాద్వేషప్రయత్నసుఖదుఃఖజ్ఞానములు ఆత్మ(జీవ) చిహ్నములు. సంఖ్యా, పరిణామ, పార్థక్య, సంయోగ, విభాగ, ఇచ్ఛా, బుద్ధి, ప్రయత్నములు ఆత్మయొక్కయు భగవంతునియొక్కయు గుణములు. శరీరచేష్టలు ఇంద్రియములకు తద్విషయములకు నాశ్రయములు. పురాకర్మముచే శరీర మేర్పడినది. పంచజ్ఞానేంద్రియములు పంచభూతముల సూక్ష్మాంశములచే నేర్పడినవి. మనస్సు అణురూప మగు నంతరింద్రియము. బుద్ధి కేవలము జ్ఞానోపలబ్ధి మాత్రము, అనిత్యము.

గౌతమమహర్షి జల్పవితండాదులను యథార్థముగ గుర్తించి వానియెడల జాగరూకత వహించుయోగ్యత నార్జింప ప్రేరేపించుచున్నాడు. పదారములను స్థూలరూపగుణముల నుండి యుద్ధరించి వాని పరమాణురూపమును విశదముగ వర్ణించెను.

## సాంఖ్యము

కపిలమహర్షి పరమాణువాదమును అతిక్రమించి ప్రకృతిని ప్రతిపాదించెను. సాంఖ్యమున జగద్వివేచన సీమారేఖ నందుకొనెను. పండితులు నేడుపలబ్ధమగు సాంఖ్యసూత్రముల నంగీకరింపరు. సాంఖ్యదర్శనముపై శ్రీధర కృష్ణుని కారికలే ప్రామాణికములుగ స్వీకృతములైనవి.

మూలమున – ప్రకృతి పురుషుడను రెండు అనాదితత్త్వములు కలవు. ప్రపంచమున

ప్రకృతి, వికృతి, ప్రకృతి - వికృతి, ఉభయ భిన్న మని నాలుగు విధములగు పదార్థములు కలవు. ప్రకృతి దేనికిని కార్యము కాదు, కావున నది కేవల ప్రకృతి, ప్రకృతిచే మహత్తత్త్వము దానిచే అహంకారము: అహంకారముచే పంచతన్మాత్రలు జనించెను. తన్మాత్రలచే పంచమహాభూతములుత్పన్నమయ్యెను. మహత్తత్త్వము, అహంకారము, తన్మాత్రలు - ఇవి ప్రకృతి వికృతి స్వరూపములు. జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములు, పంచభూతములు, మనస్సు.—ఇవి కేవల వికృతులు. జీవు డుభయభిన్నుడు, నిర్లిప్తుడు, పురుషుడు చేతనుడు, ప్రకృతి యచేతనము. పురుషసామీప్యముచే ప్రకృతియందు చైతన్యము ప్రతీతమగును. ప్రకృతిపురుషవివేకముచే నిజనిర్లిప్త స్వరూపజ్ఞానమే మోక్షకారణము.

సత్త్వరజస్తమము లనెడు త్రిగుణసామ్యావస్థయే ప్రకృతి. సుఖదుఃఖమోహములు క్రమముగ ఆమూడు గుణముల ధర్మములు. ఈ సర్వప్రపంచము ప్రకృతిజన్యమగుటచే త్రిగుణాత్మకము. అహంకారము త్రివిధము. దాని సాత్త్వికాంశముచే మనస్సుతోపాటు జ్ఞానేంద్రియ కర్మేంద్రియములు, తామసాంశముచే తన్మాత్రలు జనించును. రాజసాంశము రెండింటికిని ప్రేరకము. ఒకటిప్రకృతి. మహత్తు అహంకారము, పంచతన్మాత్రలు - ఇవి యేడును ప్రకృతివికృతులు. పంచభూతములు, జ్ఞానేంద్రియములైదు, పంచకర్మేంద్రియములు మనస్సు - ఇవి పదు నాఱును వికృతులు. ఇట్లివి యిరువదినాల్గు తత్త్వములు: ఇరువదియైదవతత్త్వము పురుషుడు.

పురుషులు పెక్కురుగలరు. వారు పరస్పర భిన్నులు. అతడు చేతనుడు భోక్త. క్రః కర్తృత్వము నతడు తనయం దారోపించుకొనును. పుణ్యవశమున పురుషుడు త్రివిధ దుఃఖనాశము నిచ్ఛగించినపుడు ప్రకృతి యాయిచ్ఛను సఫల మొనర్చును. పురుషునకు భోగేచ్ఛ లేనిచో ప్రకృతి తనంతశాంతించును. ఏలన ప్రకృతి తాను పురుషోపభోగమునకై యత్నించునే గాని తనకొఱకు కాదు. కావున వాసనలు నశించినచో ప్రకృతి బంధనములను పెంచజాలదు.

బౌద్ధదర్శనములు అసత్తునుండి సత్తు జన్మించినట్లు అంగీకరించును. న్యాయము సత్తునుండి యసత్తు జన్మించిన దనెను. సాంఖ్యము సత్తునుండి సత్తుయొక్క ఉత్పత్తినే ప్రతిపాదించెను. ఏ పదార్థమునుండిగాని తద్విరుద్ధపదార్థము జన్మింపదు. ఏ పదార్థము ఏ పదార్థముచే అన్వితమో (వ్యాప్తమో) దాని కదియే (వ్యాపకము) కారణము. పదార్థములు నశింపవు. అవి కేవలము 'తిరోభవించును' అను సాంఖ్య మూలతర్కము.

(సశేషము)



ధర సింహాసనమై, నభంబు గొడుగై, తద్దేవతల్ భృత్యులై,
పరమామ్నాయము లెల్ల వందిగణమై, బ్రహ్మాండ మాగారమై,
సిరి భార్యామణియై, విరించి కొడుకై, శ్రీగంగ సత్పుత్రియై—
వరుస న్నీ ఘనరాజసంబు నిజమై వర్ధిల్లు నారాయణా.

.బమ్మెరపోతరాజు.

# శ్రీ రామకృష్ణ గురుదేవస్మృతి

పమిడికాల్వ చెంచు నరసింహశర్మగారు

1. అన్నియును నొక్క లక్ష్యమే యందు ననుచుఁ ద్రిమతభావసమన్వయ మమరఁజేసి
యనుభవంబున జూపితి వనఘ, లోకహితము మదినూని శ్రీరామకృష్ణమౌని ॥

2. నను నీ యాత్మజుగా గణించి కరుణన్ గన్పట్టు మమ్మా, జగ
జ్జననీ, యం చెద నేడ్చి యేడ్చి తుది సాక్షాత్కారభాగ్యంబు వాం
దిన బ్రహ్మర్షివరుండ వీవు గద! యేదీ నీమదిన్ సుంత మో
హానిబంధంబు? జగాన నే ఘనుఁడు భార్యం దల్లిగా జూచెనే? ॥

3. వీతక్రోధ భయాదిదుర్గుణుఁడవై వేదాంతవిజ్ఞాన సం
స్ఫీతాత్మోన్నతిఁ గామకాంచనజయశ్రీ గన్న వా డన్న వి
ఖ్యాతిం జెందుచు బంధమున్ గడచు విద్యన్ శిష్యలోకాళికిన్
జేతఃప్రీతిగ దెల్పి తీవు భగవన్ శ్రీరామకృష్ణప్రభూ ॥

4. అక్షరజ్ఞాన మెంతయు నందకున్న నక్షరజ్ఞాన మెంతయు నందఁ గల్గి
యతుల కైవల్యరాజ్యసింహాసనంబు నెక్కిన యతిప్రభుండ వీ వొక్కరుఁడవె ॥

5. మాటల్ పెక్కు లి కేల? నీగడుసు నేమంబూని గెల్పొందగాఁ
బోటీ సేయు జితేంద్రియుం డొకడు నిబ్భూమండలిన్ లేడు నా
జాటింపం దగు శంక లేక పరమున్ సాధించి రూపింప నీ
వాటం బెవ్వరి కబ్బ లేదు గురుదేవా, నిక్క మూహింపగన్ ॥

6. ఎందఱి నాశ్రయించిన నరేంద్రుని సంశయ మీవు దక్క వే
రందిన యోగులున్ గురువు లార్చిరె? తీర్చిరె? జ్ఞానపుష్పని
ష్యంద మరందబిందు నిభ సద్వచనంబుల శంక లన్నిటిన్
బొందుగ దీర్చి సత్యగతి మూలము జూపఁగ నీక యొప్పగున్ ॥

7. సచ్చిదానంద రూప కాసారమందు సతము క్రీడించు పరమహంస వగు నీదు
నడలయందముఁ దెల్ప నెవ్వఁడు వలంతి? జ్ఞానమయి యగు నజ్జగన్మాత దక్క ॥

8. రామచంద్రుని సత్యధర్మప్రవృత్తి మార్గమున్, గృష్ణదేవు సమత్వయోగ
నియతి, నీ రెండు నీయంద నిల్చియుండు నందుచే రామకృష్ణుఁడ వందు రేమొ? ॥

9. అస్తమించిన యంత నర్యముని దీప్తివాయని వితాన నీ చిత్ప్రభావగరిమ
తఱుగ దెన్నఁడు నీ మూర్తి మఱుగువడిన దిపు డనుటె కాని శ్రీరామకృష్ణ మౌని ।

# ఆస్తిక్యం

శ్రీ పున్నావజ్ఝల సీతారామబ్రహ్మంగారు

## స్వాభావికం, సర్వజనీనం

అజ్ఞానంచేత మానవుడు మనః ప్రాణ దేహాల ద్వారా ఈషణ్మాత్రంగా వ్యక్తమవుతున్న పరమాత్మ శక్తులను, గుణాలను మనః ప్రాణ దేహ లక్షణాలుగా భావిస్తున్నాడు. బాహ్యామం చెప్ప లెచ్చటనో అన్వేషిస్తున్నాడు. ఏనాటికీ సఫలమనోరథుడు కాలేక పోతున్నాడు. గిరగిర తిరుగుతున్న భూమి నిలుకడగా ఉన్నదని, నిలుకడగా ఉన్న సూర్యుడు వేగంగా పోతున్నాడని భ్రమపడుతున్న ప్రమాదమే యిది. స్వయంప్రకాశమైన సూర్యుని కాంతి చంద్రునిమీద పడి వెన్నెల కాస్తున్నట్లుగా అంతరమందున్న భగవంతుని శక్తి మనః ప్రాణ దేహాలద్వారా వ్యక్తమవుతున్నది. అందుచేతనే చంద్రునికివలె మనః ప్రాణ దేహాలకు కూడ వృద్ధిక్షయాలుగలవు.

భగవంతుని మనం విడనాడుదామన్నా అతడు మనలను విడనాడడు. దేవుడు లేడనే వారు తమకు తెలియకుండానే దేవుని అంగీకరిస్తున్నారు. దేవుని మినహాయిస్తే మన ఆలోచనలు పరస్పర విరుద్ధంగా ఉంటవి; మన భావాలు హాస్యాస్పదంగా ఉంటవి; మనమాటలకు అర్థం ఉండదు; మనచేష్టలు అసంగతంగా ఉంటవి. మన మాటలను, భావాలను, ఆశయాలను పరిశీలిస్తే వాటన్నిటికి అనివార్యంగా దేవుని ఆశయం పొందుతున్నామన్న సంగతి తేటతెల్లంకాగలదు.

ఉదాహరణకు :

మనంచూచే ప్రతి వస్తువు పరిమితమైనదే. అపరిమితమైనదాని నెవ్వడు చూడలేదు; చూడలేరు. తుదకు ఆకాశాన్ని, కాలాన్ని భావిద్దామన్నప్పటికీ రెండువస్తువుల మధ్య స్థలాన్ని, రెండు సంఘటనల మధ్య కాలాన్ని మాత్రమే ఊహించగలం. కాని, ''పరిమితం'', ''సాంతం'', ''అవధి కలిగినది'' అనే మాటలను ''అపరిమితం'', ''అనంతం'', ''నిరవధికం'' అనే మాటలను ఆశ్రయించుకునే వ్యవహరిస్తున్నాము. అనంతమైనదానితో పోల్చినప్పుడే ''సాంతం'' అనే మాట అర్థమవుతుంది. ''అనంతం''తో పోల్చకపోతే, ''అనంతం'' నుంచి వేరుచేస్తే ''సాంతం''అనే మాటకు అర్థమే ఉండదు. అనంతం సాంతంగా వ్యక్తమవుతుంది. సాంతం అనంతాన్ని ఆశ్రయించుకొని, దానిని స్ఫురింపజేస్తుంది.

## నైతికదృష్టికి ప్రాతిపదిక

మననైతికదృష్టికి, ఉదారాశయాలకు, అభ్యుదయాని మానవత్వాని వన్నెతెచ్చే సకలసద్గుణాలకు, భవిష్యత్తునందు విశ్వాసాని కారణం భగవంతుడే. నీతిని మన్నించడం,

అవినీతిని నిరాకరించడం మనుష్య జన్మగొరవానికి అత్యవసరమని చెప్పనివారుగాని, అవసరం కాదని చెప్పేవారుగాని లేరు. ఒక్కొక్క ప్రత్యేకసమస్య పరిశీలనలో ఏది నీతి, ఏది అవినీతి అనేవిషయమై ఏ ఇద్దరి అభిప్రాయాలు ఒకటి కాకపోవచ్చు. మానవత్వానికి నీతి ప్రధానమన్న అంశాన్ని గురించి అన్ని వాదాలవారు, ఏవాదులు కానివారు కూడా ఏకీభవిస్తున్నారు. సమస్త నీతిసూత్రాల అంతర్యం, పరమ ప్రయోజనం మానవుని త్యాగశీలునిగా సుశిక్షితునిగా చెయ్యడమే. అది ఉత్తమ ప్రయోజనంకొఱకు మధ్యమ అధమ ప్రయోజనాలను త్యజించడమే కావచ్చు. ఇతరుల ప్రయోజనం కొఱకు స్వప్రయోజనాన్ని త్యజించడమే కావచ్చు. భావి ప్రయోజనం కొఱకు ప్రస్తుత ప్రయోజనాన్ని త్యజించడమే కావచ్చు. త్యాగాన్ని, అందుక్కావలసిన సాహసాన్ని, సంయమాన్ని అభినందించనివారు లేరు. లుబ్ధులు, స్వార్థపరులు, పరపీడకులు, పిఱికివారుకూడా త్యాగాన్ని, సాహసాన్ని కీర్తించేవారే. విషయలోలురుకూడా సంయమాన్ని ప్రశంసించేవారే.

దేవుడు లేకపోతే - ఉన్నదంతా భౌతిక తత్త్వమే అయితే-నేను బండిసున్నలోనుంచో, మట్టిముద్దలోనుంచో, సూక్ష్మ అణువులలోనుంచో వచ్చి, కొద్దిరోజులలో మరల బండిసున్నగానో, మట్టిముద్దగానో, సూక్ష్మ అణువులుగానో మాఱిపోవడం ముమ్మాటికీ నిజమే అయితే - జీవితం మూడునాళ్ళముచ్చటకంటే మఱేమి కాకపోతే - మన విద్యలకు, ప్రజ్ఞలకు, అనుభవాలకు, అనుబంధాలకు, ఆశయాలకు, అభివృద్ధికి అర్థమేమిటి? వాటికి పూర్ణత్వమెక్కడ? సార్థక్య మెక్కడ? ఉన్న నాలుగు రోజులు ఏవిధంగా వీలయితే ఆవిధంగా, ఎన్నివిధాల వీలయితే అన్నివిధాల సుఖపడక నాకు ఉన్నదానిని ఇతరులకు త్యాగంచెయ్యడ మెందుకు? త్యాగం ఎందుచేత మంచిపని?

నేను ఉంటేనే నాకితరులతో సంబంధం. నే నున్నంతవఱకే ఇతరులతో నాకు గల సంబంధం విలువైనది. నేను ఉన్నంతకాలం, నా కవసరమైనంతవఱకు నే నితరులతో సహకరిస్తుంటాను. నేనుపొందే ప్రయోజనానికిమించి, ఇతరులకు నేను త్యాగంచెయ్యడం ఎందుకు? నా సుఖంకొఱకు ఇతరులను వంచించడం ఎందుచేత మంచిపనికాదు? సమకాలికులకొఱకేకాక యికముందు పుట్టబోయే వారికొఱకు నాబ్రతుకు బండలుచేసికొనడం ఏవిధంగా ఘనకార్యం? తోడిమానవుల కొఱకే కాక ఒక సిద్ధాంతం కొఱకు, ఒక విశ్వాసంకొఱకు చేసే ఆత్మబలిదానాన్ని కీర్తించడంలోని రహస్య మేమిటి? అట్టి ప్రాణత్యాగాన్ని ప్రేరేపించే ప్రవృత్తి అంతర్య మేమిటి? అటువంటిత్యాగంచేసేవారు పొందే సంతృప్తి, ఆనందం ఎక్కడివి? ఎవరెస్టు శిఖరంమీద, భూగర్భంలో, సాగరమధ్యంలో, చంద్రమండలంలో ఏ మున్నదో తెలుసుకుందామన్న కుతూహలంతో, కేవలం జ్ఞానతృష్ణను తీర్చుకొనడానికి ప్రాణాలను తృణప్రాయంగా అర్పించగల సాహసానికి ఆధార మేమిటి?

జీవితానికి మించిన దేదీ లేకపోతే-జీవితం అంటే విషయభోగమే అయితే, జీవితంకొఱకు సాధ్యమైనదాని నెల్ల, అవసరమైనదాని నెల్ల త్యాగం చెయ్యడమే తెలివైనపని. జీవితాన్ని కాపాడుకొనడానికి బదులు త్యాగం చెయ్యడం ఏ విధంగా వివేకమైనపని? జీవితానికి మించిన దేదీ లేదనేవారుకూడా ఆత్మబలిదానానికే సాహసిస్తున్నారు. ప్రాణత్యాగంతోపాటు మన

శ్శరీరాలుకూడా త్యాగమైపోతున్నవి. త్యాగం చెయ్యబడేది త్యాగాన్ని ప్రేరేపించి, త్యాగంలో ఆనందం కలిగించేదానికంటె తక్కువైనదే. కనుక మనః ప్రాణ దేహాలకంటె అతీతమైనది, ఉత్కృష్ట మైనది, మనః ప్రాణ దేహాలను ప్రకాశింపజేసేది కలదని అజ్ఞాతంగా గ్రహించడమే త్యాగప్రశంస ఆంతర్యం. పంచేంద్రియ గోచరమైన సమస్త ప్రపంచం పరిమితమైనదని, పరతంత్ర మైనదని, దీనికి ఆధారంగా, ఆశ్రయంగా, అతీతంగా, అగోచరంగా స్వతస్సిద్ధమైన ఉనికి, స్వయంప్రకాశమైన జ్ఞానం, అమృతమైన జీవనం, నిరవధికమైన ఆనందం కలదని సూటిగా, స్పష్టంగా గ్రహించడమే ఆస్తిక్యం. ఆస్తికులం కామనుకొనడం ఆస్తిక్యాన్ని పరోక్షంగా మన్నిస్తూ ప్రత్యక్షంగా ప్రతిఘటించడమే. ఆస్తికుని విశ్వాసానికి, నాస్తికుని ధిక్కారానికి, అజ్ఞేయవాది సంశయానికి ఆధారం దేవుడే.

# శ్రీమద్భాగవతము - శ్రీకృష్ణసందేశము

[శ్రీమత్పరిభవానందవాణి]

## చతుర్థస్కంధము

[గత సంచిక తరువాయి]

### తృతీయాధ్యాయము

రాజు వారిని సత్కరించి వికసితహృదయుడై ఇట్లనెను :—

మహర్షులారా, మీరు బ్రహ్మపుత్రులరు, జనలోక నివాసులరు. భువిని మీసమాగమము నొందుట నా పరమభాగ్యము. ఆహా మీ సాంగత్య మెంత మధురము! ఎంత ఆనంద జనకము! మీరు ఐక్యమునే చూతురు గాని భేదదృష్టి మీకు లేదు. మీరు మానవకోటికి సుహృత్తము లని నే నెఱుగుదును. మిము వేడుకొందును మానవుల కేది నిరతిశయ శ్రేయమో దానిని దయచేసి దెల్పుడీ.

ఆమహర్షులలో జ్యేష్ఠుడగు సనత్కుమారు డి ట్లనెను—

ఓ రాజా, నిను సంధించుటయు నీతో సల్లాపించుటయు పరమానందకరము. ఈశ్వరవాణి యందు ప్రీతి వహించు వారి డెందములనుండి సకలకల్మషములును క్షాళితములై పోవును.

మానవతతికి ఈక్రింది వత్యంతశ్రేయస్కరము లని లోకమునందలి సకలశాస్త్రగ్రంథములును తాము తేల్చుకొని పిదప ప్రకటించినవి:—

(1) భగవంతునితో అభిన్నమైన ఆత్మయం

దానందించుచుండుట. భగవంతుని ప్రేమిం చుట.

(2) విశ్వమున వే ఱెద్దానియందును సంగము లేకుండుట.

ఈ పరమార్థప్రేమను నిస్సంగత్వమును మెట్టుమెట్టుగ పెంపొందించుకోవలెను. పెంపొందించు సాధనములు—విశ్వాసాదరములు, పరమార్థవిచారము, ఆధ్యాత్మికసాధనలందు శ్రద్ధ, బ్రహ్మసాక్షాత్కారసిద్ధులగు మహాత్ముల నారాధించుట, దేవునివాణియం దానందించుట, ఐహికులపొత్తును మానుకొనుట ఏకాంతమందలి ప్రేమ నలవఱచుకొనుట, సత్యము, అహింస, వేదాధ్యయనము, ఇంద్రియజయము, కామక్రోధ లోభ మోహ మద మాత్సర్యముల అణచుకొనుట, అన్యమతములను దూషింపకుండుట, సుఖ దుఃఖ జయాపజయాది ద్వంద్వముల నోర్చుకొనుట, భగవద్గుణవైభవసంకీర్తనము.

వీనిచే భగవత్ప్రేమయు ఐహికములందు నిస్సంగత్వమును కలుగును.

డెందమున ప్రేమ స్థిరముగ నాటుకొనగానే మానవుడు స్వతంత్రుడును మానవకోటికి గురువు నగును. అతడు క్రొత్తజన్మము గాంచినట్లే. అతని అహంకారము జ్ఞానాగ్నిలో భస్మమై పోయినది.

అహంకారమే అజ్ఞానకారణము. అహంకారము అణగగనే ఆత్మజ్ఞానము పూర్ణప్రకాశముతో వెలుగొందును. ఆత్మసాక్షాత్కారము కలుగును. నానారూపమగు విశ్వము, అందలి సుఖదుఃఖములతోపాటు, స్వప్నమో అనదగినట్లు మాయమై పోవును. ఏకమును చిదానందఘనము నగు ఆత్మ శేషించును.

విషయములను ధ్యానించుచుండినచో, ఆ విషయములవంకకు ఇంద్రియములు ఆకృష్టములగును. ఇంద్రియములు ఆకృష్టములు కాగానే మనస్సు వానియందు సక్త మగును. మనస్సులో సంగము వర్ధిల్లుకొలది, మానవుని వివేకము నశించును. నష్టవివేకుడు వంచితుడగును. వంచితుడు స్మృతిభ్రంశమునొందును, స్మృతి చెడుటతో ఆత్మజ్ఞానము పోవును. ఈ జ్ఞాననాశనమునే వివేకులు ఆత్మనాశన మని పేర్కొందురు? ఆత్మయే నష్టమగునేని అంతకు మించిన నష్టము వేఱొకటి ఉండ గలదా? సమస్తమును మనకు ప్రియ మగుటకు కారణము ఆత్మ. ఆత్మ నష్ట మగు నేని, ఏమి మిగులును?

జ్ఞానమునకును దివ్యత్వవికాసమునకును ప్రబలతమములగు ప్రతికూలములు కామ లోభములే. అవి మానవునకు జడత్వమును అజ్ఞానమును గలిగించును. కావున మానవుడు వానిని తొలగించుకోవలెను.

రాజా, ప్రేమనాథుడగు భగవంతుని మాత్రమే తెలిసికొనుము. చేతనాచేతనముల కెల్ల అంతర్యామియై అనుభవైకగోచరుడగు స్వామి నెఱుంగుము. అత డొక్కడే నిత్యుడు. తక్కిన వెల్ల క్షణికములు. ఆయనను ప్రత్యక్షముగ జూచుట శక్యమే. సూక్ష్మాతిసూక్ష్మములగుండను. సూక్ష్మాతిసూక్ష్మములందును అతడు వ్యక్త మగుచుండును. ఆయన సర్వోపగతుడు. ఆయనే తత్త్వము. విశుద్ధుడును నిత్యముక్తుడు నతడే. అతడు నాకు శరణమగుగాక.

చీకటిలో రజ్జువు సర్పమువలె కనిపించినట్లుగా, అజ్ఞానమున ఏకమును నిర్గుణమునగు తత్త్వము అనేకవిశిష్టమగు విశ్వముగా కనిపించుచున్నది. వెలుతురు రాగానే సర్పము మాయమగునట్లు, జ్ఞానజ్యోతి ఉదయింపగనే నానా

రూపముగ నున్న విశ్వము మాయమై సచ్చిదానందము, అఖండసత్తు, అఖండచిత్తు, అఖండానందము — శేషింపను.

ప్రేమనాథుని పాదపద్మముల ధ్యానించువారలు ధన్యులు, ఏలయన సకలకలుషముల నుండియు హృదయబాధనుండియు వారు విడుపొందుదురు.

అతని సాక్షినిసే ఉపాసింపుము. సంసార సాగరమున కామక్రోధ లోభ మోహ మద మాత్సర్యములనెడి భయంకర తిమింగిలములు ఆటు కలవు. భగవంతుని కర్ణధారునింబోలె ఆశ్రయించి ఈసాగరమును నిర్భయముగను సులభముగను దాటుము.''

సనత్కుమారు నుపదేశముల శిర సావహించి రాజు పరమాత్మధ్యానానుసంధానపరుడయ్యెను. అతని ఏకాగ్రతా శక్తి వర్ధిల్లిన కొలదియు, అంతర్దృష్టిమున మతింతపరిపూర్ణత అతని అనుభవమును దాకుచుండెను. లోకమున నతడు జీవించుచున్నను పరిపూర్ణవిరక్తుడై యుండెను. అతని కహంకారము లేదు. అతనిహృదయము విశుద్ధము, లౌకికవస్తువులును లౌకికభోగములును అతని యింద్రియములను మనస్సును తమవంకకు ఆకర్షింపలేక పోయినవి.

కొన్ని యేండ్లు గడచిన పిమ్మట, అతడు తన కుమారుడగు విజితాశ్వుని రాజ్యమున నిల్పి తాను ఏకాంతవనప్రదేశముల కరిగెను. అచ్చట పెక్కు తపస్సాధనలు సాగించుచు ధ్యానపరజీవితమును గడపుచుండెను. అచిరకాలముననే అతని మనము ఐహికచింతలబాసి, భగవంతునందే గాఢముగ నిమగ్న మాయెను. బ్రహ్మముతోడి ఐక్యము అతనికి అనుభూతమాయెను. సంశయములు సమసినవి. హృదయగ్రంథులు విచ్ఛిన్నము లైనవి.

మరణము సమీపించుట గుర్తించి, అతడు ధ్యానమున కూర్చుండెను. పాంచభౌతిక శరీరము విరిసి పంచభూతములలో కలిసిపోయినది, సకలోపాధులనుండి ముక్తుడై అతడు బ్రహ్మమును ప్రాపించెను.



# దేశభక్తయోగి శ్రీవివేకానందస్వామి

మూలము
శ్రీ ఋషిసత్త్వానందస్వామి

అను
బ్రహ్మచారిణి లలిత

పుణ్యభూమి యని ప్రసిద్ధి కెక్కిన మన భారతావని మహనీయులగు పుత్రరత్నముల పెక్కుర ప్రసాదించినది ప్రపంచములో.

పరమత్యాగమూర్తియు, దయావతారుడును అగు బుద్ధభగవానుడు మనదేశమున జన్మింపలేదా? ఉజ్జ్వలకాంతిపుంజములతో లోకమునకెల్ల దేదీప్యమానమగు జ్ఞానజ్యోతిని వెదజల్లిన శంకరుడు భారతమాత అనుంగుపుత్రుడు కాడా? సర్వభూతములపట్లనే కాక కఠినపాపాత్ములపట్ల సైతము నిరవచ్ఛిన్నప్రేమామృత

ధార ఎవని హృదయమునుండి వెలువడుచుండెనో అట్టి చైతన్యమహాప్రభువు ఈ పుణ్యభూమియం దవతరింపలేదా ?

బుద్ధభగవానుని విశాలహృదయముతోపాటు, శ్రీశంకరుని విజ్ఞానప్రతిభయు, చైతన్య మహాప్రభుని ప్రేమ పీయూషవాహినియు కూడగా, ఈమూటిని తనలో కలుపుకొని ఆవిర్భవించిన ఒక మహాద్భుతవ్యక్తిని ఈయుగమున కాంచగల్గితిమి - అతడే శ్రీవివేకానందస్వామి.

భగవానుడు మానవరూపమున అవతరించునపుడు కొందఱ సఖులను తనతోడ తీసికొని వచ్చును. ఈభగవంతుని అంతరంగులు (దేవదూతలు) ఆదర్శమగు ఆధ్యాత్మజీవనము గడపుచు, త్యాగమూర్తులై భగవానునిసందేశమును ఇంటింటికి కొనిపోవుదురు. భగవానుడు శ్రీరామకృష్ణరూపమున భూమినవతరించుచు వివేకానంద బ్రహ్మానందాది మిత్రులను తనతోడ భూలోకమునకు కొనివచ్చెను. భగవానుని శాంతి, ప్రేమసందేశముల లోకమున వెదజల్లుటకుగాను ఆశాసౌరభమును జనసామాన్యమున కందజేయుటకుగాను భగవానుడు ఈమహానుభావులతోడ్కొని వచ్చెను. శ్రీవివేకానందస్వామి శ్రీరామకృష్ణుని శిష్యులలో అగ్రగణ్యుడును, మానవజాతిలో శ్రేష్ఠతముడునై యొప్పారెను. ఇట్టి అసాధారణ ప్రజ్ఞావంతులగు వ్యక్తులు లోకమునజన్మించుట చాల అరుదు. శ్రీరామకృష్ణుడు వివేకానందుని సప్తర్షిమండలమునకు చెందిన వాడనియు, నరరూపము ధరించిన నారాయణుడనియు నుడివెను. శ్రీరామకృష్ణునిచే లోకమునకు సమర్పింపబడిన అమూల్యమైనకానుకయే శ్రీవివేకానందుడు. ఈఅమూల్యరత్నమును స్వీకరించి సమస్తమానవజాతి చిరకృతజ్ఞమై యున్నది.

వివేకానందుని చిరస్మరణీయతకును గొప్పతనమునకును గల కారణ మేమి? అత డొక సన్న్యాసి అనియా? కాదు — లోకమందు వేనవేలు సన్న్యాసులు కలరు. అందు ఏ కొలదిమందిని మాత్రమే లోకము ఎఱుగును—స్మరించును. అతడు గొప్పజ్ఞాని అనియా? లేక అట్లాంటిక్ మహాసముద్రమును దాటి పశ్చిమదేశముల పర్యటించెననియా; లేక అత డొక గొప్ప వక్త యనియా? పై కారణము లేవియు కావు. విదేశముల పర్యటించినవారును, వక్తలును పెక్కురు కలరు. కాని ఏకొలదిమందినో జనులు స్మరించుచున్నారు. వివేకానందుడు దేశాభిమాని, దేశవాసులపట్ల అతనికి గాఢప్రేమ — దేశవాసుల కొఱకై అతడు చేసిన గొప్పత్యాగము. ఇవియే అతని గొప్పతనమునకు కారణము. ఈదేశభక్తి, ఈవిశ్వమానవప్రేమ ఆయన కెట్లు అబ్బినవి? అతడు తన గురువగు శ్రీరామకృష్ణునిద్వారనే పొందెను. ఈ దేశాభిమానమును గూర్చి శ్రీరామకృష్ణుడు ఎక్కువగ ప్రసంగింపలేదు. కాని టూకీగా సందర్భవశమున చెప్పిన మాటలలోని (సత్యమును) అసలు మర్మమును అసమానప్రజ్ఞాశాలియు, కుశాగ్రబుద్ధియు అగు నరేంద్రుడు గ్రహించెను. అనన్యగురుభక్తిపరాయణుడగు నరేంద్రుడు గురువాక్యముల వేదవాక్కులుగ స్వీకరించి, ఆఉపదేశముల కార్యరూపముగ పరిణతి నొందించుటకే తన జీవితమును ధారపోసెను.

ఒకప్పుడు శ్రీరామకృష్ణుడు వివేకానందుని ఇట్లు ప్రశ్నించెను. ''నీ జీవితోద్దేశ్య మేమి?'' బాలుడగు నరేంద్రనాథుడు ''సర్వదా నిర్

కల్పసమాధిలో మునిగి బ్రహ్మానందము ననుభవింప నిచ్చు'' అని తెలుప, వెంటనే శ్రీరామకృష్ణుడు అతనిని మందలించుచు ఇట్లనెను. ''ఛీ! నీ వింతటి మందబుద్ధి వని తలపలేదు. స్వార్థపరుడవై నీ ఒక్కని ఆనందము నే యాచించెద వనుకొనలేదు. మీదు మిక్కిలి, వేనవేలు ఆర్తులకును పరితప్తులకును, తన నీడను చల్లని ఆశ్రయమును, మన శ్శాంతిని ఒసంగ గల్గు ఒక విశాలవటవృక్షము బోలె నీవు నిలువ వలెనుసుమీ!'' వృక్షము ప్రచండ తాపమునకు కాలును, విపరీతశీతమునకు తల యొగ్గును, కుంభవృష్టిలో తడియును, తీవ్ర తుఫానుకు సైతము ఓర్చి అడ్డు నిల్చును, తానెన్ని కష్టపరంపరల పాలైనను లక్ష్యపెట్టక, ఎట్టివిచక్షణయులేక సర్వజీవులకు చల్లని నీడ యొసంగును.

దక్షిణేశ్వరమున తనగదిలో మంచముపై శ్రీరామకృష్ణులు ఆసీనులై యుండిరి. అర్ధ బాహ్యబోధమాత్రమే కల్గియుండిరి. నరేంద్రాదిభక్తులు చుట్టియుండిరి, తటాలున వారిట్లనిరి : ''జీవులపట్ల దయచూపుట కాదు, వలయునది; జీవసేవయే శివారాధనగా ఒనర్చ వలెను'' అంత నరేంద్రనాథుడు గదినుండి వెలుపలికి వచ్చి అచ్చటనున్న భక్తులతో ఇట్లనెను ''నేడు నే నొక నూతనవిషయమును వింటిని. నేను మఱికొంతకాలము బ్రతికియున్న పక్షములో ఇప్పుడు వినినవాక్యమును కార్యరూపమున పరిణితినొందింప ప్రయత్నించెదను.'' కుశాగ్రబుద్ధియగు నరేంద్రనాథుడు. పై రెండు సందర్భములలో భగవానులు నుడివిన వాక్కుల ఆదర్శముగా నిడికొని తన జీవితమును ఆదర్శసిద్ధికై ఏవిధముగ త్రిప్పి బద్ధకంకణుడాయెనో ఆయన జీవితగాథ పరిశీలించిన విశద మగును. ఆహా! వివేకానందుడు జీవితమును నిక్కముగ గురువాక్యపరిపాలనకే ధారవోసెను కదా!

శ్రీరామకృష్ణుని దేహత్యాగమునకు పిదప వివేకానందస్వామి ఆసేతుహిమాచలము పరివ్రాజకపర్యటన సలుపు సమయమున సర్వసామాన్యప్రజలతో పరిచయ మేర్పఱచుకొనెను. తన పాండిత్యము, హోదా సర్వమును మఱచి అన్నిజాతులవారితో కలసి మెలసియుండెను.

ప్రజల కటికదారిద్ర్యము, నిరక్షరకుక్షిత్వము, దౌర్భాగ్యదశయు కన్నులు నొవ్వ కాంచి, మాతృహృదయముబోలు ఆనవనీత హృదయము ద్రవించిపోయెను. ఈదుఃస్థితి నుండి ప్రజల నుద్ధరించు టెట్లని స్వామి వాపోయెను, నిద్రాహారములు మాని, తదేక చింతాగ్రస్తు డాయెను.

స్వామి దేశవాసులగు ధనికుల కొందఱ యాచించెను. కేవలస్వార్థపరాయణు లగుటచే వారు స్వామి ఉద్దేశ్యముల పెడచెవిని బెట్టిరి. స్వదేశమున ఎట్టి సాయము లభింపనందున స్వామి అమెరికాకు పయనించెను. చికాగో ప్రపంచమతమహాసభయందు, హిందూమత ప్రతినిధిగ పశ్చిమఖండయాత్ర సల్పినను, ముఖ్యకారణము ఏమన ఆదేశమున కొంత ధనము సేకరించి సోదరదేశీయుల నేవిధమున నైన సేవించి ఉద్ధరించు నవకాశములు గడింప జూచుటకే యని మన మెఱుగవలెను.

చికాగోలో ప్రథమోపన్యాసముతోడనే ప్రజల నాకర్షించియు, అటుపై ఖండాంతరములలో అఖండ కీర్తి ప్రతిష్ఠలు బడసినను, అభాగ్యులును, అథః పతితులును అగు తన భారత సోదరసోదరీ సహస్రముల దుఃఖముతే

స్వామి మనస్సును కలవరపెట్టుచుండెను. భారతదేశ దీనావస్థను స్వామి ఒక్క-క్షణమైనను ఏమరజాలడాయె!

ఒకప్పుడు స్వామి ఒకధనికురాలి అతిథిగ నుండెను. ఆమహిళ స్వామికై మెత్తని పడక ఏర్పాటుచేసెను. అర్థరాత్రిసమయమున స్వామి గదినుండి ఏడ్పుశబ్దము విన వచ్చెను. ఆస్త్రీ వెంటనే లేచి ఒక్క-పరువున స్వామిగదియొద్దకు వచ్చి చూచుసరికి స్వామి వాకిలియొద్ద వేసి యుండిన తొక్కు-డు చాపపై పొరలుచు పసి బాలునివలె వెక్కి- వెక్కి- ఏడ్చుచుండెను. అది కని ఆస్త్రీ ఎంతో జాలికొని స్వామిని కారణ మడిగెను. స్వామి ఇట్లు బదులిడెను. ''నీచే ఎంతో చక్క-గా ఏర్పాటుచేయింపబడిన ఈ మెత్తని పరుపుపై పరుండుటతోడనే నాదేశ దరిద్రసోదరుల అవస్థ కండ్లఎదుట పొడగట్టెను. అకటా! పరుండుట కొరక చింపిచాప కాని, దిండుగా ఉపయోగించుట కొరక ఇటుక కాని లేదాయె వారలకు! వారే నా ఆప్తులు, తోబుట్టువులును. వారట్లు బాధపడుచుండ నేనెట్లీ పాన్పుపై నిద్రింపగలను? వారి దీనస్థితి యోచించుచు దుఃఖమును ఆపుకోజాలక పోతిని.''

స్వామి పాశ్చాత్యఖండములలో అఖండ విజయము సంపాదించెను. మహిమాన్వితులగు పాశ్చాత్యశాస్త్రజ్ఞులే కాక, ఉన్నత కుటుంబములు, ఘనిష్ఠఖ్యాతి వహించిన సంస్థలును స్వామిని తమ అతిథిగ స్వీకరించుటచే, తమ భాగ్యమునకు గర్వించుచుండిరి. ఇట్లు స్వామి ఖ్యాతి నాల్గుమూలలను విస్తరిల్లెను. స్వదేశమునకు మరలిపోవుచున్న స్వామిని పాశ్చాత్య భక్తశిష్యు డిట్లు ప్రశ్నించెను ''స్వామిజీ, ఈ నాల్గేండ్లుగ మీరు అఖండభోగైశ్వర్యనిలయమగు ఈదేశమునందు నివసించియు, అత్యున్నతగౌరవపాత్రులైయొప్పుచు, ఎల్లరప్రేమాదరముల జూరగొనిన పిదప, అజ్ఞానమున మునిగియు, విపరీతాచార వ్యవహారముల కాలయమగు హిందూదేశము మీకెట్లు రుచించును?'' స్వామి ఇట్లు బదులిడెను ''నే నిచ్చటికి వచ్చుటకు ముందు, నాదేశమును సామాన్యముగ ప్రేమించితిని కాని ఇప్పుడో నాకు భారతభూమి ధూళిసైతము పవిత్రమైనది, ఆగాలి పవిత్రమైనది, ఆదేశమే పవిత్రపుణ్యభూమియైనది. అచ్చటికి వెళ్ళుట యనిన నాకు తీర్థయాత్ర వంటిది. ఆపవిత్రదేశధూళిపై పొరలు శుభ ముహూర్తమునకై ఎంతో ఆతుర పడుచున్నాను!''

ఇతడే వివేకానందస్వామి భారతదేశము పట్లను, దేశవాసులపట్లను కల్గిన ప్రేమాదరములే స్వామికి కీర్తిని తెచ్చినవి.

స్వామి ఇండియాకు తిరిగివచ్చుటతోడనే, పాశ్చాత్యదేశములలో తానార్జించినధనముతో బేలూరునందు శ్రీరామకృష్ణమఠమును దేశసేవార్థము స్థాపించి, సేవామూలమున జీవనాదర్శమును పొంద గల్గు మార్గ మేర్పఱచెను. ఈ బేలూరు మఠ మనిన స్వామికి ప్రాణముకన్న అధికప్రీతి. కాని తన దేశవాసులపైకల ప్రీతి ఇంతకు రెట్టింపు. కలకత్తాలో ఒకప్పుడు, తీవ్రమగుప్లేగువ్యాధితో ప్రజలు బాధపడుచుండ, బాధితుల సేవించుటకు తగు ధన సాహాయ్యము లభింపనందున, సేవాకార్యమునకై బేలూరుమఠమును సైతము విక్రయింప సమకట్టెను.

స్వదేశము పట్లను, దేశవాసులపట్లను స్వామికి కల్గిన ప్రేమ వర్ణనాతీతము. స్వామి ఇట్లనెను ''రాబోవు 50 సంవత్సరములపాటు

మనము ఉపాసింపవలసినది ఒక్క దేవతనే — మన భారతమాతనే. కనీసము ఈకాలము ఇతర దేవత లందఱును మన మనంబులనుండి తొలగిపోవుదురు గాక! ఒక్క దైవమే జాగ్ర దవస్థలో నున్నది—మన జాతియే—సర్వత్ర పాణిపాదములు సర్వత్ర శ్రోత్రములుగలిగి. సర్వవ్యాప్తమై యున్నది

దుర్బలత్వము, అజ్ఞానము మున్నగు పెక్కు దోషముల స్వామి గాంచినను తనదేశవాసుల పట్ల ఆశగాని, స్వజాతిపట్ల ప్రేమాదరములు గాని ఆయనకు ఇసుమంతయు తగ్గ లేదు. స్వామి ఇట్లు ఆశాపూరితముగ పల్కెను. ''ఈదేశమందే సీతియు, పారమార్థికతయు ఇంకను నిల్చియున్నవి. ఈ రెండుప్రవాహ ములు విస్తరిల్లి పాశ్చాత్యలోకముల ముంచి వైవవలెను. దానిమూలముననే పాశ్చాత్య జాతులకు నూతనశక్తి, ఉత్సాహముల ప్రసా దింప వలెను.'' ఈపవిత్రభూమిలో జన్మించు భాగ్యము కల్గినందులకు మనల గర్వింపగోరెనే కాని, మన లోటులను తలపోయుచు నిరాశ చెంద వల దని స్వామి హెచ్చరించెను, మిాదు మిక్కిలి స్వామి ఇట్లు చాటెను ''ఓ వీరభారత పుత్రా, ధైర్యము వీడకుము! నేను భారతీ యుడ నని గర్వింపుము! 'నేను భారతీయు డను. ప్రతిభారతీయుడును నాసహోదరుడు' అని సగర్వముగ ప్రకటింపుము. భారతీయుడు నాసోదరుడు, భారతీయుడు నా ప్రాణము, భార తీయదేవతలే నా దైవతము, భారతసంఘము నా బాల్యడోలిక, యౌవననందనవనము, వార్ధకవారణాసి.'' సోదరా, ఇట్లు చాటుము! ''భారతభూమి నామహోన్నతస్వర్గము. భారత శ్రేయమే నాశ్రేయము.''

దేశముపట్లను, దేశసోదరులపట్లను ఇట్టి ప్రేమలో ఒక్క లేశము మనకు కల్గియుండి నచో మన దేశస్థితి ఎంతయో మాఱియుం డెడిది. హిందూదేశము భూతలస్వర్గమై యొప్పారియుండెడిది.

భగినీ నివేదిత స్వామినిగూర్చి ఇట్లు పల్కెను ''స్వామి నిజమగు ప్రేమికుడు — భారతభూమియే ఆయనకు ప్రేమపాత్రమైనది —భారతశ్రేయస్సే ఆయన ఉచ్ఛ్వాస నిశ్వా సము — భారతోద్ధరణమే ఆయన ఏకైక వాంఛ — అతడు భారతములోనే పూర్తిగ లయించెను.''

మనదేశాభిమానులు ఇట్టి అద్వితీయ ప్రేమలో కనీసము కొంతభాగమైనను కల్గి యుండుటకై పాటుపడవలెను. నేను దేశ భక్తుడ నని 'సహజముగ తలంతుమేకాని, యథార్థమగు దేశభక్తి కల్గియుండుట చాల అరుదు. నిజమగు దేశభక్తి యన ఎట్టిదో స్వామిబోధనల నాలకించిన విశదపడగలదు. స్వామి ఇట్లు పల్కెను ''మీకు పరితాపము కలదా? దేవతాసంతతియు, ఋషిసంతతియు నగు కోట్లకొలది జనులు పశుప్రాయులై యున్నా రని మీరు పరితపించుచున్నారా? కోట్లకొలది నేడు తిన తిండి లేక మాడు చున్నా రని, కోట్లకొలది జను లనేకయుగ ముల నుండియు పస్తుండవలసి వచ్చుచున్నదని పరితపించుచున్నారా? అజ్ఞానము కాఱుమబ్బు వలె దేశమంతయు ఆవరించుకొని యున్నదని మీరు పరితపించుచున్నారా? అది మీ కేమియు తోపనీయకున్నదా? నిద్రపట్టనీయ కున్నదా? అది మీరక్తమునందు జొచ్చి, మీ రక్తనాళములందు ప్రవహించుచు హృదయ

స్పందనములతోపాటు కొట్టుకొనుచున్నదా? అది మిమ్మించుమించు పిచ్చివాండ్రను జేసి వైచినదా? ఇట్టి వినాశము కల్గినదే, యను తదేక చింత మిమ్మావహించినదా? మీపేరు ప్రతిష్ఠలనుగూర్చి, మీ భార్యాపుత్రులగూర్చి, మీ సిరిసంపదలగూర్చి పూర్తిగా మీరు మఱచితిరా? ఈపని మీరు చేసితిరా? దేశాభిమాని యగుట కిది మొదటిమెట్టు, మొట్టమొదటి మెట్టు.''

శ్రీవివేకానందస్వామి ఇట్టి శ్రేణికి చెందిన దేశాభిమాని. ఒకప్పుడత డిట్లనెను ''నా దేశములో ఒక్కకుక్క అయినను పస్తుండియున్నచో నేను స్వర్గమునకు పోవుటకునైన ఇచ్చగింపను. ''జనసామాన్యమును మన మలక్ష్యము చేసితిమి, వారిని త్రోసిపుచ్చితిమి. ఇదియే మనజాతియొక్క ముఖ్యదోషములలో ఒకటి, ఇందు మూలముననే మనజాతి అధఃపతన మొందినది. ప్రస్తుతము రాజకీయవ్యవస్థ కంటె సామాన్యజనమునకు కూడు గుడ్డ విద్య ఇచ్చి ఉద్ధరింపనిచో మనజాతి వికాసమునకు వేఱొండు మార్గము లేదు. కాన ఈ ఆదర్శము మీకండ్లయెదుట ఉంచుకొొం డనియే నేను కోరునది ''వారి వారి, ధర్మమును చెఱుపకుండ జనసామాన్యము నుద్ధరించుట.''

స్వామిజీ దేశముపట్లను, దేశవాసుల పట్లను ప్రేమ పెంపొందించుకోవలసిన దని హెచ్చరించెను. అత డిట్లనెను: ''నేను బోధించునది ప్రేమ — ప్రేమింపు డనియే నా బోధ.'' అత డిట్లనెను : ''నా బిడ్డా, ప్రేమ ఎన్నటికిని అపజయము నందదు. నేడు కాని రేపుకాని, యుగములు గడచినను—సత్యమే జయించును! ప్రేమయే విజయసింహాసన మధిష్ఠించునది. కాన మీ సోదరుల ప్రేమింపుడు.'' దౌర్భాగ్య సోదర సోదరీజనుల సాక్షాత్ దైవస్వరూపులుగ భావింపు డని స్వామి హెచ్చరించెను. అత డిట్లనెను: ''భగవంతుని చూడ గోరు వారు ఎచ్చటకోపోయి వెదుకనేల? ఈ పేదలును, ఈదుఃఖితులును, ఈదుర్బలులును దైవస్వరూపులు కారా? ముందుగా వీరల నేల అరాధింప రాదు?'' స్వామిజీ ముఖ్యముగ యువకుల ముందుకువచ్చి ఈఆదర్శమును స్వీకరింపగోరెను. ఆయనకు భారత యువకులపై విశ్వాసము, వారిపై పెక్కు ఆశలు కల్గియుండెను. యువకులు మొదట అకలంకులై ఆదర్శయువకులై మన వలెను— అటుపైననే లోకహితము — సేవాకార్యము చేయగోరెను. స్వామిజీ ఇట్లనెను: ''ధీరోదాత్తులును, నిష్కళంకులును అగు యువకులు నాకు కావలయును. ఇనుపకండరములు, ఉక్కు నరములు, వజ్రతుల్యసంకల్పము గల వారగు వేయిమంది యువకులు ముందుకు వచ్చినచో దేశము నంతయు ఒక్కపెట్టున మార్పొందింపవచ్చును.''

మనము భారతవారసులము కాగోరుచో, ఆఋషిసంతతికి చెందినవార మనిపించుకో కోరినచో, ఈదేశాభిమాని యగు యతిపుంగవుని దుందుభినినాదమునకు మేల్కొని—సరిగా తాళము వేసినట్లు నడచుకోకల్గినచో యథార్థముగ భారతపుత్రులము కాగలము.

# వార్తలు, విశేషాలు

## శ్రీ రామకృష్ణమఠము, మదరాసు - 4

### శ్రీ కృష్ణజయంతి

తే 22-8-1962 ది నాడు శ్రీ కృష్ణ జయంతి. నాటిసాయంకాలం స్విట్జర్లండు నందలి జినీవా రామకృష్ణ వేదాంత కేంద్రాధ్యక్షులగు శ్రీ నిత్యబోధానందస్వాములు సుమారొకగంటసేపు శ్రీమద్భాగవతమును జదివి వివరించిరి. తర్వాత శ్రీకృష్ణునకు విశేషపూజయు భజనయు రాత్రి ఒంటిగంటవఱకు జరుపబడినవి.

తే 26-8-1962 ది నాడు బహిరంగసభ సమావేశ మయ్యెను. శ్రీ శుకబ్రహ్మ రామస్వామిశాస్త్రులవారు శ్రీ కృష్ణావతారమును గూర్చి రెండుగంటలసేపు తమిళములో ఉపన్యసించిరి. జైన్కాలేజి ప్రిన్సిపాలుగారగు ఏ.ఎల్. కృష్ణనుగారు శ్రీకృష్ణునిగూర్చి ఆంగ్లమున కొంతసేపు ప్రసంగించినారు.

### శ్రీవివేకానందస్వామి శతతమజయంతి స్మారకభవనము

మఠమునకు దక్షిణమున క్రొత్తగ కొనబడిన స్థలమున స్మారకభవనమునకు 'పునాది'ని డాక్టరు సి. పి. రామస్వామి అయ్యరుగారు తే 23-9-1962 ది ఉదయం 8-30 గంటలప్పుడు వేసినారు.

మొదట వేదోక్తరీతిని శ్రీరామకృష్ణపూజ కావింపబడినది. శతతమజయంతి నిర్వాహపరిషత్సభ్యు లందఱును సమావేశమైరి. డాక్టరు సి. పి. రామస్వామి అయ్యరుగారు ఆధ్యక్ష్యము వహించినారు. శ్రీమత్కైలాసానందస్వామి గోష్ఠికి స్వాగతము చెప్పారు, కొనబడిన ఆస్థలమును స్వాధీనమునకు తెచ్చుటకు తోడ్పడినవారి కెల్ల కృతజ్ఞతను ల్పుకొన్నారు.

డాక్టరు సి. పి. రామస్వామిఅయ్యరుగారు తమ ప్రసంగంలో ఈలా గన్నారు — "దేశీయుల మనస్సులను హృదయములను ఆత్మను పునరుద్ధరించుటయు, బలముయొక్క పారమార్థికతను వ్యష్టియాత్మగౌరవమును విశ్వమానవైక్యమును నెలకొల్పుటయు — ఇదే శ్రీవివేకానందస్వామికి నిజమయిన స్మారకమగును. భారతీయతత్త్వశాస్త్రమునకు శ్రీ వివేకానందస్వామి కావించిన గొప్పసేవ ఏ మనగా, ఈరంగమున ఆయన సృజించిన శాస్త్రీయ విమర్శోత్సాహము'

శ్రీశుద్ధసత్త్వానందస్వాములు భవననిర్మాణప్రణాళిని వివరించి తోడుపడిన మహాజనులకు కృతజ్ఞత దెల్పుకొన్నారు.

శ్రీ ఎస్. నారాయణస్వామిగారు గోష్ఠికి వందనోపచారము చేసినారు.

# గ్రంథపరిచయం

[సమీక్షకు గ్రంథాలు పంపేవారు రెండేసి ప్రతులు పంపవలె అని మనవి]

రామకృష్ణ వివేకానంద రామతీర్థుల
జీవితోపదేశములు

కర్త : శ్రీ బులుసు వేంకటేశ్వర్లు, ఎం.ఏ. ధర, 2-50 న.పై. ప్రతులకు, బి. వి. అండ్ సన్స్, రామారావుపేట, కాకినాడకు వ్రాయాలి.

శ్రీ రామకృష్ణపరమహంస, శ్రీ వివేకానందస్వామి, శ్రీ రామతీర్థస్వాముల చరిత్ర వారి సుభాషితాలు గలదీ చిన్న గ్రంథం.

తెలుసుకొనేశక్తి మనకు కలగాలిగాని, ప్రతి జీవితం ఒక గ్రంథం, మహాపురుషులయిన పై మహనీయుల జీవితాలు నిస్తరంగ రత్నాకరాలు!

ఎంత తెలుసుకొన్నా తృప్తికలుగకపోవడం ఏకాన్త తెలిసినా ఆత్మానందంకలగడం మహనీయుల లీలలవల్ల కలిగే సంగతి. తమహృదయంలోని జ్యోతిని జగజ్జ్యోతిగా చేసుకొన్న శ్రీ రామకృష్ణులు, శ్రీ వివేకానందులు, శ్రీ రామతీర్థులు వారివాణులు, ధోరణులు హృదయాలకు ఉత్తేజనంకలిగించేవి. అందుచేత తెలుసుకోతగినవీ, మననంచేసుకోవలసినవీ, వాటివల్ల మనజీవితమార్గం సుగమమూ, సుందరమూ, సుఖమూ, ఇహపరతారకమూ కాతగినది!

శ్రీ వేంకటేశ్వరుల అనువాదమూ, దానికదేసాటి ఐనది.

—జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రి.

సీ. శౌర్యంబు గలుగుట జన్మసాఫల్యంబు, శాంత మాత్మవివేకసాధనంబు,
మానంబు దనకను మహనీయసంపద, సిగ్గుతో బ్రతుకు సంజీవనంబు,
సవినయవచనంబు సర్వవశ్యకరంబు, వెలయు నాచారంబు వెనుబలంబు,
దానంబు సేయుట తన కది దాఁచుట, సజ్జనసంగతి సౌఖ్య మొసఁగు,
గాన బుధు లీగుణంబులు మాన కెపుడు తగిలి మిమ్ము భజింతురు తలఁచి తలఁచి
కలితలక్ష్మీశ, సర్వజగన్నివేశ, విమలరవికోటిసంకాశ, వేంకటేశ.

—తాళ్లపాక పెదతిరుమలాచార్యుడు.

## శ్రీ వివేకానందస్వామి శతతమ జయంతి ప్రచురణములు

ఆంధ్రపాఠకులకు అమూల్యతరుణము

# శ్రీవివేకానంద సంపూర్ణగ్రంథావళి

ప్రతిభోజ్జ్వలులైన ఆంధ్రపండితులచే ఆంధ్రీకరింపబడి 10 సంపుటాలుగా ప్రకటింపబడుతున్నది. ప్రతి సంపుటంలోను దాదాపు 500 పుట లుంటాయి. అసలు ఖరీదు అట్టబైండుసెట్టు రు. 50 లు. కాలికోబైండుసెట్టు రు. 65 లు. పోస్టేజి ప్రత్యేకం.

స్వామిజిసందేశం మాతృదేశభక్తిభరితం, ప్రాణప్రదం, ఆత్మోత్తేజకరం, విశ్వజనీనం. అది సమగ్రంగా ఆంధ్రమహాజనులకు అందడం ఇదే మొదటిసారి. స్వామిజీది దివ్యదృష్టి. ఆయన అమోఘ పరిష్కారవిధానం సూచింపని ముఖ్యసమస్య అంటూ లేదు. ఆయన గ్రంథావళిని చదివినవారికి ఉత్సాహమును ఉదాత్తతయునూ కలుగక తప్పదు.

వివరములు :

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| మొదటి సంపుటము | : 575 | పుటలు | అట్టబైండు | రూ. 5/- | క్యాలికో | రూ. 6-50 |
| నాల్గవ సంపుటము | : 592 | ,, | ,, | రూ. 5/- | ,, | రూ. 6-50 |
| అయిదవ సంపుటము | : 544 | ,, | ,, | రూ. 5/- | ,, | రూ. 6-50 |
| ఆఱవ సంపుటము | : 585 | ,, | ,, | రూ. 5/- | ,, | రూ. 6-50 |

విలాసము :

మేనేజరు,
శ్రీ రామకృష్ణ మఠము
మైలాపూరు : : మద్రాసు - 4

# శ్రీ రామకృష్ణ లీలామృతము

## (లేక శ్రీరామకృష్ణ జీవిత చరిత్ర)

అనువాదకులు :

కీ. శే. వెదురుమూడి కృష్ణరావుపంతులుగారు, బి. ఏ; శ్రీ కందుకూరు మల్లికార్జునంగారు, బి. ఏ.

ప్రశస్తమైన వస్తువు, అకలంకమైన జీవితము, లోకోత్తరమైన సందేశము. దేహమును పులకరింపజేయు ఆధ్యాత్మికానుభవములు—శైలి సరళము, మధురము. భాష నిర్దుష్టము.—సర్వవిధముల నమూల్యమైన గ్రంథరాజము.

—శ్రీ పా. వే. రాజమన్నారుగారు, గౌ॥ ప్రధాన న్యాయమూర్తి, మద్రాసు.

* * * ఈ గ్రంథము విషయానురూపమై సుబోధమైన శైలిలో రచింపబడినదనుటకు ఎట్టి సందియమును లేదు. * * *

—శ్రీ పింగళి లక్ష్మీకాంతంగారు.

* * * ఆధునిక కాలములో వెలువడిన కొలది మహాగ్రంథములలో, అన్నివిధముల నిది యొకటి. * * *

—శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారు.

526 పుటలు (తృతీయ ముద్రణము) వెల : రూ. 5/-

---

# శ్రీ వివేకానంద జీవితచరిత్ర

## (శ్రీ చిరంతనానందస్వామి ప్రణీతము)

ఇందు శ్రీస్వాములవారి జీవితమున నింతకు పూర్వము గ్రంథస్థములుగాని ముఖ్య సంఘటన లెన్నియో శ్రీవారి సోదరశిష్యులవలన విని వ్రాయబడినవి. ఇది శ్రీ స్వాముల వారి సంపూర్ణ చరిత్ర!

నిర్దుష్టమైన భాష, అందమైన అచ్చు, ఆకర్షకమైన రూపము.

438 పుటలు (అష్టమ ముద్రణము) వెల : { సాదా ప్రతి రూ. 3-50; అట్ట బైండు రూ. 4/- }

---

# శ్రీ శారదాదేవి చరిత్ర

## (మూడవ కూర్పు)

రచయిత : శ్రీ చిరంతనానందస్వామి

ప్రతి స్త్రీయును పురుషుడును...చదువవలసిన గ్రంథ మిది...అమృతకలశము!... అనన్యసామాన్య నీతిమంజరి...తియ్యని తెలుగు...పాలవంటి శైలి... —ఆంధ్రప్రభ

246 పుటలు వెల : రూ. 2/-

అడ్రెసు : మేనేజరు, శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు - 4

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటము ౧౯ ౧౯౬౨, నొవెంబరు; శుభకృత్తు - కార్తికము సంచిక ౪

## విషయసూచిక

# శ్రీ రామకృష్ణ మఠ ప్రచురణములు

| | | |
|---|---|---|
| 740 పుటలు | శ్రీరామకృష్ణ సూక్తి సుధ (తొలికూర్పు) | రూ. 7/50 |
| 496 పుటలు | శ్రీ రామకృష్ణ లీలామృతము (ద్వితీయ ముద్రణము) | రూ. 5/- |
| 144 పుటలు | శ్రీ శారదాదేవి | రూ. 1-25 |
| 312 పుటలు | శ్రీ శారదా ప్రసంగములు | రూ. 3-00 |
| 540 పుటలు | శ్రీ రామకృష్ణ బోధామృతము (సంగ్రహ జీవితసహితము) | రూ. 3-50 |
| 432 పుటలు (సాదా) రూ. 3-50 | శ్రీవివేకానంద జీవితచరిత్ర (అట్టబైండు) | రూ. 4/- |
| 564 పుటలు | స్వామి - శిష్య సంవాదములు (ప్రథమ ముద్రణము) | రూ. 5/- |
| 344 పుటలు | బ్రహ్మానంద బోధనలు (ప్రథమ ముద్రణము) | రూ. 3-50 |
| 330; 324 పుటలు | సందేశతరంగిణి - 2 భాగములు (ఒక్కొ-క్క-భాగము) | రూ. 3/- |
| 402 పుటలు | పారమార్థిక సంభాషణలు | రూ. 3/- |
| 504 పుటలు | శ్రీమద్భగవద్గీత (ఆఱవ ముద్రణము) | రూ. 4/- |

| | |
|---|---|
| జ్ఞానయోగము 4 00 రాజయోగము | 2 50 |
| కర్మయోగము 1 50 భక్తియోగము | 1 50 |
| నారద భక్తి సూత్రములు ... | 3/- |
| పరతత్త్వప్రసంగము ... | 2/- |
| శ్రీ నాగమహాశయుని జీవితచరిత్ర ... | 1 25 |
| ప్రబోధరత్నాకరము ... | 2 25 |
| శ్రీ శారదాదేవి చరిత్ర ... | 2/- |
| దేవీమాహాత్మ్యము ... | 2/- |
| వివేకానందలేఖావళి (మొదటిభాగము) | 1 50 |
| వివేకానందలేఖావళి (రెండవభాగము) | 75 |
| శ్రీరామకృష్ణోపనిషత్తు ... | 25 |
| హిందూ మతము ... | 25 |
| అనుష్ఠాన వేదాంతము ... | 25 |
| కులము, సంస్కృతి, సామ్యవాదము | 1/- |
| వివేక సూర్యోదయము ... | 1 25 |
| భారతీయ మహిళ ... | 1/- |
| కఠోపనిషత్తు ... | 0 80 |
| శ్రీ పరమహంస నీతికథారత్నములు | 0 75 |
| గిరీశచంద్ర 0 75 భక్తిమార్గము | 0 50 |
| షికాగో నగరోపన్యాసములు ... | 0 50 |
| గురూపదేశములు 0 50 శ్రీకృష్ణవాణి | 0 40 |
| శ్రీ రామకృష్ణ ఉవాచ ... | 0 37 |
| శ్రీ వివేకానంద శంఖారావము ... | 0 37 |
| శ్రీ శారదా సూక్తి నవనీతము ... | 0 40 |
| నా సంస్కరణ యుద్ధవిధానము ... | 0 37 |
| నా గురుదేవుడు 0 40 బుద్ధ ఉవాచ | 0 37 |
| శ్రీరామకృష్ణుడు, వివేకానందస్వామి | 0 25 |
| శ్రీ పరమహంస జీవిత సంగ్రహము... | 0 25 |
| పరమహంస శ్రీరామకృష్ణుడు ... | 0 25 |
| నవీన భారతదేశము ... | 0 25 |
| తాపత్రయ చికిత్స ... | 0 25 |
| పవహారిబాబా 0 25 ముక్తిమార్గము | 0 19 |
| సర్వం విష్ణుమయం జగత్ ... | 0 19 |
| శ్రీ రామకృష్ణ ఆరాత్రికము ... | 0 12 |
| శ్రీరామనామసంకీర్తనము 0 6 యతిగీతము | 0 6 |
| నామతము 0 3 వి. సింహగర్జనము | 0 3 |

శ్రీ దొడ్డ భాగవతము - మొదటి సంపుటము రూ. 6-50; రెండవ సంపుటము రూ. 5-50;
మూడవ సంపుటము రూ. 7-50 (మూడును ఒకేపరి కొన్నచో: రూ. 18-50)

ఇవియేకాక సంస్కృత, ఆంగ్ల, తమిళ, హిందీ, కన్నడ గ్రంథములు,

వేదాంత కేసరి (ఆంగ్లము) శ్రీ రామకృష్ణ విజయము (తమిళము)

అను మాసపత్రికలును మాయొద్ద దొరకును

అడ్రెసు : మేనేజరు, శ్రీరామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు - 4



'అఖిలవిభు శరణొందుము, యా త్రిగుణంబ యతనికృప నీవ ననుభావ్య మగును వత్స.'

—శ్రీ శారదామణి.


# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము ౧౯ } ౧౯౬౨ - నొవెంబరు : : శుభకృత్తు - కార్తికము { సంచిక ౫


శ్రీః

## సౌందర్యలహరి

మూలము : శ్రీ శంకరభగవత్పాదులు

టీక : నే. భ.

అసౌ నాసావంశ స్తుహినగిరివంశధ్వజపటి
త్వదీయో నేదీయః ఫలతు ఫల మస్మాక ముచితమ్
వహ త్యన్త ర్ముక్తా శ్శిశిరకరనిశ్వాసగళితం
సమృద్ధ్యా యత్ తాసాం బహి రపి చ ముక్తామణిధరః ॥ ౬౧

| | | | |
|---|---|---|---|
| (హే) | (ఓ) | (సః) | (అది) |
| తుహినగిరి | మంచుకొండ | అన్తః | (తన) లోపల |
| వంశ | వంశపు | ముక్తాః | ముత్తెములను |
| ధ్వజపటి | పతాకయొక్క చీనాంశుక మైన దానా | వహతి (ఇతి) | దాల్చియుండుట (అనునది) |
| | | యత్ | ఏది కలదో దానివలన |
| అసౌ | ఈ | తాసాం | ఆముత్యాల |
| త్వదీయం | నీ | సమృద్ధ్యా | పెల్లిదముచేత |
| నాసావంశః | ముక్కు అనెడి వెదురు | బహిః అపి | వెలుపలకూడ |
| అస్మాకమ్ | మాకు | శిశిరకర | వామనాడీ మార్గపు |
| నేదీయః | మిక్కిలి చేరువయందున్నది. | నిశ్వాసగలితమ్ | వాయుచే రాలిన |
| ఫలమ్ | ఇష్టార్థమును | ముక్తామణిధరః | ముక్తామణిని దాల్చియు |
| ఫలతు | ఫలింపజేయనీ | (ముక్తామణిమ్ అధాత్) | న్నది. |

తా॥ హిమగిరివంశమునకు చీనాంశుకమువంటి తల్లీ, నీ ముక్కు కవెదురుగడ. అది మాకు మిక్కిలి చేరువగా నున్నది, మాకోర్కెల పండించును గాక. దానిలో ముత్యాలున్నవి. ఆ ముత్యాలపెల్లిదముచే అం దొకటి వామనాడివాయువుకు కొట్టుకొనివచ్చి నాసాగ్ర మౌక్తికరూపమున ధరింపబడియున్నది.

ప్రకృత్యా రక్తాయా స్తవ సుదతి దన్తచ్ఛదరుచేః
ప్రవక్ష్యే సాదృశ్యం జనయతు ఫలం విద్రుమలతా
న బిమ్బం త్వద్బిమ్బప్రతిఫలనరాగా దరుణితం
తులా మధ్యారోఢుం కథ మివ విలజ్జేత కలయా ॥ ౬౨

| | | | |
|---|---|---|---|
| హే సుదతి | ఓచక్కని దంతములు కలదానా, | త్వద్ | నీ |
| | | బిమ్బ | మేనినుండి |
| ప్రకృత్యా | స్వభావముచే | ప్రతిఫలన | ప్రతిబింబించిన |
| ఆరక్తాయాః | అంతటను ఎఱ్ఱనైన | రాగాద్ | ఎఱుపుచేత |
| తవ | నీ | అరుణితం | ఎఱ్ఱనైన |
| దన్తచ్ఛదరుచేః | పెదవుల మిసిమికి | బిమ్బం | దొండపండన్ననో |
| సాదృశ్యం | పోలికను | కలయాపి | నీయధరారుణిమ లేశముతోనైన |
| ప్రవక్ష్యే | చెప్పెదను | | |
| విద్రుమలతా | పగడపుతీగ | తులామ్ అధిరోఢుమ్ | తులదూగుటకు |
| ఫలమ్ | పండును | కథమ్ ఇవ | ఎట్లు |
| జనయతు | ఈనును గాక | నవిలజ్జేత | సిగ్గుచెందకుండును? |

తా॥ చక్కని దంతములు గల మాతా, నీ పెదవులకు సహజమైన ఎఱ్ఱదన మున్నది. దొండపండుకు గల యెఱ్ఱదనము నీప్రతిఫలనశక్తిపాతమే కాని సహజము కాదు. కావున నీయధరముతో తులదూగుటకు దొండపండు సిగ్గుజెందక తప్పదు నీ పెదవికి ఉపమానము చెప్పెదను. పగడపుతీగెలో ఫలము పుట్టునేని, అది ఎఱుపులో నీపెదవికి ఉపమానము కావచ్చు.

స్మితజ్యోత్స్నాజాలం తవ వదనచన్ద్రస్య పిబతాం
చకోరాణా మాసీ దతిరసతయా చఞ్చుజడిమా
అత స్తే శీతాంశో రమృతలహరీ మామ్లరుచయః
పిబన్తి స్వచ్ఛన్దం నిశి నిశి భృశం కాంజికధియా ॥ ౬౩

| | | | |
|---|---|---|---|
| (హే భగవతి) | (అమ్మా) | తే | ఆ చకోరములు |
| తవ | నీ | అమ్లరుచయః | పులుసునందు ఆశకలవై |
| వదనచన్ద్రస్య | నెమ్మోముచందురుని | శీతాంశోః | చంద్రుని |
| స్మితజ్యోత్స్నా | చిఱునవ్వువెన్నెల | అమృతలహరీమ్ | అమృతప్రవాహమును |
| జాలమ్ | మొత్తమును | కాంజికధియా | పులియబెట్టిన కడుగు నీరు అను భ్రాంతితో |
| పిబతామ్ | గ్రోలునట్టి | | |
| చకోరాణామ్ | వెన్నెలపులుగులకు | స్వచ్ఛన్దం | యథేష్టముగా |
| అతిరసతయా | మిక్కుటపు మాధుర్యముచే | నిశినిశి | ప్రతిరాత్రియు |
| చఞ్చుజడిమా | ముక్కులకు తిమ్మిరి | భృశంపిబన్తి | మిక్కుటముగ త్రాగుచున్నవి. |
| ఆసీత్ | కలిగెను | | |
| అతః | అందువలన | | |

తా॥ అమ్మా, నీ నెమ్మోము యొక చందమామ. చిఱునవ్వు దాని వెన్నెల. అది అత్యంతమధురము. దానిని వెన్నెలపులుగులు గ్రోలును. మిక్కుటపు తియ్యదనముచే వాని ముక్కులకు జడత్వము గలుగును. పుల్లగ నుండు పానీయమును గ్రోలిన ఆ జడత్వము పోవును. కావున నీముఖహాసచంద్రికతో పోల్చిచూడగా అసలు చంద్రునివెన్నెల 'పులియబెట్టిన కడుగు నీరు' అను భ్రాంతి గలిగి చకోరములు ప్రతిరాత్రియు దానిని మిక్కిలిగ త్రాగుచున్నవి.

అవిశ్రాన్తం పత్యుర్గుణగణకథామ్రేడన జపా (డా)
జపాపుష్పచ్ఛాయా తవ జనని జిహ్వా జయతి సా
యదగ్రాసీనాయాః స్ఫటికదృషదచ్ఛచ్ఛవిమయీ
సరస్వత్యా మూర్తిః పరిణమతి మాణిక్యవపుషా ॥ ౬౪

| | | | |
|---|---|---|---|
| జనని | అమ్మా | జయతి | సర్వోత్కృష్టమైయున్నది |
| అవిశ్రాన్తమ్ | అనవరతము | యద్ | ఏ నాల్కయొక్క |
| పత్యుః | సదాశివుని | అగ్ర | కొసన |
| గుణగణ | గుణతతియొక్కయు | ఆసీనాయాః | కూర్చున్నదగు |
| కథా | కథలయొక్కయు | సరస్వత్యాః | సరస్వతీదేవియొక్క |
| ఆమ్రేడన | మరలమరల వల్లించుటచే | స్ఫటికదృషద్ | చంద్రకాంతశిల కాంతివంటి |
| జపా | జపముగాగలదియు | అచ్ఛచ్ఛవిమయీ | ధవళకాంతినిండిన |
| జపాపుష్ప | దాసానిపూల | మూర్తిః | దేహము |
| చ్ఛాయా | (ఎఱ్ఱ) వన్నెగలదియు అగు | మాణిక్యవపుషా | మానికపుమేనుగా |
| తే | నీ | పరిణమతి | మార్పొందునో. |
| జిహ్వా | నాల్క | | |

తా॥ సదాశివునిగుణములను కథలను మరల మరల చెప్పుచుండుటే నీజిహ్వకు జపముగ నున్నది. పరమశివుని స్తోత్రరూపమున సరస్వతి నీనాల్కకొసన నెలకొని యున్నది. దాసాని

పూలయెఱుపువంటి యెఱుపువన్నెగల నీ జిహ్వాకాంతి వ్యాప్తిచే, స్ఫటికశిలకాంతివంటి తెల్లకాంతిగల సరస్వతిదేహము మాణిక్యదేహముగా మారిపోవుచున్నది. అట్టి నీకు అమ్మా, జయము.

రణే జిత్వా దైత్యా నపహృతశిరస్త్రైః కవచిభిర్
నివృత్తై శ్చణ్డాంశత్రిపురహరనిర్మాల్యవిముఖైః
విశాఖేన్ద్రోపేన్ద్రై శ్శశివిశద కర్పూరశకలా
విలీయన్తే మాత స్తవ వదనతామ్బూలకబలాః ॥

| | | | |
|---|---|---|---|
| | అమ్మా, | విముఖైః | కోరికలేనివారు అగు |
| రణే | యుద్ధమున | | |
| దైత్యాన్ | రక్కసులను | విశాఖ | కుమార |
| జిత్వా | జయించి | ఇన్ద్ర | మహేంద్ర |
| నివృత్తైః | మరలినవారును | ఉపేన్ద్రైః | విష్ణువుల చేత |
| ఉపహృత | ఉపాయనముగా అర్పింపబడ్డ | శశివిశద | చంద్రునివలె తెల్లనగు |
| శిరస్త్రైః | ఆరక్కసుల బొమిడికములు గలవారును | కర్పూరశకలాః | పచ్చకర్పూరపు పలుకులుగల |
| | | తవ | నీ |
| కవచిభిః | కవచములు గలవారును | వదన | నోటి |
| చణ్డ | చండుడు అను ప్రమథునికి | తామ్బూల | తాంబూల |
| అంశ | చేరవలసిన భాగమగు | కబలాః | కబళములు |
| త్రిపురహర | శివుని | విలీయన్తే | స్వీకరింపబడును. |
| నిర్మాల్య | భుక్తశేషమందు | | |

తా॥ అమ్మా, నీపుత్త్రులగు కుమార మహేంద్ర విష్ణువులు కవచముల దాల్చి రాక్షసులను యుద్ధమున జయించి నీయొద్దకు మరలి వత్తురు. ఆరక్కసుల బొమిడికములు నీ కుపాయనములుగ సమర్పింతురు. శివనిర్మాల్యము చండు డను ప్రమథునిభాగము కావున వీరు అందు కోరికలేనివారై, పచ్చకర్పూరముతో ఘుమఘుమలాడుచు నీవు నమలుచున్న తాంబూలమందలి కబళములను ఆదరముతో కైకొందురు.

విపఞ్చ్యా గాయన్తీ వివిధ మపదానం పశుపతే
స్త్వ యారబ్ధే వక్తుం చలితశిరసా సాధువచనే
తదీయై ర్మాధుర్యై రపలపితతన్త్రీకలరవాం
నిజాం వీణాం వాణీ నిచుళయతి చోలేన నిభృతమ్ ॥

| | | | |
|---|---|---|---|
| పశుపతేః | పరమశివుని | సాధువచనే | మధురవచనము |
| వివిధమ్ | త్రిపురవిజయ - దక్షయాగ | ఆరబ్ధే | ఆరంభింపబడగా |
| | ధ్వంస - హాలాహల ధా | తదీయైః | ఆమాటల |
| | రణ - జలంధర గజాసుర | మాధుర్యైః | తియ్యదనముల చేత |
| | ప్రముఖ వధ మున్నగా | అపలపిత | చిన్నబుచ్చబడిన |
| | అనేక ప్రకారముగా | తన్త్రీ | వీణియతంతుల |
| అపదానమ్ | కడచిన పనులను | కలరవామ్ | నాదములు కలదైన |
| విపఞ్చ్యా | వీణతో | నిజామ్ | తన |
| గాయన్తీ | పాడుచున్నదై అంత స్సం | వీణామ్ | వీణను |
| | తోషముచే | వాణీ | భారతి |
| చలితశిరసా | స్వయముగ తలఊపిన | చోలేన | కప్పుగుడ్డచేత |
| త్వయా | నీచేత | నిభృతం | పూర్తిగ మఱుగుపడునట్లు |
| వచమ్ | పల్కుటకు | నిచుళయతి | కప్పివేయును. |

తా॥ వాణి పరమశివుని చరితములను కొనియాడుచు వీణ వాయించుచు పాడుచుండును. విని, మెచ్చి, తలఊపుచు, నీవు ఆమెను ప్రశంసించుచు పల్కదొడంగుదువు. నీకంఠస్వరము వినబడగనే అంతవఱకు శ్రావ్యముగ నున్న వీణాధ్వానము ఇక శ్రావ్యము కాకపోగా, వాణి తనవీణను దాని కప్పుడుగుడ్డతో బాగుగా కప్పి ఆవల పెట్టివేయును.



# దీపావళీ ప్రాముఖ్యము

## [సంపాదకీయము]

ఐహికజీవితమున మంచిచెడుగులు కష్టసుఖములు ధర్మాధర్మములు ఒండొంటితో కలిసిపోయి యున్నవి. కల్తీ లేని సుఖము స్వర్గమున నున్న నుండ వచ్చు, కల్తీ లేని దుఃఖము నరకములో నుండ వచ్చు, కాని భూలోకము కర్మభూమి. ఈ భువియందు మానవుడు తన క్షేమి కావలసియున్నను అందుకై పాటుపడవలయును. ఈ లోకమున నతడు చేయు పనులకు ఫలితముగ నతడు స్వర్గమునో నరకమునో ప్రాపించును. భూలోకమున ప్రతిదియు లోటుపాటులు గలిగియే యుండును, వానిని తీర్చుకొనుటకు మానవుడు పాటుపడవలసియుండును. దౌర్జన్యము నణచుటకును దుఃఖసముద్రమును తరించి సుఖతీరము చేరుకొనుటకును అధర్మమును చక్కబఱచుటకును మానవుడు పడు పాటే భూలోకజీవితమహిమ. దౌర్జన్యము మనల నెంత

అడ్డగించునో, మంచికై మన కోరిక అంత హెచ్చును. దుఃఖబాధలు సుఖానుభవకాంక్షల నుద్దీపింపజేయును. అధర్మము తాను భయంకరమై ధర్మౌదార్యమును మఱింత ఉజ్జ్వలముగ ప్రకాశపఱచును. మానవజాతి ఏనాడు భువిపై పుట్టువొందెనో నాటినుండియు ఈ ద్వంద్వములకు సంఘర్షణ చెల్లుచునే యున్నది. మేలొందు ప్రయత్నములు అవిచ్ఛిన్నముగ సాగుచునే యున్నవి.

మన ప్రాచీనవాఙ్మయమున ఈ సంఘర్షణ దేవాసురుల నిత్యవిరోధరూపమున వర్ణితమై యున్నది. వేదములేమి పురాణములేమి ఉపపురాణములేమి ఇతిహాసములేమి అసురుల గెల్చుటకై సురలు సాగించిన పోరాటమునే వర్ణించుచున్నవి. అధర్మమును దౌర్జన్యమును అసత్యమును వైరూప్యమును ద్వేషమును కల్మషమును గెల్చుటకై ధర్మమును సౌజన్యమును సత్యమును సౌందర్యమును ప్రేమయు పవిత్రతయు నిర్వహించిన పోరునే అవి తెల్పుచున్నవి. ద్వేషము సురాసురుల కంతర్గతము అనివార్యము. సదా సాగుచుండు ఈ పోరాటములో ఫలితము లెల్లప్పుడును ఏకరీతిగ లేవు. జయాపజయములు పర్యాయమున ఉభయులకును గలుగుచుండును. సురలు సరియైనరీతిలోనే గడించుకొన్న ప్రాముఖ్యము వారికి చిరకాలముండుట లేదు. అసురులకు గల్గిన పతనపరాజయములును చిరకాలము అట్లే నిల్చియుండుట లేదు. ఒక్కొక్కసారి నిర్జితులగుటతో అసురులు మఱింత బలీయులై తర్వాతిసారి తామే గెల్పొంద దక్షు లగుచున్నారు. సదా లొంగియుండుటకు సహింపని యీ ప్రబలశత్రువుల తిరుగుబాట్లకు తాము పడిపోకుండుటకై వేల్పులు సదా ప్రయత్నించుచున్నారు.

హిందువుల వేల్పులలో ఎవరిపేరునైన చూడుడు. అది ఒకానొకరక్కసుని ప్రక్కలించిన వాడను బిరుదనామముగ నుండును. ఈశ్వరునకు 'త్రిపురాంతకు' డనియు 'అంధకాసురసూదను' డనియు 'గజారి' అనియు పేళ్లున్నవి. నారాయణుడు, మురారి, మధురిపుడు, కంసనిషూదనుడు, బలిమథనుడు, దైత్యారి, ఇంద్రుడు, వృత్రహంత, బలిరిపుడు, పాకశాసనుడు, నముచిద్వేషి, జంభభేది, సుబ్రహ్మణ్యుడు, తారకారి — పరమశివవల్లభ రాక్షససంహారమునకై ఘోరరూపముల దాల్చును, ఆమె విజయోదాహరణాలు పెక్కులు గలవు. అవి దేవీమాహాత్మ్యమందును దేవీభాగవతమందును కాననగును. ఆమెకు చేతులు పెక్కులు. ఆ చేతులలో ఆమె పెక్కు ఆయుధముల దాల్చి యుండును. ఇంతెందుకు, ఆయుధములు లేని దేవుడు లేడు. ఇట్లు మన ప్రాచీన సారస్వతమును జూతుమేని, మంచిని సదా బాధింప దివురుచు చెడుగును ఉన్న దని మనకు స్పష్ట మగును.

ఈ వింతను జూడుడు. ఈ సురలును అసురులును తోబుట్టువులే. దితియు అదితియు కశ్యపుని యిల్లాండ్రు. దితితనయులగు దైత్యులే అసురులు. వారికి పూర్వదేవులని మఱి యొక పేరు. అదితిపుత్రులైన ఆదిత్యులే సురలు. దుష్టులును శిష్టులును ఒక్కతండ్రిబిడ్డలే. అందు దుష్టులు జ్యేష్ఠులు!

పాపమును దౌర్జన్యమును విభజించి పరిశీలింతుమేని — కామము క్రోధము లోభము మోహము మదము మాత్సర్యము అను నివే అందలి అంగములు అని మనము గుర్తింతుము. ఈ దుర్గుణముల మూర్తీభావమే అసురులు.

ఈ దుర్గుణములే మానవుల మనసులందుండి వారిచేత దుష్కృతముల చేయించుచు వారికి దుఃఖములు గల్గించుచుండును. అంతర్జగమున ఈ దుర్గుణముల గెల్చుటే ఆత్మవిముక్తిసాధనలో ప్రథమసోపానముగ విహితమై యున్నది. ఈ దుర్గుణములు భౌతికములు ఆధ్యాత్మికతకు విరుద్ధములు. బాహ్యజగత్తున ఈ గుణములు రక్కసులలో రూపొందును. లోకక్షేమమునకు ఆ రక్కసుల నుక్కడగించుట ఆవశ్యకము.

దేవవిరోధుల పట్టునుండి జగము రక్షింపబడిన చరితములు పురాణములందు గలవు. జగము అట్లు దేవవిరోధులపట్టునుండి విడివడియుండుకాలము ఎంత స్వల్పమైన నగును గాక. మాయావరణమునుండి ఆత్మ ఉద్ధరింపబడు ప్రకారములను ఆధ్యాత్మికశాస్త్రము ప్రతిపాదించును. వేల్పులకడంకచే రక్కసులు వినిర్జితులైన చరితములలో దీపావళిపండుగకు సంబంధించిన చరిత్రము పైని సూచితమైనట్టి తలంపును మన డెందములలో లేపును. కామక్రోధలోభాదులు అజ్ఞానప్రభవములు అవి 'నరకము' ను గల్గించును. నరకము (నరకుడు) మానవతతిని గబళింతు నని బెదరించును. నరకమును (నరకుని) నిర్జించుట సర్వలోకమునకును మహోత్సవకారణ మగును. నరకాసురుని మరణము అజ్ఞానతమస్తిరోధానమును, ఆ తమోలోకవాసులగు కామక్రోధాదుల విలయమును ఆధ్యాత్మికజ్ఞాన తేజస్సముదయమును సూచించును. దీపావళిపండుగను కొనియాడుట మానవులకు సర్వపాపహర మనియు నరకార్తినివారణ మనియు పురాణములు చెప్పుచున్నవి.

ఇది ఈ కథకు మఱుగున నున్న నైతికాధ్యాత్మికప్రాముఖ్యము. ఈ కథయు రక్తిగొలుపునదే. విష్ణుదేవుడు వరాహరూపి యైనప్పుడు ఆయనకు భూదేవియందు జనించిన కుమారుడే నరకాసురుడు, కావుననే అతనిని భౌము డని యును పేర్కొందురు. అతడు అస్సాములోని ప్రాగ్జ్యోతిషమునకు రా జయ్యెను, తపస్సు చేసి బ్రహ్మదేవునొద్దనుండి వరముల బడసెను. వరబల భుజబల గర్వాంధుడై అతడు వేల్పులను మానవులను పీడింప సాగెను. స్వర్గమర్త్యములందలి లావణ్యవతుల నెల్ల నతడు చెఱబట్టెను. ఇంద్రునిచ్ఛత్రకుండలముల హరించెను. విశ్వకర్మనికూతును బలాత్కారముగ గలిసెను. అతనిదుర్గమా, శత్రువుల కభేద్యముగ నుండెను. దేవేంద్రుడు నరకాసురుని దుండగములను శ్రీకృష్ణునితో జెప్పుకొనెను. శ్రీకృష్ణుడు నరకుని దుర్గమును పడగొట్టి, అతని మిత్రుడగు పంచశిరుని మురాసురుని సంహరించి, పిమ్మట నరకునే తన చక్రమున కెర గావించెను.

మరణించునప్పుడు నరకాసురునకు స్వకీయదుర్నయములవలని పశ్చాత్తాపము కలిగె నట. అతని డెందమున విశ్వప్రేమ నిండి పొంగె నట. 'నా బాధ తొలగుట విశ్వమున కెంత నిర్వృతికరము!' అని అత డనుకొనె నట. అదియును గాక భగవంతునిచేత నతడు మరణించుటచే, అతడు మోక్షార్హుడైన యోగి యయ్యెను. అతడు తన చరమప్రార్థనగా ఇట్లు వేడుకొనె నట — "లోకులకు నావలని బాధ తొలగిన యీ దినము భూలోకమున సదా స్మరింపబడుచుండవలెను, పుడమిజను లీనాడు మహానందముతో గొప్ప పండుగు చేసికొనవలెను".

ఆశ్వయుజ(తులా)మాస కృష్ణపక్ష చతుర్దశియే ఆ పండుగుదినము.

ఈ కథనుగూర్చి వేర్వేఱు వక్కాణములు కలవు. అం దొక వక్కాణము — నరకుని జనని యైన భూదేవియే అతనిమృతికి విలపించుచు అతడు హతుడైన చోటికి వచ్చెను. ఆమె అతనికే కాక సర్వచరాచరములకును గూడ జనని కదా. కాబట్టి ఆ ఒక్కకంటకుని పీడ నుండి విముక్తమైన అశేషజగమును గాంచి, తన పుత్రశోకమును మఱచి — 'ఈ దిన మిక మీాద పండుగుగా పుడమిజనులు కొనియాడ వలె' నని ఆమె కోరినదట.

మఱియొకవక్కాణ మి ట్లున్నది — నరకాసురుడు తన తల్లిచేతనే కాని మఱొకరిచేత చావకుండునట్లు బ్రహ్మ వర మిచ్చియుండెను. కావుననే శ్రీకృష్ణు డతనితో పోరాడుటకు బోయినప్పుడు సత్యభామను తనతో పిల్చుకొని పోయెను. లక్ష్మి రుక్మిణిగ అవతరించినట్లు భూదేవి సత్యభామగ అవతరించెను. సత్యభామచే నరకాసురుడు హతు డాయెను.

యావద్భారతీయులకును పండుగు అని చెప్ప దగినది దీపావళి తప్ప వే ఱొకటి లేదు. 'ఓణము' అను పండుగ నైరృత (మలయాళ) భాగమునకు మాత్రమే పరిమితము. హోళి పండుగు ఉత్తరభారతమునకు మాత్రమే పరిమితము. మఱి దీపావళి యన్ననో హిమాలయమునుండి కన్యాకుమారిఅగ్రమువఱకును గల దేశములో క్రైస్తవేతరులును మహమ్మదీయేతరులును కాని భారతీయుల కందఱికిని పండుగై ఉన్నది. ఉత్తరభారతమున దీపావళి 'దీపాలపండుగు'. అట్లైననే ఆ పేరు యథార్థాక్షర మగును. భవనములలో నూర్లకొలది దీపములు వెలుగును.

కాశిలో గంగానదియొట్లు మహోజ్జ్వలదీప పరంపరలచే అలంకృతములై యుండును. వేల కొలది దీపములు నదిపై తేలుచుండును. పైగా ఉత్తరభారతమున ఇది మూడుదినాల పండుగగా కొనియాడబడుచున్నది. దీపావళికి ముందు దినము వారికి మహాబలిపూజాదినము. దీపావళికి మఱుదినము వారికి కుబేరపూజ.

దక్షిణభారతదేశమున పిన్నలయు పెద్దలయు ఉత్కటానందములకు చిహ్నముగా రాత్రియంతయు టపాసుల పటపటలును వెలుగులును నిండియుండుటయు భీత్యంధకారాల పాఱద్రోలుటయు అను ఆచారము స్థిరపడియున్నది. నరకచతుర్దశి వేగుజామున అందఱును అభ్యంజనస్నానము చేయవలయు నని శాస్త్రమే చెప్పుచున్నది. నూనెలో లక్ష్మియు నీట గంగయు అప్పుడు వెలసియుందు రట. నూతన వస్త్రాలంకరణముల దాల్చుటయు కానుకలిచ్చుటయుగూడ మగువలకును మహిళలకును విహితమై యున్నది. బంధుమిత్రుల పరస్పరాభినందనసందేశము లీ పండుగ నా డొక విశేషము. అల్లుండ్రకు సంతుష్టికూర్ప అత్తమామలు అత్యానందముతో ప్రయత్నింతురు. వివిధమధురభక్షణములు బాలుర కత్యంతప్రీతికరములుగ నుండును. గొప్పవిందు ఈ ఉత్సవ ప్రధానాంగము. క్రైస్తవులకు క్రిస్మసు ఎట్టిదో మనకు దీపావళి అట్టిది అన వచ్చును. జో, దివ్యశిశుజననము క్రిస్మసు పండుగులోని హృదయము. తమఃప్రకృతియగు నరకుని విలయము దీపావళిపండుగులోని హృదయము.

---

తనమహిమ తనకుఁ దెలిసినఁ దనయందే తోఁచి యణఁగుఁ దత్త్వములెల్లన్.

# భారతీయ దర్శన గ్రంథములు

శ్రీయుతులు పాటీలు తిమ్మారెడ్డి, ఎం. ఏ.
బోయనపల్లి రామారావు, బి.ఏ., గారలు

(గతసంచిక తరువాయి)

## యోగము

మహర్షి పతంజలికృతమగు యోగదర్శనము సేశ్వరసాంఖ్యదర్శనమే. సాంఖ్యవిచారముతో యోగదర్శనము భేదింపదు. ఇరువదియైదు సాంఖ్యతత్త్వములను యోగముకూడ మన్నించును. ఇవిగాక పురుషవిశేషుడగు భగవానుని ఇరువదియారవతత్త్వముగా స్వీకరించును. యోగదర్శనము క్లేశనాశమున కొక వ్యావహారిక సాధనమార్గము నిచ్చుట కేర్పడినది.

అవిద్య, అస్మిత, రాగము, ద్వేషము, అభినివేశము - ఇవి జీవుని పంచక్లేశములు. వీనిచే నిత్యముక్తుడు, కర్మవిపాక ఆశయసంపర్క-శూన్యుడు, అద్వితీయుడు, జ్ఞానరూపుడగువాడీశ్వరుడు. ఈప్రపంచము హేయము. దుఃఖమయము. చిత్తవృత్తులు కారణముగా ప్రపంచమున కర్మబంధన మేర్పడినది. చిత్తవృత్తుల నిరోధించుటచే క్లేశములు నశించి జీవాత్మపరమాత్మల సంయోగము సంభవించును. యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధారణా, ధ్యాన, సమాధులు ఈ చిత్తవృత్తి నిరోధరూపములగు యోగాష్టాంగములు.

## పూర్వమీమాంస

సాంఖ్యతత్త్వమే ఉత్తరమీమాంసయందు పురోగమించినది. కాని సాంఖ్య, యోగ, ఉత్తరమీమాంసలు మూడును తత్త్వజ్ఞానమునకై పుణ్యకర్మోదయము నావశ్యక మనెను. కావున కర్మవిచారమునకై పూర్వమీమాంసాదర్శనమును జైమినిమహర్షి నిర్మించెను. ఉత్తమకర్మాధికారికే యోగము. కామనాహీనుడగు ముముక్షువు వైరాగ్యసాధనల యభ్యాసముచే సమాధిలాభమును పొంది ముక్తుడగును. కాని విరక్తుడు కానివాని కటు రుచి కలుగదు. అతనికి భోగములే కావలయును. అట్టివానికై పూర్వమీమాంస కర్మసిద్ధాంతమును ప్రతిపాదించెను. ఈపూర్వమీమాంసయే లోకమున మీమాంసాదర్శన మనబడును. ఉత్తరమీమాంస వేదాంతదర్శన మనుపేర ప్రసిద్ధి వడసినది.

వేదములు నిత్యములు ఆమంత్రములే దేవతలు. విధి, అర్థవాదము, మంత్రము, స్మృతి, నామధేయము - ఇవి యైదు వేదాంగములు. శబ్దము నిత్యము. శబ్దములందీ యైదంగము లభివ్యక్తమగును. వేదాదులగు నేగ్రంథతాత్పర్యము గ్రహించుటకైనను గ్రంథోపక్రమము, ఉపసంహారము, అభ్యాసము, అపూర్వత, ఫలము, అర్థవాదము, ఉపపత్తి - అను నేడు విషయములపై ధ్యానముంచుట ఆవశ్యకము. ప్రతివాక్యము ఏదో యొక వ్యాపారమును, కర్మను బోధించును. దాని కేదో ఫలముండక తీరదు. కర్మలు స్వయముగా ఫలోత్పాదన సమరములు.

## ఉత్తరమీమాంస

వ్యాసకృతమగు దీనిని వేదాంతదర్శన మం దురు. బ్రహ్మజిజ్ఞాసకై ఇది ప్రవర్తిల్లినది. బ్రహ్మలక్షణము – "జన్మాద్యస్యయతః" దేనిచే సృష్టిస్థితిప్రళయములు సంభవించెనో అది బ్రహ్మ" మని చెప్పబడినది. గ్రంథమంతయు దీనికి వ్యాఖ్యానము. వ్యాసభగవానుని యీ యుత్తరమీమాంసను (బ్రహ్మసూత్రములు) స్వీకరించి విభిన్నాచార్యులు తమతమదృష్టి కోణములచే వ్యాఖ్యలు భాష్యములు రచించిరి. సంప్రదాయప్రతిష్ఠ ఆభాష్యములపై నాధార పడియున్నది. బ్రహ్మసూత్రములు (న్యాయ ప్రస్థానము) ఏకాదశోపనిషత్తులు (శ్రుతిప్రస్థా నము) గీత (స్మృతిప్రస్థానము) – ఇవిమూడును ప్రస్థానత్రయ మను పేర ప్రఖ్యాతి నొందినవి. వీని యన్నింటిపై భాష్యములు రచించుటచే మొదట విభిన్నసంప్రదాయములు విలసిల్లినవి. నేటివలె పూర్వము భారతదేశమున కల్పిత సంప్రదాయములు లేవు.

## కర్మమీమాంస

ఈపూర్వమీమాంసకాక కర్మ ప్రతిపాదక మగు భరద్వాజకృతమగు కర్మమీమాంసా దర్శనమును భారతధర్మమహామండలివారు ప్రచురించి రట. ఇది యెంతయు నుపాదేయ మగు గ్రంథ మని తెలియుచున్నది. ప్రాచీనులు దీని నేల పూర్వము గణింపలేదో తెలియదు. దీనిని సైతము స్వీకరించినచో వైదికదర్శన ముల సంఖ్య యేడగును.

## అద్వైతవాదము

దృశ్యజగత్తు కేవలము ప్రతీతిమాత్రము. ఒకే నిర్గుణ నిరాకార నిర్వికార చేతనతత్త్వము కలదు. దృశ్యజగతి దానికన్న భిన్నముకాదు. అది యా బ్రహ్మసత్తయందే అధ్యస్తము. సమస్తదృశ్యములు పరిణామశీలములు, అనిత్య ములు అన్నింటికి ద్రష్ట యొక్కఁడే. జ్ఞేయము కూడ జ్ఞాతయొక్క సోపాధికరూపమే. నామ రూపము లివి మనోవృత్తులు. నామరూపముల కతిరిక్తమగు జగత్తు లేదు. మాయచే నామ రూపప్రతీతి యేర్పడును. మాయ అనిర్వాచ నీయము, కాని యనాదియయ్యును జ్ఞానముచే నంతమొందింపజాలు కతన దానికి 'సత్త' లేదు. ఏకైకబ్రహ్మమే సత్యము. అందు సజాతీయ విజాతీయసగత – ఇక మఱేట్టి భేద మును లేదు.

శంకరభగవత్పాదులు రజ్జువునందు సర్పము వలె మిథ్యయందు జగము ప్రతీతమగుచున్న దనిరి. అద్వైతవాదమున దృష్టి – సృష్టి వాదము, అజాతివాదమువంటి కొన్ని ప్రక్రియా భేదములు కలవు. జగత్ప్రతీతిని స్వీకరించియే యీసిద్ధాంతము లేర్పడినవి. బ్రహ్మయొక్క అద్వైతస్థితిని జగత్తుయొక్క మిథ్యాత్వమును ఎల్ల రంగీకరింతురు. కావున ప్రక్రియలు భిన్న మైనంతమాత్రమున మూలతత్త్వమున భేద మేర్పడదు.

జగత్తు ప్రతీతిమాత్రము, మిథ్య, అధ్యా సము లేదా వివర్తము – అని పూర్వమే చెప్ప బడినది. శంకరభగవానులు వ్యావహారిక పార మార్థికము లను రెండువిధములగు సత్యములు ప్రతిపాదించిరి. వారు 'ఈశ్వరానుగ్రహా దేవ పుమా నద్వైతవాసనః' అని యీశ్వరీయ కృప నపేక్షిత మని పేర్కొని ఉపాసనాభక్త్యా చారములకు ప్రాధాన్య మిచ్చిరి. జగత్తు ప్రతీతిమాత్రము, కల్పితము. పైగా సమష్టి సంచాలకకల్పితము. జీవునికల్పన అందు

'అహం, మమ' అనునవియే. కావున అహంకారమమత్వత్యాగము మనవశములోనిదే. సమష్టిలయము సమష్టికర్తయధీనమునం దుండును. ధనమోహము లేనివానికి నోట్లు కాగితపుముక్క లయినట్లుగా, ఎప్పుడు పారమార్థికసత్యము దేనిప్రతీతి నేని ఆత్మ సాక్షాత్కరించునో అపుడు వ్యావహారికసత్యము దానిని బంధింపజాలదు.

బౌద్ధధర్మము వజ్రయానస్థాయికి దిగివచ్చినది. వామతంత్రసాధనలుకూడ అనాచారములుగ మార్పు సెందినవి. తర్కము దర్శనమును జడవాది గావించెను. ఇట్టి వాతావరణమున శంకరభగవత్పాదులు ప్రాదుర్భవించిరి. జడమును సత్యముగా స్వీకరించుట వైభాషికబౌద్ధ దర్శనమున కాధారము. శంకరభగవానులు దానికి ప్రతిక్రియ నుత్థితముసేసిరి. జడదృశ్య జగతి కేవలప్రతీతిమాత్రము. మధ్యమాచారముతో నీమతము కలియుచున్నది. బౌద్ధ దర్శనమునకన్న శంకరదర్శనమునకు భేద మేమన నిందు శ్రుతిశాస్త్ర ఆస్తికత్వప్రాధాన్యముతోపాటు ఆచారమునకంటె జ్ఞానమున కెక్కువ ప్రాధాన్య మీయబడినది. నాడు వామాచార కాపాలికాచారప్రభృతులగు నుచ్ఛృంఖలతలు ఆచార మనుపేర బ్రమకుచుండెను. తన్నిషేధ మావశ్యకమై యుండెను. నాడు మానవుని పతనమునుండి నిలిపి యున్నతిస్థాయికి తెచ్చినది అద్వైతవాదము.

## విశిష్టాద్వైతవాదము

అద్వైతవాదము సాధనచతుష్టయ, శ్రవణ మనననిధిధ్యాసనాదులచే నపరోక్షానుభూతి ప్రతిపాదనను స్వీకరించి ప్రవర్తిల్లినది. కాని మానవప్రకృతి అధోగమనశీలము గలది. ఆచారమునకంటె జ్ఞానమున కాధిక్య మిచ్చు ప్రతిపాదనము బౌద్ధికజ్ఞానమునకు ప్రాధాన్య మిచ్చెను. ఆచారములు నశించెను. ఇంద్రియ విషయసేవనము వ్యవహారమాత్రముగ భావింపబడి బుద్ధికాధిక్యము వచ్చెను. అద్వైతబోధ మనుభూతిదశ నతిక్రమించి యన్యవిద్యలవలె మేధావిషయికజ్ఞాన మయ్యెను. జీవుడు నిత్యముక్తశుద్ధబ్రహ్మము. అతని నాచారములు బాధింపవు. విషయాదిభోగాదులు వ్యవహారములు, కల్పితములు, ప్రతీతిమాత్రములు. కావున సదాచారోపాసనాదు లన్నియు నజ్ఞానము లయ్యెను. ఒకరు మూలతత్త్వమును జడమనుటయు రెండవవారు చేతనమనుటయేతప్ప, దేహాత్మవాదులగు నాస్తికులకును ఈ అద్వైత వేదాంతులకును భేదములేని పరిస్థితియేర్పడెను.

ఎంతవఱకు వ్యవహారవ్యావహారికసత్యములు అపేక్షితములో, ఎంతదాక వాని ప్రతీతికలదో, అంతవఱకు, మనమేకల్పనవానిని సృజించెనో దానియధికారక్షేత్రమునం దున్నాము. ఈభోగములు మనకల్పనలైనచో వానిప్రాప్తికి మనము యత్నింప నవసరము లేదు. కల్పనచేతనే మనము వానిని సృష్టించుకొందుము. దేని కల్పనాక్షేత్రమున మనమువ్యవహారము నడుపుచున్నామో అది మనకుశాస్త (శాసించునది). తత్కృపచే మన మాక్షేత్రమునుండి బయట పడగలము. తత్ క్షేత్రమున నివసించి తన్నియమభంగ మొనర్చినచో దండనము లభించి తీరును. ఈ సత్యస్థాపనకై రామానుజదేశికులు విశిష్టాద్వైతమును ప్రవర్తిల్లజేసిరి.

చిదచిద్విశిష్టసమగ్రతత్త్వమే బ్రహ్మము. దానిచేతనాంశముచే చిత్తు (జీవుడు) అచిదంశముచే జడము (ప్రకృతి) సంభవించెను. బ్రహ్మము జగత్తునకు నిమిత్తఉపాదానకారణము. జీవుడు

బ్రహ్మముయొక్క అంశమే. నారాయణభగవానుడే ఈ సమస్తజడచేతనముల కధినేత. అతడు నిఖలగుణగణైకధాముడు, నిత్యవైకుంఠ విహారి. అతనికి శరణాగతుడగుటచేతనే జీవికి ముక్తికలదు. ప్రపత్తి(శరణాగతి)యే ముక్తికి సర్వోత్తమసాధనము. జీవుడు జ్ఞాత. జ్ఞానము జీవునిధర్మము. జీవేశ్వరులు నిత్యభిన్నులు. యథావస్థితవ్యవహారానుగుణజ్ఞానమే ప్రేమ. నిర్వికల్పసవికల్పము లను ద్వివిధజ్ఞానములును విశేషతాయుక్తతత్త్వమునందే యుండును. ఆత్మ, మనస్సు, ఇంద్రియములు, విషయ సంయోగము—ఇవి జ్ఞానహేతువులు. కర్మ సంబంధిజ్ఞానసంపన్నుడే బ్రహ్మజిజ్ఞాస కధికారి.

ఎఱుగదగిన దగుటచే బ్రహ్మము సగుణము, సవిశేషము. జగత్తు బ్రహ్మపరిణామము. ఉపాసనచే అజ్ఞాననివృత్తియే జీవునిప్రయోజనము. బ్రహ్మమగు శ్రీమన్నారాయణుడు నిజయోగమాయాశక్తిచే సమన్వితుడై కర్మఫలదాత, సర్వనియంత, సర్వాంతర్యామి, సృష్టిస్థితి సంహారకారణుడు నగుచున్నాడు. అతడు కర్మప్రేరితుడై యవతరింపడు, స్వేచ్ఛగ నవతరించును. అతడు నిర్వికారి. జీవుడు చేతనుడు, అణురూపుడు, బ్రహ్మయొక్క దేహము, జీవబ్రహ్మలయందు స్వగతభేదము కలదు. జీవపరబ్రహ్మలు చేతనులు, స్వయంప్రకాశులు, జ్ఞానాశ్రయులు, నిత్యులు, దేహాదికభిన్నులు. జీవుడు కర్త, భోక్త, బ్రహ్మశరీరము, దాసుడు. జీవునకు పరబ్రహ్మకంటె నెప్పుడును అభిన్నత కలుగదు. అప్రాకృతచిన్మయశరీరముచే వైకుంఠధామనివాసప్రాప్తియే ముక్తి. ఈ ముక్తి పరబ్రహ్మకృపవలన అతని ప్రపత్తివలననే ప్రాప్యము.

విశిష్టాద్వైతము శరణాగతి – ప్రపత్తి మార్గము. ఆరాధ్యున కనుకూలములను సంకల్పించుటయు ప్రతికూలములను త్యజించుటయు ప్రపత్తిస్వరూపము. భగవదాదేశము శాస్త్రమే కావున శాస్త్రవిరుద్ధసర్వధర్మత్యాగము, శాస్త్రాచారస్వీకారము దాని కర్థము. నియమాచారము లత్యున్నతములే. కాని నియమమరుపయోగము, హాసోన్ముఖత్వము మానవనైజమగుటచే నిది యాచార్యమతము కాక యాచారుల మత మయ్యెను. ప్రపత్తి – శరణాగతి యందలి ముఖ్యాంశమగు భావము గౌణమై క్రియప్రాధాన్యము వహించెను. శాస్త్రముయొక్క బాహ్యాచారవిడంబనలు తమహద్దు నతిక్రమించెను. భావ ముపేక్షింపబడెను. తత్ఫలితముగా ముఖ్యలక్ష్యమగు ఉపాసన పెక్కు అర్థరహితక్రియాకలాపములచే గ్రాసి రాజయ్యెను. ఈ స్థితియందు శైవవైష్ణవమతములు వర్థిల్లెను.

## ద్వైతవాదము

మధ్వాచార్యప్రోక్తమగు ద్వైతవాదము పూర్ణప్రజ్ఞదర్శన మనబడును. ఈ మతసారాంశము — జీవుడు, బ్రహ్మము. ఇవి రెండును నిత్యపార్థక్యమగు నస్తిత్వము కలవి. జీవు డణుస్వరూపుడు, దాసుడు. పరబ్రహ్మ సగుణుడు, సవిశేషుడు, స్వతంత్రుడు. సాలోక్యాదిముక్తులం దేదో యొకటి పొందుట జీవునిపరమార్థము. జీవబ్రహ్మలనడుమ సామ్యబోధ భ్రమమే కాదు, అపరాధముకూడ. దృశ్యజగత్తు సత్యాభిన్నము. వికారియు పరివర్తనశీలము నయ్యును జగత్తు మిథ్య కాదు. ఏలయన నసత్య మెప్పుడు నెఱుగబడదు. జ్ఞాతజ్ఞేయముల యధీనమున జ్ఞాన ముండును. జ్ఞాన

చింతనముకన్న నితరమగు స్థితి లేదు కావున జ్ఞానము సదా సవికల్పమే. జ్ఞాన మాపేక్షికము. జ్ఞానమే జ్ఞేయప్రతిపాదకము, ప్రధాన ప్రమాణము. బ్రహ్మము శాస్త్రైకగమ్యము. పూర్ణతఃవాగ్విషయము కాదు. భావవస్తు, గుణ, క్రియా, జాతి, విశేషత్వ, విశిష్ట, అంశీ, శక్తి, సాదృశ్య, అభావములు – దశపదార్థములు. భావవస్తువు చేతనాచేతనము లని ద్వివిధము. బ్రహ్మము, పరమతత్త్వము ఆవిష్ణు భగవానుడు. భక్తి, త్యాగము, ధ్యానము—ఇవి జీవుని ముక్తికి సాధనములు.

## ద్వైతాద్వైతవాదము

నింబార్కాచార్యులవారు ద్వైతాద్వైతములను సమన్వయించి లోకమునకు ప్రసాదించిరి — జగత్తు బ్రహ్మపరిణామము. బ్రహ్మమున పరిణామ మేర్పడియు నది వికృతి కాదు. అది సర్వశక్తిమంతము. దాని సగుణభావము ముఖ్యము. జీవజగత్తులు రెండును బ్రహ్మపరిణామములు. ఇవి బ్రహ్మమునుండి పృథగ్భావము కల వయ్యును అపృథక్కులును అగుచున్నవి. జగదతీతరూపమున బ్రహ్మము నిర్గుణము. బ్రహ్మము జగత్తునకు నిమిత్తోపాదానకారణము. జీవుడు బ్రహ్మాంశము, తద్భిన్నుడును, అభిన్నుడును. జీవుడణుస్వరూపుడు. ముక్తుడు తనకు జగత్తునకు బ్రహ్మాభిన్నత్వ మనుభవించును. కేవల ముపాసనయే ముక్తికి సాధనము.

## శుద్ధాద్వైతవాదము

వల్లభాచార్యులవారు జగత్తుయొక్క మిథ్యాత్వమును ఖండించి ఉపాసనను ప్రతిష్ఠించిరి. శ్రీకృష్ణుడే బ్రహ్మము. అతడు నిర్గుణుడు, నిర్విశేషుడు, కర్త, భోక్త, గుణాతీతుడు, సమస్తవిరుద్ధధర్మాశ్రయుడు, జగత్తు సత్యము. అందు పదార్థము లావిర్భవించి తిరోభవించును. జీవుడు శుద్ధుడు, అణుస్వరూపుడు, బ్రహ్మప్రేమయే జీవున కుత్తమ మార్గము. శ్రీకృష్ణునియందు పతిభావప్రాప్తి దీనికి చరమసీమ. ఇది భగవదనుగ్రహము చేతనే సాధ్యము. బ్రహ్మవివేచనము శాస్త్రమువలననే సంభవము.

## అచింత్యభేదాభేదవాదము

శ్రీకృష్ణుడు సత్యము అని గ్రహించుటయే జీవునకు చాలును. చైతన్యుని ఈ భావమునకు గోస్వామిపాదులవారు అచింత్యభేదాభేదరూప మిచ్చిరి. గీతకు, ఉపనిషత్తులకు, బ్రహ్మసూత్రములకు భాగవతమే భాష్యము. ప్రస్థానత్రయీ భాష్యముల నుల్లంఘించి భాగవతమునే భాష్యముగా గ్రహించి యీ వాదము పరిపుష్టమయ్యెను. తరువాత కొన్నినాళ్ళకు బ్రహ్మసూత్రములపై భాష్యము రచింపబడెను.

ఈశ్వర, జీవ, ప్రకృతి, కాల, కర్మములు పంచతత్త్వములు. శాస్త్రములు వాచకములు, భగవంతుడు వాచ్యుడు, శాస్త్రములచేతనే భగవజ్జ్ఞానము సంభవము. సగుణవిశేష శ్రీకృష్ణుడే బ్రహ్మతత్త్వము. అతడు స్వతంత్రుడు, సర్వజ్ఞత్వాదిసకలగుణసనాథుడు, జీవులకు భోగమోక్షప్రదాత, ప్రాకృతగుణము లతనియందు లేనికతన నిర్గుణుడు. అతనియందు కల వన్నియు నప్రాకృతగుణములు. సంవిత్, సంధిని, హ్లాదిని — ఇవి మూడును సచ్చిదానందస్వరూపుడగు శ్రీకృష్ణుని శక్తులు. జగత్తు బ్రహ్మపరిణామము. ఇది సత్తయ్యు ననిత్యము. ప్రకృతి బ్రహ్మశక్తి, త్రిగుణాత్మకము, నిత్యము.

కర్మలు, జడములు. అవి భగవచ్ఛక్తిరూపములు. జీవు డణువు, బ్రహ్మ భోగ్యుడు, ప్రేమచే శ్రీకృష్ణసాన్నిధ్యము పొందుటయే జీవునకు ముక్తి.

అద్వైతవాదాతిరిక్తములగు సమస్తవైష్ణవ దర్శనములు ఉపాసనాసిద్ధికొఱకై యేర్పడినవి. కావున వీనియందు జగత్తు సత్యత పరబ్రహ్మ సవిశేషరూపము ప్రతిపాదితమయ్యెను. ప్రస్థానత్రయమునకే యివన్నియు భాష్యములు. కావున భాష్యరూపములగుటచే వీనిలో మూల సిద్ధాంతమున మార్పు ఉండదు. ఆచార్యవర్యులు సాధనపుష్టికై ఆదర్శనములను విస్తరించిరి. అద్వైతవాదము జ్ఞానయోగపుష్టికి, వైష్ణవదర్శనము లుపాసనాపుష్టికి ప్రభవించినవి. ఇందు ప్రతిసంప్రదాయమును అనాదినుండియు నిజపరంపరను పేర్కొనును. ఆద్యాచార్యులనగా తన్మతపరకముగ ప్రస్థానత్రయిపై భాష్యములు నిర్మించిన మహాపురుషు లని యర్థము. వారుగాని వారియనుయాయులుగాని వారే సిద్ధాంతమును సృష్టించిన ట్లొప్పుకొనరు. సత్యము నానారూపముల నుండదు. కాని నిజవాణిచే దానిని వివరించునపుడు, దృష్టికోణము ననుసరించియు, వాణీభేదము ననుసరించియు నానారూపములు ప్రతీత మగును. అచింత్యరూపయగు మాయాశక్తియు, అవాఙ్మానసగోచరమగు పరమతత్త్వము సర్వమాన్యములు. అధికారిభేదము ననుసరించి వీని యుపలబ్ధి, వీని యనుభూతిమార్గములు భిన్నభిన్నములు. ఎట్టి యధికారికై ప్రతిపాదితమగునో ఆతనిదృష్టికోణమున తత్త్వవ్యక్తీకరణము జరుగును. అధికారభేదము ననుసరించి యేర్పడిన పురాణములందు పరతత్త్వ మొకచో శివు డనియు, నొకచో శక్తి యనియు, నొకచో విష్ణు వనియు చెప్పబడినట్లే ఈ యాచార్యుల సిద్ధాంతములందు భేదములుకూడ అధికారపుష్టికై యేర్పడినవే. వాస్తవముగ అం దెట్టిభేదమును లేదు.

## శైవదర్శనములు

నిర్విశేషబ్రహ్మప్రతిపాదకదర్శనములను విడిచి సవిశేషబ్రహ్మప్రతిపాదకములను స్వీకరించినచో నందు శైవ, వైష్ణము లని రెండు ముఖ్యభేదములు కలవు. ఇవికాక సౌర, శాక్త, గాణాపత్యము లను మూడు గౌణభేదములు కలవు. ఇందు వైష్ణవదర్శనము లుచ్చరింపబడినవి. వైష్ణవదర్శనములు అద్వైతవాదము వేదములను పరమప్రమాణముగ స్వీకరించెను. ఉపాసనకొఱకు నిగమము (వేదాదిశాస్త్రములు) తోపాటు ఆగమ (తంత్రములు) దక్షిణాచారములుకూడ సర్వత్ర స్వీకృతమైనను శ్రుతియే పరమప్రమాణముగ నుండెను. శైవదర్శనములు ఆగమమును నిగమముతో సమానస్థాయిగా గుర్తించి పరమప్రామాణ్య మిచ్చి ప్రవర్తిల్లెను. ఉపాసనాక్షేత్రమున నవి యాగమమువైపే మొగ్గుసూపును. అందు నిగమములు గౌణములు. ఆగమోక్తదక్షిణాచారములతోపాటు వామాచారములకు సైత మందు స్థానము కలదు.

### పాశుపతము

పతి, పశువు, పాశము—ఈమూడును నిత్యపదార్థములు. పతి పరమేశ్వరుడు. అతడు కర్మాదిసాపేక్షకర్త. జీవు (పశు) న కాతడే ఫలము నిచ్చును. అతడు శరీరి, జగత్కారణుడు. ఈశాన, తత్పురుష, అఘోర, వామదేవ, సద్యోజాతమంత్రములు క్రమముగా నతని శిరోముఖహృదయగుహ్యచరణములు.

అతడు మంత్రమూర్తి. పతిరూపము లీవైదింట నీశానరూపమే క్షేత్రజ్ఞము, భోక్త. తత్పురుషము ప్రకృతిరూపము. అఘోరము ధర్మాద్యష్టాంగయుక్తమగు బుద్ధి. వామదేవ మహంకారము, సద్యోజాతము, మనస్తత్త్వము.

జీవుడే పశువు, అత డపరిచ్ఛిన్నుడు, దుర్జ్ఞేయుడు, కర్త. మల, కర్మ, మాయా, రోధశక్తులు నాల్గును పాశములు. అపవిత్రత మలపాశము. ఇందు బద్ధుడగు జీవుడు విజ్ఞానాకలు డనబడును. అసమాప్తకలుషుడగు జీవుడు సాధనచే మంత్రేశ్వరపదమును పడయును. కలుషమాప్తిచే నతడు విద్యేశ్వరపదమును గాంచును. ధర్మాధర్మములు రెండును కర్మపాశములు. ఈ పాశముల చేతను మలపాశము చేతను బద్ధుడగు జీవుడు ప్రళయాకలు డనబడును. ఈ జీవుడు పాశద్వయపక్వతచే ముక్తు డగును. సర్వపాశబద్ధుడగు జీవుని జీవసకలు డందురు. ప్రళయకాలమున దేనిచే సర్వకర్మములు నిహత మగునో, సృష్టిసమయమున దేనిచే నుద్భవించునో ఆ మాయ పురుషగతి నడ్డగించు కర్మరోధశక్తి యనబడును. ప్రళయాకలజీవులందు అపక్వపాశద్వయజీవులు పుర్యష్టక దేహధారులై నానాయోనులందు జన్మింతురు. పుర్యష్టక దేహమున అంతఃకరణ చతుష్టయము, పంచభూతములు, పంచభూతాత్మలు (తన్మాత్రలు), దశేంద్రియములు, శబ్దాదిపంచవిషయములు, కాలము, నియతి, విద్య, రాగము, ప్రకృతి, గుణము, భోగసాధనకళ యను ముప్పదియాఱు తత్త్వము లుండును.

## ప్రత్యభిజ్ఞ

కాశ్మీరమున అభినవగుప్తాచార్యులవారు ప్రతిష్ఠించిన శైవదర్శనమును ప్రత్యభిజ్ఞదర్శన మందురు. ప్రతిజీవి మహేశ్వరాభిముఖ్యముచే జ్ఞానమే ప్రత్యభిజ్ఞ. పరాసిద్ధి (ముక్తి) అపరాసిద్ధి (అభ్యుదయము)—ఇవి దేవలోకప్రాప్త్యాది బాహ్యక్లేశములు ఆంతరిక క్లేశములు లేకున్నను పరమేశ్వరత్వప్రాప్తిచే సిద్ధించును. పరమేశ్వర దాంపత్యము సంపత్తియొక్క పరాకాష్ఠ. ఈశ్వరుడు స్వభావముచేతనే నిత్యసిద్ధుడైనను, ఆ యీశ్వరరూపమున మాయావశము, ఆంశికము నగు అప్రకాశమానత్వమే జీవత్వము. సంపూర్ణ శాస్త్రసాహాయ్యముచే నీశ్వరునిపూర్ణ శక్తి నెఱుగవచ్చును. పూర్ణశక్తియగు పరమాత్మ ఆత్మసమ్ముఖమున ప్రత్యక్షమైనపుడు ఆతనిశక్తి ప్రతిసంధానముచే జ్ఞానము కలుగును. ఆ జ్ఞానముచే తనకు నీశ్వరునకు అభేదబోధ యేర్పడును.

ఈశ్వరుడు నిర్వికల్పుడు, నిర్వికారుడు. కాని అతనియందు శక్తిస్పందనము కలదు. నిస్తరంగ పరమాత్మని నిర్వికల్పసర్వతోముఖవృత్తియే స్పందనము, బ్రహ్మమందు జ్ఞానము, క్రియ కలవు. చిద్రూపత్వ, అనవిచ్ఛిన్నవిమర్శత్వ, అన్యోన్యముఖత్వ, ఆనందఘనైకత్వములే మహేశ్వరత్వము. ఆ మహేశ్వరుడు భావాత్మ, సమస్తపదార్థస్వరూపుడు. ఆతనియిచ్ఛ ననుసరించి జగత్సృష్టి సాగుచున్నది.

(సశేషము)

'కోటివిధ విద్యలెల్లను కూటికొఱకే కాత్మవిద్యకును సరి యగునే బూటకము లనక కుజనులు పాటింపరు శివ ముకుంద పరమానందా!'' -పరమానందయోగి.

# ఆస్తిక్యం

శ్రీ పున్నావఝ్ఝల సీతారామబ్రహ్మంగారు

## ఏకేశ్వరోపాసన

సువర్ణతత్వం క్షుణ్ణంగా తెలిసినవానికి బంగారంతో చేసిన ప్రతివస్తువుసంగతి తెలుస్తుంది. ఆలాగే భగవంతుని తెలుసుకున్న వానికి సృష్టిలోని ప్రతివస్తువు ఆంతర్యం తెలుస్తుంది; జీవితరహస్యం బోధపడుతుంది. భగవంతునితో సంయోగం పొందిన వానికి సర్వమూ వశమవుతుంది; సమస్త ఆశయాలు సంపూర్ణంగా సఫల మవుతవి. కనుక భగవంతుడున్నాడన్న విశ్వాసం గల వారికి అతనిని పొందడంకంటె కర్తవ్యం మఱిలేదు. ఆకర్తవ్యచింత విశ్వాసంనుంచి ఉద్భవించేదే, విశ్వాసంచేత ప్రేరేపించబడేదే, విశ్వాసాన్ని సర్వదా అంటిపెట్టుకొనిఉండేదే. అట్టి కర్తవ్యచింతను జ్వలింపజేసే విశ్వాసమే విశ్వాసం. అట్టికర్తవ్యచింతను రగుల్కొల్పని విశ్వాసం, విశ్వాసం కాదు. అది అభిప్రాయం లేదా, అభిమానం. ఏమైనా, అది దుర్బలమైనది గనుక నిరుపయోగం.

ఆస్తికుల మనుకునే వారిలో అనేకమందికి గల విశ్వాసం దేవునియందు కాదు, దేవుడున్నాడనే అభిప్రాయమందు. దేవుడున్నాడన్న అభిప్రాయమే మంచి దన్న నమ్మకమది. మన చుట్టూ ఉన్న సంఘంలో అనేకమంది దేవుడున్నా డంటున్నారు. కనుక ఉన్నాడంటారు. దేవుడున్నాడని బిగ్గఱగా పదే పదే చెబుతుంటే గౌరవం కలుగుతుం దని దేవుడు కలడని అంగీకరిస్తారు మఱికొందఱు. దేవుడు లేడంటే తమకు గౌరవం కలుగదేమో నని ఆస్తికుల మని చెబుతారు ఇంకా కొందఱు. పరంపరాగత మైన ఆచారప్రభావమే దేవుడున్నా డన్న కొందఱి నమ్మకానికి కారణం. లేడనుకొనడం కంటె ఉన్నా డను కొనడమే ఎందుకయినా మంచి దనే వారు కూడా ఉన్నారు. అవసరం కలిగినప్పుడు – తాత్కాలికంగా – దేవునియందు నమ్మకం పెట్టుకుంటారు కొందఱు – ఒడంబడిక కుదుర్చుకున్నట్టు. ఇటువంటి కారణాలవల్ల ప్రారంభమైన నమ్మకం కొందఱిలో తరువాత నిశ్చలము, సార్థకము అయిన ఆస్తిక్యం కలుగడానికి సహాయపడితే పడవచ్చుగాక. కాని ఈవిధమైన నమ్మకం మాత్రం ఆస్తిక్యం కానేరదు

మన లక్ష్యానికి విశ్వాసానికి తగినట్టే ఉంటుంది మన పూజావిధానం. మన పూజకు తగినట్టుగానే ఉంటుంది పూజాఫలం ఈశ్వరుడంటే సర్వేశ్వరుడే. సర్వేశ్వరుడు ఏకేశ్వరుడే. సర్వేశ్వరుడు కానివాడు ఏకేశ్వరుడు కాడు. ఏకేశ్వరుడు కానివాడు సర్వేశ్వరుడు కాడు. సర్వమునకు ఈశ్వరు డైనవాడు ఒక్కడు కాక అనేకమంది ఎలా కాగలరు ? ఏకేశ్వరు డంటే ఏదో ఒకానొక ఈశ్వరు డని అర్థంకాదు. సమస్త బహుళత్వము ఏ ఒకే ఒక్కనినుంచి ఉద్భవిస్తున్నదో అట్టిపరాత్పరుడే ఏకేశ్వరుడు. సర్వగతుడయినను, వివిధరీతుల తన్నుతాను ప్రకటించుకొంటున్నను అతడు ఒక్కడే గాని అనేకం కాదు.

దేవుని గుఱించిన ఆహోహాలు కొన్ని ప్రజా బాహుళ్యంలో ప్రబలంగా వ్యాపించిపోయినవి. అవి అనేక అనర్థాలకు కారణమయినవి. అట్టి ఆహోహాలను తొలగించి, సరైన భావాలు తెలియజెయ్యడంకోసం ఈశ్వరుని ఏకేశ్వరుడని ప్రత్యేకించి చెప్పవలసి వచ్చింది. ఎప్పటి కప్పుడు ఆచరణలో ఉన్న పద్ధతులను సమర్థిస్తుండడమే కొందఱి ప్రవృత్తి. అందుచేత దేవునిగుఱించిన అహోహాలను తొలగించడానికి జరిగే ప్రయత్నాలను సంఘంలోని పెద్దలు, పిన్నలు ప్రతిఘటిస్తుంటారు. అహోహాలకు పెద్దలు అంతరార్థాలు చెబుతుంటారు. ఈ అంతరార్థాలు శాస్త్రచర్చలలో వినబడేవేగాని క్రియా రూపంలో కనబడుతున్న దోషాలను పరిహరించగలవి కావు. అంతరార్థాలు చెప్పే వారు బాహ్యార్థాలను బహిరంగంగా ఖండించనయినా ఖండించరు. సంఘంలోని ప్రముఖులు చెబుతున్న దానికి, చిరకాలంగా వస్తున్న ఆచారానికి విరుద్ధమైన మాటలను – అవి వేదమంత్రార్థాలయినాసరే–వాటిని సామాన్యప్రజలు అంగీకరించడానికి సాహసించలేరు. ప్రజా బాహుళ్యానికి గల నమ్మకాలకు, పూర్వాచారానికి విరుద్ధమైన సత్యాలను బాహాటంగా చెప్పడానికి తెలిసినవారు కూడా పచ్చివెలక్కాయ గొంతున పడ్డట్టు ఉక్కిరిబిక్కిరి అవుతారు.

''సర్వంఖల్విదంబ్రహ్మ'' అన్న మహా వాక్యానికి విపరీతార్థం కల్పించి, దేనిని పూజించినా దేవుని పూజించినట్టే నని చెప్పడం సర్వసాధారణమైపోయింది. దేవుని ప్రతిమానవునికి సులభంగా అందుబాటులోకి తీసుకరావాలనే సత్సంకల్పంతో కొందఱు ఈ వాదాన్ని ప్రోత్సహించారు. ఇందులో కొందఱు సృష్టికర్తకు విగ్రహాలు సృష్టించారు. కొందఱు చారిత్రక పురుషులను, మఱికొందఱు కల్పిత పురుషులను భగవంతుని అవతారాలుగా ప్రతిపాదించారు. అట్టి మహిమాన్వితుల ప్రతిమలనో, ఛాయా చిత్రాలనో అర్చిస్తే చాలు నన్నారు. పోనీ, అట్టి మహాత్ములవలె జీవించడమే వారిని పూజించడం అని అయినా చెప్పరు. అంతటిమాట చెప్పి లాభంలేదని వారికి తెలుసు. సజీవ గురువును ఆశ్రయిస్తే భగవద్భక్తి ఫలితం నిస్సందేహంగా దక్కుతుందని మఱికొందఱు ప్రబోధంచేశారు. ఒకానొక ప్రవక్తద్వారా అయితే దేవుని దర్శనం త్వరగా కలుగుతుందని వేఱు కొందఱు సిఫార్సుచేశారు. ప్రతివారు ఎవరి మట్టుకు వారు శ్రమపడి స్వయంగా దేవుని ధ్యానించ నవసరం లేదని, ఒకరి తరపున మఱొకరు అర్చనచేస్తే సరిపోతుందని, ఇంకా కొందఱు పెద్దలు ''దేవతార్చన'' పద్ధతి ఏర్పాటు చేశారు.

సులువుగా ఏ ఉపాయం వీలయితే ఆ ఉపాయం అవలంబించాలని కోరుకొనడం సహజం. మనలను పీడిస్తున్న కోర్కెలను, ప్రేరేపిస్తున్న ఆశలను మనం కోరేవిధంగా వెంటనే తీర్చే దేవుడున్నాడంటే, ఆదేవునికే మ్రొక్కుతారు అందఱు. అటువంటి దేవుళ్లను – సజీవ దేవుళ్లను, నిర్జీవ దేవుళ్లను మనవారు ఎప్పటికప్పుడు కల్పిస్తూనే ఉన్నారు. ఎన్నికలలో పోటీచేస్తే ఆ దేవుళ్లకు వచ్చినన్ని ఓట్లు నిజమైన దేవునికి– ఏకేశ్వరునికి రావు. తాను చెప్పినట్టు మనం నడుచుకోవాలనే దేవుని పూజించడం ఇష్టం ఉండదు. మనం కోరినట్టు నడుచుకునే దేవుడంటేనే అందఱికీ ఇష్టం. మనస్సుకు ఏదో ఒక విధంగా సంతృప్తి కలగడమే ప్రధాన మని

భావించి, మానవ దౌర్బల్యం కోరే కోర్కెలన్నిటికి అనుగుణమైన విధానాలు భగవత్ప్రాప్తికి సూచించారు. దౌర్బల్యాన్ని తరింపజెయ్యడానికి ముందు లాలనచెయ్యడం అవసరమని, దీర్ఘకాలంలో పెద్దప్రయోజనం కలుగగలదన్న ఆశతో ప్రతిపాదించబడిన పద్ధతులన్నీ మానవుని దౌర్బల్యాన్ని వృద్ధిచెయ్యడానికే సహాయబడినవి.

మఱొక విశేషం : ప్రజాహితమే లక్ష్యంగా స్థాపించబడే రాజకీయపక్షాలు అచిరకాలంలో తమ లక్ష్యాన్ని అలక్ష్యంచేసి, తమ పార్టీలను బలపఱచుకొనడానికి, ఇతరపార్టీలతో పోటీ పడ్డానికి ఏవిధంగా వీలయితే ఆవిధంగా ఇతర పార్టీలను అణగద్రొక్కడానికి, తమ పార్టీ అధికారం చేజిక్కించుకోడానికి తంటాలుపడుతున్న సంగతి జగద్విదితం. ఈ వైఖరి మత విషయంలో మఱింత మూర్ఖంగా, మొండిగా వ్యక్తమైంది.

''అది జ్ఞాపకార్థమే'', ''ఇది తాత్కాలిక సహాయం మాత్రమే'' ''ఆయన ఉపదేశంనీకు ఉపయోగపడవచ్చు''. ''ఈగ్రంథంగొప్పది''. ''ఇది గుఱికుదరడం కోసం'' అని దేనినయినా సూచిస్తే, అవి త్వరలో దేవునికిస్వస్తిచెప్పడం, దేవుని పొందడానికి చెయ్యవలసిన ప్రయత్నాన్ని విరమించడం, సహాయకారి కాగలదని చూపినమనిషినో, బొమ్మనో, పుస్తకాన్నో, అనుష్ఠానాన్నో పట్టుకొని దానికే దేవుని సింహాసన మప్పగించడం, దాని చుట్టూ ప్రదక్షిణంచేస్తూ భజించడం పరిపాటి అయింది. అవతారవాదాలు, గురువాదాలు, మధ్యవర్తి వాదాలు, గ్రంథాల అపౌరుషేయ వాదాలు, విగ్రహపూజలు కొన్ని యీవిధంగా వెలసినవే.

కొందఱు ''ఇవి ఉత్కృష్టమైన పద్ధతు లని ఎవ రన్నారు? ఇవి పామరులకొఱకు పెట్టినవి'' అని చెబుతారు. తత్త్వవేత్తలూ తపస్వులు కూడా వీటిని అనుసరిస్తుండడంచేత, వీటిని విడిచిపెట్టినవా రెవరూ కనబడకపోవడంచేత పామరు లెవరో, పామరులు కానివా రెవరో తెలియడంలేదు. పైగా ఎవ్వరూ ఏ నాటికీ ఆ పామరత్వాన్ని అతిక్రమించినట్టు కనబడ్డంలేదు. అతిక్రమించా లన్న కోర్కె ఉన్నట్టు కూడా తోచడంలేదు. వీటికి పామరత్వమే కారణమో, పామరత్వానికి ఇవే కారణమో నిర్ణయించడంకూడా దుస్తరమైపోయింది.

లక్ష్యం స్మృతిపథంనుంచి మఱుగునపడి, తాత్కాలికోపాయాలు లక్ష్యమై పోవడంచేత దైవచింతసాధన మతసంస్థల రూపం దాల్చింది. అంతఃప్రేరణ ననుసరించి మనిషి కొకవిధంగా ఉండదగిన సంకేతాలు, సంస్కారాన్నిబట్టి ఎవరికివారు నిర్ణయించుకొనవలసిన విధి నిషేధాలు, తాత్కాలికమైన విధానాలు సమష్టికి అనుల్లంఘనీయమయిన శాశ్వతధర్మాలుగా మారినవి. ఈ విధులను పాటించడమే-బాహ్య కర్మానుష్ఠానమే ఆధ్యాత్మిక సాధనంగా పరిగణింపబడసాగినది. ఈ విధులను ఆచరించక పోవడం పరమనాస్తికత్వంగా నిరసింపబడినది. తాముచెప్పే దేవుని తమకంటె ఎక్కువభక్తితో ఉపాసించే అన్యమత సంప్రదాయాలవారు శత్రుసమానులైనారు. దైవదూషణచేస్తున్నా, మృగజీవితం గడుపుతున్నా తమ మతవిధులను మన్నించేవారు ఆత్మీయులైనారు.

విధుల భేదాలకు, విధానాల భేదాలకు ప్రాధాన్య మిచ్చి ఒక దేవునికంటె మఱొక దేవుడు

గొప్పవాడని, ఒక ప్రవక్తకంటె మఱొక ప్రవక్త మహిమాన్వితు డని, ఒక గ్రంథం కంటె మఱొక గ్రంథం ఈశ్వరదత్తమని, ఒక విగ్రహంలోకంటె మఱొక విగ్రహంలో ఎక్కువ మహత్తకల దని, ఒక అనుష్ఠానం కంటె మఱొక అనుష్ఠానం శ్రేష్ఠమైనదని యుక్తులపై యుక్తులు పన్ని సిద్ధాంత రాద్ధాంతాలు చేస్తుంటారు. ఇందుకు ప్రచారకు లవతరించారు. పెద్దపెట్టున ప్రతిమతం వ్యయప్రయాసలతో ఇట్టి ప్రచారం చేస్తున్నది. ఇతర మతాలవారిని తమ మతాలలోకి త్రిప్పుకొనడానికి ప్రయత్నిస్తుంటారు. ఇది దైవకార్యమని తాము నమ్ముతూ ఇతరులను నమ్మించడానికి ఆరాటపడుతుంటారు.

నేను ఆస్తికుడ నని చెబితే నన్నెవ్వరూ అభిమానించరు. నేను హిందువుననో, క్రైస్తవుడననో, మహమ్మదీయుడననో ప్రకటించుకొనగానే ఆయా ప్రత్యేక మతస్థులు నన్ను తమవానిగా ఆదరిస్తారు. నేను దైవచింతతో జీవితయాత్ర సాగిస్తున్నానంటే న్యాయం దెవ్వరికీ లక్ష్యంలేదు. "మహమ్మద్ వంటి ప్రవక్త లేనే లేడు" అనిగాని, "ఏసునాథునివంటి అవతారం మఱిరాదు" అనిగాని, "క్రీస్తులు, మహమ్మద్‌లు, బుద్ధులు ఎందరయితేమాత్రం ఒక్క నవనీతచోరునికి, గోపికాలోలునికి దీటురాగలరా? అనిగాని భజనచేస్తుంటే నన్ను గౌరవిస్తారు. అపౌరుషేయమైన గ్రంథాలు వేదాలు మాత్రమే ననిగాని, సమస్తసత్యము బైబిలులోనే తిష్ఠవేసుకొని ఉన్న దని గాని, ఖొరాన్‌లో లేని విషయం నిజంకానేర దని గాని ప్రచారంచేస్తుంటే నేను భాగవతోత్తముడ నుగా చెలామణి అయి, పాదపూజలు పొందగలను.

మత దుర్భ్రమలో తగుల్కొన్నవారు చదువురానివారు మాత్రమే ననుకొనడం శుద్ధ పొరబాటు. విద్యాధికులు, ఇంగ్లీషువిద్యలో ప్రావీణ్యంపొందినవారు, పాశ్చాత్యసంస్కృతీ సంపన్నులు, వైజ్ఞానికులుకూడా ఈ భ్రాంతిలో వెనుకబడిలేరు. అందఱి ధోరణీ ఒకటే. మత మాధ్యంవిషయంలో చదువుకున్న వారికి, చదువు లేనివారికి సామ్యమే గాని తారతమ్యంలేదు.

ఒక ప్రవక్తయందు, ఒక గ్రంథమందు, ఒక బాహ్యాకర్మానుష్ఠానమందు అమోఘమైన భక్తిలేని దైవచింత నిరర్థకమని, నిర్గంధ కుసుమంవంటి దని కూడా ఘోషించబడినది. హిందూమతంలో ప్రవక్తలకు బదులు అవతారాలు, విగ్రహపూజలు, విగ్రహాల ఉత్సవాలు, విగ్రహాల పెళ్ళిళ్ళు, వేడుకలు, వినోదాలు వాటితోపాటు వింతలు, విడ్డూరాలుప్రాధాన్యం వహించినవి. ఇవన్నీ మానవునికి దేవుని దూరంచేసినవి. మానవునికి తోడిమానవునికి వేర్పాటుకలిగించినవి. ఏ సత్సంకల్పముతో ఇవి తొలుత ప్రతిపాదించబడినవో సరిగా తద్విరుద్ధమైన ఫలితాలకే దారితీసినవి. ఇదంతా గమనించిన బుద్ధిమంతులు కొందఱు అసలు దేవుడే పెద్దబూటకమన్న నిర్ణయానికివచ్చారు, వస్తున్నారు.



వెలిచూపును లోచూపును గలయంగా నొక్కచూపుగాఁ జూచిన యా
నిలుకడ గల యోగీంద్రుఁడె సలలితసుజ్ఞాని యన్న సంపఁగిమన్నా. —పరమానందయోగి.

# నిర్వాణషట్కము *

డాక్టరు ఓరుగంటి రామచంద్రయ్యగారు, ఎమ్.ఏ., పిహెచ్డి.

అంతఃకరణము నహంకృతి బుద్ధి
మనసును తనువును తను వికారములు
శబ్దరూపములు రసంబు గంధముల
తెలుపు నింద్రియము లిం దేవియుఁ గాను,
వ్యోమ తేజములు వాయువు భూమి గాను
పరసచ్చిదానంద పరమహ మ్మేను
పరశివోహమ్ము తత్పరశివోహమ్ము.

ప్రాణమ్ము, ప్రాణాది వాయుపంచకము,
పంచభూతములును, పంచకోశములు,
కర్మేంద్రియములు తత్కర్మ ఫలంబు,
లవి గాను, పరసచ్చిదానంద మేను
పరశివోహమ్ము తత్పరశివోహమ్ము.

ఊహయు ద్వేషమ్ము మోహలోభములు
ధర్మమోక్షములు స్వార్థమును నసూయ
కామ కామ్యముల నొక్కం డేని గాను
పర సచ్చిదానంద పరమహ మ్మేను
పరశివోహమ్ము తత్పరశివోహమ్ము.

పాపము పుణ్యము వగయు మోదమ్ము
తీర్థయాత్రా వేద దేవ పూజనము
లుపభోగ్య ముపభోగి యుపభోగములును
అవి గాను, పరసచ్చిదానంద మేను
పరశివోహమ్ము తత్పరశివోహమ్ము.

మృతి మృత్యుభీతియు మొదలవు, లేదు
కులము, పుట్టువె లేదు, కలిగెద రెట్లు
పితరులు మిత్రు లా యితర బంధువులు?
గురువును లేఁడు శిష్యజీకము లేదు
పరసచ్చిదానంద పరమహ మ్మేను
పరశివోహమ్ము తత్పరశివోహమ్ము.

జ్ఞేయుఁడన్ గాను, ముక్తిని గాను, నన్ను
వాసనల్ తలఁగు, నుపాధియు సీను
లను మాట లేదు, కాలము దేశములకు
నవల నా గీము, నే నాదు. సర్వమ్ము,
సర్వమయుండ విశ్వాధార మేను
పరసచ్చిదానంద పరమహ మ్మేను
పరశివోహమ్ము తత్పరశివోహమ్ము.

* గీర్వాణమూలము : శ్రీశంకరభగవత్పాదులు; ఆంగ్లమూలము. శ్రీవివేకానందస్వామి.

# శ్రీమద్భాగవతము - శ్రీకృష్ణసందేశము

[శ్రీమత్ప్రభవానందవాణి]

## చతుర్థస్కంధము

### చతుర్థాధ్యాయము

### పురంజన నగరము

కాలక్రమమున విజితాశ్వుని కుమారుడగు ప్రాచీనబర్హి భూమండలాధిపతి అయ్యెను. ఆయన మంచిరాజే కాని ఆధ్యాత్మికసత్యముల మఱచి ఐహికమందు ప్రగాఢాసక్తి గలిగి యుండెను. అతనియందు నారదమహర్షికి ఎంతో ప్రేమ. అత డైహికాసక్తుడుగ నున్నందుకు వెతచెంది అగాధాజ్ఞానపంకమునుండి అతని నుద్ధరించి బ్రహ్మజ్ఞానము నుపదేశింప గోరి నారదు డతనియొద్ద కరుదెంచెను.

నారదు డిట్లనెను: 'రాజా, ప్రేయో మార్గము ననుసరింపకు. శ్రేయోమార్గము ననుసరింపుము. జీవితమున నీవు నిక్కముగ గడింప గోరు లాభ మేమి? దుఃఖముల ఆత్యంతికనివృత్తియు నిత్యానందప్రాప్తియు పరమ శ్రేయములు, సాధించుకోవలసిన మహోన్నత లక్ష్యములు. కాని నీ యీ ఐహికపరత నీకు వానిని గల్గింప జాలదు.''

ఇందులకు ప్రాచీనబర్హి ఇట్లు బదులు చెప్పెను — మునిపుంగవా, ఐహికవస్తువులు నాడెందము నంతగా ఆకర్షించుచున్నవి. అజ్ఞానము నాబుద్ధి నంత దట్టముగ ఆవరించియున్నది. కావున ముక్తిమార్గము నెఱుగకున్నాను. ఐహికసంగవిముక్తిని పరమశ్రేయఃప్రాప్తిని గల్గించు జ్ఞానమును నా కుపదేశింపుమా.

నారదు డిట్లుపక్రమించెను—నేను నీకొక కథను జెప్పెద. నీకు నే నుపదేశింప గోరిన పరమార్థము నది అన్యాపదేశముగ దెలియజేయును—

పురంజను డను నొక రాజు సుప్రసిద్ధుడుండెను. అతని కొక అంతరంగికమిత్రు డుండెను గాని ఆమిత్రుని పేరుగాని వృత్తిగాని ఎవరికిని తెలియదు.

నివాసార్హమగు నొక తావును కనుగొన గోరి పురంజనుడు భూమండలమం దంతటను సంచరించెను. కాని ఆకోర్కె నెఱవేఱనేలేదు. అతడు తనలో ఇట్లనుకొనెను—''ఎన్నియో నగరములను జూచితిని కాని ఒక్కటైనను నాకు నచ్చ లేదు. నా అన్ని కోర్కెలను నేను తీర్చుకోగలిగిన నగరమున నుండ వలె నని నాయాశ. ఈ నగరాలలో ఒక్కటైనను అందుకు చాలినది కాదు''.

తుద కతడు భారతవర్షమున హిమవత్పర్వతపంక్తికి దక్షిణమున నున్న యొకనగరమునకు వచ్చెను. నవద్వారములు గలిగి పరమ భాస్వరభవనరాజములు గలిగి సుసుందరోప

వనములు గలిగి నిర్మలోదకసరస్సులు గలిగి, ఆమహోజ్జ్వల నగరము అత డన్వేషించుచుం డిన అన్ని సౌకర్యములును గలదిగా గోచ రించెను. తన కోరిక లన్నియు తాను తీర్చుకొ గలచోటుగా అది ఉన్నందున, ఇక తనకు త్రిప్పట అక్కఱలే దని అత డనుకొనెను.

వెంటనే ఒకనాడు సఖీజనపరివృతయై ఒక తోటలో సంచరించుచున్న యొక తరుణ సుందరి నతడు కాంచెను. వారు కలసికొనిరి, ఒండొరులను వలచిరి, అచిరకాలముననే దంప తులుగ నైరి. నవద్వారయుతమగు ఆనగర మున వారు వసించుచుండిరి. ఆద్వారముల గుండ సంచరించుటచేతనే తన కోరికలు తీరు చున్నట్లు పురంజనుడు తలంచెను. కాని, అ దేమి వింతయో, యథార్థమగు సంతృప్తి అత నికి కల్లకే యుండెను. అతనికి భార్యపై నిప్రేమ గాఢము. ఆమె సన్నిధినున్నప్పుడు మాత్రమే అతడు హాయిగ నుండెను. ఆమెయిష్టములనే తన యిష్టములుగ నతడు కావించుకొనెను. ఆమె ఏడ్చిన తానేడ్చెను. ఆమె నవ్విన తాను నవ్వెను. ఇట్లు ఆమె కోర్కెలకును చిత్త ప్రవృత్తులకును ఇతడు బానిసయై, తన స్వాతం త్ర్యమును పూర్తిగ కోల్పోవుదశలోనుండెను.

ఆరమణీయ నగరమున నతడు పెక్కుసంవ త్సరము లుండెను. ప్రతికోర్కెను తీర్చుకొను చుండెను. కాని, ఇట్టి జీవితవిధానమువలన శాశ్వతానందము కాని సౌఖ్యము గాని అతనికి కలుగనే లేదు.

పురంజనమహారాజు ఇట్లు భోగానుభవనిమ గ్నుడై, తక్కిన యన్నింటిని విస్మరించి యుండ అత డున్న నగరముమీదికి మహావీరుడగు నొక సేనాపతి దండెత్తివచ్చెను. ఆవీరునొద్ద నొక అద్భుతమంత్ర ముండెను. దాని విధ్వంసన శక్తి అపారము. దానిచే నతడు ఆ నవద్వార యుత సుందరనగరమును పడగూల్చెను. పురం జనుడు సైతము తప్పించుకొనలేక పోయెను. తనయొద్ద నున్న సమస్తము కోల్లపోవుట అతడు గుర్తించెను. తుది దుర్గమన దగిన తనయెఱుకను జ్ఞప్తినికూడ నతడు కోల్పో యెను. గడచిన వృత్తాంతమును, తన రాజ్య మును, తన మహానగరమును — ఇంతటిని ఇంచుమించు పూర్తిగా నతడు మఱచెను. ఒక్కస్మృతిమాత్ర మతనికి మిగిలియుండెను— సౌందర్యవతియగు తన ప్రియురాలిస్మృతి. ఆస్మృతి అతనిలో ఎంతప్రగాఢముగ నుండె ననగా తక్కిన జగతిని గూర్చిన తన విస్మృతి నతడు కనుగొననే లేదు. అతని ప్రకృతినంత టిని ఆమె మూర్తి ఆవరించెను. తన మన స్సును గ్రసించిన యొక మూర్తిలో తానే లీనుడై ఐక్యమొందు వెఱ్ఱివానివలె, పురంజనుడు సుందరియగు ఏ ప్రియురాలిని భావనచేయుచుం డెనో తా నామెగా మాఱిపోయెను.

ఈతరుణి (=పురంజనుడు) తొలుత తా నెవరో పూర్తిగా మఱచిపోయెను, మలయ ధ్వజు డను రాజును కలసికొని, అతనినే వలచి పెండ్లాడెను. కొన్నాళ్లకు ఆ రాజు మరణిం చెను. ఆమె మరల ఒంటిజిక్కి ప్రియుని స్మృతి కిని తనకు గలిగిన నష్టమునకును విలపించు చుండ, అజ్ఞాతుడగు నొక విప్రు డామె యొ ద్దకు వచ్చి ఇట్లనెను.

"ఓ ప్రియమిత్రమా, ఏల దుఃఖించు చున్నావు? నేను నీప్రియమిత్రుడను. నన్నెఱు గవా? నీ వెవరవో ఏమిగా ఉంటివో జ్ఞప్తికి తెచ్చుకొన ప్రయత్నింపుము. నేను సదా నీ మిత్రుడనుగనే ఉంటిని. నీవు నన్నొప్పరికిం చితివి, పూర్తిగ విస్మరించితివి, సుఖములను

భోగములను వెదకుచు తొలగి చనితివి. నీవును నేనును మిత్రులము. మన సంబంధ మనాది. నీవు నన్ను మఱచినను, నేను సదా నీ వెంబడినే ఉంటిని. నీవు నవద్వారయుతమగు నగరమున ప్రవేశించితివి. ఒకానొక మహిళయందు ప్రగాఢమగు ఆసక్తి వహించితివి. నీ నిజమైన ఆత్మను మఱచితివి. నీగతచరిత్రమును పూర్తిగా మఱచి ఈమానవునికి నీవు భార్యవైనట్లు విశ్వసించితివి. నీవు పతివియు కావు సతివియుకావు. నీలో స్త్రీత్వము కాని పుంస్త్వముకాని లేదు. నీవును నేనును వేఱు కాము. నేనే నీ వని తెలిసికో. అద్దమున చూచుకొన్న వానికి తా నిద్దఱుగా నగపడినరీతి, నీవు, నీవుగను నేను గను అగపడుచున్నావు. కాని నిక్కమునకు మన మొక్కరమే''.

ఈచరితమందలి వ్యంగ్యార్థమును జెప్పుమని ప్రాచీనబర్హి కోరగా నారదు డంగీకరించి ఇట్లనెను :—

''రాజా, కథలోని పురంజనుడు 'పురుషుడు' 'దివ్యాత్మ', 'పురము'నకు (=శరీరమునకు) ఆవిష్కర్త ఆత్మయే కావున ఆత్మ పురంజను డనబడెను. నేను చెప్పిన అజ్ఞాతసుహృత్తు బ్రహ్మమే (దేవుడే). దేవు నెవ్వరు నెఱుగరు, ఏల యన గుణకర్మముల కాయన అనిర్వాచ్యుడు, గుణకర్మము లాయనను జూపజాలవు.''

పురములు (శరీరములు) వివిధములు. అందు మానవశరీరము సకలకామోపభోగములకును తగిన సాధనము. చక్షుశ్శ్రోత్ర ఘ్రాణాది నవద్వారములు గల నగరము ఈమానవశరీరమే. పురుషుడు (దివ్యాత్మ) శబ్దాది విషయముల అనుభవించుటకై ఆ నవద్వారములగుండ వెలువడును. బుద్ధియే ఇల్లాలు. ఆమెతో గూడియే నరుడు ఈలోకమును ఇందలి వస్తువులను అనుభవించును. బుద్ధితో అహంకారముతో తన్ను అభిన్నముగా భావించుటతో దివ్యాత్మ తనయథార్థస్వరూపమును విస్మరించి అజ్ఞానాహంకారములలో నిమగ్న మగును.

ఆమహాసేనాపతి ఎవ రనగా సర్వగ్రసన సమర్థమగు కాలము. వ్యాధియు మరణమునే అతని యొద్ద నున్న మంత్రములు. ఈ శరీరమును తుదకు నాశనము చేయునవి వ్యాధియు మరణమును.

మానవుడు దివ్యుడు ముక్తుడు ఆనందపూర్ణుడు. మాయవలనై అతడు అవిద్యగుణముల తనకు ఆరోపించుకొనుచున్నాడు. క్షుత్పిపాసలు ప్రాణమువి, కామము బాహ్యాభ్యంతరేంద్రియములవి. కాని ఇవన్నియు మానవుని లోని ఆత్మకు ఆరోపితము లగుచున్నవి. ఆత్మకన్ననో ముక్తతయే స్వభావము.

తన యథార్థదివ్యతను మఱచి మిథ్యాహంతతో తన్ను అభిన్నునిగ భావించి, మానవుడు లోకమందును లౌకికానందములందును తగుల్కొనుచున్నాడు. అప్పుడు కర్మము లతనిని బంధించును. కర్మానుగుణములైన జన్మము లతనికి ప్రాప్తించుచుండును.

కర్మములు త్రివిధములు— సాత్త్వికములు, రాజసికములు, తామసికములు. సాత్త్వికకర్మము లొనర్చిన మానవుడు ఊర్ధ్వలోకములందు జన్మించును. రాజసికకర్మకర్త సుఖదుఃఖములనడుమ దారి చేసికొని పురోగమింప వలసిన యీ లోకమున జన్మించును. తామసికకర్మల జేసినవాడు అసుఖమయజన్మము నొందును. ఆజన్మమున సమగ్రముగ వంచితుడగును. కావున ప్రాణులు పశువులుగనో మగవారుగనో మహిళలుగనో దేవదూతలుగనో వేల్పులుగనో పుట్టువొందుటకు వారి

కర్మలే కారణములు. కర్మానుగుణముగ వారికి ఊర్ధ్వగతియో అధోగతియో గల్గుచుండును, సుఖమో దుఃఖమో పాటిల్లుచుండును.

జననము వెంబడే మరణమును ఉన్నది. మొత్తముమీద బ్రతుకు దుఃఖమయము. నెత్తిని మోయుచున్న బరువు దుర్భరమైన ప్పుడు మానవుడు దానిని భుజములమీదికి మార్చుకొనునే కాని, బరు వేమో అతనికి తప్పదు కదా. అట్లే మానవునకు బ్రతికినన్ని నాళ్లు దుఃఖభరము తప్పదు. ఈబరువు కర్మల బరువే. స్వలాభాపేక్షతోను సక్తితోను చేయ బడిన కర్మలు అజ్ఞానమున చేయబడినవి. తన దివ్యాత్మస్వరూపయాథార్థ్యజ్ఞానము మానవు నకు గలిగినప్పుడే అతనికి కర్మబంధమును అజ్ఞా నమును తొలగును. అప్పు డతనికి పారమార్థి కానందమును నిత్యజీవితమును గల్గును.

భగవంతునందు ప్రేమయు స్థిరభక్తియు గల్గినప్పుడే పారమార్థికజ్ఞాన ముదయించును. భగవత్ప్రేమగలవాడు సంసారము నతిక్రమిం చును. అట్టి ప్రేమ నిజమునకు పరమమైనది.

భక్తిశ్రద్ధలతో భగవద్వాణి నాలకింపుము. నీ డెందమున ప్రేమ వర్ధిల్లవలె ననిన దేవుని యాథార్థ్యమును ప్రకాశపఱచు ప్రమాణ గ్రంథముల చదువుము. భగవంతుని వాగ మృతమును గ్రోలు వారు నిక్కముగధన్యులు. ఏల యన వారికి దురహంకార ముండదు, భయ ముండదు, మోస ముండదు, దుఃఖ ముండదు. ప్రేమనాథుని తమ ఆత్మనాథునిగా ధ్యానించువారు నిక్కముగ ధన్యులు, ఏల యన వారికి అజ్ఞానబంధ ముండదు, కర్మదాస్య ముండదు.

ఏపని ప్రేమనాథునకు ప్రియమో అదే పుణ్యము. ఏజ్ఞానముచేత మన డెందము దేవునం దైక్య మొందునో అదే పారమార్థిక జ్ఞానము.

విశ్వనాథుడు పరమశివుడు సర్వశరణ్యుడు. ప్రియము లన్నిటికంటె ఆయనే ప్రియతముడు. ఆయన సాక్షాత్తు మన ఆత్మయే. ఆయన నెఱి గిన వానికి ఎట్టి భయమును లేదు. ఈ సత్య మెఱిగినవాడే పరమసత్య మెఱిగినవాడు. అతడు దేవునితో అభేద మొందును కావున అతడే తత్త్వోపదేష్ట యగును.

జీవితము భంగురము. గాలి కెంత నిలుక డయో మర్త్యుని ప్రాణమున కంత నిలుకడ. బ్రతుకుకై పీల్చబడు ప్రతిశ్వాసయు మరణ మును డగ్గఱించు శ్వాసయే. క్షణిక సుఖాల నన్వేషించుచు జీవితములను వెచ్చించుట మన అవివేకము. దేవు నాశ్రయింపుము, ఆయన యొక్కడే మనకు గతి. దేవునం దైకాంతిక భక్తి గల్గి వాంఛలనుండి విడు పొందుము.

అంత ప్రాచీనబర్హి ఇట్లడిగెను—"పూజ్య గురూ, నీవు బోధించిన విషయము నాడెంద మున గాటముగ నాటుకొన్నది. నీయుపదే శానుసారము నడచుకొన యత్నింతును. కాని నా కింకను ఒకసందేహ మున్నది— దయచేసి ఆ సందేహమును దీర్పుము. తానుచేసిన కర్మ లెట్టివో మానవు డట్టివాడుగ ఉండు నందురు. కాని అన్నికర్మలకును ఫలితము వెంటనే కలు గగా మనము చూడలేము. నరుడు మృత్యువు నోట బడినపిమ్మట, కర్మఫలముల ననుభవించుట కెవ రున్నారు? శరీరము నశించినప్పుడు దాని తోనే కర్మలును నశింపవా?"

నారదు డిట్లు చెప్పెను. "రాజా భౌతిక శరీరము మాత్రమే మరణించును, ఆమరణము తోనే సూక్ష్మశరీరము చావదు. మానవుని కర్మల సంస్కారములు ఆసూక్ష్మశరీరమం

దుండును. మరణించి మానవుడు భౌతిక దేహమును వీడినను, కర్మలు అతని నంటియే యుండును. ఆకర్మ లెట్టివో, అతని మఱుజన్మ మట్టిదిగానుండును. మఱుజన్మమున నతడు తన కర్మఫలములైన కష్టసుఖముల ననుభవించును.

చిత్తమే ఆత్మ అనియో బుద్ధియే ఆత్మ అనియో అనుకొనుటవలన అహంకారము పుట్టును. ఆ అహంకారమే కర్మలకు కర్త. సూక్ష్మదేహమే (మనస్సే) ఆత్మ అనుకొన్నప్పుడు ఆసూక్ష్మ దేహమే జీవుడుగ భాసించును. కష్టసుఖానుభూతులేమి భయవిభ్రాంతు లేమి కల్గునది యీ జీవాత్మకే. ఈభ్రాంతి ఉన్నంతకాలము మానవునకు కర్మబంధమును జనన మరణవశతయు నుండును. అజ్ఞానముచేతనే సకలబంధములును కలుగును. పారమార్థిక జ్ఞానము గల్గినప్పుడు విముక్తి చేకుఱును. అట్టి జ్ఞానము నొంద వలె నన్న అందుకు మార్గము ఆస్థతో భగవంతు నుపాసించుటయు భగవంతునే సర్వత్ర సాక్షాత్కరించుకొనుటయు."

ఇట్లు నారదుడు బోధింపగా, ప్రాచీనబర్హి తపశ్చర్యకై కపిలాశ్రమమున కేగెను. అట ఏకాంతమున నుండి, భగవద్ధ్యానము గావించుచు నతడు ఆత్మజ్ఞానమును విముక్తిని బడసెను.



# శ్రీకాళహస్తి మాహాత్మ్యము - యోగవిషయములు

## శ్రీ నిడుదవోలు పెద సూర్యనారాయణగారు

అష్టదిగ్గజములలో నొకడైన ధూర్జటిమహాకవి రచించిన శ్రీకాళహస్తిమాహాత్మ్యమును వేంకట్రామ్ అండు కో వారు శ్రీచిలుకూరి పాపయశాస్త్రిగారి పరిష్కారముతో లఘుటీకతో 1961 సం॥న ప్రకటించినారు.

ఈసందర్భమున నేను మనవిచేయునది ఏమనిన సాధారణముగ ఆధ్యాత్మికపదములు అనుభవించిన కాని తెలియవు.

"గోవు" అను పదము వినగనే కొమ్ములు చెవులు మూపురము కాళ్లు పొదుగు మొదలైన అంగము లన్నిటితో పూర్తిస్వరూపము గోచర మగును.

కాని హంసతత్త్వము అను పదము చెవికి సోకినంతనే హంస యేమి తత్త్వ మేమి అను సంశయము జనించి భావించుటకైన అవకాశములేని పరిస్థితి గలుగును.

ఇందుకే కాబోలు "శాస్త్రదృష్టిర్ గురోర్వాక్యం తృతీయం చాత్మనిశ్చయ" అన్నారు ప్రాజ్ఞులు.

ప్రథమాశ్వాసము 102 పద్యము మూడవ పాదములో "హంసమంత్రమణి" చక్షులు మూయుట యోగనిద్ర మూర్ఛా పరవశత్వము చచ్చుట మోక్షమా మదిన్.

హంస మంత్రమణి — పరమహంస లుచ్ఛ

రించు మంత్రరాజము అని అర్థము చెప్పబడి నది. నిజమే కాని దీని విషయము చాలగ నున్నది. దేవత ప్రత్యక్షమై వరమిచ్చు మంత్రము కాదు. పుట్టుకతోనే ప్రభవించినది.

ద్వైతాద్వైత విశిష్టాద్వైత మనుభేధము లేనిది.

ప్రతిజీవి నాసికారంధ్రముద్వారా సంచరించు ప్రాణవాయువు లోపల పోవునపుడు 'హ' కారధ్వనితోను వెలికి వచ్చునపుడు 'స' కారధ్వనితోను వచ్చుచున్నది.

ఎటులనిన మనకు ఆవులింత వచ్చినపుడు, నోటితో ఊపిరి లోపలికి తీయునపుడు హాహం అను ధ్వని తెలియ గలదు.

'స' కారధ్వని అనగ ఇస్సోఇస్ బస్సు బుస్ మొదలైనవి ఉచ్చరించునపుడు సకారధ్వనితో వాయువు వెలికి వచ్చుచున్నది.

పై విషయములు పరీక్షించిన తెలియ గలవు.

ఇది స్థూలముగ జరుగుచున్న కార్య క్రమము.

ఇక సూక్ష్మవిషయము విచారింతము. నిద్ర పోవునపుడు తీవ్రముగ ఆలోచించునపుడు ఆసక్తితో చదువుచున్నపుడు (అనగ మౌనముగ) పై హకార సకారములు సూక్ష్మధ్వనితో లోపలికి వెలికి తిరుగుచున్న వని సులభముగ తెలిసికోవచ్చును.

యోగాభ్యాసకులు పై విషయమును మౌనము వహించి భావనచేయుదురు. దీనినే నాదానుసంధానము అని అందురు.

పూరకమున హకారంబు పొందుపఱచి

రేచకంబున సకారంబు జూచి వాని

శ్రీసీతారామాంజనేయ సంవాదము ప్రథమాశ్వాసము ౧౮౧ పద్యము చూచునది.

పూరకము = ఊపిరి లోపలికి తీయుట.

రేచకము = వెలికి వదలుట.

హకారసకారములు నిరంతరము కలిసి తిరుగుచుండుట వలన నాదము పుట్టి బిందువు అనగ బుద్ధి ఏర్పడి మన స్సను ఆలోచనశక్తిని కలుగజేసి కోరిక లుప్పతిల్లచేయుచు రూప నామములు కల్పించి సృష్టి ప్రారంభమునకు కారణ మగుచున్నవి.

హకారసకారములమధ్య బిందువు అనగ పూర్ణానుస్వారము ఏర్పడుటవలన ''హంస'' యైనది.

క. వినుమా పురుషప్రకృతుల
ఘనతాదాత్మ్యంబు మధ్యగత బిందువుగా
వున హంస యనగ జీవుం
డనిలమనోయుక్తుడగుచు నతడువెలుంగున్.

అట్టి బిందువు చాంచల్య మణగ
నెందు హంసతత్త్వంబు గానబడదు.

ఈహంస నిరోధమే యోగాభ్యాసము.

హకారమునకు పురుషుడు సకారమునకు ప్రకృతి యని పేళ్లు.

ఇదే సోహం అను మంత్రము. ''తద్యోఽహం సోఽసౌ యోఽసౌ సోఽహం త్వం వా అహమస్మి భగవోదేవతే హం వై త్వ మసి''

మరా మరా మరా అనునదే రామరామ. అనియు గీతా గీతా గీతా అనునదే త్యాగీ త్యాగీ అనియు ఐనట్లు సోహం సోహం సోహం అనునదే హంస యైనది.

దీనిని అజపగాయత్రి అనికూడ అందురు. స్థూలసూక్ష్మకారణశరీరములని పేర్కొనబడు

కాయత్రయములలో ఉచ్ఛ్వాస నిశ్వాసముల ద్వారా జపించుకొనుచున్న గాయత్రీమంత్రము.

హంసనీరక్షీరన్యాయము — రాజహంసకు నీటిని వేఱుచేసి పాలను గ్రహించు శక్తి యున్నటుల ఈహంస సంసార మను అంధకారము నుండి వెలుగుబాటకు మార్గము కలుగ జేయును.

కలహంస—నిద్రావస్థలో కనబడు చైతన్య విశేషమే అనగ ప్రాణవాయువుకూడ కలగన్నపుడు సంచరించుచున్న దని అభిప్రాయము. అటుల జరుగని యెడల కలలోగన్న విషయము చెప్పజాలము. ఇదే జ్ఞాపకశక్తి.

ఈహంసజాతి మతభేదములు లేక అన్ని జీవరాసులయందు సమానముగ నున్నది. ధనికులు పేదలు అను అహంకారభావము లేనిది.

దీనిని జపించినవారు పరమహంస లగుచున్నారు.

సీ. పరమహంసంబు రేపగలు చింతింపంగ
    బిందువిందందు కంపింపకుండు
బహులక్ష్యలక్ష్యముల్ పరికించిచూడంగ
    సురుచిరంబై స్వయంజ్యోతి యొప్పు
దశవిధప్రణవ నాదము లాలకింపంగ
    తుదను ఘంటానాద మొదవి మ్రోయు
యామద్వయంబు యోగారూఢుడై వాని
    నభ్యసింపంగ దన్మయత కలుగు

అట్టియున్మని యందు మనోనిలములు
వివిధదశల యింద్రియములు విలయమొందు
అదియె సూ సర్వవేదాంతవిదిత పరమ
రాజయోగంబు దేవతారాజివినుత.



# శ్రీ తురీయానందలేఖావళి

## శ్రీ గురుపాదరేణువు

86

శ్రీహరిశ్శరణమ్

ఆల్మోరా
12-8-15

శ్రీమాన్ దే—

అక్కడ మీ కందఱికిని జ్వరము వచ్చుచున్న దను వార్తను విని చాల దుఃఖితుడనైతిని. ఈసారి తూర్పువంగదేశమున అనేకములైన ఉపద్రవములు సంభవించినవి, సంభవించుచున్నవి. భగవంతుని సంకల్పము ఏమియో ఎవరికి తెలియును? ఆయన శుభముల సమకూర్చును గాక! ఇదియే నా ఆంతరికప్రార్థనయు, నివేదనమును. నీ శరీరము కొంచెము బాగున్నదని తెలిసి సంతోషించితిని. స్మరణమననములను సాధ్యమైనంతవఱకు చేయుచుండుము. అభ్యాసమైన యెడల అన్నియు సహజమైపోవునని నిశ్చయముగా తెలియుము. తిన్నగా అభ్యాసములను, ఆయనపై ప్రేమను, సమకూర్చుకొనవలయును. అంతయు అనిత్య మని తెలిసి, కేవలము ఆయనకే మనఃప్రాణముల నర్పింప

కల్గిననే హృదయమున ప్రేమోదయ మగును. ఆయనపై ఒక సారి నిజమైన ప్రేమ కల్గిన యెడల వేఱేమియు భయ ముండదు. ఆయ నను శరణుజొచ్చిన ఆయనయే అన్నియు చేయించుకొనును. మాశుభేచ్ఛలను ప్రేమాశీ ర్వాదములను తెలియుము.

ఇట్లు
శ్రీ తురీయానందుడు.

## 87

శ్రీ హరిశ్శరణమ్

ఆల్మోరా
14-8-15

ప్రియ,—

...శరీర మీ విధమే యగును—"శీర్యతే వయోభిః కౌమార యౌవన వార్ధక్యాదిభిః"— అనగా 'బాల్యము యౌవనము వార్ధక్యము మున్నగు వయసులద్వారా క్షయ మగును'. శరీరము రోజురోజును శిథిలమే యగును. 'మానవుని శరీర మెన్నటికిని చిరస్థాయికాదు' —'జన్మించిన మరణింప వలయును. అమరు డెక్కడ? ఎవ్వడు?"—ఇత్యాది. కాని దేహ ముతో తాదాత్మ్య మొందని యెడల అహో మహాభాగ్యము. తన్ను తాను శరీరమునుండి వేఱుగా తలచుట చిన్న విషయము కాదు. ప్రభుని దయవల్ల అట్లైన పరమానందము. మీరు స్త్రీపుత్రాదులచింతతో వ్యగ్రులగుదు రెందుకు? సమస్తమును ఆయనచేతులలోనుంచి నిశ్చింతులు కండు. ఈవిషయమునే నేను చెప్పి యుంటిని. స్త్రీపుత్రాదు లందఱు ఆయనకు చెందినవారే. మీపై వారిని పాలించుభారము మాత్రమే. రామకృష్ణుడు చెప్పెడివాడు— "ధనికునిగృహములోని దాసి యజమానుని బిడ్డను 'నాముద్దుగోపాలు' డనుచు లాలన పాలన చేయుచుండును. కాని ఆమెకు తనబిడ్డ వేఱొక డనియు, తనగృహము వేఱొకచోట అనియు నిశ్చయముగా తెలియును. మీకు ఆంతరత్యాగమే — సంసారము భగవంతుని దని తెలిసికొని నిశ్చింతులై యుండుటయే—కర్త వ్యము. ప్రతిబంధము విచారమార్గులకే కాని మీకు కాదు. మీకొఱకై భగవంతుడు గీత లలో ఈవిధముగా తెల్పియున్నాడు. "తేషా మే వానుకంపార్థ మహ మజ్ఞానజం తమః నాశ యా మ్యాత్మభావస్థో జ్ఞానదీపేన భారత". [వారి ననుగ్రహించుటకై నేను వారి బుద్ధి వృత్తిలో నుండి ఉజ్జ్వలజ్ఞానదీపముద్వారా అజ్ఞానజనితమగు అంధకారమును నాశనము చేయుదును. 10-11] "తేషామహం సముద్ధర్తా మృత్యు సంసారసాగరాత్ భవామి నచిరాత్ పార్థ మయ్యావేశితచేతసామ్". [ఓ అర్జునా, ఎవరు నాపై చిత్తము నుంతురో వారిని నేను శీఘ్రముగ మృత్యుపూర్ణమగు సంసారసాగరము నుండి ఉద్ధరింతును—12-7.] "అహం త్వాం సర్వపాపేభ్యో మోక్షయిష్యామి" [నేను నిన్ను సకలపాపములనుండి ముక్తుని గావింతును. 18-66]—మీకై భగవంతుడు సమస్తభార మును గ్రహించియున్నాడు. భాగ్యవంతుని భారము భగవానునిపైన. మీరు భాగ్యవం తులు. మీరు వ్రాసిన శ్లోకము లన్నియు జన్మ గ్రహణమునకై భీతిల్లు జ్ఞానమార్గుల కొఱకు. ఆయనభక్తులు భక్తినే ప్రార్థింతురు. వారీవిధ ముగా నుడివెదరు—

"కీటేషు పక్షిషు మృగేషు సరీసృపేషు;
రక్షః పిశాచమనుజేష్వపి యత్రయత్ర;
జాతస్య మే భవతు కేశవత్వత్ ప్రసాదాత్;
త్వ య్యేవ భక్తి రచ లావ్యభిచారిణీ చ".

[ఓ కేశవా, కీట, పక్షి, మృగ, సరీసృప, రాక్షస, పిశాచ, మానవ దేహములలో జన్మము నందినను నీకృపవలన నీపై అచలావ్యభిచారిణీ భక్తి యుండునట్లు ప్రసాదింపుము. ప్రపన్న గీత - ద్రుపదోక్తి] ఒకానొకప్పుడు రామకృష్ణుడు నాతో ఈవిధముగా తెల్పియుండెను— "ఎవరు నిర్వాణమును ప్రార్థింతురో వారు హీన బుద్ధులు. కేవలము భయముచే కంపించువారు. పాచికలాడునప్పుడు, ఒకవిధమైన ఆటకాడు కేవలము తన కాయల పండించుటకే ప్రయత్నించును. ఒకసారి తనకాయ పండక పోయిన, తిరిగి క్రిందికి దింపడు. వీనిని అసమర్థపు ఆటకాడందురు. వేఱొకడు చతురుడు, చంపు దొరికిన పండక పోవు కాయనుకూడ నిలిపి ఎదురువాని కాయను చంపును. తర్వాత ఎంత కావలయునో అంత వేసి తనకాయను పైకి తీసికొని పోవును. పాచికలీ చతురులచేతిలోని కీలుబొమ్మలు. ఎన్ని కావలసిన అన్ని పడును. అందువలన నిర్భయులై స్వేచ్ఛగా క్రీడ నొనర్తురు." ఈవిధ మగుట సంభవమా? యను నా ప్రశ్నకు ఆయన ఈవిధముగాబదులు చెప్పెను. "నిశ్చయముగ సంభవ మగును. జగదంబదయవలన అంతయు సంభవ మగును. ఎవరు క్రీడ నొనర్తురో వారిని అవ్వ మిక్కిలి ప్రేమించును. దాగుడుమూత లాడునపుడు అవ్వ, ఎవ్వరు బాగుగాఆడునో వారినే ప్రేమించును. అప్పుడప్పుడు తనచేతిని చాచి వారికందుబాటులోనికి వచ్చి సాయము చేయును. అవ్వను తాకినవారు దొంగకారు. కాని ఎవరు దూరముగా పరుగిడక అవ్వదగ్గఱ దగ్గఱనే [illegible] అవ్వ కంత ప్రీతియుండదు. ఎందు కన అవ్వ ఆట చాలసేపు జరుగుట కిష్టపడును. అదే విధముగ ఎవరు నిర్వాణము నాశింతురో, త్వరగ ఈ లీలానాటకమును ముగింపజూతురో వారిపై అంబ అంతగ ప్రీతిని చూపదు. నాటకము చాలసేపు జరుగుటయే ఆమె కోరిక. జగదంబ లీలానాటకమును మిక్కిలి ప్రేమించును గాన భక్తులు నిర్వాణమును కోరరు. వారు "చక్కెరగా అగుటకు ఇష్టపడము, కాని చక్కెర తినుట కిష్టపడుదు" మని నుడువుదురు.

ఇంకను రామకృష్ణుడు చెప్పెడివాడు "శాస్త్రములలో పురాణములలో ఉన్న దేమి? కేవలము పద్దుమాత్రమే కదా! అన్ని వస్తువులును దొరికినవో లేవో సరిచూచుటకు సహాయపడు పద్దుమాత్రమే శాస్త్రములు. అది గాక వేఱేమియు ప్రయోజనములేదు. వస్తువులన్నియు సమకూరిన పద్దును పాఱవేయుదురు. ఇంటి నూడ్చునపు డొకచిన్న కాగితము దొరికినది. అందులో 'అయిదుసేరుల సందేశము (ఒక విధ మైతీపు) ఒకధోవతి పంపునది' అని వ్రాసియున్నది. అది చూచి 'అన్నియు పంపబడినవి—లేఖను పాఱవేయు' మని చెప్పుదురు. శాస్త్రములుకూడ ఆవిధముగనే అందులో జ్ఞానము, భక్తి యుదయించిన ఏవిధమగు ఉపలబ్ధి యగునో వ్రాయబడియుండును. వానిని చూచి తనఅవస్థను సరిచూచుకొనవలయును. భక్తిజ్ఞానము లుపలబ్ధి కాకయుండిన అందులకై ప్రయత్నింపవలయును. ఉపలబ్ధియైన శాస్త్రములు పాఱవేయవలయును." అందువల్లనే "బ్రహ్మజ్ఞానే తృణం శాస్త్రమ్" అని చెప్పబడెను. రామకృష్ణుడు—జగదంబ తనకు వేద శాస్త్రములలోని. పురాణములలోని. మంత్ర తంత్రములలోని మర్మమును తెలిపియున్నదని చెప్పెడివాడు. అందువలననే కదా తాను నిరక్షరుడయ్యు మహామహాపండితుల జ్ఞానగర్వ

మును చూర్ణము చేసెడివాడు. ఆయన తెల్పెడి వాడు—'సరస్వతీదేవి జ్ఞానరాశియొక్క ఒక బిందువు ఎదుట ఇతరజ్ఞానము లన్నియు నిస్సారము లగును. ఎవ్వరిపై ఈబిందురశ్మి పడునో వారికి ఏజ్ఞానముకూడ కొఱతయుండదు.'

శ్రీరామకృష్ణుడు జ్ఞాననిధినిపొందుటకై ప్రాణముల కొద్ది ప్రయత్నించెను. మఱియు భక్తిధనమును సంపాదించి భగవంతుని ప్రేమించెను. ఆ ధనము — మనపరమసౌభాగ్యబలమున నేమి — ఆయన (రామకృష్ణుని) అహేతుకదయాప్రభావమున నేమి — ఆ ధనము మనయొద్ద ఆవిర్భూతమైనది. కాన ఆ నిధిలోనే మన మనఃప్రాణముల నర్పించి ఆయనను ప్రేమించుట మనకర్తవ్యము. అట్లైన తక్కిన వన్నియు వానియంతట నవియే సమకూరును. ఆయనను ప్రేమించిన జగత్తును మఱచుటయే కాక; ఆయనదయవల్ల దేహబుద్ధికూడ తొలగిపోవును. తపస్య, విచారము మున్నగు వాని ద్వారా ఏమైన సంభవించు విషయములో (ఎవ్వరికైన సంభవించిన సంభవించు గాక) — మేము నిరాశులమై ఆయనచరణకమలములనే ఆశ్రయించి యున్నాము. ఇప్పు డాయన ఏమి చేసిన అదియే సార మని ఆయన ద్వారములో పడి యున్నాము. మీకుకూడ ఆయనయే శరణ్యు డని నాకు నిశ్చయముగ తెలియును గాన మీరు భయపడ నక్కఱలేదు. మహాపురుషుడు (స్వామి శివానందుడు) మఱియు సీ — బాగున్నారు. ఇతరము లన్నియు కుశలము. మీ కుశలముల ప్రార్థించుచున్నాను. మీరు మా శుభాశీర్వాదముల, ఆంతరిక ప్రేమలను గైకొనుడు.

ఇట్లు,
శ్రీ తురీయానందుడు.

# వార్తలు, విశేషాలు

## శ్రీ రామకృష్ణ మఠము, మదరాసు - 4

శ్రీ వివేకానందస్వామి శతతమజయంతి

తే 6-9-1962 ది నాడు పత్రికావిలేఖరులతో ప్రసంగిస్తూ శతతమబయంతి నిర్వాహక కేంద్ర పరిషత్కార్యదర్శులైన శ్రీ సంబుద్ధానంద స్వాములు ఆ మహోత్సవానికి సాగుతున్న యేర్పాట్లను సంగ్రహించి ఈలాగు తెలిపారు—

పై సంవత్సరం రాబొయ్యే శతతమజయంతిని కొనియాడడానికి పెక్కువిదేశాలు విపుల కార్యక్రమాలను పన్నాగిస్తున్నవి. ఆ దేశాలలో ముఖ్యమైనవి — ఇంగ్లండు, అమెరికా సంయుక్తరాష్ట్రాలు, రుమేనియా, ఇటలీ, స్విట్జర్లండు, ఫ్రాన్సు, స్పెయిన్, ఫిజిద్వీపాలు, తూర్పుఆఫ్రికా, దక్షిణాఫ్రికా, సయాము, జపాను.

జాన్యువరి తే 17 ది నాడు బేలూరుమఠంలో మఠాధ్యక్షులు సంవత్సరాంత్యంవఱకు జరుగుచుండబోయే జయంతిమహోత్సవాలకు ప్రారంభంచేస్తారు.

కేంద్రప్రభుత్వపు కమ్యూనిటి డెవలప్మెంటు మంత్రివర్గంవారు, శతతమజయంతి పరిషత్తుతో కలిసి, మనదేశంలోని సర్వగ్రామాలలో ఈ ఉత్సవాలను విపులంగా జరపాలని తీర్మానిం

చారు. రేడియోసమాచారమంత్రివర్గంవారు శ్రీ వివేకానందస్వాముల సంక్షిప్తజీవితచరిత్రల తో పాటు ఒక ఫోటో ఆల్బమును ప్రచురిస్తారట.

రవాణాల (కమ్యూనికేషన్స్) మంత్రివర్గం వారు ఈ శతతమజయంతికై రెండురకాల తపాలాబిళ్లలను ప్రచురిస్తారట. ఒకదానిలో స్వామిజి పరివ్రాజకచిత్రమున్నూ, రెండో దానిలో 'చికాగోలో ఉపన్యాసవేదికపై నిల బడ్డ వైఖరి' చిత్రమున్నూ ముద్రిస్తారట.

శాస్త్రపరిశోధనాలమంత్రివర్గంవారు స్వామిజి సంపూర్ణగ్రంథావళి తొమ్మిదిభాషలలో ప్రచు రించడానికని దాదాపు ఐదులక్షలరూపాయలు కేటాయించారు. గ్రంథప్రచురణార్థం ఆ మంత్రి వర్గంవారు (సెంటినరి సెంట్రల్) కమిటీవారికి రూ. 2,37,875 లు సాంక్షన్ చేశారు. స్వామిజి జీవితం తెలిపే చలనచిత్రాలను వివిధభాషలలో తీస్తారు.

శతతమజయంతి స్మారకసంపుటము నొక దానిని ప్రచురించవలెనని, శ్రీ వివేకానంద స్వామినిగూర్చిన చక్కనిగ్రంథాలను స్కూలు కాలేజివిద్యార్థులకు పఠనార్థంగా ప్రకటింప వలెనని, శిశువులకై 'శిశువుల వివేకానందు' డనుపేర 'బొమ్మలపుస్తకం' ఒకటి ప్రచురించ వలెనని సెంటినరి సెంట్రల్‌కమిటివారు నిశ్చ యించుకొన్నారు—

బేలూరులో ఒక విశ్వకళాపరిషత్తును నెల కొల్పుట, కల్కత్తాలో ఒక విశ్వమతమహాసభ నేర్పాటుచేయుట, కాశిలో వివిధ సంప్రదా యాల సన్న్యాసుల సమావేశమును జరుపుట, 'అఖిలభారతమహిళల' 'అఖిలభారతవిద్యార్థుల' 'అఖిలభారతసంగీత' — సమావేశాలు నడ పడం — శతతమజయంతి కార్యక్రమాలలో ప్రధానములు. కల్కత్తా గోల్పార్కునొద్ద వివేకానందస్వాముల చలువరాతివిగ్రహం ప్రతిష్ఠించబడుతుంది. శ్రీ వివేకానందస్వామి అవతరించినచోటును కొని అక్కడ అర్హమైన స్మారకభవనాన్ని నిర్మింపవలె అనే ప్రతిపాదన కూడా ఉంది.

## రెంటచింతలలో రామకృష్ణసేవామండలిస్థాపన

రెంటచింతల పౌరు లనేకులు 30 వ తేదీ సాయంత్రం 3 గంటలకు శ్రీ నాళం వీరయ్య శ్రేష్ఠి ధర్మసత్రములో పెద్దలు దుగ్గరాజు నర సింహంగారి అధ్యక్షతన సమావేశమై "రామ కృష్ణసేవామండలి" అనుపేరుతో ఒక సంఘ మును స్థాపించిరి. ఈ క్రిందివారు కార్యనిర్వా హకవర్గసభ్యులుగా ఏకగ్రీవముగ ఎన్నుకొన బడిరి. ఏచూరి వేంకటగురువు (అధ్యక్షులు), కట్టమూరి భిక్షాపతి (ఉపాధ్యక్షులు), డాక్టర్ ఎన్. కృష్ణమూర్తి (కార్యదర్శి), పల్లెర్ల నాజ రెడ్డి, డా॥ ఎన్. సీతారామశాస్త్రి (జాయింటు కార్యదర్శులు), కట్టమూరి పుల్లయ్య (కోశాధి కారి), సభ్యులు: ఏచూరి వాడపల్లి, నాళం వీరాంజనేయులు, ఏచూరి రామయ్య, గుండా వెంకటేశ్వర్లు, ఎస్. ఆర్. కృష్ణమూర్తి. పిమ్మట బ్రహ్మశ్రీ లంకా లక్ష్మణశాస్త్రులవారిచే వేదపఠనము జరిగెను. శ్రీ దుగ్గరాజు నరసింహం గారు ఇండియాలో రామకృష్ణమిషనులు చేయు చున్న సేవను విశదీకరించిరి. డాక్టర్ కృష్ణ మూర్తిగారు మానవసేవయే మాధవసేవ అంటూ మండలి ముఖ్యోద్దేశ్యములను వివరిం చిరి. 'రామకృష్ణపరమహంసమహారాజునకుజై' అను నినాదములమధ్య మంగళహారతు లొసగ బడి ప్రసాదములు పంచిపెట్టబడెను.

# గ్రంథపరిచయం

[సమీక్షకు గ్రంథాలు పంపేవారు రెండేసి ప్రతులు పంపవలె అని మనవి]

## యోగ ఇన్‌స్టిట్యూటువారి ప్రత్యేక సంచిక

ఇది ఆంగ్లమాసపత్రిక. సంవత్సరచందా ఐదురూపాయలు. ప్రాప్తిస్థానం : యోగఇన్‌స్టిట్యూటు, శాంతక్రజ్, బొంబాయి-55. సంపాదకులు : డాక్టరు జయదేవయోగీంద్రులు. యోగంలో శాస్త్రీయ వైజ్ఞానిక విద్యాబోధక వైద్యశాఖలలో పరిశోధనలు సాగించడం ఈ సంస్థవారి ముఖ్యకార్యక్రమం. వీరిది ఒక శిక్షణ కేంద్రం (అకాడమి) ఉంది. మంచి వైద్యశాల ఉంది. యోగవిషయికములయిన గ్రంథాలను ఆంగ్ల, హిందీ భాషలలో వీరు ప్రచురిస్తుంటారు. వీరిపత్రిక ప్రత్యేకసంచికలో (జూలై 1962) యోగవిద్యామహిమను, దానిచే మానవులకు సాధ్యములైనవానిని, తత్సంబంధపరిశోధనఫలితాలను చిత్రాలతోను పట్టికలతోను కరతలామలకంగా స్పష్టపఱచే రచనలున్నవి.

## జాగృతి దీపావళి ప్రత్యేకసంచిక

100 పుటలు, వెల : రూపాయి. సంపాదకులు : శ్రీ టి. ఎల్. నారాయణగారు. ప్రాప్తిస్థానం : జాగృతిప్రకాశనట్రస్టు, విజయవాడ. శ్రీ వివేకానందస్వాముల పరివ్రాజకరూపచిత్రం దీనికి ముఖాలంకారంగా పొందుపడి ఉండడం ఒకవిశేషం. భారతదేశానికి స్వామి ప్రసాదించిన సందేశంకూడా ఇందు—29, 30, 31 పుటలలో ముద్రితమై ఉంది. ముఖ్యంగాను ప్రాస్తావికంగాను అమూల్యవిషయాలు నిండియున్న శ్రేష్ఠరచయితల పదిహేను వ్యాసాలు, దేశభక్తిపరీవాహరూపములైన ఐదు గేయాలు, బహుమతులు పొందిన చారిత్రక పౌరాణిక సాంఘికకథలు నాలుగు, ఐదు కావ్యఖండాలు గలిగిన యీ ప్రత్యేకసంచికకు స్వాగతం.

౧

తెనాలి సాధనగ్రంథమండలివారి 82వ పుష్పం ఇది. గీతలో నవమాధ్యాయమునకు శ్రీ శ్రియానందనాథదీక్షానాములగు ఈశ్వర సత్యనారాయణశర్మగారు వ్రాసిన ఆంధ్రవ్యాఖ్యానం ఇందు పొందుపఱుపబడి ఉన్నది. సాక్షాత్కారసిద్ధులు సకలవికల్పదూరీకరణసమర్థముగాను శ్రీరాజవిద్యామర్మప్రఖ్యాపకముగాను అనుగ్రహించిన యీ వివరణానికి స్వాగతం. వెల : రూ. 2/- లు మాత్రమే. దీని ముద్రణవ్యయమునొసగిన పరమోదారులగు శ్రీ మఱ్ఱిపాటి వేంకటనరసింహారావుగారును, సాధనగ్రంథమండలివారును ఎంతైనా అభినందనీయులు.

—ప్రభాకర్

## శ్రీ వివేకానందస్వామి శతతమ జయంతి ప్రచురణములు

ఆంధ్రపాఠకులకు అమూల్యతరుణము

# వివేకానంద సంపూర్ణగ్రంథావళి

ప్రతిభోజ్జ్వలులైన ఆంధ్రపండితులచే ఆంధ్రీకరింపబడి 10 సంపుటాలుగా ప్రకటింపబడుతున్నది. ప్రతి సంపుటంలోను దాదాపు 500 పుట లుంటాయి. అసలు ఖరీదు అట్టబైండుసెట్టు రు. 50 లు. కాలికోబైండుసెట్టు రు. 65 లు. పోస్టేజి ప్రత్యేకం.

స్వామిజిసందేశం మాతృదేశభక్తిభరితం, ప్రాణప్రదం, ఆత్మోత్తేజకరం, విశ్వజనీనం. అది సమగ్రంగా ఆంధ్రమహాజనులకు అందడం ఇదే మొదటిసారి. స్వామిజీది దివ్యదృష్టి. ఆయన అమోఘ పరిష్కారవిధానం సూచింపని ముఖ్యసమస్య అంటూ లేదు. ఆయన గ్రంథావళిని చదివినవారికి ఉత్సాహమును ఉదాత్తతయున్నూ కలుగక తప్పదు.

వివరములు :

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| మొదటి సంపుటము | 575 | పుటలు | అట్టబైండు | రూ. 5/- | క్యాలికో | రూ. 6–50 |
| నాల్గవ సంపుటము | 592 | ,, | ,, | రూ. 5/- | | రూ. 6–50 |
| అయిదవ సంపుటము | 544 | ,, | ,, | రూ. 5/- | | రూ. 6–50 |
| ఆఱవ సంపుటము | 585 | ,, | ,, | రూ. 5/- | | రూ. 6–50 |

విలాసము :

మేనేజరు,
శ్రీ రామకృష్ణ మఠము
మైలాపూరు : : మద్రాసు - 4

# స్వామి - శిష్య సంవాదములు

(శ్రీమద్వివేకానందస్వామితోడి సంభాషణలు)

అనువాదకులు : కీ. శే. కందుకూరు మల్లికార్జునంగారు

సాంసారిక సమస్యలు పరిష్కరించుకొనదలచినను సమాధిస్థితి సాధింపదలచినను; రాజకీయవిశేషము లాకళింపదలచినను, లలితకళారహస్యము లవగతముచేసికొనదలచినను — ఇంతేల, లౌకిక కాలౌకిక విషయములలో వేనినిగుఱించిగాని మీ పరిజ్ఞానము వృద్ధి గావించుకొన దలచినచో ఈ గ్రంథమును తప్పక చదువుడు. నవభారతభాగ్యవిధాత శ్రీమద్వివేకానందస్వామిచంద్రులు శిష్యులతో కావించిన యీ ప్రసంగములలో వారి అనుభవసర్వస్వము రాశీభూతమై యున్నది. సులభశైలి, హృదయమును పట్టి యిచ్చు సంభాషణలు, ముచ్చటైన అచ్చుకూర్పు.

పుటలు : 552+12 (అకారాది అనుక్రమణికతో) వెల : రూ. 5/-

# శ్రీమద్భగవద్గీత

అనువాదకులు : శ్రీ నిర్వికల్పానందస్వాములవారు

ఇది మూలశ్లోకములు, ప్రతిపదార్థము, ధారాళమగు అనువాదము, శ్రీధరీయ టీకాసారము, విశేషాంశములు, సానువాదగీతాపారక్రమము, ధ్యానమాహాత్మ్యములు, సమభావాత్మకములగు ఉపనిషద్వాక్యసూచిక, వేదాంతసూత్రసూచిక, గీతాశ్లోకసూచిక, శబ్దానుక్రమణిక—ఇన్నిటితో విరాజిల్లుచున్నది.

పుటలు 480 (అందమయిన ఆఱవ కూర్పు) వెల : రూ. 4

# పారమార్థిక సంభాషణలు

అనువాదకులు : కీ. శే. కందుకూరు మల్లికార్జునంగారు

శ్రీరామకృష్ణదేవుని స్వశిష్యవర్గములోని ఆర్గురు జ్ఞానసిద్ధులు శిష్యులతోడను, భక్తులతోడను చేసిన పరమార్థ విషయక సంభాషణ కతిపయములు. ఎన్నెన్నో గ్రంథములు చదివినగాని తీఱని ఆధ్యాత్మిక సంశయము లీ గ్రంథమూలమున అవలీలగా తీఱును.

పుటలు : 402 (మనోజ్ఞమగు ప్రథమ ముద్రణము) వెల : రూ. 3/-

అడ్రెసు : మేనేజరు, శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు - 4

సంపాదకులు : శ్రీ శుద్ధసత్త్వానందస్వామి, శ్రీ నేలటూరి భక్తవత్సలము,
కే. ఎస్. ఎస్. రాజన్ గారిచే ది జ్యూపిటర్ ప్రెస్స్ ప్రైవేట్ లిమిటెడ్ (మద్రాసు - 18) న ముద్రింపబడి,

# వంట చేస్తూనే విశ్రమించండి

ಅಡಿಗೆಯು ನಿಮಗೆ ಭೀಕರ ಶ್ರಮಕಾರಿಯ ಬಲ್ಲುದು, ಈ ಆಶ್ಚರ್ಯಕರ ಕೆರೋಸಿನ್ ಕುಕರ್ ಸೌಕರ್ಯವನ್ನು ನೀವು ತಿಳಿದು ಕೊಳ್ಳುವವರೆಗೆ. ಬೇಕಾದ ಕಾಲದಲ್ಲಿ ಅಡಿಗೆ ಮಾಡಿರಿ—ಪರಿಶ್ರಮವಿಲ್ಲ.

ಕಲ್ಲಿದ್ದಲನ್ನು ಮುರಿಯ ಬೇಕಾಗಿಲ್ಲ, ಬೆಂಕಿ ಊದ ಬೇಕಾಗಿಲ್ಲ, ಕಣ್ಣಿಗೆ ಹೊಗೆಯಿಲ್ಲ ಮತ್ತು ಒಳ ಮಾಳಿಗೆಯಲ್ಲಿ ಮಸಿಯಾಗದು. ಈ ಹೊಸ ಕುಕರ್ ಸ್ವಚ್ಛ, ನೇರ ಮತ್ತು ಸರಳ-ದುಡಿಮೆ ಜೀವರು ಅಥವಾ ಕಂಬನಿಗಳಿಲ್ಲ.




# ఖాస్ జనతా
## కిరోసిన్ కుక్కర్

వంట బాగా తేలికగా చేసుకోండి

ఉత్పత్తిదారులు:

**ఓరియంటల్ మెటల్ ఇండస్ట్రీస్ ప్రైవేట్ లిమిటెడ్**

77, బౌబజార్ స్ట్రీట్, కలకత్తా-12

KALPANA O. M. 15 TE

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటము ౧౯     ౧౯౬౨, డిసెంబరు; శుభకృత్తు - మార్గశీర్షము     సంచిక ౬

## విషయసూచిక




శ్రీ రామకృష్ణ ప్రభ ఆఫీసు,
శ్రీ రామకృష్ణ మఠము,
మైలాపూరు :: మద్రాసు-4.

Phone : 71231

# ప్రకటన

మీ చందా యీ............నెలాఖరుతో ముగియును. రాబోవు సంవత్సరమునకు మీ చందా (రూ. 4) మనియార్డరు ద్వారా, మా కార్యాలయమునకు రాబోవు నెల 10-వ తేదీలోగా అందునట్లు పంపగోరెదము. అట్లు మనియార్డరు పంపనియెడల, రాబోవు సంచికను వి. పి. పి. ద్వారా పంపెదము. పత్రికయెడ మీ యాదరాభిమానములను యథాప్రకారముగా జూపుదురని నమ్ముచున్నాము. మనియార్డరుద్వారా మీ చందా పంపినయెడల, తపాలా వీ. పీ. రిజిస్ట్రేషను చార్జీలు 56 న. పై. లు మీకు మిగులునని గుర్తింతురుగాక. అనివార్యమయిన యే కారణములచేనైనను మీ రిక చందాదారుగా నుండగోరనియెడల రాబోవు నెల 5-వ తేదీ లోపుగా ఆ సంగతి మాకు దయచేసి తప్పక తెలుపగోరెదము. అట్లు మీ యొద్దనుండి ఉత్తరము రాకపోవుటచే మీరు తప్పక వీ. పీ. విడిపించుకొందురను నమ్మకముచే మేము వీ. పీ. పంపి, మీరు విడిపించుకొనకపోయినయెడల వృథాగా ఈ ధర్మసంస్థకు వి. పీ. చార్జీలు నష్టముగలిగించినవారగుదురు. దయచేసి ఈ విషయము గుర్తింతురు గాక.

ఉత్తర ప్రత్యుత్తరములన్నిటిలోను మీ చందాదారు సంఖ్యను ఉదాహరించుచు, మీ పూర్తి పేరును, విలాసమును స్పష్టముగా వ్రాయగోరెదము.

మేనేజరు, శ్రీ రామకృష్ణ ప్రభ



'అఖిలవిభు శరణొందుము, యా క్షణంబ యతనికృప నీకు ననుభావ్య మగును వత్స.'

—శ్రీ శారదామణి.


# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము ౧౯ } ౧౯౬౨ - డిసెంబరు :: శుభకృత్తు - మార్గశీర్షము { సంచిక ౬


శ్రీః

# సౌందర్యలహరి

మూలము : శ్రీ శంకరభగవత్పాదులు

టీక : నే. భ.

కరాగ్రేణ స్పృష్టం తుహినగిరిణా వత్సలతయా
గిరీశే నోదస్తం ముహు రధరపానాకులతయా
కరగ్రాహ్యం శమ్భో ర్ముఖముకురవృన్తం గిరిసుతే
కథఙ్కారం బ్రూమ స్తవ చుబుక మౌపమ్యరహితమ్ ॥ ౬౭

| | | | |
|---|---|---|---|
| గిరిసుతే | పార్వతీ | కరగ్రాహ్యమ్ | చేతిచే ఉపలాలింపదగినదియు |
| తుహినగిరిణా | మంచుకొండచేత | ఔపమ్య | సాటి |
| వత్సలతయా | వాత్సల్యముచేత | రహితమ్ | లేనిదియు |
| కరాగ్రేణ | చేతికొనతో | ముఖముకుర | మోమనెడి అద్దమునకు |
| స్పృష్టమ్ | తాకబడినదియు | వృన్తమ్ | ఆధారదండమును అగు |
| గిరీశేన | మహాదేవునిచే | తవ | నీ |
| అధరపాన+ | మోవినానుటయందలి | చుబుకమ్ | గడ్డమును |
| ఆకులతయా | తహతహచేత | కథఙ్కారం | ఏమని |
| ముహుః | మాటిమాటికిని | బ్రూమః | వర్ణింతుము? |
| ఉదస్తమ్ | పైకెత్తబడినదియు | | |
| శమ్భోః | శివుని | | |

తా॥ పార్వతీ, సాటిలేని నీగడ్డమును మే మేలాగు వర్ణింపగలము ? ఆగడ్డమును నీతండ్రి వాత్సల్యముతో తాకును. నీయధరపానాభిరతుడగు పరమశివుడు, ఆగడ్డమును మాటిమాటికిని పైకెత్తుచుండును. నీముఖము అను అద్దమును పట్టుకొని అందు సమస్తమును గాంచు మహాదేవునకు నీ గడ్డము ఆయద్దపు పిడివలె ఉన్నది.

భుజాశ్లేషా న్నిత్యం పురదమయితుః కణ్టకవతీ
తవ గ్రీవా ధత్తే ముఖకమలనాళశ్రియ మియమ్
స్వత శ్శ్వేతా కాలాగురుబహులజమ్బాలమలినా
మృణాళీలాలిత్యం వహతి య దధో హారలతికా ॥ ౬౮

| | | | |
|---|---|---|---|
| (దేవి) | (అమ్మా) | అధః | క్రింద |
| తవ | నీ | స్వతః | తనంతట |
| ఇయమ్ | ఈ | శ్వేతా | తెల్లనిదైనను |
| గ్రీవా | మెడ | కాల+అగురు | నల్ల అగురుయొక్క |
| పురదమయతుః | త్రిపురాంతకుని | బహుళ | సమృద్ధమైన |
| భుజాశ్లేషాత్ | భుజాలింగనమువలన | జమ్బాల | (అడుసు) మైపూతచేత |
| నిత్యం | సదా | మలినా | నల్లనిదైన |
| కణ్టకవతీ | గగుర్పాటుకలదై | హారలతికా | ముక్తామాల |
| ముఖకమల | మోముదామరకు | మృణాళీ | (అడుసంటిన) తామరతీగ |
| నాళశ్రియమ్ | కాడ అగు కాంతిని | లాలిత్యం | సొంపును |
| ధత్తే | తాల్చుచున్నది | వహతి | తాల్చుచున్నది. |
| యత్ | దేనికి | | |

తా॥ పరమశివుడు తనభుజములతో ఆలింగనము చేసికొనుటచేత నీమెడ సదా రోమాంచకంచుకితముగ నుండును. అది నీముఖపద్మమునకు కాడవలె నుండును. మెడ క్రింద ముత్యాలమాల ఉన్నది. అది సహజముగా తెల్లనిదే కాని, దట్టమయిన నల్లఅగురుగంధపు పూత అంటుటచేత దానిసొంపు (అడుసంటిన) తమ్మితీగసొంపును బోలి యున్నది.

గళే రేఖా స్తిస్రో గతిగమకగీతైకనిపుణే
వివాహవ్యానద్ధప్రగుణగుణసంఖ్యా ప్రతిభువః
విరాజన్తే నానావిధమధురరాగాకరభువామ్
త్రయాణాం గ్రామాణాం స్థితినియమసీమాన ఇవ తే ॥ ౬౯

| | | | |
|---|---|---|---|
| గతి | రాగాలాపము | నానావిధ | పలువిధముల |
| గమక | రసాత్మకమైన ముఖ్యనాద పరిపోషము | మధురరాగ | శ్రీరాగ - మలహరీ - లలితా - భూపాలాది శ్రావ్యరాగముల |
| గీత | సముచితార్థ ప్రబంధ సందర్భము - అను వీనిలో | ఆకరభువామ్ | ఉత్పత్తిస్థానములగు |
| ఏక | ముఖ్యముగా | త్రయాణామ్ | మూడు |
| నిపుణే | నేర్పరివైన జననీ | గ్రామాణామ్ | గాంధార - మధ్యమ - షడ్జములను రాగకదంబముల |
| వివాహ | పెండ్లియప్పుడు | | |
| వ్యానద్ధ | (మహాదేవునిచే) కట్టబడిన | స్థితి | ఉనికికి |
| ప్రగుణగుణ | మంగళసూత్రపు | నియమ | ఏర్పఱుపబడిన |
| సంఖ్యా | (పేటల మూడింటి) సంఖ్యతో | సీమానః ఇవ | పొలిమేరలవలె |
| | | తే | నీ |
| ప్రతిభువః | సమానములగు | గళే | కంఠమున |
| త్రిరేఖాః | మూడురేఖలు | విరాజన్తే | ప్రకాశించుచున్నవి. |

తా॥ అమ్మా నీవు సంగీతశాస్త్రోక్తములగు గతియందును గమకమందును గీతమందును సాటిలేని నిపుణురాలవు. నీమెడయందున్న మూడు రేఖలు - నీమంగళసూత్రపు పేటల మూడింటితో సంఖ్యలో సరిపోవుచున్నవి. - అటు చూచిన - మధురములగు రాగములకు ఉత్పత్తిస్థానములగు గాంధారము మధ్యమము షడ్జము అను మూడు 'గ్రామము'ల పొలిమేర గీటులవలె ఉన్నవి.

మృణాళీమృద్వీనాం తవ భుజలతానాం చతసృణామ్
చతుర్భి స్సౌన్దర్యం సరసిజభవ స్స్తౌతి వదనైః
నఖేభ్య స్సన్త్రస్యన్ ప్రథమమథనా దన్ధకరిపో
శ్చతుర్ణాం శీర్షాణాం సమ మభయహస్తార్పణధియా ॥ ౭౦

| | | | |
|---|---|---|---|
| (దేవి) | (అమ్మా) | అర్పణధియా | ఇమ్మని కోరుచు |
| సరసిజభవః | బ్రహ్మ (తమ్మిచూలి) | చతుర్భిః | నాలుగు |
| ప్రథమ | మొదటి (ముఖపు) | వదనైః | ముఖముల చేతను |
| మథనాత్ | వినాశమువలన | మృణాళీ | తామరతీగలవలె |
| అన్ధకరిపోః | రుద్రుని | మృద్వీనామ్ | మృదువులైన |
| నఖేభ్యః | గోళ్లనుండి | తవ | నీ |
| సన్త్రస్యన్ | భయపడుచున్నవాడై | చతసృణామ్ | నాల్గు |
| చతుర్ణామ్ | (ఇప్పుడున్న) నాల్గు | భుజలతానామ్ | భుజములనెడి తీగల |
| శీర్షాణామ్ | శిరములకు | సౌన్దర్యం | సొంపును |
| సమం | సమానముగా | స్తౌతి | వర్ణించుచున్నాడు. |
| అభయహస్త | 'భయపడకు' అను అభయదానమును | | |

తా॥ బ్రహ్మదేవునకు మొదట ఉండిన ఐదు తలలలో ఒకదానిని రుద్రుడు తనగోళ్లతో పెఱికివేసినాడు. అందుచేత భయపడుచు బ్రహ్మ నీ నాల్గుచేతులచేతను తనకు మిగిలినయున్న నాల్గుతలలను అభయప్రదాన మిప్పించుకొనగోరి తామరతీగలవలె మృదువులైన నీ నాల్గుచేతుల సౌందర్యమును తన నాల్గునోళ్లతోను స్తుతించుచున్నాడు.

నఖానా ముద్యోతై ర్నవనళినరాగం విహసతామ్
కరాణాం తే కాన్తిం కథయ కథయామః కథ ముమే
కయాచి ద్వా సామ్యం భజతు కలయా హన్త కమలం
యది క్రీడల్లక్ష్మీచరణతలలాక్షారసచణమ్ ॥ ౭౧

| | | | |
|---|---|---|---|
| ఉమే | పార్వతీ | ల | లక్ష్మీదేవియొక్క |
| నఖానామ్ ఉద్యోతైః | గోళ్లకాంతులచేత | చరణతల | పాదతలములందలి |
| నవనళినరాగమ్ | లేదామర కెంజాయను | లాక్షారస | లత్తుకరసముతో |
| విహసతామ్ | పరిహసించునవగు | చణమ్ యది | కూడినదగునేని |
| తే కరాణామ్ | నీ చేతుల | (తర్హి) | (అప్పుడు) |
| కాన్తిమ్ | శోభను | హన్త | పాపము ! |
| కథమ్ కథయామః | ఎట్లు వర్ణింతుము ? | కయాచిద్ వా విధయా | ఎట్లో ఒకట్లు |
| కథయ | చెప్పుమా | సామ్యమ్ | సాదృశ్యమును |
| కమలమ్ | పద్మము | భజతు | పొందును గాక. |
| క్రీడత్ | క్రీడించుచున్న | | |

తా॥ అమ్మా, ఉమా, గోళ్లకాంతులచే నీచేతుల కెంజాయ లేదామరల కెంజాయను మించియున్నది. వానిని మే మెట్లు వర్ణింపగలము? చెప్పు. క్రీడించు లక్ష్మీచరణములందలి లత్తుకరసము తామర కంటునేని, అప్పు డది ఎంతో కొంత నీచేతులతో సమత్వ మొందునేమో!

సమం దేవి స్కన్దద్విపవదనపీతం స్తనయుగమ్
త వేదం నః ఖేదం హరతు సతతం ప్రస్నుతముఖమ్
యదాలో క్యాశఙ్కాకులితహృదయో హాసజనకస్
స్వకుమ్భౌ హేరమ్బః పరిమృశతి హస్తేన ఝుటితి ॥ ౭౨

| | | | |
|---|---|---|---|
| దేవి | | ఆకులిత | కలవరపెట్టబడిన |
| యత్ | ఏ నీ చనుగవను | హృదయః | డెందముగలవాడై |
| ఆలోక్య | చూచి | హాసజనకః | (అమ్మకు నాయనకు తమ్మునికి) నవ్వు పుట్టించువాడగుచు |
| ఆశఙ్కా | (నా కుంభముల నీమె కైకొన్నదా అను) సందేహముచేత | హేరమ్బః | వినాయకుడు |

| | | | |
|---|---|---|---|
| హస్తేన | చేతితో | ప్రస్నుతముఖమ్ | పాలుకార్చు చూచుకము లుగల |
| ఝటితి | తటాలున | | |
| స్వకుమ్భౌ | తన కుంభములను | తవ | నీ |
| పరామృశతి | తాకిచూచుకొనునో | ఇదమ్ | ఈ |
| సమం | ఏకకాలమున | స్తనయుగమ్ | చనుగవ |
| స్కన్ద | సుబ్రహ్మణ్యుని చేతను | నః | మా |
| ద్విపవదన | గజాననుని చేతను | ఖేదమ్ | క్లేశమును |
| పీతం | త్రాగబడినదై | సతతమ్ | ఎల్లప్పుడును |
| | | హరతు | పోగొట్టునుగాక. |

తా॥ అమ్మా సుబ్రహ్మణ్యుడును గజాననుడును ఏకకాలమున నీ చనుబాలు త్రాగుదురు. వారు పాలుత్రాగిన వెనుక నింకను చూచుకములనుండి పాలు కాఱుచుండ, అట్టి నీ స్తనములను గాంచి గజాననుడు తన కుంభములనే నీవు కైకొంటి వేమో అని శంకించి, ఉన్నవా లేవా అని తన కుంభములను తాకిచూచుకొనును. ఆముగ్ధ (ముద్దు) చేష్టకు అందఱును నవ్వుదురు. అట్టి నీ స్తనయుగము మా క్లేశములను సదా పోగొట్టునుగాక.



# మాతృదేవి స్త్రీల గావించిన హితబోధ

## శ్రీమచ్ఛుద్ధసత్త్వానందస్వామి సంకలితము

వినమ్రత యొక్కటియే స్త్రీలకు విభూషణ మని యెఱుఁగుడు. దేవతావిగ్రహముయొక్క పాదముల వ్రాల నర్పింపబడినప్పుడే పుష్పము తనభాగ్యమున కానందించునది. ఆ భాగ్యమునకు నోచుకొనని పుష్పము చెట్టుమీదనే వాడిపోవుట మేలు. మిటారికత్తియ లట్టి పుష్పముల బంతి నాఘ్రాణించుచు "బళీ! ఎంతసువాసన!" అని పల్కుచుండునప్పుడు నా మనస్సెంతో సంతాపించును.

* * *

స్త్రీలకు ముంగోపము తగదు. వారు ఓరిమి నలవఱచుకొనవలెను. వారికి శైశవమునను బాల్యమునను తలిదండ్రులు, యౌవనమున భర్తలు, పోషకులు. స్త్రీబుద్ధి సామాన్యముగా మిక్కిలి సున్నితము, సులభముగా నొచ్చుకొనునది. ఒక్క మాట చాలును వారిని తలక్రిందు చేయుటకు. ఈ కాలములో ఎంతమాటైనను సులభముగా అందురు గదా! కావున స్త్రీలు ఓరిమినభ్యసించి తలిదండ్రులయొక్కయు భర్తయొక్కయు మాటలయెడ తాలిమి కలిగి ప్రవర్తింపవలెను.

* * *

వివాహము చేసికొనునట్లు తనకొమార్తకు బోధింపు డని యొక భక్తురాలు శ్రీమాతృదేవి నొకనాడు వేడుకొనెను. ఆమె అందుకిట్లనెను: "జీవితకాలమంతయు ఒకనికి బానిసయై వాని

యిష్టానుసారము ప్రవర్తించుచుండుట ఎంత కష్టము! పెండ్లి లేక యుండుటయందు కొంత అపాయము కలదు నిజమే కాని, పెండ్లాడ నిచ్ఛగింపని బాలికలను బలాత్కారముగా పెండ్లాడించి యావజ్జీవము ఐహికజీవనముపాలు చేయుట అనుచితము. పరిపూర్ణ విరక్తితో జీవితము గడపగోరు బాలికలను బ్రహ్మచారిణులుగా నుండుడనియే ప్రోత్సహింపవలెను.''

* * *

అమ్మాయీ, నీ అదృష్టము పండుటచేతనే నీకీ మానవజన్మ లభించినది. దైవమునందు పరిపూర్ణభక్తి కలిగియుండుము. బాగుగా ప్రయాసపడవలెను. అప్రయత్నముగా ఏమైన సిద్ధించునా? పని ఒత్తిడిచేత ఏమాత్రము తీఱిక లేకుండు వేళలలోకూడ దైవప్రార్థన కెట్లో కొంతకాలము కల్పించుకొనవలెను. దక్షిణేశ్వరమున నేనెప్పుడును పనితొందరలో ఉండుదానను. ఐనను నా ధ్యానప్రార్థనలు సాగించుచునే ఉంటిని. మనస్సు వ్యాకులముగా నున్నదని మొఱపెట్టుకొనుచుండు మా మఱదలు కూడ ఇట్లే చేయుగాక! వేకువజామున మూడు గంటలకు లేచి ధ్యానమునకు కూర్చుండుమనుము. ఆ మనోవ్యాకులత యింకను నిలిచి యుండునేమో చూచెదను. అట్లు చేసిచూడక మనోవ్యాకులతనుగూర్చి చెప్పుకొనుచుండును. ఆమె కా వ్యాకుల మేల? వ్యాకుల మను మాటనే నేనెన్నడు నెఱిగి యుండలేదు.

* * *

పెనిమిటి, కొడుకు, దేహము- -ఈ సర్వము అయథార్థము —— మాయ : మాయ కల్పించు సంకెలలు. ఈ బంధములను వదలించుకొన్న గాని ముక్తి సిద్ధింపదు. ఈ దేహమునం దభిమానముకూడ, ఈ దేహమే ''నేను'' అను భావముకూడ, చివరకు నశింపవలెను. అమ్మాయీ, ఈ దేహ మనగా ఏమో యెఱుగుదువా? పిసెడు బూడిద (కాల్చినచో పిడికెడు బూడిద)! దీనికై యింత గర్వమేల? ఎంత ఘనమైన దేహమైనను చివరకీ పిసెడు బూడిద రూపమునే పొందును. ఐనను జనులకు దీనిపై ఇంత వ్యామోహము!

* * *

ఒకరిని సన్న్యసింప బ్రోత్సహించుచున్నందుకు శ్రీమాతృదేవి నాక్షేపించుచు, వివాహమాడి గృహస్థజీవనము గడపుటకూడ ఒక విధమగు ఆస్తికధర్మమే యని చెప్పుచుండిన యొక స్త్రీతో శ్రీమాతృదేవి యిట్లనెను : ''వీ రందఱును దివ్యాంశ సంభూతులు. వారీ లోకమున ఆఘ్రాణింపని పుష్పములవలె నిష్కలంకజీవితములు గడపుదురు. అంతకన్న రమ్యమైన దేమైన నుండునా? ఈ ఐహికజీవనములో ఏపాటి సుఖము కలదో నీవు స్వయముగా చూచియున్నావుగదా? నాయొద్ద నీ విన్నాళ్లనుండి యేమి నేర్చుకొంటివి? ఈ ప్రాపంచిక జీవనముపై నింత వాంఛ యేల? ఇంతటి పశుప్రవృత్తి యేల? దానివలన నీకెట్టి సుఖము లభించును? పరిశుద్ధాదర్శములుగల జీవనమును నీవు కలలోనైన భావింపలేవా? నీ భర్తతో నీ విప్పుడైన సోదరునితోవలె జీవింపజాలవా? పందుల తెఱగున జీవించుటయం దింత ఆసక్తి యేల? ప్రపంచములో కనుపట్టు ఈ తాపత్రయము నా యెముకలనుకూడ నమిలివేయుచున్నది.

* * *

తన కుమారుని మరల ఐహికజీవనము నవలంబింపజేయు మని యొక సాధువుయొక్క తల్లి శ్రీమాతృదేవి నొకనాడు ప్రార్థించెను.

అందు కామె యిట్లనెను : ''సాధువునకు తల్లి యగుట మహాభాగ్యము. ఇత్తడిచెంబుపై గల మమకారమునుగూడ మానవులు త్యజింప జాలరు. ప్రపంచమును పరిత్యజించుట మాట లా ? నీ వేల విచారించెదవు ?''

*       *       *

ఒక శిష్యురాలికి మంత్రోపదేశముచేసి శ్రీ మాతృదేవి యిట్లు పలికెను : ''క్రొత్తగా వైధవ్య మొందిన స్త్రీలకు మంత్రోపదేశము చేయకుండుట నా అలవాటు. నీ విషయములో ఆ అలవాటు తప్పితిని. నీ పారమార్థికశీలతయే అందుకు కారణము. నాకు పశ్చాత్తాపము కల్గింపకుము. శిష్యుల పాపములను గురువు అనుభవింపవలసి యుండును. క్రమము తప్పక మంత్రమును జపించుచుండుము.''

*       *       *

అత్తవారింటికి కాపురమున కేగుచుండిన యొక స్త్రీతో శ్రీ మాతృదేవి యిట్లు చెప్పెను: ''ఎవరితోగాని విస్తారము చనవు కల్పించుకొన కుము. కుటుంబమున జరుగు సాంఘిక కార్యము లలో అంతగా పాలుగొనకుము. 'మనసా, సదా నీయందే నీవు నిలిచియుండుము' అను కొనుచుండుము. ఇతరుల విషయముల నెఱుగు టకై కుతూహలపడకుము. ధ్యానప్రార్థనల కాలమును క్రమక్రమముగా అధికపఱచు చుండుము...''

*       *       *

మఱొక గృహస్థశిష్యురాలిని శ్రీ మాతృదేవి ఇట్లు హెచ్చరించెను :— ''మగవారితో— నీ తండ్రితో, నీ సోదరునితోగూడ—విస్తారము మచ్చికగా నుండవలదు. ఇతరులవిషయ మిక చెప్పవలయునా ? మఱొకసారి చెప్పుచున్నాను వినుము. ఏ మగవానితోనైననుసరే—భగవం తుడే ఆ రూపమున వచ్చినను — మచ్చిక వలదు.''

*       *       *

ఒక పిల్లవానిని దత్తు చేసికొనగోరిన యొక స్త్రీకి శ్రీ మాతృదేవి యిట్లు చెప్పెను : ''ఆ తలంపే పెట్టుకొనవలదు. లోకు లందఱియెడ నీ ధర్మమును నిర్వర్తించుచుండుము. నీ ప్రేమ మాత్రము భగవంతు నొక్కనియందే నిలు పుము. ఐహికప్రేమ లెప్పుడును చెప్పరానంత పరితాపమునకు కారణ మగును.''

*       *       *

నీ ప్రేమను ఏ మానవునియందైన నుంచి నచో నీకు సంతాపము తప్పదు. భగవంతుని మాత్రమే ప్రేమింపగల స్త్రీ ఎంతో అదృష్ట వంతురా లనుట తథ్యము. భగవంతుని ప్రేమిం చుట సంతాపకారి కాజాలదు.

నిరంతరము ధ్యానముచేయుటవలన మనస్సు సుస్థిరమగును. ఆ స్థితిలో ధ్యానమును ఆపుటకు నీకు మనసురాదు. మనస్సు ధ్యానమునకు విముఖముగా నుండునప్పుడు దానిని బలా త్కరింతకుము. ప్రణామములు మాత్రము చేసి ధ్యానపీఠమునుండి వెడలిపొమ్ము. స్వతస్సిద్ధ ముగా బుద్ధి దానిపై పొరలినప్పుడు చేయునదే నిజమగు ధ్యానము. —మాతృశ్రీ

# శ్రీ మాతృదేవి స్మృతులు*

## శ్రీమద్విశుద్ధానందస్వామి

క్రీ. శ. 1911-వ సంవత్సరము శ్రీశ్రీమా దక్షిణభారతతీర్థయాత్రకై వచ్చియుండెను. మాతృదేవి సేవకై శ్రీరామకృష్ణానందస్వామి సర్వదా ఆమెయొద్దనే యుండెను. బెంగుళూరు ఆశ్రమమునకు మాతృదేవి వచ్చెను. ఆ సమయమున తల్లియొద్ద నుండెడి అవకాశము నాకును లభించెను. మాతృదేవి బెంగుళూరికి వచ్చి యున్న సంగతి బైట ఎవ్వరికిని తెలుప వలదనియు, ఎక్కువమంది భక్తులు వచ్చిన ఆమెకు విశ్రాంతికికూడ అవకాశముండదనియు శ్రీరామకృష్ణానందస్వామి కట్టుదిట్టములు చేసిరి. కాని వారి కట్టుదిట్టము లేవియు సాగజాలవాయె. మాతృదేవి బిడ్డలు ఆమె విషయము తెలిసికొనకుండ ఉండగలరా? స్త్రీలు, పురుషులు పెక్కురు గుంపులు గుంపులుగా వచ్చి తల్లిని దర్శించుకొని పోవుచుండిరి. రాత్రి 8 గంటల తర్వాతనే భక్తుల ఒత్తిడి తగ్గుచుండెను. ఆహా! అది నిజముగా ఒక విచిత్రఘటన! మాతృదేవి దివ్యసాన్నిధ్యముతో ఆశ్రమము వెల్గొందుచుండెను. ఒకదినము ఆశ్రమములోని ఒక పెద్ద గదిలో మాతృదేవి ఆసీనలైరి. ఆ గదిలోనే కాక చుట్టుపట్లనున్న గదులలోకూడ భక్తులు క్రిక్కిఱిసి కూర్చుండిరి. ఎల్లరును మౌనముగా కూర్చుండిరి. అంత పెద్ద భవన మంతయు నిశ్శబ్దముగా నుండెను. అందఱును తదేకదృష్టితో మాతృదేవిని చూచుచుండిరి. ఇట్లు చాలసేపు గడచెను. అంత తల్లి నన్ను పిలిచి ఇట్లు పల్కెను: "బాబూ, నీవు ఏదేని వీరికి చెప్పు. వీరి భాష నాకు కొంచెము అయిన తెలిసియుండి, ఒకటి రెండుమాటలు వీరితో మాట్లాడినచో ఎంత ఆనందపడుదురో కదా?" నేను అమ్మ చెప్పిన ఈ మాటలు ఇంగ్లీషులో చెప్పగా భక్తమండలములోనుండి ఇద్దఱు వృద్ధభక్తులు లేచి నిలువబడి, చేతులు జోడించి ఇట్లు పల్కిరి: 'ఏమియు అక్కరలేదు. మా హృదయములు ఆనందభరితములైనవి. మేము మాతృదేవి యథార్థత్వమును హృదయంగతము చేసికొనుచున్నాము.' ఈ మాటలు వినుటతోడనే అమ్మ చేయి పైకెత్తి భక్తుల నెల్లరను ఆశీర్వదించెను. ఎంతటి అపూర్వసంఘటన! ప్రేమ రాజ్యమున మాటలతో పని లేదు. మాతృప్రేమ అవిచ్ఛిన్నధారగ భక్తులహృదయాంతరమందు ప్రవేశించెను — అచట భాషకు తావే లేదు. తల్లి తమ దగ్గఱనుండుటకే బిడ్డలు ఆశపడుదురు. మాతృదేవి బెంగుళూరులో ఉన్న కాలమంతయు, ఈలాగుననే ప్రేమలీల జరిగెను.

* [సత్ప్రసంగములు - రెండవభాగము.—శ్రీ విశుద్ధానందస్వామి]



# ‘శ్రీరామకృష్ణాదర్శ’ పరమావధి శ్రీశారద*

## [సంపాదకీయము]

౧

ఒకనాడొకరు మాతృశ్రీతో “అమ్మా, గురుదేవుడు సర్వమతసామరస్యమును నెలకొల్పినాడు, ఆయన ప్రసాదించిన ఆ సమరస భావము అద్వితీయమైనది కదా” అన్నారట. అందుకు అమ్మ చెప్పిన జవాబు — “బిడ్డా, మతసామరస్యమునుగూర్చి నీవు చెప్పుచున్నది నిజమే. కాని మతసామరస్యమును బోధించు స్పష్టసంకల్పముతోనే ఆయన వివిధమతమార్గాలలో సాధన చేసినాడని నాకు తోపలేదు. అహోరాత్రములు ఆయన ఉద్రిక్తభగవద్భావనలో ఉండెడివాడు. పారమార్థికసాధనలు చేయుటచేతను వైష్ణవ క్రైస్తవ మహమ్మదీయాదిమార్గాల అనుసరించుటచేతను ఆయన భగవల్లీలానుభూతి నొందినాడు. గురుదేవుని జీవిత విశిష్టలక్షణము ఆయన వైరాగ్యమే అని నా తలంపు. అట్టి వైరాగ్యము నెవరైన వేఱెటనైన కాంచి యున్నారా?”

ఈ సూక్తిదీపము నాధారపఱచుకొని దీనిని వెలువఱచినట్టి ఆమె స్వరూపమును గ్రహింపబూనితిమేని, ‘శ్రీరామకృష్ణాదర్శపు’ అప్పటమైన రూపును గాంచినవారమగుదుము. గురుదేవుని పారమార్థికానుభూతులలోను ఉపదేశాలలోను సర్వమతసామరస్యాదులైన అనర్ఘభావాలు లేవు అనము. కాని అవి ఆయన జీవితగంగాప్రవాహపు ఆనుషంగిక ఫలితాలు. శ్రీరామకృష్ణుడు దేవునే తప్ప వేఱు దేనిని నెఱుగడు. లేదా ఆయన సర్వమును దేవుడే, దేవునిలోనిదే, దేవునికొఱకుండునదే అని గ్రహించినాడు. ఆయనలో ఉండిన ఉద్రిక్త భావము ఒక్కటే. ఏది అనగా భగవత్ప్రేమ. ఆయన పనులకేమి ప్రసంగాలకేమి ఏకైకప్రేరకము భగవత్ప్రేమయే. అది ఆయనను క్రొత్త సాహసాలకు తార్చినది, క్రొత్తసాధనలను సమావేశాలను పొందించినది. వీని యన్నిటి ఫలితాలును మరల ఆ ప్రేమజ్వాలలలోనే ఆహుతి సేయబడినవి.

ఈ ప్రేమకే ‘వైరాగ్య’ మని నామాంతరము. శ్రీరామకృష్ణుడు స్వాత్మతేజముతో శారదాదేవిలో ప్రజ్వరిల్లజేసినది దీనినే. అట్లు చెప్పుట సరి యగునా? శ్రీశారదకు ఈ ప్రేమ సహజముగ లేదా! ఆమెలో ఆ ప్రేమే లేకుండిన, ఆమె శ్రీరామకృష్ణు నేలాగు అర్థము చేసికొని యుండగలదు? స్వాభీష్టజీవితలక్ష్యము నాయన చేరుటకు ఆయనకు తోడ్పడుటకే తాను దక్షిణేశ్వరమునకు వచ్చితి నని ఏలాగు చెప్ప సాహసించియుండును? భగవత్ప్రేమ ఆమెకు లేకున్నచో, శ్రీరామకృష్ణుడు తన లక్ష్యమైన భగవత్ప్రేమను సిద్ధింపజేసికొనుటలో ఆమె ఏలాగు ఆయనకు సహకరించియుండగలదు?

ఐనను శ్రీరామకృష్ణుడు దేనినిగాని యదృచ్ఛకు విడిచి పెట్టలేదు. శారదకు సంబంధించినంతవఱకు ఆయన తన కార్యక్రమమును సిద్ధపఱచుకొనియే యుండెను. ఐదేండ్ల శారదను

* వేదాంతకేసరి మాతృదేవి శతవార్షికోత్సవసంపుట సంపాదకీయవ్యాసానుసరణము.

‘ఈమె నాకు విధినిర్ణీతపత్ని’ యని కనిపట్టి నిర్దేశించినవా డాయన. తా మిరువురును కలసికొనుట ఘటిల్లినప్పు డెల్ల, ఆయన, ఐహికాధ్యాత్మికపథములలో ఆమెను తీర్చిదిద్దుటకై అత్యంతమైన జాగరూకతను వహించుచుండెను. ‘ఆమెలో ఉన్న పరిపూర్ణతను వెలువఱచుట’ అనెడి శిక్షణము ఏది కలదో, ఆ శిక్షణమును ఆయన ఆమె కొసంగెను. వివాహానంతరము ‘శారదలో కామస్పర్శ మైనను లేకుండ జేయుము’ అని ఆయన లోకమాతను ప్రార్థించెను. తన పారమార్థికసిద్ధులకు పరమపావనురాలగు శ్రీశారదాదేవిసాహచర్యము తన కెంతగా తోడ్పడినదో గుర్తించి అనంతరకాలమున శ్రీరామకృష్ణుడే కృతజ్ఞతతో ప్రకటించినాడు. ప్రాయము రాగానే శారద దైవోన్మత్తుడగు తన పతిసన్నిధికి చేరుకొనెను. భార్యకుండ వలసిన పూర్తిఅధికారమును ఆమె కిచ్చి శ్రీరామకృష్ణుడు, తన్ను తన భవిష్యమును, తన జీవితకార్యక్రమమును ఆమె కనికరమున కప్పగించెను. వెంటనే శారద, గుడిలో ఆయనచే నిత్యాభ్యర్చ్యమానయగు లోకజనని వలెనే ఆయన జీవితలక్ష్యావసరములకై తానెంత ఉదాత్తతాశిఖరముల నందుకోవలెనో అంత ఉదాత్తతాశిఖరములకు ఎక్కెను. శ్రీరామకృష్ణుని మనము ఎట్టి ఆదర్శముగా ఎఱుగుదుమో అట్లు ఆయనను రూపొందించుటలో ఆయన వైరాగ్యమునకంటె శ్రీశారదామణి వైరాగ్యమే ఎక్కువగా పనివడినది. ఇట్లు తన్ను శ్రీశారదకు పరతంత్రునిగా అర్పించుకొనుట ఆమెను తన లక్ష్యమునకును నిక్షేపమునకును ధర్మకర్త్రినిగా ఆయన తర్ఫీదుచేయు పద్ధతియే. తన సిద్ధుల యాథార్థ్యమును ఆయన ఆమెలో పరీక్షించిచూచుకొనెను. తన అద్భుత సాధనల అన్నింటి ఫలితములను ఆయన ఆమె చరణములకే అర్పించివేసెను. జీవితములో ప్రతిరంగములోను శ్రీరామకృష్ణునికి సిద్ధిని చేకూర్చినది భద్రపఱచినది శ్రీశారదయే. ఆయనను ఆమె అర్థముచేసికొన్నంత సమగ్రముగా అర్థముచేసికొన్నవారు వే రెవ్వరును లేరు. లోకములో తన కార్యక్రమమును నిర్వహించుకొనుటకు అవతారమూర్తికి సైత మొక అక్షము (ఇరుసు) కావలెను. శ్రీరామకృష్ణుని జీవితచక్రమునకు నిగూఢమైన అక్షము శ్రీశారదయే.

౨

శ్రీరామకృష్ణునిజీవితములో పరతత్త్వసాక్షాత్కారానంతరమే యథావిధి ఆధ్యాత్మికసాధనలు సాగినవి. ఆయన చెప్పిన ఉపమానము ప్రకార మిది ‘ఫలము ముందు గల్గి పూవు వెనుక గల్గుట’. అవతారమూర్తి వచ్చుట, నెగ్గించుటకే కదా, కాబట్టియే సత్యాలు తొలుత కనుగొనబడుట రుజువు తర్వాత పొందుపఱుపబడుట. శ్రీశారదాదేవిపట్ల కూడ ఇట్టి యొక అద్భుతమును గందుము. యోగియయిన తన పతిచేత ‘లోకమాతగా ఆరాధింపబడుట’ ఆమెకు ఘటిల్లును. కాని ఆమె తా నేమో బ్రతికినన్నినాళ్లు ఆయనకు శిష్యురాలుగనే ఉండెను. గుడిలో అర్చింపబడుచున్న జగజ్జననియే శారద యని శ్రీరామకృష్ణుడు ఆమెతోనే చెప్పినాడు. మూర్తీభవించిన సత్యమగు ఆయన మాటను ప్రత్యక్షరము ఆమె నమ్మినది. కాని తా నేమో ఆయననే తనకు మార్గదర్శకునిగా గురువునుగ కనుపెట్టియుండినది.

బుద్ధి తెలిసినమీదట ఆమె పతిజీవితరంగమున అడుగిడినదే అది ఒక ‘భగవత్ప్రేమ

గాథే'. ఆమెతోడి తన సంబంధపు ప్రారంభములోనే శ్రీరామకృష్ణు డామెకు చెప్పిన విషయము :— పిల్ల లందఱికి చందమామ మామే. అట్లే దేవుడును అందఱికిని మామ, ఉమ్మడిదైన 'సొమ్ము'. ఆయన నాశ్రయించు హక్కు ప్రతియొక్కనికిని కలదు. ఆయన నాశ్రయించినవాని కెల్ల తత్సాక్షాత్కారభాగ్యము గల్గును. అట్లే నీవును నీ అవధానమును ఆయన వైపునకు మరల్తువేని ఆయనను ప్రాపింతువు''.

నిజమునకు ఆమె తన ధ్యానమును అప్పటికే ఆయనవంకకు మరల్చుకొనియుండెను. ఆమెకు భగవత్ప్రాప్తి కల్గెనుగూడ. 'చందమామ' ఆదర్శమును గురుదేవుడు ఆమెకు దెల్పినాడే, ఆ యాదర్శము ఆమె కెంత పరిపూర్ణముగ వశపడెనో గుర్తించి ఆయనయే సంతోషాశ్చర్యము లొందెను. ఆమెజీవిత చరిత్రకారు డొక ఐతిహ్యమును దెల్పుచున్నాడు: ''ఒకనాడు మాతృశ్రీ గురుదేవున కాహారము నొక తట్టలో నుంచి తెచ్చుచుండెను. ఒకానొక మహిళ గురుదేవునిగదియొద్ద నిలబడియుండెను. ఆమె పరుగున వచ్చి 'ఆహారమును గురుదేవునొద్దకు నే నెత్తుకొని పోయెదను, దయచేసి నాచేతి కి'మ్మని అమ్మను ప్రార్థించెను. అమ్మయు సంతోషముతో తట్ట నామె చేతి కిచ్చెను. తట్టను గురుదేవు నెదుట పెట్టి ఆమె వెడలిపోయిన తర్వాత, ఆయన భుజించుచుండగా అమ్మ వచ్చి ఆయనకు గాలి విసరుచుండెను. అప్పు డాయన 'ఈ అన్నము మ్రింగుడుపడుట నా కెంతో కష్టముగ నున్నది. దీనిని తెచ్చినామె జీవితము విశుద్ధమైనదికాదు' అనెను. అమ్మ ఆ మాట కొప్పుకొని 'సరే ఈ నాటి కెట్లో ఆరగింపు' డని ఆయనను ప్రార్థించెను. అప్పు డాయన 'ఇకమీద నెప్పుడు నా అన్నము నితరులచేత పంప నని వాగ్దానమి'మ్మని అమ్మను కోరెను. వెంటనే అమ్మ విసనకఱ్ఱను క్రిందబెట్టి కై మోడ్పు ఘటించి ఇట్లనెను — ''ప్రభూ, అదిమాత్రము నాకు శక్యము కాదు. మీ కాహారమును సాధ్యమైనంతవఱకు నేనే తెత్తును. కాని ఎవ రైనను వచ్చి నన్ను 'అమ్మా' అని సంబోధించి ఏమైన నడిగినచో దాని నీయక నాకు తప్పదు. అంతే కాదు మీరు నాకుమాత్రమే కాదు సొంతము; సకలచేతనులకును మీరు సొంతము''.

ఆ మాటల సహజతయు, ఉదాత్తతయు, ఔదార్యమును శ్రీరామకృష్ణునకు వర్ణింపనలవి కానంత ప్రీతిని అచ్చెరువును గల్గించియుండును. ఆ మాటలలో ప్రకటమైన అద్భుతవైరాగ్య-త్యాగ-క్షాంతి-కరుణలు అమ్మ గురుదేవునొద్ద నేర్చుకొన్న పాఠమును పరమవిధేయ మగు నటుల అలవఱచుకొనె నని గురుదేవునకు నమ్మకము గలిగించెను. పవిత్రాపవిత్రవిభేదనిరపేక్షముగా తా నందఱికి సొంత మను విషయమును జ్ఞాపకముచేసినప్పుడు చందమామ కొంకింత సిగ్గు గలిగియుండవలెను. కాని ఆ చిత్తపరిణతి అమ్మకు ఎంతసహజముగ గలిగినది!

కాలము రాగా, చందమామ శారదలోనే పరిపూర్ణముగ ప్రకాశించెను. సంపన్నురాలగు నొక భక్తమహిళ దుశ్శీలయగు మఱియొకతె అమ్మగారి దర్శనమునకు వచ్చుచుండుటను జూచి, 'ఆమెను తఱిమివేయనిదే నేను మీ యింటికి రా' నని అమ్మను బెదరించినది. అప్పుడు అమ్మ ప్రశాంతతో చెప్పిన జవాబు: ''నేను మంచివారికిని అమ్మనే, చెడ్డవారికిని అమ్మనే''. ఒకనా డొక పతితురాలు పశ్చాత్తాపముతో భయముతో అమ్మవాకిట గడగడ లాడుచు నిలబడెను. విశ్వరక్షణప్రశస్తములగు

తన హస్తముల చాచి అమ్మ ఆమెను చేరదీసి, తన స్పర్శమాత్రముచేతనే ఆమెజీవితదుఃఖ మును తొలగించివేసెను. దేశభక్తి గల యొక శిష్యపరమాణువు విదేశవస్త్రమును గొన నిరాకరించెను. దివ్యవిప్లవకారిణియగు అమ్మ "ఆ పాశ్చాత్త్యులును నా బిడ్డలే. వారినుండి నే నెట్లుడసిపోగలను" అనెను. 'సర్వజగత్తును నాదే' అను కొనెడి ఆమె భక్తిని ఆనా డెవ్వరును అర్థముచేసికోలేరైరి. కాని అందఱికి తల్లి యగు నామె కొందఱికే తల్లిగ నెట్లుండ గలదు? ఉండజాలదు. మహమ్మదీయుడును బందిపోటుదొంగయు అగు అమ్జదును శరత్తు (శ్రీ శారదానందస్వాములు) ను తన కొక్క రీతిని పుత్రకులే అని ఆమె చెప్పియుండ లేదా? శ్రీరామకృష్ణునికి పిల్లియందు లోకమాత కని పించినది. లోకమాతకు నివేదింపవలసిన దాని నాయన పిల్లిచే తినిపించెను. అట్లే మాతృశ్రీకి చిలుకలో శ్రీరామకృష్ణుడు కనిపించినాడు. ఆయనకు నివేదింపవలసిన హల్వాను అమ్మ చిలుకకు నివేదించెను.

ఆమెజీవితములోని ప్రతిఘట్టమును, అపాతముగ ఆమె పల్కిన పల్కులును చేసిన పనులును 'శ్రీరామకృష్ణాదర్శము'నకు పూరకములే.

జీవులందు శ్రీరామకృష్ణు ననుకంప ఉత్కటకోటికము. కావున కంఠవ్రణము దుర్భరబాధ గల్గించుచున్నను పారమార్థికసందేశదానము నాయన మాన లేదు. మాతృశ్రీయందును అంత ఉత్కటకోటికమైన మానవసేవాక్షుధయే కనిపించును. అనంతరకాలమున తన యొద్దకు ఆశ్రితు లెవ్వరును రాక ఒక్కదినము గడచినను ఆమె గురుదేవునిచిత్రమున కెదుట నిలబడి "ఈ దినము ఊరకే గడచిపోయినది. ఒక్క రైనను నాయొద్దకు రా రైరి. 'ప్రతి దినము ఏకొంతయైనను చేయుచుండు' మని నీ వంటివే" అని చెప్పుకొనును. అనతో మరల ఆచిత్రమువంక చూచి "దేవా, ఈ దినము వ్యర్థముగనే గడచిపోవునా" అని అడుగును.

అమ్మ దేహము చాల బలహీనముగా నున్నప్పుడు, ఆమె విచక్షణ లేక అందఱిని చేరదీసి, వారి పాపములను తనమీదికి దెచ్చుకొని అధికమైన గాసికి లోనుకాకూడ దని, మనసు కరగిన పరిచారకు లెవ రైన ఆమెతో అందు రేని, ఆమె చెప్పు జవాబు సదా ఇదే— 'మేము (=గురుదేవుడును నేనును) అవతరించిన దిందులకే కదా. దీనిని మేము చేయకున్న వే ఱెవరు చేయుదురు. శ్రీరామకృష్ణు డవతరించి నది 'రసగొల్ల' తినుటకు మాత్రమేనా?'

ఆమె దేహ మామెవశమున నున్నంతవఱకు ఎవరు ఏవేళప్పుడువచ్చినను ఆమె నిరాకరింపక వారిని అనుగ్రహించి రక్షించుచునే యుండెను. సాధారణముగ అనుచరుల మాటలకు అణగియే యుండును కాని, ఈ విషయమున మాత్ర మామె అనుచరుల నియమములను వైద్యుల నియమములనుకూడ త్రోసిరాజనుచుండెను. ఆమె కృపావేగమును తగ్గింప గలవారు కాని దాని నొక వ్యాజమునకు కట్టుపఱుపగలవారు కాని లేరు. ప్రతి జీవుడును శివుడే అను భావముతోగూడిన శ్రీరామకృష్ణుని యీ ప్రేమ శ్రీ శారదాదేవిగుండ అర్థులవైపు పతితుల వైపు నిందితులవైపు నిరర్గళవేగముతో ప్రవహించెడిది.

శ్రీరామకృష్ణుడు మానవతతికి వెలుగొసగ గలవారిని గుర్తించి ఎన్నుకొని శిష్యులను గావించుకొన్నాడు. అమ్మయో 'అనాలోచిత

విశేషాశేషలోకశరణ్య'గా వెలసినది. తన్నాశ్రయించినవారికి ఆమె 'నాస్తి' అని చెప్పనే లేదు.

యోగిన్మా ఒక దిన మమ్మతో ఎగతాళిగ ని ట్లనెను: "గురుదేవుని శిష్యులను జూడు. ఆధ్యాత్మికరంగమున వారిలో ఒక్కొక్కడు నొక శిఖరమువంటివాడు. అమ్మా, మఱి నీ శిష్యులో", అందులకు అమ్మ చెప్పిన జవాబు:— "అందు ఆశ్చర్య మేమున్నది? శ్రేష్ఠులను ఆయన ఎన్నుకొన్నాడు. ఎంత మెలకువతో ఎన్నుకొన్నాడు! నూర్లకొలదిగ చీమలవలె వచ్చు ఈ చిఱుచేపలను ఆయన నావంకకు మరల్చినాడు. నా శిష్యులను ఆయన శిష్యులతో పోల్చకుము."

అమ్మమాటప్రకారమే మనము చీమలను దిగ్గంతులతో పోల్చకుందుము గాక. మనము, ఇంచుమించు చందఱమును చీమలమే. మనకు కావలసిన దేమనగా, తారకములగు చక్కెరరవలు మనలో ఎవరికిగాని దుర్లభములు కాగూడదు. నాయనకరుణకంటె అమ్మకరుణ ఎక్కువ అను నాగమహాశయుని సూక్తి అహేతుకము కాదు.

ఇందుచే అమ్మకు ఫలించిన దేమి? ముందే ఆమె శరీరము వాతవ్యాధిపీడితము. ఆరోగ్యము తఱుగుచుండెను కాని స్వయముగ నెట్టి సాధనలను చేయనివారగు తన చరణాశ్రితుల క్షేమమునకై ఆమె రాత్రులందు సగభాగమును ప్రార్థనల జపముల చేయుచు కూర్చుండియే గడపవలసియుండెను.

ఈ 'చీమ'ల ఆధ్యాత్మికక్షేమమును కాపాడుట అను పని కొంద ఱనుకొనునంత సులభమైన పని కాదు. ఏల యన అమ్మను ఆశ్రయింప వచ్చు వారిలో అతిఘోరపాపులు దుష్కార్యరతులు నుండెడివారు. అమ్మ అందఱికిని ఆశ్రయ మిచ్చెడిది. అమ్మయందున్న నిస్సమాభ్యధికమగు ఈ కనికరమును గూర్చి శ్రీ ప్రేమానందస్వామి ఇ ట్లనెను: "ఆమె దీవనలందుట కెందఱు పరుగున వచ్చుచున్నారో మీరు కన లేదా? మనము స్వయముగ ముంగ లేని విషమును కదా అమ్మ యొద్దకు పంపుచున్నాము. ఆమె అందఱికి ఆశ్రయ మిచ్చుచున్నది. అందఱి పాపముల గ్రసించుచున్నది, జీర్ణించుకొనుచున్నది. . . . అపారశక్తి! నిరవధిక దయ! మనమాట ఎందుకు, శ్రీరామకృష్ణుడు సైత మిట్లు చేయగా మనము చూచి యెఱుగము."

౪

శ్రీరామకృష్ణుని పరిపూర్ణత శ్రీ శారదాదేవిలో తనకే ప్రత్యేకమైన యొక మేలిమిని సంతరించుకొనెను. అతిదూరస్థితుడగు శ్రీరామకృష్ణుడు ప్రతియింటిసభ్యుడును ప్రతిహృదయకేంద్రమునను శ్రీ శారదాదేవిగుండ తా నగపడుచుండెను. ఆమె లేకుండినచో శ్రీరామకృష్ణుడు అల్పశక్తులును సంకుచితులును దోషపూర్ణులు నగు ప్రజల కందని ఆదర్శమై వారి నిరాశకు లక్ష్యమై యుండియుండును. ఆయన సంసారమధ్యముననే — కల్కత్తామహానగర సమీపమున — ఉన్నట్లు కనిపించెడిది కాని నిజమునకు ఆయన సదా బ్రహ్మనిమగ్నుడగను బ్రహ్మముగనే యుండెను. ఆయనలో ఆకర్షణశక్తియు నుండెను, అనుపసర్పణీయ ప్రభావమును ఉండెను. ఆయన సంచారము సదా బ్రహ్మమందే. కావున ఆ సంచారము మన మార్గాన సంచారము కానే కాదు. ఆయనకు గల ప్రపంచజ్ఞానము, అసాధార

ణము ఆంతరంగికము, నరులపట్ల ఆయన కరుణ నిరవధికము, అయినను తనకే ప్రత్యేకమైన యొక లోకములోనే ఆయన సదా ఉండెను.

కాని మనభాగ్యవశమున మాతృశ్రీ సంచారము సదా మనలోకముననే సాగెను. మన గృహముల చిక్కులు ప్రతిదానిని ఆమె ఎఱుగును. ప్రతిదానిలోను ఆమెకు ప్రవేశము గలదు. ఆమె మన అమ్మ, మనకై వండునది, మనల శుభ్రపఱుచునది, మన కుపకరించునది, మనల పోషించునది, మనకై శ్రమపడునది. మనగేహముల మధ్య, మనలోకము నడుమ మామూలు వ్యక్తిగ ఆమె ఉండెను కాని పరిపూర్ణబ్రహ్మజ్ఞానము గలిగియుండెను. మానవుల ఆధ్యాత్మికచరిత్రలో ఇది మన కంటి యెదుట ఘటిల్లిన గొప్ప సంభవము.

దక్షిణేశ్వరమున నుండిన దినములలో తన హృదయమున నొక ఆనందకలశము సదా ఉండినట్లు మాతృశ్రీకి అనుభూత మగుచుండెడిదే. అట్లే గురుదేవుడు దుఃఖవిదీర్ణమగు ఈ జగమున ఆనందము వెదజల్లు నొక పూర్ణకుంభముగా శ్రీ శారదాదేవిని నెలకొల్పినాడు. ఆమె జగములోపల వెలసి సంక్షుబ్ధమానవ తతిని ఉదాత్తత నొందించుచున్నది.

ఆ పవిత్రతాస్వరూపమును జూచి నిర్వృతి నొందనివా రెవరు? ఆమెనామమును స్మరించిన ఎవరికి కలుషక్షతి కలుగ లేదు? ఆమె యాత్మమానము విశ్వవశీకరణసమర్థము. దానిని ధ్యానించి ధీరుడు కానివా డెవడు? ఆమె వివేక మహిమచే అజ్ఞానక్షయము నొందని వా రెవరు? చతుర్దశభువనముల దనలో ఇముడ్చుకొనగల ఆమె అనుకంపచే దుఃఖశాంతి నొందనివా రెవరు? ఆమెశాంతిచేతను ఆమెసేవచేతను ప్రేమప్రవృద్ధి నొందనివా రెవరు?

శ్రీరామకృష్ణుడు సదా మన మాలిన్యపూర్ణప్రపంచావరణమునకు వెలుపలనే యుండెను. అటనుండియే తన సందేశ మందజేయుచుండెను. ఆయన ఆకాశమందలి హోమపక్షి. తనగీతామాధుర్యము నాయన ఆ గగనమున వెదజల్లుచుండెను. నిజమునకు ఆయన 'చందమామ'. ఎంతో ప్రియుడే కాని ఎంతో దూరమున నుండెను. ఊపిరాడనీయని యీ ముఱికి లోకాన ఆయన సక్తుడు కాలేక పోయెను. బాగ్బాజారు దుర్గాచరణముఖర్జీవీథిలోని ఒక అద్దెయింటికి వైద్యమునకై కొనిరాబడినప్పుడు, ఆయన ఆ యింటినుండి చరచర వెలికివచ్చి "ఆసన్నమరణులను కొనివచ్చినట్లుగ నన్నిచ్చటికి కొనివచ్చితిరా" అనుచు సరాసరి బలరాము నింటికి చనెను. మాతృశ్రీ అట్లు కాదు. పెక్కేండ్లు ఆమె నహబత్తులో నుండెను. అది యించుమించు కారాగారమువంటిదే. ఆనందకలశ మామెడెందమున నుండెను. ఇక వస్తుకలశములు ఆమెచుట్టు నుండెను, ఆమెనెత్తిపై కూడ నుండెడివి. గురుదేవునకును మాతృదేవికినిగల యీ భేదము ముచ్చటైనది, వారి స్వభావానుగుణము, నిగూఢార్థగర్భము. ఒక రీతిలో శ్రీరామకృష్ణునందు లేనివి మనకు మాతృదేవిలో కనిపించును. మనలను తినివేయు ఈ మలిన జగమున నూర్లకొలదిగ నుండు చిక్కులమధ్య దేవునొక్కనే దీపముగా జీవితలక్ష్యముగా జీవితనిర్వృతిగా నుంచుకొని తాను జీవించి అమ్మ ఇం దెట్లు జీవింపవలెనో మనకు తెలిపినది. ఆ రీతి శ్రీరామకృష్ణుని సిద్ధాంతములను సూత్రములను ఆమె మనకు అమలులో చూపి, వాని అంగీకార్యతను ఋజువు చేసినది.

మన ప్రతిదోషములోను ప్రతివెఱ్ఱిలోను ప్రతివక్రతయందును ప్రతిఆశాజ్వాలయందును

ప్రతిపరాజయవ్రణమందును ఆమె నిశ్శబ్దముగ తన జీవితమనెడి సంజీవనిని ప్రసరింపజేసెను. విముక్తిప్రదమగు జ్ఞానమునకు ఆమె మూర్తీభావము. ఆమె వైరాగ్యమును సేవయు సాడంబరరాజవీథులను మాని నూఱుపాయలై సందుగొందుల వ్యాపించి ప్రజల నుద్ధరించినవి. ఈ పరిపూర్ణతను శ్రీరామకృష్ణుడు కలలు కనుచుండి తుదకు ముఖ్యముగ శ్రీశారదలో సాక్షాత్కరించుకొనెను.

వంటింటిలో మనము వాడుకొను ప్రతి గిన్నెకును శ్రీశారద గౌరవ మొసంగినది. చీపురుకట్టకూడ గౌరవార్హమే అన్నది ఆమె. మనయింటిపిల్లి మూర్ధముకూడ భగవత్ప్రీతమే అన్నది. మనపెంపుడుచిలుక డెందమందుకూడ ఆ దేవుడే ఉన్నాడు. మనము పాఱవేయు బుట్టకుగూడ ఉచితగౌరవము నామె యిచ్చెను. కూరగాయలతోళ్లు ఆవుసొమ్మనియు వానిని దానినోటి కందించుట మన విధి యనియు ఆమె నొక్కి చెప్పినది. అల్పిష్ఠనీచతమముల పట్ల ఆమె అనుగ్రహమును శ్రద్ధయు మనశాస్త్రగ్రంథములందు ప్రతిపాదితములైన సత్యములకు దృష్టాంతము. పురాణములలో జనకుని గూర్చియు నతనిరాజార్హజ్ఞానమునుగూర్చియు మనము వినియున్నాము. దేశకాలాంతరితమగు మిథిలానగరరాజభవనములో ఆ రాజు ప్రకాశించెను. కాని మన కుటీరములకు, దుస్సహగృహములకు, శ్రద్ధాహీనులును, దీనులును, వక్రులును, మతిదూరులును, మానవద్వేషులును, నరములరోగములుగలవారును నిండిన మన ప్రజానీకమునకు మఱొక ఉదాహరణము కావలసివచ్చినది. దానినే మనము శ్రీ శారదయందు గాంచితిమి.

శ్రీరామకృష్ణాదర్శము మాతృశ్రీయందే పరమావధి నందినది. ఆమె తన్ను ఇటు సరళపఱచుకొనుట, శ్రీరామకృష్ణాదర్శమును ఆదర్శ్యాదర్శముగ చేయుటే.

౨

శ్రీరామకృష్ణునిసాధనలు సిద్ధిగాంచిన పిమ్మట లోకజనని అతనిని లోకశ్రేయమునకై "భావముఖము"న నుండుమని కోరినది. శ్రీరామకృష్ణవచనామృతమేమి, ఈ శ్రీరామకృష్ణసంప్రదాయమేమి, సాధనానంతరము శ్రీరామకృష్ణుని భావముఖావస్థానఫలితములే. మాతృశ్రీయెడ మఱొకవిధమైన భావముఖావస్థానము మనకు కనపడును. అది శ్రీరామకృష్ణునిజీవితము మానవతతికి ఏమేమొసగెనో వాని నన్నిటిని పనిలపఱచినది. అనంతతత్త్వమునుగూర్చిన తన సాధనలపంట ఇలు సేర్చినవాడు శ్రీగురుదేవుడు. అందుండి భక్ష్యములను భోజ్యములను వంచి తనబిడ్డలకు తినబెట్టినది ఆయనగారి గృహిణి.

శ్రీరామకృష్ణాదర్శము అతనిపేర నున్న సన్న్యాససంస్థగ రూపొందిన కథ పెక్కండ్రకు చక్కగ తెలిసినదే. కాని శ్రీరామకృష్ణుని నిర్యాణానంతరము ఆ సంస్థను 'శ్రీరామకృష్ణాత్మకము'గ రూపొందించిన దెవరో ఎవ్వరు నెఱుగరు. అట్లు చేసినది శ్రీరామకృష్ణుని బహిఃప్రాణమగు శ్రీశారదాదేవియే. తన భావనలకును చర్యలకును తల్లి అభ్యుపగతి లభించుటే తన దారి సరియైనందుకు ప్రబలతార్కాణమని బాగుగ నెఱిగినవాడు శ్రీవివేకానందస్వామి. కావున ఆమెయభ్యుపగతి లేక ఆయన ఏమియు చేయలేదు. ఆయన చేసిన ప్రతి పనికిని చేవను నిలుకడను చేకూర్చినది అమ్మ

ఆమె తాను 'శ్రీరామకృష్ణాత్మక'. ఆమెగుండ శ్రీరామకృష్ణుడే ఈసంస్థకు వెలుగును స్థితిని ప్రసాదించిన మార్గదర్శకుడు.

శుష్క-సిద్ధాంతాలవారికి ఆమె తన సరళోదాత్త జీవితప్రభావముచేత పారమార్థికపరత్వావశ్యకతను బోధించినది. స్ఖలనమొందు సాధకులను తట్టి ఆమె వారికి శ్రీ రామకృష్ణపరమైన ప్రబోధము గలిగించినది. ఒక్కపక్షమునే యెఱిగినవారికి ఆమె అన్యపక్షముల యెఱుకను గలిగించెను. తపోవ్యసనులకు ఆమె పరమార్థాదర్శసారమును ఎత్తిచూపినది. సంతుష్టుల బృందములలో ఆమె ఆధ్యాత్మిక జీవుల తపసులకున్న ప్రభావసౌందర్యములను హత్తుకొలిపెను. పరస్పర విభేదములున్న శిష్యులకు ఆమె పరమోదారజనని. ఆమెసన్నిధిని అన్ని ముడులును విడిపోవును, విరుద్ధములన్నింటి విరోధమును సమసిపోవును. అన్నిటికిని అమోఘమగు ఏకీభావ మొనగూడును. ఈ నూతన నాదర్శమును ఆకళించుకో లేక దీనిని విడిచి, మరల గుహలకును అడవులకును పాఱిపోవలెనని తహతహపడువానికి ఆమె ఇట్లు చెప్పెను : 'ఊరక గాలుల లెక్కపెట్టుచుండుటకు ఎక్కడకు పోవుద మని మీ యుద్దేశము ? రండి, నాకొఱకు గురుదేవునికొఱకు పాటుపడుడు, సాధనలకంటె అది తక్కువయా? పుల్లని పదార్థములనుజూచి భయపడి పాఱిపోయి సాక్షాత్తుగ చింతచెట్టుక్రిందనే కూర్చుండుట! మంచి బుద్ధి!' కొన్నిచోట్లయందు కొన్నికోర్కెలందు మితిమీఱిన ఆసక్తిగల్గి తమ ఆశ్రమములనే 'అపరసంసారములు'గ మార్చుకొన్న బూనుకొన్న వారికి బోధకముగను చక్కబఱచుటగను ఆమె చెప్పిన మాట ఇది. అలలుగా చెదిరిపోవు స్వభావము గల వారికి ఆమె మౌక్తికసంపన్నములగు సాగరాగాధములను జూపెడిది. అధఃకృతులకు హింసితులకు రుద్ధులకు ఆమె ఉత్తేజకరమగు తన 'మాతృచిత శాంతిచేత' బలము చేకూర్చెడిది. ఆమాతృత్వమే శ్రీరామకృష్ణునిలోని దేవత్వము.

ఉపన్యాసకేసరియగు వివేకానంద స్వామియు, పరమోదాత్తుడగు బ్రహ్మానంద స్వామియు ఆమెచరణములొద్ద గడగడలాడెడివారు. క్రుద్ధులగు వేల్పులు తమ బొత్తుగ లేక ఘోరములగు పిడుగుల విసరుచు మన్నప్పుడు, తమకు తప్పని శరణ మామెయే అని ఆదినాలలో ఆస్తిక్యమున క్రొత్తగ అడుగిడినవారెఱిగియుండిరి. ఆమె నొక్కి చెప్పిన విషయము — ఈ రామకృష్ణసంప్రదాయము సున్నముతో రాళ్ళతో నైన కట్టడము కాదు. ఇది యొక ఆధ్యాత్మికకుటుంబము. దీని అభివృద్ధికిని వ్యాప్తికిని మార్గము ప్రేమయే, ఊర్ధ్వవిసర్పియై దేవుని పరితఃప్రసృతియై మానవుని లక్షించు ప్రేమ. ఈభగవత్ప్రేమయు మానవప్రేమయునే శ్రీరామకృష్ణ నాత్మయందలి కేంద్రజ్యోతిర్జ్వాల. ప్రతియొక్కడును తన ఆత్మలో పదిలపఱచుకోవలసినది దీనినే. ఈ సంప్రదాయ క్షేమమునకును లోకమంగళమునకును ఇదే ఆధారము. శ్రీరామకృష్ణుని మతమునకును వివేకానందుని ఉత్సాహమునకును సంఘర్షణ కలిగినపుడు అంతఃపరీక్ష జరుగునదియు రెంటికిని పొత్తుకుదురునదియు ఆమెలో. రెండును సమకాలమున చక్కబడుట అచ్చటే, చక్కగా అర్థ మగుటయు అచ్చటే. శ్రీరామకృష్ణసంప్రదాయహృదయము శారదయే. కాని ఆమె దాని పరిధికి వెలుపల నుండెను, దుఃఖవిదీర్ణమగు సంసారమున నుండెను. ఈవిధముగ ఆమె ఈసంప్రదాయమును శ్రీరామకృష్ణుని

భావముఖావస్థానమునకు మూర్తీభావముగ నుండుటకు దారి చూపెను.

శ్రీరామకృష్ణుని నిత్యసజీవసాన్నిహిత్యమును సాక్షాత్కరించుకోవలెను. శ్రీరామకృష్ణసంస్థ కోరవలసినది, అలవఱచుకోవలసినది, ఒరుల కందింపవలసినది దీనినే అని ఆమె యుబలాటపడెడిది. శ్రీరామకృష్ణుడు మృచ్ఛిలామయదేవుడు కాగూడదు. ప్రతియొక్కనికిని ఆయన ఆత్మస్థానీయుడు కావలెను. ప్రతియొక్కని హృదయస్పందనమును ఆయన సాన్నిధ్యమును తెల్పుచుండవలెను. సరిగా ఇదే రామకృష్ణాదర్శము, భగవద్గత – భగవద్యుత – భగవదర్థక – జీవనముగ నుండుట అను రామకృష్ణాదర్శము, సజీవమైనాదర్శము. తానెట కేగినను ఏమి చేసినను అమ్మ శ్రీరామకృష్ణుని పేరు నుద్ఘోషించెడిది. దేవుని నుండి, ప్రియునినుండి, తన రామకృష్ణునుండి ఎడసి పని చేయుట ఆమె కశక్యము. తాను ఏమి చేసెడినో అదిగా తా నయ్యెడిది. ఆ ఐక్య మొకొక్కప్పుడు మతిరతి స్పష్టమై, ఆమె గొంతుపలుపును నడతరీతియు శ్రీరామకృష్ణుడామెగుండ ఇంకను జీవించియేయున్నట్లు సూచించెడివి. శ్రీరామకృష్ణుని కొఱకే ఆమె జీవించియుండిన దనుట మన మెఱిగినదే. శ్రీరామకృష్ణుని నిర్యాణమున కత్యనంతరకాల స్మృతులను దెల్పుచు ఒకప్పు డామె ఇట్లన్నది—'గురుదేవుడు చనినంతనే నేనును శరీరమును త్యజింప గోరితిని. ఆయన నాయెదుట కనబడి ''శరీరమును త్యజింపకు. నీ వీ లోకమున నుండవలయును. చేయవలసినపనులు పెక్కు లున్నవి'' అని చెప్పెను. ఆ వాక్కు నిజమే అని నేను పిదప గ్రహించితిని. పెక్కు పనులు నేను చేయవలసి యుండినది'.

ఆమె ఎవరో తెలిసికొని ఈ 'పెక్కుపనుల'ను చేయవలసియుండుటను అర్థముచేసికొనవలెను. ఆమె ఎవరో శ్రీరామకృష్ణుడే స్వయముగ తెల్పియుండకున్నచో మనము తెలిసికొనలేము. ఆయన స్పష్టముగ నిట్లనెను. ''ఆమె జ్ఞానదాత్రి. ఆమె సామాన్యురాలా? ఆమె నాశక్తి'' ఆయనశక్తి ఆయనతల్లి ఆనందమయి. ఆమె ఇట్లన్నది: ''అతడు నాకుబిడ్డ, తండ్రి, తల్లి, తోబుట్టువు, మిత్రము, సర్వస్వమును.'' మాతృశ్రీ ''నన్ను శ్రీరామకృష్ణుని అభేదదృష్టితో కనుడు'' అన్నది.

ఒకశిష్యు డడిగినాడు – ''అమ్మా, గురుదేవుని నిర్యాణానంతరము, నీ వున్నావు, మానవతతికి ఉపదేశములు చేయుచున్నావు. కాని పూర్వావతారపురుషులలో ఎవరి పత్నియు (శక్తియు) ఇట్లు చేసియుండలేదు. ఆయవతారమూర్తుల కనంతరము లోకుల కుపదేశించు పనిని వారి భక్తసహచరులు కావించుచుండిరి. నీవిషయమున ఈక్రొత్తదారియేల?'' ఇందులకు అమ్మ చెప్పిన జవాబు ''కుమారా, గురుదేవుడు సకలమందును లోకజననిని సాక్షాత్కరించుకొనె ననుట నీ వెఱుగుదువు కదా. లోకులకు దేవుని మాతృత్వమును బోధించుటకై ఆయన ఈసారికి నన్ను నిలిపి పోయియున్నాడు.''

౬

మాతృశ్రీని గుఱించిన గురుదేవు నభిప్రాయమును మాతృశ్రీ తన్ను గూర్చి తానేపడిన యభిప్రాయమును మనము చక్కగా అర్థము చేసికోవలెను. దేవుని మాతృత్వాదర్శము మగువలకును మగవారికినికూడ ఆదర్శమే కదా. కావున సోదరినివేదిత పల్కిన విశ్వజనీనమైన యొకమాట ఇంచుక అపర్యాప్తమనితోచును.

ఆమె చెప్పిన మాట : ''నాయభిప్రాయమున భారతీయమహిళాదర్శమునకు శ్రీరామకృష్ణుడు తెల్పిన పరమావధియే మాతృశ్రీ''.

లోకమంతటను అమ్మబిడ్డలలో కొమాళ్లు జాగరూకులై యుండవలెను. కూతుండ్రు అమ్మను తమకుమాత్రమే దక్కించుకొనుట కిది చక్కని పన్నుగడ!!

అది పోనిండు. శ్రీరామకృష్ణుని సందేశము నంతటిని మనము ఎఱిగియున్నంతలో చూచితిమేని భారతీయమహిళాదర్శమునుగూర్చి మాత్రమే ఆయన చెప్పియుండు నని తోపదు. భారతీయమహిళాదర్శపుమహోన్నతావిష్కృతి మాతృశ్రీలో లేదనము, కాని ఆమె విశ్వమహిళాదర్శపరమావధి అనుట యొప్పు నని మా విన్నపము. ఆదర్శమును పరిచ్ఛేదించి 'భారతదేశమునకు మాత్రమే ఇది ఆదర్శము' అని అందుమేని, అది తుదకు భారతీయమహిళాదర్శమైనను కాకపోవును. ఇది కేవలము సిద్ధాంతము కాదు, విశ్వమందలి బహుదేశాలందున్న ప్రజ్ఞాధురీణలైన మహిళలు ఈనాడు శ్రీశారదనే తమ పరమాదర్శముగ తల దాల్చుచున్నారు.

మఱొక్కమాట! మాతృదేవి విశ్వమందలి మహిళలకు మాత్రమే ఆదర్శభూతురాలగుచో అది వాస్తవమైన ఆమె వైభవమునకు తక్కువే. దేవుడు మహిళలకు మాత్రమే తల్లియా? దేనికైనను మాతృదేవి లక్ష్యమగుచో - అది దీనికే:__ఏజీవితము భగవంతుడు అను రసమున నానినదో, ఏజీవితమునకు దేవుడే కేంద్రమో, దేవుడే పరిధియో అట్టి జీవితమునకు మాతృదేవి లక్ష్యము. అదే నిజముగ రామకృష్ణాదర్శము.

రామకృష్ణాదర్శము శ్రీరామకృష్ణునిలో మాత్రమే పరిపూర్ణత నొందినది కాదు, మాతృదేవి దానిని ఎట్లో అందుకొనెనని చెప్పుట సరి కాదు. శ్రీశారదాదేవియే చెప్పెను కదా ''శ్రీరామకృష్ణుడును నేనును ఒక్కరమే'' అని. కావున రామకృష్ణాదర్శమే మాతృదేవిగా రూపొందినది. అంతే కాదు, ఆమెలో పరమావధి నందుకొన్నది.



# శివానందస్వామి - ధర్మప్రసంగములు

బ్రహ్మచారిణి లలిత

బేలూరుమఠము, ఆదివారము, డిసంబరు 22, 1930

నేడు శ్రీశ్రీమా (శారదాదేవి) జన్మదినము. ఉదయమునుండి మహాపురుషులు మాటిమాటికి 'అమ్మా, అమ్మా, అమ్మా' అని తదేకతానముగ స్మరించుచుండిరి. మాతృగతప్రాణము__పసిబిడ్డనుబోలి అమ్మను పిలుచుచుండిరి. కన్నులు మూసికొని చేతులు జోడించి ''అమ్మా, మహామాయీ, జయము, జయము. అమ్మా మాకు భక్తి, విశ్వాసము, జ్ఞానము,

వైరాగ్యము, అనురాగము, ధ్యానము, సమాధి ప్రసాదింపుము తల్లీ. శ్రీరామకృష్ణభగవానుని ఈ సంఘమునకు మంగళము చేకూర్పుము, ప్రపంచమునకు శాంతిమార్గము చూపుము తల్లీ!'' కొంతసేపు ఊరకుండి మరల ఇట్లు పలుకదొడంగిరి : ''మాకు భక్తి లేదు. అందుచే ఇన్ని దినాలుగ నీ మహిమను యథార్థముగ తెలిసికొనజాలక పోతిమి. అహా! ఈ దినము. ఈ దినమా! ఆ మహామాయి జన్మదినమా! — ఈ జీవులను — ఈ జగత్తును అనుగ్రహించుటకుగాను — మహామాయి స్వయముగ జన్మగ్రహణము కావించెను కదా! మానవ రూపలీల తెలిసికొనుట చాల కష్టము. ఆమె కృప చూపని పక్షములో ఎవరు అర్థముచేసికొనగలరు? ఎంత అమాయికురాలుగ ఉండెడిది! తన శక్తిని అంతయు మఱుగుపఱచెడిది. ఏదో మారువేషము ధరించినట్లు నటించెను కదా! మన మామె నెట్లు అర్థముచేసికొనగలము? శ్రీరామకృష్ణు లొక్కరే ఆమెను అర్థము చేసికొనగల్గిరి. శ్రీరామకృష్ణులు ఒకదినము నాతో ఇట్లు చెప్పిరి : ''ఈ ఆలయములోని తల్లియు (శ్రీ కాళికాదేవి) నహబత్తులో నివసించు తల్లి (శ్రీ శారదాదేవి) యు ఒక్కరేసుమా. శ్రీ వివేకానందస్వాములుకూడ అమ్మ యథార్థస్వరూపమును తెలిసికొనగల్గిరి. ఆహా! మాతృదేవిపట్ల స్వామిజీకి ఎంతటి భక్తి!'' స్వామిజీ ఇట్లనెడివారు : ''అమ్మ ఆశీర్వాదము కైకొనియే సముద్రమును దాటి విశ్వవిజయమును సంపాదింప గల్గితిని.''

ఆ దినము తనకు ప్రణామ మాచరింప వచ్చిన వారి నందఱిని ''నీవు మాతృదేవిని చూచితివా?'' అని ప్రశ్నించుచుండిరి. ఆ దినము ఆదివారము అయినందున పెక్కురు భక్తులు వచ్చిరి. సుమారు మూడువేలభక్తులు మఠములో ఆ దినము ప్రసాదము స్వీకరించిరి. ఆ దినము ఉదయమునుండి ఆకాశము మేఘాచ్ఛాదితమై యుండెను. వర్షము వచ్చునేమో, మాతృశ్రీ జన్మోత్సవానందము తగ్గునేమో యని ఎల్లరును తలంచిరి. ఒక బ్రహ్మచారి శ్రీమహాపురుషులయొద్దకు వచ్చి మేఘములు కమ్ముకొని యున్నవి — ఉత్సవము సక్రమముగా జరుగదేమో యని చింతించెను. మహాపురుషులు కొంచెము ఊరకుండి ఇట్లు పల్కిరి : ''బిడ్డా, ఏలాటి భయము లేదు. తల్లికృపచే ఈ దినము ఉత్సవము సక్రమముగా జరుగగలదు. మాతృదేవి మహాలక్ష్మి, సర్వము మంగళమే ఒనడ్చును.'' సాయంకాలము పూజనీయగంగాధరమహారాజు(అఖండానందస్వామి) గారు మాతృజయంతి చూచుటకై వచ్చిరి. వారిని చూచి మహాపురుషులు చాల ఆనందించిరి. మాతృదేవి ఆలయమున శ్రీచండీగానము జరుగుచుండెను. శ్రీచండీగానము బేలూరు మఠములో జరుగుటకు ఇదే మొదటిసారి. మహాపురుషులు పలుమార్లు చండీగానము ఎట్లు జరుగుచున్నదో పరికించుచుండిరి. మహాపురుషులు ఇట్లు పల్కిరి : ''మనతల్లిపేరు శారదాదేవి. ఆమె సాక్షాత్ సరస్వతి. ఆమెయే కృప చూపి జ్ఞానము ప్రసాదించును. భగవంతుని తెలిసికొనుటయే జ్ఞానము''.



శ్రీ వివేకానందస్వాముల శతతమజయంతి 17-1-1963

# శ్రీ శారదాస్తుత్యనువాదగీతములు

నే. భ.

స్థిరములగు లోచనంబులు చెలఁగు కృపయు గలిగి భక్తుల మానసకమల మనెడి
పీఠమున హాయిఁ జొక్కుచు ద్విభుజములును తేఁటమోమును నొప్పారు దేవి నిన్ను
శారదామాత, నామది సతత మెంతు ॥ ౧

వక్షమున నొకసగముపై బలిసి వ్రేలు నెఱికురులు పైఁడితొడవుల సిగ్గు, మేన
ధవళమా నంబరంబును దాల్చు – నిన్ను శారదామాత, నామది సతత మెంతు ॥ ౨

స్వాంకవిన్యస్తహస్తవు జ్ఞానభక్తిదాయినివి, జీవపాపసంతాపహారి
ణివి, శుచివి, జ్యోతి నీ రూపు, నిన్ను దేవి, శారదామాత, నామది సతత మెంతు ॥ ౩

రామకృష్ణగతము నీదు ప్రాణ, మతనిపేరు వినిన నీమదిఁ బ్రీతి పేర్చు, నతని
దలఁచిన వికసించును నీదు తనువు, విశ్వజనని దాల్చిన రూపము వైన నిన్ను
శారదామాత, నామది సతత మెంతు ॥ ౪

చిన్మయివి నీవె, రాధవు సీత వీవె, సర్వమంగళవును నీవె, జగతి నిత్యవును,
వరదవు, మోక్షప్రదవు నగు నిన్ను శారదామాత, నామది సతత మెంతు ॥ ౫

ఓమహాదేవి, కరుణాపయోధి, మమ్ము నీసుతులఁ బ్రణతుల దయ నేలుకొనుము,
నీయడుగుఁబ్రాపు నొసఁగుము, నిఖిలలోకజనని, నీ కిదె మా నమస్కార మమ్మ ॥ ౬

సిగ్గు నీ కొక తెర యయి చెలఁగుచుండ జ్ఞానదానము సేయుదు సంశ్రితులకు
వరకృపామయి, మమ్ము పాపములనుండి కావు మో శారదా నమస్కార మమ్మ ॥ ౭

ఎవతె జీవనచరితముల్ పావనాలొ, ఎవతె రూపుగాంచినయట్టి పావనతయొ
అట్టి మా శారదమ్మ పదాంబుజములకు నిడుదు నమస్కృతిశతము కోర్కి మీఱ ॥ ౮

దేవికిఁ, బ్రసన్నకుఁ, బ్రణతార్తిహరకు, భవముక్తిదాత్రికి, యోగీంద్రపూజ్యకు, యుగ
ధర్మలక్ష్యకును, బ్రశస్తదయకు—శారదాంబికకు భక్తితో మ్రొక్కెదను సతతము ॥ ౯

స్నేహబంధాన బంధింతు చిత్తములను, తప్పు లన్నిటి మార్చెద నొప్పులనుగ
సాపరాధుల నవ్యాజకృపను గాతు వంకమునఁ దాల్చి, అది కాదె అబ్బురంబు ॥ ౧౦

వినయమున నిన్ను మాతరో వేఁడుకొందు పుత్త్రులందు సదా స్నేహపూర్ణ వగుము
చిరము తప్తములైన మా చేతములకు శాంతిఁ గూర్పుము ప్రేమరసంబు చిలికి ॥ ౧౧

జనని శ్రీశారదాదేవి జగములకును గురుడు శ్రీరామకృష్ణుండు వారి పాద
పద్మములఁ జేరి చేయుదు వందనముల మరల మరలను మరలను మరల మరల ॥ ౧౨

# శ్రీమద్భాగవతము - శ్రీకృష్ణసందేశము

## [శ్రీమత్త్రిభువానందవాణి]

### చతుర్థస్కంధము

### పంచమాధ్యాయము

### ప్రచేతసులు

ప్రాచీనబర్హి మహారాజునకు కుమారులు పదుగురు. వారికి ప్రచేతసు లని పేరు. సుగుణములకు వారు ప్రఖ్యాతులు. గృహస్థాశ్రమ బంధములలో జొచ్చుటకు ముందు వారు కఠిన తపోనిష్ఠతోడి జీవితముల గడపిరి. పెక్కేండ్లు ధ్యానము నభ్యసించిరి. ప్రేమనాథుడు వారి స్థిరభక్తికి ప్రీతుడై వారికి తన వైభవమును సాక్షాత్కరింపజేసి వారి హృదయాలను శాంత్యానందములతో నింపెను. వారి పరమానందము వారివాక్కున ఇట్లు గేయరూపమున వెలువడెను —

గీ॥ వేదవేద్య ప్రణామము నీదు పాద
పద్మములకు; దీర్ఘము దుఃఖభరిత మైన
భవ మను కలను దొలఁగించివైతు వీవు;
పావనంబగు నీనామనివహ మెపుడు
నాల్కపైఁ గ్రాల, దివ్యగుణాళి నెదను
దలఁచి, నరుఁడు నీ భవ్యపథాన నడచు;
మదికి మాటల కందదు నీదు మహిమ,
ధాత, యింద్రియపథము నీదారి కాదు;
ధన్యు లెఱుఁగుదురయ్య నీదైన శుద్ధ
శాశ్వతానందమూర్తి; సంసారపాశ
బంధము విడును వారిని, ప్రణతి నీకొ
నరిచెదము దేవ, మాధవా, నరకనాశ,
ప్రేమనాథుఁడవు; పతివి ప్రీతి నిన్ను
పాసనము సేయువారికి; పాపవితతి
తొలఁచి మము నెల్లఁ గాతువు, తోయజాక్ష.
నిన్నుఁ దమసొంతవానిగా నెఱుఁగఁ గల్గు
వారు ధన్యులు, శాంతిని వారె కంద్రు.
ఆత్మలకు నెల్ల నాత్మవై యమరు దేవ,
ఎల్లవారల హృత్కాంక్ష లెఱుఁగు దీవు,
నిన్ను నిచ్చలు ప్రేమింపనిమ్ము మమ్ము,
నీ వనంతుఁడ, వవధులు లేవు నీకు,
నీదు వైభవములకును లేదు హద్దు,
కర్మవశ్యత జన్మలు గల్గునేని
జన్మజన్మమునన్ మాకు సారసాక్ష,
నీ పరమభక్తుల చెలిమి నెగడుఁ గాక
అదియె భాగ్యపరాకోటిగాఁ దలఁతుము.

సీ॥ ముక్తులా నీభక్తపుంగవుల్ దేవ నీ
పలుకనే యెల్లప్డు పలుకుచుంద్రు
ఎల్లవారిని సమదృష్టితోఁ జూచెద
రిహబంధముల నెడలించుకొంచు
నిత్యసంశ్లేషంబు నీతో ననుభవింత్రు
మహికి వా రుండుట మంగళంబు
వారిజీవితములు పావనదీపముల్
వారిసంగతి మృత్యుభయహరంబు

గీ॥ నిక్కముగ నీవె వెజ్జవు నీరజాక్ష
ఈశితవ్యుల భవమృత్యునాశనుడవు
నిరవధికజీవితంబును నిత్యమైన
యట్టి యానంద మిచ్చెద వాదిదేవ
నీ మహాయశ మెవ్వఁడు నేర్చుఁ బొగడ?
నన్నియును నీవె, యుండుదు వన్నియెడల,
మ్రొక్కెదము నీకు మాటికి రుక్మిణీశ ॥

ఇట్లు అనంతుడగు భగవంతుని మహిమను కొనియాడి ప్రచేతసులు తమ డెందములలో పరమ నిర్వృతిని గాంచిరి.

పురుషార్థసాధకముగ వారు పెక్కేండ్లు జగతిని జీవితమును గడపిరి. పరమోన్నతజ్ఞానమును గడించుటకై సకలచరాచరముల కంతర్యామిగ నున్న అద్వితీయదివ్యాత్మను గూర్చిన జ్ఞానమును బడయుటకై వారు సన్న్యసించిరి. ఏకాంతముగ నుండు నొక చోటి కేగి వారు నిర్గుణబ్రహ్మానుసంధానము నభ్యసింప దొడగిరి. ఒకనాడు వారు ధ్యానింప గూర్చుండియుండగా వారియొద్దకు మహాచార్యుడగు నారదుడు అరుదెంచెను. ప్రచేతసు లాయనను మహాభక్తితో పూజించి, ముక్తిప్రదమగు సత్యమును పరతత్త్వమును తమ కుపదేశింపుమని ప్రార్థించిరి.

అంత నారదుడు తనహృదయమును భగవంతునితో యోగమొందించి, ఇట్లు ప్రారంభించెను:—

''రాజకుమారులారా, విశ్వాత్ముడగు భగవంతుని ప్రేమపూర్వకసేవకై అర్పితమైనట్టి జన్మము ధన్యము, అట్టి కర్మము మహోజ్జ్వలము, అట్టి జీవితము పారమార్థికము, అట్టి మనసు పరమభాస్వరము, అట్టి వాక్కు (సర్వ) ఫలప్రదము

మానవునకు రెండు జన్మములు గలవు తల్లిదండ్రులవలన గల్గునది తొలిజన్మము. పావనరహస్యార్థముల ఉపదేశమునొందుట మలిజన్మము. కాని ప్రేమపూర్వకముగ భగవంతునికి సేవచేయుటకు జీవిత మర్పించుకొనని వాని ఈ రెండు జన్మములును వ్యర్థములే.

భగవత్కైంకర్యము చేయుచు జీవింపమేని, ఇక మన సత్కర్మలు వ్యర్థములు, మన సుదీర్ఘ జీవితములు నిష్ప్రయోజనములు.

ప్రేమయు సేవయునే సర్వవేదములయు తపములయు చదువులయు శాస్త్రములయు మహిమలక్ష్యములు.

హృద్గతమైన భగవత్ప్రేమ లేని వాని యోగమును సన్న్యాసమును శాస్త్రపాండిత్యమును ధర్మకార్యములును నిరుపయోగములు నిరర్థకములు.

ఉన్నవస్తువులన్నింట ప్రియతమము ఆత్మయే. ప్రేమనాథుడు సాక్షాత్తుగ మనకు ఆత్మ ఇక ఆయనకంటె ప్రియతరులు వేరెవ రుండగలరు?

వృక్షమూలమునొద్ద పోసిన నీటిచే వృక్షశాఖలు పుష్టినొందినట్లు, ఆహారము భుజించిన ఇంద్రియములు అధికశక్తిమంతము లయినట్లు, విశ్వనాథుని ప్రేమించి ఆరాధించినప్పుడు విశ్వమంతయు ఆనందపూర్ణ మగును.

కావున ఓ రాజకుమారులారా, ఆయనను మీఆత్మకంటె అభిన్నునిగ భావించి మీహృదయములందే ఆరాధింపుడు. సృష్టికంతటికిని ఆత్మ ఆయనయే. విశ్వమునకు నిమిత్తోపాదానకారణములు రెండును ఆయనయే. ఆయనే పరాత్పరుడు విశ్వేశ్వరుడు.

సర్వప్రాణులపట్ల ప్రేమ, ఈవి, సర్వదశలందును సంతుష్టి, ఇంద్రియములయు కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యములయు నిగ్రహము—అను ఈ గుణముల అలవఱచుకొనుట దేవుని సామీప్యము నొందించును.

తన భక్తుల విశుద్ధచిత్తములందు భగవంతుడు సదా వెలసియున్నాడు.

ఇట్లు నారదోపదిష్టులై ప్రచేతసులు తమ మనసులను హృదయములను ప్రేమనాథునితో గలిపి ఆయనతోడి తమ ఐక్యమును సాక్షాత్కరించుకొనిరి.



# ఆస్తిక్యం

శ్రీ పున్నావజ్ఝల సీతారామబ్రహ్మంగారు

## ఏకేశ్వరోపాసన

జగదీశ్వరుడు, ప్రతిజీవుని హృదయేశ్వరుడు అయిన ఏకేశ్వరుని విశ్వసించడమే ఆస్తిక్యం. ఈశ్వరుడు ఆత్మస్వరూపుడు. జీవుడుకూడా ఆత్మస్వరూపుడే. జీవాత్మ పరమాత్మనుంచి ఉద్భవించినదే. కనుక జీవాత్మ పరమాత్మల సంబంధం ఆత్మసంబంధమే కాని మఱొకటి కాజాలదు. పరమాత్మనుంచి పుట్టిన జీవాత్మకు పరమాత్మతో కలిసిపోవాలన్న కాంక్ష సహజలక్షణం; కనుక సంయోగం సాధ్యం. పరమాత్మతో సంయోగం పొందటమే జీవాత్మకు స్వస్థత కలగడం. అంతవఱకు దాని స్థితి, కాని దేశంలో, దిక్కుమాలిన పక్షివలె సంచరించడం వంటిదే. అది అస్వస్థతతో బాధపడుతున్న స్థితే.

జీవుడు చేసే ఆలోచనలు, భావించే భావనలు, నిర్వహించే పనులు పరమాత్మకోసం సాగించే అన్వేషణే. అయితే ఈ అన్వేషణ తెలియక, తెలిసీ తెలియక కటికచీకటిలోనో, కనుచీకటిలోనో తన గమ్యం తనకే తెలియకుండా నడవడం వంటిది. నదులన్నీ సాగరంలో సంగమించునట్లు జీవులన్నీ సులభంగానో, శ్రమపడో, సూటిగానో, చుట్టూ తిరిగో, శీఘ్రంగానో, ఆలస్యంగానో పరమాత్మను చేరుకోడానికి ప్రయత్నిస్తున్నవి.

పరమాత్మతో సంయోగం పొందడానికి స్పష్టమైన ఎఱుకతో సూటిగా చేసే ఒకానొక తీవ్రప్రయత్నమే ఉపాసన.

పరమాత్మతో సంయోగం పొందుతూ, అతని సంకల్పానుగుణంగా జీవితరథాన్ని కర్మక్షేత్రంలో నడిపించాలన్న అభీప్సతో చేసే ఉపాసనే ఏకేశ్వరోపాసన, ఆధ్యాత్మికోపాసన. ఏకేశ్వరునితో సంయోగం పొందడం అంటే సమస్త నానాత్వాన్ని అతిక్రమించి, పరమాత్మస్థితిని పొందడం. సమస్త వాంఛలు భేదజ్ఞానంనుంచో, అహంకారంనుంచో, మమకారంనుంచో పుట్టినవే. సమస్త భయదుఃఖాలకు కారణంకూడా భేదభావమో, అహంకారమో, మమత్వమో. అందుచేత మనవాంఛలను తీర్చవలసిందని ప్రార్థించడం ప్రకృతిశక్తులను, క్షుద్రదేవతలను ఆరాధించడమే గాని ఏకేశ్వరుని ఉపాసించడం కాదు. సాధనపథంలో అనేక ప్రయోజనాలు, శక్తులు అయాచితంగా లభించవచ్చుగాక. కాని, సాధకుడు వాటి వ్యామోహానికి వశమైపోవడం, వాటిని స్వప్రయోజనానికి వినియోగించుకొనడం ఏకేశ్వరుని విడనాడ్డమే.

నానాత్వం సర్వతంత్ర స్వతంత్రమైనది కాదు. అది పరాత్పరుని అధీనమైనది. నానాత్వానికి గల స్వాతంత్ర్యం బహు పరిమితం. నానాత్వం నామరూప క్రియాత్మకం, పరివర్తనాశీలం. కనుక ఎవడు నానాత్వాన్ని ఆశ్రయిస్తాడో, ఎవడు ప్రకృతిశక్తులను పూజిస్తాడో

అతడు మృత్యువునుంచి మృత్యువుకు ప్రయాణం చెయ్యవలసినవాడే. క్షుద్ర దేవతలను, ప్రకృతి శక్తులను పూజించడంవల్ల తాత్కాలికమైన కొన్ని నీచప్రయోజనాలు కలిగితే కలగవచ్చు. కాని, సృష్టిమర్మం తెలియదు; ఆత్మజ్ఞానం, ఆత్మానందం, అమృతత్వం సిద్ధించవు. అవి ఆ దేవతలకే లేవు. ఇక తమ భక్తుల కేమివ్వ గలరు ?

భగవంతునితో సంయోగం పొందడానికి కావలసిన శక్తుల నిమ్మని, సౌకర్యాలు కలిగించవలసిందని, సహాయపడవలసిందని, అవరోధాలు తొలగించవలసిందని ఏకేశ్వరుని ప్రార్థించవచ్చు. ఎప్పటికప్పుడు కర్తవ్య మాదేశించవలసిందని అర్థించవచ్చు. ఈతి బాధల నుంచి శాంతి, స్థైర్యం ప్రసాదించవలసిందని కోరవచ్చు. ఆరోగ్యభాగ్య మిమ్మని అభ్యర్థించవచ్చు. కష్టాలు తలకు మించినప్పుడు గట్టెక్కించవలసిందని వేడుకొనవచ్చు. మనస్సుకు శాంతి, నిబ్బరం కలగడం, కర్తవ్యం బోధపడ్డమే కష్టాలు తొలగిపోయినందుకు నిదర్శనం. అసత్యంనుంచి, అజ్ఞానంనుంచి, అంధకారం నుంచి, పరాధీనతనుంచి, మృత్యువునుంచి సత్యంలోకి, జ్ఞానంలోకి, జ్యోతిలోకి, స్వాధీనతలోకి, అమృతత్వంలోకి నడిపించవలసిందని, తాను మనః ప్రాణ దేహాలకు భిన్నమైన ఆత్మనన్న వివేకం కలిగించవలసిందని చేసే ప్రార్థన ఏకేశ్వరప్రార్థన. పరమాత్మ స్వరూపాన్ని, తనకు పరమాత్మకు గల . అభేదతత్త్వాన్ని ధ్యానించి, ధరించడం ఏకేశ్వరోపాసన. విషయ భోగం, భౌతికవస్తుసంపద, సంపదపై యాజమాన్యం, ఐశ్వర్యం, అధికారం, పదవి, కీర్తి, తనకు తనవారికి విజయం, తన శత్రువులకు పరాజయం, సంతానప్రాప్తి ఇత్యాది కోర్కెల సాఫల్యానికి పూజించడం ప్రకృతిబంధాన్ని మరింత వృద్ధిచేసుకొనటమే. ఇది ప్రకృతిపూజే గాని, ప్రకృతిబాధనుంచి విముక్తి చెందించే ఏకేశ్వరోపాసన కాదు.

ఉపాసన—బుద్ధిని, హృదయాన్ని జోడించి సాగించవలసిన పరిశ్రమ. ఇది ప్రధానంగా అంతరంగసాధన. దీనిని ప్రారంభించడానికి అర్హులు కానివారు లేరు. ఆగర్భశ్రీమంతులు, గర్భదరిద్రులు, చదువుల సరస్వతులు, నిరక్షరాస్యులు, రారాజులు, బిచ్చగాండ్రు, పురుషులు, స్త్రీలు, దృఢగాత్రులు, వికలాంగులు, సుందరాకారులు, కురూపులు, బాలురు, వృద్ధులు, బ్రహ్మచారులు, గృహస్థులు, యజమానులు, సేవకులు, తాపసులు, పాపులు ఏకేశ్వరోపాసనకు అర్హులే. కళ్యాణమంటపంలోను, శ్మశానవాటికలోనుకూడా భగవంతుని ఉపాసించవచ్చు. ఏకేశ్వర ధ్యానానికి వర్జ్య సమయంగాని, వర్జ్యస్థలంగాని లేదు. ఉపాసనకు ధనం అవసరం లేదు. బాహ్యకర్మకలాపాలు ముఖ్యం కావు. లక్ష్యశుద్ధితో, చిత్తశుద్ధితో, సాధనశుద్ధితో చెయ్యవలసిన మానసిక ప్రయత్న మది.

భగవంతుడు ప్రతి వస్తువులోను ఉన్నాడు. తన సృష్టిలోని ప్రతి వస్తువుద్వారా అతడు తన మహిమను ప్రకటించుకొన్నాడు. కాని, ఏ వస్తువు దేవుడు కాదు. ఏ వస్తురూపము భగవత్ స్వరూపం కాదు. ఏ వస్తువు గుణాలు భగవంతుని లక్షణాలు కావు. ఏ వస్తువును గురించి మనకు కలిగే జ్ఞానం బ్రహ్మజ్ఞానం కాదు. ఏ వస్తువునుగూర్చిగాని మనకు బోధించే విద్య బ్రహ్మవిద్య కాదు. పరమాత్మ ప్రతి వస్తువులో ఆ వస్తువుకు భిన్నుడై ఉన్నాడు.

రంగులేని తెల్లని సూర్యకిరణం పట్టకం మీద పడి సప్తవర్ణాలుగా ప్రతిఫలిస్తుంది. అలాగే స్థల, కాల, కార్యకారణాతీతమయిన శుద్ధపరబ్రహ్మము స్థల, కాల పరిస్థితులమీద పడి, ఖండదృష్టిగల మన మనస్సుకు తద్భిన్నంగా గోచరిస్తున్నది. ఏకం అనేకంగా, అనంతం సాంతంగా, అఖండం ఖండంగా, నిరాకారం సాకారంగా, నిర్వికారం సవికారంగా, ఆదిమధ్యాంతరహితం ఆదిమధ్యాంతసహితంగా వివిధ వస్తువుల రూపంలో భాసిస్తున్నది. సృష్టిలోని వస్తువులు దేవు డని కాక, దేవుడు సృష్టిలోని వస్తువులుగా వ్యక్తమవుతున్నాడనడం సబబు. శుద్ధపరబ్రహ్మ ప్రపంచంగా భాసించడంతో భేదసూత్రం ప్రాధాన్యము వహించింది. బ్రహ్మకు ప్రపంచానికి భేదం, ప్రపంచంలో ఒక వస్తువుకు మఱొక వస్తువుకు భేదం, ఒకవస్తువులోనే ఒక భాగానికి మరొక భాగానికి భేదం ఏర్పడింది. ఐక్యాన్ని మఱుగుపఱచే భేదం భగవంతుడు కాదు. సమస్త విభేదాలకు ఏది ఆధారమో అట్టి అభేదమే దేవుడు. భేదం మఱుగున అతడు దాగి ఉన్నాడు. సమస్త వస్తువులలోను సామాన్యంగా ఉన్న తత్త్వమే పరబ్రహ్మ. అతడు రూపంలో అరూపంగా, గుణంలో నిర్గుణంగా, వ్యక్తిలో శక్తిగా శక్తిలో వ్యక్తిగా, మార్పులో నిర్వికారంగా, జీవితవిధానంలో శాసనకర్తగా ఉన్నాడు. కంటికి చూపుగా, దీపానికి కాంతిగా, దేహానికి దేహిగా, మనస్సుకు ఆలోచనగా, ఆలోచనకు ప్రజ్ఞగా, అనుభవానికి రసామృతంగా సృష్టిని సార్థకం చేస్తున్నాడు. అతడు ఆకాశంలో శబ్దంగా, శబ్దంలో అర్థంగా, అర్థంలో భావంగా, దారువులో అగ్నిగా, వేణువులో గానంగా, మందారంలో మకరందంగా, జగత్తులో నిగూఢంగా దాగియున్నాడు. అతడు అనుభవైకవేద్యుడు.

వస్తువులో దేవుని చూడ్డం అనడంలోనే వస్తువు, దేవుడు ఒక్కటి కాదన్న భావం యిమిడి ఉంది. వస్తువును దేవునిగా చూడ్డం అన్నప్పటికీ వస్తువు మన సామాన్య దృష్టికి ఏ విధంగా కనబడుతున్నదో అది దేవుడు కాదన్నమాట. వస్తువును దేవునిగా చూడ్డానికి మఱొక చూపో, నేత్రమో అవసరమని అర్థం. కనుక మన సామాన్య దృష్టికి కనబడే సృష్టినిగాని, సృష్టిలోని ఏ వస్తువునుగాని పూజించడం బ్రహ్మోపాసన కాదు.

వస్తువునందు పరమాత్మను దర్శించే ప్రయత్నంలో వస్తువు భౌతికమైన ఆకృతి పరమాత్మ ఆకృతిగా భ్రమించరాదు. విగ్రహంమీద చెక్కిన కన్నులు, ముక్కు, చెవులు, బొజ్జ, బొడ్డు, కాళ్లు, చేతులు పరమాత్మ అవయవాలు కావు. ఈ అవయవాలను స్తుతించడం పరమాత్మను స్తుతించడం కాదు. ఈ అవయవాలను పూజించడం పరమాత్మను పూజించడం కాదు. వస్తువునందు భగవంతుని దర్శించడం అనగా వస్తువునందు చిచ్ఛక్తిని దర్శించడం; వస్తువునందు దివ్యచేతన సాక్షాత్కారం పొందడం. వస్తుభావం తొలగిపోయి పరమాత్మభావం మనస్సును ఆవహించాలి. సర్వేశ్వరుడు సర్వేంద్రియగుణాభాసుడే అయినా, అతడుమాత్రం సర్వేంద్రియ వివర్జితుడు.

"సర్వం ఖల్విదం బ్రహ్మ" అంటే, ఈ సర్వమూ, ప్రతివస్తువు తాత్త్వికంగా మూలమందు, ఉనికియందు, స్థల కాల కార్య కారణాతీతస్థితియందు పరమాత్మే అన్నమాట. అంతే కాని వ్యక్తస్థితికి అవ్యక్తస్థితికి భేదం లేదని అర్థం కాదు. నిర్విశేషాద్వైతవాదులుకూడా సాధన విషయమై ప్రస్తావించునప్పుడు సాంఖ్యుల ప్రకృతి

పురుష విభాగాన్ని ఆత్మానాత్మవివేకరూపంలో అంగీకరించక తప్పినదికాదు. మామూలుగా మన కంటికి కనబడుతున్న రూపాలు పరమాత్మ స్వరూపాలే అయితే, భగవద్దర్శనం కోసం అన్వేషణ ఎందుకు? ప్రయత్న మెందుకు? సాధన ఎందుకు? సంయమ మెందుకు? తప స్సెందుకు? నిద్రలేచినది మొదలు నిద్రపోయే వఱకు మనం భగవత్సాక్షాత్కారం పొందుతునే ఉన్నాముకదా. భగవత్సాక్షాత్కారం పొందకుండా ఉండలేముకదా. ఇక దేవుడు అవాఙ్మానసగోచరు డనటం ఎందుకు? దేవుడు మన యింద్రియాల కింత స్పష్టంగా గోచరిస్తుంటే, అతీంద్రియానుభూతికోఱకు ఆరాట పడ్డం ఎందుకు?

మన మనస్సుకు, మాటకు అందని దేవుని గ్రహించడం, ప్రేమించడం, సేవించడం సాధారణ మానవులకు సాధ్యం కాని పని కనుక స్థూలము, స్పష్టము అయిన ఉపాయ మొకటి అవసరమన్న భావం బహుళంగా వ్యాప్తమై ఉంది. మనం స్పష్టంగా గ్రహించగల సమస్త వస్తువులద్వారా, భావాలద్వారా భగవంతుడు తన్ను తాను అభివ్యక్తం చేసుకొంటునే ఉన్నాడు. జగత్తు, జీవితం, ప్రకృతి, ప్రజ, కష్టాలు, సుఖాలు, అనుభవాలు, అనుబంధాలు, మహాపురుషుల చరిత్రలు, మహత్తర సంఘటనలు మనం స్పష్టంగా గ్రహించగలుగుతున్నవి కాదా? వీటిద్వారా భగవంతుని శక్తి, మహిమ, ప్రజ్ఞ, సౌందర్యం, సంకల్పం, గుణం మనకు బోధపడ్డంలేదా? మనుష్యకల్పిత వస్తువుల కంటె భగవంతుని సృష్టిలో అతని దర్శనం పొందడం సులభతరంకాదా? జగత్తులో, జీవితంలో దేవుని దర్శించడం అసాధ్యమైతే, రాతిలో దర్శించడం సుసాధ్యమా? రాతిలో దేవుని చూడగలవారు తోడిమానవునిలో చూడలేరా? సహజం, సార్థకం, సులభం అయిన పద్ధతులు మనకు అస్వాభావికంగా, అసాధ్యంగా, నిరర్థకంగా కనబడుతున్నవి. అస్వాభావికమైన పద్ధతులు సహజంగా, సులభంగా కనబడుతున్నవి. ఈ వైపరీత్యానికి ఒక కారణం, మనకు నిజంగా దైవచింత లేకపోవడం. దైవచింతపేరిట మన కిష్టమైన పద్ధతిని సూక్ష్మంలో మోక్షం సంపాదించాలన్న ఆత్మవంచన కలగడం మఱొక కారణం. ఈ ప్రవృత్తి శతాబ్దాల ఆచారంచేత బలపడుతూ వచ్చింది.

విగ్రహంలోనో, బాహ్యప్రకృతిలోనో భగవద్దర్శనంపొందే అనుభూతిలోకూడా నిజంగా జరుగుతున్న పనేమిటి? ఉపాసకుని అంతరంగంలో ఒక మసక తొలగిపోతున్నది. విగ్రహం, బాహ్యప్రకృతి ఎప్పటిలాగే ఉన్నది. మార్పు కలుగుతున్నది ఉపాసకుని చూపులోనే. అందఱికీకాక, ఉపాసకునికి మాత్రమే - దేవుని దర్శనం కలుగుతున్న ముహూర్తంలోనే - విగ్రహమో, బాహ్యప్రకృతో విశేషంగా కనబడుతున్నది. బాహ్యప్రకృతియందు కంటె జీవితసంఘటనలలో, తోడిమానవులతో గల సంబంధాలలో భగవంతుని దర్శించడం మఱింత సార్థకం. అంతకంటె అంతరంగంలో భగవత్సాక్షాత్కారం పొందడం ఉత్కృష్టం. తనకు పరమాత్మకు గల అభేదాన్ని ఆత్మయందు అపరోక్షంగా అనుభూతి పొందడం, జీవితం భగవత్ప్రేరిత మవుతున్నట్టు అనుభవగతం కావడం పరమోత్కృష్టం.



# భారతీయ దర్శన గ్రంథములు

శ్రీయుతులు పాటీలు తిమ్మారెడ్డి, ఎం. ఏ.
బోయనపల్లి రామారావు, బి.ఏ., గారలు

(గతసంచిక తరువాయి)

మహేశ్వరుడు నిరావరణచైతన్యస్వరూపుడు, అనవచ్ఛిన్నుడు, అద్వితీయుడు, స్వానుభవైకప్రమాణుడు, శక్తిచక్రేశ్వరుడు, ఆత్మ చింతామణి, ఉపేయుడు, అభిధేయుడు. అతని స్వాభావికశక్తియే ప్రకృతి. ఆతనిస్వాత్మభూత ప్రకృతియం దెప్పుడును వ్యభిచారము (వ్యతిక్రమము) కన్పింపదు. మహేశ్వరుడు కర్త, జ్ఞాత, అనాదిసిద్ధుడగు స్వాత్మ. జీవుడు చేతనుడు, పైగా అనీశ్వరుడు. ఆ ప్రత్యగాత్మ పరమేశ్వరభిన్నుడు మోహాచ్ఛన్నుడగుటచే కర్మబద్ధుడై సంసారి యగుచున్నాడు. జీవుడు మహేశ్వర దాసుడు. మహేశ్వరునితో ఏకత్వము స్థాపితమైనపుడు సర్వవిషయగ్రహణమునం దతనికి పూర్ణశక్తి లభించును. సర్వజ్ఞత్వసర్వకర్తృత్వరూపమగు మహేశ్వరత్వప్రాప్తియే ముక్తి. జ్ఞానము ప్రకాశస్వరూపము, చిత్స్వరూపము, సర్వప్రకాశకము, అఖండము. ప్రత్యభిజ్ఞ (జీవేశ్వరాభేదబోధ)యే ముక్తిసాధనము.

## శివాద్వైతము

(మహేశ్వరుడు) బ్రహ్మ మారాధ్యము. ధర్మాచరణము తదారాధనము. ఫలేచ్ఛాత్యాగపూర్వకముగా కర్మము లొనర్చుటచే పాపములు నశించును. పాపనాశముచే చిత్తము శుద్ధమై జ్ఞానము లభించును కర్మజ్ఞానసముచ్చయముచేతనే ముక్తి సిద్ధించును. జీవుని పరమపురుషార్థము శివసమానగుణతారూపమగు ముక్తి నార్జించుట. ఇది శివకృపచేతనే సాధ్యము – ఇట్లు ముక్తి శివప్రసాదఫలితము. ఈప్రసాద ముపాసనచే ప్రాప్తించును.

పరబ్రహ్మ (శివుడు) సగుణుడు, సవిశేషుడు, జ్ఞానానందశక్తిసంపన్నుడు, జగద్రూపు డగువాడు, మనస్సుచే నానందమున ననుభవించువాడు. జీవు డనాది, అజ్ఞానవాసనాబద్ధుడు, పరవశుడు, విభుడు, చేతనుడు, శక్తిపరిచ్ఛిన్నుడు, కర్త, భోక్త. జీవునియందు కర్తృత్వము స్వాభావికము. ముక్తజీవుడు సైత మంతఃకరణసమన్వితుడు. పాశము నశించినచో నత డఖండానందము ననుభవించును. బ్రహ్మ పరమాశక్తి (చిచ్ఛక్తి – చిదాకాశము) యందు జగద్బీజము కలదు. అదియే ప్రపంచకారణము. బ్రహ్మ పరిణామి, జగత్తు పరిణామము. జన్మ, స్థితి, ప్రళయ, తిరోభావ, అనుగ్రహములు బ్రహ్మ యొక్క ఐదు కృత్యప్రపంచకములు.

శివత్వప్రాప్తియే ముక్తి. కర్మోపాసనచే లేదా బ్రహ్మవిద్యచే శివత్వము ప్రాప్తించును. సత్కర్మాచరణపురాణశ్రవణమాత్రముచే శూద్రుని పాపములు నశించును.

## లకులీశపాశుపతము

పశుపతి ఏ కారణమును, ఏ సాధనయు లేకుండగనే ప్రపంచమును సృజించెను. దీని

నుండి రెండు విధముల ముక్తి పడయవచ్చును. ఒకటి దుఃఖాత్యంతికనివృత్తి, రెండు పారమైశ్వర్యప్రాప్తి. దృక్శక్తి (సర్వజ్ఞత) క్రియాశక్తులు (ఇచ్ఛితవస్తుప్రాప్తి) పారమైశ్వర్యమనబడును. భగవద్దాసత్వ మొకవిధమగు బంధనము. వ్రతము, భస్మాదిధారణము, ఉపహారము, ఏకాంతమున శివనామము పేర్కొని నవ్వుట, యేడ్చుట, జపము, ద్వారము (జగద్విపరీతచేష్ట) – ఇవి ధర్మార్థసాధనలు.

## శక్తిదర్శనములు

పరాశక్తియగు త్రిపురసుందరిచేతనే శబ్దవస్తూత్పత్తి జరిగినది. పరమతత్త్వము శివుడు. శక్తిస్ఫూర్తిరూపమును ధరించినపుడు శివుడందు తేజోరూపమున ప్రవేశించెను. అపుడు బిందు ప్రాదుర్భావము జరిగెను. శివునియందు శక్తి ప్రవేశించుటచే నారీతత్త్వము – నాదము వ్యక్తమయ్యెను. ఈ రెండుతత్త్వములు (నాదబిందువులు) కలిసి యర్ధనారీశ్వరుడయ్యెను. ఇదియే కామతత్త్వము. పుంతత్త్వము శ్వేతము, నారీతత్త్వ మరుణము. రెండింటిచే కళ జనించెను. ఈ కామకళలయు నాదబిందువులయు సంయోగముచే సృష్టి సాగెను. మూలతత్త్వ మనంతము, అవ్యక్తము. ఆ శివుని అజాఆద్యాశక్తియే ప్రకృతిరూప.

జీవోద్ధరణకై వైదిక, వైష్ణవ, శైవ, దాక్షిణ, వామ, సైద్ధాంతిక, కులముఖ్యములు— ఈ యేడాచారములు కలవు. దివ్యభావాశ్రయముచే దేవసాక్షాత్కారము, వీరభావముచే క్రియాసిద్ధి, పశుప్రాప్తిచే జ్ఞానసిద్ధి లభించును. ఆరాధనకై మహాశక్తికి – మహాకాళి, ఉగ్రతార, షోడశి (త్రిపురసుందరి), భువనేశ్వరి, ఛిన్నమస్త, భైరవి, ధూమావతి, బగళాముఖి, మాతంగి, కమల- అను పది మహావిద్యారూపములు కలవు. ఈ శక్తులతోపాటు పది పరతత్త్వారాధ్యరూపములుఁకూడ ఉపాసింపబడును. క్రమముగా నవి, మహాకాలుఁడు, అక్షోభ్యపురుషుడు, పంచవక్త్రరుద్రుడు, త్ర్యంబకుడు, కబంధుడు, దక్షిణామూర్తి, ఏకవక్త్ర రుద్రుడు, మతంగుడు, సదాశివుడు, విష్ణువు. జీవుడాచారపాలనారాధనలచే శక్తికృపవలన శివత్వమును పొంది పాశముక్తుడగును.

## కొన్ని అన్యదర్శనములు

ఈ దర్శనములుకాక భక్తిస్వరూపసాధన తత్త్వసాక్షాత్కారము గావించు నారదశాండిల్యకృతములగు భక్తిసూత్రములు భక్తిదర్శనములను పేర విఖ్యాతములైనవి. ఇవి రెండును భక్తితత్త్వమును చక్కగా నిరూపించును. 'సా పరమప్రేమరూపా' 'సా పరానురక్తిరీశ్వరే' యని యవి భక్తిని నిర్వచించెను. భగవానునియెడ పరమప్రేమయే భక్తి. వ్రజగోపికలప్రేమము దాని కుదాహరణము. ముక్తికి జ్ఞానముకన్న భక్తియే శ్రేష్ఠము అని వాని మతము.

ఇవి కాక వైద్య శాస్త్రమున కొక ప్రత్యేక దర్శనము కలదు. కర్మప్రారబ్ధములను మన్నించి యందు చికిత్స కెట్టి స్థానము కల దనుట నది చర్చించును. ఇట్టిదే 'రసేశ్వరదర్శనము'. దీని ననుసరించి 'పరమతత్త్వము రసరూపము. శివపార్వతులమూలభావము స్థూలజగత్తున పారదాభ్రకరూపములచే వెలసినది. పారదము ఆనందమునకు మూర్తరూపము (మూర్త – Concrete). పారదమే రసము. సృష్టియొక్క పారమును దయసేయునదగుటచే నది పారద

మయ్యెను. పారదసిద్ధిచే శరీరము జరామరణములపై విజయము నార్జించును.'

ఇట్లే జ్యోతిషమున నొక పృథగ్దర్శనము కలదు. సమస్తజగతితద్ఘటనలు నక్షత్రజగతి నవలంబించినవి. నక్షత్రముల గతిస్థితిసంయోగములే సమస్తప్రాపంచికరూపగుణక్రియలకు కారణములు. ఏ భావాభివ్యక్తి భూమిపై క్రియాపదార్థరూపమున కలదో అదియే సమష్టియందు నక్షత్రరూపమున కలదు. ప్రతియొక్క క్రియయు ప్రతిఆకృతియు పూర్వనిశ్చితము. సర్వాకృతులు క్రియలు శబ్దాదులు నిత్యములు. అవి సదా ఆవిర్భవించి తిరోభవించుచుండును. ఇట్లు లోకచరిత్రము మాటిమాటికి పునరావృత్తమగుచుండును. ప్రాణికర్మములు సంకల్పపూర్వకములు. సంకల్పమే కర్మకారణము. సంకల్పభావస్తరము లభివ్యక్తములు. ఇవియే సర్వగ్రహసంచాలకములు. కావున కర్మ సదా గ్రహానుసారి. ప్రారబ్ధవాదజ్యోతిషములకు భేదము లేదు. మనుజకర్మ మాతనికి ఫలమిచ్చుటలో స్వయంసమర్థము.

వీనికి వలెనే వ్యాకరణమున నొక దర్శనశాస్త్రము కలదు. దీనిని స్ఫోటవాదము లేదా శబ్దాద్వైతవాద మందురు. పాణిని దీనికి ప్రవర్తకుడు. దీని ననుసరించి 'శబ్దమనాది, సనాతనము. ఉన్నదృశ్యము లన్నియు కల్పనావిచారముల ఛాయలు వానిమూర్త (Concrete) రూపములు. దృశ్యజగతి అవాస్తవికము. శబ్దము వినా జ్ఞానము స్వయంప్రకాశము కాదు. శబ్దజ్ఞానములు పరస్పర మవిభేద్యములు. శబ్దస్మృతియే శ్వాసాదిసమస్తక్రియలకు కారణము. శబ్ద మాఖ్యేయశక్తియుక్తము. లోక మర్థనిర్మితము. శబ్దము దానికి జ్ఞాన మిచ్చును. ప్రణవము వాచకతాధిష్ఠానము. అదియే జగత్తునకు మూలకారణము. నామరూపాత్మకమే విశ్వము. విశ్వము శబ్దబ్రహ్మపరిణామము కాదు. వివర్తము, శబ్దార్థముల సంబంధము కల్పితము కాదు, నిత్యము. వ్యక్తశబ్దమునకు మూలాధారమున పరా, నాభియందు పశ్యంతి, హృదయాకాశమున మధ్యమ, కంఠమున వైఖరి ఒప్పుచుండును. శబ్దబ్రహ్మానుభూతియందు ప్రణవోపాసన, యోగి, శుద్ధసత్యభాషణములు సహాయములు'.

ఇట్లే అనేకయోగమార్గములు శరీరమును జ్ఞానసత్యమందిరముగా స్వీకరించి నేతి. ధౌతి మున్నగు షట్కర్మములచే తచ్ఛుద్ధిని ప్రతిపాదించెను. షట్చక్రవేధకుండలినీయోగముకూడ నొక దర్శనమే. బ్రహ్మవిష్ణురుద్రగ్రంథులను వేదాంతముయొక్క మల, విక్షేప, ఆవరణములుగ భావించి వానివేధకై ప్రవర్తించిన తంత్రశాస్త్రముకూడ ఒకదర్శనమే. ఈ యాస్తిక దర్శనము లన్నియు అధికారి సాధనభేదముల వలన భిన్నము లైనవి.

## ఉపసంహారము

ఏకత్వమునం దనేకతాభివ్యక్తియు, అనేకతయం దేకత్వదర్శనమును భారతీయదర్శనగ్రంథముల విశేషము. 'విశ్వమునందలి నానావిభిన్నతలయందు ఏకత్వమునకై భారతదేశము చేసినంతటి పూర్ణసార్థకవివేచనము మఱేదేశమునందును మఱేజాతియు చేయ లేదు. కాని మనదేశమునం దున్నన్ని శ్రేణీభేదములు మఱెందును లేవు' అని యొక మాన్యవిద్వాంసు డభిభాషించెను.

అనేకతయం దేకత్వదర్శనము భారతీయసంప్రదాయము. పశుమానవవృక్షాదులయం దేకత్వమును దర్శించి యొక్కవిధమగు నాహా

రమునే యొసంగినచో హాని యేర్పడును. కావున నేకత్వ మనునది బుద్ధియందు వ్యవస్థితము కావలసిన భావము. ఏకత్వమునుండి బహుత్వోత్థానమునుగూడ భారతీయదర్శనములే పేర్కొనెను. ఏకర్మాధికారభావాదిభేదముచే బహుత్వ ముత్థితమైనదో తదనురూప వ్యవహారమే వ్యక్తికి సమాజమునకు కల్యాణ కారకము. కావున వ్యవహారమున నితరదేశములయందుకంటె నధికమగు శ్రేణీభేదములు అధికారనిరూపణపరిణామము. ఇది యేకత్వమునకు విరోధి కాదు. భారతీయదర్శనముల గాంభీర్యముతోపాటు ఈ మూలవిశేషమునుగూడ తెలిసికొననిదే వాని నర్థము చేసికొన్నట్లు కాదు. పదార్థవిజ్ఞానాది ఆలోచనాత్మకశాస్త్రక్షేత్రములయందు జ్ఞాన మెంతసూక్ష్మమో పదార్థోపయోగములును శ్రేణీభేదములును అంతగా పెరుగుటయు, ఎంతస్థూలమో అంతగానీ శ్రేణీభేదములు తఱుగుటయు ప్రత్యక్షముగ గమనించుచున్నాము. అట్లీ శ్రేణీభేదములు అధికారిభేదము ననుసరించి యేర్పడినవే కాని యజ్ఞానమూలకములు కావు. ఇట్లే భారతీయదర్శనములు అధికారతరతమభేదము ననుసరించి యింత విస్తృతముగ రచింపబడినవి. ఇక ప్రపంచసాహిత్యమునం దింత విస్తృతమగు దర్శనరచన మతేదేశమునందును మతేజాతియు చేయ లేదు. ఇదియే భారతీయదర్శనకర్తల ఆధిక్యము. భారతీయులకు గర్వకారణము.

[కవిసమ్రాట్ విశ్వనాథసత్యనారాయణ - జటావల్లభుల పురుషోత్తం - సుదర్శనసింహ హనుమాన్ ప్రసాద్ పోద్దార్ గారకు కృతజ్ఞతతో]

# వార్తలు, విశేషాలు

## బేలూరునొద్ద వివేకానంద యూనివర్సిటి

బేలూరులో స్థాపింప సంకల్పించిన వివేకానంద యూనివర్సిటికై రామకృష్ణమిషనువారి ప్రార్థనమీద శ్రీ బర్లాల్రాయిగారు మూల ధనమును విరాళమిచ్చారు. వీరు కీర్తిశేషులయిన కుమార ప్రమథనాథరాయిగారి కుమారులు. వీరిది 'భాగ్యకులము' ఇది ఇప్పుడు తూర్పు పాకిస్థానములో ఉన్నది. 'రామకృష్ణ మిషను వివేకానంద యూనివర్సిటి మూల ధనము' అను పేర వారొసగినారు. ఇందుకై వారు తమ స్థిరాస్తిలో కొంతభాగం ఇచ్చారు. ఇందుండి సంవత్సరానికి సుమారు ఒకటిన్నర లక్ష రూపాయల ఆదాయంవస్తుంది. దీనిని ఆయూనివర్సిటి స్థాపనానికి దాని సుస్థితికి వినియోగించాలని వారు సంకల్పించారు. ఈ ధర్మ పరిషత్తుకు పూజ్య శ్రీ పి. సి. సేనుగారు అధ్యక్షులు. పూజ్యశ్రీ శ్రీశైలకుమారముఖర్జి గారును, శ్రీ బీరేంద్రకుమార బోసుగారును రామకృష్ణమిషను సాధువులిద్దఱున్నూ ఈధర్మ పరిషత్సభ్యులు.

మన యువకులకు మంచి విద్యలభించాలని హృదయపూర్వకంగా కోరేవారందఱూ ఈ మూలధన విరాళం యిచ్చిన మహోదారులకు కృతజ్ఞులై ఉండడంలో రామకృష్ణమిషను వారితో తప్పక ఏకీభవిస్తారు.

ఈ వివేకానంద యూనివర్సిటి స్వామిజీకి తగిన స్మారకంగా ఉండడమే కాకుండా దేశ చరిత్రలో ఒక ప్రముఖసంభవంగా ఉంటుంది. తన దేశీయులకు స్వామిజి అభిలషించిన విద్యా విధానం – అది మానవీకరణ సమర్థమై ఉండవలె; శీలనిర్మాణ దక్షముగ ఉండవలె, భారతీయాధ్యాత్మికలక్ష్యములసమున్నతికి సాధనముగ నుండవలె, పాశ్చాత్యుల ఆశయాలలో నుండిన్నీ సంస్కృతి నుండిన్నీ శ్రేష్ఠాంశములను తనలో కలుపుకొనేదిగా ఉండవలె.

యూనివర్సిటీ ప్రణాళిక తయారవుతూ ఉంది, త్వరలోనే పశ్చిమ బంగాళ ప్రభుత్వం వారికి అది సమర్పితమవుతుంది. అమలుపఱచడానికి తగిన చర్య తీసికోబడుతుంది. ప్రారంభించడానికే రెండు కోట్ల రూపాయలు కావాలి. ఉదారమహాజనులున్నూ 'రాష్ట్ర' 'కేంద్ర' ప్రభుత్వాలవారున్నూ విరాళాలిచ్చి ఈ పుణ్యకార్యానికి తోడ్పడవలసిందని మా ప్రార్థన, తోడ్పడతారని మా నమ్మకం.

శ్రీ వీరేశ్వరానందస్వామి,
జెనరల్ సెక్రెటరి,
శ్రీరామకృష్ణ 'మఠ' 'మిషను'లు.

## శ్రీరామకృష్ణ సేవాశ్రమము, చట్లతాంత్ర

శ్రీకాకుళం జిల్లా, టెక్కలి తాలూకా, చట్లతాంత్ర గ్రామ శ్రీరామకృష్ణ సేవాశ్రమము ద్వితీయ కార్యనిర్వాహకవర్గ సమావేశము శ్రీ భద్రాచలం రామమూర్తిగారి అధ్యక్షతను తే 12–10–1962 దీని జరుపబడినది. ఆశ్రమము ఇండియను సొసైటీల చట్టము (Act XXI of 1860) క్రింద 9 నెంబరుగా రిజిస్టర్ చేయబడినది. రామకృష్ణ మిషను బేలూరు మఠమువారు కోరినతక్షణము దయతో పంపిన బైలాలను కొద్దిమార్పులతో తయారుచేసి ఆమోదించడమైనది. మఠమునకు అనుకొనియున్న సుమారు 20 సెంట్ల భూమిని కొనుటకుగాను తీర్మానించడమైనది. ఇప్పటివరకు చేరిన 100 సభ్యులు గాక యింకను ఇతోధికముగా సభ్యులను చేర్పించుటకుగాను సభ్యులను గోరడమైనది. కార్యదర్శిగారి నివేదిక చదివి ఆమోదించడమైనది. శ్రీ అట్టాడ చినలచ్చుము నాయుడుగారిని ఉపకార్యదర్శిగా కోఆప్టు చేసుకొనడమైనది. సభ్యులు పాటించే నిబంధనలనుగూర్చి అధ్యక్షులు ఉపన్యసించిరి.

## శ్రీహరేరామనామకోటిపూజా మహోత్సవములు

కోరుకొండలో శ్రీహరేరామభజనభక్త సమాజమువారి ఆధ్వర్యమున కార్తీకమాస పర్వదినములు నెలరోజులు ది. 29–10–1962 నుండి 28–11–1962 వరకు సమాజమందిరము వద్ద తెల్లవాఱుజామున 4 గం॥కు ప్రభాతసేవ, ఉదయం 8 గం॥ నుండి 10 గం॥వరకు స్వామివారి సన్నిధిని హరేరామ నామకోటికి వేదోక్తముగా షోడశోపచారములతో సహస్రనామ పూజలు 10 గం॥ నుండి 12 గం॥ వరకు నిత్యము 50 మంది బీదలకు అన్నదానము, మధ్యాహ్నము 3 గం॥ నుండి 5 గం॥ వరకు

ప్రముఖులయిన పండితుల ఆధ్యాత్మికోపన్యాసములు, రాత్రి 7 గం॥ నుండి 10 గం॥ వరకు శ్రీహరేరామమహిళా మండలివారిచే నామసంకీర్తన, ఆఖరురోజున 50 మంది బీదలకు వస్త్రదానము జరుపబడెను. ఈ కార్యక్రమములో భక్తులెల్లరు పాల్గొని యథాశక్తి ధన, వస్తు, సేవా రూపమున విరాళము లొసంగి జయప్రద మొనరించినందుకు కృతజ్ఞతాభివందనములు. ఆలయ నిర్మాణముకు రూ. 3000/-కు స్థలము ఖరీదుచేసియున్నారు గాన భక్తులెల్లరు ఈ క్రింది అడ్రసుకు విరివిగా విరాళములొసంగి సమాజాభివృద్ధికి తోడ్పడ ప్రార్థన.

ఇట్లు,

శ్రీ హరేరామభజన భక్తసమాజము (రిజిష్టరు)
శ్రీలక్ష్మీనరసింహ క్షేత్రము కోరుకొండ,
తూ॥ గో॥ జిల్లా (ఆం॥ప్ర.) స్థాపితం: 1960.

# గ్రంథపరిచయం

[సమీక్షకు గ్రంథాలు పంపేవారు రెండేసి ప్రతులు పంపవలె అని మనవి]

## శంకరగ్రంథరత్నావళి

### ప్రథమసంపుటము

ప్రకాశకులు, ప్రాప్తిస్థానం: సాధన గ్రంథ మండలి తెనాలి, పుటలు 296.

వెల 4. రూపాయలు.

'శంకరుడే శంకరుడై' అన్నట్లు అద్వితీయావతారమూర్తులునూ జ్ఞానవైరాగ్యనిధులును ఐన శ్రీశంకభగవత్పాదులు విశ్వోపజీవ్యమైన భారతదేశాధ్యాత్మిక సందేశాన్ని శతాధిక గ్రంథపేటికలలో పదిలపఱచి ఉంచినారు. గీర్వాణభాషలో ఉన్న ఆగ్రంథాలను వివిధదేశీయులు తమతమ భాషలలోనికి అనువదించుకొని అనుభవించడం ప్రాప్తం. ఇప్పటికి పదిహేను సంవత్సరాలుగా సాధకులకు అత్యంతోపయుక్తములైన గ్రంథములను సులభసరళాంధ్రభాషలో ప్రచురిస్తూ జిజ్ఞాసువుల కృతజ్ఞతకు భాజనులైన తెనాలి సాధన గ్రంథ మండలివారు శ్రీశంకరవాణిని సాంధ్రానువాదంగా ఆంధ్రమహాజనులకు అర్పింప పూనుకోవడం ముదావహం. అందిప్పుడు ప్రచురితమై ద్వితీయముద్రణమునందిన ఈ ప్రథమ సంపుటంలో 'అద్వైతానుభూతి' మొదలు 'హస్తామలక' పర్యంతం మొత్తం నలభై గ్రంథాలు ఉన్నాయి. ఇందున్న మొత్తం శ్లోకాలసంఖ్య 1083. ప్రతి పుటలోను పైసగమున పెద్ద అచ్చులో మూల శ్లోకాలు, క్రింది సగమున ఆశ్లోకాల అనువాదం ఉండేటట్లుగాముద్రించిన పద్ధతి పారాయణపరులకు చాలా అనుకూలంగా ఉంది. పుస్తకం విప్పిచూచినవారికిచదవకవిడిచిపెట్టడానికి బుద్ధిపుట్టదు. అనువాద రచయితలు రాజమహేంద్రవర శ్రీరామకృష్ణమఠాధికృతులైన పరమహంస పరివ్రాజకాచార్య శ్రీనిర్వికల్పానందస్వాములు. ఈఅనువాదమందలిసరళసుగ్రహామధురశైలి స్పృహణీయం. ఈ తొలి సంపుటమును చదివినవారు అనంతరసంపుటాలకై తప్పక ఉవ్విళ్లూరుతూ నిరీక్షిస్తారు.

—ప్రభాకర్.

# OUR ENGLISH PUBLICATIONS

| | Price. Rs. | nP. |
|---|---|---|
| Sri Ramakrishna the Great Master (2nd Edn.) (Calico) | 25 | 00 |
| " " (Morocco) | 35 | 00 |
| The Gospel of Sri Ramakrishna (3rd Edn.) (Calico) | 20 | 00 |
| " " (Morocco) | 30 | 00 |
| Ramakrishna: Prophet of New India | 10 | 00 |
| Sri Ramakrishna .. | 1 | 50 |
| Sayings of Sri Ramakrishna (9th Edn.) | 5 | 00 |
| Ramakrishna Upanishad (2nd Edn.) | 1 | 00 |
| Tales and Parables of Sri Ramakrishna (2nd Edn.) | 2 | 50 |
| The Ramakrishna Mission its ideals and activities .. | 0 | 50 |
| Sri Ramakrishna and His Mission (2nd Edn.) | 0 | 62 |
| The Master and the Disciple .. | 2 | 00 |
| Sri Ramakrishna and Sarada Devi | 2 | 50 |
| Holy Mother Sri Sarada Devi (Gambhiranandaji) (Ordinary) | 7 | 00 |
| " " (Calico) | 9 | 00 |
| Sri Sarada Devi the Holy Mother (Tapasyanandaji) (Ordinary) | 6 | 50 |
| " " (Calico) | 8 | 00 |
| Inspired Talks (Swami Vivekananda) (8th Edn.) (Board) | 2 | 00 |
| " " (Calico) | 3 | 00 |
| Hinduism (4th Edn.) .. | 1 | 00 |
| Education (6th Edn.) .. | 1 | 00 |
| The Eternal Companion (3rd Edn.) (Ordinary) | 2 | 25 |
| " " (Calico) | 3 | 25 |
| For Thinkers on Education (Swami Ramakrishnananda) | 3 | 00 |
| The Story of a Dedicated Life (Life of Swami Ramakrishnananda) | 3 | 00 |
| The Message of Eternal Wisdom (Swami Ramakrishnananda) | 3 | 00 |
| God and Divine Incarnations (Swami Ramakrishnananda) | 2 | 25 |
| The Ancient Quest (Swami Ramakrishnananda) | 1 | 50 |
| Sri Krishna, The Pastoral and King-maker (Swami Ramakrishnananda) (5th Edn.) | 1 | 25 |
| Life of Sri Ramanuja (Board) | 4 | 00 |
| " " (Cloth) | 5 | 00 |
| Isavasya Upanishad (7th Edn.) | 0 | 75 |
| Kena Upanishad (6th Edn.) | 0 | 75 |
| Katha Upanishad (8th Edn.) | 1 | 50 |
| Adventures in Religious Life (2nd Edn.) (Board) | | 00 |
| (Cloth) | | 00 |

| | Price. Rs. | nP. |
|---|---|---|
| Prasna Upanishad (5th Edn.) .. | 1 | 00 |
| Mundaka Upanishad (6th Edn.) .. | 1 | 00 |
| Mandukya Upanishad (7th Edn.) .. | 0 | 75 |
| Taittiriya Upanishad (4th Edn.) .. | 2 | 00 |
| Aitareya Upanishad (3rd Edn.) .. | 1 | 00 |
| Svetasvatara Upanishad (3rd Edn.) | 1 | 50 |
| Chandogya Upanishad .. | 8 | 00 |
| Brihadaranyaka Upanishad (2nd Edn.) | 7 | 50 |
| Mahanarayanopanishad .. | 5 | 00 |
| Srimad-Bhagavad-Gita (Swami Vireswarananda, with Sridhara's Gloss) .. | 7 | 00 |
| Bhagavad-Gita: the Song of God (4th Edn.) | 2 | 75 |
| Upadeshasahasri .. | 3 | 50 |
| Atmabodha .. | 4 | 00 |
| Yatindramatadipika .. | 5 | 00 |
| Srimad Bhagavatam: The Wisdom of God .. | 3 | 50 |
| Stotraratna (2nd Edn.) .. | 0 | 75 |
| Divine Life (4th Edn.) .. | 3 | 00 |
| Universal Prayers (5th Edn.) .. | 2 | 25 |
| Prince of Ayodhya (Ordinary) | 3 | 00 |
| " " (Calico) | 4 | 50 |
| Vedic Religion and Philosophy (4th Edn.) | 2 | 50 |
| Narada Bhakti Sutras (3rd Edn.) .. | 3 | 00 |
| Vakyavritti & Atmajnanopadeshavidhi (2nd Edn.) .. | 1 | 00 |
| Devi-Mahatmyam (Chandi) (2nd Edn.) | 2 | 00 |
| Saint Durga Charan Nag (3rd Edn.) | 2 | 25 |
| Thus Spake Sri Ramakrishna (7th Edn.) | 0 | 40 |
| Thus Spake Holy Mother (2nd Edn.) | 0 | 40 |
| Thus Spake Vivekananda (8th Edn.) | 0 | 40 |
| Thus Spake The Buddha (2nd Edn.) | 0 | 40 |
| Thus Spake Sri Krishna (2nd Edn.) | 0 | 40 |
| Thus Spake The Christ (2nd Edn.) | 0 | 40 |
| Thus Spake Prophet Muhammad .. | 0 | 40 |
| Worship of Sri Ramakrishna .. | 1 | 00 |
| A Man of God (Ordinary) | 3 | 00 |
| " " (Calico) | 4 | 00 |
| Buddha and Our Heritage .. | 0 | 40 |
| Path to Perfection .. | 0 | 40 |
| Consolations .. | 0 | 31 |
| Women of India .. | 0 | 25 |
| Spiritual Life .. | 0 | 06 |
| Path Beyond Sorrow .. | 0 | 06 |

**Please ask for the Detailed Catalogues of our Tamil and Telugu Books**

**SRI RAMAKRISHNA MATH,** *Publication Dept.,* **MYLAPORE, MADRAS-4**

# శ్రీ రామకృష్ణ బోధామృతము

అనువాదకులు :

శ్రీ చిరంతనానందస్వామి

ఇందు శ్రీరామకృష్ణుని జీవిత సంగ్రహమును 1121 మహోపదేశములును గలవు.

జీవుడు : సంసారము ; మాయ, గ్రంథములు : గ్రంథులు, బాధగురువులు : బోధ గురువులు, లౌకికులు : వారి ధోరణులు, ఆత్మోన్నతి ; సాధకులు : వారి యాదర్శములు, పారమార్థిక జీవనమునకు సదుపాయములు, సర్వమతసామరస్యము, దేవుడు, జ్ఞానము : భక్తి : కర్మము, బ్రహ్మతత్త్వము మున్నగు అంశము లిందు తేటతెల్లముగ పసిబిడ్డల కయిన అవగాహన కాగల ఉపమానములతో వివరింపబడియున్నవి.

నీతికథలును సూక్తులును మకరందపేశలములు, నిర్వృతికరములు.

... ఈ గ్రంథం చదువుతూంటే ఒక్క ఐహికానికీ, ఒక్క ఆముష్మికానికీ కాక, రెంటికీ సంబంధించిన సూక్ష్మాలూ, రహస్యాలూ, కీలకాలూ చక్కగా అరటి పండొలిచి చేతిలో పెట్టినట్లు ఉంటవి... —ఆంధ్రపత్రిక

540 పుటలు ప్రజ్జ్వలమగు పంచమ ముద్రణము వెల : రూ. 3-50

# హిందూమతము

రచయిత : శ్రీ వివేకానందస్వామి

అనువాదకులు: శ్రీ కందుకూరు మల్లికార్జునంగారు

హిందూమత నామమును పరస్పరభిన్నభావభూయిష్ఠములగు అనేక మతసంప్రదాయములు వహించి యుండుటచే, తత్స్వరూప నిర్వచనమునకు ఇందు శ్రీ వివేకానంద స్వాములవారు పూనుకొని ఆ మతము వేదసంహితాకాలమునుండి ఎట్లు క్రమ పరిణామ మందెనో, అందు సర్వసమ్మతమూలభావము లెవ్వియో, అవి చేయు బోధ యెట్టిదో, ఇన్ని భిన్నమతాంతరము లెట్లు కలిగెనో, ఈ కలగూరగంపకు హిందూమత నామ మెట్లు లేర్పడెనో విశదీకరించియున్నారు. జిజ్ఞాసువుల కత్యంతోపయుక్తమగు గ్రంథము.

... తెనుగువాఙ్మయములో వేదాంతచర్చలపై ... ప్రకటింపబడిన గ్రంథములలో ఇది ఉత్తమోత్తమమైనదని శిరసొగ్గి చెప్పవలసియున్నది. ... —భారతజ్యోతి 12-4-1956.

... గ్రంథము ప్రావాహిక శైలిలో అనువదింపబడినది. —హిందూపత్రిక 5-8-'56.

168 పుటలు వెల : రూ. 1-25

అడ్రెసు : మేనేజరు, శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు - 4

సంపాదకులు : శ్రీ శుద్ధసత్త్వానందస్వామి, శ్రీ నేలటూరి భక్తవత్సలము,

శ్రీ. కే. ఎస్. ఎస్. రాజన్ గారిచే ది జ్యూపిటర్ ప్రెస్స్ ప్రైవేట్ లిమిటెడ్ (మద్రాసు - 18) న ముద్రింపబడి

శ్రీ శుద్ధసత్త్వానందస్వామిచే శ్రీ రామకృష్ణమఠము ( మైలాపూరు) నుండి ప్రచురింపబడినది